


శిల్పం ఛందోమయం యస్య
నానావృత్త మిదం జగత్
శాంతః చంద్రకళా కాంతః
పాతు మాం స ఋతధ్వజః

# కృతజ్ఞత

ఈ గ్రంథమును ముద్రించుటకు విరాళముగా

యునివర్సిటీ గ్రాంట్సు కమిషన్ ద్వారా
రూ. 4000 లు ఇప్పించినవారు

ఉస్మానియా యునివర్సిటీ ఉపాధ్యక్షులు

*డాక్టర్ డి. యస్. రెడ్డిగారు.*

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతికశాఖ ద్వారా
రూ. 2000 లు ఇప్పించినవారు

మద్యనిషేధశాఖామాత్యులు, గౌరవనీయులు

*శ్రీ యం. ఆర్. అప్పారావు బహద్దరువారు.*

వీరికి కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

ఆంధ్ర మహా భారతము

# ఛందఃశిల్పము

*

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారి
డాక్టరేట్ పట్టమును పొందిన
సిద్ధాంత వ్యాసము

*

డాక్టర్ పాటిబండ మాధవశర్మ
రీడర్, ఆంధ్రశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

ప్రథమముద్రణము : 1000 ప్రతులు.
డిశంబరు, 1966

అభినవభారతీ ప్రచురణము

౧

మూల్యము : రు 20/-

ప్రతులకు :

డాక్టర్ పాటిబండ మాధవశర్మ
1-8-37/A, చిక్కడపల్లి : హైదరాబాదు-20.

ముద్రణ :
శివాజీ ప్రెస్
సికింద్రాబాదు.

# అంకితము

చి॥ సౌ॥ పాటిబండ మంగతాయికి



నీవు నా జీవితమున పండించినట్టి
యమృతఫల మీ మహాగ్రంథ మంబుజాక్షి!
ఉభయులము దీనిచేత మృత్యువు తరించి
యనుభవించెద మమృతమయత్వసిద్ధి!

# ఆశీస్సులు

ప్రతులను సిద్ధముచేయుటయందు :

జి. వి. సుబ్రహ్మణ్యం, యం. ఏ.
యల్. చంద్రమోహన్, యం. ఏ., బి., ఇడి.
కే. యస్. ఆంజనేయశర్మ, యం. ఏ.
కుమారి పాటిబండ అరుంధతి, యం. ఏ.

గద్య పద్య సంఖ్యా వివరములు కూర్చుటయందు :

పాటిబండ లక్ష్మీనారాయణశర్మ,
పాటిబండ వేంకటరామశర్మ,

పదముల పట్టిక తయారుచేయుటయందు :

కుమారి డాక్టర్ పాటిబండ ఝాన్సీ లక్ష్మి,
పి. వి. చలపతిరావు, యం. ఏ.

నాకెంతయో తోడుపడిరి.

ఈ చిరంజీవులకు నా ఆశీర్వచనములు.

# ని వే ది క

"ఆంధ్రమహాభారతము : ఛందోఽలంకారరసశిల్పము" అను విష యమునుగుఱించి నా కావించిన పరిశోధన ఫలితములు ఈ వ్యాసమునఁ బొందుపఱుపఁబడినవి. ఈ సిద్ధాంతవ్యాసము ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి పి. హెచ్. డి. పట్టపరీక్షకు సమర్పింపఁబడినది.

ఆంధ్రమహాభారతము సంస్కృతమహాభారతమునకు అనువాదము. అందలి వస్తు రసాలంకారకల్పన మించుమించుగా నంతయు వ్యాసభగవాను నిదే. ఆ మహర్షి హృదయము తెలుఁగు జాతికిఁ గరతలామలకమగు తీరున ననువదించి ప్రతిరూపకల్పనా శిల్పమును వెలయించిన ప్రతిభానిధులు కవి త్రయము.

ఆంధ్రమహాభారతమునం దచ్చముగాఁ గవిత్రయము వారి ప్రతిభా నిష్యందమని చెప్పఁదగినది ఛందము. ఛందము కేంద్రముగా వారి రసాలం కారశిల్ప మీ వ్యాసమున ననుశీలింపఁబడినది. నానాఛందములను నిర్మించుట యందు, వాని నలంకరించుటయందు, వానిని రసానుగుణముగ, నర్థానురూప ముగ వినియోగించుటయందు, కవిత్రయము ప్రదర్శించిన శిల్పమును నిరూ పించుటయే ప్రధానలక్ష్యముగాఁ బెట్టుకొని ఆ లక్ష్యసాధనయందుఁ బ్రసక్త మైనంతవఱకే యర్థాలంకారములను స్పృశించితిని.

ఆంధ్రసంస్కృతాంగ్ల భాషలయం దుపలభ్యములగు ఛందోఽలంకార రససంబంధి గ్రంథములను, శరీర జీవమన స్తత్వశాస్త్రగ్రంథములను, బెక్కిం టిని సూక్ష్మేక్షికతోఁ బరిశీలించి వాని యంతరాళముల మఱుఁగువడియున్న రహస్యములను సాధించి, శోధించి, యనుసంధించి ఛందోరససంబంధ నిరూ పణమున కొక అభినవమైన ఘంటాపథమును నిర్మించుకొంటిని. ఆ పథమునఁ బయనించి నాకు సాక్షాత్కరించిన కవిత్రయమువారి యనంతముఖమైన ఛందః శిల్ప విశ్వరూపమును ఈ గ్రంథమునఁ జిత్రింపయత్నించితిని.

ఈ పరిశోధనప్రణాళికను నిపుణముగఁ బర్యవేక్షించిన విద్వన్మణి ఆచార్య, డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారికి హృదయపూర్వక ధన్యవాదము లర్పించుచున్నాను. ఈ పరిశోధన కార్యక్రమమును నిర్విఘ్నముగఁ గొనసా గించుకొనుటకు నా కవకాశము కల్పించిన ఉస్మానియా యూనివర్శిటీ

ఉపాధ్యక్షులు డాక్టర్. డి. సదాశివరెడ్డిగారికి హృదయపూర్వక కృతజ్ఞతను నివేదించుకొనుచున్నాను.

ఈ సిద్ధాంతవ్యాసమును బరీక్షించి, మెచ్చి నాకు డాక్టరేట్ పట్టమును ప్రసాదించిన పూజ్యులు — కవిసమ్రాట్, కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికి, ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజిగారికి భక్తిమయ ప్రణామము లర్పించుకొనుచున్నాను.

అత్యంతవాత్సల్యముతో నాకు సాహిత్యతత్త్వము నుపదేశించిన పూజ్య గురుపాదులు ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారికి, అభినవవాగనుశాసన స్వర్గీయ మల్లాది సూర్యనారాయణశాస్త్రిలవారికి వినయాంజలి ఘటింతును. పుత్రనిర్విశేషముగాఁ బెంచి పెద్దవానినిచేసి విద్యాబుద్ధులునేర్పించి నా సర్వాభ్యుదయములకుఁ గారణభూతుఁడైన స్వర్గీయ కేశవరావు అన్నగారిని భక్తిశ్రద్ధలతో స్మరింతును.

'అభినవభారతి' పక్షమున ఈ గ్రంథమును ప్రచురించుటకు అనుమతించిన ప్రియమిత్రులను అభినందింతును.

అందముగా ముఖపత్రమును తీర్చిన మిత్రులు మడిపడగ బలరామాచారిగారికి, అత్యంతశ్రద్ధవహించి ఈ గ్రంథమును ముచ్చటగా ముద్రించి యిచ్చిన శివాజీ ప్రెస్ అధిపతులకు ధన్యవాదము లర్పింతును.

పరిశోధనకు అత్యంతావశ్యకములైన అమూల్యగ్రంథములను పెక్కింటిని సేకరించిపెట్టిన శ్రీయుతులు జి. సదాశివశర్మ, యం. ఏ., పి. బి. లాళే, యం. ఏ., డి. జి. పాధ్యే, మెట్టా వేంకటేశ్వరరావు, యం. ఏ., గార్లకును, సర్వవిధముల నాకు అండదండలుగానుండిన ఆంధ్ర బుక్ హౌస్ అధిపతులు శ్రీ నారాయణరావుగారికిని మిక్కిలి కృతజ్ఞుఁడను. ఈ పరిశోధనము సంకల్పించిననాఁటినుండియు నన్ను పెక్కువిధముల ప్రోత్సహించిన సుహృద్వరులకు, సహృదయులకు ప్రణామ కుసుమాంజలులు సమర్పింతును.

డిశంబరు, 1966.

మాధవశర్మ

# అనుక్రమణిక

"వాగ్వై గాయత్రీ
వాగ్వా ఇదగ్ సర్వంభూతం
గాయతి త్రాయతే చ"

ఛాందోగ్యోపనిషత్తు.

"ప్రాణోవై గయః ప్రాణః, తం త్రాయతే।
సా హైషా గయాం స్తత్రే।
ప్రాణావై గయాః। తాన్ ప్రాణాం స్తత్రే।
యస్మా ద్గయాం స్తత్రే తస్మా ద్గాయత్రీ నామ"

శతపథబ్రాహ్మణము.

"ఊర్ధ్వోర్ధ్వ మారుహ్య యదర్థ జాతం
ధీః పశ్యతి శ్రాంతి మవేదయంతీ
ఫలం తదాద్యైః పరికల్పితానాం
వివేకసోపాన పరంపరాణాం

"తస్మాత్ సతామత్ర న దూషితాని
మతాని తాన్యేవ తు శోధితాని
పూర్వ ప్రతిష్ఠాపిత యోజనాసు
మూలప్రతిష్ఠా ఫల మామనంతి"

అభినవగుప్తపాదులు.

# కవిత్రయ భారతి

శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహం త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురైః
భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరాః శ్రేయసే.

ఆదికవి.

శ్రీ యన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తముపల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యనిపల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్ట సిద్ధికిన్.

కవిబ్రహ్మ.

అంబ! నవాంబుజోజ్జ్వల కరాంబుజ ! శారదచంద్ర చంద్రికా
డంబరచారుమూర్తి ! ప్రకటస్ఫుటభూషణరత్న దీపికా
చుంబిత దిగ్విభాగ ! శ్రుతి సూక్త వివిక్తనిజప్రభావ! భా
వాంబర వీథి విశ్రుతవిహార ! ననుం గృపఁజూడు భారతీ !

ప్రబంధపరమేశ్వరుఁడు.

# శిల్పము

"ఋక్సామయోః శిల్పే స్థః । తే వాం ఆరభే ।
తే మాం పాతం । ఆస్య యజ్ఞస్య ఉదృచః
శర్మాసి । శర్మ మే యచ్ఛ ।............"

యజుర్వేదము : 4-9.

"ఋక్సామముల యనంతరము రెండు శిల్పము లున్నవి. ఆ రెండింటిని నే నారంభింతును. ఆ రెండును నన్ను రక్షించుఁగాక ! ఈ యుదృచమనెడు యజ్ఞమునకు సుఖరూపమైన ప్రయోజనమున్నది నాకు సుఖము నిమ్ము."

ఋక్సామముల యనంతరము మనుష్యుఁడు సుఖప్రసవి యగు కర్మయందు ప్రవృత్తుఁడగుట కుత్సహించును. ఆ కర్మ యజ్ఞము, దానికి శిల్పములు సాధనములు మానససిద్ధములు, క్రియాసిద్ధములు నని యా శిల్పములు రెండు విధములు. "ఉదృచః యజ్ఞస్య" అనఁగా "ఉత్కృష్టాః అధీతాః ప్రత్యక్షీకృతాః ఋచః యస్మిన్ తస్య శిల్పవిద్యా సిద్ధస్య యజ్ఞస్య" అని స్వామి దయానందసరస్వతి వ్యాఖ్యానము.[1] ఉత్కృష్టముగా నధీతములయిన ఋక్కులు దేనియందు ప్రత్యక్షీకృతము లగునో అది ఉదృచమను యజ్ఞము. అది శిల్పములచే సిద్ధించును.

ఋక్కులు అధీతములు, గీతములు నైనంతమాత్రమున మానవునకు సుఖము లభింపదు. వాని యర్థ మభినీతము – ప్రత్యక్షీకృతము కావలెను. ఋగర్థాభినయమే యజ్ఞము. అది సుఖప్రసవి యైన కర్మ. "స్వర్గకామో యజేత" యని శ్రుతి యాదేశించుచున్నది. స్వర్గము సుఖస్థానము. స్వర్గము గోరినవాఁడు యజ్ఞకర్మ నాచరింపవలెను.

సుఖకామన జీవలక్షణము. "దుఃఖ సంశ్లేష విద్వేషీ సుఖాస్వాదన సాదరః" అను న్యాయమున దుఃఖసంశ్లేషవిద్వేషిత్వము, సుఖాస్వాదనసాదరత్వము జీవలక్షణములు.[2]

"Practically all modern Psychology goes to suggest that the primary considerations of the unconscious animal mind are the avoidance of pain and the pursuit of peace."[3] అని జీవతత్త్వవేత్త Mc Dowall చెప్పుచున్నాఁడు.

"కర్మహేతుః కామః స్యాత్ – ప్రవర్తకత్వాత్"[4] అని దార్శనికుల మతము. మానవజాతికి మూలపురుషుఁడైన మనువు "సంకల్పమూలః కామోవై । యజ్ఞః సంకల్పసంభవః"[5] అని కామమువలన సంకల్పము, సంకల్పమువలన యజ్ఞము పుట్టుచున్నవని తెలుపుచున్నాఁడు. మానవుని కర్మప్రవృత్తి యంతయు కామమూలకము. సర్వజీవప్రవృత్తియు సుఖకామనామూలకమే యని మనస్తత్త్వవేత్తలును జెప్పుచున్నారు.

"The basis of consciousness in every animal is desire"[6]

—Th. Ribot.

సుఖము లౌకికము, లోకోత్తరము, పారలౌకికము అని త్రివిధము. వీనిలో పారలౌకికసుఖమే ప్రధానమనియుఁ, దదాశ్రయమైన యజ్ఞమే యవశ్యకరణీయమనియు సూచించుటకు, లౌకిక, లోకోత్తర సుఖాశ్రయములయిన కర్మములు శిల్పములను సామాన్యనామముచే వ్యవహరింపఁబడి యజ్ఞమునకు అంగములుగా నిర్దేశింపఁబడినవి

తక్ష తంతువాయ నాపిత రజకాదులయు, పాచక గాంధిక మాలికాదులయు, వైణిక వాంశిక మార్దంగికాదులయు, నర్తకగాయకాదులయు కర్మములన్నియు శిల్పము లనఁబడినవి.*

"అహం హి విశ్వకర్మా వై దానవానాం మహాకవిః"[7] అని మయుఁడు తన్నుగూర్చి చెప్పికొనెను. 'యది త్వం కర్తుకామోఽసి ప్రియం శిల్పవతాంవర!'[8] అని శ్రీకృష్ణుఁడు మయునితో ననెను. మయుఁడు విశ్వకర్మ, మహాకవి, శిల్పవతాంవరుఁడు. "విశ్వం కర్మ కృతిసాధ్యం యస్య సః విశ్వకర్మా, మహాకవిః శిల్పపండితః" అని నీలకంఠవ్యాఖ్య. సర్వ కర్మములు నెవ్వనికిఁ గృతిసాధ్యములో వాఁడు విశ్వకర్మ – వాఁడు శిల్పపండితుఁడు – వాఁడు మహాకవి. ఫలమిష్టమై, ఇష్టము జ్ఞాతమై, జ్ఞాతము కృతమై యెవ్వని కర్మము సిద్ధించునో వాఁడు శిల్పి – కవి. శిల్పి కారువు, కృత్నువు ననియుఁ జెప్పఁబడుచున్నాఁడు. ఈ పదములు "కృ"ధాతు నిష్పన్నములు, కర్తృవాచకములు. అయినను కర్తృసామాన్యవాచకములు కాక కర్తృవిశేషవాచకము లగుటచే రూపవిశేషలబ్ధి పొందినవి.

"కారు రహం తతో భిషక్."[9]

ఈ మంత్రమున కారువు అనఁగా స్తోమకర్త – స్తుతి ప్రయోక్త.

"సురూపకృత్ను మూతయే సుదుఘామివ గోదుహే"[10]

ఈ మంత్రమున కృత్నువు సుందరరూపనిర్మాత. ప్రయత్నపూర్వకముగా, ప్రయోజనాపేక్షచే, ఇష్టఫలసాధన సమర్థమగు క్రియను ఆచరించువారు కారువులు, కృత్నువులు – శిల్పులు. వీరి కర్మములు యజ్ఞకర్మమునకు అంగములు.

శిల్ప శబ్దము శీలధాతు నిష్పన్నము. "ఖర్ప శిల్ప శష్ప బాష్ప రూప పర్ప తల్పాః"– నప్రైతే పప్రత్యయాంతాః నిపాత్యంతే। శీలతేః హ్రస్వం। శిల్పం కౌశలం".

సిద్ధాంతకౌముది: ఉణాది – 3 పాదము.

శిల్పము అనఁగా కౌశలము. కుశలుని ధర్మము కౌశలము. కుశాదానము యజ్ఞోపయోగి గనుక కుశలుని ధర్మమైన కౌశలము శిల్పమై యజ్ఞాంగ మగుచున్నది.

---

* "తక్షా చ తంతువాయశ్చ నాపితో రజక స్తథా
పంచమ శ్చర్మకారశ్చ కారవః శిల్పినో మతాః" —అమరము.

"శిల్పం నిపుణకర్మ"[11] "శిల్పం కర్మ కళాదికం"[12] అని యమరసింహుని నిర్వచనములు. శిల్పము కళాదికమైన నిపుణకర్మ. సుఖప్రదమైన కర్మకళ. అది నిపుణమైన కర్మ. "నితరాం పుణతీతి నిపుణః"[13] "పుణ కర్మణి శుభే"[14] "శుభ శుంభ శోభార్థే"[15] అను తీరున అతిశయశోభాస్పదమైన కర్మ నిపుణకర్మ. వేదికానిర్మాణము, తదలంకరణము — మున్నగునవి యజ్ఞశోభాకరములగుటచే నిపుణకర్మలై కళలగుచున్నవి. దేవతారాధనారూపమైన యజ్ఞకర్మకు అంగములగుచున్నవి. కౌశలము, నైపుణము శిల్పములు. ఇవి పారలౌకికసుఖసాధనమైన యజ్ఞమునకు అంగములు. అన్యత్ర కౌశలము లౌకికసుఖమునకు, నైపుణము లోకోత్తరసుఖమునకు సాధనములు.

శిల ధాతువునకు అభ్యాసము[16], సమాధి[17] యని యర్థములు చెప్పఁబడినవి. అభ్యాసము బాహ్యప్రయత్నము, సమాధి యాంతరప్రయత్నము.[18] అభ్యాసమువలన కౌశలరూప శిల్పము, సమాధివలన నైపుణరూపశిల్పము సిద్ధించును. సుఖప్రయోగచాతుర్యము కౌశలమనియు,[19] సూక్ష్మార్థావాప్తినిరతమైన ధీవ్యాపారము నైపుణమనియు[20] శారదాతనయుఁడు వివరించుచున్నాఁడు. అనఁగా క్రియాసిద్ధమైన శిల్పము కౌశలము, మానససిద్ధమైన శిల్పము నైపుణము నని తాత్పర్యము. శ్రుతియందు 'శిల్పే' అని ద్వివచనప్రతిపాదితములయిన — కాయవ్యాపార, మనోవ్యాపార సిద్ధములయిన రెండు శిల్పములు నివియే.

యజ్ఞము పుణ్యకర్మ. కళ నిపుణకర్మ. శుభకర్మకు శోభనకర్మ యంగము. శోభయనఁగా సౌందర్యము. సుఖాస్వాదనసాదరుఁడైన జీవుఁడు లోకోత్తరసుఖసాధనమైన కర్మమునందు ఆదరముగలవాఁ డగును. అట్లు తన యాదరమునకుఁ బాత్రమైన దానిని సుందరము అని భావించును. ''సుతరాం ఆద్రియతే ఇతి సుందరం''[21] అని యమరసింహుని నిర్వచనము. ఏది యత్యంత మాదరింపఁబడునో అది సుందరము. లోకోత్తరసుఖాస్వాదనమునందలి యాదరమే తాదృశసుఖాశ్రయమైన కర్మయందలి యాదరమునకుఁ గారణము, తాదృశకర్మనిర్మాణమునందలి శిల్పమునకుఁ గారణము. కర్తయందలి యాదరమే కర్మయందలి సౌందర్యము.

సౌందర్య మిట్లు లక్షింపఁబడినది:—

"అంగ ప్రత్యంగకానాం యః
సన్నివేశో యథోచితం
సుస్నిగ్ధ సంధిబంధః స్యాత్
తత్ సౌందర్య మితీర్యతే"

భరతరసప్రకరణము : 93.

అంగప్రత్యంగకముల యథోచితమైన సుస్నిగ్ధసంధిబంధమైన యే సన్నివేశము కలదో అది సౌందర్య మనఁబడుచున్నది.

అంగి నిర్మాణమునందు అంగప్రత్యంగములు యథోచితముగ సన్నివిష్టములు కావల యును. యథోచితముగా ననఁగా దేని కేది సదృశముగా నుండునో ఆ తీరున నని యర్థము. అంగప్రత్యంగముల పరస్పరసాదృశ్యమువల్ల వాని సన్నివేశము యథోచితముగ నుండును. యథోచిత సన్నివేశము వలన వాని భిన్నత్వము తిరోహితమై యంగియందు ఏకత్వము భాసించును. సదృశములయిన యంగప్రత్యంగకముల సన్నివేశము – అనఁగా సంధానము అంగియందు పూర్ణత్వమును గల్పించును. సన్నివేశము సుస్నిగ్ధ సంధిబంధమైనచో విభాగము ప్రలీనకల్పమై యంగియందు అఖండత్వము సిద్ధించును. ఏకత్వము, పూర్ణత్వము, అఖండ త్వము సౌందర్య లక్షణములు. ఇవి సమాధి లక్షణములు.

కర్తయొక్క సమాహిత మనోవ్యాపారరూపమైన నైపుణము కర్మయందు సమాధిరూప సౌందర్యముగా రూపొందును. విషయియందలి యానందమే విషయమునందలి సౌందర్యము. ఆనందము, సౌందర్యము నొక్కఁడే. అధికరణభేదముచే వ్యపదేశభేదము. ఈ యంశమునే George Santhayana యను కళావేత్త :

"Beauty is objectified pleasure"[22]

అని సూత్రప్రాయముగ "ఆనందవ్యక్తియే సౌందర్యము" అని చెప్పెను.

Beauty యను పదమును నిఘంటు విట్లు వివరించుచున్నది :

"The perfection of form resulting from the harmonious combination of diverse elements in unity; that quality of objects that gratifies the aesthetic nature" ...Standard Dictionaray.

ఈ యంశమును "Beauty is unity and totality" అని E. D. Puffer సూత్ర ప్రాయముగఁ జెప్పెను.[23]

ఏకత్వ పూర్ణత్వాఖండత్వములు ఏ యంగియందు సిద్ధించునో దానియందు సౌందర్యమను ధర్మము దీపించును. అట్టిదానియందు జీవుఁడు రమించును. అట్టిదానిని రమణీయము, సుంద రము, సరసము అని భావించును. అట్టిదానిని సాధించుట యందు శిల్పవంతుఁ డగును.

శిల్పశబ్దమును శీలధాతువునుండి కరణవ్యుత్పత్తిచేత, కర్మవ్యుత్పత్తిచేత – రెండు విధములుగా నిష్పాదింపవచ్చును. కరణార్థకమైనది వ్యాపారమును, కర్మార్థకమైనది ఫలమును బోధించునని శాస్త్రమర్యాద.[24] శీలనము శిల్పము, శీలితము శిల్పము. శీలనము వ్యాపారము, శీలితము కర్మ. కర్తృనిష్ఠమైన వ్యాపారము క్రియ యనఁబడును. * క్రియాజన్య ఫలాశ్రయము

* ధాతువునకు వ్యాపారము, ఫలము అర్థములు. అందు వ్యాపారమునకు ఆశ్రయము కర్త. ఫలము నకు ఆశ్రయము కర్మ. పచనము వ్యాపారము. దానికి ఆశ్రయము దేవదత్తుఁడు. పాకము ఫలము. దానికి ఆశ్రయము అన్నము. పచన వ్యాపారఫలమైన పాకమునకు ఆశ్రయమగు అన్నము అను కర్మ కర్తయైన దేవదత్తునకు ఈప్సితతమము.

కర్మ యనఁబడును.[25] కర్తృవ్యాపారజన్యమైన ఫలమునకు ఆశ్రయము గనుకనే కర్మ 'కర్తురీప్సితతమం[26] అనఁబడినది. ఉద్దిష్టఫలమునకు ఆశ్రయమైన కర్మయొక్క యుత్పాదనమున కర్త సమాహితచిత్తుఁడై వ్యాపారవంతుఁ డగును. * సమాహిత చిత్తవ్యాపారమే మానస శిల్పము. దానికే భావన యని పేరు.

"భావనా నామ భవితు ర్భవనానుకూలో వ్యాపారః"[27] అని మీమాంసికుల పరిభాష. సాధ్యమైనదాని సిద్ధికి అనుకూలమైన వ్యాపారము భావన. భావన సాధ్యము, సాధనము, ఇతికర్తవ్యత యను మూఁడంశములతోఁ గూడియుండును.[28] సాధ్యము రసము – లోకోత్తరానందము. సాధనము కావ్యము – కవికర్మ. ఇతికర్తవ్యత ఛందోఽలంకారాది పరికరకల్పనము. ఆలంకారిక పరిభాషయందు భావన ప్రతిభయొక్క వ్యాపారముగాఁ జెప్పఁబడినది. అది కావ్యోత్పాదనమునఁ గవియొక్క మానసికవ్యాపారము – కావ్యనిర్మాణసంకల్పాత్మకము. భావనా వ్యాపారమువలనఁ గావ్యము మనస్సునఁ గల్పింపఁబడును. 'సంకల్పం కర్మ మానసం' అని యమరసింహుఁడు.

లేఖకో భారతస్యాస్య భవ త్వం గణనాయక !
మయైవ ప్రోచ్యమానస్య మనసా కల్పితస్య చ"[29]

భావనావ్యాపారముచే మనస్సునఁ గల్పింపఁబడిన భారతమును వ్యాసభగవానుఁడు కాయ వ్యాపారముచే వాగ్రూపమునఁ గల్పించెను.

కర్మేంద్రియవ్యాపారము క్రియ. అది శక్తియొక్క వ్యక్తావస్థ. "ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి స్వరూపిణీ" యని కొనియాడఁబడిన[30] పరమేశ్వరియే శక్తి. "శక్తిః కవిత్వ బీజంహి"[31] అని యాలంకారిక మతము. నవనవోన్మేషశాలిని, అపూర్వవస్తునిర్మాణక్షమ యైన[32] ఆ శక్తియే కావ్యభాషయందు ప్రతిభ యనఁబడినది. ప్రతిభయొక్క యంతరంగాశ్రిత వ్యక్తావస్థ భావన. బహిరంగాశ్రితవ్యక్తావస్థ క్రియ. అది మనఃకల్పితమైన కావ్యమునకు వాక్కల్పనము. వాక్కల్పితమైన కవి కర్మ కావ్యము.

కాళిదాసు నాట్యము క్రతు వనెను.[33] తిక్కన వాఙ్మయము అధ్వర మనెను.[34] లోకారాధనరూపములు, ఈశ్వరారాధన రూపములు నై పరమపురుషార్థసాధనము లైన నాట్య కావ్యములు యజ్ఞము లనుటలో విప్రతిపత్తి లేదు.

---

* "ఆప్తు మిచ్ఛా ఈప్సా". పొందఁ గోరిక యీప్స. పొందఁ గోరఁబడినది ఈప్సితము. ఈప్సితతమము అనఁగా పొందవలెనని అత్యంతము కోరఁబడినది. ప్రేమింపఁబడినది, ఇష్టమైనది అని యర్థముకాదు. "రాముఁడు రావణుని చంపెను" అను వాక్యమున చంపుట వ్యాపారము. దానికి ఆశ్రయమైన రాముఁడు కర్త. చావు ఫలము. దానికి ఆశ్రయమైన రావణుఁడు కర్మ. తన వ్యాపారమునకు ఫలమైన చావునకు ఆశ్రయమైన రావణుఁడు (మృతరావణుఁడు) రామునకు ఈప్సితతముఁడు – పొందఁ గోరఁబడినవాఁడు.

"పాత్రవిశేషే న్యస్తం గుణాంతరం వ్రజతి శిల్ప మాధాతుః[35] అని నాట్యకర్మనిర్మాణమునందలి నటవ్యాపారము శిల్పమను నభిప్రాయమును కాళిదాసు వ్యక్తముచేసెను. "నే నుభయ కావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునన్ బారగుఁడ"[36] అని తిక్కన ప్రౌఢకావ్యనిర్మాణమునందలి కవివ్యాపారము శిల్పమని స్పష్టము చేసెను.

యజ్ఞకర్మవలె, నాట్యకర్మవలె, కావ్యకర్మయు బహ్వంగము. "శబ్ద శ్ఛందోఽభిధానార్థాః" అని భామహుఁడు[37] శబ్దము, ఛందము, అభిధానము, అర్థము కావ్యముయొక్క ప్రముఖాంగములని చెప్పెను. శబ్దము, ఛందము, వాగింద్రియ నిర్వర్త్యములయి శ్రోత్రేంద్రియ గ్రాహ్యములయిన కావ్యాంగములు. కావ్యము శ్రోత్రక్రతువు గదా.

అంగ నైపథ్య సత్త్వములు వాక్యార్థమును వ్యంజించుటకే ప్రవర్తిల్లుచున్నవి గనుక[38] వాక్కు నాట్యమునకు తనువువంటిది గనుక నిర్మాణసమయమునఁ గవియు, నభినయసమయమున నటుఁడును వాక్కున మిక్కిలి యత్నవంతులు కావలయునని భరతముని యాదేశించెను. నాట్యమునందే వాక్కునకు అంత ప్రాధాన్యముండఁగాఁ దన్మయమైన కావ్యమున దాని ప్రాధాన్యము ఎట్టిదో చెప్పనక్కఱలేదు.

కావ్యమున ఛందము అంగాభినయ స్థానీయము. అలంకారము ఆహార్యాభినయ స్థానీయము. గుణము సాత్త్వికాభినయ స్థానీయము. ఈ సర్వమును కావ్యతనువైన వాక్కు నాశ్రయించి కావ్యార్థమైన రసమును వ్యంజించును.

రసాభివ్యక్తి సమర్థమగు కావ్యమును నిర్మించుట కవి యిచ్ఛ. అంగియైన కావ్యమున అంగములయిన వాగర్థములు, ఛందోఽలంకారములు సుస్నిగ్ధసంధిబంధములై యథోచితముగ సన్నివిష్టములు కావలయును. అట్టి సన్నివేశమునఁ గవియొక్క యంతరింద్రియ బహిరింద్రియముల యేకాగ్రమైన వ్యాపారము శిల్పము.

శీల ధాతునిష్పన్నములయిన శీలము, శైలి, శిల్పము తరతమభావమున నేకార్థకములే. అనంత జన్మాభ్యాస సంస్కారము శీలము. శీలమే స్వార్థమున శైలియగును. ఇహజన్మాభ్యాస సంస్కారము శిల్పము. మహర్షులయందు శీలమైనది మహాకవులందు శిల్పమగుచున్నది. అప్రయత్నఫలసిద్ధి శీలమూలకము. సప్రయత్నఫలసిద్ధి శిల్పమూలకము.

లౌకికానాం హి సాధూనాం
అర్థం వాగనువర్తతే
ఋషీణాం పున రాద్యానాం
వాచ మర్థో ఽనుధావతి" ఉత్తరరామచరితము : ప్రథమ. 2.

అని భవభూతి మహాకవి చెప్పినట్లు ఆద్యులయిన మహర్షులకు శీలవశమున వాక్కునంటి యర్థము పరువెత్తును. లౌకికసాధువులయిన మహాకవులకు శిల్పవశమున నర్థమునకు అనుకూలముగ వాక్కు వర్తించును.

"నైసర్గికీ చ ప్రతిభా, శ్రుతం చ బహునిర్మలం
అమంద శ్చాభియోగోఽస్యాః కారణం కావ్యసంపదః"[39]

నైసర్గికియైన ప్రతిభ కావ్యబీజము. దానిని సహస్రధా విస్తరింపఁజేసి కావ్యమును సంపన్నము చేయునది అమందమైన యభియోగము. దీనిని రాజశేఖరుఁడు "అవిచ్ఛేదేన శీలనం"[40] అనెను. అవిచ్ఛిన్నమైన శీలనమే శిల్పము.

"అమలోదాత్తమనీష నే నుభయ
కావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునన్ పారగుఁడన్ గళావిదుఁడ"

అని తిక్కన నిర్వచనోత్తరరామాయణ పీఠికయందు చెప్పికొనెను. "కవి ర్మనీషీ" యను న్యాయమున మనీష యనఁగా కవిశక్తియైన ప్రతిభ. తిక్కన ప్రతిభ యమలము, ఉదాత్తము. అట్టి ప్రతిభాశక్తిచే ఆయన ప్రౌఢకావ్యమును నిర్మించును. ప్రౌఢి యనఁగా రసమయత్వము * కావ్యమునఁ బ్రౌఢిని పాటించుట శిల్పము. ఆ శిల్పమునం దాయన పారగుఁడు. ఆయన కళావిదుఁడు. కళ యనఁగా సౌందర్యము – రసము. తిక్కన రసవేత్త. రసాశ్రయమైన ప్రౌఢ కావ్యమును నిర్మించుటయందు కవి బుద్ధిపూర్వకముగా చేయు ప్రయత్నము శిల్పము. తిక్కన శిల్పపారగుఁడు. శిల్పముయొక్క పారము రసము. తిక్కన రససిద్ధుఁడు, రసస్వరూపము, రసవ్యంజక సామగ్రీస్వరూపము, సామగ్రీసంయోజనస్వరూపము సమగ్రముగ నెఱింగినవాఁడు. నన్నయ, ఎఱ్ఱనయు నిట్టివారే ఉద్దిష్టార్థ సమ్యక్సమర్పణ సమర్థముగ వాక్కును బ్రయోగించుట యందు పరమసాధువులైన మహాశిల్పులు కవిత్రయము.

శక్తిప్రసృతమై, ఛందోఽలంకారసుందరమైన యా మహాకవిత్రయముయొక్క వాక్కు భారతమహాకావ్యార్థము నెట్లు రసాభిషిక్తము గావించినదో యనుశీలించుట రసజ్ఞులయిన విమర్శకుల కర్తవ్యము.

"జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః"

—భర్తృహరి : విద్వత్పద్ధతి–20.

* "యథా లక్షణరహితః పురుషః న సుందరశబ్ద వాచ్యః తథా లక్షణవర్జం కథాశరీరం గుణాలంకారోజ్జ్వలమపి నీరసత్వం భజత్ ప్రౌఢకావ్యాభిధానం నార్హతి." — నా. శా. XVI-1.

అభినవగుప్తపాదుల ఈ వాక్యమువలన నీరసత్వము భజించు కావ్యము ప్రౌఢము అనుటకు యోగ్యముకాదు. కనుక రసవంతమైన కావ్యమే ప్రౌఢకావ్యము. దీర్ఘసమాస, కఠినపదబంధ బహుళమైన కావ్యము ప్రౌఢము అను నభిప్రాయము సమంజసముగా గనఁబడదు. ప్రియుఁడు సన్నిహితుఁడైనంత మాత్రముననే రసభావతరంగిత యగుట ప్రౌఢానాయికా లక్షణముగాఁ బలువు రాలంకారికులు వర్ణించియుండుటయు నిట ననుసంధింపఁ దగియున్నది.

## సూ చి క లు

1. యజుర్వేద సంహితాభాష్యము :
2. నాట్యశాస్త్రము (అభినవ భారతి) : VI - పుట 282
3. A Biological Introduction to Psychology : p. 5.
4. తైత్తిరీయోపనిషత్తు (శాంకర భాష్యము)
5. మనుస్మృతి : 2-3.
6. Psychology of the Emotions : p. 439.
7. భారత సంహిత : సభా. 1-6.
8. ,, : సభా. 1-10.
9. నిరుక్తము : 6-2-5.
10. ఋగ్వేదము : 2-4-31.
11. అమరకోశము : 2 కాండ. శూద్ర-ర.
12. ,, : ,, ,, -35.
13. ,, : 3 కాండ. విశేష్యనిఘ్న -4
14. సిద్ధాంతకౌముది ; తుదాది-1333
15. ,, : తుదాది-1321 : 1322.
16. ,, : చురాది-1879.
17. ,, : భ్వాది-523.
18. కావ్యమీమాంస : 4వ అధ్యాయము.
19. భావప్రకాశనము : 3వ అధికారము-పుట 75.
20. ,, : ,, ,,
21. అమరకోశము : 3వ కాండ-విశేష్యవిఘ్న-52.
22. The Psychology of Beauty : P. 270.
23. ,, ,, : P. 50.
24. పరమలఘుమంజూష : పుట 41.
25. పరమలఘుమంజూష : పుట 98.
26. సిద్ధాంతకౌముది : కారక. 585.
27. ధ్వన్యాలోకము (బాలప్రియ) : పుట. 189.
28. ,, : ,,
29. భారత సంహిత : అనుక్రమణికాపర్వము-77.
30. లలితాసహస్రనామావళి : శ్లో. 130.

31. "శక్తిః కవిత్వబీజరూపః సంస్కార విశేషః । యాం వినా కావ్యం న ప్రసరేత్. ప్రసృతం వా ఉపహాసనీయం స్యాత్"

అని మమ్మటాచార్యుఁడు కావ్యప్రకాశ ప్రథమోల్లాసమున 'శక్తి' ని వివరించి యున్నాఁడు. "శక్తిః కవిత్వబీజం హి ప్రాక్తనీ కాపి సంస్క్రియా యయా వినా న ప్రసరేత్ కావ్యం శిక్షావతా మపి" అను కారిక చిన్ననాఁటినుండియు నాచిత్తమున మెదలుచునే యున్నది. కర్త యెవఁడో గుర్తు తగులుటలేదు.

32. ధ్వన్యాలోకము (లోచనము) : 1-6.

33. మాళవికాగ్నిమిత్రము : 1-4.

34. భారతము : శాంతి. II-55.

35. మాళవికాగ్నిమిత్రము : 1-6.

36. నిర్వచనోత్తర రామాయణము : I-13.

37. కావ్యాలంకారము : 1-9.

38. నాట్యశాస్త్రము : XIV-2.

39. కావ్యాదర్శము : 1-103.

40. కావ్యమీమాంస : 4వ అధ్యాయము.

41. శుక్లయజుర్వేద సంహిత : 40 అధ్యా. 8 సూత్రము.

# ఛందః ప్రశస్తి

"ఛందః పాదౌ తు వేదస్య"

పాణినీయశిక్ష-41.

ఛందము వేదమునకు పాదములు. వేదముయొక్క ప్రతిష్ఠకు, ప్రచారమునకు ఛందము సాధనము. వేదాంగము లాఱింటిలో ఛందోరూపమైన యంగము వేదపురుషునకు గతిసాధనమైన పాదద్వయముగా రూపింపఁబడినది.

వేదము మంత్రబ్రాహ్మణరూపము. అందు పాదవ్యవస్థ గల మంత్రములు ఋక్కులు. ఋక్కులు వాఙ్మయములు. "వాగేవ ఋక్"[1]అని శ్రుతి. "ఋచస్తుతౌ"[2] అనుటచే దేవతార్చనారూపములయిన వాక్కులు ఋక్కులు, దేవత మంత్రముయొక్క ఆత్మ.

"మంత్రమయీ దేవతా." *

మహర్షులచే నేది మననముచేయఁబడినదో అది దేవత. మననసాధనము మంత్రము. యాస్కముని మంత్రత్వము నిట్లు నిర్వచించెను.

"మంత్రా మననాత్"

"తేభ్యో హి అధ్యాత్మాధిదేవాధియజ్ఞాది మంతారః మన్యంతే।

తదేషాం మంత్రాణాం మంత్రత్వం ।

తే పునః ఛందోమయాః ।

నాచ్ఛందసి వాగుచ్చరతీతి."[3]

మంత్రములు ఛందోమయములు. దేవతాత్మకమైన మంత్రము దేవతార్చనారూపమైన వాక్కు. అట్టి వాక్కు అచ్ఛందమునఁ జరింపదు. అభిమతదేవతాస్తవనాత్మకమైన వాక్కు స్వయముగనే ఛందోమయమై యుండును. అట్టి వాక్యములు వేదముయొక్క స్థితికి, గతికి సాధనములయిన పాదములు. వేదముయొక్క ప్రతిష్ఠ, ప్రచారము ఛందోమయ వాక్యరూపములైన యీ పాదముల యధీనమై యున్నది.

* దేవత మంత్రమయి యనుట మీమాంసికమతమని చెప్పి యీ సూత్రము వృత్తిప్రభాకరము అను గ్రంథమున నుదాహరింపఁబడినది. యజుస్సర్వానుక్రమణిక - ప్రథమాధ్యాయము - 9వ పుటలో కాత్యాయనుని వాక్యము లిట్లున్నవి :—

"అథ దేవతాస్వరూప మాహ"—

"దేవతాః మంత్రాంతర్భూతాః అగ్న్యాదికాః హవిర్భాజః స్తుతిభాజో వా."

"యా మంత్రాంతర్భూతాః మంత్రమధ్యపతితాః మంత్రాక్షరజ్ఞేయస్వరూపాః హవిర్భాజః స్తుతిభాజో వా అగ్న్యాదికాః తాః దేవతాః।మంత్రవర్ణా దేవతాః।అగ్ని సోమేంద్ర విష్ణ్వాదయో దేవతాః ఇత్యర్థః"

“తేషాం ఋక్ యత్రార్థవశేన పాదవ్యవస్థా”[4] యను జైమినీయ వాక్యమువలన ఋక్కుల పాదవ్యవస్థ అర్థవశమై యున్నదని విదితమగుచున్నది. కనుక ఛందము వేదగతికి మాత్రమేకాక వేదార్థావగతికిఁగూడ సాధన మగుచున్నదని గ్రహింపవలసియున్నది. అర్థవశమునఁ బాదవ్యవస్థ, పాదవశమున ఛందోవ్యవస్థ – ఇది వేదవాక్యముల లక్షణము.* కనుక వేదాధ్యయనమునకు, వేదార్థగ్రహణమునకు, వేదార్థానుష్ఠానమునకు ఛందోజ్ఞానము అవసరమగుచున్నది.

“ప్రతిపాదం ఋచా మర్థాః సంతి కేచిదవాంతరాః
ఋగర్థ స్సముదాయః స్యాత్ తేషాం బుద్ధ్వా ప్రకల్పితః
ఛందోఽనుక్రమణీ తస్మాత్ గ్రాహ్యా సూక్ష్మేక్షికాపరైః”

—ఋగ్భాష్య - ఛందోనుక్రమణిక

ఋక్కుయొక్క సంపూర్ణార్థము ఋక్పాదములందలి యవాంతరార్థముల సముదాయమే కనుక ఋగర్థావగతికి ఛందోఽనుక్రమణిక యతిసూక్ష్మవివేకముతో గ్రహింపఁదగియున్నదని వేంకటమాధవుల యాదేశము.

“ఛందాంసి గాయత్ర్యాదీని । ఏతా న్యవిదిత్వా యో అధీతే, అనుబ్రూతే, జపతి, జుహోతి, యజతి, యాజయతే తస్య బ్రహ్మ నిర్వీర్యం, యాతయామం భవతి । ...అథ విజ్ఞాయైతాని యోఽధితే తస్య వీర్యవత్ । అథ యోఽర్థవిత్ తస్య వీరవత్తరం భవతి । జపిత్వా. హుత్వా, ఇష్ట్వా తత్ఫలేన యుజ్యతే.”[5]

గాయత్ర్యాదులయిన ఛందములను జక్కఁగా నెఱుంగక యెవఁడు అధ్యయన జప యజనాదులు చేయునో వానికి వేదము నిర్వీర్యమగును. ఛందముల నెఱింగి యధ్యయనాదికము చేయు వానికి వేదము వీర్యవంతమగును. అర్థముకూడ గ్రహించినవానికి వీర్యవత్తరంబగును. కనుక ఛందోజ్ఞానము వేదాధ్యయనానుష్ఠానసాఫల్యమునకు అత్యంత మవసరమగుచున్నదని కాత్యాయన మహర్షి యనుశాసించెను.

వేదము అనాదికావ్యము. అది యపౌరుషేయము. అనఁగా ఆర్షేయము. “దేవస్య పశ్య కావ్యం న మమార న జీర్యతే”[6] యని యథర్వశ్రుతి యజరామరమైన మహాకావ్యముగా వేదమును గొనియాడుచున్నది.

ఆర్షేయ వాక్యసముదాయత్వమే వేదముయొక్క యపౌరుషేయత్వము. “ఋషి ర్దర్శనాత్” అను న్యాయమున దర్శిత్వమే ఋషిత్వము. అనంతజన్మాభ్యాసవశమున యుక్తచిత్తులై

* “చతుశ్శత ముత్కృతిః” (పింగళచ్ఛందము : అధ్యా. 4-సూ. 1) ఉత్కృతిచ్ఛందమునకు 104 అక్షరములు. ఇవి నాల్గుపాదములుగా నుండునన్న నియమములేదు. ఎన్ని పాదములుగానైన నుండవచ్చును. “భాగస్య హవిష ఆత్త మద్య” ఇత్యాదియగు శుక్లయజుర్వేదమంత్రము (21-48-1) పదమూఁడు పాదములుగా నున్నది. ఈ పదమూఁడును అవాంతరవాక్యములు.

యున్న మహర్షులు దర్శించిన వాక్యముల సముదాయమే వేదము. సమాహితచిత్తులయిన మహర్షులు దర్శించిన వాక్యములుకూడ సమాహితములే. సమాహితవాక్యమే ఛందము. ఛందస్వద్వాక్యదర్శిత్వమే ఋషిత్వము. ఆర్షమైన వాక్యము అచ్ఛందము కాఁజాలదు. అచ్ఛందమైన వాక్యము అనార్షము, అనార్యము. అది యసాధువు, అస్వాదువు. సాధుత్వస్వాదుత్వ లక్షణములు గల వాక్కులే ఋక్కులు ఋఙ్మండలమే వేదము – ఆర్షేయ మహాకావ్యము.

ఆర్షేయమైన వైదికకావ్యమువలె పౌరుషేయమైన లౌకికకావ్యముగూడ ఛందోమయమే. "నాచ్ఛందసి వాగుచ్చరతి" యన్న మాట దేవతాత్మకములయిన మంత్రముల విషయమందువలె రసాత్మకములయిన కావ్యముల విషయమునందును పరమార్థమే. మననశీలురైన మహర్షులు దర్శించిన దేవతామయవాక్యములవలె భావనాశీలురైన మహాకవులు దర్శించిన రసమయవాక్యములును ఛందోమయములే. అచ్ఛందమైన వాక్య మకావ్యము, అశ్రవ్యము, అసేవ్యము. *

కావ్యభాషయందు వాక్కు అనఁగా రసవృత్తియైన శబ్దము. "సా వాక్ యా రసవృత్తిః"[7] అని వాగనుశాసనుని యనుశాసనము. అట్టి రసవృత్తియైన వాక్కు అచ్ఛందమునఁ జరింపదు. కనుక రసగ్రహణమునకు ఛందోజ్ఞాన మత్యవసరము. వాక్య మెట్టి ఛందముచే నలంకృతమై యెట్టి రసభావములను సమర్పింపఁగలదు అన్న జ్ఞానము లేనిదే కావ్యము చదివి ప్రయోజనము లేదు. ఛందోవేత్తయైన యధ్యేతకే కావ్యము వీర్యవంతమగును. అట్టివానికే రసదర్శనమై కావ్యాధ్యయనఫలము సమగ్రముగ లభించును.

"నాచ్ఛందసి వాగుచ్చరతి" యను నాగమవాక్యమును భరతమహర్షి నాట్యపరముగా నన్వయించి చెప్పెను.

"ఛందోహీనో న శబ్దోఽస్తి
న చ్ఛందః శబ్దవర్జితం
ఏవం తూభయ సంయోగో
నాట్య స్యోద్ద్యోతకః స్మృతః"[8]

శబ్దచ్ఛందము లితరేతరాశ్రితములు. అచ్ఛందమైన శబ్దము, అశబ్దమైన ఛందము శోభిల్లవు. శబ్దచ్ఛందస్సంయోగము నాట్యమునకు ఉద్ద్యోతకము. వాక్యార్థాభినయరూపమైన నాట్యము రసాత్మకము. రసాత్మ నేత్రేంద్రియగోచరమైన రూపము నాశ్రయించి నాట్య మనఁబడుచున్నది. అదియే శ్రోత్రేంద్రియగోచరమైన నామము నాశ్రయించి కావ్య మనఁబడుచున్నది. ఛందము, శబ్దము సంయుక్తములయి నాట్యమునువలె కావ్యమును ఉద్ద్యోతితము గావించును.

* అసేవ్యము అనఁగా దాని యర్థము అనుష్ఠింపఁదగనిది అని యర్థము కాదు. అది శ్రుతికి సేవ్యము కాదు, నిరంతరము ఆసక్తితో వినఁదగినదికాదు అని యర్థము. హితమైనను మనోహారికాదు అని తాత్పర్యము.

"శబ్ద స్యైషా తనూః" అని భరతముని ఛందమును గొనియాడెను. 'తను విస్తారే' అను న్యాయమున శబ్దము ఛందోరూపవిస్తరణము గలది. • రసాత్మక శబ్దవిస్తరణ మంతయు ఛందోమయమే యని చెప్పుటచే ఛందము కావ్యధర్మి యని చెప్పినట్లయినది. కావ్యధర్మము లోకధర్మము ననువర్తించియే యుండును గనుక ఛందము లోకధర్మియు నైయున్నది.

> "ఛందోభూత మిదం సర్వం
> వాఙ్మయం స్యా ద్విజానతః
> నాచ్ఛందసి న చాపృష్టే
> శబ్ద శ్చరతి కశ్చన"

తెలిసికోఁగలవానికి సర్వవాఙ్మయము ఛందోమయమే. అచ్ఛందమున శబ్ద మేదియు చరింపదు. శబ్దచరణ మంతయు ఛందోమయమే. ఛందమనఁగా ఇచ్ఛ. అది వృచ్ఛ, వివక్ష యని రెండువిధములు. జ్ఞానేచ్ఛ పృచ్ఛ, జ్ఞాపనేచ్ఛ వివక్ష. వీనియం దేదో యొక యిచ్ఛ లేనిదే శబ్దచరణము లేదు. జిజ్ఞాసా వివక్షా రూపమగు యిచ్ఛయే లోకమున వాగ్వ్యవహారము నకు మూలము. కనుక యథేచ్ఛాప్రయుక్తమయిన వ్యావహారికవాక్యముగూడ ఛందోమయమే యని విజ్ఞుఁడు గుర్తింపఁగలఁడు. లోకధర్మియైన ఛందమెట్లు సంస్కృతము కావ్యధర్మి యగు చున్నదో, కావ్యధర్మియైన ఛందముగూడ ఎట్లు ఉపస్కృతము రసధర్మి యగుచున్నదో గ్రహింప వలసిన యవసరము ఎంతేనియుఁ గలదు. గద్య పద్య మిశ్రరూపమున చంపూకావ్యమున లోకధర్మి, కావ్యధర్మి, రసధర్మి యైన ఛందము వక్తృ వాచ్యాద్యౌచిత్యానుసారము ఎట్లు ప్రయో గింపఁబడుచున్నదో గ్రహించుటకు సమగ్రమున ఛందోవివేక మగత్య మగుచున్నది.

> "ఛందశ్శాస్త్రం పవిత్రం త
> ద్వివిక్షోః కావ్యసాగరం
> ఛందోభా గ్వాఙ్మయం సర్వం
> న కించి చ్ఛందసా వినా."

అని జయకీర్తి ఛందమును ప్రశంసించినాఁడు. వాఙ్మయమంతయు ఛందోమయమే కనుక కావ్యసాగరమును ప్రవేశింపఁగోరువానికి ఛందశ్శాస్త్రము తరణోపాయ మగుచున్నది.

> "విద్యలలోపల నుత్తమ
> విద్య కవిత్వంబు మఱి కవిత్వము ఛందో
> వేద్యము :................."

• "Metre is the body of verse as emotional thought is the soul" (A Study of Metre : Page 1.) T. S. Omond ప్రకటించిన యీ యభిప్రాయము భరతముని యభిప్రాయముతో సంవదించుచున్నది.

ఛందోవేత్త కానివాఁడు కావ్యవేత్త కాఁజాలఁడని యనంతామాత్యుఁడు ఛందోమహిమను బ్రశంసించెను. ఛందోవేత్తయే వేదవేత్త; ఛందోవేత్తయే కావ్యవేత్త. వేదమునకువలె కావ్యమునకును ఛందము అంగమే. అంగజ్ఞానము లేక అంగిజ్ఞానము లేదు.

ఛందోజ్ఞాన మనఁగా చంపక శార్దూలాది పద్యనామ జ్ఞానముగాని, ఆయా పద్యముల గణ యత్యాది లక్షణజ్ఞానముగాని కాదు. తావన్మాత్ర జ్ఞానముచే కావ్యగతి స్వరూపము కొంతవఱకు గోచరించుననుట సత్యమ. కాని ఛందస్తత్త్వము, కావ్యతత్త్వము, వాని పరస్పర సంబంధము దెలిసినవానికి కావ్యము వీర్య వత్తరమై తదధ్యయనఫలము సమగ్రముగ లభించును.

> "అథ యో మంత్రే మంత్రే వేద సర్వమాయు రేతి
> శ్రేయాన్ భవతి । అయాతయామా న్యస్య ఛందాంసి
> భవంతి । తస్మా దేతాని మంత్రే మంత్రే విద్యాత్"[10]

గాయత్ర్యాది ఛందముల నెఱింగినంతమాత్రమున వేదాధ్యయనము పూర్ణఫలప్రదము కాఁజాలదు. ప్రతి మంత్రమును దానియొక్క ఛందమును, ఋషిని, దేవతను దెలిసికొని యధ్యయనము చేయవలెను. అట్లే కావ్యమందలి ప్రతిపద్యముయొక్క లక్షణము, నిర్మాణవిశేషము, వక్తృవాచ్యములను జక్కఁగాఁ దెలిసికొని యధ్యయనము చేయువాఁడు తత్ఫలమును సంపూర్ణముగ ననుభవింపఁ గలఁడు.

కనుక ఛందశ్శబ్ద నిర్వచనము, ఛందోదర్శనము, ఛందః ప్రభవ ప్రభావములు, ఛందోఽంగములు, ఛందోనిర్మాణ మర్మములు, ఛందోవృత్తి రీతులు, ఛందోరససంబంధము, ఛందోఽలంకరణము – మున్నగు పెక్కు అంశముల పరిజ్ఞానము కావ్యార్థ సమగ్ర గ్రహణమునకు అవసరము.

ఋషికల్పులు, మహాశిల్పులు నైన కవిత్రయము నానారసాశ్రయమైన యాంధ్రమహాభారతమున నానావృత్తములను వస్తురసభావ నిర్వహణదక్షము లగునట్లు నిర్మించుటయందుఁ బ్రదర్శించిన శిల్పము ననుశీలించుటకు అత్యంతసూక్ష్మమైన ఛందస్తత్త్వవివేకము అవసరమగుచున్నది.

"దేవానా మిద మామనంతి మునయః కాంతం క్రతుం చాక్షుషం"[11] అని కాళిదాస మహాకవి నాట్యమును యజ్ఞముగాఁ గొనియాడియున్నాఁడు. నాట్యము చక్షుఃక్రతువైనట్లు కావ్యము శ్రోత్రక్రతువని భావింపవచ్చును. "వాగ్వై యజ్ఞః"[12] అని శ్రుతి వాఙ్మయయజ్ఞమును బ్రతిపాదించుచున్నది. కవికర్మయైన కావ్యము లోకకళ్యాణకారి యగుటచే యజ్ఞమే యనుటలో విప్రతిపత్తి లేదు.

> "తపమునకు విద్యకును జనుఃస్థాన మైన
> జనన రహితుని యజ్ఞాత్ము శౌరి వాఙ్మ
> యాధ్వరార్చితుఁ జేసితి నా జనార్ద
> నుండు మద్భజనమునఁ బ్రీతుండుగాత" శాంతి. II–55

అని తిక్కనసోమయాజి పరమేశ్వరస్తుతి వాఙ్మయయజ్ఞమన్న యభిప్రాయమును ప్రకటించెను. మహాభారతనిర్మాణము ఈశ్వరారాధన రూపమైన వాఙ్మయాధ్వర మనియే ఆయన యాశయము.

"సర్వై శ్ఛందోభి ర్యజే దిత్యాహుః ।
సర్వై శ్ఛందోభి రిష్ట్వా దేవాః స్వర్గం లోకం అజయన్ ।
తథై వైతద్యజమానః
సర్వై శ్ఛందోభి రిష్ట్వా స్వర్గం లోకం జయతి॥"[13]

యజ్ఞమును సర్వచ్ఛందములచేత నిర్వహింపవలెననియు, నట్లు నిర్వహింపఁబడిన యజ్ఞమే స్వర్గఫలప్రద మగుననియు ఐతరేయ బ్రాహ్మణము చెప్పుచున్నది.

వాఙ్మయమైన కావ్యయజ్ఞముగూడ నానాచ్ఛందములచే నిర్వహింపఁబడఁ దగినదే యని భావింపవచ్చును. విశేషించి వస్తు గుణ క్రియా రస భావ బహుళమైన భారతమహాకావ్య నిర్మాణమున ఛందోబాహుళ్య ప్రయోగావసర మెంతేనియుఁ గలదు. నానాఛందముల యథోచిత పరిజ్ఞానము గల కవి వాని యుచిత నిర్మాణ ప్రయోగములచేఁ గావ్యయజ్ఞమును శోభావంతముగా వించి రసదేవతారాధనమునఁ గృతార్థుఁడు కాఁగలఁడు.

ఛందఃప్రయోగౌచిత్యము ఛందఃప్రయోజన పరిజ్ఞానముపై నాధారపడి యుండును గనుక ఛందః శబ్దముయొక్క యర్థమును విచారింపవలయును.

## సూచికలు

1. ఛాందోగ్యోపనిషత్తు : 1-1-5.
2. పాణిని : తుదాది-1302
3. నిరుక్తము : 7 వ అధ్యాయము, 3 వ పాదము.
4. మీమాంసా సూత్రములు : 2-1-35.
5. యజుర్వేద సర్వానుక్రమణిక : అధ్యా. 1. పుట. 8.
6. అథర్వవేదము : 10-8-32.
7. ఆంధ్రశబ్దచింతామణి : 1-1.
8. నాట్యశాస్త్రము : XIV - 44.
9. కాత్యాయనపరిశిష్టదశకము : 92 పుట (వైదికచ్ఛందో మీమాంస-9 పుట.)
10. ఆర్షేయబ్రాహ్మణము : 1-10 (వైదికచ్ఛందో మీమాంస-77 పుట.)
11. మాళవికాగ్నిమిత్ర నాటకము : 1-4.
12. శతపథబ్రాహ్మణము :
13. ఐతరేయబ్రాహ్మణము : 2-3.

# ఛందో నిరుక్తి

"ఛందాంసి ఛాదనాత్"[1]

ఛందము ఛాదకమని యాస్కముని నిర్వచించెను. దేవత మంత్రమయి యనియు, మంత్రము ఛందోమయ మనియుఁ జెప్పఁబడుటచేత ఛందముచే నాచ్ఛాదింపఁబడుచున్నది మంత్రమయియైన దేవతయే యని విదితమగుచున్నది. శ్రుతియు నీ యర్థమునే వివరించు చున్నది.

"దేవా వై మృత్యో ర్బిభ్యతః త్రయీం విద్యాం ప్రావిశన్ ।
తే ఛందోభి రచ్ఛాదయన్ । యదేభి రచ్ఛాదయం స్తత్
ఛందసాం ఛందస్త్వం"

ఛాందోగ్యోపనిషత్తు : 1-4-2.

దేవతలు మృత్యువువలన భయపడుచున్నవారై త్రయీవిద్యను బ్రవేశించి ఛందములచేఁ దమ్ము ఆచ్ఛాదించుకొనిరి గనుక ఛందములకు ఛాదనమువల్ల ఛందస్త్వము సిద్ధించుచున్నది. మంత్రమయియైన దేవత ఛందోమయమైన యాచ్ఛాదనమును బొంది మృత్యుభీతి తొలఁగి యమర మగుచున్నది. ఛందోమయాచ్ఛాదనము అమరత్వహేతువు అని దీని భావము.

"ఛంద్యతే అనేనేతి ఛందః । ఛది సంవరణే"[2]

సంవరణ మనఁగాఁ జక్కఁగా నావరించుట. ఛందముచేతఁ జక్కఁగా నావరింపఁబడి మంత్రమయదేవత శక్తిమత్తరమై మృత్యువును జయించి యమృత మగుచున్నది.

"దివు క్రీడా వ్యవహార ద్యుతి స్తుతి మోద మద స్వప్న కాంతి గతిషు"[3] అను న్యాయ మున క్రీడా మోద ప్రకాశాదికము దేవతాలక్షణము. ఛందోమయమైన యాచ్ఛాదనమును, ఆవరణమును బొంది మంత్రాత్మయైన దేవత ప్రకాశించుచుఁ గ్రీడించుచు, మోదించుచున్నది. ఛందము దేవతకు ఆచ్ఛాదనరూపమునఁ గవచము, ఆవరణరూపమున దుర్గము నగుచున్నది.

"ఛది రూర్జనే - అనేకార్థత్వా దూర్జే రర్థే వృత్తిః. ఛదంతం ప్రయుంక్తే ఛదయతి. బలవంతం ప్రాణవంతం వా కరో తీత్యర్థః । అన్యత్ర ఛాదయతి - అపవారయంతం ప్రయుంక్తే ఇత్యర్థః"[4] అని పాణినీయ ధాతుపాఠమున ఛద్ ధాత్వర్థము వివరింపఁబడినది. ఛందమువలన మంత్రమయదేవత ప్రాణితము, ఊర్జితము, అపవారితము నగుచున్నది.

‘‘ఛందయతి ఆహ్లాదయతీతి ఛందః’’[5] ఛందము ఆహ్లాదకము. మంత్రాత్మయైన దేవతకు మంత్రద్రష్టయైన ఋషికి, మంత్రశ్రోతలైన సర్వమానవులకు అభిలషితార్థప్రదానరూపమున ఆహ్లాదము గలిగించునది ఛందము.

‘‘ఛందః పద్యే అభిలాషే చ’’[6] ఛందశ్శబ్దమునకు పద్యము, అభిలాష యనియు నర్థములు గలవు. ఛందముయొక్క యీ ప్రయోజన బాహుళ్యమును దృష్టియం దుంచుకొని కావ్యాధ్యయనము, కావ్యార్థానుసంధానము చేయవలెను.

ఋషి, దేవత, ఛందము, మంత్రము – వీని సంబంధము తెలియక వేదాధ్యయనము చేయరాదని కాత్యాయనమహర్షి శాసించెను. వీని సంబంధము దెలిసికొని కావ్యపరముగా వీని నన్వయించుకొనవలయును.

‘‘యస్య వాక్యం స ఋషిః; యా తేనోచ్యతే సా దేవతా’’[7] యను న్యాయమున వక్త ఋషి, వానిచే నుక్తమయినది దేవత. వక్త ఋషి; ఉక్తము దేవత, ఉక్తి మంత్రము. వాక్యార్థమే దేవతయనియు, వాక్యమే మంత్రమనియు, కవి లేక కవినిబద్ధవక్త ఋషియనియు పర్యవసితార్థము.

వాక్యార్థమును గుప్తము, దీప్తము, ఊర్జితము, ప్రాణితము, అమృతము చేయుటకు వక్త వాక్యమును ఛందోమయము గావించునని భావింపఁ దగియున్నది.

‘‘గాయత్రేణ ఛందసా త్వా ఛాదయామి ।
త్రైష్టుభేన ఛందసా త్వా ఛాదయామి ।
ఛాదయంతి హ వా ఏనం ఛందాంసి।’’[8]

ఆర్షమైన యీ ఛందోభావన గంభీరార్థమై యున్నది. ఏ దేవత యే ఛందముచే నాచ్ఛాదితమై స్వధర్మనిర్వహణ దక్షమగునో తెలిసి యా దేవతను ఆ ఛందముచే నాచ్ఛాదించి యూర్జితము, దీపితము, ఆహ్లాదమయము చేయవలయును. లోకమునను, గావ్యమునను ఈ భావన యున్నది.

మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యము తథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగు పలు
కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్

ఆది. III-205

పండితపరిషత్తులందుఁ బ్రయోగింపఁ దగిన వాక్యముయొక్క చంద మెట్లుండవలెనో నన్నయ యీ పద్యమునఁ జెప్పెను. ఈ చెప్పిన లక్షణము లన్నియు గోపన దీపనాపవార ణాహ్లాదనాదులయిన ఛందముయొక్క నానార్థములే యనుట స్పష్టము. *

కావ్యమును నిర్మించు కవియు "ఈ యర్థము నీ ఛందముచే ఆచ్ఛాదితము చేయుదును; ఈ యర్థము నీఛందముచే దీప్తము చేయుదును; ఈ యర్థము నీఛందముచే ఆహ్లాదకము చేయుదును"— ఈ విధమైన ఛందోభావన కలవాఁడై వాక్యప్రయోగము గావించును. లేనిచో వస్తు రసభావాద్యర్థానుకూలముగ ఛందములను బ్రయోగింపఁ జాలఁడు. శృంగారదేవతాకమైన వాక్యమును మధురము చేయుటకు, రౌద్రదేవతాకమైనదానిని దీప్తము చేయుటకు, ధర్మదేవతాకమైన దానిని పరిమితము చేయుటకు – ఇట్లు నానార్థములను నానావిధముల సమర్థించుటకు కవి వాక్యమును ఛందోమయము చేయును. ఛందముయొక్క ప్రయోజన బాహుళ్యమును యథావసరము ఉపయోగించుకొనుటకు కవికి సమగ్రమైన ఛందోదర్శనము ఉండవలయును.

భిన్నచ్ఛందములు భిన్నసామర్థ్యములు గలవనియు, భిన్నార్థములు భిన్నచ్ఛందములందు నిబద్ధములై భిన్నసామర్థ్యములు పొందఁగలవనియు మహర్షులే గుర్తించిరి. ఛందములయొక్క యర్థానురూపత్వమును గొంతవఱకు ఉపదేశించిరి.

"గాయత్రీం బ్రాహ్మణ స్యానుబ్రూయాత్ ।
గాయత్రో వై బ్రాహ్మణః ।
తేజో వై బ్రహ్మవర్చసం గాయత్రం ।
తేజసైవైనం తద్బ్రహ్మవర్చసేన సమర్థయతి ।
త్రిష్టుభం రాజన్య స్యానుబ్రూయాత్ ।
త్రైష్టుభో వై రాజన్యః ।

---

* ఈ పద్యమున నన్నయ చెప్పిన లక్షణములు చాలవఱకు శ్రుతిరమణీయమై, లయాన్వితమైన వాక్యమునకుఁ జెందినవి. అట్టి వాక్యము గద్యమైనను ఛందోమయమే యగును. గద్యముకూడ ఛందోభేదమేకదా. తిక్కన్నకూడ వక్తకు, శ్రోతకు ప్రియము కాని వాక్యము బాలిశుల పలుకని తెలిపెను.

''కం॥ శ్రోతకును దనకుఁ బ్రియమగు
నే తెరువున నట్టిమెయి సమీరితమైనం
జూ తగు వాక్యం బది; నృప
సూతీ! పెఱపలుకు బాలిశుల పలుకరయన్."

శాంతి VI - 190.

ఓజో వా ఇంద్రియం వీర్యం త్రిష్టుప్ ।
ఓజసైవైనం తదింద్రియేణ వీర్యేణ సమర్ధయతి । ......"

ఐతరేయ బ్రాహ్మణము : 5 - 2

వర్ణ్యవస్తు స్వరూప స్వభావములకు అనుగుణమైన ఛందమును ప్రయోగించి ఛందము యొక్క సామర్థ్యవిశేషముచే వర్ణ్యవస్తువును సమర్థము చేయవలెను.

## సూ చి క లు :

1. నిరుక్తము : 8-8-11 (864 పుట)
2. సిద్ధాంతకౌముది : చురాది. 1577.
3. సిద్ధాంత కౌముది : దివాది.
4. సిద్ధాంతకౌముది : భ్వాది
5. అమరకోశము : 3-20.
6. అమరకోశము : 3-233.
7. నిరుక్తవ్యాఖ్య : 6-5-29 (325 పుట)
8. పింగళచ్ఛందశ్శాస్త్రభూమిక : పుట. 81.

# ఛందో దర్శనము

ఛందోదర్శన మనఁగా ఛందములయొక్క యంగప్రత్యంగ స్వరూప స్వభావ పరమార్థములను దెలిసికొనుట.

"ఛందో ఽక్షరసంఖ్యావచ్ఛేదక ముచ్యతే"[1]
"యదక్షరపరిమాణం తచ్ఛందః"[2]
"చతుర్వింశత్యక్షరాదీని చతురుత్తరాణి
గాయత్ర్యాదీని ఛందాంసి"[3]

ఛందము అక్షరసంఖ్యానియామకము. అక్షరపరిమాణమే ఛందము. గాయత్రి మొదలయినవి ఛందములు. అవి చతుర్వింశత్యక్షరాది చతురక్షరోత్తరములు. ఛందముల తొలి దర్శనము అక్షరసంఖ్యానిష్ఠమై యున్నది. ఆదిమచ్ఛందము గాయత్రి. అది చతుర్వింశత్యక్షర. దానినుండియే చతురక్షరవర్ధనరూపమున నన్యచ్ఛందములు పుట్టినవి.

"చతుర్విగ్ంశత్యక్షరా త్రిపదా గాయత్రీ"[4]
"గాయత్రీ ఛందాసా మహం"[5]
"తత్త్వార్థవర్ణాత్మికాం గాయత్రీం"[6]

అని గాయత్రీచ్ఛందము కొనియాడఁబడినది. సాంఖ్యదర్శనప్రసిద్ధమైన ప్రకృతియొక్క త్రిగుణాత్మకత్వమే గాయత్రియొక్క త్రిపదాత్వము. ప్రకృతియొక్క చతుర్వింశతితత్త్వాత్మకత్వమే గాయత్రి చతుర్వింశత్యక్షరాత్వము. ప్రకృతియొక్క సర్వప్రపంచ మాతృత్వమే గాయత్రి సర్వచ్ఛందో మాతృత్వము. ఛందః ప్రకృతియే గాయత్రి.

"ఓజోఽసి సహోఽసి బలమసి భ్రాజోసి దేవానాం ధామ నామాసి విశ్వమసి విశ్వాయుః సర్వమసి సర్వాయుః"[7] అని యీ విధముగా గాయత్రియొక్క సర్వశక్తిసంపన్నత కొనియాడఁబడినది.

పాశ్చాత్యుల ఛందోదర్శనము నిట్లే యున్నది. ఛందములను Numbers అనియు, Measures అనియు వారు వ్యవహరించిరి.

గాయత్రియందలి యిరువదినాలు గక్షరములు, మూఁడు పాదములు వ్యస్తములయిన యక్షరములు, పాదములు మాత్రమే కావు. ఆ యక్షరములు ప్రాణస్పందములు, ఆ పాదములు

ఏకప్రాణభావములు.* అక్షరములు పాదములుగా, పాదములు మంత్రముగా ధరింపఁబడి యున్నవి. అక్షరధారణము పాదధర్మము. పాదధారణము మంత్రధర్మము. పాద మక్షర బంధము, మంత్రము పాదబంధము. అక్షరసంఖ్యయే ఛందము కాదు, అక్షరబంధము ఛందము. చతుర్వింశత్యక్షరబంధము గాయత్రీచ్ఛందము. ఇరువదినాల్గుగా విక్షిప్తములయిన యక్షరములు గాయత్రమను ఛందమున సమాహితము లయినవి గనుక అక్షరసమాధియే ఛందము. చతుర్వింశత్యక్షరసమాధి గాయత్రి. గాయత్రియొక్క గాయత్రీత్వము శతపథబ్రాహ్మణమునం దిట్లు వర్ణింపఁబడినది.

"ప్రాణో వై గయః ప్రాణః, తం త్రాయతే"
సా హైషా గయాం స్త్రత్రే ।
ప్రాణా వై గయాః । తాన్ ప్రాణాం స్త్రత్రే ।
యస్మా ద్గయాం స్త్రత్రే తస్మా ద్గాయత్రీనామ ।
...... సర్వచ్ఛందసాం హి గాయత్రీచ్ఛందః ప్రధానభూతం ।
తత్ ప్రయోక్తృగయత్రాణాత్ గాయత్రీతి వక్ష్యతి ।
........ కే పునర్గయాః ?
ఏతే ప్రాణాః వాగాదయో వై గయాః శబ్దకరణాత్ ।
తాం స్త్రత్రే సా హైషా గాయత్రీ ।
తద్యస్మాత్ గయాం స్త్రత్రే తస్మాద్గాయత్రీ ।
గయత్రాణాత్ గాయత్రీతి ప్రథితా ।"

— వాచస్పత్యము

వాగ్రూపమునఁ బ్రసరించు ప్రాణము గయనామకము. గయనామక ప్రాణమును త్రాణము చేయునది గనుక ఛందము గాయత్రి యనఁబడినది. † నియతప్రసారము ప్రాణరక్షకము.

---

* ఋక్కుల పాదములు ఏకప్రాణభావము బొందిన వాక్యములన్న యభిప్రాయము తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడినది—

"అథ సంహితాయాం ఏకప్రాణభావః" V : 1

— "యావ దేకోచ్ఛ్వాసేన ఉచ్చార్యతే తావ త్సంహితావిధిః"

అని వ్యాఖ్య. ఏకోచ్ఛ్వాసముచే నుచ్చరింపఁదగిన పదముల సముదాయమునందు సంహితావిధి వర్తించును. అట్టి పదసముదాయము అవాంతరవాక్యమో, వాక్యమో అగును. వాక్యమునందే సంహితావిధి. వాక్యావసానమున నంది యుండనక్కఱలేదు.

† "సా హైషా గయాగ్ స్త్రత్రే । ప్రాణా వై గయాః ।
తత్ ప్రాణాగ్ స్త్రత్రే । తద్యద్గయాగ్ స్త్రత్రే తస్మా ద్గాయత్రీనామ"
అని శుక్లయజుర్వేదీయ బృహదారణ్యకోపనిషత్ - చతుర్థశ బ్రాహ్మణమునఁగూడ చెప్పఁబడినది.

నియమనమే త్రాణము. తరంగభంగీ ప్రసారరూపమునఁ బ్రాణవ్యాపారమును నియమించి పాలించి ఊర్జన దీపనాహ్లాదనాది రూపమునఁ బోషించునది గాయత్రి. వాక్స్పందములయిన యెనిమిది యక్షరములను ఏకప్రాణప్రసారరూపమున నియమించి, యట్టి మూఁడు ప్రాణప్రసారములచే మంత్రమును బ్రయోగించుట చిత్తవిశ్రాంతిహేతువని గుర్తింపఁబడినది. అక్షరములు పాదమునందు, పాదములు మంత్రమునందు లయించి, అఖండమైన యొక సుఖానుభవమునఁ బర్యవసించుట ఛందముగా దర్శింపఁబడినది. అట్టిఛందము గాయత్ర మనఁబడినది. సమాహితములయిన యక్షరముల యుచ్చారణమున నొక గతివిశేషము - పూర్వపూర్వాక్షరములను ఉత్తరోత్తరాక్షరములతో యుక్తములను గావించి వానియందు ఏకాగ్రవ్యాప్తిని రూపించు ఒకానొక ధర్మము ఛందముగా దర్శింపఁబడినది. యోగభాషయం దాధర్మము ఋత మనఁబడుచున్నది. ఋతంభరమైన యక్షరబంధము ఛందము. అట్టి యక్షరబంధముయొక్క యనుసంధానముచేత చిత్తము ఋతంభర మగును.

అష్టాక్షరబంధరూపమున నేకప్రాణభావమును బొందిన గాయత్రిపాదము అవాంతరవాక్యరూప మనుట స్మరింపవలెను. అవాంతరవాక్యావసానమున పదము ఛిన్నముకావలెను. పదచ్ఛేదమే యతి. పదచ్ఛేదరూపమున పాదయమనమే ప్రాణయమనము. ప్రయోక్తృగయత్రాణసముకొఱకే పాదాంత యతి నియతి. గాయత్ర్యాది జగత్యంతములు ఏడును ఛందములుగాఁ బ్రసిద్ధములై యున్నవి. అష్టాక్షరాది ద్వాదశాక్షర పర్యంతములయిన పాదప్రమాణములు తరతమభేదమునఁ బ్రాణసుఖావహములే యగుటచే ఛందములుగా గుర్తింపఁబడినవి. జగత్యనంతరములయిన ఛందములు ప్రయోక్తృగయత్రాణలక్షణమైన ప్రమాణమును అతిక్రమించి యుండుటచే అతిచ్ఛందము లనఁబడినవి. అతిచ్ఛందములు పాదాంతరాళ యతిసాపేక్షములు. ప్రాగ్గాయత్రములైన ఛందములుగూడ అల్పాక్షరపాదములై సత్వరప్రాణయమనము నపేక్షించునవగుటచే ఛందములుగా గ్రహింపఁబడలేదు. అవి గాయత్రీగర్భమునందే యుండి యథావసరము పొడసూపి యడఁగుచుండును.

పాశ్చాత్త్యులుగూడ Numbers స్థానమున "Numerositie" కనిపట్టిరి. ఆ Numerosity యందు Proportion కనిపట్టిరి. Rhythm కనిపట్టిరి. Campion అను నాంగ్లచ్ఛందోవేత్త ఛందస్సంబంధియైన Number ను గుఱించి యిట్లనెను.

"Number is discreta quantitas, so that when we speak simply of number, we intend only the dissevered quantity; but when we speak of a poem written in number, we consider not only the distinct number of sillables but also their value which is contained in the length or shortness of their sound."

"...... so in a verse the numeration of the sillables is not so much to be observed as their waite and due proportion."[8]

సంఖ్యయనఁగా పరిమాణవివేచనము. ఛందోవిషయమున మాత్రము సంఖ్యయనఁగా అక్షరగణనము కాదు. అక్షరశ్రుతియందలి హ్రస్వత్వదీర్ఘత్వములు, వాని సంబంధము ముఖ్యముగా గమనింపఁదగినవి. వివేచనాశీలియైన శ్రోత్రేంద్రియము అక్షరబంధౌచిత్య నిర్ణాయకము. శ్రవ్యాక్షరబంధమే ఛందమగును గాని అక్షరసంఖ్యమాత్రమే ఛందము కాదని Campion యొక్క యభిప్రాయము.

Puttenham అను ఛందోవేత్త యీ యంశమును మరింత స్పష్టముగా వివరించెను. ఛందముయొక్క ప్రధానధర్మము 'Rithmus' అని చెప్పుచు ఆయన యిట్లనెను :

". . this Rithmus of theirs (Greeks) is not therefore, our Rime, but a certain musical numerositie in utterance, and not a bare number as that of the Arithmetical computation is, which therefore, is not called rithmus but arithmus."[9]

గ్రీకులు ప్రసంగించిన 'Rithmus' అన్న ధర్మము ఒకానొక యక్షరకోశమధురోచ్చారణ భంగి. పద్యమందలి యక్షరసంఖ్య గణితశాస్త్రమందలి యక్షరసంఖ్యవలె అనిబద్ధము కాదు. అనిబద్ధము గనుకనే గణితశాస్త్రమందలి సంఖ్యానము 'Arithmus' అనఁబడుచున్నది. పద్యమందలి యక్షరసంఖ్య సుబద్ధము గనుక 'Rithmus' అనఁబడుచున్నది.

గ్రీకులు 'Rithmus' అన్న ధర్మమే యోగులు ఋతము అన్న ధర్మము అని భావింపఁదగియున్నది. Rheo అను గ్రీకు ధాతువునుండి పుట్టిన 'Rithmos' లేక 'Rithmus' అన్న పదము ఆంగ్లమున Rhythm అనఁబడుచున్నది. Rheo అనఁగా to flow, to move అని యర్థము. ఇది యక్షరబంధరూపమైన ఛందముయొక్క ధర్మము. ఛందమునందలి యక్షరములు Rhythm అను ధర్మముచేత సుబద్ధములై యున్నవి.

"ఇయర్తి హృదయం ఇతి ఋతం ఋ గతౌ." —అమరకోశము

గత్యర్థకమైన 'ఋ'ధాతవుయొక్క క్తాంతరూపము ఋతము. హృదయంగమమైన గతియే ఋతము. అక్షరబంధగతమైన యీ ఋతమే లయమనియుఁ బిలువఁబడుచున్నది. 'ఋత మేకాక్షరం బ్రహ్మ' యను న్యాయమున ఏకము, నిత్యము, విశ్వవ్యాప్తము నైన యొక మహాధర్మము ఋతము. సర్వవ్యాపియైన విష్ణువు ఋతంభరుఁడు. సర్వలయంకరుఁడైన శంకరుఁడు ఋతధ్వజుఁడు. సమాధియందలి ప్రజ్ఞ ఋతంభర.

Rhythm ను గుఱించి గ్రీకుల యభిప్రాయముగూడ ఇట్టిదేయని T. S. Omond అను నాంగ్లచ్ఛందోవేత్త చెప్పుచున్నాఁడు.

"Philosophers have called Rhythm the pulse of the Universe; the Greeks said that its sire was God. At all events, Poetry, in common with

other arts, is wholly and absolutely conditioned by Rhythm, this is the breath and law of its being."[10]

విశ్వచైతన్యస్పందమే ఋతము (Rhythm.) భగవంతుఁడే దానికి ప్రభవస్థానము. సుందరనిర్మాణరూపములయిన సర్వకళలకు Rhythm ప్రధానధర్మము విశేషించి కవితకు అది ప్రాణభూతమైన పరమధర్మము.

ఋతంభరమైన యక్షరబంధము వక్తృశ్రోతల చిత్తములందు సమాధిని నిష్పాదించి తన్మయత్వ మొదవించును. కావ్యపఠనకాలమునఁగలుగు తన్మయత్వము "పాతంజలులు చెప్పెడి ఋతంభరవంటిది''అని శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారు ఒకచో వ్రాసియున్నారు."

అక్షరములు పరిమాణమున వివిధములుగ నున్నవి. పరిమాణమనఁగా అవయవసన్నివేశవశమున నుత్పన్నమగు అణుత్వ మహత్వ హ్రస్వత్వ దీర్ఘత్వాది లక్షణవిశేషము. అణుత్వ మహత్వములే ఛందఃశాస్త్ర పరిభాషయందు లఘుత్వ గురుత్వములని వ్యవహరింపఁబడుచున్నవి. అక్షరసంఖ్యాభేదము ఛందోభేదకమైనట్లు అక్షరపరిమాణభేదముకూడ ఛందోభేదకము కాఁగలదనుట న్యాయము.

అష్టగుర్వక్షరబంధమున, అష్టలఘ్వక్షరబంధమున వ్యక్తమగు ధర్మ మేకరూపమే యని చెప్పవలనుకాదు గదా. అట్లే యక్షరక్రమభేదముకూడ ఛందోభేదకమే యనుట న్యాయము. అష్టాక్షరబంధము గాయత్రమైనచో బంధభేదములు గాయత్రభేదము లగును. అక్షరములయొక్క లఘుత్వగురుత్వ హ్రస్వత్వ దీర్ఘత్వములను, భిన్నపరిమాణములయిన యక్షరముల భిన్నక్రమములను ఆశ్రయించి అనంతగాయత్రీభేదములు సంభావ్యము లగుచున్నవి. అష్టాక్షరప్రస్తారము అఱువదినాలుగు భేదములను గల్పించుచున్నది. సమధర్మములు, విషమధర్మములు నైన పాదముల త్రికయోగముచే నింకెన్నియో భేదములు కల్పనీయము లగుచున్నవి.

''క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః'' (యోగదర్శనం) అని న్యాయము. అక్షరబంధమున నక్షరవిన్యాసక్రమభేదముచే పరిణామభేదము స్యాధమగుచున్నది. పరిణామమనఁగా పాకము. పాకమే గుణము – రుచి. గాయత్రీఛందమందే అక్షరక్రమభేదమువల్ల పాకభేదము – ఆస్వాదభేదము సాధ్యమని గుర్తింపఁబడినది,

"గ్లౌ తి సమానీ''[12] ''ల్గౌ తి ప్రమాణీ"[13] ''వితాన మన్యత్''[14] ఇత్యాది పింగళసూత్రములు ఆస్వాదభేదవ్యంజకములయిన ఛందోభేదములను లక్షించుచున్నవి. ఇవి యన్నియు ఋతంభరములయిన యక్షరబంధములే యైనను వీనియందలి ఋతము భిన్నవిధములఁ బరిణమించి వీని యాస్వాదము భిన్నమగుచున్నది. గురులఘుక్రమమైన సమానియందలి ఋతము అవరోహణవిశిష్టము. లఘు గురుక్రమమైన ప్రమాణియందలి ఋతము ఆరోహణ విశిష్టము. అన్యమైన వితానముయొక్క ఋతమున నెన్నియో పాకభేదములు సాధ్యము లగుచున్నవి,

అందు కొన్ని భేదములను ''వక్త్రము''* లని పింగళముని నిర్దేశించెను. ప్రాణత్రాణలక్షణమైన గాయత్రమునందు వాగింద్రియత్రాణలక్షణము గల భేదములు 'వక్త్రము' లని భావింపవలెను. ఇట్లే శ్రోత్రేంద్రియత్రాణ లక్షణములు గలవి 'శ్లోకము' లనఁబడినవి. ఇవి యన్నియు అష్టాక్షర బంధమునందలి పాకభేదములు.

పాదము అవయవి. అక్షరములు దాని యవయవములు. ''అవయవావయవినోస్సమవాయః'' అను న్యాయమున పాదమునకు, అక్షరములకుఁ గల సంబంధము సమవాయము. కనుక అక్షరక్రమభేదమునఁ గలుగు పాకభేదము పాదాంతమునఁ గలుగుచున్నదా, పాదాంతరాళమునఁ గలుగుచున్నదా యని విచికిత్స. పాద మక్షరపిండములుగా ఖండింపఁబడి పరిశీలింపఁబడినది. పరిశీలనఫలముగా ద్విక, త్రిక, చతుష్క, పంచకము లయిన యక్షరపిండములు గుర్తింపఁబడి వీనియందే పరిణామ మారంభమగుచున్నదని గ్రహింపఁబడినది. పాదఖండనము వల్ల ఏర్పడిన యక్షరపిండములే గణములని వ్యవహరింపఁబడినవి. పాదమునకు గణము లంగములు, అక్షరములు ప్రత్యంగములు. ప్రత్యంగసంధానముచే అంగసంధానము, అంగసంధానముచే అంగిసంధానము. అక్షరదృష్టిచే పాదముఅంగి. పద్యదృష్టిచే అది యంగమే. కావ్యదృష్టిచే పద్యముకూడ అంగమే.

వాక్యమునఁ బద మెట్టిదో ఛందమున గణ మట్టిది. పదము, గణము అక్షరసంహితలు. సంహితావశమున నక్షరములు పదములై యర్థవిశేషమును, గణములై యనుభవ విశేషమును గలిగించును. పదసంస్థాన వైచిత్రిచే వాక్యమున పాకవిశేషము లుత్పన్నములయినట్లే గణసంస్థానవైచిత్రిచే పాదమున పాకవిశేషము లుత్పన్నము లగును.

విద్యున్మాలయందు విలంబితము, మణిగణనికరమున ద్రుతము నైన ఋతభేదము, సమానియం దవరోహి, ప్రమాణియం దారోహి యైన ఋతవిశేషము సులక్షణీయములై యున్నవి. ఛందశ్శాస్త్రములం దిట్టి పెక్కు భేదములకు లక్షణములు విధింపఁబడియున్నవి.

శాస్త్రవిహితవిధానము నతిక్రమింపక ఛందములను నిర్మించుట కవికిఁ గర్తవ్యము. శాస్త్రానుసార మనుష్ఠింపఁబడిన ఛందఃకర్మ సుఖావహమగును. నియమభంగముచేత అశ్రవ్యమై దుఃఖహేతువగును. అక్షర, గణ, యతి, పాద నిర్మాణరూపమైన ఛందఃకర్మ ఛందోయజ్ఞము. శ్రవ్యతాకామియైన కవి ఛందోయజ్ఞమును యథావిధి నిర్వహింపవలెను. వాఙ్మయ మహాధ్వరమున ఛందోయాగము ప్రయాజాదికల్పము. అక్షరబంధనాత్మకమైన ఛందఃకర్మ సుఖదుఃఖాదిహేతు వెట్లగును? ఛందఃకర్మ పరిపాకమే సంస్కారరూపమున ఫలప్రదమగుచున్నది. ఛందమునం దక్షరములు, అక్షరపిండములు, వానిక్రమము ప్రత్యక్షములు. వాని పాక మదృష్టము. అనుభవసిద్ధము గనుక లేదనఁజాలము.

* అష్టాక్షరపాదమైన వైదికగాయత్రము లౌకికచ్ఛందమున అనుష్టుప్పు అనఁబడినది. పింగళముని సమాన్యాదులను అష్టాక్షరపాదమైన అనుష్టుప్పునందే చెప్పెను.

సంఖ్యా యోగ క్రమ పాక ఫల దర్శనములచేత ఛందోదర్శనము పూర్తి కాలేదు. ఛందఃపరతత్త్వ మింకను అన్వేషింపవలసియే యున్నది. చతుర్వింశతి తత్త్వాత్మిక, త్రిగుణాత్మిక, ఋతంభర, ఓజోవీర్య బలాయురైశ్వర్యప్రద యైన ఈ గాయత్రికి ప్రభవహేతువైన చైతన్యశక్తియే ఛందః పరమార్థము.

ఓమ్ తత్సవితు ర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్.

సావిత్రీదేవతాకమైన యీ గాయత్రీమంత్రము విశ్వవిఖ్యాతమై యున్నది. సవితృదేవుని ప్రకృష్టమైన శక్తియే సావిత్రి. అది విశ్వప్రపంచ ప్రసవిత్రి. తద్దేవతాకమైన ఛందము గాయత్రి. అది ఛందఃప్రపంచ ప్రసవిత్రి.

"ఎవ్వఁడు మా ధీంద్రియములను బ్రచోదించునో ఆ సవితృదేవుని ప్రశస్తమైన తేజమును మేము ధ్యానింతుము.'' అని మంత్రార్థము. ధ్యానమునకు విషయము సవితృదేవుని తేజము. అది సర్వప్రభవహేతువైన చైతన్యము. అదియే సర్వజీవులయొక్క ధీంద్రియములను బ్రచోదించును. గాయత్రీమంత్రద్రష్ట విశ్వామిత్రమహర్షి. ''సర్వాంతర్యామియైన యాత్మచైతన్యశక్తి మమ్ము ధర్మమార్గమునఁ బ్రవర్తింపఁ జేయుఁగాక !'' సర్వలోక నిస్తారకమైన యీ మహామంత్రమును దర్శించిన మహర్షి విశ్వామిత్రుఁడని కొనియాడఁబడుట పరమోచితమై యున్నది. దృష్టమైన యర్థము ఛందోమయ వాక్యరూపమున నుచ్చరింపఁబడినది. ఉచ్చరింపఁబడిన వాక్యమునందలి ఛందము ఉచ్చారయిత యొక్క ధీంద్రియవృత్తికిఁ బ్రతిబింబము. సవితృదేవతాశక్తిచేఁ జోదితమైన ధీంద్రియము వాక్యచోదనమునకు హేతువు. ధీంద్రియ మనఁగా అంతఃకరణము. అది జీవచైతన్యము. జీవచైతన్యవృత్తియే వాక్యవృత్తి.

ఛందమనఁగా ఇచ్ఛ. అది సృజనాత్మకమైన చైతన్యస్పందము. వక్తృచైతన్యస్పందమే వాక్యోత్పత్తికిఁ గారణము. కారణగుణములు కార్యమున లక్షింపఁబడును. వాక్యము వక్త్రిచ్ఛాపరతంత్రము గనుక వక్తృచ్ఛందమే వాక్యచ్ఛందము, ఛందమందలి యక్షరములు, వాని గౌరవలాఘవములు, వాని సంఖ్యాక్రమములు–సర్వము వక్తృచిత్తవృత్తి వివర్తములు. కనుకనే తచ్చిత్తవృత్తి వ్యాప్తములై తద్వ్యంజకము లగుచున్నవి. వాక్యమందలి సర్వాంగములు విశిష్టధర్మములు గల పదార్థములు. వానిచే వ్యంజింపఁబడు వక్తృచిత్తవృత్తియే పరమార్థము.*

* "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్'' అని శంకర భగవత్పాదులచే మీమాంసా సూత్రభాష్యమున (ప్రతర్దనాధి కరణము–30) నుదాహరింపఁబడినది. వాక్యార్థము తెలిసినంత మాత్రమునఁ జాలదు. వక్త హృదయము తెలియవలెను. వాక్యముకంటె వక్త ముఖ్యము. వక్త చిత్తవృత్తి తెలిసినప్పుడే వాక్యము తెలిసినట్లు.

ఛందము శ్రవ్యము కావచ్చును, అశ్రవ్యము కావచ్చును. గాయత్రము కావచ్చును, కాకపోవచ్చును. వక్తృచైతన్యవృత్తిని వ్యంజించుట మాత్రము దాని పరమధర్మము. ఆ ధర్మమును నిర్వహించుటకే దానికి కావ్యాంగతాగౌరవ మొసంగఁబడినది. ఛందఃకర్మయందు కవి చేయు శిల్పమంతయు శ్రవ్యతామాత్ర సిద్ధికొఱకుఁ గాదు; కావ్యచైతన్యవర్తనమును వ్యంజించుటకొఱకు. వాక్యార్థాభినయము ఛందముయొక్క కర్తవ్యము. కావ్యార్థభావనాపర తంత్రుఁడై కవి ఛందములు శిల్పించును. కవి యస్మయుఁడో అతని ఛందములు తన్మయములు. కనుక వాక్యచ్ఛందమును దర్శింపవలసిన పరమార్థము వక్తృచ్ఛందము స్వాచ్ఛందానురోధముగ వక్త వాక్యార్థము నాచ్ఛాదించును. ఆచ్ఛాదించుట యందలి గోపన దీపనాహ్లాదనాది ప్రయోజనములు వక్త్రిచ్ఛాధీనములు. బహుముఖ ప్రయోజనమైన ఛందమును కవి యథారుచి, యథాశక్తి, యథామతి, యథౌచిత్యము కావ్యమునఁ బ్రయోగించును.

భారతకవులు కావ్యవేత్తలు, రసవేత్తలు, ఛందోవేత్తలు. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అని శాంకరసూక్తి. భారతకవులు కావ్యమయులు, రసమయులు, ఛందోమయులునై పంచమ వేదమైన మహాభారతము నాంధ్రమున నిర్మించిరి. అజరామరమైన దేవత్వమును బొందిరి.

"స ఏవం విద్వాన్ ఛందోమయో, దేవతామయో, బ్రహ్మమయో అమృతమయః సంభూయ దేవతా అప్యేతి య ఏవం వేద । యో వై తద్వేద యథా ఛందోమయో దేవతామయో బ్రహ్మమయో అమృతమయః సంభూయ దేవతా అప్యేతి తత్ సువిదిత మితి ।"
ఐతరేయ బ్రాహ్మణము : 10-8.

సూచికలు :

1. అథర్వబృహత్సర్వానుక్రమణిక : 1 పుట
2. ఋక్సర్వాను క్రమణిక : 2-6
3. యజుర్వేద సర్వానుక్రమణిక : 8 అధ్యాయము
4. సంధ్యావందనము
5. భగవద్గీత : 10-35
6. సంధ్యావందనము-గాయత్రీస్తోత్రము
7. సంధ్యావందనము
8. Elizabethan Lyrics : p. 56
9. Ibid : p. 44
10. A Study of Metre : p. 2
11. తెలుఁగు ఛందోవిధానము - ప్రస్తావన : 8 పుట
12. పింగళచ్ఛందశ్శాస్త్రము : V-6
13. .. : V-7
14. .. : V-8

# ఛందోఽవతారము

ఋతంభరమైన యక్షరసమాధి ఛందమనియు, అది వక్తృచిత్తవృత్తి వివర్తమనియు గుర్తించితిమి. సమాహితాక్షరవృత్తి యుత్పత్తికి సమాహితచిత్తవృత్తి కారణము. సమాహిత చిత్తవ్యాపారమే ప్రతిభ – ఋతంభరయైన ప్రజ్ఞ. ప్రతిభయే జీవుని యైశ్వర్యము. అపూర్వవస్తు నిర్మాణక్షమయైన ప్రజ్ఞ ప్రతిభ యనఁబడినది. ఛందస్స్వద్వ్యాక్యము ప్రతిభ యొక్క సృష్టి.

ఛందః ప్రభవమును గుఱించి శ్రుతి యిట్లు చెప్పుచున్నది :—

"ఇంద్రా చ్ఛందః ప్రథమం ప్రాస్యందత్
అన్నం తస్మా దిమే నామరూపే విషూచీ
నామ ప్రాణచ్ఛందోరూప ముత్పన్నం
ఏకం ఛందః బహుధా చాకశీతి"[1]

భర్తృహరి వాక్యపదీయమునం దీమంత్రము నుద్ధరించి దీని ప్రమాణమున —

"ఛందోభ్య ఏవ ప్రథమం
ఏతద్విశ్వం వ్యవర్తత"[1]

అని ప్రవచించెను. ఛందము తొలుత ఇంద్రునివలనఁ బ్రభవించెను. దానినుండి యన్నము, నామము, రూపము పుట్టెను. నామము ప్రాణచ్ఛందోరూపము. ఏకమయిన ఛందము అనేక విధములఁ బ్రకాశించుచున్నది. అనేకములయిన ఛందములనుండియే యీ సర్వము వివర్తించినది.

ఇంద్రుఁడు త్రిలోకాధిపతి. కర్మేంద్రియప్రపంచము, జ్ఞానేంద్రియ ప్రపంచము, అంతరింద్రియ ప్రపంచము – ఇవియే త్రిలోకములు. "ఇంద్రస్య ఆత్మనః లింగం ఇంద్రియం" అని యమరసింహుని నిర్వచనము. "లింగం నామ సామర్థ్యం" అని న్యాయము. ఇంద్రియము లన్నియు నింద్రుని యధీనములు – ఆయన శక్తిని వ్యక్తముచేయు సాధనములు. ఇంద్రుఁడనఁగా ఆత్మచైతన్యము. చైతన్యస్యందమే ఛందమని శ్రుతి చెప్పుచున్నది. అన్నచ్ఛందము, రూపచ్ఛందము, నామచ్ఛందము – సర్వచ్ఛందము ఇంద్రుని ఇచ్ఛాస్యందమే.

నామచ్ఛంద మనఁగా వాక్యచ్ఛందము. అది ప్రాణచ్ఛందోరూపము. ప్రాణమేవాక్కు అని చెప్పఁబడినదిగదా.

ఆత్మా బుద్ధ్యా సమే త్యార్థాన్
మనో యుంక్తే వివక్షయా
మనః కాయాగ్ని మాహంతి
స ప్రేరయతి మారుతం''

పాణినీయశిక్ష : 1

ఇత్యాది శిక్షావచన మీ యర్థమునే సమర్థించుచున్నది. వివక్షారూపమైన యాత్మయొక్క యిచ్ఛావృత్తినుండి వాక్యము ప్రవృత్తమైనది.

వేదమున ఛందః ప్రథమావతారము మధుచ్ఛందుని ముఖమున జరిగినది.

అగ్ని మీళే పురోహితం
యజ్ఞస్య దేవ మృత్విజం
హోతారం రత్నధాతమం''

ఇది ఋగ్వేద ప్రథమమంత్రము. ఋషి మధుచ్ఛందుఁడు. దేవత అగ్ని. ఛందము గాయత్రము. కర్మప్రవర్తకుఁడు, కర్మప్రదీపకుఁడు, కర్మఫలప్రదుఁడునై రత్నరాశివలె నేత్రానందకరుఁడై ప్రత్యక్షమునఁ బ్రకాశించుచున్న యగ్నిదేవునిచేఁ బ్రభావితుఁడైన ఋషి యొక్క వాక్య మీ మంత్రము. అగ్నిదేవతాలంబనకమైన ఋషిచిత్తవృత్తి యీ వాక్ప్రవృత్తికి నిమిత్తము. దేవత యాలంబనము; తద్గుణము లుద్దీపనములు; తత్కారణమున జన్మించిన చిత్తవృత్తి హర్షము; తద్ వ్యంజకమైన వాగనుభావము మంత్రము. హర్షమనఁగాఁ జిత్తవికాసము. వికాసరూపమైన ఋషిచిత్తవృత్తియొక్క యక్షరవ్యక్తియే మంత్రము. హర్షమధురమైన చిత్తవృత్తి నిమిత్తముగ నుత్పన్నమైన వాగ్వృత్తి మధురమైయున్నది. మధురచ్ఛందోమయ వాక్యము నుచ్చరించిన మహర్షిని శ్రోతలు మధుచ్ఛందుఁడని కొనియాడిరి. సుఖోచ్చారణ సుఖశ్రవణ లక్షణమైన యీ ఛందము గాయత్ర మనఁబడినది.

"అగ్నే ర్గాయ త్ర్యభవత్'' ఋక్ : 10-130.

అగ్నివలన గాయత్రి పుట్టెనని శ్రుతి చెప్పుచున్నది. అగ్ని విభావము, గాయత్రి యను భావము. ఒక్కొక్క విభావమువలన నొకొక్క ఛందము పుట్టుననియు, విభావభేదము ఛందోభేదమునకుఁ గారణ మగుననియు భావింపఁదగియున్నది.

ఆహ్లాదనలక్షణముచేఁ బ్రాణత్రాణసమర్థమైన మధుచ్ఛందుని వాక్యమునందలి యక్షరబంధ మనుశీలితమై త్రిపదవ్యవస్థాపిత చతుర్వింశత్యక్షరకోశాత్మకత గుర్తింపఁబడినది. ఇది యార్షీగాయత్రి.

"వాగ్వై గాయత్రీ। వాగ్వా ఇదగ్ సర్వం భూతం।
గాయతి త్రాయతే చ । '' 3-11-1

అని ఛాందోగ్యశ్రుతి. వ్యాసభగవానుఁడును—

"గాయంతం త్రాయతే యస్మాత్
గాయత్రీయం తతః స్మృతా."

అని గాయత్రిని గొనియాడెను. గానత్రాణలక్షణములు గల వాక్కే గాయత్రి. అది స్వయము గేయాత్మిక. సమాహితాక్షరబంధరూప గనుక గాతృశ్రోతృ చిత్తసమాధాన సమర్థ. అక్షరసమాధానమువలన ఛందము గానమైనది.

ఛందమునకు ఆంగ్లమున Prosody అని పేరు. Pro = to, ode = song అను వ్యుత్పత్తి ననుసరించి Prosody యనఁగా గేయాత్మకత, గానయోగ్యత యని యర్థమగు చున్నది. ఛందము గాయత్రమనుటచే ఛందస్త్వము గేయత్వపర్యాయ మగుచున్నది. గానము వలె శ్రుతిరమ్యమైన యక్షరబంధము ఛందమని భావింపఁదగియున్నది. వాక్కును శ్రోతృ చిత్తాపహారిణి యగునట్లు సంస్కరించు ధర్మము ఛందము.

"గాయత్రం ఛందసాం పూర్వం
వర్ధమానాక్షరం పరం
వాఙ్మండనకరం నౌమి
చిత్రవృత్త ప్రసిద్ధయే" I. 1

అని జయదేవుఁడు గాయత్రమును ప్రశంసించెను. గాయత్రము వాఙ్మండనకరము గనుక వాఙ్మండనరూపములయిన చిత్రవృత్తముల సిద్ధికొఱకు జయదేవుఁడు ఛందోమాతయైన గాయత్రమును స్తుతించెను. "మండయ త్యలంకరో తీతి మండనం" అను అమరసింహుని నిర్వచనము ననుసరించి మండనమనఁగా అలంకారము. గాయత్రము వాఙ్మండనకర మనుటచే ఛందము వాగలంకారము, వాక్యాలంకారము నగుచున్నది.

తు హి చ వై ఖలు - ఇత్యాదులు వాక్యాలంకారములు. వాక్యార్థపూర్తికి యక్షరముల యవసరము లేదు. వాక్యసౌష్ఠవమునకు, సౌందర్యమునకు నివి యవసరము. తు చ ఖల్వాదులు వాక్యాలంకారములే కాని శబ్దాలంకారములు కావు. వాక్యమునం దుచితస్థానమున నివేశింపఁబడి యివి వాక్యగతిని సంస్కరించును. హీనాంగపూరణరూపమైన సంస్కారముచే వాక్యము సౌష్ఠవము, సౌందర్యము పొంది శ్రవ్యమగును. *

* ఛందము వాక్యము నలంకరించునని పలువురు పాశ్చాత్య విద్వాంసులును అభిప్రాయపడిరి.

"Verse does not distinguish Poetry but clothes and adorns it."
— Castelvetro.

Verse, while not essential to Poetry, gives it much of its delightful effectiveness and if the gods were to speak, they certainly speak in verse. — Minturno.

"అలం భూషణ పర్యాప్తి శక్తి వారణ వాచకం" అను న్యాయమున అలంకరణ మనఁగా భూషణకరణము, పర్యాప్తికరణము, శక్తికరణము, వారణకరణము నన్న యర్థము లేర్పడును. ఇవి గోపన దీపనాపవార ణాహ్లాదనాదులయిన ఛందశ్శబ్దముయొక్క యర్థముల వంటివే యని సులభముగ గుర్తింపవచ్చును.

ఛందస్వద్వాక్యోత్పత్తికి వక్తృచిత్తవృత్తి నిమిత్తమనియు, ఆ చిత్తవృత్తికి నిమిత్తము బహిరాలంబన మనియు మధుచ్ఛందమహర్షి వాక్యము బోధించినది. మహర్షుల వాక్యదర్శనము లన్నియు సనిమిత్తములే యని చెప్పఁబడినది.

"మంత్రాణాం ఋషయః యేన కేనచి న్నిమిత్తేన నిందా హర్ష శోక ప్రశంసాదినా మంత్రాణాం ద్రష్టారో భవంతి"[3] అని నిరుక్తవ్యాఖ్యాత దుర్గాచార్యుఁడు నుడువుచున్నాఁడు. ఆదిపదముచే ఆశీశ్శాప శపథ పరిదేవనాచిఖ్యాసా భయ క్రోధ జుగుప్సాద్యసంఖ్యాక నిమిత్తములు గ్రాహ్యము లగుచున్నవని వివరణకర్త నుడువుచున్నాడు. చిత్తసమాధి ఛందస్వద్వాక్యోత్పత్తికి నిత్యకారణము. నిందా హర్ష శోకాదికము నైమిత్తిక కారణము. నిందాహర్షాది నిమిత్తమున సిద్ధించిన సమాధి కారణముగా ఛందస్వద్వాక్యము సిద్ధించుచున్నది. కనుక నిమిత్తభేదమున ఛందోభేదము అనుమేయ మగుచున్నది. నిమిత్తము చిత్తవృత్త్యవచ్ఛేదకము, చిత్తవృత్తి వాక్య వృత్త్యవచ్ఛేదకము. నిందాహర్షాది నిమిత్తావచ్ఛిన్న చిత్తవృత్త్యవచ్ఛిన్నము వాక్యవృత్తి - ఛందము.

"This (the origin of metre) I would trace to the balance in the mind effected by that spontaneous effort which strives to hold in check the workings of passion."

—Writers on Writing p. 85

---

"The greatest part of poets have apparelled their poetical invention in that numbrous kind of writing which is called verse. Verse is apparel only being but an ornament and no cause to poetry; ......"

— Sidney.

"The reason why verse is necessary to the form of Poetry is, that the perfection of the poetical spirit demands it — that the circle of its enthusiasm and beauty and power is incomplete without it."

— Leigh Hunt.

"The rhythm and measure of poetry elevated to a regularity, certainty and force, very different from the rhythm and measure which can pervade prose, are part of its perfection."

— Mathew Arnold.

వికారవిజృంభణము నరికట్టి విక్షిప్తమగుచున్న చిత్తమును సమాహితముచేయు నైసర్గిక నియతి యొకఁడు జీవునియం దున్నదనియు, నదియే ఛందోబద్ధ వాక్యావిర్భావమునకుఁ గారణ మనియు Coleridge యనెను.

"The measure flows, as it were, unconsciously from the mood of the poet"[4]

కవియొక్క చిత్తవృత్తినుండి యప్రయత్నముగనే ఛందోమయవాక్యము నిర్గమించు చున్నది అని Goethe మహాకవి వక్కాణించెను. Mood అనఁగా నిమిత్తావచ్ఛిన్న చిత్త వృత్తియే.

త్రిపదవ్యవస్థాపిత చతుర్వింశ త్యక్షరకోశాత్మకమైన గాయత్రీచ్ఛందము హర్షనిమిత్తావ చ్ఛిన్నమైన మధుచ్ఛందుని చిత్తవృత్తినుండి అయత్నముగ నిర్గమించిన వాక్యవృత్తి.

లోకమున ఛందః ప్రథమావతారము వాల్మీకిమహర్షి ముఖమున జరిగినది. ఆ యితి హాసము ఛందఃపరమార్థోపదేశకము గనుక అనుశీలింపఁదగి యున్నది.

"శ్లోకత్వ మాపద్యత యస్య శోకః"[5]

అని కాళిదాసమహాకవి యా యితిహాసమును బేర్కొనెను.

"………ఆదికవే ర్మునేః
క్రౌంచద్వంద్వ వియోగోత్థః
శోకః శ్లోకత్వ మాగతః. ధ్వన్యా. I. 5.

అని యానందవర్ధనుఁ డాయితిహాసమును అనువదించెను. కాళిదాసు, ఆనందవర్ధనుఁడు శోకమే శ్లోకత్వమును బొందినదని చెప్పుచున్నారు. శోకనిమిత్తావచ్ఛిన్నమైన వాల్మీకి చిత్త వృత్తినుండి ఛందోమయ వాక్యము ఆయన ప్రయత్నము లేకుండఁగనే ఆయనకుఁ దెలియ కుండఁగనే నిర్గమించినది.

స్వీయానుభవమును వాల్మీకిమహర్షియే పరక్రియారూపమున శ్రీమద్రామాయణమునం దభి వర్ణించెను. వాల్మీకి మహర్షి నియతేంద్రియుఁడు, ధర్మాత్ముఁడు, మహాప్రాజ్ఞుఁడు, భావితా త్ముఁడునని వర్ణింపఁబడినాఁడు. అనఁగా ఆయన చిత్తము సత్వప్రతిష్ఠచే నిర్మలముకుర సదృశముగ నున్నదని తాత్పర్యము. తమసాజలము "ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా"[6] యని వర్ణింపఁబడినది. సన్మనుష్యుఁ డనఁగా సహృదయుఁడు. వాల్మీకి చిత్తము అకర్దమ తమసాజలమువలె నిర్మలము, ప్రసన్నమునై యుండెను. క్రౌంచమిధునముయొక్క చారునిస్వ నము ప్రసన్నమైన ఋషిచిత్తమును మధురము గావించెను. ఇంతలో ఋషి చూచుచుండఁగనే యొక నిషాదుఁడు ఆ జంటలో మగదానిని బాణముతోఁ గొట్టి చంపెను. మరణించుచున్న భర్తను గాంచి క్రౌంచి కరుణనాదము చేయసాగెను. క్రౌంచద్వంద్వ చారునిస్వనైకతానమై

యున్న ఋషి చిత్తము క్రౌంచీరోదనైకతాన మయ్యెను. ప్రసన్నమధురమైన ఆయన చిత్తమునఁ గల్లోలము పుట్టెను. క్రౌంచీరోదనము వినుచు ఆయన యీ వాక్యము పలికెను.

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ
మగమః శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక
మవధీః కామమోహితం" బాల II-15.

వాల్మీకి యీ వాక్యమును పలుకవలెనని పలుకలేదు. క్రౌంచీరోదనచోదితుఁడై పలికెను. పరమార్థమున నిది క్రౌంచీవాక్యమే. "కామమోహితులమై యున్న మాలో నా భర్తను జంపితివి గాన ఓరి నిషాదుఁడా! నీవు చిరకాలము బ్రదుకవుసుమా." వాల్మీకి ముఖమున నిర్గమించిన క్రౌంచి శోకమే శ్లోకమైనది.

"శోకార్తేనాస్య శకునేః
కిమిదం వ్యాహృతం మయా" బాల II-16.

ఈ శకునియొక్క శోకముచే ఆర్తుఁడనైన నాచేఁ బలుకఁబడిన యిది యేమి? అని మునికిఁ జింత కలిగెను. చింతకు విషయములు రెండు – తనచే వ్యాహృతమైన వాక్యము, ఆ వాక్యముయొక్క అర్థము. ముందుగా ఆయనకు వాక్యస్వరూప నిశ్చయము కలిగెను.

"పాదబద్ధో ఽక్షరసమః
తంత్రీలయ సమన్వితః *
శోకార్తస్య ప్రవృత్తో మే
శ్లోకో భవతు నాన్యథా" బాల. II 18.

* వాల్మీకి నోటివెంట 'మా నిషాద' శ్లోకము వెలువడినప్పుడు అచ్చట తంత్రీస్వరమేదియు లేదు. క్రౌంచీరోదననాదము వినుచునే వాల్మీకి 'మానిషాద' శ్లోకము నుచ్చరించెను. క్రౌంచీరోదన నాదముతోపాటు తన శ్లోకమును గూడ వినెను. అనర్థకమైన క్రౌంచీకంఠనాదమే అచ్చట తంత్రీనాదము. దానియందు లయమొందియే శ్లోకవాక్యము వినఁబడెను. క్రౌంచీనాదము వ్యంజించు భావము, వాల్మీకి వాక్యము వ్యంజించు భావము ఒక్కటే. పక్షియైన క్రౌంచినాదము యొక్క యర్థము మనుష్యులకు వాల్మీకి వాక్యమునఁ దెలియువచ్చును. సమానభావ వ్యంజకములైన రెండు కంఠనాదధారలు మేళన మొంది శ్రవోరంధ్రములఁ బ్రవహించుటచే వాక్యము తంత్రీలయ సమన్వితమై వినవచ్చినది. ఈ యభిప్రాయమును విని యానందించిన సోదరుఁడు రజనీకాంతరావు దానిని మరికొంత భావనచేసి ఇంకొక యద్భుత విషయమును కనిపట్టెను. శ్లోకము 'మానిషాద' అను నక్షరములతో ఆరంభమగుచున్నది. ఈ యక్షరములు మ, ని, స, ద అను స్వరములు. క్రౌంచి కూత యందీ స్వరములే యుండునఁట. వాల్మీకి క్రౌంచీరోదన తాదాత్మ్యమున నుచ్చరించిన వాక్యము అచ్చముగా క్రౌంచి కూఁతవలెనే ఆరంభమై యుండును. ఆనందవర్ధనాదులు ఈఘట్టమున దర్శించిన రససిద్ధాంత రహస్యమునకు ఇది యంతయు బలసంపత్తి.

శోకార్తుఁడనైన నా వాగ్వృత్తి పాదబద్ధము, అక్షరసమము, తంత్రీలయ సమన్వితము నై శ్లోకమే యగునుగాని వేఱు కాదు. అని యాయన తన వాక్యస్వరూపమును నిశ్చయించెను.

"మిమీహి శ్లోక మాస్యే" ఋక్. 1-8-38.
"శ్లోకం ఘోషం భరథేంద్రాయ" ఋక్. 8-4-29

ఇత్యాదివైదికమంత్రములందలి శ్లోకశబ్దము 'శ్రు' ధాతునిష్పన్నము. "శ్లోకః శృణోతేః"[6] అని భాష్యముచేయఁబడినది.[7] వివరణకర్త. 'శ్రోతవ్యం' అని యర్థము వ్రాసెను. శ్రవ్యము, శ్రోతవ్యమునని శ్లోకశబ్దము నర్థము. సమాక్షరత్వ, చతుష్పదత్వ, లయాన్వితత్వ లక్షణమైన వాక్యము శ్రవ్యము గనుక శ్లోకమే యని వాల్మీకిమహర్షి నిశ్చయించెను.

"శోకార్తేన మయా వ్యాహృతం" అను కర్మణిప్రయోగము శోకకర్తృత్వమును శోకమునందే యారోపించుచున్నది. అశోకార్త వాల్మీకిచే వ్యాహృతమైన వాక్యము శ్లోకము కాకపోవచ్చును.

'ఆర్త' శబ్దము ఆఙ్ పూర్వక 'ఋ' ధాతువుయొక్క క్తాంతరూపము † అత్యంతము చలితము కంపితము, నగుటయే ఆర్తమగుట.

ఋతి యనఁగా కంపనము, చలనము : Motion.

ఆర్తి యనఁగా ఉత్కంపనము, ఉచ్చలనము : Emotion. 8. *

శోకముచే ఆర్తమైన క్రౌంచి హృదయముయొక్క ఋతి దాని రోదనద్వారమున వాల్మీకి హృదయమునఁ బ్రవేశించి, తిరిగి యాయన వాక్యద్వారమున వెలువడి యాయనయొక్కయు,

---

† "ఉపసర్గాత్ ఋతిధాతౌ" (6-1-91)అను పాణినీయ సూత్రముచేత ఆఙ్ + ఋత = ఆర్తయగును.

* "Emotion is a moved or stirred up state of the individual" అని R. S. Woodworth నిర్వచనము. Psychology : P. 344.

"Any strong movement or perturbation of the conscious mind; an act or state of excited feeling ; as emotions of fear.

—Standard Dictionary.

"Emotion :... it is a complex state of the organism, involving bodily changes of a widespread character – in breathing, pulse, gland secretion, etc.—and on the mental side, a state of excitement or perturbation, and marked by strong feeling, and usually an impulse towards a definite form of behaviour."

—Dictionary of Psychology.

Emotion అనుపదము E = out + moveo = move అను తీరున Latin భాష నుండి ఆంగ్లమునకు వచ్చినది.

భరద్వాజునియొక్కయు హృదయములందుఁ బ్రవేశించినది. ఆ ఋతివిశేషముచే వాక్యము శ్రోతవ్యమై శ్లోకమైనది.

వాల్మీకి ముఖమునుండి 'మా నిషాదే'త్యాది వాక్యము వెలువడుచుండఁగా వినిన భరద్వాజుఁడు ఆ వాక్యమందలి శ్రవ్యతా లక్షణముల నిట్లు విమర్శించెను.

"సమాక్షరై శ్చతుర్భి ర్యః
పాదై ర్గీతో మహర్షిణా
సో ఽనువ్యాహరణా ద్భూయః
శోకః శ్లోకత్వ మాగతః"

బాల. II -40.

సమాక్షరములయిన నాల్గు పాదములతో మహర్షిచే గీతమైన శోకము, అనువ్యాహరణమువలన అత్యంతము శ్రవ్యత్వమును బొందినది. అనువ్యాహరణ మనగా వాగ్రూపమైన యనుభావము. క్రౌంచి శోకము వాల్మీకి హృదయమునం దావిర్భవించి వాగనుభావమున వ్యక్తమైనది. వ్యంగ్యవ్యంజ కాభేదోపచారమువలన శోకమే శ్లోకమైనదని చెప్పఁబడినది.

అగ్నివలన గాయత్రము పుట్టినట్లు శోకమువలన శ్లోకము పుట్టినదని భావింపవచ్చును. వేదమున మధుచ్ఛందుని ముఖమున త్రిపదయై యవతరించిన గాయత్రియే లోకమున వాల్మీకి ముఖమున చతుష్పదయై శ్లోకముగా నవతరించినది. శ్లోకము గాయత్రిపునర్జన్మ. జన్మమాత్రము కాదు. అవతారమని భవభూతి ప్రశంసించెను. * "పరిత్రాణాయ సాధూనాం" — ఇది పరమేశ్వరావతార నిమిత్తముగాఁ జెప్పఁబడినది. ఛందము లిట్టి యవతారములు. సహృదయప్రాణత్రాణముకొఱ కవతరించిన ఛందములు అవతారము లనుటయందు విప్రతిపత్తిలేదు. చతుర్థపాదకృతమైన యనుష్టోభనముచే వర్ధమానాక్షరయైన గాయత్రియే యనుష్టుప్పని యాస్కముని వచనము కలదు. కనుక శ్లోకము గాయత్రి యపరావతార మనుట యుచితమే.

* ఉత్తరరామ చరితమున ఆత్రేయి "ఆకస్మిక ప్రత్యవధాసాం దేవీం వాచ మానుష్టుభేన ఛ్ఛందసా పరిణతాం అభ్యుదైరయత్" అని శ్లోకావిర్భావ వృత్తాంతమును జెప్పఁగా విని వనదేవత "చిత్రం! ఆమ్నాయాదన్యత్ర నూతనచ్ఛందసాం అవతారః" అని యాశ్చర్యమును బ్రకటించును. సంస్కృత వాఙ్మయమునఁ బట్టాభిషిక్తమై దాని సర్వతోముఖ విజృంభణమునకు సాధనమైన శ్లోకము ఒక యవతారమని పరిణత ప్రజ్ఞుఁడైన భవభూతి కొనియాఁడెను.

T. S. Eliot కూడ ఇట్టి యభిప్రాయమునే ప్రకటించినాఁడు.—

"Few things that can happen to a nation are more important than the invention of a new form of verse."

Shakespeare by H. Fluchere : p. 181.

'సన్మనుష్యమనో యథా' యని వర్ణింపఁబడిన యకర్దమ తమసాతీర్థమువలె ప్రశాంత నిర్మలమై, క్రౌంచీరోదనాకర్ణనమున ఆర్ద్రమై కరుణరస తరంగితమైన వాల్మీకి హృదయము నుండి వదనద్వారమున సమాహితగతియై నిర్గమించి, శ్రోత్రద్వారమున భరద్వాజుని హృదయ మునఁ బ్రవేశించి దానిని రసతరంగితము గావించిన శ్లోకము ఛందోమయము. ఛందము కవి సహృదయ హృదయస్పంద సంవాద సంపాదన సమర్థమైన యక్షరబంధమని యీ యితిహాసము వలన సువిదిత మగుచున్నది.

ఛందము కావ్యముయొక్క హృదయమని చెప్పవచ్చును. హృదయమనఁగా చేతనా స్థానము. కావ్యచైతన్యము స్పందించు స్థానము ఛందము. కవి హృదయము కావ్యహృదయ మున స్పందించి సహృదయహృదయమున ప్రతిస్పందించును. హృదయమువలె ఛందమును నానాభావముల ప్రభావమున నిరంతరము నానావిధముల స్పందించుచుండును. ఛందఃస్పంద వర్తనమునుబట్టి కావ్యచైతన్య వర్తనమును గుర్తింపవచ్చును. ఛందము కావ్యరసావస్థాన వ్యంజకమని భావము.

నానారసభావముల నానావస్థాంతరములను సుష్ఠుగా వ్యంజించుటకుఁ దగిన యంగ ప్రత్యంగ నిర్మాణసౌష్ఠవము ఛందములకు సమకూర్చుటకు కవి ఛందోఽంగ పరిజ్ఞాన సౌష్ఠవము గలిగియుండవలయును. అంగప్రత్యంగముల సముచిత సన్నివేశముచే స్వధర్మనిర్వహణ దక్ష ములగునట్లు ఛందములను నిర్మించుటయే కవియొక్క ఛందః శిల్పము.

## సూచికలు :

1. వైదికచ్ఛందోమీమాంస : 43 పుట
2. మీమాంసాపరిభాష : 23 పు.
3. నిరుక్తము : 7-1-3 (344 పుట)
4. Writers on writing.
5. రఘువంశమహాకావ్యము 14-70
6. శ్రీమద్రామాయణము : బాలకాండము.
7. నిరుక్తము : 9-1-10 (413 పుట)

# ఛందోఽంగములు

"అక్షరేణ మిమతే సప్త వాణీః"

ఋక్ : 1-22-164

ఈ శ్రుతివాక్యమును సాయణు లిట్లు వ్యాఖ్యానించిరి :

"అక్షరేణైవ సప్తవాణీః
వాగధిష్ఠితాని సప్తచ్ఛందాంసి
మిమతే నిర్మాణం కుర్వంతి ।
మిమతే, మాంతి మాతారః ।
అక్షరైః పాదాః పరిమీయంతే,
పరిమితైః పాదైః ఛందాంసి"[1]

'సప్తవాణీః' అనఁగా 'వాగధిష్ఠితాని సప్తచ్ఛందాంసి' అని సాయణుల భాష్యము. ఛందములు వాగధిష్ఠితములై వర్తించును. ఛందోవర్తనము వాక్యవర్తనము ననువర్తింపవలెనని దీని యభిప్రాయము.

కావ్యమందలి వాక్యములు పదసముదాయములు. వాక్యమందలి పదములు అక్షరసముదాయములు. వాక్యములను పదములుగా, పదములను అక్షరములుగా విభజింపవచ్చును. పదములందలి యక్షరముల క్రమము, వాక్యమందలి పదముల క్రమము అనేకవిధముల నుండును. పదములందలి యక్షరక్రమము, వాక్యమందలి పదక్రమము వాక్యచ్ఛందమును రూపించును. అచ్ఛందమైన వాక్యము అసంభవమే యైనను ఆహ్లాదన దీపనాది లక్షణములు ప్రస్ఫుటముగాఁ గల వాక్యచ్ఛందములే ఛందములుగా స్వీకరింపఁబడినవి.

అక్షరసంఖ్యా దృష్టిచే ఛందము లిరువదియాఱని చెప్పఁబడినను వానియందలి యక్షర విన్యాస క్రమభేదములచే సిద్ధించు ఛందములు అసంఖ్యాకములని చెప్పవలసియున్నది. ఛందములు మాత్రానిష్ఠములు, అక్షరనిష్ఠములు గలవు. అక్షరనిష్ఠములందు అక్షరసంఖ్యా క్రమ నియతములు శార్దూలవిక్రీడితాదులు, అక్షరగణ నియతములు సీసగీతాదులు, మాత్రాసంఖ్యా నియతములు వైతాలీయాదులు, మాత్రాగణ నియతములు కందాదులు గలవు. మాత్రాఛందములందు మాత్రికు, అక్షరచ్ఛందములందు అక్షరమునకుఁ బ్రామాణ్యము.

ఛంద మెట్టిదైనను ఛందోవిధియందు గమనింపవలసిన యంగములు పది కలవని భరత మహర్షి తెలిపెను :

"సంప ద్విరామ పాదాశ్చ
దేవతా స్థాన మక్షరం
వర్ణః స్వరాః విధి ర్వృత్తం
ఇతి చ్ఛందోగతో విధిః"

నా. శా. XIV. 102.

సంపత్తు, విరామము, పాదము, దేవత, స్థానము, అక్షరము, వర్ణము, స్వరము, విధి, వృత్తము – ఇవి ఛందో దశాంగములు. రసాద్యర్థనిర్వహణ సమర్థమగునట్లు ఛందమును నిర్మించుటయందు కవికి ఈ యంగములు సాధనములు గనుక వీని స్వరూపస్వభావములను బరిశీలింపవలసి యున్నది.

## 1. సంపత్తు

సంపత్తనఁగా అక్షరసమృద్ధి. అపూర్ణాక్షరము లయిన ఛందము లశ్రవ్యము లగును గనుక ఛందములందు మాత్రలయొక్కయు, అక్షరములయొక్కయు సంఖ్య సంపన్నమై యుండవలయును. "పాదపూరణార్థం తు క్షైప్రసంయోగైకాక్షరీభావాన్ వ్యూహేత్"[2] అని కాత్యాయనుఁడు, 'ఇయాదిపూరణః'అని పింగళుఁడు[3] అక్షరసంపదయొక్క ప్రాధాన్యమును వక్కాణించి యున్నారు. ఇయాదిపూరణము లౌకికచ్ఛందములందు లేదు. కాని ఉపగణనిర్మితములయిన సీసగీతాదులందు మాత్రాక్షరసంపన్నత శ్రవ్యతాతిశయ సంపాదకమగుట గుర్తింపవచ్చును ఉపగణములలో త్ర్యక్షరములు, చతురక్షరములు, చతుర్మాత్రాకములు, పంచమాత్రాకములు గలవు. సీసగీతాదులందు పంచమాత్రాకములయిన యింద్రగణముల ప్రయోగమువలన శ్రవ్యత యతిశయమగునని సులభముగ గ్రహింపవచ్చును.

తే॥ పుట్టినప్పుడ కన్యకఁ బోలునట్టి
వరున కిచ్చుట యిది లోకవర్తనంబు
వసుమతీనాథ నీయట్టి వరున కిచ్చి
ధన్యులము గామె యిక్కన్యఁ దద్ద పేర్మి.

ఆది. IV. 175

పూర్వార్ధముకంటె ఉత్తరార్ధము మాత్రాక్షర సంఖ్యాసంపదచే శ్రవ్యతరమై యున్నది. *

* శ్రవ్యతయే ఛందముయొక్క పరమధర్మమని భావించిన శ్రీనాథాది మహాకవులు సీసపద్యనిర్మాణమున పంచమాత్రాకము లయిన యింద్రగణములను విరివిగా కూర్చి పద్యమునకు ఒకతూగును, ఒక నిండుదనమును సాధించిరి.

## 2. విరామము :

''యత్రార్థస్య సమాప్తిః స్యాత్ స విరామ ఇతి స్మృతః''[4] అర్థమెచ్చట సమాప్తమగునో అచ్చట విరామ ముండునని భరతముని యనెను. "అర్థస్య అవాంతరరూపస్య సమాప్తిర్లక్షణతో యతిః''[5] అని యభినవగుప్తులు వ్యాఖ్యానించిరి. అవాంతరార్థ సమాప్తి రూపమైన విరామమును ఛందోలాక్షణికులు యతి యని నిర్దేశించిరి.

''నియతః పదవిచ్ఛేదః
యతి రిత్యభిసంజ్ఞితః.'' నాట్యశాస్త్రము. XIV-88.

అని భరతముని నియతస్థానమున పదవిచ్ఛేదము చేయుటయే యతి యనెను. అవాంతరార్థ సమాప్తిరూపమున అనియతస్థానమున పదమును ఛేదించుట విరామము. అదియే నియతస్థానమున యతి యనఁబడును. ''యతి ర్విచ్ఛేదః''[6] అని పింగళుఁడు, ''యతిః పదచ్ఛేదః''[7] అని జనాశ్రయుఁడు యతిని నిర్వచించిరి. ఛందమున నియతస్థానములందు ఒక పదము ముగిసి మరియొక పదము ప్రారంభింపవలెను. ఉచ్చారయిత జిహ్వకు విశ్రాంతి లభించుటకై సుఖోచ్చారణ పరిమాణమును మించిన పాదములందు నియతస్థానమున పదము విచ్ఛిన్నము కావలెనని యాదేశింపఁబడినది. పదచ్ఛేదవశమున పాదము ఖండములయి యొక్కొక్క ఖండము ఒకొక్క నిఃశ్వాసముచే సుఖముగా నిర్వర్తింపఁ దగియుండును. పద్యమును పాదములుగా ఛేదించుటయందలి యాశయమును ఇదియే. అవిచ్ఛిన్నమైన దీర్ఘపాదము నుచ్చరించుట జిహ్వకు భారము, వినుట శ్రుతికి భారము. ఉచ్చారణశ్రవణములయందు వక్తృశ్రోతలకు ఉద్వేజనము గలిగించు ప్రమాణములుగల పాదములందు నియతస్థానమునఁ బదచ్ఛేదరూపమైన యతి యుండుట అవసరము. ఈ యభిప్రాయముతోడనే జయకీర్తి యతినిర్వచనము నిట్లు కావించెను :

''వాగ్విరామో యతిః స్యాత్, సా
స్థాప్యతే శ్రుతిసుందరం
పాదాంతే సూచితస్థానే
యుక్పాదాంతే విశేషతః''

ఛందోనుశాసనము : I-10.

యతి వాగ్విరామము. అది శ్రుతిసుందరముగాఁగూడ ఉండవలెను. పాదాంతరాళమున సూచితస్థానమునను, పాదాంతమునను, విశేషించి యుక్పాదాంతమునను యతి యుండవలెను. పాద పద్య గమనమునందలి యమనమే యతి. అది వాగ్యమనము — అనఁగా ప్రాణయమనము. అది ప్రయోక్తృశ్రోతృచిత్త విశ్రాంతికరము.

పాదములు చిన్నవైనచో పాదమధ్యయమన మవసరము కాదు. పాదాంతయమనము చాలును. పాదములు మిక్కిలి చిన్నవైనచోఁ బాదాంతయమనమును అక్కఱ యుండదు;

యుక్పాదాంత యమనము చాలును. యతి పదచ్ఛేదరూప మనుటయందు లాక్షణికుల యభిప్రాయము అది యర్థభంజకము కాఁగూడదనుటయే యని భావింపవలసియున్నది. స్వరసంధ్యాప్త సౌందర్య మున్నచోటఁదప్ప యతియందు ధాతునామభేదము చేయరాదని నియమము. ఇది యర్థభంగదోషము నివారించుటకొఱకే యేర్పడినదనుట స్పష్టము. ఛందోనియతి వాక్యనియతి నతిక్రమింపరాదని గ్రహింపఁదగియున్నది.

నియతస్థానగతమైన పదచ్ఛేదరూప విశ్రాంతి ఛందము యొక్క ఆహ్లాదకత్వమను ధర్మమునుఁ బురస్కరించుకొనుచున్నది. యతిభంగమువలనఁ బద్యము అశ్రవ్యమై యాహ్లాదము భగ్నమగుటచే శ్రోతకు ఉద్వేగము జనించును. వాక్యము శ్రోతకు ఆహ్లాదము కలిగింపవలెనా, ఉద్వేగము కలిగింపవలెనా యన్న యంశము వక్తయిచ్ఛకు వశమైయున్నది శ్రవ్యతాదృష్టితో లాక్షణికులు యతిస్థానములు నిర్ణయించి, యా నిర్ణయముల నతిక్రమించిన ఛందములు యతిభంగమువలన దుష్టములగుచున్నవని నుడివిరి. గుణదోషములు ఔచిత్యపరతంత్రములు. వక్త యిచ్ఛ శ్రోత నాహ్లాదపఱచుటయే యైనచో నతఁడు తన వాక్యమును యథాస్థానమున ఛిన్నముచేయును. శ్రోత చిత్తము నుద్విగ్నము చేయుటయే యతని యిచ్ఛ యైనచో నతఁడు వాక్యము నవిచ్ఛిన్నముగఁ బ్రయోగించును. తా నుద్విగ్నుఁడై శ్రోత నుద్విగ్నుని గావించును. ఇది శిల్పవిషయము – రసవిషయము. శాస్త్రమునకు దీనితో నంతగాఁ బనిలేదు. కనుక వాక్యమును శ్రవ్యము, ఆహ్లాదకము చేయు లక్షణములనే లాక్షణికుఁడు సూత్రించును.

యతి, విరామ, విశ్రామ, విచ్ఛేదాది పదము లేకార్థకములుగాఁ బలువురు లాక్షణికులు భావించియున్నారు. కాని రసాభినివేశముగల భరతముని యతి విరామములకు భేదము భావించెను. ''నియతః పదవిచ్ఛేదః యతిః'' అనియు, ''యత్రార్థస్య సమాప్తిః స్యాత్ స విరామః'' అనియు భరతముని స్పష్టముచేసెను. ''విరామో హ్యర్థానుదర్శకః''[8] అని యాయన యభిప్రాయము. యతి ఛందోవశము, విరామము అర్థవశము. రెండును పదచ్ఛేదరూపములే. యతి నియతస్థానము, విరామము అనియతస్థానము. ఛందము వాగధిష్ఠితమై వర్తించునుగనుక యతి విరామములు రెండును ఛందోధర్మమును యథాయోగము నియమించుచుండును.

అర్థానుదర్శకమై, యవాంతరార్థ సమాప్తిరూపమై వాక్యవశమైన విరామము యొక్క స్వరూపము బహుధా భిన్నమై యున్నది. వాక్యావసానవిరామము పూర్ణవిరామము. అవాంతర వాక్య విరామము దానికంటె తక్కువ. పదాంతవిరామము అంతకంటెను దక్కువ. అక్షర విరామ మింకను దక్కువ. ఇట్లు బహువిరామములు బహుప్రమాణము లయినవి వాక్యమునఁ గలవు. ఇది భాష లక్షణము. భాషావ్యవహారమునం దివి లోకప్రసిద్ధములై యున్నవి. వాక్యాధిష్ఠితమై కావ్యమున వర్తించు ఛందము వాక్యమునకు స్వతస్సిద్ధములయిన లక్షణముల నతిక్రమించి వర్తింపఁజాలదు.

శాస్త్రమున ఛందము స్వతంత్రము. కావ్యమునం దది రసాద్యర్థ పరతంత్రము. ఛందము కావ్యమునకు అంగమేకదా. కావ్యమున రసాద్యర్థపరతంత్రమై వాక్యము ప్రవర్తించును. వాక్యపరతంత్రమై ఛందము ప్రవర్తించును.

వాగ్వ్యవహారమున లోకప్రసిద్ధములై యున్న విచ్ఛేదకాల ప్రమాణములను గూర్చిన యొకానొక వ్యవస్థ పింగళ చ్ఛందశ్శాస్త్ర భూమికయందు మధుసూదన విద్యావాచస్పతిచే నుదాహృతమై యున్నది.

"సంయుక్తయో ర్వ్యంజనయో ర్మాత్రాపాదోఽంతరం భవేత్
మాత్రాపాదార్ధ విచ్ఛేదే గుణసాంకర్య సంభవః ॥
సమస్తపదయో ర్మధ్యే విచ్ఛేద స్త్వర్థమాత్రకః
పాదోనమాత్రా విచ్ఛేదః పదయో రసమస్తయోః ॥
ఏకక్రియాన్వయే వాక్య ఖండానాం మాత్రయాంతరం
నైక ద్వి త్రి చతుః పాదాః మాత్రాః సాపేక్షవాక్యయోః ॥
త్రిమాత్రా వా చతుర్మాత్రాః సూక్తపూర్తౌ విధీయతే
అధికారే ప్రకరణే తతోఽప్యధిక మిష్యతే ॥
శ్లోకే ఽర్ధమాత్రా తు యతౌ విరతౌ మాత్రయాంతరం
విచ్ఛేదే త్వత్ర మాత్రే ద్వే అవసాయే తతోఽధికం॥ పుట. 64.

ఈ విరామకాల ప్రమాణములన్నియు భాషయందు లోకవ్యవహార సిద్ధములై యున్నవి. వీని నతిక్రమించి ఛందము వర్తింపఁజాలదు. ఈ విరామకాల ప్రమాణవ్యవస్థ యంతయు వక్తృవివక్షామూలకమై యున్నది. ఛందముగూడ వివక్షామూలకమే. వివక్షయే పరమార్థమున ఛందము. వక్తృచ్ఛందఃస్వరూపమును వివేచించి, వ్యాకరించి, సూత్రించుటయే ఛందఃశాస్త్రము యొక్క పరమాశయము.

వాక్యనిర్మాణమందలి పదములు, పదములందలి యక్షరములు, అక్షరములందలి స్వర వ్యంజనములు – ఈ సర్వమును ఛందమునందుఁ బనిచేసితీరును. ఈ సర్వాంగములయొక్క నడిమి విరామకాలప్రమాణములు ఛందముయొక్క గమనమును నిరూపించును. *

---

* "లయో ఽక్షరే పదే వాక్యే
యో ఽసౌ నాత్రోపయుజ్యతే" సంగీతరత్నాకరము : 1-5-46.

అక్షరమున, పదమున, వాక్యమున లయయుండుననియు, వానికి సంగీతశాస్త్రము నందంతగాఁ బ్రయోజనము లేదనియు సంగీతరత్నాకరము చెప్పుచున్నది. కాని సాహిత్యమునం దీలయలన్నియు స్ఫుటముగనో అస్ఫుటముగనో పఠనవశమునఁ బనిచేయుచునే యుండుననని విరామకాలప్రమాణ నానాత్వము సూచించుచున్నది. "క్రియానంతర విశ్రాంతి ర్లయః" అనుటచే విశ్రాంతికాల ప్రమాణ భేదముచే లయభేదిల్లుచున్నది.

సమస్తపదముల నడిమి విరామకాలప్రమాణము అర్ధమాత్ర. అసమస్తపదముల నడిమి విరామకాలము పాదోనమాత్ర. కనుక వ్యస్తపదఘటితమైన పాదముకంటె సమస్తపదఘటితమైన పాదము అల్పవిశ్రాంతియై దుఃఖకరమగును. ఏకక్రియాన్వయములైన వాక్యఖండముల నడిమి విరామము మాత్రాకాలము. సాపేక్షవాక్యముల నడిమి విరామము మాత్రకు పైఁబడియుండును. ఇట్టి వాక్యములుగల పద్యములయొక్క నడకలు ఒకదానికంటె నొకటి యలసతరముగ నుండును.

యతి, విరతి, విచ్ఛేదము, అవసాయము - ఇవి వేర్వేఱు విషయములు. పాదమధ్య పదచ్ఛేదరూపమైన యతియందలి విరామము అర్ధమాత్రాకాలము. పాదాంత విచ్ఛేదరూపమైన విరతియందు విరామము ఒకమాత్ర. యుక్పాదాంత విచ్ఛేదమున విరామము రెండు మాత్రలు. పద్యాంతమున విరామము రెండు మాత్రలకంటె అధికము. పద్యముయొక్క నిర్మాణమున నివి యున్నచోఁ బద్య మొకవిధముగా నడచును. లేనిచో నింకొక విధముగా నడచును. పైని చెప్పఁబడిన విరామకాలప్రమాణము లంతే కావచ్చును. కాకపోవచ్చును. అది యౌచిత్య విషయము. కాని విరామ కాలప్రమాణ భేదము మాత్రము అవశ్య ముండి తీరును.

అర్థవశములు, ఛందోవశములునైన విరామములు ఛందముయొక్క ధర్మమును నియమించి నిరూపించును. ఈ యుభయములో అర్థవశవిరామము దురతిక్రమము. శాస్త్రము ఆదేశించిన యతి నతిక్రమించినను బెద్ద దోషములేదు. పరమార్థమున యతి సర్వచ్ఛాందసికులకు నభిప్రేతము కాదు.

> "వాంఛంతి యతిం పింగళ
> వసిష్ఠ కౌండిన్య కపిల కంబల మునయః
> నేచ్ఛంతి భరత కోహల
> మాండవ్యాశ్వతర సైతవాద్యా మునయః.[9]

యతి కావలెనని కొందఱు, అక్కఱలేదని కొందఱు - ఛందోవశమైన యతి ఛాందసికు లందే వివాదాస్పదమై యున్నది. రసప్రవణులైన భరతకోహలాది నాట్యాచార్యులు అర్థాను దర్శకమైన విరామము నభిమానించి ఛందోవశమైన యతిని నిరాదరించిరి.

అక్షరచ్ఛందములందు యతినియతి వైకల్పికమే యైనను మాత్రాచ్ఛందములందు మాత్ర మది నిత్యవిధిగాఁ బాటింపఁ దగినదియే. వాగ్వల్లభమునం దీయంశము సోపపత్తికముగఁ బ్రతి పాదింపఁబడి యున్నది.

> "మాత్రావృత్తే విశేషా ద్విరతి రభిహితా, వర్ణవృత్తే విభాషా
> ధత్తేఽసా వత్ర శోభాం, హరతి చ నియతం భంగ మాప్తా పునస్సా.॥[10]

"లయప్రవృత్తినియమో యతిః'' (కోహళ) అని సంగీతసంప్రదాయము. గేయము లయిన మాత్రాచ్ఛందములందు తాలపాతానుగుణముగ యతిచ్ఛేద ముండవలయును. అట్టియతి

లయను నిరూపించును. యతినియతి మాత్రాచ్ఛందములకు శోభాకరము, తద్భంగము శోభాప హరము. తాలబద్ధములుకాని అక్షరచ్ఛందములందు యతి యైచ్ఛికము – రసాద్యర్థానుసారము మాత్రమే వాంఛనీయము. వాగ్వల్లభమున నీయంశముగూడ చెప్పఁబడినది.

"కామ్యా కామానురోధే కథమపి కరుణౌద్ధత్యతో ఽన్యత్ర హేయా;
వర్ణప్రస్తారమాత్రే మునయ ఉదలక శ్వేత మాండవ్యముఖ్యాః
నైతా మిచ్ఛంతి; కింతు స్యఖిలషతితరాం కుంభజన్మైఖయత్ర."[11]

కరుణరౌద్రాది రసములందు ఇచ్ఛానురోధమున యతిని ప్రయోగించుకొనవచ్చును. ఉదల కాదిమునులు వర్ణచ్ఛందములందు యతి యక్కఱలేదందురు కాని యగస్త్యముని మాత్రము వర్ణచ్ఛందములందు, మాత్రాచ్ఛందములందు యతి యుండియేతీరవలయు ననుచున్నాఁడు. అగస్త్యముని దాక్షిణాత్యచ్ఛాందసికుఁడు. సర్వచ్ఛందములందును యతి యుండితీరవలయునని యాయన సిద్ధాంతించుట దాక్షిణాత్యుల సహజమైన యభిరుచికిఁ దగినట్లే యున్నది.

"దాక్షిణాత్యా స్తావత్ బహునృత్తగీతవాద్యాః
కైశికీప్రాయాః చతురలలిత మధురాంగహారాభినయాశ్చ"[12]

అని భరతముని దాక్షిణాత్యుల యభిరుచిని వర్ణించెను. నృత్తగీత వాద్యాదులందువలెనే ఛందములందును దాక్షిణాత్యులు మాధుర్యప్రియులు – కైశికీప్రియులు. తమిళచ్ఛందముల యందలి తొడై భేదములు, తెలుఁగు ఛందములందలి ప్రాసభక్కి దాక్షిణాత్యుల మాధుర్యప్రియ త్వమునకుఁ జక్కని నిదర్శనములు.

యతివిషయ మింత వివాదాస్పద మగుటచేతనే సంస్కృత మహారథులుగూడ దానినంత పరిశుద్ధముగాఁ బాటింపరైరి. పదచ్ఛేదరూపమైన యతి వారి ప్రయోగములందుఁ బొందిన వికారములను హలాయుధభట్టు యత్యుపదేశోపనిషత్తను పేర నిట్లు వివరించెను.

"యతి స్సర్వత్ర పాదాంతే, శ్లోకార్ధే తు విశేషతః
సముద్రాదిపదాంతే చ వ్యక్తావ్యక్తవిభక్తికే॥
క్వచిత్తు పదమధ్యేపి సముద్రాదౌ యతి ర్భవేత్
యది పూర్వాపరౌ భాగౌ న స్యాతాం ఏకవర్ణకౌ॥
పూర్వాంతవత్ స్వర స్సంధౌ, క్వచిదేవ పరాదివత్;
ద్రష్టవ్యో యతిచింతాయాం యణాదేశః పరాదివత్॥
నిత్యం ప్రాక్పదసంబంధాః చాదయః ప్రాక్పదాంతవత్
పరేణ నిత్యసంబంధాత్ ప్రాదయశ్చ పరాదివత్॥

పింగళచ్ఛందము : అధ్యా. 6.

యతి రహస్యమునుగుఱించి మందారమరందమునఁ జెప్పఁబడిన యంశములు పింగళ చ్ఛందశ్శాస్త్ర టిప్పణియం దుద్ధరింపఁబడినవి —

"పదాంత ఏవ కేచిచ్చ పదమధ్యేపి కేచన
యతిం వదంతి తత్రాపి విశేషః స్ఫుట ముచ్యతే॥
ధాతునామస్వభిన్నేషు యతి ర్భవతి నాన్యథా
ఉపసర్గాంతత శ్ఛేదః ప్రత్యయాదౌ తయోః క్వచిత్॥
స్వరసంధౌ తు సంప్రాప్తసౌందర్యా ద్యతి రిష్యతే
తుచాదయో న ప్రయోజ్యాః విచ్ఛేదాత్పరత స్తథా
ప్రత్యయాదౌ యతి ర్నామ్నాం షష్ఠ్యామేవేతి కేచన॥

పింగళచ్ఛందము : 6 అధ్యాయము.

తెలుఁగున యతి పదచ్ఛేదరూపము కాదు. కాకున్నను పైన చూపఁబడిన యతిరహస్యములను దృష్టియం దుంచుకొని చూచినచో ఆంధ్రకవులు పదచ్ఛేదరూప యతినిగూడ చాల వఱకు పాటించిరనియే చెప్పవచ్చును. ప్రసన్నములు, మధురములు నైన యర్థములను బ్రతిపాదించు పద్యములందును, సీసగీతాదులందును దఱచు పదచ్ఛేదరూపయతి భారతమునందు పాటింపఁబడియే యున్నది.

ఆంధ్రుల యతినియమము విశిష్టమైనది. దానిని వారు వడి యనిరి. యతి నిర్వచనమునకు వడినిర్వచనమునకు నెట్టి సంబంధము లేదు.

"వళిరాద్యం" — చింతామణి. సంజ్ఞా. 37.

పాదారంభాక్షరమే వడి యని వాగనుశాసనుని యనుశాసనము. "వాసనగలమొదలిప్రాయి వడియనఁబరగున్" అని[13] యనంతామాత్యుని వ్యాఖ్యానము. పాదారంభాక్షరముయొక్క వాసన-సంస్కారవ్యాప్తి పాదమున నియతస్థానమం దుండవలెను. పాదారంభాక్షరము, పాదఖండారంభాక్షరము మిత్రములగుటయే వడి లక్షణము. తమిళుల అడిమోనైత్తొడై యనునదియే తెలుఁగుల వడిమైత్రి. *

---

* వడి యను యతిపర్యాయమైన తెలుఁగు శబ్దము 'వడు' అను తమిళశబ్దమునుండి పుట్టినది. వడు అనగా మార్గము యతివశమున ఖండితమైన పాదము నందలి మొదటి భాగపు మొదటి యక్షరము రెండవ భాగపు మొదటి యక్షరమునకు మార్గము చూపుట వడి లక్షణము. వడికి వళి రూపాంతరము — ఇది డా॥ గిడుగు సీతాపతిగారి యభిప్రాయము (ఛందోదర్పణ పీఠిక)

వళి యనునది సంస్కృతపదము, దానికి మడత యని యర్థము. కాంత యుదరమునకు వళులవలె పద్యపాదమునకు అలంకారములైనవి వళులు — ఇది వేదుల రామశాస్త్రిగారి యభిప్రాయము (అప్పకవీయ వివరణము - పుట 10)

కం॥ చరణచరణమున కాద్య
క్షరములు వళులయ్యె, నవియె క్రమ్మఱఁ దత్త
చ్చరణములలోనఁ జెప్పిన
యిరవులఁ బొందింపవలయు నెల్లకృతులలోన్. III-5.

అని యప్పకవిచేసిన వడిస్వరూపవర్ణనము స్పష్టముగా నున్నది.

కం॥ ఎన్నిట యతి రావలెనని
రన్నిట సంస్కృతమునందు నగు విచ్ఛేదం
బెన్నిట యతి రావలెనని
రన్నిటఁ దెలుఁగునకు మొదటియక్షర మమరున్. I-128.

అని యనంతామాత్యుఁడు చెప్పినమాట సత్యమే కాని ఆతని విధానమునుబట్టి చూచినచో తెలుఁగునుగూర్చిన మాట సత్యము కాదనవలసివచ్చుచున్నది. "పద్మార్కాంచిత విశ్రమంబుగ"[14] అని యనంతుఁడు శార్దూలవిక్రీడితమునకు యతి నిర్దేశించెను. అతఁడు చేసిన తెలుఁగువడి నియమమునుబట్టి పండ్రెండవ స్థానమున మొదటియక్షర మమరవలెను. కాని యమరదు. పదమూఁడింట అమరును. 'విశ్వవిశ్రాంతి'[15] అని యప్పకవి సరిగా చెప్పెను. సంస్కృతమునం దేయక్షరమునఁ బదచ్ఛేదము చేయఁబడునో ఆ యక్షరము తరువాతి యక్షరమున ఆంధ్రమున వడిమైత్రి పాటింపఁబడును. సంస్కృతమున శార్దూలమునకు పండ్రెండింటఁ బదచ్ఛేదము. తెలుఁగునఁ బదమూఁడింట వడిమైత్రి.

సంస్కృతయతి నియతస్థానమునఁ బదమును ఛేదించి విశ్రామమును నియమించును. తెలుఁగువడి యట్టి యమనమును చేయదు. కనుక లాక్షణికులు వడిని యతి యని వ్యవహరించుట సమంజసము కాదనవలసియున్నది.

'వడి విభాజనే' అనుటచే విభజించునది వడి. విభాజనార్థము కలది కనుక వడి శబ్దము యతిశబ్దమునకుఁ బర్యాయము. అరవమున వతియెదుగై యను అనుప్రాసభేదము కలదు. వతియెదుగైలోని వతియే తెలుఁగున వడి యైనది. తమిళమున 'మోనై' అను యత్యర్థకశబ్దమునకు మొదటి యక్షరమని యర్థము. కాన వడి - మోనై సమానార్థకములు — ఇది రావూరి దొరసామి శర్మగారి యభిప్రాయము. (తెలుఁగు భాషలో ఛందోరీతులు - పుట 218)

తమిళమున అడి యనఁగా పాదము. అడిమోనై యనఁగా పాదప్రథమాక్షరము. అడిమోనైత్తొడై యనఁగా పాదప్రారంభాక్షరమునకు పాదమందలి మఱియొక యక్షరముతోఁ గల మైత్రి. ఈ భావమంతయు నుద్దేశించి 'అడి' యను శబ్దమును గ్రహించి తెలుగువారు 'వడి' యను రూపమున వాడియుండవచ్చును. వడి వ్యవహారము పాదమునకే పరిమితము గనుక 'అడి' శబ్ద రూపాంతర మగు వడిశబ్దము సార్థకమే యగుచున్నది.

నియతస్థానమున పదవిచ్ఛేదమువల్ల వాగింద్రియమునకు విశ్రాంతి లభించును. నియత స్థానమునఁ బాదారంభాక్షరము పునఃశ్రుతమగుటవల్ల శ్రోత్రేంద్రియమునకు విశ్రాంతి లభించును. తెలుఁగువారు గతికంటె శ్రుతికే యెక్కుడు ప్రాధాన్య మిచ్చిరని భావింపవలెను.

యతిచ్ఛేదము పద్యగతిని యమింపఁగలదే కాని పద, వాక్య విరామములవలె పద్యమున గతిభేదములను నిరూపింపఁజాలదు. ఛందశ్శాస్త్రములు పద్యలక్షణములను స్థూలముగ నిర్దేశించుటయే లక్ష్యముగాఁ బెట్టుకొని ఛందముల రసాద్యర్థానుకూల నిర్మాణమర్మములను దిఙ్మాత్రముగనైనను సూచింపఁ బూనలేదు.

ఛందము వాగింద్రియకర్మ. అది శ్రోత్రేంద్రియమునకు విషయము. లిఖితములయిన యక్షరబంధములందలి గతిభేదములు నేత్రేంద్రియముచే గ్రహింపసాధ్యముగాదు. అక్షరబంధము పఠితమై, శ్రుతమైనప్పుడే దానియందలి లయ యనుభూతమగును. పద్యము ప్రబద్ధమైనఁ జాలదు. ప్రయుక్తము కావలెను, శ్రుతము కావలెను. ఛందశ్శాస్త్రములు పద్యప్రబంధలక్షణములనే చెప్పునుగాని పద్యప్రయోగలక్షణములను జెప్పవు. కావ్యమందలి ఛందములు ప్రయోక్తవ్యములు - పాఠ్యములు లేక గేయములు. పఠితములో, గీతములో అయి, శ్రుతములయినప్పుడే వాని శక్తి యనుభూతమగును. "ప్రయోక్తృ గయత్రాణాత్ గాయత్రీ" యన్న బ్రాహ్మణవచనము, 'గాయంతం త్రాయతే' యన్న వ్యాసవచనము, 'పాఠ్యే గేయే చ మధురం' అన్న వాల్మీకి వచనము ఈ యర్థమునే సమర్థించుచున్నవి.

Paul Valery యీ యంశమును చక్కఁగాఁ జెప్పెను.

"It is the performance of the poem that is the poem. Without this these rows of curiously assembled words are but inexplicable fabrications"[16]

ప్రయుక్తమైన పద్యమే సజీవము, శక్తిమంతము నగును. అప్రయుక్తమైన పద్యము నిర్జీవము, నిరర్థకమునైన లిపిసమావేశము. ఛందోంగములయిన యతి విరామ వళులను శిల్పియైన కవి యెట్లు వినియోగించునో ఛందములను బ్రయోగించి తెలిసికొనవలెను. *

---

*ఛందముయొక్క ధర్మము ప్రయోగమువల్లనే గ్రహింపఁదగునన్న యభిప్రాయము వాల్మీకిమహర్షి "పాఠ్యే గేయే చ మధురం" అని తన రామాయణమును గొనియాడుటలో వ్యక్తముచేసినాఁడు కుశలవులు రామాయణము గానముచేయఁగా విని శ్రోతలు "అహో గీతస్య మాధుర్యం శ్లోకానాం తు విశేషతః" అని ప్రశంసించి రనుటయందును నీ యభిప్రాయమే కనఁబడుచున్నది.

పాశ్చాత్యులందును నిట్టి యభిప్రాయము ప్రబలముగా నున్నది పలువురు కావ్యవేత్తలు, ఛందోవేత్తలు నిట్లే యనిరి.

T. S. Omond అను ఛందోవేత్త 'Study of Metre' అను గ్రంథమునందు తన యభిప్రాయ మిట్లు తెలిపెను :

## 3. పాదము :

"పద్యతే గమ్యతే అనేనేతి పాదః" అను న్యాయమునఁ బాదమనఁగా గమనసాధనము. వేదమునఁ బాద మవాంతరవాక్యము; లౌకికచ్ఛందములందు పాదము పద్యచతుర్థభాగమని సాధారణసంజ్ఞ.

"పాద శ్చతుర్భాగః"

4.10.

అని సామాన్యసూత్రముచేసి పింగళముని యామీఁద :

"యథా వృత్తసమాప్తి ర్వా"

4.11

అని వికల్పసూత్రమునుగూడ చేసెను. పద్యము చతుష్పదిమైనచో పాదము చతుర్థ భాగము; ద్విపదమైనచో ద్వితీయభాగము; షట్పదిమైనచో షష్ఠభాగము. పద్యమునం దెన్నవ భాగమైనను పాదముయొక్క స్వగతపరిమాణము ముఖ్యము.

"పాదో ఒక్షరమాత్రా నియమోదిత పిండః"

ఛందోఽనుశాసనము : 1.25

అని జయకీర్తి చేసిన పాదస్వరూపనిర్వచనము సమంజసముగా నున్నది. మాత్రాచ్ఛందములందు నియతమాత్రాసంఖ్యచేతను, అక్షరచ్ఛందములందు నియతాక్షరసంఖ్యచేతను నిష్పన్నమైన పిండము పాదము. ఛాందసికులు సాధారణముగఁ బాదమునకే లక్షణము చెప్పుదురు. "గాయత్ర్యా వసవః"17 "జగత్యా ఆదిత్యాః"18 ఇత్యాదిగా పింగళమునియుఁ బాదములకే లక్షణము చెప్పెను. పాదము పాదముగా శ్రోతకు గోచరింపవలె నన్నచో దాని యంతమునఁ బదము విచ్ఛిన్నము కావలెను. ఏకాక్షరాది షడ్వింశత్యక్షరాంతములయిన పాదప్రమాణములు

"Now Poetry is speech of a specially ornate kind. All verse is supposed to be read aloud, and in considering it we must study sound rather than sight, phonetics rather than orthography." p. 4.

Catherine Ing అభిప్రాయమిది :

"It is the essence of a poem that its form should work on the emotions till it awakens the exact mood fitted for the reception of its matter."
— Elizabethan Lyric. p. 177.

Henrie Fluchre అభిప్రాయము :

"The rhythmical succession is an emotional pattern showing a purpose, imposing a mood or defining a thought."

Shakespeare, p. 181.

గలవు. వీని స్వరూపము తదంతమందలి విచ్ఛేదమువలననే తెలియఁదగియున్నది. పద్యము పేరు తెలిసి, దాని పాదమందలి యక్షరసంఖ్య తెలిసి, పాదస్వరూపము తెలియుట వేఱు విషయము. ఈ లక్షణముల పరిజ్ఞానము లేకయే శ్రోతకుఁ బాదస్వరూపము శ్రుతిగోచరము కావలెనన్నచో పాదాంతవిరామ మవశ్యంభావి యగుచున్నది. కనుకనే ''యతి స్సర్వత్ర పాదాంతే''[19] అని ఛాందసికులు కవిని శాసించిరి. ''కార్యో విరామః పాదాంతే''[20] అని భరతముని ప్రయోక్తను ఆదేశించెను. సంస్కృతకవు లీనియమమును జాలవఱకుఁ బాటించిరి.

ఆంధ్రలాక్షణికులుగూడ పాదమునకే లక్షణము చెప్పిరి. కాని పాదాంతమున యతిచ్ఛేదమును వారు విధింపలేదు; తమ లక్ష్యములందుఁ బాటింపలేదు. కనుక లాక్షణికులు పాదలక్షణము నిబంధించుట పద్యనిర్మాణముకొఱకేకాని పద్యప్రయోగముకొఱకుఁ గాదని తోఁచును. కవులుగూడ పాదాంత యతినిగాని, యుక్పాదాంత యతినిగాని నియమముగాఁ బాటించినట్లు కనఁబడదు. లిఖితమైన పద్యము పాదలక్షణానుసారము లిఖితమైననేతప్ప తెలుఁగు పద్యములందు పాదస్వరూపమును గుర్తించుటకు సంస్కృతనియమము లేవియు నుపయోగింపవు. అయితే వృత్తములు, జాతులు ననఁబడు పద్యములందు మాత్రము సుకుమారమైన శ్రోత్రము పాదస్వరూపమును గుర్తించుట కొకసాధన మున్నది. అది ప్రాసము. ప్రాసాక్షరావృత్తినిబట్టి పాదావృత్తిని శ్రోత్రేంద్రియము గుర్తించు నవకాశమున్నది.

పాదప్రమాణము కేవలము అక్షర సంఖ్యానిష్ఠమే కాదు. హ్రస్వత్వ దీర్ఘత్వ, గురుత్వ లఘుత్వ రూపములయిన ప్రమాణములుగూడ పాదమున కున్నవి. పండ్రెం డక్షరములుగల పాదములన్నియు నేకప్రమాణములు కాఁజాలవు. పండ్రెండును హ్రస్వములేయైన పాదముకంటె పండ్రెండును దీర్ఘములేయైన పాదము రమారమి రెట్టింపునిడివుండును. పండ్రెండును లఘువులేయైన పాదముకంటె పండ్రెండు గురువులేయైన పాదము రమారమి రెట్టింపు బరువుండును. అక్షరసంఖ్యాప్రమాణము జ్ఞానమాత్రవిషయము. హ్రస్వత్వ దీర్ఘత్వాదికము అనుభవవిషయము.

పాదము నేకప్రాణభావము పాదప్రమాణము నిశ్శ్వాసప్రమాణ లక్షకమని భావింపవచ్చును. వాక్యము యొక్క ప్రమాణమువలెనే వాక్యస్థానీయమైన పాదముయొక్క ప్రమాణముగూడ వక్త్రిచ్ఛాధీనము. ప్రతిపాద్య వస్తుప్రమాణము, వక్త స్వభావము, వక్త నావేశించిన భావముయొక్క గాఢత్వము మున్నగునవి పాదప్రమాణ నియామకములని భావింపవచ్చును.

అష్టాక్షరప్రమాణము గాయత్రము – ప్రాణసుఖావహము అని గుర్తించితిమిగదా. అంతకు లోఁబడినవి, పైఁబడినవి యైన ప్రమాణములు వక్తయొక్క ప్రాణప్రసారమునకు అతిలాఘవమువలన, అతిగౌరవమువలన దుఃఖకరములే యనఁదగును. ఎట్టి యవస్థయందు వక్తయొక్క ప్రాణప్రసారము లఘువు, సత్వరము నగుచున్నదో అట్టి యవస్థయందు లఘుప్రమాణ పాదములయిన ఛందము లుచితములనియు, తద్విపరీతావస్థయందు గురుప్రమాణ పాదములయిన ఛందము లుచితములనియు గ్రహింపఁదగును. ఇది లోకప్రసిద్ధమైన యంశమే.

వాక్యప్రమాణమునుబట్టి వక్త చిత్తవృత్తి కొంతవఱకు గ్రహింపవచ్చును. "నామ ప్రాణ చ్ఛందోరూప ముత్పన్నం" అన్న శ్రుతివాక్యము నిచ్చట స్మరింపవలెను. వాక్ప్రమాణము ప్రాణప్రమాణ నిరూపకమన్న యభిప్రాయము శ్రుత్యర్థమువలన ననుమేయమగుచున్నది.

పాదప్రమాణాశ్రితమైన ఛందోవినియోగౌచిత్యమును గుఱించి భరతముని కావించిన సూచనలుగూడ గమనింపఁదగినవి.

''ఉత్తరోత్తర సంయుక్తం వీరే పార్యం చ యద్భవేత్
జగత్యతిజగత్యా తు సంకృత్యా చైవ యోజయేత్''॥
"యుద్ధసంఫేటయో స్తద్జ్ఞైః ఉత్కృతిః పరికీర్తితా
కరుణే శక్వరీ చైవ తథా చాతిధృతి ర్భవేత్''
''యద్వీరే కీర్తితం ఛందః తద్రౌద్రేపి ప్రయోజయేత్
శేషాణా మర్థయోగేన ఛందః కార్యం ప్రయోక్తృభిః॥''

నా. శా. XVI : 117-119

వీరరసమున ఉత్తరోత్తర సంజల్పములందు 12, 13 లేక 24 అక్షరముల పాదములు, యుద్ధసంఫేటవర్ణనలందు 26 అక్షరముల పాదములు, కరుణమున 14 లేక 19 అక్షరముల పాదములు ప్రయోగింపఁ దగినవి. వీరమునందలి ప్రమాణములే రౌద్రమునందును ఉచితములు తక్కినరసములందు, అర్థములందు యథోచితముగ పాదప్రమాణములు నిర్ణయించుకొని ఛందములను ప్రయోగింపవలెను.

వస్తురసభావాదులను వ్యంజించుటయందు ఛందముయొక్క పాదప్రమాణముకూడ సమర్థమే యనుట పరమార్థము.

## 4. దేవత:

గాయత్ర్యాదిచ్ఛందములకు అగ్న్యాదులు దేవతలుగాఁ జెప్పఁబడియున్నారు. ''మంత్ర మయీ దేవతా'', "యా తేనోచ్యతే సా దేవతా'' - ఇత్యాది ప్రమాణములవల్ల వాక్యార్థమే దేవత యని విదితమగుచున్నది. వాక్యార్థము విభావానుభావాదికము, రసాదికము. వాక్యాధిష్ఠితమైన ఛందమునకు వాక్యార్థము అంగమే యగుచున్నది. అంగమనఁగాఁ బ్రసక్తమైన యంశమని గ్రహింపవలెను. ఛందము అర్థానుగుణముగ, రసానుసారముగ నుండవలెను. దేవతకు, ఛందమునకు వలెనే రసాద్యర్థమునకు, ఛందమునకు అవినాభావమైన, స్వతస్సిద్ధమైన సంబంధ మున్నది.

"గాయత్రీం బ్రాహ్మణ స్యానుబ్రూయాత్'' - ఇత్యాది బ్రాహ్మణవచనముల నిచ్చట స్మరింపవలెను.

## 5. స్థానము :

ఛందోవిధియందు గమనింపవలసిన స్థానము శరీరాశ్రయము, దిగాశ్రయమునని ద్వివిధమని భరతముని చెప్పెను. ఛందమున కధిష్ఠానమైన వాక్కుయొక్క స్థానములను భరతముని యుద్దేశించి యుండవచ్చును. శరీరాశ్రయములు, ఆస్యాశ్రయములు - వాగుత్పత్తి స్థానములు రెండు విధములని శిక్షావ్యాకరణములందుఁ బ్రసిద్ధమైయున్నది. హృదయ, కంఠ, శిరస్సులు శరీరాశ్రయములయిన సవనస్థానములు.[21] సవనస్థానములనఁగా ప్రాణమారుతము కాయాగ్నిచే ఆహతమై నాదమును ప్రసవించు స్థానములు. తాలు, దంతోష్ఠాదులు ఆస్యాంతర్గత స్థానములు. ఇవి యాస్యమున ఊర్ధ్వాధః పూర్వోత్తర దిక్కులం దున్నవి. శరీరాశ్రయస్థానమునం దుత్పన్నమైన నాదము ఆస్యాంతర్గత దిగాశ్రయస్థానములందు వివిధస్వరవ్యంజనముల రూపమున నిష్పన్నమగుచున్నది. ఇట్లు స్థానద్వయాశ్రయమున వ్యక్తమైన వైఖరీవాక్కే ఛందమున కధిష్ఠానము. కనుక ఛందముయొక్క ధర్మము ఈ స్థానద్వయము నాశ్రయించియే ఉండునని భావింపవలెను.

"శరీరాశ్రయ సంభూతం దిగాశ్రయ మథాపి వా"[22] అని భరతముని ప్రతిపాదించిన స్థానద్వైవిధ్యమును అభినవగుప్తపాదులు వేఱొకవిధమున భావించి వ్యాఖ్యానించియున్నారు. శరీర మనఁగా కరచరణాద్యంగ యుక్తమైన యాకారమనియు, దిక్కులనఁగా ప్రాక్పశ్చిమ దక్షిణోత్తరములనియు భావించి శరీరాశ్రిత, దిగాశ్రితచ్ఛందో వినియోగమునుగుఱించి కాత్యాయనోక్తములయిన శ్లోకముల నుదాహరించిరి.

"వీరస్య భుజదండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్
నాయికావర్ణనే కార్యం వసంతతిలకాదికం"
"శార్దూలలీలా ప్రాచ్యేషు మందాక్రాంతా చ దక్షిణే"

నా. శా. XIV.

వీరుని భుజదండములను స్రగ్ధరచేత, నాయికను వసంతతిలకాదికముచేత వర్ణించుట శరీరాశ్రయచ్ఛందః ప్రయోగము. ప్రాచ్యులందు శార్దూలవిక్రీడితము, దాక్షిణాత్యులందు మందాక్రాంత ప్రచురమై యుండుట దిగాశ్రయచ్ఛందఃప్రయోగము.

వీరుని దీర్ఘభుజదండముల వర్ణనమున దీర్ఘములైన స్రగ్ధరాదులు, నాయికయొక్క తన్వంగవర్ణనమున అల్పప్రమాణములైన వసంతతిలకాదులు వినియోగింపఁదగినవనుట వృత్తస్వరూపము వర్ణ్యవస్తుస్వరూపావభాసకముగ నుండవలెననుట. ఆద్యంతములందు దీర్ఘాక్షరములు, నడుమ హ్రస్వాక్షరములు గలిగి స్రగ్ధరావృత్తపాదము దీర్ఘభుజదండమధ్యగత వక్షోవేదికను బోలి యుండుట గుర్తింపవచ్చును. స్రగ్ధరావృత్తపాద దర్శనమునఁ గలుగు ననుభవము మహావీరుని భుజదండములను దర్శించినప్పుడు కలుగు ననుభవమువంటిదే, ఛందము నందలి యక్షర

బంధమువలన నేత్రశ్రోత్రములకు గలుగు దర్శనము ఏకరూపమే యని విజ్ఞుల యనుభవముగాఁ గనఁబడుచున్నది. అక్షర బంధలభ్యమైన యీ దర్శనము నాశ్రయించినవే చక్రబంధ మురజ బంధాదులు. సుశిక్షితశ్రోత్రేంద్రియులు చక్రబంధాది పద్యములను వినినంతమాత్రముననే చక్రాది రూపములను దర్శింపఁగలరని భావింపవచ్చును. నేత్రశ్రోత్రములవలన గలుగు ననుభవమున విశేషసాదృశ్యము గలదని యాంగ్లచ్ఛందోవేత్త Puttenham చెప్పుచున్నాఁడు.

"Likewise it so falleth out most times your occular proportion doth declare the nature of the audible; for, if it so please the eare well, the same represented by delineation to the view pleaseth the eye well and e converso; and this is by a natural sympathy between the eare and the eye and between tunes and colours, even as there is the like between the other sences and their objects......"[23]

వృత్తములకు నామకరణము చేయుటయందును నిట్టి భావన కలదు. ఉష్ణిక్, కకుప్, జగతి – ఇత్యాది ఛందోనామము లిట్టివే.

"ఉష్ణిక్ ఉత్స్నాతా భవతి । ఉత్స్నాతా – గాయత్రీతః చతుర్భి రక్షరైః ఉద్వేష్టితా ఇవ । ఉష్ణీషిణీ వా ఇత్యౌపమికం । అథవా ఉష్ణీషిణీ ఉష్ణీషవతీ ఇవ ఇత్యౌపమికం ఉపమానిబంధనం నామ"

నిరుక్తము : పుట 364.

గాయత్రియొక్క పాదత్రయముమీఁద నాల్గక్షరములు ఉష్ణీషమువలె నుండును గనుక గాయత్ర్యనంతరచ్ఛందమునకు ఉష్ణిక్ అని యౌపమిక నామకరణము చేయఁబడినది. శ్రుతమైన యక్షరబంధము దృష్టవస్తూపమానమునఁ బేర్కొనఁబడినది. ఆటవెలఁది, సీసము, శార్దూలము, మత్తేభము – ఇత్యాది పద్యనామములు ఔపమికములే.

శార్దూలవిక్రీడితము ప్రాచ్యులందును, మందాక్రాంత దాక్షిణాత్యులందును వినియోగింపఁ దగిన వనుటయందలి భావ మిట్లుండవచ్చును: శార్దూలమందలి 19 అక్షరములలో 11 గురువులు, 8 లఘువులు. ఆదిమధ్యాంతములందు గురులఘునివేశ మించుమించు తుల్యరూపము. పాదము ద్వివిరామము. మందాక్రాంతయందలి 17 అక్షరములలో 9 గురువులు, 8 లఘువులు. ఆద్యంతముల గురువిన్యాసము, నడుమ లఘువిన్యాసము. పాదము త్రివిరామము. విరామబాహుళ్యము వలన, తరంగభంగిగమనమువలన మందాక్రాంత సుకుమారమధురవృత్తి. విరామాల్పతవలన, కల్లోలాయమానగమనమువలన శార్దూలవిక్రీడితము పరుషదీప్తవృత్తి.

శార్దూలవిక్రీడితము గౌడీయము – ప్రాచ్యప్రసిద్ధము, మందాక్రాంత వైదర్భము – దాక్షిణాత్యప్రసిద్ధము నని తాత్పర్యము. దాక్షిణాత్య నృత్తగీతాదులవలె దాక్షిణాత్యములయిన తెలుఁగు దేశిచ్ఛందములును మధురములు, కైశికీప్రాయములు నై యున్నవి.

పింగళమునికూడ దిగాశ్రయచ్ఛందోభావన కలవాఁడే యని వైతాలీయమునం దాయన నిరూపించిన ప్రాచ్యవృత్తి, ఉదీచ్యవృత్తి, దక్షిణాంతికవంటి భేదములవలన ఊహింపఁదగి యున్నది.

## 6. స్వ ర ము :

తార మంద్ర మధ్య భేదములచే స్వరము త్రివిధమనీ భరతముని చెప్పెను. తార మంద్ర మధ్యములే ఉదాత్తానుదాత్త స్వరితములనియు, ఉచ్చ నీచ మధ్యములనియు వ్యవహరింపఁబడు చున్నవి. తారాదులు సంగీత శాస్త్రమున, ఉదాత్తాదులు శిక్షాశాస్త్రమున, ఉచ్చాదులు లోకవ్యవహారమునఁ బరిభాషింపఁ బడుచున్నవి. స్వరము సంగీతమున "స్వతో రంజయతి"* యనియు, సాహిత్యమున "స్వయం విరాజతే" యనియు నిర్వచింపఁబడినది.

స్వయంవిరాజమానములయిన స్వరములు అచ్ ప్రత్యాహారమున సంగ్రహింపఁబడి యున్నవి. వీనికి హ్రస్వత్వ దీర్ఘత్వ ప్లుతత్వ భేదముతోపాటు ఉచ్చత్వ నీచత్వ మధ్యత్వ భేదముకూడ కలదని శబ్దతత్వవేత్తల యభిప్రాయము. ఉరఃకంఠశిరస్సులం దుత్పన్నమైన స్వరము క్రమముగా నీచము, మధ్యము, ఉచ్చము నై యుండును ప్రాణమారుత మే స్థానమున యమింపఁబడి స్వరరూపము ధరించుచున్నదో ఆస్థానము స్థాయి లేక యమము అనఁబడుచున్నది. సర్వస్వరములకును స్థాయిత్రయభేద మున్నది. ఈ స్థాయి భేదము వక్త్రిచ్ఛాధీనము. భేద కల్పనమునకుఁ బ్రయత్నమవసరము. సమానస్థాయియందు నిష్పన్నములయిన స్వరములు వక్తృప్రయత్నవిశేష నిరపేక్షముగనే పరస్పరాపేక్షచే ఉచ్చనీచ భేదములుగల వగుచున్నవి.

"సమాన యమే అక్షరం ఉచ్చైరుదాత్తం
నీచై రనుదాత్తం, ఆక్షిప్తం స్వరితం"[24]

అని వాజసనేయప్రాతిశాఖ్యము సమానయమమున స్వరత్రైవిధ్యమును జెప్పుచున్నది.

"తాల్వాదిషు సభాగేషు స్థానేషు ఊర్ధ్వభాగే నిష్పన్నః అచ్ ఉదాత్తసంజ్ఞః స్యాత్" అని భట్టోజీదీక్షితుఁడు వివరించియున్నాఁడు.

సిద్ధాంతకౌముది 1-5

*"శ్రుత్యనంతరభావీ యః స్నిగ్ధో ఽనురణనాత్మకః
స్వతో రంజయతి శ్రోతృచిత్తం స స్వర ఉచ్యతే. (1-3-24)

అని సంగీతరత్నాకరము.

"రాజృ దీప్తా వస్యధాతోః స్వశబ్దపూర్వకస్య చ
స్వయం హి రాజతే యస్మాత్తస్మాత్ స్వర ఇతి స్మృతః"

అని మతంగుఁడు స్వయముగా రాజిల్లునది స్వరము అని నిర్వచించినట్లు సంగీతరత్నాకరమునకు సుధాకర వ్యాఖ్య వ్రాసిన సింగభూపాలుఁడు నుడివియున్నాఁడు.

శబ్దతత్త్వజ్ఞులు స్వరముల శ్రుతియందు స్వతస్సిద్ధములయిన భేదములు కలవని కనిపట్టిరి. ఆభేదములను వారు Pitches అని పేర్కొనిరి. Sir Richard Paggot పండితుఁడు అకారాది స్వరములయొక్క Pitch ని గుఱించి కనిపట్టిన యంశములను M. M. Maccdermott తన వ్యాసమునం దిట్లు పరిష్కరించి చూపియున్నాఁడు.

అగ్రస్వరములు (Front vouels) – ఈ, ఇ – High pitch
మధ్యస్వరములు (Mid – vouels) – ఆ, అ – Middle pitch
పృష్ఠస్వరములు (Back – vouels) – ఊ, ఉ – Low pitch

తాలవ్య స్వరములు – ఉచ్చములు
కంఠ్య స్వరములు – మధ్యములు
ఓష్ఠ్య స్వరములు – నీచములు Psyche Monograph - 13 ( 1940)

అని శబ్దతత్వవేత్తల యభిప్రాయముగా గ్రహింపవచ్చును. ఈ స్వరములం దేది ఛందమున, ఋనఃపునరావృత్తమగునో, ఏది వడియందు నిల్చియుండునో ఆస్వరము ఛందమున స్థాయిత్వము పొంది వక్తయొక్క వాక్యోచ్చారణస్థాయిని సూచించును. ఛందమందలి స్వర స్థాయినిబట్టి వక్తయొక్క చిత్తవృత్తిని గొంతవఱకు గుర్తింపవచ్చును.

## 7. వర్ణము :

శ్వేతాదులు వర్ణములని భరతముని చెప్పెను. గాయత్ర్యాది సప్తచ్ఛందములు క్రమముగా "సిత సారంగ పిశంగ కృష్ణ నీల లోహిత గౌర" వర్ణములని ప్రసిద్ధి. అర్థమైని యీ ఛందో వర్ణభావన లౌకికచ్ఛందోవినియోగమును నిరూపింప సాధ్యముకానిది. "హయాశ్చ సప్త చ్ఛందాంసి"[25] "సప్తాశ్వరూపా శ్ఛందాంసి"[26] అని సప్తచ్ఛందములు సవితృదేవుని సప్తాశ్వ ములుగా రూపింపఁబడినవి. ఛందములు సూర్యరశ్మిలుగా వేదములందే రూపింపఁబడి యున్నవి. సూర్యుని సప్తకిరణములు సప్తవర్ణములు గనుక సూర్యాశ్వములుగా రూపింపఁబడిన ఛందములకు సూర్యకిరణవర్ణము లారోపింపఁబడినవి. లోకసాహిత్యమందలి ఛందములకు సప్తవర్ణారోపణము నిష్ప్రయోజనమని తలంపవచ్చును.

కనుక స్వరమన్నపదము అకారాద్యుపలక్షకముగా గ్రహింపఁబడినట్లే వర్ణమన్నపద మిచ్చట కకారాది వ్యంజనోపలక్షకముగా గ్రహింపఁబడుచున్నది. వర్ణపదమునకు లిప్యర్థమున రంగు అని యర్థము చెప్పుదురు. కాని వర్ణశబ్దము గుణవాచకమని Allen అను శబ్దశాస్త్రవేత్త వివరించెను. "వర్ణము" అనఁగా "Quality" అని యాయన వ్యాఖ్యానించెను.[27] 'కవర్ణము' అనఁగా 'క quality' అనియు 'కకారము' అనఁగా 'క making' అనియు ఆయన వివరిం

చెను. "కార" శబ్దము ఉత్పాదనమును, "వర్ణ" శబ్దము గుణమును బోధించును, "హ్రస్వో వర్ణోత్తరః త్రయాణాం" * ఇత్యాది పరిభాష యీ యంశమునే సమర్థించుచున్నది. వాగధిష్ఠితమై ప్రవర్తించు ఛందమునకు వాగ్వికారమైన వ్యంజనము అంగమే యని భావింపఁదగియున్నది. కనుక వర్ణశబ్ద మిచ్చట వ్యంజనార్థకముగా స్వీకరింపఁబడుచున్నది.

వ్యంజనశబ్దము "పరేణ స్వరేణ వ్యజ్యతే" [28] అనియు "వ్యంజయంతి ప్రకటాన్ కుర్వంత్యర్థాన్" [29] అనియు నిర్వచింపఁబడినది. రెండవ నిర్వచనమే యిచ్చటఁ బ్రధానముగా గ్రహింపఁబడినది తన బుద్ధికి గోచరించిన నానార్థములను బ్రకటించుటకే వక్త నానావ్యంజనములను నిష్పాదించుచున్నాఁడు.

"అభిమతప్రయోజన విజిజ్ఞాపయిషయా పురుషేణ తదభివ్యక్తిసమర్థేన స్వగుణభూత ప్రయత్నేన ఉదీర్యమాణః శబ్దః ఉరఃకంఠాది వర్ణస్థానేషు నిష్పద్యమానః తయా (విజిజ్ఞాపయిషయా) పురుషార్థాభిధానసమర్థ వర్ణాదిభావ మాపాద్యమానః ..." [30] పురుషార్థాభివ్యంజనము కొఱకు శబ్దము ‡నానావర్ణరూపములు పొందింపఁబడుచున్న దనుటవల్ల పురుషార్థగుణవత్త్వమే వర్ణముయొక్క వర్ణత్వమని గ్రహింపవలసియున్నది. పురుషేచ్ఛాధీనమైన ఛందమునఁ బురుషేచ్ఛావర్జితమైన వర్ణము లేక వ్యంజనము అంగమనుట యుచితము.

వక్తృ చిత్తవృత్త్యారోపణమువలన వర్జితమైన వాక్స్పందమే వర్ణము. అది ఛందో నిర్మాణ మూలద్రవ్యము. ఏ వర్ణము పునఃపునరావృత్తమై ఛందమున స్థాయిత్వము పొందునో ఆ వర్ణముచే ఛందమంతయు వర్ణితమై, వర్ణోత్పాదన నిమిత్తమైన వక్తృ చిత్తవృత్తి ఛందమున సుష్ఠుగా వ్యక్తమగును.

"అకారో వై సర్వా వాక్ । సైషా స్పర్శోష్మభి ర్వ్యజ్యమానా బహ్వీ నానారూపా భవతి" [31] అని యైతరేయశ్రుతి చెప్పుచున్నది. అకారమే వాఙ్మాతృక. దాని స్పర్శకృత వికారములు కాదిమాంతములు, ఊష్మకృత వికారములు శషసహలు. పురుషేచ్ఛయే వర్ణోత్పత్తికి, వర్ణనానాత్వమునకు మూలకారణము. నానావర్ణముల యుత్పత్తియందలి పురుషప్రయత్న వైవిధ్యమునుబట్టి వర్ణవైశేష్యకారణములు వివేచింపఁబడినవి.

* "హ్రస్వో వర్ణోత్తరః త్రయాణాం" (i : 20) "వర్ణః కారోత్తరో వర్ణాఖ్యా" (1 : 26)

అను తైత్తిరీయప్రాతిశాఖ్య సూత్రములవల్ల 'అ' వర్ణము అనఁగా అ, ఆ, ఆ౩ అను హ్రస్వ దీర్ఘప్లుతములు. 'అ' కారము అనఁగా అవర్ణహ్రస్వముమాత్రమే.

‡ "శబ్దః ప్రకృతిః సర్వవర్ణానాం" "తస్య రూపాన్యత్వే వర్ణాన్యత్వం" "వర్ణకారౌ నిర్దేశకౌ" (XXII : 1, 2, 4) అని తైత్తిరీయప్రాతిశాఖ్యము కూడ సర్వవర్ణములు శబ్దవికృతులే యనుచున్నది.

"అనుప్రదానాత్ సంసర్గాత్
స్థానాత్ కరణవిభ్రమాత్
జాయతే వర్ణవైశేష్యం
పరిమాణాచ్చ పంచమాత్"[31]

అనుప్రదానము, సంసర్గము, స్థానము, కరణవిభ్రమము - ఈ నాల్గును వర్ణవైశేష్య కారణములు. ఈ కారణములవలన సిద్ధించిన వర్ణవిశేషములను పాణినిమహర్షి హల్ ప్రత్యాహారమున సంగ్రహించెను. అనుప్రదానమనగా అనురూప ప్రాణప్రదానము. సంసర్గమనగా స్థానకరణసంయోగము. స్థానమనగా తాల్వాదికము. కరణవిభ్రమమనగా జిహ్వాప్రచారము. ఇవి వర్ణభేదకారకములు.

పరాది వైఖర్యంతమైన వాగావిర్భావ దశాచతుష్టయమును చిచ్ఛక్తి పరిణామమును మహర్షులు స్పష్టముగ దర్శించిరి. పరావాక్కు అనపాయిని-వివక్షామాత్ర. దాని స్థానము నాభి - అనగా చైతన్యకేంద్రము. పశ్యంతి ద్యోతితార్థ-వివక్షితార్థరూప. దాని స్థానము హృదయము - అనగా చేతనాస్థానము. మధ్యమ శ్రుతిగోచర - వివక్షితార్థగర్భ ధ్వనిరూప. దాని స్థానము కంఠము. అది వక్తృశ్రుతికిమాత్రమే గోచరయగును. నాభియం దిచ్ఛారూపయైన శక్తి హృదయమున జ్ఞానరూపయై, కంఠమున క్రియారూపయగును. ఇష్టార్థప్రత్యాయక ధ్వనివిశేష రూప ధారణము కంఠమునుండి యారంభమగును. క్రియాత్మకవ్యాపారమే ప్రయత్నము. ఈ ప్రయత్నము రెండు విధములు :

1. బాహ్యప్రయత్నము : ముఖయంత్రమునకు వెలుపల కంఠమునందే జరుగునది.

2. ఆభ్యంతరప్రయత్నము : ముఖయంత్రములోపల జరుగునది.

బాహ్యప్రయత్నమునకు అనుప్రదానమని పేరు. అది యిష్టార్థవ్యంజనసమర్థ వర్ణోత్పాదనానుకూల ప్రాణవాయుప్రదాన ప్రయత్నము - కంఠబిల వివార సంవార రూపము. వివారప్రయత్నముచే శ్వాస మహాప్రాణ భేదములును, సంవారప్రయత్నముచే నాదాల్ప ప్రాణ భేదములును ధ్వనియందు గల్గును. ఈ భేదకల్పనము ఇష్టార్థవ్యంజనమున ప్రథమ ప్రయత్నము. ద్వితీయప్రయత్నము ఆస్యాభ్యంతరమున జరుగును. అది స్థాన కరణ స్పర్శాస్పర్శ రూపము. స్పర్శమువలన కాదిమాంతములు, అస్పర్శమువలన ఊష్మములు, దుఃస్పర్శమువలన అంతస్థములు నిష్పన్నములగును. ఇవి యిష్టార్థవర్తితములయిన ధ్వని విశేషములు. ఇట్టి వర్ణములచే వైఖరీవాక్కు నిష్పన్నమగుచున్నది. అది యిష్టార్థాభివ్యంజక వాక్యరూప; బాహ్యాభ్యంతరోభయప్రయత్న నిర్వర్తిత వర్ణాక్షర పదబంధ స్వరూప; శ్రోతృ శ్రవణగోచర; హృదయంగమ. ఇట్టి వైఖరీవాక్కుచే నధిష్ఠింపబడి ఛందములు వర్తించు చున్నవి.

స్థానకరణప్రయత్నాది సామ్యముచే, వైషమ్యముచే వర్ణములందు సామ్యము వైషమ్యము గలుగుచున్నవి. వర్ణసామ్యము ఛందమును శ్రుతిరంజకము చేయును, వర్ణవైషమ్యము ఉద్వేజకము చేయును.

"వర్ణాః రసచ్యుతః"[33] అనిన యానందవర్ధనుల యభిభాషణము పరమార్థము. ఛందో నిర్మాణమునందుకూడ ఆ పరమార్థము అనుసంధింపఁ దగియే యున్నది. ఛందోనుభవము తన్నిర్మాణ మూలద్రవ్యానుభవ సహితమయియే యుండును.

సేంద్రియమైన దేహము, మనస్సు, వేదనములకు[34] అధిష్ఠానములుగాఁ జెప్పఁబడినవి. కనుక సర్వవేదనలు ప్రశ్లిష్టములై యుండును. శాబ్దవేదనయు నట్టిద. Stout అను మనస్తత్త్వవేత్త యిట్లనుచున్నాఁడు :

"The impact of sound waves produces not only auditory sensations but also tactile sensations due to vibrations set up in the external ear and in other parts of the organism.

Hence sound experiences are intimately connected not only with auditory sensations but also with tactile and other sensations.

So sounds are said to be soft, sweet etc."[35]

శాబ్దవేదనము మార్దవపారుష్యాది త్వాచవేదనలతోడను, మాధుర్యకాటవాది రాసనవేదనలతోడను గూడియే యుండును. ఈ విషయమున అభినవగుప్తుల యభిభాషణ మిట్లున్నది .

"వర్ణానామపి శ్రుతిసమయోపలక్ష్యమాణార్థానపేక్ష్యపి శ్రోత్రైకగ్రాహ్యో మృదుపరుషాత్మా స్వభావో రసాస్వాదే సహకార్యేవ । ...శ్రోత్రైకగ్రాహ్యోఽపి చ స్వభావో రసనిష్యందే వ్యాప్రియత ఏవ అపదగీతధ్వనివత్, పుష్కరవాద్యనియమిత విశిష్టజాతికరణ ప్రఘూద్యనుకరణ శబ్దవచ్చ."[36]

అర్థానపేక్షియై శ్రుతిసమయమునం దుపలక్ష్యమాణమగుచున్న మార్దవమాధుర్యాదిగుణము శబ్దమునకుఁ గలదు. అట్టిగుణము శ్రోత్రేంద్రియైకగ్రాహ్యమే యయ్యు రసాస్వాదమున సహకారియే యగుచున్నది. అపదగీతమందలి ధ్వనియు, పుష్కరవాద్యమందలి యనుకరణరూపమైన ప్రఘూదిశబ్దమును స్వస్వగుణములను రసనిష్యందమున వ్యాపింపఁజేయుచునే యున్నవిగదా కనుక ఛందముకూడ తన్నిర్మాణమూలద్రవ్యమైన వ్యంజనముయొక్క గుణముతోఁగూడియే అనుభూత మగుచున్నది.

వర్ణములయొక్క సంతాపక నిర్వాపక స్వభావములను గుఱించి అభినవు లింకను నిట్లనిరి ;

"స్వభావతో హి కేచన వర్ణాః సంతాపయంతీవ
నికృతంతీవ రేఫ కకారాదయ ఇవ పరుషవృత్తిపూర్వకాః ।
అన్యేతు నిర్వాపయంతీవ ఉపనాగరికోచితాః ।
లోకగోచర ఏవాయమర్థః స్వసంవేద్యోఽపి."

నాట్యశాస్త్రము XVI. పుట. 339.

మమ్మట, విశ్వనాథ, పండితరాయాది రసదార్శనికు లందఱును ఈయంశమును గుర్తించి సంతాపకనిర్వాపక వర్ణవివేకము యథామతి కావించియేయున్నారు. ఉచ్చార్యము, శ్రవ్యము నైన ఛందము స్వనిర్మాణద్రవ్య స్వభావమునుబట్టి యుచ్చారయితకు, శ్రోతకుఁగూడ ఖేదమోదములు గలిగించును.

"తస్మా ద్వర్ణోచ్చారణప్రయత్నేన పరుషపఠనస్పర్శజనితో యః ఖేదః ఉచ్చారయితుః స ఏవ శ్రోతురపి పారుష్య మాధత్తే"[37] ఛందమునకుఁగూడ అభినవుల యీ యభిభాషణము వర్తించును. E. D. Puffer పండితురా లీయర్థమునే యిట్లు వివరించెను :

"The main point to be noticed in the enumeration of expressive qualities of sounds, is that it is the movement in utterance which characterises them. That movement tends to reproduce itself in the hearer and carries with it its feeling tone of ease or difficulty, explosiveness or sweetness . ... ..."[38]

దుష్యంతుని బాలక్రీడలను, యౌవనగర్వమును నన్నయ రెండుపద్యములందు వర్ణించెను :

కం॥ బాలహరిణములఁ బట్టెడు
లీలను విషమాటవీచలిత కేసరి శా
ర్దూలేభ శరభములఁ దన
బాలత్వమునంద యెగిచి పట్టుచు మఱియుఁన్.

ఆది. VI.-8.

కం॥ ఉర్వీరుహ నివహముతోఁ
బర్వతములు పెఱికి యొండు పర్వతములపైఁ
బర్వఁగ వైచుచు యౌవన
గర్వంబున నొప్పె నుర్విఁ గడు నధికుండై.

ఆది. VII-7.

ఈ రెండును గందపద్యములే యైనను వీని యుచ్చారణ శ్రవణములవలనఁ గలుగు ననుభవములు భిన్నములగుట ప్రత్యక్షముగఁ దెలియుచునే యున్నది. అనుభవ భేదమునకుఁ గారణము నిర్మాణద్రవ్య స్వభావభేదమే.

## 8. అక్షరము :

అక్షరశబ్దము వివిధముగ నిర్వచింపఁబడియున్నది. వర్ణము, అక్షరము అభిన్నములుగ వ్యవహరింపఁబడుచున్నవి. ఐనను వర్ణము, అక్షరము సన్నపదములు భిన్నార్థములే యనవలసి యున్నది. అక్షరము లనఁబడుచున్న వన్నియు వర్ణములు కావు. క్ర, కర్ అక్షరములే కాని వర్ణములు కావు.

"అక్షరం న క్షరతి న క్షీయతే వా"[39]

"అక్షరం న క్షరం విద్యాత్, అశ్నోతేర్వా సరోఽక్షరం"[40]

"న క్షరంతీ త్యక్షరాణి : క్షరణ మన్యాంగతయా చలనం"[41]

క్షరముకానిది, క్షయములేనిది అక్షరము. వ్యాప్త్యర్థకమైన అశ్ ధాతువునకు సరప్రత్యయముచేరి అక్షరశబ్దము నిష్పన్నమైనది. క్షరణమనఁగా అన్యమున కంగమై చలించుట అన్యాంగత్వము పొందకుండ స్వయముగనే చలింపఁగలది అక్షరము.

"స్వయం రాజంతే స్వరాః । అన్వగ్భవతి వ్యంజనం"

స్వయముగ రాజిల్లునది స్వరము, దాని నాశ్రయించి గమనముచేయునది వ్యంజనము. కనుక "స్వరోఽక్షరం"[42] "వ్యంజనం స్వరాంగం"[43] అని నిర్ణయింపఁబడినది.

"అక్షరం వర్ణనిర్మాణం వర్ణమ ప్యక్షరం విదుః"

వర్ణము, వర్ణములచేనైన నిర్మాణము – ఈరెండును అక్షరములే. అక్షరములు అనఁదగిన వర్ణములు స్వరములే. వర్ణమునకు అర్ణమనియుఁ బేరుకలదు. అర్ణశబ్దము గత్యర్థకమైన ఋధాతువునుండి నిష్పన్నమైనది. స్వయంగమనసమర్థమైన వర్ణమే – స్వరమే అర్ణము. కనుక స్వరము, స్వరవ్యంజన నిర్మాణము అక్షరములు. అనఁగా సాంగము, నిరంగమునైన స్వరమే యక్షరము.

"స్వరో ఽక్షరం; సహాద్యై ర్వ్యంజనైః;
ఉత్తరై శ్చావశిష్టైః,"

వాజస. ప్రాతి. 1–99–101.

పూర్వోత్తరభాగములందు వ్యంజనములతోఁగూడిన స్వరము అక్షరము. కనుక వ్యంజనము అక్షరాంగమను న్యాయముకూడ ఏర్పడినది.

'అచ్' ప్రత్యాహార సంగ్రహీతములయిన స్వరములు 'హల్' ప్రత్యాహారసంగ్రహీతములయిన వ్యంజనములతోఁ గూడియు, కూడకయు అక్షరము లనఁబడుచున్నవి. నిరంగమైన యక్షరము వర్ణము. సాంగమైన యక్షరము వర్ణనిర్మాణము. స్వరములు, వ్యంజనములు నానావిధములై యున్నవి గనుక వానివలన నైన నిర్మాణములుకూడ నానావిధములై యుండుట సహజము. నానావిధములయిన యక్షరములు ఛందమునకు అంగములు – గమనసాధనములు.

సాంగమైనను, నిరంగమైనను అక్షరము ఏకప్రయత్నోచ్చార్యమయిన శబ్దపుంజము. ఆంగ్లమున అక్షరము Syllable అనఁబడును. Syn = together, Lambeno = take: అనఁగా సముచ్చరణము – ఏకోచ్చరణము.

"A single or articulated vocal sound, that which is uttered in a single voice impulse; a word or part of a word that is capable of separate and complete enunciation by one voice-impulse. A sound ending with a vowel is called an open syllable; one ending with a consonant is called a closed syllable." —Standard Dictionary.

ఏకప్రయత్నోచ్చార్యము – ఏకప్రాణస్పంద నిష్పాద్యమునైన శబ్దపుంజము అక్షరము. అది పదము కావచ్చును, పదాంశము కావచ్చును. అక్షరములు స్వరోదయములు, స్వరోపధములు నని రెండువిధములు. స్వరాంతములు స్వరోదయములు, వ్యంజనాంతములు స్వరోపధములు.

వ్యంజనము స్వరాంగము, అక్షరాంగము ననఁబడినది. వ్యంజనముయొక్క యీ ద్వివిధమైన యంగత్వము భిన్నధర్మములు గలదనియే భావింపవలసియున్నది. స్వరము వ్యంజనమును పూర్వాంగముగా, ఉత్తరాంగముగా గ్రహింపవచ్చును.

"స్వరాధిరూఢాని వ్యంజనాని వర్తంతే"[44] అను నిరుక్తివచనమునుబట్టి వ్యంజనములు స్వరములచే అధిరూఢములై వర్తించునని తెలియుచున్నది. ఏ వ్యంజనములు స్వరముచే అధిరూఢములై వర్తించుచున్నవో ఆ వ్యంజనములు స్వరాంగములనుట యుక్తము. కొన్ని వ్యంజనములు తామే స్వరముల నధిరోహించి వర్తించును. అట్టి వ్యంజనములు అక్షరాంగములనుట యుక్తము.

ఎచ్చట స్వరోచ్చారణకాలమందే వ్యంజనోచ్చారణకాలము లీనమైయుండునో అచ్చట వ్యంజనమునకు స్వరాంగత్వము. క, క్రి యను నక్షరములందు కకార రకారముల యుచ్చారణము వాని నధిరోహించియున్న అకారముయొక్క ఉచ్చారణకాలమునందే లీనమగుచున్నది. కనుక కకార, రకారములు ఇచ్చట అకారమునకు అంగములు – స్వరాంగములు.

రజ్, రంజ్ అను నక్షరములందు రకారోచ్చారణము అకారోచ్చారణమున లీనమై యున్నది. మకార, జకారముల యుచ్చారణము అకారోచ్చారణము తరువాతనే జరుగుచున్నది. కనుక దానియందు లీనము కాలేదు. రకారము అకారముచే నధిరోహింపఁబడి యుండఁగా మకార జకారములు తామే అకారమును అధిరోహించియున్నవి. స్వరము నధిరోహించు వ్యంజనముల యుచ్చారణము స్వరోచ్చారణానంతరమే జరుగును. వర్ణక్రమన్యాయ మిదియేకదా. ఎచ్చట వ్యంజనోచ్చారణము స్వరోచ్చారణానంతరము జరుగునో అచ్చట వ్యంజనములకు అక్షరాఽంగత్వము ఉచితము.

అ, క, అక్, కక్ – అను తీరున నిరంగము, పూర్వాంగము, ఉత్తరాంగము, పూర్వోత్తరాంగము నని యక్షరము చతుర్విధముగా భావింపఁదగియున్నది.

స్వరము ప్రాణమనియు, స్వరసహితమైన వ్యంజనము ప్రాణియనియు వ్యవహరింపఁబడుచున్నవి. ప్రాణమనఁగా రజోవృత్తి యని సాంఖ్యసిద్ధాంతము. సత్త్వరజస్తమస్సులలో రజస్సు చలము, చాలకము నని చెప్పఁబడినది. సత్త్వము, తమస్సు రజస్సుచేతనే చలనవంతములు చేయఁబడును. వర్ణములలో అర్ణములయిన స్వరములు ప్రాణరూపములు – ప్రాణస్పందములు. సత్త్వతమస్సులు వ్యంజనరూపములు – జడములు – స్వరములచే నధిరోహింపఁబడికాని, స్వరముల నధిరోహించికాని వర్తించునవి. వ్యంజనములను స్వర మధిరోహించినప్పుడు వ్యంజనగతియు, స్వరగతియు స్వరాధీనములై యుండును. వ్యంజనములే స్వరము నధిరోహించియున్నప్పుడు స్వరగతి స్వాధీనముకాక వ్యంజనముచే నియతమై యుండును. వ్యంజనాంతములయిన యక్షరములు "Closed syllables" అనఁబడినవి. అంతమందలి వ్యంజనముచే స్వరవ్యాప్తి యరికట్టఁబడినది. ఇట్టి యక్షరములు ఛందఃపరిభాషయందు గురువులనఁబడినవి. వ్యంజనాధిరూఢమై యక్షరము భారమైనది.

ఇట్లు వ్యంజనపూర్వత్వమువల్ల, వ్యంజనపరత్వమువల్ల స్వరవ్యాపారమునఁ గలుగు భేదము స్పష్టము, పారమార్థికమునై యున్నది. ద్రవ్యవిశేషమువలనను, నిర్మాణవిశేషమువలనను అక్షరస్వరూపస్వభావములందు గణనీయమైన వైవిధ్యము సంభావ్యమగుచున్నది.

అక్షరనిర్మాణములందు త్రివిధములైన మానములు గుర్తింపఁబడినవి – దైర్ఘ్యమానము, భారమానము, కాలమానము.

"హ్రస్వం దీర్ఘం, ప్లుతం చైవ
త్రివిధం చాక్షరం స్మృతం"

నాట్యశాస్త్రము XIV–107.

హ్రస్వము, దీర్ఘము, ప్లుతము నని దైర్ఘ్యమానము నాశ్రయించి యక్షరము త్రివిధము.

ఏకమాత్రో భవే ద్ధ్రస్వః
ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే
త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయః
వ్యంజనం త్వర్ధమాత్రకం॥*

యాజ్ఞవల్క్య శిక్ష : 13.

హ్రస్వ మేకమాత్రికము, దీర్ఘము ద్విమాత్రికము, ప్లుతము త్రిమాత్రికము, వ్యంజన మర్ధమాత్రికము. మాత్రయనఁగా మానసాధనము – కాలమానసాధనము. "నిమేషోన్మేషాభ్యాం అన్యతరేణ తులితః కాలః మాత్రా" అని ఛందశ్శాస్త్రములందు నియమము. "ఏకమాత్రో భవేద్ధ్రస్వః" – ఇత్యాదికము అక్షరములయొక్క దైర్ఘ్యమాన కాలమానముల సంబంధము నిరూపించుచున్నది. † అక్షరముల దైర్ఘ్యమాన భారమానములకును ఇట్లే సంబంధము నిరూపింపఁబడినది.

| | | |
|---|---|---|
| "హ్రస్వం లఘు; | సి. కౌ. | 1-4-10 |
| సంయోగే గురు; | ,, | 1-4-11 |
| దీర్ఘం చ; | ,, | 1-4-12 |
| హలో ఽనంతరా స్సంయోగః" | ,, | 1-1- 7 |

ఇచ్చట వివరణ మిట్లున్నది :—

"అజ్భి రవ్యవహితాః హలః సంయోగసంజ్ఞాః స్యుః । సంయోగే పరే హ్రస్వం గురు సంజ్ఞం స్యాత్." అచ్చులచేత వ్యవహితములుకాని హల్లుల యోగము సంయోగము. అట్టి సంయోగముపరమైనప్పుడు హ్రస్వము గురువనఁబడును. 'దీర్ఘం చ' అనుటచే దీర్ఘముకూడ గురు వనఁబడును.

కేవల హ్రస్వము లఘువు
సంయోగపర హ్రస్వము గురువు
కేవల దీర్ఘముకూడ గురువు

* "హ్రస్వార్ధకాలం వ్యంజనమ్ – యథా సమ్రాట్"
అని తైత్తిరీయప్రాతిశాఖ్యము (i : 37)

† "హ్రస్వో దీర్ఘః ప్లుత ఇతి
కాలతో నియమా అచి"

అని పాణిని తన శిక్షయందు (11) హ్రస్వత్వాదులు అచ్చునకు కాలమునుబట్టి చేయబడిన నియమములని వివరించెను.

అని యింతవఱకే పాణిని గురుదీర్ఘ సంబంధము తెలియఁజేసెను. పాణిని యుపదేశించిన స్వరములు ___

| | | | |
|---|---|---|---|
| అ | ఇ | ఉ | ణ్ |
| ఋ | ఌ | | క్ |
| ఏ | ఓ | | ఙ్ |
| ఐ | ఔ | | చ్ |

వీనిలో అ ఇ ఉ ఋ ఌ హ్రస్వములు – ఏకమాత్రికములు. ఇవియే సవర్ణపరత్వమున దీర్ఘములు – ద్విమాత్రికము లగును. ఏ ఓ లు స్వయముగ దీర్ఘములు. ఐ ఔ లు వృద్ధు లనఁబడినవి. వీనియందలి వృద్ధియేమి ? మాత్రావృద్ధియని మహర్షి చెప్పలేదు గనుక మన మనుటకు వీలులేదు. ఐ ఔ లు త్రిమాత్రిక ప్లుతములని నందికేశ్వరాదులు భావించినట్లే తెలియుచున్నది. హ్రస్వమునకు స్వరపరకత్వమువలన దీర్ఘత్వము సిద్ధించినట్లు ప్లుతత్వము కూడ సిద్ధించుననియే తలంపవచ్చును. *

స్వర్గమునకు స్వరపరకత్వమువలన దీర్ఘత్వము సిద్ధించినట్లు వ్యంజనపరకత్వమువలన గురుత్వము సిద్ధించుచున్నది. సిద్ధించుచున్న దైర్ఘ్యమునఁ బ్రమాణభేద మున్నట్లు గురుత్వమునను బ్రమాణభేద ముండుట సహజము; ఉండుననుట సమంజసము.

సంయోగపరత్వమువలన హ్రస్వము గురువగునని చెప్పెనేకాని దీర్ఘమేమగునో పాణిని చెప్పలేదు. దీర్ఘము స్వయముగనే గురువని చెప్పెనేకాని సంయోగపరత్వమువలన నది గురుతరమగునని యాయన చెప్పలేదు. సంయోగపరత్వమువలన లఘువైన హ్రస్వమే గురువగుచుండఁగా స్వయము గురువైన దీర్ఘము గురుతరమగునని చెప్పవలసియే యున్నది. ఆమాటకుఁ శాస్త్రమునఁ బ్రయోజనములేక పాణిని చెప్పకుండవచ్చును. కాని ప్రాతిశాఖ్యములు చెప్పినవి.

---

* నందికేశ్వరుఁడు 'రుద్రడమరూద్భవ సూత్రములు' అను గ్రంథమున మాహేశ్వర సూత్రములను గుఱించి వ్రాసిన యంశములను Dr. K. G. Panday యిట్లు సంగ్రహించెను.

అ ఇ ఉ – ఏకమాత్రాకములు

ఏ ఓ – ద్విమాత్రాకములు

ఐ ఔ – త్రిమాత్రాకములు

ఈ యేదే అచ్చులు. ఇవి సప్తస్వరోపలక్షకములు. Ind. Aesth. P 528

"గురు దీర్ఘం గరీయస్తు
యది సవ్యంజనం భవేత్
లఘు సవ్యంజనం హ్రస్వం *
లఘీయో వ్యంజనా దృతే."

ఋక్. ప్రాతి. 18 : 11–44

అక్షరముల భారమానము ద్వివిధమని ఛందోవ్యాకరణశాస్త్రములు చెప్పుచుండఁగా, చతుర్విధమని ప్రాతిశాఖ్యము చెప్పుచున్నది. చాతుర్విధ్యమే యనుభవసాక్షికము. ద్వైవిధ్యము శాసనలాఘవదృష్టితో భావింపఁబడినది.

ఛందశ్శాస్త్రములందు అక్షరముల భారమానమునకు, కాలమానమునకుఁగూడ సంబంధము నిబంధింపఁబడినది. "హే"[45] "లౌ సః"[46] అను సూత్రములచే పింగళముని గురువు ద్విమాత్రికమనియు, నది రెండులఘువులకు సమానమనియుఁ బ్రతిపాదించెను. ఈ ప్రతిపాదనము సార్వత్రికము కాదు. అక్షరచ్ఛందములందు దీనికేమియుఁ బ్రయోజనములేదు. ఇది మాత్రాచ్ఛందములకు మాత్రమే పరిమితము. శార్దూలచంపకాద్యక్షరవృత్తములందు గురువుండవలసిన చోట రెండులఘువుల నుంచుటకు వీలులేదు. అట్లుంచినచో వృత్తభంగదోషము సంభవించును. మాత్రాసంఖ్యతోఁ బనిలేని శార్దూలాది వృత్తములందును, సీసగీతాద్యుపజాతులందును గురువు ద్విమాత్రికమను మాటకుఁ గూడ ప్రయోజనములేదు. వానియందలి గురువుల మాత్రాప్రమా

* ఏకవ్యంజన పరమైన హ్రస్వము లఘువని ప్రాతిశాఖ్యము చెప్పుచున్నది. పాణిని యభిప్రాయము నిదియే. "ఇజాదేశ్చ గురుమతో అనృచ్ఛః" (2-1-26) అను 'ఆమ్' ప్రత్యయవిధాయక సూత్రము నందలి గురువు దీర్ఘము. "గురోశ్చ హలః" (3-3-103) అను 'అ' ప్రత్యయవిధాయక సూత్రమునందలి గురువు సంయోగపరహ్రస్వము. "పిడ దాహే" (ధ్వా. 270), "హుడి సంఘాతే" (ధ్వా. 269) అను ధాతువుల పిడ్, హుడ్ అను రూపములు గురువులు కావు. "ఇదితో నుమ్ ధాతోః" (7-1-58) సూత్రముచే 'నుమ్' రాగా నేర్పడిన పిండ్, హుండ్ అను రూపములు గురువులు.

నన్నయ్యయు నీ యభిప్రాయమునే అంగీకరించెను. "లఘ్వ్యకాక్షర పూర్వక్రియాంతమ స్యానయో భవేదిద్వా" అను చింతామణియందలి 78 సూత్రము ననుసరించి వఛ్, వన్ ఇత్యాదులు గురువులు కావు. కనుకనే వఛించు - వఛియించు అనుతీరున రెండురూపము లేర్పడును. వర్ణ్, రంజ్ - ఇత్యాదులు గురువులు. కనుక వర్ణించు, రంజియించు అను రూపములు ఏర్పడవు.

చిన్నయసూరికిఁ గూడ ఈ మత యభిమతమే. "గురువిరహితంబులయి యియాంతంబు లయిన యేకస్వరద్విస్వరంబుల యించుగ్వర్ణంబుల కియుఁడాగమంబు విభాషనగు" (బాల. క్రియా. 50) అను సూత్రము ననుసరించి 'ఇుక్' మున్నగు ఏకవ్యంజనపరహ్రస్వములు గురువులు కావు.

శబ్దశాస్త్రవేత్తల మత మిట్లుండఁగా ఛాందసికులు వ్యంజనాంతమును గురువుగాఁ బరిభాషించుచుయెకాక అట్టి గురువుకూడ ద్విమాత్రికమే యనుటయందు సామంజస్యము కానరాదు.

ణము ననుసరించియే యుండును. మాత్రాచ్ఛందములందు మాత్రమే గురువు గౌరవప్రమాణ నిరపేక్షముగ ద్విమాత్రికముగా గ్రహింపఁబడవలసియున్నది. తాలావృత్త్యాత్మకములై గేయము లయిన ఛందములందు తాలశుద్ధికొఱకు ఈకల్పన యగత్యమగుచున్నది. జయదేవచ్ఛందము నకు వ్యాఖ్య రచించిన హర్షటుఁడు స్పష్టముగ నిట్లుతెలిపెను.

''ద్విమాత్రో ఒసౌ''[47] అను సూత్రమును వ్యాఖ్యానించుచు హర్షటుఁ డిట్లనెను— ''దీర్ఘో హి గురుః యః స స్వత ఏవ ద్విమాత్రః । అతో న తదర్థ మిదం వచనం । తథాచ తత్రభవంత ఆహుః—

'ద్విమాత్రతా న దీర్ఘాఖ్యా
శిష్టయో స్త్వతిదిశ్యతే
మాత్రావృత్తేషు సంఖ్యాతుం
మాత్రాః సా చోపయుజ్యతే.'

హ్రస్వప్లుతరూపో ఒసౌగురుః ద్విమాత్రో వేదితవ్యః । అతిదేశార్థ మిదం । హ్రస్వ ప్లుతౌ ద్విమాత్రవత్ భవతః ఇత్యర్థః । ఆర్యావైతాలీయాదౌ మాత్రాణాం గణనార్థం ।''

ఛాందసికుల యతిదేశస్వరూప మిచ్చట స్పష్టముగ దర్శింపనగుచున్నది అతిదేశ మనఁగా నన్యధర్మముల నన్యమునం దారోపించుట. దీర్ఘము స్వయముగనే ద్విమాత్రము. ద్విమాత్రతయేకదా దీర్ఘత. దీర్ఘధర్మమైన ద్విమాత్రత త్రిమాత్రికమైన ప్లుతమునందును, ఏకమాత్రికమైన పాదాంతహ్రస్వమునందును, వ్యంజనపరకమైన హ్రస్వమునందును ఆరో పింపఁబడి యివియన్నియు ద్విమాత్రికములే యని చెప్పఁబడుచున్నవి. ఈ యతిదేశము ఆర్యా వైతాలీయాది మాత్రాచ్ఛందములయందు మాత్రాసంఖ్యను గణించి సరిపెట్టుకొనుటకు మాత్రమే ఉపయోగపడును, అక్షరవృత్తములం దీయతిదేశమునకుఁ బ్రయోజనములేదు. అక్షరచ్ఛందము లందు గురువు గురువే - అది భిన్నప్రమాణము. దీర్ఘము దీర్ఘమే - అదియు భిన్నప్రమాణము. అక్షరములు లఘువులు, గురువులు, గురుతరములు - హ్రస్వములు, దీర్ఘములు, ప్లుతములు. అక్షరచ్ఛందములం దివి యిట్లే గ్రహింపఁబడును. పాదాంతస్థ లఘువునందు మాత్రము ఛాంద సికుల ద్విమాత్రతాదిదేశము అక్షరచ్ఛందములందుఁగూడ క్వాచిత్కముగఁ బనిచేయును.

అక్షరచ్ఛందములందు గురు వుండవలసినచోట గురువే యుండవలయును. ఆ గురువు దీర్ఘమా, వ్యంజనపరహ్రస్వమా, ప్లుతమా యన్న యంశము ఛందశ్శాస్త్రమునకుఁ బ్రసక్తము కాదు. దీర్ఘముయొక్క దీర్ఘత్వము, గురువుయొక్క గురుత్వము ఏ ప్రమాణములలో నుండ వలెనన్న నిర్ణయము కవి చేసికోవలెను. రసాద్యర్థానుకూలముగా కవి పద్యనిర్మాణము చేసి కొనుట కనువుగా ఛాందసికులు గురుస్వరూపనిర్ణయము చేసిపెట్టిరి. గురువుండవలసినచోట

నిట్టి గురువే యుండవలయునని నిర్బంధింపక లాక్షణికులు కవికి రసానుకూలముగ నక్షరము నిర్మించుకొను స్వాతంత్ర్యమును ప్రసాదించిరి.

అక్షరమునుగూర్చి ఛాందసికులు చేసిన సూత్రములు ప్రధానముగా గురుస్వరూపనిర్ణాయకములే యైయున్నవి. "సంయోగే గురు, దీర్ఘంచ గురు" అని పాణినిచేసిన గురుస్వరూప నిర్ణయము ఛాందసికులచేఁ గ్రమముగ నెంతయో విస్తరింపఁబడినది.

'గంతే'[48] యను సూత్రముచే పింగళముని పాదాంత లఘువు గురు వగునని చెప్పెను. లఘువైన యక్షరము గురువగుటకు అనుభవసాక్షికమైన కారణమేదేని నుండవలయును గాని శాస్త్రకారుఁడు చెప్పినంతమాత్రమునఁ గాఁజాలదు. పాదాంతహ్రస్వము నుచ్చరించుటకు గురుప్రయత్న మవసరములేదు. ఈ యతిదేశము కేవల మనుభవవిరుద్ధము. పాదాంతమున దీర్ఘ ముండవలసినచోట హ్రస్వమున్నచో, ఆ హ్రస్వముతరువాత నొకమాత్రకాలము వ్యవధియిచ్చి యుత్తరపాదపఠన మారంభింపఁబడును. ఈ కాలవ్యవధానమువలన ఏకమాత్రికమైన హ్రస్వము ద్విమాత్రికమైన దీర్ఘముగా గణింపఁబడును. అంతియకాని హ్రస్వము నిష్కారణముగ గురువగు ననుటయందు సామంజస్యము కానరాదు. పాదాంతస్థ లఘువుయొక్క గురుత్వము "స్వవిశ్రాంతిజనిత కాలోపచయ లభ్యం''[49] అని యభినవులు చక్కగా వ్యాఖ్యానించిరి. ఐనను స్వవిశ్రాంతిజనిత కాలోపచయమువలన లఘువైన హ్రస్వము దీర్ఘమగునుగాని గురువు కాఁజాలదు. ఆ కాలోపచయము వ్యంజనాద్యుపాధికమైనప్పుడే గురుత్వము సంభవించును. అభినవులు దీర్ఘత్వమనుటకే గురుత్వమనియుందురు.

"ప్రాదివరః''[50] అను సూత్రమును హలాయుధభట్టు ఇట్లు వ్యాఖ్యానించెను – ''ప్ర ఇతి వ్యంజనసంయోగస్య ఉపలక్షణార్థ మేతత్. ఆదిశబ్దేన విసర్జనీ యానుస్వార జిహ్వామూలీ యోపధ్మానీయానాం గ్రహణం". 'ప్ర' యని వ్యంజనసంయోగము నుపలక్షించుట పాణిని "సంయోగే''యనుటవంటిదే. కాని 'ఆది' శబ్దముచే విసర్జనీయాదికము ఆకర్షింపఁబడునని హలాయుధభట్టు చెప్పుటకు హేతువు కనిపించదు. "ధీ శ్రీ స్త్రీ మ్"[51] – ఇత్యాది సూత్రములందు పింగళముని యుపయోగించిన గురువులన్నియు దీర్ఘములే. ఒక్క 'కింవద భ్'[52] అను సూత్రమందే ఆయన అనుస్వారపర హ్రస్వరూపగురువు నుపయోగించెను. కనుక ఆదిశబ్దము చేత అనుస్వారముమాత్రమే గ్రహింపవీలగుచున్నది. ప్రాకృతపైంగలమునఁగూడ గురునిర్వచన మిట్లేయున్నది —

''దీహో సంజుత్తపరో
బిందు జు ఓ పాడిఓ అ చరణాంతే
స గురు వంక దుమత్తో
అణ్ణో లహు హోఇ సుద్ధ ఏక్క అలో''        1–2.

దీర్ఘము, సంయుక్తపరము, బిందుయుతము, చరణాంతపతితము, నైన యక్షరము గురువు. అది ద్విమాత్రికము. అన్యమైన యక్షరము లఘువు, ఏకమాత్రికము, "అనుస్వారో విసర్గశ్చ ఃక ఃపౌచాపి పరాశ్రయా"[53] అను పాణినీయ శిక్షావచనము ననుసరించియు,

"సంయోగాయోగవాహపరో గురుః" 1-12.

అను జనాశ్రయుని నిర్వచనము ననుసరించియు హలాయుధభట్టు విసర్జనీయాదులను గ్రహించియుండును. తైత్తిరీయప్రాతిశాఖ్యమున —

"యద్వ్యంజనాంతం యదుచాపి దీర్ఘం
సంయోగపూర్వం చ తథానునాసికం
ఏతాని సర్వాణి గురూణి విద్యాత్
శేషాణ్యతోఽన్యాని తతో లఘూని" XXII-14

అని గురునిర్వచనము చేయఁబడినది. ఏకవ్యంజనాంతత్వముగూడ గురుత్వహేతువుగా గ్రహింపఁబడినది. 'వ్యంజనాంతం' అనుటవలన ఆ ఏకవ్యంజనము అవశిష్టము లేక పదాంతము నైయుండవలెను. రెండు స్వరములనడుమనున్న వ్యంజనములు ఏ స్వరమునకుఁ జెందు నన్న విషయమునఁ బ్రాతిశాఖ్యము లిట్లనుచున్నవి —

"వ్యంజనా న్యుత్తరస్యైవ స్వరస్య। అంత్యం తు పూర్వభాక్;
సంయోగాదిశ్చ వైవం చ :
ఋ ప్రా. XVIII. 33-35.

వ్యంజనములు సామాన్యముగ నుత్తరస్వరమునకే చెందును. అంత్యమైన వ్యంజనము మాత్రము పూర్వస్వరమునకే చెందును. సంయోగమునందలి మొదటివ్యంజనము వైకల్పికముగాఁ బూర్వస్వరమునకుఁ జెందుచుండును. కనుకనే ఏకవ్యంజనాంతమైన హ్రస్వముగురువగును. "ధ్రాది పరః" అను సూత్రమునందలి 'పరః' అను మాటకు 'అంతః' అనియర్థముకాదు. కనుకనే హలాయుధుఁడు 'ఆది' పదముచే ననుస్వారాదులను గ్రహించినట్లు వ్యంజనమును గ్రహింపలేదు. అనుస్వార విసర్జనీయములు అకారాదులతోడి యోగమువలననే స్వరూపవ్యక్తి పొందఁగలవు. ఇవి యెప్పుడును పదాంతమందే తప్ప పదాదియం దుండవు. కనుక పూర్వస్వరమునకే చెందినవై దానికి గుర్వుత్వము కల్పించును. అనంతరలాక్షణికుల నిర్వచనములను సంగ్రహించి హలాయుధుఁడుకూడ గురు నిర్వచనము గావించెను.

దీర్ఘం సంయోగపరం
తథా ప్లుతం వ్యంజనాంత మూష్మాంతం

సానుస్వారం చ గురు
క్వచి దవసానేఽపి లఘ్వంత్యం"

పిం. ఛ. శా.

"గతి రష్టవిధోష్మణః"* అను న్యాయమున ఊష్మశబ్దముచే విసర్జనీయ జిహ్వామూలీయ శ ష స ర కారములుగూడ గ్రహింపఁబడుచున్నవి.

ప్లుతము గురువని పాణినిగాని పింగళుఁడుగాని చెప్పియుండలేదు. "గురు దీర్ఘం ప్లుతం చైవ"[54] అని భరతముని ప్లుతముకూడ గురువే యనెను. దీర్ఘము గురువనినప్పుడు ప్లుతము గూడ గురువేయని చెప్పినట్లే. అయినను "గ్లౌ"[55] అను పింగళసూత్రమును వ్యాఖ్యానించుచు హలాయుధుఁడు "ప్లుతేనాత్ర వ్యవహారో నాస్తి"యని చెప్పెను. భరతజయదేవాదులు ప్లుతము కూడ గురువే యనిరి. వారి మార్గము ననుసరించి హలాయుధుఁడు తన గురునిర్వచనమునఁ బ్లుతమును చేర్చికొనెను పింగళుఁడు 'గ్లౌ' – గురువు, లఘువు నని యక్షరద్వైవిధ్యమును బ్రతిపాదించినను భరతముని ప్లుతముతోఁగలిపి యక్షరత్రైవిధ్యము విధించెను.

" త్రివిధం హ్యక్షరం కార్యం కవిభి ర్నాటకాశ్రయం
హ్రస్వం, దీర్ఘం, ప్లుతం చైవ పదబంధ సమాశ్రయం" 122
"హ్రస్వ దీర్ఘ ప్లుతానీహ యథాభావం యథారసం
కావ్యబంధే ష్వశేషేషు హ్యక్షరాణి ప్రయోజయేత్" 124

సర్వకావ్యబంధములందును యథాభావము, యథారసము కవులు ప్లుతము నుపయోగించి తీరవలెనని భరతముని నాట్యశాస్త్ర షోడశాధ్యాయమున నాదేశించియుండెను. మునిమతము ననుసరించి యభినవగుప్తపాదులు —

"ప్లుతస్యాప్యత్ర ప్రయోగో భవత్యేవ యథా-
యతోఽపి మానేన స ఏష మూఢో
ద్రోణారి రే యాతి పదత్రిలగ్నో౩.
స తు పాఠః దీర్ఘవత్ పఠితవ్యః ప్రయోక్తృ౩ త్రిమాత్ర ఏవ."

నా. శా. XVI.-107.

అని త్రిమాత్రికప్లుతప్రయోగము కావ్యములం దుండితీరునని చెప్పిరి.

"హా యను ధర్మరాజతనయా యను"

ద్రోణ II 242.

* "ఓ భావశ్చ వివృత్తిశ్చ శ ష సా రేఫ ఏవ చ
జిహ్వామూల ముపధ్మా చ గతి రష్టవిధోష్మణః" పాణినీయ శిక్ష – 14.

ఇందలి 'హా' 'యూ' లు ప్లుతములు. వానిని త్రిమాత్రికములుగనే యుచ్చరింపవలెను. ద్విమాత్రికములుగ నుచ్చరించినచో రసము వ్యక్తముకాఁజాలదు.

"ఓ హో తక్షక నిలునిలు మని"

ఆది II–235.

ఇచ్చట 'హో' మాత్రాగణనార్థము ద్విమాత్రికముగఁ బరిగణింపఁబడినను త్రిమాత్రిక ప్లుతముగ నుచ్చరింపఁబడవలెను. పెక్కు ఛందోనియమములు అర్థవశమైన యుచ్చారణమునకు లోఁబడియే యున్నవనుటకు పాదాంతలఘువుయొక్క వైకల్పికగురుత్వము, క్రమాక్షరపూర్వక గురువుయొక్క వైకల్పికలఘుత్వము నిదర్శనములు. రస, భాషానియమములకు లోఁబడియే ఛందోనియమములు పాలింపఁదగియున్నవి. అక్షరచ్ఛందములందు ప్లుతమునకుఁ ద్రిమాత్రా ప్రమాణము నిత్యమైయున్నది. ద్విమాత్రతాతిదేశము నిష్ప్రయోజనము.

పాదాంతస్థ లఘువునకు గురుత్వాతిదేశము పాణిని చేయలేదు. తన శాస్త్రమున కవసరమై పింగళుఁడు 'గంతే' (I–10) యని సూత్రించెను. ఈ యతిదేశము సార్వత్రికముకాదు గనుక భరతముని "తథాఽంత్యం చ లఘు క్వచిత్' అని యతిదేశమును క్వాచిత్కముచేసెను. క్వాచిత్కాతిదేశముగూడ గుర్వంతపద్యములకే – విశేషించి ద్వితీయ చతుర్థపాదములకే పరిమితమై యున్నది.

"యత్పాదాంతే లఘోరపి గురుభావ ఉక్తః తత్సర్వత్ర
ద్వితీయ చతుర్థ పాదవిషయం। ప్రథమ తృతీయ పాద
విషయం తు వసంతతిలకాదే రేవ "

అని విశ్వనాథ కవిరాజు సాహిత్యదర్పణ సప్తమపరిచ్ఛేదమున హతవృత్తత్వ రూపమైన దోషమును నిరూపించు సందర్భమున వివరించెను. 'యుక్పాదాంతే విశేషతః' అను న్యాయమున ద్వితీయచతుర్థచరణముల యంతములందుఁ బదచ్ఛేదము నియతముగనుక నచ్చటిలఘువును గొంతిపొడిగించి యుచ్చరించి గురువుగా సరిపెట్టుకొనవచ్చునని విశ్వనాథుని యభిప్రాయము కావచ్చును.

ఆంధ్రమున గుర్వక్షర నిర్వచనము దేశ్యపదస్వరూపదృష్టితోఁ జేయఁబడినది.

"దీర్ఘ స్సంయుక్తాద్యః
పూర్ణానుస్వారపూర్వవర్ణశ్చ
ఏతే గురవ శ్శేషాః
సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః,

అ. శ. చిం

అని వాగనుశాసనుని యనుశాసనము. ఆంధ్రచ్ఛాందసికు లందఱు నీ మార్గమునే యనుసరించిరి. కవిజనాశ్రయమున నాంధ్రుల యాదిచ్ఛాందసికుఁడు మల్లియరేచన గురునిర్వచన మిట్లున్నది —

గురువులు నిడుదలు, జడ్డ
క్కరముల బొట్టుల పిఱుందకడ నూఁదిన య
క్కరములు; పెఱయవి లఘువులు;

సంజ్ఞాధికారము.

పాదాంతలఘువునకుఁ గ్వాచిత్కగురుత్వమునుగూడ నాంధ్రలాక్షణికు లెవ్వరును జెప్పి యుండలేదు. దేశీయపద్యములు ఉపగణనిర్మితములు. అవి ప్రాయికముగ సూర్యగణాంతములు - అనఁగా నియతముగా లఘ్వంతపాదములు. కనుకఁ బాదాంతలఘువునకుఁ బాక్షికగురుత్వాతిదేశ మాంధ్రలాక్షణికుల కనవసరమైనది. అయినను సంస్కృతమర్యాద ననుసరించి కావలె నన్నయ్య యొక్కచోటమాత్ర మట్టి ప్రయోగము కావించిన ట్లగపడుచున్నది.

"వీరావతార ! సుకవిస్తుత ! నిత్యధర్మ
ప్రారంభ ! శిష్టజనపాలనసక్త ! రాజ
నారాయణాఖ్య ! కరుణారసపూర్ణ ! వీర
శ్రీరమ్య ! రాజకులశేఖర ! విష్ణుమూర్తి !

ఆది. II-240.

రాజరాజనరేంద్రునకు 'రాజనారాయణ' యను బిరుదమున్నట్లు నన్నయ సంబోధనల వలనఁ దెలియుచున్నది 'రాజనారాయణ' (ఆది. IV. 312) 'రాజనారాయణ' (సభా. I. 296) అని నన్నయ రాజరాజును సంబోధించెను. ఎట్లన దానినే 'నృపనారాయబిరుదాంక' (ఆర. V.-1) యని ప్రయోగించెను. బిరుదమునందలి 'జ' హ్రస్వమేకాని దీర్ఘముకాదని నన్నయ ప్రయోగములవలనఁ దెలియుచున్నది. ఉదాహృతమైన వసంతతిలకావృత్తమున ద్వితీయపాదాంతమున 'జ' వర్ణము దీర్ఘముగా ముద్రింపఁబడియున్నది. ఆదిపర్వషష్ఠాశ్వాసము యొక్కయు, సభాపర్వప్రథమాశ్వాసముయొక్కయు అంతములందలి పద్యములందు అట్లు దీర్ఘముచేయుటకు వీలులేదు. బిరుదము 'రాజనారాయణ' యనియే రూఢియగుచున్నది గనుక ఉదాహృత వసంతతిలకా ద్వితీయపాదాంతమందలి 'జ' వర్ణముకూడ హ్రస్వమేయైయుండవలెను. పాదాంతలఘువునకు వైకల్పికముగనైనను గురుత్వమును ఆంధ్రలాక్షణికులు విధించి యుండనందువలన నన్నయను ఛందోభంగదోషమునుండి రక్షించుతలంపుతో ముద్రాపకులు 'రాజానారాయణ' యని రాజరాజు బిరుదమును వికృతముచేసి ముద్రించియుందురు. తన ప్రభువు బిరుదమును వికృతముచేసి పద్యమున నిరికింపవలసిన యవసరము నన్నయ కేల కలు

గును? వికృతముచేయవలసిన యవసరములేని స్థానమునందే యావిరుడము నుంచి పద్యమును వ్రాయఁజాలఁడా? తెలుఁగుజాతి కాయన యాదికవి. తెలుఁగు లాక్షణికులెల్లరు నాయన నుప జీవింపవలసినవారే. ఆయననాఁటికిఁ దెలుఁగున ఛందోలక్షణగ్రంథములు పుట్టనేలేదు. ఆయ నకు మార్గము చూపినవి సంస్కృతకావ్యములు, సంస్కృతలక్షణగ్రంథములు. వానియందుఁ బ్రసిద్ధమైయున్న పాదాంతస్థ లఘువుయొక్క వైకల్పికగురుత్వము నాయన యవలంబించి యుదాహృత వసంతతిలకావృత్తమున 'రాజనారాయణ' యని 'జ' వర్ణమును హ్రస్వముగనే ప్రయోగించెనని భావించుట యుక్తము. *

'సంయోగే గురు', 'ధ్రాది పరః' అను సూత్రములు ధ్రాది సంయోగములు పరమైనంత మాత్రమునఁ దత్పూర్వలఘువునకు నిత్యముగా గురుత్వము గలుగునన్న భ్రాంతిని గలిగించు చున్నవి. నిజమున కట్టి గురుత్వసిద్ధి కూడ వైకల్పికమే. పింగళమునియే 'ప్రహ్రేవా' యని వికల్పసూత్రము చెప్పెనని పలువురనుచున్నారు. పింగళుని యష్టాధ్యాయియం దట్టి సూత్ర మున్నజాడ కానరాలేదు. కాని ప్రాకృతపైంగలమున మాత్రము—

" రహావంజణ సంజోఏ
పరే అసేసంవి హోఇ సవిహాసం" 1-5

ర, హ వ్యంజనముల సంయోగము పరమైనప్పుడు పూర్వలఘువునకు గురుత్వము సవి భాషమని చెప్పఁబడినది. ఈ యంశమునే హేమచంద్రుఁడు ఛందోఽనుశాసనమున 'అహ్రాది సంయోగే' (1-6) అని చెప్పెను. పూర్వలఘువును గురువుచేయఁజాలని సంయోగములకుఁ గేదారభట్టు 'క్రమము'లని పేరుపెట్టెను.

"పాదాదా విహ వర్ణస్య
సంయోగః క్రమసంజ్ఞితః
పరస్థితేన తేన స్యాత్
లఘుతాపి గురోః క్వచిత్. వృత్తరత్న. 1-10

---

* ఆంధ్రమహాభారతమును ఒక ప్రామాణికమైన రూపమున ప్రకటింపవలెనని ఉస్మానియా విశ్వ విద్యాలయము - ఆంధ్రశాఖ ప్రయత్నించుచున్నది. అందుకొఱకు సేకరింపఁబడిన తాళపత్ర ప్రతులలోఁ గొన్నింట ఈ వసంతతిలకా వృత్తముయొక్క ద్వితీయపాదాంతమున హ్రస్వ జవర్ణమే యున్నది.

"తెలుఁగునఁ బాదాంతలఘువు గురువగుట యశ్రుతచరము" అని వజ్ఝలవారు వ్యాకరణసంహితా సర్వస్వమున (I-70 పుట) వ్రాసినారు. వారు నన్నయప్రయోగమును గుర్తింపలేదు కాఁబోలు. చింతామణియందు సంస్కృతమర్యాద ననుసరించి గురుస్వరూపనిరూపణము చేసిన నన్నయ్య కావ్యమునం దిప్పట్ల సంస్కృతమర్యాద ననుసరించియే పాదాంతలఘువును గురువుగాఁ బరిగ ణించి యుండును.

పాదాదియైన సంయుక్తాక్షరము 'క్రమము' అనఁబడును. అట్టి యక్షరము పరమందున్నను నొకొక్కప్పుడు తత్పూర్వలఘువునకు గురుత్వము గలుగదు. రహసంయోగములేకాక యెట్టి సంయోగములయినను పాదాదియం దుండినవైనచోఁ బూర్వలఘువునకు గురుత్వము గలిగింపఁ జాలవని కేదారభట్టు వికల్ప హేతువును విస్తృతముచేసినను క్వాచిత్కమని చెప్పి దాని ప్రయోజనమును సంకుచితముచేసెను. కేదారభట్టు గురువునకు లఘుత యగుననుటకంటె లఘువునకు గురుత కాదని చెప్పియుండవలసినది. లఘువు గురువగునుగాని గురువెన్నడును లఘువు కాఁజాలదు.

క్రమసంయోగ పరకత్వమున లఘువు గురువు కాకుండుటకుఁ గారణము ఉచ్చారణ శైథిల్యమే యని ఛందఃప్రకాశము చెప్పుచున్నది.

"యదా తీవ్రప్రయత్నేన
సంయోగాదే రగౌరవం
న చ్ఛందోభంగ ఇత్యాహుః
తదా దోషాయ సూరయః"

భోజమహారాజు సరస్వతీకంఠాభరణమున దీని నుదాహరించి అతీవ్ర ప్రయత్నమువలన సంయోగమునకుఁ బూర్వమందున్న లఘువునకు గురుత సంభవింపదని వివరించెను. అతీవ్ర ప్రయత్నమనఁగా శిథిలోచ్చారణము. గాఢోచ్చారణము గౌరవమునకుఁ గారణమగును. జయకీర్తి ఛందోఽనుశాసనమున నీ యర్థమును తేటగాఁ జెప్పెను.

"సంయోగపరోఽపి జాతు వర్ణః
శైథిల్యా ల్లఘుతా ముపైతి......" 1–5

సంస్కృతమునఁ గ్రమాక్షరపరత్వమున వైకల్పికముగ నిషేధింపఁబడిన గురుత్వము ఆంధ్రమున వాగనుశాసనునిచే నియత సందర్భములందు నిత్యముగ నిషేధింపఁబడినది.

"సంయుక్తే సంస్కృతాద్యే స్యాత్
సర్వ మంధ్రపదం లఘు
భవే దాద్యసమా సేఽపి
రేఫయోగాత్ పదం తథా"

ఆంధ్రశబ్దచింతామణి.

అక్షరమమట కీకారికయందు "పదము" అనఁబడినది. సంస్కృతపదాదియైన సంయుక్తాక్షరము పరమైనప్పుడు ఆంధ్రపదాంతమైన లఘువు లఘువుగనే యుండును. సంస్కృత సమాసములందుఁ గూడ రేఫసంయోగము పరమైనచోఁ బూర్వలఘువు లఘువుగనే యుండును.

ఈ రెండవయంశము వైకల్పికమని చెప్పియుండవలసినది. చింతామణి చేసిన యీ నియమ మతిక్రమించిన ప్రయోగములు భారతమునఁ గనఁబడలేదు

న క్షత్రయుతుండుగా శశిప్రకాశజయోన్నతమైన యష్టమిన్
ఆది. V. 94.

అవనిజమువలన నమ్మునీ
ప్రవరు పృథూత్సంగతలముపై వడిఁ బడియెన్.
సభా I. 140.

కృపకృతవర్మలం గడిమిఁ గిట్టి శిఖండిప్రభద్రకుల్ మహో
గ్రపువడిఁ దోడ్పడంగ భుజగర్వము సూపిన.........
శల్య. I. 221.

సంస్కృత సమాసగతములై, పూర్వలఘువునకు గురుత్వము గలిగింపని రేఫేతర సంయోగములు భారతమునఁ గనఁబడలేదు. సంస్కృత పదాదియందుండి, యాంధ్రపదాంత లఘువును గురువుగాఁ జేయని పెక్కుతీరుల సంయోగములు కవిత్రయ ప్రయోగములందు కలవు.

"భూ వినుతుఁడు ద్రోణుండు నిఖిలవేదవిదుండై"
ఆది. III. 78.

"అవసరజ్ఞుండయి వ్యాసుఁ డేతెంచె నంత"
ఆది. IV. 254

"దు ర్జనులగుచున్న క్షత్రియులఁ జంపుదు నంచుఁ బ్రతిజ్ఞ"
ఆది. III. 154.

"అది యోడి శతవిధంబులఁ బరిద్రుతయయి స్థలంబయిన"
ఆది VII, 122.

"పర్వుచు స్త్రీపర్వాదిక
పర్వంబుల నేనిటం గృపాయితమై స్త్రీ"
ఆది. I - 56.

వృత్తాంతము స్వప్నవృత్తముక్రియం దలపోసి
భక్తి సేయుదుఁ జూపుఁ బలుకును గోర్కియు
స్నేహంబు వింతగాఁ జేయనెపుడు
ఆది. V 300.

'చిత్తనాఁడు శ్రీగంధపుఁ జెక్కు స్వాతిఁ
దనకుఁ బ్రియమైన యది మేలు దాసమునకు''

అను. II. 378.

''అనఘ విశాఖ నెద్దనురాధఁ బైచీర
విను జ్యేష్ఠఁ దగఁ గటివేము గూర్చి''

అను. II. 279.

సంస్కృతపాదాది సంయోగములే కాదు; ఆంధ్రపదాది సంయోగములు గూడ తమకుఁ బూర్వమందున్న లఘువులకు గురుత్వము గల్పింపవు. విద్రుచు, ఇగ్రుచు మున్నగు పదము లందు పదమధ్య సంయోగము కూడ పూర్వలఘువును గురువుగాఁ జేయదు. ఇది తెలుఁగు యొక్క విలక్షణత.

"ద్విత్వమున కాదివర్ణంబు తెలుఁగునందు నూఁదకుండును"[56] ఇంతవఱకే అనంతుని మాట సత్యము. "వలసిన నూఁదియుండు" ననుట సత్యముగాఁ దోఁపదు. అయినను దీఁద వలసినపట్టు ఎట్టిన రచనయం దొకటి కనఁబడుచున్నది.

కం॥ పాయక పదియాతేండ్ల
ప్రాయమునందాక నరుల బాధింపుఁడు.

ఆది. V. 251.

దీనికి "పాయక పదియాతేడుల" అని పాఠాంతరము చూపఁబడినది.

ఛందఃశాస్త్రములు విధించిన గురుత్వము పెక్కు సందర్భములందు వైకల్పికమనియు, ఉచ్చారణ పరతంత్రమనియు, భాషావ్యవహారనియమములకు లోఁబడియుండునదనియు గుర్తింప వలెను. ఛందముయొక్క సౌష్ఠవము, శుద్ధి యుచ్చారణ శ్రవణములవల్లఁ దెలియఁదగినవే కాని లేఖనదర్శనములవలనఁ గాదు. వ్యవహారము, వ్యాకరణము, శిక్షాప్రాతిశాఖ్యములు బోధించిన తెలుంగున అర్థముయొక్కయు, వాక్కుయొక్కయు శుద్ధికి భంగము సంభవింపకుండునట్లు పద్యమును బఠించి యందలి యక్షరముల ప్రైర్ఘ్య గౌరవ లాఘవములవలన, వాని క్రమము వలన ఛందముయొక్క ఆహ్లాదన దీపనాది శక్తులను అనుభవపూర్వకముగ గ్రహింపవలెను.

ఛందోలాక్షణికులు నిబంధించిన గురుత్వహేతువులను పరిష్కరించి యిట్లు గ్రహింప వచ్చును :

1. సంయోగపరత్వము
2. విసర్జనీయాంతత్వము
3. ఉపధ్మానీయాంతత్వము
4. జిహ్వామూలీయాంతత్వము

5. అనుస్వారాంతత్వము
6. ఊష్మాంతత్వము
7. వ్యంజనాంతత్వము
8. పాదాంతస్థత్వము
9. దీర్ఘత్వము
10. ప్లుతత్వము.

వీనిలో చివరి మూఁడును దైర్ఘ్యమానములే. తక్కినవే గౌరవమానములు. 2 నుండి 7 వఱకుఁ గల హేతువులు నిత్యముగా గురుత్వము గలిగించునవి. 'అంతత్వ'బలముచే 'అవశిష్టం పూర్వస్య' అను నియమము ననుసరించి విసర్జనీయాద్యంతములయిన లఘువులు నిత్యముగా గురువులగుచున్నవి. అయితే పాణినిమతమున నిట్టివి గురువులు కావు. తైత్తిరీయ ప్రాతిశాఖ్యానుసార మివి లఘువులే యగుచున్నవి. ఛాందసికులుమాత్రము వీనినిగూడ గురువులని పరిభాషించిరి. గురుత్వతారతమ్యాపేక్షచే నిట్లు సంభాషించుట సమంజసమే యనవచ్చును. కాని యిట్టి గురువులుకూడ ద్విమాత్రికములే యనుట యక్షరచ్ఛందముల విషయమున మాత్రము సమంజసము కాదనవలసియున్నది.

గురువు ద్విమాత్రికమని పాణిని చెప్పలేదు. చెప్పకున్నను ఆయన యభిప్రాయ మదియే యని యూహింపవచ్చును. ఏకమాత్రికమైన హ్రస్వము అర్ధమాత్రికములయిన హల్లులు రెండింటితోఁగూడి మొత్తము రెండుమాత్రల ప్రమాణము పొందుట సహజము.* కాని ఏకవ్యంజనపరకమైన హ్రస్వముకూడ రెండుమాత్రల గురువే యగుననుట యసమంజసము. "వ్యంజనం త్వర్ధమాత్రకం" అనుట యక్షరచ్ఛందములందు పరమార్ధము. కేవలదీర్ఘము, వ్యంజనపరదీర్ఘము భిన్నపరిమాణములని యొప్పక తప్పదు.

* లాటిన్ ఛాందసికులుగూడ ఇట్టి యభిప్రాయమే కలవారని W. M. Liudsay చెప్పిన మాటల వలనఁ దెలియుచున్నది

"In Latin Poetry a syllable is scanned long even though it may have a short vowel, if the vowel precedes any consonant-group requiring a certain period of time for pronunciation. A long syllable of this kind is said to be long by 'Position'.

—The Latin Language : 129.

ఈ లాటిన్ సూత్రమును Allen Poe యిట్లు వ్యాఖ్యానించెను. "A vowel before two consonants is long". హ్రస్వమైన లఘువు దీర్ఘమైన గురువుతో సమానముకావలెనన్నచో దానివెంట కనీసము రెండు వ్యంజనము లుండవలెను. ఈ లాటిన్ సూత్రమందలి రహస్యమును Poe యిట్లు వివరించెను - "Of course it is not the vowel that is long (although the rule says so) but the syllable of which the vowel is a part."

—Principles of English Metre - p. 94.

| | |
|---|---|
| సంయోగపరహ్రస్వము | 2 మాత్రలు |
| వ్యంజనపరహ్రస్వము | $1\frac{1}{2}$ మాత్రలు |
| దీర్ఘము | 2 మాత్రలు |
| వ్యంజనపరదీర్ఘము | $2\frac{1}{2}$ మాత్రలు * |

ఈ మాత్రాప్రమాణ భేదములు పరమార్థములు. భిన్నప్రమాణములయిన యక్షరములచే నిర్మింపఁబడిన ఛందములు భిన్నప్రమాణములు గలవై భిన్నరసాదివ్యంజన సమర్థములై యుండును.

అక్షరములందు లఘుత్వ లఘీయస్త్వ గురుత్వ గరీయస్త్వములవలెనే హ్రస్వత్వ హ్రస్వీయస్త్వ దీర్ఘత్వ ద్రాఘీయస్త్వములు, తన్నిర్మాణ సామగ్రీ ప్రమాణానుసారులయి యనుభవసాక్షికముగా నున్నవి.

| | | |
|---|---|---|
| క, క్ర, క్త్ర | — | ఇవి లఘువులు |
| గం, గా, క్ష్మ<br>ప్రై, స్త్రై, స్థంభ్ | — | ఇవి గురువులు |

* అనంతామాత్యుని ఛందోదర్పణమునకు ఉపోద్ఘాతము వ్రాయుచు డాక్టర్ గిడుగు సీతాపతిగారిట్లనినారు — (పుట. 48)

"మాత్రాపరిమాణము అచ్చునుగూర్చి చెప్పవలెనేగాని వ్యంజనమునుగూర్చి చెప్పగూడదు". ఈ మాట యంగీకరింపఁదగినదికాదు. 'భ్ర' ఏకమాత్ర. 'భ్రన్' ద్విమాత్ర యనఁగదా లాక్షణిక మతము. 'భ్రన్' లోని అచ్చునుబట్టియే మాత్రాప్రమాణము చెప్పినచో నది ఏకమాత్రాకగురువు కాఁగలదా? 'భ్ర' కంటె 'భ్రన్' మాత్రాపరిమాణమును హెచ్చించుటకుఁ గారణమేమి? నకారమే కదా. మఱి వ్యంజనమునుబట్టి మాత్రాపరిమాణము చెప్పరానిదనఁగా నేమి? స్వరమునకైనను, వ్యంజనమునకైనను మాత్రాప్రమాణము దాని శ్రుతి వినిపించు కాలప్రమాణమునుబట్టి చెప్పవలెననుట పరమార్థము. 'వ్యంజనం త్వర్ధమాత్రకం' అని ప్రాచీనులు నిష్కర్ష చేసిరి. 'భ్రన్'లో నాలుగుశ్రుతులు — భ్, ర్, అ, న్ — కలవు. 'అ' మాత్రాకాలశ్రుతి. అది భ్, ర్ లను అధిరోహించియున్నది గనుక భ్, ర్ ల శ్రుతులు 'అ' శ్రుతియందే లీనములై యుండును. 'అ' యొక్క మాత్రాకాలమునందలి పూర్వార్ధమును 'భ'కారము, ఉత్తరార్ధమును 'ర' కారము ఆక్రమించియున్నవి. 'న్' శ్రుతిమాత్రము 'భ్ర' శ్రుతి యనంతరమే వినఁబడుచున్నది. అట్లు వినఁబడుట అర్ధమాత్రాకాలము. 'భ్రన్' శ్రుతి మొత్తము $1\frac{1}{2}$ మాత్రల కాలమే వినిపించును. కావలసినచో — మాత్రాఛందములందు న్ శ్రుతిని కొంత పొడిగించి 'భ్రన్'ను రెండు మాత్రల గురువును చేయవచ్చును.

"ఎప్పుడైనా ఉచ్చారణ ప్రయత్నమునుబట్టి అచ్చుకు మాత్రాపరిమాణము చెప్పవలెను" అను వాదమును సరికాదు. మాత్రాపరిమాణము అక్షరమునకుఁ జెప్పవలెను. కేవలము అచ్చునకుఁ గాదు.

కాని యీ లఘువుల లాఘవము, గురువుల గౌరవము ఏకప్రమాణము కాదని యుచ్చరించి, విని సులభముగ గ్రహింపవచ్చును. 'విద్యుద్దండము', 'నీలాకాశము' — ఈ రెండును గురులఘుక్రమమున నేకరూపములే యైనను వీని యుచ్చారణ శ్రవణములవలనఁ గలుగు ననుభవము లేకరూపములు కావనుట ప్రత్యక్షసత్యము.

ఉ॥ ఇద్దఱ హుంకృతిధ్వనులు నిద్దఱ ఘూరిభుజారవంబు న
య్యిద్దఱ ముష్టిఘాతజనితేద్ధ భయంకర నిస్వనంబు

ఉ॥ దారుణజానుదండమున దండధరప్రతిముండు భీకరా
కారుఁడు వాని వీఁపు విఱుగం బొడిచెం బిశితంబుతో

ఈ రెండును ఉత్పలమాలలే. రెండింటను గురులఘుక్రమ మొక్కవిధమే. అయినను ఈ రెండు పద్యములను విని శ్రోత పొందు ననుభవ మేకరూపమేయని చెప్పఁజాలముగదా. రెండవ పద్యముకంటె మొదటి పద్యము శ్రుతిపరుషముగ నుండుట యనుభవగోచర మగుచునే యున్నది.

ప్రాణరూపములయిన స్వరముల గమనము వాని యంగముల గౌరవలాఘవములపైఁ జాలవఱ కాధారపడియుండును. వ్యంజనబాహుళ్యము స్వరగతిని నిరోధించి మందీకరించును. ఛందముయొక్క గమనము దానియందలి స్వరవ్యంజనముల నిష్పత్తిపై నాధారపడియుండును.

ఉ॥ లాలితరూపయౌవన విలాసవిభాసినులైన యంబికాం
బాలికలన్ వివాహమయి భారతవంశకరుండు...

ఉ॥ నెట్టన నిట్టి యల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును గాలము, దీనికి నాఱుపెన్నడున్

ఈ రెండు పద్యములందును స్వరవ్యంజన నిష్పత్తి భిన్నముగా నున్నదనియు, దీర్ఘరూప గురువులచే మొదటి పద్యము ధారామధురముగ నడచుచుండ, సంయోగపరహ్రస్వరూప గురువులచే రెండవ పద్యము నిరుద్ధ వికృతగతి యగుచున్నదనియు స్పష్టము.*

---

* ఇట్టి స్థితిని పాశ్చాత్యులు 'Consonantal blockage' అందురు. "This (smoothness) is to be effected by a proportionate mixture of vowels and consonants and by tempering the mute consonants with liquids and semi-vowels" అని Dr. Jhonson అభిప్రాయము.

— Principles of English Metre : p. 107.

అనంతామాత్యుని గురులఘునిర్వచనమునం దిట్టి యభిప్రాయము గుర్తింపనగుచున్నది.

కం॥ వివిధముగఁ జాపి పలికెడు
నవియును మఱి యూఁది పలుకునవియును గురువుల్
భువి నిలిపిపలుకు వర్ణము
లవియెల్లను లఘువులయ్యె నంబుధిశయనా !

ఛం. ద. I-8.

వివిధముగఁ జాపిపలుకు నక్షరములుగల ఛందము సాగినడచును. వివిధముగ నూఁది పలుకు నక్షరములుగల ఛందము ఊఁదినడచును. వివిధముగ నిలిపిపలుకు నక్షరములుగల ఛందము నిలిచినడచును. ఈ మూఁడువిధములయిన యక్షరముల వలన ఛందమునఁ గలుగు గతిభేదములు పరమార్థములు.

లాక్షణికులు చేసిన నిర్ణయముల ననుసరించియే శిల్పియైన కవి యక్షరములందలి సూక్ష్మాతిసూక్ష్మ భేదములనుగూడ గుర్తించి నానావిధములయిన రసభావములను నిర్వహించుటకు సమర్థములగు తీరున వృత్తములు నిర్మించును.

అక్షరసమ్యగ్దర్శనము గల కవికి అక్షరములు కేవల గురులఘువులే కావు—

లఘు హ్రస్వములు (క) : లఘు దీర్ఘములు (కా)
హ్రస్వ గురువులు (కర్) : దీర్ఘ గురువులు (కార్)
అలఘు హ్రస్వములు (క్ర) : అలఘు దీర్ఘములు (క్రా)
అలఘు హ్రస్వ గురువులు (క్రం) ; అలఘు దీర్ఘగురువులు(క్రాం)

మున్నగు ననేకప్రకారములుగా గోచరించును. ఆయా రసములను భావించునప్పు డాయా రసముల నిర్వహణమునకు అనుకూలములైన యక్షరములు తామైవచ్చి యాతని ఛందములందు యథాస్థానముల నుపవిష్టములగును.

## 9. విధి:

విధియనఁగా విధానము - ఛందమందలి యక్షరముల కూర్పు.

"విధి ర్గణకృత శ్చైవ
తథా చార్థకృతోఽపి వా" నా. శా. XIV-108.

ఛందోవిధానము గణకృతముగాని అర్థకృతముగాని కావచ్చునని భరతముని చెప్పెను. అక్షరములను గణములుగా సంధించి వానితో పద్యమును విధింపవచ్చును. లేదా అక్షరములను

అర్థవంతములైన పదములుగాఁ గూర్చి, యా పదములతోఁ బద్యమును నిబంధింపవచ్చును. ఎట్లు విధించినను సిద్ధించు పద్యస్వరూపము సమానమే.

ఛందము నిబద్ధపదమని భరతముని చెప్పియుండుటవలన అక్షరబంధమైన ఛందము భంగ్యంతరమునఁ బదబంధముకూడ అగుచున్నది. పరమార్థమున ఛందమున బంధింపఁబడు చున్నవి పదములే – వట్టి యక్షరములు కాదు. గురులఘు నివేశవైచిత్రిచేఁ బదముల స్వరూపము పెక్కుభంగుల నుండును. ఇట్టి పదములు విశిష్టముగా నుపవిష్టములైన వాక్యములు శ్రుతి రంజకములుగా నుండును. ఏ పదబంధములు శ్రవ్యములో వానిని పరిశీలించి లాక్షణికులు వానికిఁ దమకుఁ దోఁచినతీరున లక్షణములు సూత్రించిరి. వారి తీరులు వేఱైనను లక్షింపఁబడిన వృత్తమందలి యక్షరక్రమము సర్వసూత్రములచేతను ఏకరూపముననే సిద్ధించుచున్నది. శార్దూల వృత్తమునకు :—

భరతముని లక్షణము :

"అంత్యం సప్తదశంచైవ షోడశం సచతుర్దశం
త్రయోదశం ద్వాదశం చ షష్ఠమష్టమమేవచ
త్రీణ్యాదౌ చ గురూణి స్యుః యస్మిం స్త్వేకోనవింశకే
పాదే లఘూని శేషాణి శార్దూలక్రీడితం తు తత్."

నా. శా. XV. 119-120.

పింగళముని లక్షణము :

"శార్దూలక్రీడితం మ్సౌ జ్సౌ తౌ గ్ ఆదిత్యఋషయః"

7-22

జనాశ్రయుని లక్షణము :

"శార్దూలక్రీడితం గు కు సృ జ్ నైః" 4-91

కేదారభట్టు లక్షణము :

"సూర్యాశ్వై ర్మసజ స్తతాః సగురవః శార్దూలవిక్రీడితం"

వృత్తరత్నాకరము 3-98

శ్రుతబోధ లక్షణము :

"ఆద్యం యత్ర గురుత్రయం ప్రియతమే షష్ఠం తతశ్చాష్టమం
సంత్యేకాదశత స్త్రయ స్తదనుచే దష్టాదశాద్యాంతిమాః

మార్తాండై ర్మునిభిశ్చ యత్ర విరతిః పూర్ణేందుబింబాననే
తద్వృత్తం ప్రవదంతి కావ్యరసికాః శార్దూలవిక్రీడితం"57

ఇట్లు ఒకే వృత్తమునకు భిన్నలాక్షణికులు భిన్నరీతుల లక్షణము నిబంధించిరి, నాట్యశాస్త్రము, శ్రుతబోధ అక్షరముల విన్యాసమును గురువు లేయేస్థానములం దుండవలెనో చెప్పుచున్నవి. పింగళ, జనాశ్రయుల లక్షణములందుఁ గొన్ని సంకేతములు కూర్పఁబడియున్నవి. కేదారభట్టు పింగళసంకేతములనే యవలంబించెను. ఆ సంకేతములు ఏక, ద్వి, త్రి, చతురాద్యక్షరములు, నియతగురులఘు నివేశములువైన పదస్వరూపములకు ఉపలక్షకములు. పింగళసంకేతములు వేఱు, జనాశ్రయ సంకేతములు వేఱు, పింగళశాస్త్రమున —

ధీ శ్రీ స్త్రీ — మ్
వ సు ధా — స్
క దా స — జ్
సా తే క్వ — త్
గురువు — గ్

ఆయన లక్షణము ప్రకారము సిద్ధించు శార్దూలవృత్తము—.

ధీశ్రీస్త్రీ । వసుధా । కదాస । వసుధా । సాతేక్వ । సాతేక్వ । గం.
మ్ స్ జ్ స్ త్ త్ గ్

'ఆదిత్యఋషయః' అనుటచే 12వ అక్షరమునను, పాదాంతమునను బదచ్ఛేదరూపయతి యుండును.

'ధీ శ్రీ స్త్రీ' – ఇత్యాదులను పింగళుఁడు త్రికములనెను. అనంతరలాక్షణికులు వీనిని నిసర్గగణములని పేర్కొనిరి.

జనాశ్రయ శాస్త్రమున —.

నూ నం సా — గ్
కు రు తే — ఉ
వి భా తి — క్
గం గా — స్
కృ శాం గి — ఋ
న దీ — జ్

ఆయన లక్షణముప్రకారము సిద్ధించు శార్దూలవృత్తము –

నూనంసా । కురుతే । విభాతి । కురుతే । గంగా । కృశాంగి । నదీ
గ్ ఉ క్ ఉ స్ ఋ జ్

'నైః' అనఁగా పంద్రెండవ యక్షరమున యతి. పాదాంతయతి నియతమే.

పింగళ, జనాశ్రయుల విభజనము యతిచ్ఛేదమువఱకు నొక్కతీరుగనే యున్నది. ఆమీఁదఁ గొంత భేదిల్లినది. నాట్యశాస్త్రము, శ్రుతబోధ చెప్పినలక్షణములం దిట్టి విభజనమే లేదు. నిర్దిష్టములయిన స్థానములందు గుర్వక్షరము లుండి తక్కినవి లఘువులై సచోఁ జాలును.

''ఆద్యం యత్ర గురుత్రయం ప్రియతమే షష్ఠం తతశ్చాష్టమం'' ఇత్యాది శ్రుతబోధ లక్షణమే లక్ష్యమునై యున్నది. లక్షణము ననుసరించినచో లక్ష్య మిట్లుండునని శ్రుతబోధ బోధించుచున్నది. పాదమందలి యక్షరములను త్రికములుగాఁగాని, అన్యథాకాని వర్గీకరింపవలె నని చెప్పుటలేదు. త్రికవ్యవస్థ పింగళకృతము. జనాశ్రయుని వ్యవస్థ మఱియొకవిధము. ద్వికత్రికాదికమైన యీ యక్షరగణనము లాఘవార్థమని భరతముని యనుచున్నాఁడు.

''త్ర్యక్షరాస్తు త్రికా జ్ఞేయాః లఘుగుర్వక్షరాన్వితాః
మాత్రాగణవిభాగస్తు గురులఘ్వక్షరాశ్రయః''

నా. శా. 14-87.

"ఏతేహ్యష్టౌత్రికా నామ్నా విజ్ఞేయా బ్రహ్మసంభవాః
లాఘవార్థం పునరమీ ఛందోమాన మవేక్ష్య చ" నా. శా. 14-123.

జనాశ్రయుఁడును నిట్లే యనెను —

"తే ద్వికచతుష్క షట్క త్రిక పంచక వర్ణకాః
వృత్తవిధానే గ్రంథలాఘవార్థం పరిగృహీతాః"

1. అధ్యా.

సూత్రీకరణ లాఘవార్థము శాస్త్రకారుఁడు కావించికొనిన యక్షరపిండములను కవి యథాతథముగ వృత్తమున నివేశింపనక్కఱలేదు. నియతస్థానములందు గురులఘ్వక్షరములు నిలుచునట్లు అర్థవశమునఁ బదములను వ్యవస్థాపించి పాదమును నిర్మించుకొనవచ్చును. పదచ్ఛేదరూపములయిన విరామములవలననే వృత్తపాదములం దక్షరపిండములు స్వరూపము ధరించును. ఆ పిండములందలి గురులఘు నివేశమునుబట్టి లయ భాసించును. అనఁగాఁ బద్యపాదగతి పదాధీనమై యుండునుగాని కృత్రిమములయిన గణముల యధీనమం దుండదు. పద్యము పదములుగా విఱుగును గాని గణములుగా విఱుగదు. విఱిచినచో అర్థభంగమై చిత్తముద్విగ్నమగును. వాక్యపరమార్థమే నష్టమగును. ఛందము వాక్యార్థమును పోషింపవలెనేకాని భంజింపరాదుగదా.

అల్పాక్షరములయిన వ్యస్తపదములతో నడచు వాక్యమెట్లు వక్తకు సుఖప్రయోజ్యము, శ్రోతకు సుఖానుసంధేయము నగునో అల్పాక్షరపిండములతో నడచు వృత్తపాదముకూడ అట్లే సుఖప్రయోజ్యము, సుఖానుసంధేయము నగును. బహ్వక్షరపద సంధానరూపములయిన సమాసములతోడి వాక్యమువలెనే బహ్వక్షరములయిన గురుపిండములతో నడచు వృత్తపాదము ప్రయోక్తకు, శ్రోతకు దుఃఖకరమగును;

వాక్యార్థము ఉద్వేజకమైనచో పాదనిర్మాణము బహ్వక్షరపిండాత్మకమై యుండవలయును. దీర్ఘసమాసభూయిష్ఠమైన వాక్యమునం దర్థానుసంధానమువలె బహ్వక్షరపిండాత్మకమైన పాదమున లయానుసంధానము దుష్కరము. అర్థము ననుసంధింపఁజాలక చిత్తము, లయ ననుసంధింపఁజాలక శ్రోత్రము నుద్విగ్నములగును.

మధురార్థములను లఘుప్రమాణ పిండములచేతను, ప్రసన్నార్థములను మధ్యప్రమాణ పిండములచేతను, దీప్తార్థములను గురుప్రమాణ పిండములచేతను ప్రతిపాదింపవలెను. అక్షర పిండదర్శనమున శ్రోత్రేంద్రియమునం దుత్పన్నమై, చిత్తమున సంక్రమించిన వృత్తి యర్థదర్శనముచే పుష్టము కావలయును. కనుక కవి ఛందోవిధానమును అర్థానురూపముగ చేయును - చేయవలెను. వృత్తపాదమందలి యక్షరముల నెట్లు వర్గీకరింపవలెనన్న యంశము కవి యిచ్ఛాధీనము - అనఁగా రసాద్యర్థాధీనము. గురులఘుక్రమముమాత్రమే శాస్త్రాధీనము. శ్రోతయుఁ గవి యుపదేశము ననుసరించియే యక్షరసమూహనము చేసి లయానుసంధానము చేయును. త్రికపిండీకరణము లాఘవార్థము లాక్షణికుఁడు కల్పించుకొనినదిమాత్రమే. ఛందము త్రికములచే నిర్మింపఁబడదు. ప్రయోగింపనుబడదు.

**“గొడుగుల పఱియలు గుఱుతులు గొనుటఁజ**
**సిడముల తునియలు సెదరి యునికిఁ బెం**

ఈ యక్షరబంధమునఁ గవి లయాధానము నెట్లుచేసెను? సహృదయుఁడు లయానుసంధానము నెట్లు చేయును? దీనియందు లయావభాసకమైన లక్షణమేది? ఛందశ్శాస్త్రము దీని లక్షణము నిట్లు నిర్దేశించినది ——

1. ఇది యతిశక్వరీచ్ఛందము.
2. పాదమునకుఁ బదునైదక్షరములు.
3. న న న న స గణములు.
4. ఎనిమిది యక్షరముల మీఁద యతి.
5. వృత్తనామము మణిగణనికరము.

అనంతుఁడు ననననస గణములని చెప్పెనుగాని కవిజనాశ్రయుఁడు పదునాలుగు లఘువులపై నొకగురువు అనిమాత్రమే చెప్పెను. కవిజనాశ్రయుని పద్ధతియే యుచితము. ఆయన

యక్షరములను వర్గీకరించి గతిని నిబంధింపలేదు. అనంతుఁ డాపనిచేసెను. త్ర్యక్షరవర్గీకరణముచేసి గతిని త్ర్యస్రముగా నియతముచేసెను.

గొడుగుల పఱియలు గుఱుకులు గొనుటఁ

పాదమునందలి పదునై దక్షరములను నిట్లు వర్గీకరించుట కవి యిచ్ఛ.

గొడుగు లపఱి యలుగు ఱుకులు గొనుటఁ

ఇది యనంతుని యిచ్ఛ. కవి యిచ్ఛ లాక్షణికుని యిచ్ఛతో సంవదించుటలేదు. కవి జనాశ్రయుని లక్షణము స్వేచ్ఛానుసారము లయను భాసింపఁజేయుటకు కవికి స్వాతంత్ర్య మిచ్చుచున్నది. అసలీ పద్యము మాత్రాచ్ఛందము. దీనియందలి యక్షరముల వర్గీకరణము చతుర్మాత్రాత్మకముగ నున్నచో అక్షరగతియందలి లయ భాసించును. పాదమునకు నాల్గేసి చొప్పున నుద్ధృతభాగమున నెనిమిది చతుర్మాత్రాకగణము లున్నవి. ఈ భాగమును —

గొడుగుల పఱియలు గుఱుకులు

గొనుటఁ సిడముల తునియలు నెదరియు నికిబెం

అనుతీరున వ్రాయవచ్చును. అప్పుడది కందపద్యమగును. కాని కవియుద్దేశమునం దిది కందపద్యముకాదు. మణిగణనికరమే. కనుకనే పాదవ్యవస్థ యట్లుండుట సహృదయుఁడు కవి యుపదేశించిన మార్గముననే పద్యలయ నాస్వాదించునుగాని లాక్షణికనిర్దిష్ట మార్గమునఁ గాదు.

"గొడుగుల పఱియలు గుఱుకులు గొనుటఁ

అనుతీరున పాదమందలి యక్షరములు నాలుగునాలుగుగా పదస్వరూపముల వర్గములు కట్టుచున్నవి. నాల్గేసియక్షరముల యనంతరము విశ్రాంతి యున్నది. అనంతుఁడు చెప్పినట్టు మూఁడేసి యక్షరముల యనంతరము విశ్రమించినచో నర్థము భంగమగును. యతిమైత్రికూడ చతురక్షర వర్గీకరణముతోడనే సహకరించుచున్నది చతురక్షర పదబంధములయిన యీ పాదములను సహృదయుఁ డట్లే పఠించి లయ ననుసంధించును. అనంతుని లక్షణ మీ పద్యమందలి లయను, అర్థమును భంజించునదై యనర్థకమగుచున్నది.

గణ్ ధాతువునకు లెక్కించుట యని యర్థము. వృత్తపాదమందలి యక్షరములను, మాత్రలను లెక్కించుటకొఱకై యేర్పడిన సాధనములు గణములు - సర్వగణములకు నక్షరములే బీజములు. పాదమందలి యక్షరగణనమును పాశ్చాత్యులు Scansion అందురు. Scando అను గ్రీకుధాతువునకు 'to climb' అని యర్థము. Scando అను పదమునకు ఖండనము, గణనము అని యర్థము చెప్పికొనవచ్చును. ఛందశ్శబ్దమును దానికి సమానార్థకముగా గ్రహింపరాదు. Henrie Fluchere చెప్పినట్లు :—

"Scansion is one thing and Prosody is another"[58] గణనము. లేక ఖండనము వేఱు, ఛందము వేఱు. ఛందము ఆహ్లాదకము, దీపకము. గణనముకూడ అట్టి ధర్మములనే నిర్వహింపవలసి యున్నది.

ద్వి త్రి చతురక్షర పిండములను పింగళుఁడుగాని జనాశ్రయుఁడుగాని గణములనుపేర వ్యవహరించియుండలేదు. త్రికములకు నిసర్గగణములని, చతుష్క పంచకములకు, ద్వికములకు ఉపగణములని పేళ్ళుపెట్టినవా రనంతరలాక్షణికులు.

"ల స్సముద్రాః గణః" 4–12

"గౌ గంత మధ్యాదిః స్లశ్చ" 4–13

అని పింగళముని చతుర్మాత్రాకములయిన గా భ జ స నలములనే గణములను పేర వ్యవహరించెను. *

"గణా శ్చతుర్మాః" 1–38

"పంచహా శ్చ" 1–39

అని జనాశ్రయుఁడు చతుర్మాత్రాకములు, పంచమాత్రాకములు నైన యక్షరపిండములనే గణములనుపేర వ్యవహరించెను.

ఆర్యా వైతాలీయ శీర్షకాది మాత్రాచ్ఛందములందు గురులఘు నివేశక్రమనిరూపణము కష్టసాధ్యమగుటచే మాత్రాసంఖ్యానియతములయిన యక్షరపిండములను వారు గణములని నిర్దేశించిరి. గణములు చతుర్మాత్రాకములు, పంచమాత్రాకములు, త్రిమాత్రాకములు – ఇట్లు మాత్రాసంఖ్యా నియతములయిన, గురులఘునివేశనియమ రహితములయిన యక్షరపిండములు. మాత్రాచ్ఛందములు తాలలయాశ్రయములు గనుక వానియందు తాలప్రమాణబద్ధములయిన యక్షరగణావృత్తులకుఁ బ్రాధాన్యముకలదు. నియతసంఖ్యాక మాత్రాప్రమాణములయిన యావృత్తులందు అక్షరములు గణములుగా నేర్పడవలసిన యవసరమున్నది. ఆవృత్తి యంతమందలి విశ్రాంతిచే లయ నిరూపింపఁబడును. "క్రియానంతర విశ్రాంతి ర్లయః"[59] అని న్యాయము. క్రియయనఁగా ఛందోవిషయమున నక్షరోచ్చారణము. అక్షరోచ్చారణక్రియ, ఉచ్చారణమునకుఁ గావలసినకాలము సమానములు కావలయును. అట్లగుటయే తాలము.

"తాలః కాల క్రియా మానం"[60] క్రియామానము, కాలమానము సమానములగుట తాలము.† "తాలాంతరాళవర్తీ యః కాల అసౌ లయనా లయః"[61] అను న్యాయమున కాలమాన

---

* "చతుర్మాత్రో గణఃస్మృతః" నా. శా. XV-198.

† "కాలో లఘ్వాదిమితయా క్రియయా సమ్మితో మితిం
గీరాదే ర్విదధత్ తాలః........" సంగీతరత్నాకరము : 5_3.

ప్రమితములయిన యుచ్చారణ క్రియాప్రమాణముల నడిమి విరామకాలమే సామ్యమువలన లయము అనఁబడుచున్నది. తాలావృత్త్యాత్మకములయిన మాత్రాచ్ఛందములందు లయ ద్రుతాది భేదములచే, త్ర్యసాదిభేదములచే నియతమై యుండును. అక్షరచ్ఛందములందలి లయ కవి యిచ్ఛానియతమై యుండును.

తాలావృత్త్యాత్మకములయిన మాత్రాచ్ఛందములు ఆంగ్లేయుల Song verses వంటివి. మాత్రాసంఖ్యానిష్ఠములయిన వీనిని Quantitative Verses అందురు. అక్షర సంఖ్యానిష్ఠము లయిన ఛందములను వారు Syllabic verses అందురు. మాత్రాచ్ఛందములు గేయములు. వానియందలి యక్షరవర్గములు గానానుకూలముగ నుండవలెను. అక్షరచ్ఛందములు పాఠ్యములు. వానియందలి యక్షరవర్గములు పాఠానుకూలముగ నుండవలయును. అభినవగుప్తపాదులు చెప్పినట్లు—

"కేషాంచిత్ దోధక తోదకాదీనాం గీయమానతయా
శోభాతిశయో భవతి। శ్లోకస్రగ్ధరాదీనాం తు పాఠేన"[62]

దోధకాది మాత్రాచ్ఛందములకు గానమువలనను, స్రగ్ధరాద్యక్షరచ్ఛందములకు పఠనము వలనను శోభాతిశయము గలుగును. కనుక మాత్రాచ్ఛందముల విధానము గానానుకూలముగను, అక్షరచ్ఛందముల విధానము పాఠానుకూలముగను నుండవలెను.

"విధి ర్గణకృత శ్చైవ
తథా చార్థకృతో౽పి వా" నా. శా. XIV.-109.

అని భరతముని ఛందోవిధి వికల్పనము ప్రతిపాదించుటయందలి యభిప్రాయ మిట్లు గ్రహింపవలసియున్నది - గేయములయిన మాత్రాచ్ఛందములందు విధానము తాలానుగుణము లయిన గణముల నాశ్రయించియు, పాఠ్యములయిన, యక్షరచ్ఛందములందు విధానము వస్తు రస భావాద్యర్థానుగుణములయిన పదముల నాశ్రయించియు నుండవలెను.

పద్యనిర్మాణమునఁ గవిగాని, పద్యపఠనమున సహృదయుఁడుగాని త్రికములను సాధన ములుగాఁ గైకొనకున్నను పింగళముని లక్షించిన త్రికములు అక్షరవిన్యాసవైచిత్రీ కల్పితము లైన గతివిశేషములకు ఉపలక్షకములుగా గ్రహింపఁదగియున్నవి.

సర్వగురువైన మగణమున విలంబితము, సర్వలఘువైన నగణమున ద్రుతము, ఆది గురువైన భగణమున అవరోహి, అంత్యగురువైన సగణమున ఆరోహి యైన గతిభేదము సులక్షణీయ మగుచున్నది. తక్కినవానియందు మధ్య మిశ్ర గతిభేదములు గుర్తింపనగుచున్నవి. ఆయా గణముల స్వరూపము పద్యపాదమున పునఃపునః గోచరించినచో ఆ పద్యములం దాయా గతిభేదములు స్ఫుటములగునని భావింపవలెను.

## 10. వృత్తము :

వృత్తమనఁగా పూర్ణమని యర్థము. పూర్ణత వృత్తలక్షణము. ఒకానొక యక్షరగతి విశేషము పునఃపునరావృత్తమై దేనియందు శ్రవ్యత పూర్ణమగునో అది వృత్తము.

> "ఏవం నానార్థసంయుక్తైః
> పాదై ర్వర్ణభూషితైః
> చతుర్భిస్తు భవే ద్యుక్తం
> ఛందో వృత్తాభిధానవత్." నా. శా. XIV-41.

నానార్థ సంయుక్తములు, వివిధ వర్ణభూషితములు, నిబద్ధాక్షరములు, యతిచ్ఛేద సమన్వితములునైన నాల్గుపాదములతోఁ గూడిన ఛందము వృత్తమనఁబడునని భరతముని యభిప్రాయము. వృత్తములు సమములు, అర్ధసమములు, విషమములునని మూఁడు విధములుగా నుండును.

"వృత్తం"[63] అను పింగళసూత్రమును వ్యాఖ్యానించుచు హలాయుధుఁడు "గాయత్ర్యాదౌ ఛందసి వర్తతే ఇతి వృత్తం; తచ్చ స్థిరగురులఘ్వక్షరవిన్యాస మిష్యతే" అని వక్కాణించెను. గాయత్ర్యాదిచ్ఛందములందు వర్తించు స్థిరగురులఘ్వక్షరవిన్యాసముగల యక్షరబంధములు వృత్తములనియు, గాయత్ర్యాది ఛందములందు వర్తించునవి గనుక అవి వృత్తము లనఁబడు ననియు హలాయుధుని యభిప్రాయము. స్థిరగురులఘువిన్యాసము లేని యక్షరబంధములు ఆతని యభిప్రాయమున వృత్తములు కాఁజాలవు.

"గురులఘునివేశనియమేన శ్రవ్యతా వర్తతే యేషు తాని వృత్తాని"[64] అని యభినవ గుప్తుల నిర్వచనము. గురులఘువులు యథోచితములుగ నివిష్టములగుటచే నే యక్షరబంధము లందు శ్రవ్యత వర్తించునో అవి వృత్తములు. అవి గాయత్ర్యాదిచ్ఛందములందు వర్తింప కున్నను వానియందు శ్రవ్యత వర్తించినచో అక్షరబంధములు వృత్తము లనిపించుకొనుటకు యోగ్యములగును. గురులఘునివేశము స్థిరము కాకున్నను శ్రవ్యతానియతమై యున్నచో అక్షర బంధము వృత్తమగును.

గాయత్ర్యాదిచ్ఛందములందు వర్తించునవి వృత్తము లనుటకంటె శ్రవ్యత వేనియందు వర్తించునో అవి వృత్తము లనుటయే యుచితముగా నున్నది. గాయత్ర్యాదులందు వర్తించు స్థిరగురులఘునివేశములయిన యక్షరబంధము లన్నింటను శ్రవ్యత వర్తించునని నియమములేదు. శ్రవ్యత వర్తింపని యక్షరబంధములను వృత్తము లనుట యసమంజసమే. శ్రవ్యత స్ఫుట ముగా వర్తించు అక్షరబంధములనే లాక్షణికులు వృత్తములుగా తమ లక్షణ గ్రంథములందు

నిరూపించిరి. శాస్త్రములు రూపించిన యక్షరబంధములందుఁగూడ శ్రవ్యత స్ఫుటతరముగా భాసించు కొన్నింటిని మాత్రమే కవులు తమ కావ్యములందు ప్రయోగించిరి.

శ్రవ్యత వృత్తసామాన్యలక్షణమే యైనను భిన్నవృత్తములందు వర్తించు శ్రవ్యత భిన్నవిధముగా నుండునని భావింపవలసియున్నది. శ్రోతృచిత్తమును ఆర్ద్రము, దీప్తము, ప్రసన్నము, సత్వరము, అలసము, క్షుబ్ధము, శాంతము చేయు నానాప్రకారములయిన శ్రవ్యతా విశేషములు – అనుభవవేద్యములు – సంభావ్యము లగుచున్నవి.

చంపకమాల, శార్దూలము, స్రగ్ధర – వీని శ్రవ్యతలు భిన్నములు. ఉత్సాహము, మత్తకోకిలము, లయగ్రాహి – వీని శ్రవ్యతలు భిన్నములు. ఆటవెలఁది, మధ్యాక్కర, తరువోజ – వీని శ్రవ్యతలు భిన్నములు. ఇట్లు నానావిధములయిన యక్షరబంధములందు నానావిధములయిన శ్రవ్యతలు అనుభవగోచరము లగుచున్నవి. పరమార్థమున శ్రవ్యతావృత్తిగల యక్షరబంధము లన్నియు వృత్తములే. ఇట్టి యభిప్రాయము గలిగియే గణచ్ఛందములకు, మాత్రాచ్ఛందములకు లక్షణములు నిబంధించిన కేదారభట్టు తన గ్రంథమునకు వృత్తరత్నాకరము అని నామకరణము చేసెను. ''వృత్త మక్షరసంఖ్యాతం జాతి ర్మాత్రాకృతా భవేత్''—[65] ఇత్యాదివివేకము లాక్షణికులకుఁ గావలసియుండవచ్చును. శ్రవ్యతాకామియైన శ్రోతకు అక్షరబంధమునఁ గావలసినది శ్రవ్యత. ఆ శ్రవ్యత కావ్యమందలి యర్థము నాస్వాదించుటకు ఉపకరించునదిగా నుండవలెనని శ్రోత యభిలషించును.

విశిష్టశ్రవ్యతావృత్తియైన యక్షరబంధము పునఃపునరావృత్త మగుటవల్ల శ్రోత్రేంద్రియము పూర్ణకామమగుటయే కాక శ్రోత్రేంద్రియద్వారమునఁ జైతన్యమునఁ గలుగు వృత్తి విశేషము స్థాయిత్వము పొంది వాక్యార్పితమైన యర్థము చక్కఁగా ననుభూతమగును. నానావిధములయిన యర్థముల యాస్వాదసౌష్ఠవమునకు నానావిధములయిన శ్రవ్యతలు యోగ్యములై యుండును.

విలక్షణశ్రవ్యతావృత్తులగు నక్షరబంధములను పెక్కింటిని గుర్తించి లాక్షణికులు వ్యవహారముకొఱకై వానికి స్వీయదర్శనానురూపములయిన నామకరణములు గావించిరి. భిన్నలాక్షణికులు ఒకే నామముచే భిన్నవృత్తములను, భిన్ననామములచే నొకే వృత్తమును వ్యవహరించినను అక్షరబంధమున శ్రవ్యత పరమార్థము. ఆ శ్రవ్యత యర్థరసానుకూలముగ నుండుట కవికర్మనైపుణ్య నిరూపకము. అక్షరబంధమున నర్థానురూపమైన శ్రవ్యతను రూపించుటయే ఛందశ్శిల్పము.

వృత్తనామములు కొన్ని యాదృచ్ఛికములు, కొన్ని యన్వర్థములు. అన్వర్థములయిన వానిలో రథోద్ధతము, మందాక్రాంతము, భుజంగప్రయాతము వంటి గతిసూచకనామములు, లయగ్రాహి, లయవిభాతి వంటి లయసూచకనామములు, మంజుభాషిణి, మానిని, మత్తకోకి

లము వంటి గుణసూచకనామములు, శార్దూలవిక్రీడితము, ఆటవెలఁది వంటి చేష్టాసూచక నామములు, చంపకమాల, మణిగణనికరము, విద్యున్మాల వంటి ద్రవ్యసూచకనామములు, ఉత్సాహము. తరలము వంటి చిత్తవృత్తిసూచకనామములు నున్నవి. వృక్ష పక్షి మృగ మనుష్యాది ప్రాణివాచకములు, శౌర్య గాంభీర్య మాధుర్యాది గుణవాచకములు, నేత్రప్రత్యక్షమూలకములు, శ్రోత్రప్రత్యక్షమూలకములు, బుద్ధిప్రామాణ్యకల్పితములు, హృదయప్రామాణ్యకల్పితములునై వృత్తనామములు నానాప్రకారములుగా నున్నవి.ఈ నామములను బురస్కరించుకొని కవు లెడనెడ వృత్తములు నిబంధించు నాచారమున్నది. * మత్తేభక్రీడను మత్తేభవిక్రీడిత వృత్తమున, ఉత్సాహమును ఉత్సాహవృత్తమున వర్ణించుట యొక చమత్కారముగా గణింపఁబడినది. వృత్తనామ ముద్రాసహితముగ నిట్టి చమత్కారములను నన్నెచోడాదు లందందు ప్రదర్శించియున్నారు.

కవిత్రయభారతమునందును విచారరమణీయములయిన యిట్టి చమత్కారములుగలవు. అయితే నన్నెచోడాదులవలె వారు వృత్తనామమును వాచ్యముచేయలేదు. ముద్రాలంకారమును ధ్వనింపఁజేసిరి.

"ఏల దీని నెడయుఁ జేయ నీ క్షణంబ యేఁగి పాం
చాలుఁ బట్టి తెత్త మధిక శౌర్యలీల మెఱయఁగాఁ
బోలు ననుచుఁ బెరిఁగి రాజపుత్రు లరిగి యార్చి పాం
చాలు పురము ముట్టికొని రసంఖ్యబల సమేతులై."

ఆది. VI. 66.

కురుకుమారుల యుత్సాహమును ఉత్సాహవృత్తమున వర్ణించి నన్నయ ముద్రాలంకారమును జమత్కారముగ ధ్వనింపఁజేసినాఁడు.

"భవదాజ్ఞా దృఢబంధ సంయమిత శుంభద్వేగమై కాక నాఁ
డవలీలన్ మన యర్జునద్విపము క్రోధావేశదుర్దాంత ద
ర్పవిలాసోద్భటభంగి సేపడరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జి
క్కువడం జేయదె యొక్క వ్రేల్మిడిన నీకున్ వేడ్కసంధిల్లఁగన్"

విరా. I-56.

తిక్కన యీ పద్యమునఁ జేసిన చమత్కార మనల్పము. ఇందలి ఛందోఽలంకార సంవాదము విచారరమణీయము. వక్తయైన భీముఁడు తన స్వరూపస్వభావముల కనుగుణమైన మత్తేభవిక్రీడితవృత్తమున నర్జునునియందు మత్తేభక్రీడారోపణము గావించుచున్నాఁడు.

* నాట్యశాస్త్రమున భరతమహర్షి సర్వవృత్తములకును వృత్తనామముద్రాసహితములు, తన్నామసార్థక్య నిరూపకములునగు లక్ష్యములనే నిర్మించెను. (చూ. 15 అధ్యాయము)

'భవదాజ్ఞా' యని యారోహణాభిముఖమైన గతియందు 'దృఢబంధ' రూప గుర్వక్షర నివేశముచే సంయమనము కల్పించి 'ఘంభద్వేగ'మున స్వరవ్యాపారము నిరోధింపఁబడినది. గురు, దీర్ఘములందు శాస్త్రము కల్పించిన యభేదమును శాస్త్రపాలనమునకై యనువర్తించుచు వానియందు స్వతస్సిద్ధమైయున్న భేదమును శిల్పానుపాలనమునకై వినియోగించుట మహాకవి లక్షణము. 'ఆజ్ఞా' యను దీర్ఘాక్షరములు ఆజ్ఞయం దారోపితమైన పాశముయొక్క దీర్ఘత్వమును, 'జ్ఞా' యను గ్రంధ్యక్షరము పాశగ్రంథిని జక్కగా రూపించుచున్నవి. 'సంయమిత' పదమందలి 'సం' అను ననుస్వారాంతత్వకల్పితగుర్వక్షరము ధర్మజుని మృదుసంయమనమును, 'ఘంభద్వేగ' మందలి గుర్వక్షరము నిరుద్ధగతియై సనిఃశ్వాసముగఁ బదప్రక్షేపణముగావించు మదగజమును సుష్ఠుగా వ్యంజించుచున్నవి. గుర్వక్షరబాహుళ్యమున ముహుర్ముహుర్నిరుద్ధగతి యగుచున్న వృత్తము వాక్యార్థమును సువ్యక్తము చేయుచున్నది. 'అర్జున ద్విపము' అను రూపకమువలె ఛందముకూడ ఆలోచనామృతముగ నున్నది.

"అర్జునద్విపము" అను సమాసము అర్జునుఁడను ద్విపము అను నర్థముబోధించి, ఆ ద్విపము అర్జునమైన ద్విపము అను విశేషార్థమును చమత్కారముగ వ్యంజించుచున్నది. ఫల్గుణద్విప మనినచో నీ యర్థాంతరము కలుగదు. అర్జునునియం దారోపితమైనది సామాన్య గజముకాక ఐంద్రమైన యైరావతమై యర్జునుని త్రిలోకవిజయిత్వము ధ్వనించి ప్రకృతార్థమునకుఁ జమత్కారాతిశయము గలుగుచున్నది. వాచ్యమందలి యలంకారము వాచకమందు ధ్వనించు ముద్రాలంకారముతోఁ గలిసి పరమాహ్లాదజనక మగుచున్నది.

"బాల గేళిమీఁది భరము క్రమంబున
విడువఁ గళలయందు వేడ్క సొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు
నెలఁత కేడుగడయు నీవ కావె? విరా. I–251.

ఆటవెలఁదిరూపముఁ దాల్చియున్న బృహన్నలకు ఆట నేర్పుమని యుత్తరనొప్పగించుచు విరాటుఁడు పలికిన వాక్యము ఆటవెలఁదిరూపము దాల్చుట ముద్రాలంకారధ్వనిపూర్వకమైన కవియొక్క ఛందఃశిల్పఫలమే.

ఇట్టి చమత్కారములవలన కవి ఛందశ్శిల్పియనిపించుకొనఁజాలఁడు. నామముద్రాసహితమైన వృత్తప్రయోగమునకు క్షేత్ర మతిసంకుచితము. ఛందముయొక్క అర్థరసానుకూల ప్రయోగనైపుణ్యము వృత్తముయొక్క నామేతరమైన నైసర్గికధర్మము నాశ్రయించియున్నది.

ఛంద మశ్వము. కవి యాశ్వికుఁడు. గమ్యమైన కావ్యపరమార్థమున కభిముఖముగ స్వేచ్ఛానుసారముగ దానిని నడిపించి ప్రతిభాశాలియైన కవి యిష్టార్థసాధనమునఁ గృతార్థుఁడగును. నానారసమయమైన మహాకావ్యపథమున విహరించు కవియొక్క విచిత్రప్రక్రమముల

కేయొక్క ఛందమునుఁ జాలదు వివిధచ్ఛందముల వివిధసామర్థ్యములను సమగ్రముగ నెఱింగి స్వప్రతిభాసామర్థ్యమున వానికి సామర్థ్యాతిశయాధానము గావించి మహాకవి కావ్యప్రస్థానము చేయును.

శ్రుతి యిట్లు చెప్పుచున్నది —

"సోఽబ్రవీత్ ప్రజాపతి శ్ఛందాంసి — రథో మే భవత,
యుష్మాభి రహ మేత మధ్వాన మనుసంచరాణీతి ।
తస్య గాయత్రీ చ జగతీ చ పక్షౌ వభవతాం ।
ఉష్ణిక్ చ త్రిష్టుప్ చ ప్రష్ట్యౌ ।
అనుష్టుప్ చ పంక్తిశ్చ ధుర్యౌ ।
బృహత్యేవోద్ధి రథవత్ ।
స ఏనం ఛందోరథ మాస్థాయ ఏత మధ్వాన మనుసమచరత్ ।"

— తైత్తిరీయ బ్రాహ్మణము : 1-5-12.

సూచికలు :

1. వైదికచ్ఛందోమీమాంస : 10 పుట.
2. యజుర్వేద సర్వానుక్రమణిక : 5 అధ్యాయము.
3 పింగళచ్ఛందశ్శాస్త్రము : 3-2
4. నాట్యశాస్త్రము : xiv-104
5. Ibid .. ..
6 పింగళచ్ఛందశ్శాస్త్రము ; 6-1.
7 జనాశ్రయు : 1-40
8 నాట్యశాస్త్రము : xvii-134.
9 జయకీర్తి-ఛందోనుశాసనము : సంజ్ఞా-13
10. వాగ్వల్లభము : 1-45
11. సంగీతరత్నాకరము : 5-46 (తాళాధ్యాయము)
12. నాట్యశాస్త్రము : xiii-37 తరువాతి గద్యము
13. చందోదర్పణము : 1-29
14. Ibid : 2-89.
15. అప్పకవీయము : 4-328
16. Imagination.
17. పింగళచ్ఛందశాస్త్రము : 3-3.

18 Ibid : 3-4.
19. హలాయుధభట్టు - పిం. ఛంద 6 అధ్యాయము
20. నాట్యశాస్త్రము : xvii -139
21. నవాహ్నికభూమిక - 34 పుట.
22. నాట్యశాస్త్రము : xiv-105.
23. Elizabethan Lyrics : p. 46.
24. వాజసనేయ ప్రాతిశాఖ్యము : i : 14-17.
25. విష్ణుపురాణము : 2-8-7.
26 వాయుపురాణము : 51-64.
27. Phoeneties in Ancient India : p. 14-15.
28 తైత్తిరీయ ప్రాతిశాఖ్యము : i-6.
29 ఋక్ప్రాతిశాఖ్యము : i-6.
30 నిరుక్తము : 8 పుట.
31. ఐతరేయోపనిషత్తు : 3-6-7.
32. తైత్తిరీయ ప్రాతిశాఖ్యము : xxiii-2
33. ధ్వన్యాలోకము : iii-4
34. చరకసంహిత : 1-136.
35. Manual of Psychology : p 534.
36. ధ్వన్యాలోకలోచనము : 305 పుట.
37. నాట్యశాస్త్రము : xvi - పుట. 339.
38. Psychology of Beauty p. 213.
39. నిరుక్తము : 13-1-13 (529 పుట)
40. నవాహ్నికము : 126 పుట.
41. తైత్తిరీయ ప్రాతిశాఖ్య - వైదికాభరణవ్యాఖ్య : 1 : 2.
(Phoenetics in Ancient India : P. 81.)
42. ఋక్ప్రాతిశాఖ్యము : 18-32.
43. తైత్తిరీయప్రాతిశాఖ్యము ; xxi. ; 1
44. నిరుక్తము : 13-1-13 (529 పుట)
45. పింగళచ్ఛందశాస్త్రము : 1-12
46. Ibid 1-13.
47. జయదేవచ్ఛందము ; 1-7.
48. పింగళచ్ఛంధశాస్త్రము : 1-10
49. నాట్యశాస్త్రము : xvi.-107 (341 పుట)
50. పింగళచ్ఛందశాస్త్రము ; 1-11
51. Ibid 1-1.
52. Ibid 1-7.
53. పాణినీయశిక్ష : 5 శ్లోక.

54. నాట్యశాస్త్రము : xiv.–90.
55. పింగళచ్ఛందశ్శాస్త్రము : 1_14
56. ఛందోదర్పణము : 1_67.
57. వృత్తరత్నాకరము : హిందీవ్యాఖ్యాతచే సుద్ధరింపఁబడినది. (పుట 124)
58. Shakespeare : p 179
59. సంగీతరత్నాకరము : తాళాధ్యాయము : 44
60. అమరము
61. కోహలుఁడు
62. నాట్యశాస్త్రము - అభినవభారతి : xiv పుట 246.
63. పింగళచ్ఛందశాస్త్రము : 5 . 1
54. నాట్యశాస్త్రము : xv అధ్యాయారంభమున.
65. ఛందోమంజరి : 1–4.

# ఛందోఽనుశీలనము

ఛందోఽనుశాసనము చేసిన పండితులు పలువురున్నారు. కాని ఛందోఽనుశీలనము చేసిన సహృదయులు మిక్కిలి యరుదుగా నున్నారు. ఛందోఽనుశీలనమనఁగా ఛందముల యొక్క వస్తు రస భావ నిర్వహణసామర్థ్య పరిశీలనము.

రససంశ్రయమైన ఛందఃప్రయోగౌచిత్యమునుగూర్చి మొదటఁ బ్రసంగించినవాఁడు భరతమహర్షి. రసవ్యంజకమైన యభినయమున వాచికాభినయము సర్వప్రథమము. "అంగ నైపథ్య సత్వాని వాక్యార్థం వ్యంజయంతి హి"[1] అని మహర్షి వచనము. అట్టి వాచికాభినయమునకు అంగము ఛందము. వాచికాభినయ మంత ప్రధానమైనది కనుకను, దాని సౌష్ఠవముమీఁదనే తక్కిన యభినయము లాధారపడియున్నవి కనుకను భరతమహర్షి వాచికాభినయాంగమైన ఛందముయొక్క ప్రాముఖ్యమును దృష్టియం దుంచుకొనియే వర్ణాదివృత్తపర్యంతమైన ఛందోవిధానమును విస్తరించి యుపదేశించి, ఛందములయొక్క రసానుకూల వినియోగమును గుఱించి కూడ ఉపన్యసించెను.

"లఘ్వక్షరప్రాయ కృతం, ఉపమా రూపకాశ్రయం
కావ్యం కార్యం తు నాట్యజ్ఞైః, వీరరౌద్రాద్భుతాశ్రయం"

"గుర్వక్షరప్రాయ కృతం, బీభత్సే కరుణే తథా
కదాచి ద్వీరరౌద్రాభ్యాం, యదా ధర్షణజం భవేత్"

"రూప దీపక సంయుక్తం, ఆర్యావృత్త సమాశ్రయం
శృంగారే తు రసేకార్యం, మృదువృత్తం తథైవ చ!"

"ఉత్తరోత్తర సంయుక్తం, వీరే పాఠ్యం చ యద్భవేత్
జగత్యతిజగత్యాతు, సంకృత్యా చైవ యోజయేత్"

"యుద్ధసంఫేటయో స్తద్జ్ఞైః, ఉత్కృతిః పరికీర్తితా
కరుణే శక్వరీ చైవ, తథా చాతిధృతి ర్భవేత్"

"యద్వీరే కీర్తితం ఛందః, తద్రౌద్రేఽపి ప్రయోజయేత్
శేషాణా మర్థయోగేన, ఛందః కార్యం ప్రయోక్తృభిః"

నాట్యశాస్త్రము : XVI. 114-119.

ఇచ్చట మహర్షి రెండు నియమములు చెప్పెను. 1. అక్షరవిన్యాస నియమము, 2. అక్షరసంఖ్యా నియమము.

అక్షరవిన్యాసవిషయమున మహర్షి చేసిన నియమము గురులఘుక్రమమును విధింపక వానియం దన్యతరప్రాధాన్యమునుమాత్రమే సూచించుచున్నది.

లఘ్వక్షరప్రాయమైన ఛందమును వీరరౌద్రాద్భుత రసములందు వినియోగింపవలెను. గుర్వక్షరప్రాయమైన ఛందమును బీభత్సకరుణరసములం దుపయోగింపవలెను. వీరరౌద్రము లందుఁగూడ ధర్షణము ప్రధానమైనపట్ల గుర్వక్షరప్రాయమైన ఛందమును వాడవచ్చును. శృంగారరసమునమాత్రము ఆర్యావృత్తమునుగాని, ఏదైన మృదువృత్తమునుగాని వాడవలెను.

మహర్షి యిచ్చట గాయత్ర్యాది ఛందోనామములనుగాని, శార్దూలాది వృత్తనామములను గాని పేర్కొనకుండుట గమనింపవలెను. ఛందమునఁ బ్రధానమైనది లయ. అది యక్షర సంఖ్యనుగాని, వృత్తనామమునుగాని ఆశ్రయించియుండదు. అది యక్షరబంధము నాశ్రయించి యుండును. కనుక ఛందమున గురులఘ్వక్షరములం దన్యతరప్రాధాన్యమునుబట్టి దాని రసాను కూలత నిర్ణయించుట యుచితము.

లఘ్వక్షరప్రాయమైన ఛందము ద్రుతలయకు, గుర్వక్షరప్రాయము విలంబితలయకు, ఆర్యావృత్తము లేక మృదువృత్తము మధ్యలయకు నుపలక్షకములుగా మహర్షి సూచించెనని భావింపవలెను. ఈ యక్షరబాహుళ్య నియమమునుగుఱించి యభినవు లిట్లు వ్యాఖ్యానించిరి :

"యత్ర అతనువాహీ చిత్తవృత్తిపరిస్పందః తత్ర లఘ్వక్షరప్రధానం వృత్తం వీరాదౌ......మసృణవాహిని తు హృదయస్పందే గుర్వక్షరప్రాయం కరుణాదౌ। రౌద్రాదౌ కదాచిత్ తద్భవతి యత్ర విలంబ్య పరఖలీకారం స్మృత్వా బ్రవీతి. "కర్తా ద్యూతచ్ఛలానామ్" ఇతి; తథా "యో యశ్శస్త్రం బిభర్తి" ఇత్యాదౌ. అత ఏవ భయానకే, హాస్యే, శాంతే వా యథాయోగం సంవేదనస్పందతా చర్వ్యమాణస్వాద్య తాశ్చర్యకృతః విభాగో వృత్తానాం మంతవ్యః"

చిత్తవృత్తిపరిస్పందము అతనువాహి యైనపట్ల లఘ్వక్షరప్రధానవృత్తము, మసృణ వాహి యైనపట్ల గుర్వక్షరప్రధానవృత్తము ప్రయోగింపఁదగినవి. అతనువాహి యనఁగా త్వరిత గతి గలది. మసృణవాహి యనఁగా అలసగతిగలది.

అక్షరసంఖ్యావిషయమున మహర్షి చేసిన సూచనలు అక్షరబాహుళ్యవిషయమున చేసిన సూచనలను బోలియే యున్నవి. వీరమున ఉత్తరోత్తరయుక్తమైన పాదమున 12, 13 లేక 24 అక్షరముల పాదప్రమాణముగల ఛందమును వాడవలెను. యుద్ధసంఫేటవర్ణనములందు

26 అక్షరముల పాదప్రమాణ ముండవలెను. కరుణమున 14 లేక 19 అక్షరముల పాదప్రమాణములు యోగ్యములు. వీరమున యోగ్యములయిన ప్రమాణములే రౌద్రమునను యోగ్యములు.

వీరరౌద్రములందు ఉక్తిప్రత్యుక్తి సంజల్పములందును యుద్ధసంఘట వర్ణనములందును జగత్యతిజగతీచ్ఛందములనుగాని, వానికి ద్విగుణములయిన ఛందములనుగాని వాడవచ్చును. వీరరౌద్రవిభావముల స్వభావములకుఁ దగినట్లు పాదప్రమాణనిర్ణయము కవి చేసికొనవలయును. ఎట్టి సందర్భముల గుర్వక్షర బాహుళ్య ముపదేశించెనో అట్టి సందర్భములందే గురువృత్త ప్రయోగమును మహర్షి యుపదేశించెను. కరుణమునఁ గూడ విలాపబాహుళ్య ధర్మముగా జగత్యనంతరచ్ఛందములనే యుపదేశించెను.

ఛందోవినియోగమునుగుఱించి భోజమహారాజుగూడ కొన్ని సూచనలు చేసెను. "శ్రవ్య వృత్తత్వము" మహాకావ్యములం దభిలషింపఁదగిన శబ్దగుణమని భోజుని యభిప్రాయము. శ్రోతృజనమును బ్రోత్సహించుటకై వృత్తములలో శ్రవ్యమైనవానినే మహాకవి తన కావ్యమునఁ బ్రయోగింపవలెను.

"శ్రుతేషు యేషు చిత్తస్య
వైరాగ్యం న చ హృద్యతా
తాని వర్జ్యాని వృత్తాని
ప్రసిద్ధి ప్రచ్యుతాని చ."

శృంగారప్రకాశము.

అశ్రవ్యములు, అప్రసిద్ధములునగు వృత్తములనుఁ గవి ప్రయోగింపరాదు వృత్తశ్రవ్యతచే నాకృష్టమై లోకము మహాకావ్యమునం దనురక్తమగును గనుక శ్రోతృజనసమ్ముఖీకరణ సాధనముగా శ్రవ్యవృత్తత్వము మహాకావ్యమున నవశ్యముండఁదగిన లక్షణమని భోజుని యభిప్రాయము.

వృత్తము శ్రవ్యమైయుండుటయేకాక అర్థానురూపముగఁ గూడ ఉండవలెనన్న యభిప్రాయముతో "అర్థానురూపచ్ఛందస్త్వము" మహాకావ్యమున శబ్దార్థోభయగుణముగా భోజుఁడు పేర్కొనెను. "అర్థానురూపచ్ఛందస్త్వము"న భోజుని సూచన లివ్వి :[2]

శృంగారమున ద్రుతవిలంబితాదులు
వీరమున వసంతతిలకాదులు
కరుణమున వైతాలీయాదులు
రౌద్రమున స్రగ్ధరాదులు

ఇట్టి యర్థానురూపచ్ఛంద_స్త్వము కావ్యమున రసావియోగహేతువు కాఁగలదని భోజుని యభి ప్రాయము. ఛందోరస సంబంధమునుగూర్చి భోజుఁడు చేసిన సూచనలు దిఙ్మాత్రములే. ఈ వృ_త్తి మీ రసమందే వినియోగింపవలెననిగాని యీ రసమం దీవృ_త్తమునే వినియోగింపవలెనని గాని భోజుఁడు నిర్దేశింపలేదు. కొన్ని రసములకుఁ గొన్ని వృ_త్తములు ఉచితములనిమాత్రము చెప్పెను. కడపట ఒక్క_మాటలో శార్దూలవిక్రీడితాదులను సర్వత్ర వాడవచ్చునని చెప్పెను.

ఛందఃప్రయోగౌచిత్యమునుగుఱించి విపులముగఁ జర్చించినవాఁడు క్షేమేంద్రమహాకవి. ఆయన యౌచిత్యవాది. సర్వతోముఖమైన యౌచిత్యమే కావ్యమునకుఁ బ్రాణమువంటిదన్న సిద్ధాంతమును ఔచిత్యవిచారచర్చయందు బహుధా ప్రపంచించి, ఛందోగతమైన యౌచిత్యమును సువృ_త్తతిలకమునఁ బ్రత్యేకముగా ఆయన వివరించెను. ఛందఃశాస్త్రక_ర్తలు ఛందోనానాత్వ మును నిరూపించి యూరకుండఁగా క్షేమేంద్రుఁడు నానాభూతమైన ఛందఃప్రపంచమెట్లు రసభావ ప్రపంచనిరూపకము కాఁగలదో వివేచించి చూపెను.

ఛందోలాక్షణికు లసంఖ్యాకములయిన వృ_త్తములు నిరూపించిరి. కాని వారి శ్రమ యను రూపఫలప్రదాయక మయ్యెనని చెప్పవలనుగాదు. వారు రూపించిన వందలకొలఁది వృ_త్త ములలో మహాకవుల కావ్యములఁ బడి పునీతములయినవి చాల తక్కు_వ. హృదయసంవాద సుందరములయిన ఛందములను మాత్రమే మహాకవు లుపయోగించి వాని రసాదివ్యంజకతా సామర్థ్యము నిరూపించిరి. ప్రసిద్ధ కావ్యకర్మణ్యులు అభినివేశముతోఁ బ్రయోగించిన వృ_త్తము లను మాత్రమే సంగ్రహించి క్షేమేంద్రుఁడు వాని లక్షణములను, నిర్మాణమర్మములను, ప్రయో గౌచిత్యమును వివరించెను. క్షేమేంద్రుఁడు చేసినది ఛందశ్శాస్త్ర పరిశీలనము కాదు, ఛందశ్శిల్ప పరిశీలనము.

సువృ_త్తతిలకమునం దాయన ప్రతిపాదించిన ప్రధానాంశము లివ్వి ;

1. "అవ్యభిచారేణ శ్రవ్యతై_వ గరీయసీ." 2–5

ఛందమునకు నిత్యముగా నుండవలసిన ధర్మము శ్రవ్యత. అన్ని ధర్మములకంటె అదే గొప్పది.

2. కావ్యే రసానుసారేణ వర్ణనానుగుణేన చ
కుర్వీత సర్వవృత్తానాం వినియోగో విభాగవిత్ 3–7

వృ_త్త విభాగవే_త్తయైన కవి వృ_త్తములను రసానుసారముగ, వర్ణనానుగుణముగఁ గావ్యమున వినియోగింపవలెను.

3. సమాసై_ర్లఘువృత్తానా మసమాసై_ర్మహీయసాం
శోభా భవతి భవ్యానా ముపయోగవశేన వా" 2–3

లఘువృత్తములకు సమాసములవలనను, దీర్ఘవృత్తములకు అసమాసములవలనను శోభ గలుగును. భవ్యులైన మహాకవుల యుపయోగమువలనఁగూడ వృత్తములకు శోభ గలుగును.

4. శాలినీ శ్లథబంధైవ స్వభావేన విభావ్యతే
ఉత్తేజయేత్ తాం యత్నేన మందదీపశిఖా మివ 2-10

శాలినీవృత్తము (ఉపలక్షకము మాత్రమే) స్వభావముచేత శిథిలబంధగాఁ గనిపించును. మంద దీపశిఖనువలె దానిని కవి ప్రయత్నముచే నుత్తేజితను చేయవలెను.

5. సుకుమారరసస్యాత్ర రక్షాయై వృత్త ముద్ధతం
వాక్పాకేనైవ గళితం కవినా నీత మల్పతాం 2-40

సుకుమారరసముయొక్క రక్షణకొఱకు ఉద్ధతమైన వృత్తముకూడ వాక్పాకముచే శిథిలమై కవిచే అల్పత్వము పొందింపఁబడును.

6. గురులఘ్వాదినియమా దవిభ్రష్టోఽపి లక్షణాత్
దోషః 'త్వదుపగే'త్యత్ర శ్రోత్రగ్రాహ్యోఽస్తి విస్వరః 2-25

గురులఘ్వాదినియము ననుసరించి, లక్షణము నతిక్రమింపకున్నను గొన్ని స్థలములందు శ్రోత్రగ్రాహ్యమైన వికృతస్వరరూపదోషము సంభవించుచుండును.

7. అసమాసైః పదై ర్భాతి పృథ్వీ పృథ్వీ పృథక్స్థితైః
సమాసగ్రంథిభి స్సైవ యాతి సంకోచఖర్వతాం 2-27

పృథ్వీవృత్తము (ఉపలక్షకము మాత్రమే) విడివిడిగానున్న పదములచేత పృథులమైనట్లు భాసించును. ఆ పృథ్వియే సమాసగ్రంథులచేత సంకోచఖర్వతను పొందును.

8. నానావృత్తవిశేషాస్తు కవే శ్శక్తస్య శాసనాత్
యాంతి ప్రభోరివాత్యంత మయోగ్యా అపి యోగ్యతాం 3-10

సమర్థుఁడైన ప్రభువునకు సేవకుఁడువలె శాసనసామర్థ్యమువలన కవికిఁగూడ అయోగ్యములైన వృత్తములును ఉపయోగ్యములగుచున్నవి.

9. తథాప్యవస్థా సదృశై స్సాధు శబ్దపదస్థితాః
సువృత్తైరేవ శోభంతే ప్రబంధాః సజ్జనా ఇవ 3-12

సజ్జనులవలె ప్రబంధములుగూడ సాధుశబ్దపదస్థితిగలవయ్యు అవస్థాసదృశములైన సువృత్తములచేతనే శోభిల్లును.

10. శాస్త్రకావ్యే ఽతిదీర్ఘానాం వృత్తానాం న ప్రయోజనం
కావ్యశాస్త్రేఽపి వృత్తాని రసాయత్తాని కావ్యవిత్ 3—8

శాస్త్రప్రధానములయిన కావ్యములందు అతిదీర్ఘములయిన వృత్తములకుఁ బ్రయోజనములేదు. కావ్యసంబంధి శాస్త్రమునందుమాత్రము వృత్తములు రసాయత్తములుగా నుండవలెను.

క్షేమేంద్రమహాకవి చెప్పిన పై యంశములు ఛందఃశాస్త్రమునకుఁ బ్రమేయములు కావు. ఛందఃశిల్పమున కివియే ముఖ్యప్రమేయములు. కావ్యమందలి వస్తురసముల పుష్టికి ఎట్టి వృత్తములు యోగ్యములో అట్టివానినే మహాకవులు తమ కావ్యములందుఁ బ్రయోగించిరి. వృత్తముల యొక్క రసాద్యనుకూలత ఛందశ్శాస్త్రములు సూత్రించిన లక్షణములవల్లఁగాని, వారు నిర్మించిన లక్ష్యములవల్లఁగాని తెలియదు. మహాకవులచేఁ బ్రయుక్తములయినప్పుడే యే వృత్తముయొక్క శక్తి యెట్టిది యను విషయము తెలియవచ్చును. వృత్తములయొక్క రసాద్యనుకూలత గ్రహించుటకుఁ గావ్యములందు వానిని బరించి యనుశీలింపవలయును.

"ఫలనిష్ఠ జన్యతానిరూపిత జనకత్వం అనుకూలత్వం" అని న్యాయము.

మహాకవి నిర్మితమైన యొక కావ్యమును బఠించి రసమనుభవించితిమి. ఆ రససిద్ధియందచ్చటి వృత్తముయొక్క సహకారమును గుర్తించితిమి. ఆ వృత్త మా రసమున కనుకూలమంటిమి. రసాస్వాదనరూప ఫలమునందు తద్వృత్తజన్యత్వము అవధరింపఁబడినది గనుక ఆ రసమున ఆ వృత్తముయొక్క సహకారరూపజనకత్వము నిరూపితమైనది. కనుక ఆ వృత్తము ఆ రసమునకు అనుకూలమని నిర్ణయించితిమి. ఒక మహాకావ్యమునం దొకానొకవస్తువు వర్ణింపఁబడినది. ఆ వర్ణనము ఒకానొకవృత్తమున నిబంధింపఁబడినది. వర్ణితమైన వస్తువు సహృదయునకు సుష్ఠుగా సాక్షాత్కరించినది. సాక్షాత్కారరూప ఫలమునందు ఆ వృత్తముయొక్క సహకారరూపజనకత నిరూపితమైనది. కనుక ఆ వృత్తము ఆ వస్తువుయొక్క వర్ణనకు అనుకూలమంటిమి.

కనుక ఛందములయొక్క విభావానుభావ వర్ణనానుగుణత్వము, రసభావాద్యనుసారిత్వము మహాకవుల ప్రబంధములందు వాని ప్రయోగమువలన గ్రహింపవలసియున్నది. క్షేమేంద్రమహాకవి యీ పని చేసెను. అనఁగా ఆయన చేసినది ఛందఃశీలనము — విశేషించి ఛందోఽనుశీలనము.

ఛందములను పరిశీలించి గుణదోషములను విచారించి శక్తిప్రస్ఫుతవచస్కులయిన ప్రసిద్ధ కావ్యకర్మఖ్యులచేఁ బ్రయుక్తములయిన వృత్తములను మాత్రమే క్షేమేంద్రుఁడు సంగ్రహించెను. విక్షిప్తసంస్థానములు, ఏకపదస్థితములు, సంయోగస్థములునైన యక్షరవిశేషములతోఁ గూడిన వృత్తముల నుదాహరణములుగాఁ బ్రదర్శించెను. శాస్త్రవిహితలక్షణముల ననుసరించిన వృత్తములందే శ్రవ్యత, అశ్రవ్యత, శిథిలత, గాఢత, హ్రస్వత, దీర్ఘత, సుకుమారత, పరుషత, ద్రుతి, అలసత, యోగ్యత, అయోగ్యత - ఇత్యాది గుణదోషములను నిరూపించెను.

అక్షరము, అక్షరసమూహము, యతి, విరామము, పాదము మొదలయిన సర్వాంగములు వృత్తముయొక్క గుణదోషములకుఁ దన్మూలములయిన రసాద్యర్థ వ్యంజనానుకూలతా ననుకూలతలకు నెట్లు కారణములగునో క్షేమేంద్రుఁడు తానుద్ధరించిన లక్ష్యములందు తేటపఱచెను. అనుస్వార, వ్యంజన, విసర్జనీయాది పరములయిన యక్షరముల ప్రయోగమువలన వృత్తములకుఁ గలుగు మందత, దీప్తి, మాధుర్యము, కాటవము మున్నగు ధర్మవిశేషములను స్ఫుటీకరించెను.

నానారూపవాణీగుణ పరిచయముగలవారికి, వివిధదోషలేశముల యంతరము దెలిసిన వారికి, యోగితుల్యాశయులైనవారికి మాత్రమే అతిసూక్ష్మమైన తన వృత్తచర్చావిచారము ప్రయోజనవంత మగుననియుఁ, గృతిజ్ఞులయిన కవులకే శిల్పనియమములు కాని అవశ్యవాక్కులకుఁ గాదనియు క్షేమేంద్రుఁడు స్పష్టముచేసెను. 18797

శాస్త్రసిద్ధములయిన ఛందములందు మహాకవి చేయు శిల్పమునుగుఱించియు, అట్టి శిల్పమువలన కావ్యాంగముగా ఛందమునకుఁ గల్గు సామర్థ్యమునుగుఱించియు, అట్టి ఛందము ననుసంధించుటవలన సహృదయునకుఁ గల్గు రసాదికావ్యార్థ సాక్షాత్కారమును గుఱించియు క్షేమేంద్రమహాకవి చేసినంత సూక్ష్మసుకుమారపరిశీలనము నన్యులెవ్వరును జేసియుండలేదు. ఇంతచేసియు నాయన తన యనుశీలనము దిఙ్మాత్రమే యగుచున్నట్లు[3] గ్రహించి "అనయైవ చ దిశా సర్వం జ్ఞేయం తద్‌జ్ఞై ర్యథోచితం" అని చెప్పుకొనవలసివచ్చినది.

ఛందములయొక్క రసాద్యర్థానుకూలతనుగుఱించి క్షేమేంద్రుఁడు చేసిన తీర్పులన్నియుఁ దత్పూర్వమహాకవుల లక్ష్యములనుబట్టి చేసినవే. అనంతరకవుల కవి మార్గదర్శకములేతప్ప అవశ్యానుష్ఠేయములయిన శాసనములుకావు. వశ్యవచస్కుఁడైన కవి వశ్యచ్ఛందస్కుఁడు కూడ నగును. అతని వాక్య మెట్లు అర్థానురూపముగఁ బ్రసరించునో అతని ఛందముగూడ అట్లే యర్థానురూపముగఁ బ్రసరించును.

శార్దూలాది వృత్తములయొక్క నిర్మాణమర్మములను గుఱించియు, భిన్ననిర్మాణ విశేషములవల్ల నొకే వృత్తము భిన్నగుణవంత మగుటనుగుఱించియు క్షేమేంద్రుఁడు చెప్పినమాటలు

లక్ష్యములవలన సత్యములుగనే నిరూపితములగుచున్నవి. ఎచ్చట నేవృత్తము ఉచితముగా నుండునని యాతఁడు నిర్దేశించెనో అచ్చట నావృత్తము ఉచితముగనున్నట్లే యాతఁడు చూపిన లక్ష్యములవల్ల రూఢియగుచున్నది. అంతమాత్రమున నట్టి సందర్భములం దన్యవృత్తము లనుచితములని భావింపఁబనిలేదు. క్షేమేంద్రుఁ డామాట యనను లేదు.

ప్రతిభావంతుఁడైన కవి యెచ్చటనైనను ఏవృత్తమునైనను బ్రయోగించి యచ్చట నా వృత్తము సముచితముగా నున్నదని యొప్పింపఁగలఁడు. శక్తిప్రసృతమైన వాక్కు ఛందమును శక్తిమంతయు చేయఁగలదు. ఉగ్రగోగ్రహణ సంగ్రామమున నే యశ్వములు వైరాటికిఁ దగినట్లు నడచెనో ఆ యశ్వములే కిరీటికిఁ దగినట్లును నడచెను.

"సువశా కాళిదాసస్య మందాక్రాంతా ప్రవల్గతి
సదశ్వదమకస్యేవ కాంభోజ తురగాంగనా"[4]

అనిన క్షేమేంద్రుని వాక్యము గమనింపఁదగినది. మంధరాక్రాంత విస్రబ్ధములయిన ప్రారంభ దీర్ఘాక్షర చతుష్కముచేతను, పర్యంతమున మరల దీర్ఘాక్షరములచేతను అలసగతియైన మందాక్రాంత కాళిదాసుని వశమునఁ గాంభోజతురగాంగనవలె ప్రవల్గనము చేసినదనినప్పుడు వశ్యచ్ఛందస్కుఁడైన కవి యొకే ఛందమును నానాగతుల నడిపించి నానార్థములు సాధింపఁగలఁడని క్షేమేంద్రుఁడే చెప్పినట్లయినది. అసమర్థమయిన వృత్తమును కవి తన సమర్థతచే సమర్థముగా చేయవీలున్నది. అందులకుఁ గవి తగిన యక్షరముల నెన్నికచేసి, వానిని తగినతీరునఁ గూర్చి, ఆ కూర్పున స్వరవ్యంజననివేశన, విచ్ఛేదవిరామాది కల్పనావిచ్ఛిత్తి వల్ల గతిభేదమును గుణభేదమును సాధింపవలసియున్నది. వాక్పాకముచే ఛందమును పక్వము చేయవలసియున్నది. ఇదియంతయు కవి చేయవలసిన యత్నము – శిల్పము.

క్షేమేంద్రుఁడు చెప్పిన వృత్తౌచిత్యము చాలవఱకు సంస్కృతవృత్తసంబంధి. సంస్కృత వృత్తముల రసాద్యనుకూలత విషయమున ఆయన చేసిన సూచనల ననుసరించి తెలుఁగుపద్యముల రసాద్యనుకూలత పరిశీలింపఁదగియున్నది.

మమ్మటుఁడు కావ్యప్రకాశమున హతవృత్తత్వము కావ్యదోషమనియు, రసాననుగుణత్వ మొకవిధమగు హతవృత్తత్వమనియు, హాస్యరసవ్యంజకమగు దోధకవృత్తమును గరుణరసమున వాడుట తగదనియుఁ జెప్పెను. ఆ సందర్భమున టీకాకారుఁడు వామనాచార్య ఝల్కీకర్ వృత్తముల రసానుకూలతనుగూర్చిన పూర్వుల యభిప్రాయముల నిట్లు తెలిపెను – "కరుణే మందాక్రాంతా పుష్పితాగ్రాదీనా మేవానుగుణత్వం; శృంగారాదౌ పృథ్వీస్రగ్ధరాదీనాం; వీరాదౌ శిఖరిణీ శార్దూలవిక్రీడితాదీనా మానుగుణ్యం; హాస్యే చ దోధకస్య ప్రతిపదవిచ్ఛేదిత్వే నానుగుణ్యమితి".

అచ్యుతరాయలు సాహిత్యసారమున మధురపరుషవృత్తులకుఁ దగిన ఛందములను గుఱించి యిట్లు చెప్పెను :

"మధురాయాం యావదార్యా
మాలతీ చ ప్రహర్షిణీ
మంజుభాషిణ్యపి జ్ఞేయా
వసంతతిలకా తథా॥

హరిణీ తద్వదేవేష్టా
మందాక్రాంతా తథైవ చ
పుష్పితాగ్రా మలభారి
ణ్యేత న్నాన్యత్ర యుజ్యతే॥

పరుషాయాం తు పృథ్వ్యేకా
న తు సా౽న్యత్ర రాజతే
ప్రౌఢాయా మన్యచ్ఛందాంసి
ప్రాధాన్యాచ్చ తయోరపి॥"

VII. 158, 159, 160

ఛందోరస సంబంధమునుగుఱించి యాంధ్రరసజ్ఞపండితులు కొందఱు తమ యభిప్రాయములను బ్రకటించియున్నారు. శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు తమ కావ్యాలంకారసంగ్రహవ్యాఖ్యయందు - "ఆంధ్రమునఁ బూర్వకవులెవ్వరును నీ వృత్తములకును రసములకును సంబంధము గలుపలేదు. సామాన్యముగా వీరరౌద్రములకు మత్తేభశార్దూలములు వాడిరి. కాని శృంగారాదులకుఁగూడ నావృత్తములను వాడిరి. కాని......కరుణాదులలో హాస్యాది విరుద్ధ రసవ్యంజకములగు వృత్తములను వాడి రసదోషమును జేయలేదు. ఏలనఁ గవులెల్లరును గ్వాచిత్కముగా భుజంగప్రయాతము, పృథ్వీవృత్తము మొదలగువానిని వాడినను నత్యధికముగా ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము, శార్దూలము, కందము, గీతము, ఆటవెలఁది, సీసము అను నీయెనిమిది వృత్తములనే వాడిరి. వీనిలో రసభంగ మొనర్చు వృత్తములు లేవు" అని నుడివియున్నారు.

పుట —477

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి యభిప్రాయము :

''వృత్తములు కొన్నివందలు కలవు. నన్నయగారి సంప్రదాయమునుబట్టి చంపకమాల, ఉత్పలమాల, మత్తేభశార్దూలములు, కందము, సీసము, గీతము ఇవి ప్రధానముగా ఆంధ్రభాషా కావ్యోపయోగి ఛందములుగా స్వీకరింపఁబడినవి......ఒకభాష కొకశక్తి యుండును. ఒక ఛందస్సు కొకశక్తి యుండును. ఈ రెండు శక్తులు కలిసి కొన్నచోట ఆ ఛందస్సులో ఆ భాష రాణించును. ఇది భాషాతత్త్వము. ఛందస్తత్త్వము. ఈ భాషా ఛందస్సులయొక్క పరస్పర సంయోజనానుకూల సముచితత్వమును చూచిన పూర్వకవులు మహర్షులు. నన్నయ అట్టి ఋషి.''

జయంతి నవంబరు 1959

''ఆరణ్యపర్వ ద్వితీయాశ్వాసాదియందు నన్నయగారు నలోపాఖ్యానము వ్రాసినారు. అది రెండువందల యిరువదినాలుగు పద్యముల కథ. ఈ కథలో నెచ్చటను శార్దూలముగాని మత్తేభముగాని వ్రాయఁబడలేదు. ఇది కరుణరసము ప్రధానముగా గలిగిన కథ. ఈ కథకు ఆ రెండు వృత్తములు పనికిరావని నన్నయగారి నిష్కర్ష. ఇట్లే యెల్లచోటులను జూడవచ్చును.''

నన్నయగారి ప్రసన్న కథాకలితార్థ యుక్తి — పుట 16

''తెలుఁగు ఛందోవికాసము'' పీఠికయందు విశ్వనాథవారు ఛందఃశిల్పమునుగుఱించి యమూల్యములైన రహస్యములు గొన్ని వివరించియున్నారు. అక్షరము, యతి, ప్రాసము, విరామము మున్నగు ఛందోఽంగము లన్నియు రసాద్యర్థవ్యంజకములేయనియు, రసానుకూల ముగ ఛందమును బ్రయోగించుటయందు కవిచేయు శిల్పము అనంతప్రకారమై యుండుననియు వారి యభిప్రాయము.[5]

మొత్తముమీఁద రసప్రధానమైన కావ్యమునకు అంగమయినఛందము విభావానుభావ సాత్త్విక భావవర్ణనమునకును, స్థాయి సంచారి భావవ్యంజనమునకును ననుకూలముగ నుండవలెననుట కావ్యరసజ్ఞులెల్లరు నంగీకరించిన యంశమే. ఏ విభావమునకు, ఏ రసమునకు ఏ ఛందము సముచితమన్న విషయమున మాత్ర మెవరికిఁ దోఁచినట్లు వారు కొన్ని వృత్తములను బేర్కొనిరి. వృత్తనామముల నాశ్రయించి చేయు వృత్తౌచిత్యప్రసంగములు పరమార్థములని చెప్పవలను పడదు.

కవిత్రయము సామాన్యముగవీరరౌద్రములందు శార్దూలమత్తేభములను,శృంగారకరుణము లందు చంపకోత్పలములను నుపయోగించియుండి రనుమాట పరిశీలనక్షమము కాదు. యుద్ధపంచ కమునం దుపయుక్తములయిన శార్దూలములు ఏఁబదిరెండు, మత్తేభములు నూటనలుబదిమూఁడు. ఆ పర్వములందు వెల్లివిరిసిన వీరరౌద్రరసముల నీ నూటతొంబదియైదు పద్యములే నిర్వ హించినవా ? ఆ పర్వములందుఁ గల చంపకమాలలు నాలుగువందల నలుబదియేడు, ఉత్పల

మాలలు రెండువందలయఱువది యెనిమిది. ఈ పద్యములన్నియు నేమిచేసినవి? వీరరౌద్రము లను భంజించినవా పోషించినవా? కరుణరసప్రధానమైన స్త్రీ పర్వమునఁ బేరునకైన నొక్క యుత్పలముగాని, చంపకముగాని లేకుండనేల? శాంతిపర్వమందలి పదునాఱు శార్దూలములు, ముప్పదియొక్క మత్తేభములు నిర్వహించిన వీరరౌద్రరసములెట్టివి? ఈ పర్వమునందు, ఈ యాశ్వాసమునందు నిది రసమనిగాని, ఈ రసమున కిది ఛందమనిగాని నిష్కర్షచేయుట యసాధ్యమైన విషయము. ఒకప్పుడు చెప్పినచో నీ పర్వమునం దిది స్థాయియైన భావము. ఇది స్థాయియైన ఛందమునని కొంతవఱకుఁ జెప్పవచ్చును. యుద్ధపర్వములందు స్థాయులయిన భావ ములు ఉత్సాహక్రోధములయినచో స్థాయిత్వముపొందిన ఛందములు శార్దూలమత్తేభములని చెప్పఁ జాలము. చంపకోత్పలనియే చెప్పవలసియుండును. వీరరౌద్రములకు లఘ్వక్షరప్రాయమయిన ఛందము లనుకూలములని చెప్పిన భరతమహర్షి వాక్యము ననరించి చెప్పఁదగిన మాటయు నిట్టిదే. గుర్వక్షర బహుళములయిన మత్తేభశార్దూలములకంటె లఘ్వక్షర బహుళములయిన చంపకో త్పలములే వీరరౌద్ర రసమయములైన యుద్ధపర్వములందు స్థాయిత్వము నందఁదగి యున్నవి.

విభావానుభావ వ్యభిచారీసామాగ్రీ సముల్లసితమైన రసవ్యవహార మత్యంతము శ్లిష్టమైనది. దీనిని నిర్వహింపవలసిన ఛందోవ్యవహారముగూడ అత్యంతము శ్లిష్టమైనదియే. రససామగ్రీ దర్శన సమగ్రతగల ప్రతిభాశాలియైన కవికే ఆ సామగ్రికిఁ దగిన ఛందము గోచరించును. విపులము, వివిధమునైన రససామగ్రిని పరిమితములయిన ఛందములచే సమర్పింపవలసినప్పుడు మహాకవి యా ఛందములను యథావసరము శిల్పించును. కవి శిల్పము వర్ణాదివృత్తపర్యంతము వ్యాపించి యుండును.

అక్షర బంధమైన ఛందము కావ్యమందలి వస్తువు యొక్కయు, రసముయొక్కయు నానావిధమైన వర్తనమును సహృదయుని హృదయమునఁ బ్రవర్తింపఁజేయవలసియున్నది. తన యందలి యక్షరముల వివిధవర్తనములచేతనే ఛంద మా పని చేయఁగలదు. విశిష్టమైన ఛందో వృత్తియే విశిష్టమైన వస్తురసభావవృత్తిని వ్యంజింపఁగలదనుట పరమార్థము.

## సూచికలు :

1. నాట్యశాస్త్రము : XIV - 2
2. కావ్యానుశాసనమున నుద్ధరింపఁబడినది - పుట 336
3. సువృత్తతిలకము : 2-43
4. Ibid 3-34
5. తెలుఁగు ఛందోవికాసము - ప్రస్తావన : పుటలు 10-11

# ఛందోవృత్తి

రతి శోక భయ క్రోధ నిందా హర్షాది నానానిమిత్తములవల్ల చిత్తమున నానావిధములయిన వృత్తు లుత్పన్నము లగుననియు, నట్టిచిత్తవృత్తులు నిమిత్తములుగా వాక్యములందు వివిధములగు వృత్తు లుత్పన్నములగుననియుఁ జెప్పఁబడినది. వక్తృహృదయార్తిజన్యమై, శ్రోతృహృదయార్తిజనకమైన ఋతము లేక ఋతి ఛందముయొక్క పరమధర్మమని వివరింపఁబడినది.

ఋతియే సామాన్యరూపమున వృత్తియనియు, విశేషరూపమున రీతియనియు నీ వ్యాసమున వ్యవహరింపఁబడుచున్నది.

"చిత్తవృత్త్యుద్భవ హేతుః విషయః విభావ శబ్దస్య అర్థః[1] అని యభినవులు భాషించిరి. బాహ్యార్థములయిన వివిధవిషయములు వివిధేంద్రియములచే ననుసంధింపఁబడి అనుసంధాత చిత్తమున వివిధములయిన వృత్తులను పుట్టించును. బాహ్యములయిన విషయములు, ఆంతరమైన చిత్తము త్రిగుణాత్మకములే. బాహ్యార్థమునఁ ద్రిగుణముల వృత్తి యెట్టిదో తదనుసంధానమున ననుసంధాత చిత్తమున నుద్భవించిన వృత్తియు నట్టిదే. సత్త్వగుణవృత్తి గల విషయము సాత్త్వికవృత్తిని, రజోగుణవృత్తిగల విషయము రాజసవృత్తిని, తమోగుణవృత్తిగల విషయము తామసవృత్తిని అనుసంధాత చిత్తమున నుత్పాదించును.

కావ్యమందలి శబ్దభాగము సహృదయుని శ్రోత్రేంద్రియమునకు విషయము. తదనుసంధానమున సహృదయుని చిత్తమున వివిధవృత్తు లుద్భవించును. ఆ వృత్తులు కావ్యరసాస్వాదమునకు అనుకూలములుగా నుండవలెను. కావ్యము ఛందోమయము గనుక సహృదయుని యందు రసాస్వాదనానుకూలమైన చిత్తవృత్తిని ఉత్పాదించు కావ్యవృత్తి ఛందోవృత్తియే. ఛందమందలి యక్షరముల వర్తనమే ఈ వ్యాసమున ఛందోవృత్తి యనఁబడినది.

వృత్తిశబ్దము లాక్షణికులచే బహ్వర్థములం దుపయుక్తమై యున్నది.

1. అర్థవిశేష సమర్పణరూపములగు అభిధాది శబ్దవృత్తులు.
2. నియతవర్ణగత రసవిషయ వ్యాపారరూపములగు ఉపనాగరికాది వర్ణవృత్తులు.
3. నాయకాది వ్యాపారరూపములగు భారత్యాది అర్థవృత్తులు.
4. వికాస విస్తర క్షోభాది రసాస్వాదానుకూల చిత్తవృత్తులు.
5. ఏకపదవద్భానసమాన పదసంఘటనారూప సమాసవృత్తులు.

ఇవికాక అక్షరవృత్తులు వేఱకలవు. వీనికే వాగ్వృత్తులనియు పేరు.

"తిస్రో వృత్తీ రుపదిశంతి వాచో
విలంబితం మధ్యమం చ ద్రుతం చ
అభ్యాసార్థే ద్రుతాం వృత్తిం
ప్రయోగార్థే తు మధ్యమాం
శిష్యాణా ముపదేశార్థే
కుర్యాద్ వృత్తిం విలంబితాం"*

—ఋక్. ప్రాతి. xiii 46. 49

కాలాశ్రితమైన యుచ్చారణపరిమాణమునకు వృత్తియని పేరు. వాగుచ్చారణవృత్తులు ద్రుతము, విలంబితము, మధ్యము అని మూఁడువిధములు. వాక్యమును కంఠస్థము చేయుటకై యభ్యాసము చేయునప్పుడు ద్రుతవృత్తి నవలంబింపవలెను. వాక్యమును ప్రయోగించునప్పుడు మధ్యవృత్తి నవలంబింపవలెను. శిష్యుల కుపదేశించునప్పుడు విలంబితవృత్తి నవలంబింపవలెను. ఇట్లు మూఁడు వృత్తులకు మూఁడు ప్రయోజనములు నిర్దేశింపఁబడినవి. ఈ వాగ్వృత్తికి ఆంగ్లమున Tempo అని పేరు.

వక్తచే నుచ్చరింపఁబడిన వాక్యమున స్ఫుటములయిన వర్ణములేకాక ఆ వర్ణముల యుచ్చారణమందలి కాలప్రమాణరూపమైన వృత్తియుఁ గలదని భర్తృహరి నుడివియుండెను.

"శబ్దస్యోర్ధ్వ మభివ్యక్తేః
వృత్తిభేదే తు వైకృతాః
ధ్వనయః సముహోహంతే
స్ఫోటాత్మా తై ర్న భిద్యతే"

— వాక్యపదీయః (ధ్వన్యా. ప్రథమ)

ఉచ్చారితములైన శబ్దములు స్ఫుటములైన వర్ణములరూపమున గ్రహింపఁబడును. అంతేకాక వాని యుచ్చారణమున వర్ణాతిరిక్తమైన వృత్తియు గ్రహింపఁబడును. వృత్తిబేధమున వైకృత ధ్వనులు పుట్టును.

కారికపై అభినవుల యభిప్రాయమిట్లున్నది :

"తేషు (వర్ణేషు) తావత్స్వేవ శ్రూయమాణేషు వక్తుః
యః అన్యః ద్రుతవిలంబితాది వృత్తిభేదాత్మా ప్రసిద్ధా
దుచ్చారణవ్యాపారా దభ్యధికః స ధ్వని రుక్తః"

—ధ్వన్యా. P. 133.

ప్రసిద్ధమయిన యుచ్చారణవృత్తి మధ్యవృత్తి. దానికంటె భిన్నములయిన ద్రుతవిలంబిత వృత్తులు ధ్వనిరూపములు. వక్తయొక్క చిత్తవృత్తియందలి విలక్షణతను వ్యంజించునవి గనుక ఇవి ధ్వనులు. వాక్యమందలి యక్షరములు శ్రుతము లగుచుండఁగా వాని స్వరూపముకంటె అతిరిక్తమైన ధర్మమొకఁడు శ్రోతచే గ్రహింపఁబడును. ఆ ధర్మమే వృత్తి. అది వక్తృచిత్తవృత్తి వ్యంజకము.

వక్తయొక్క వాగుచ్చరణమున ద్రుతవృత్తి గోచరించినంతనే ఆతఁడు అభ్యాసార్థము వాగుచ్చరణము చేయుచున్నాఁడని శ్రోతకు వ్యక్తమగును. అట్లే విలంబితవృత్తి గోచరించినంతనే శిష్యోపదేశార్థము వాగుచ్చరణము చేయుచున్నాఁడు అని వ్యక్తమగును. వృత్తి యెట్టిదైనను శ్రోతకు వినిపించు వర్ణములు మాత్రము అవియే. కనుక వక్తృచిత్తవృత్తిని వ్యంజించుచున్నది వర్ణాతిరిక్తమైన వృత్తియే. ఈ వృత్తులు అభ్యాసోపదేశరూపమైన వక్త్రిచ్ఛావిశేషమును మాత్రమేకాక ఇష్టానిష్ట, కామక్రోధ భయాశ్చర్యాది నానావిధములైన వక్తృచిత్తవికారములను గూడ వ్యంజించునని యనుభవమువల్ల సర్వులు నెఱింగిన విషయమే. ప్రసిద్ధివ్యతిక్రమము నెవ్వఁడును ప్రయోజన నిరపేక్షముగ నెన్నడును చేయఁడుగదా ! కనుక ప్రసిద్ధ వాగ్వృత్తి కంటె భిన్నమైన వాగ్వృత్తి ప్రయోజన విశేషయుక్తమే యనవలెను.

రతి శోక భయ క్రోధాది భావములచే ఆవిష్టుఁడైన వక్తయొక్క వాగుచ్చరణము తరచు అతిత్వరాన్వితమై ద్రుతవృత్తియం దుండుటయు, ఆ భావములే అత్యంత ముత్కటములైనపుడు వాగ్వృత్తి మిక్కిలి యలసమై విలంబితరూపమున నుండుటయు లోకమున ననుభవసిద్ధమై యున్నది.

ఛందమునందు అక్షరములవృత్తి యిచ్చట ఛందోవృత్తి యనఁబడినది. భరతమహర్షి గురులఘ్వక్షరాన్యతర బాహుళ్యవర్తనమును సూచించి యూరకుండెనే కాని ప్రత్యేకముగా వృత్తి శబ్దము నీ సందర్భమునఁ బ్రయోగించి యుండలేదు. భోజమహారాజు దీనిని గతియని వ్యవహరించెను. గద్య పద్య మిశ్ర రచనలయందు ఆఱువిధములయిన శుద్ధసంకీర్ణగతులను ఆయన రూపించెను.[2]

ద్రుత మధ్య విలంబితములు శుద్ధవృత్తులు. ద్రుతవిలంబిత ద్రుత మధ్యాదులు సంకీర్ణ వృత్తులు. వృత్తివివేకము ఇట్లు చేయవచ్చును.

1. ద్రుతము
2. మధ్యము
3. విలంబితము
4. ద్రుత – విలంబితము

5. విలంబిత – ద్రుతము

6. ద్రుత – మధ్యము

7. మధ్య – ద్రుతము

8. విలంబిత – మధ్యము

9. మధ్య – విలంబితము

లఘువులు, హ్రస్వములునైన యక్షరములయొక్కయు, అవాంతర వాక్యములయొక్కయు, వృత్తములయొక్కయు బాహుళ్యము ద్రుతవృత్తి. గురువులు, దీర్ఘములునైన యక్షరములయొక్కయు అవాంతర వాక్యములయొక్కయు, వృత్తములయొక్కయు బాహుళ్యము విలంబితవృత్తి. ఉభయమిశ్రణము మధ్యవృత్తి.

ఛందోవృత్తియనఁగా "గురులఘ్వక్షరాన్యతర బాహుళ్యాత్మా రసవిషయో అక్షర వాక్య వ్యవహారః ''అని నిర్వచింప వచ్చును.

వృత్తిభేదము :

1. అక్షరాశ్రితము, 2. ఆవృత్త్యాశ్రితము, 3. వాక్యాశ్రితము, 4. వృత్తాశ్రితము

అని యధిష్ఠానచతుష్టయము నాశ్రయించియుండును. మొదటి రెండును హృదయస్పందసంచార నిరూపకములు ; చివరిరెండును ప్రాణప్రసారస్వరూప నిరూపకములు. నియతానియత, వర్ణ మాత్రాచ్ఛందములందును, గద్యములందును ఈ వృత్తిభేదములను లక్షింపవచ్చును.

## I. అక్షరాశ్రిత వృత్తి :

(1) ద్రుతము ;

క. హరుశరమును నరుశరమును
సరి నిరుపక్కియలు దాఁకి జవమటి శరసం
భరమునఁ దిరిగె వరాహము
శరనిధి మథనమునఁ దిరుగు శైలముపోలెన్.

అర, I. 306.

(2) విలంబితము :

స్రగ్విణి. ఏము నీ పుత్రుచే నెన్నియే భంగులన్
వేమఱుం బాటు నీవెంట భావించుచున్
సామసంపాదివై నైపు మా తప్పులన్
ధీమహత్వంబు సంధిల్లు నీ కిమ్మెయిన్"

శ్రీ. I. 140.

(3) మధ్యము :

ఉ॥ "నీకరుణం గరంబు రమణీయతరంబయి సర్వవిఘ్నదూ
రీకృతమై సమాప్తి నొనరెన్ ధరణీధర యిమ్మఖంబు భూ
లోకములోన నేను నృపలోక నమస్కృతిఁ గీర్తిఁ బర్వితిన్
నాకులమున్ వెలింగె సుగుణంబుల కాస్పదమై పవిత్రమై"

సభా. II. 81.

(4) ద్రుతవిలంబితము :

మేదిని. విను మిటు లేటికిం జనిన వృత్త మూది యల్గన్
జనము నుతించు నీదు గురు సార ధీర బుద్ధిన్
నిను నతిశాంతచిత్త యని నిక్కమేనుఁ గందున్
మనమున నిట్టి నీకగునె మత్సరంబు వత్సా !

శ్రీ. I. 152.

(5) విలంబిత ద్రుతము :—

సరసిజము. శ్రీరమ్యత్వం బారఁగఁ బెంపూ
ర్జితముగ మణివిరచిత మకుటములుం
దారుం జూడన్ సారవిభూతిన్
ధరణిపు లనిమిషధవ నిభులగుచున్

శ్రీ. II. 37.

(6) ద్రుతమధ్యము :—

బంధురము. సకల రథములును నఖిల గజములును
సర్వ హయంబులతోఁ బెరయన్
శకలములుగ భటనికర మఖిలముం
జావఁగ ద్రౌపది పుత్రులలో

త్రి. I. 115.

(7) మధ్యద్రుతము :—

క్రౌంచపదము. కౌరవ సేనా వీరుల లావున్
గడిమియుఁ జలమును గడక యెలర్పన్
ధీరత సొంపుం గ్రూరత పెంపుం
దెగువయు నెఱపఁగఁ దెరలక వీఁకన్

త్రి. I. 166.

(8) విలంబిత మధ్యము :—

శుద్ధవిరాటి. ఉల్లం బప్రియ మొంద గ్రొత్త సం
ధిల్ల న్నెవ్వగ దీనవక్త్రుఁడై
యొల్లం బోవుచు నుచ్చె నవ్విభుం
డల్లం గౌఁగిట నా నృపాలకున్.

త్రి. I. 125.

(9) మధ్యవిలంబితము :—

క. పూరు పురూరవులట్లు భ
గీరథ రఘుపతులయట్లు కృతకృత్యుఁడవై
ధారుణి రక్షింపుము వి
స్తారగుణాధార ధీర ధర్మతనూజా !

అరణ్య. II. 288.

## II. ఆవృత్త్యాశ్రిత వృత్తి :

(1) ద్రుతము (త్ర్యస్రము)

ఉత్సాహము॥ ధరణినాథ వినుము మధువు ధార లెల్ల ప్రొద్దునున్
దొరగుచుండ నతఁడు వాని దోహలమున నానుచున్

శ్రీ. I. 48.

(2) విలంబితము (మిశ్రము)

లయగ్రాహి. కమ్మని లతాంతముల కుమ్మొనసి వచ్చు మధు
పమ్ముల సుగీతనినదమ్ము లెసఁగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధిముకు
ళమ్ములను నానుచు ముదమ్మొనర......''

ఆది. V. 138.

(3) మధ్యము (చతురస్రము)

మానిని. ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల
నిమ్మగు తావుల జొంపములన్
బూచిన మంచి యశోకములన్ సుర
పొన్నలఁ బొన్నలఁ గేదఁగులన్''

ఆది. IV. 20.

## III. వాక్యాశ్రితము :

(1) ద్రుతము :

చ. వరమునఁ బుట్టితిన్; భరతవంశముఁ జొచ్చితి; నందు బాండుభూ
వరునకుఁ గోడలైతి; జనవంద్యులఁ బొందితి; నీతివిక్రమ
స్థిరులగు పుత్రులం బడసితిన్; సహజన్ముల ప్రాపుఁ గాంచితిన్;
సరసిజనాథ! యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్''

ఉద్యో. III. 108.

(2) విలంబితము :

ఉ॥ ఎన్నఁడు నిట్టి సాహసము లింక నొనర్పకుమయ్య; దుర్జనుం
డన్నన సాహసక్రియలయందుఁ గడంగి నశించుఁ; గావునన్
గ్రన్ననఁ దమ్ములం దొరలఁ గైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్;
సన్నుత! దీని కొండొక విషాదముఁ బొందకుమీ మనంబునన్

అరణ్య. V 434.

(3) మధ్యము :

ఉ॥ మానుషశక్తి యొల్లఁడు; సమంచితదైవము యాఁదియుండు; నీ
పైన యతండు పుణ్యమును బాపముఁ బెట్టినవాఁడు; నీవు నీ
సూనువశంబకాని యొకచొప్పుఁ దలంపవు; కర్ణసౌబలా
ధీనము గార్యనిశ్చయము; దెల్లము నీమత మొప్పు దేమియున్

ఉద్యో. II. 8.

(4) ద్రుతవిలంబితము :

చం॥ ఇటు దగునయ్య కృష్ణ! శమియింపుము; సాత్యకిఁ జంపినాఁడ విం
కట చనితేని; నీదగు సహాయతఁ గౌరవసేన రూపు మా
పుట యవలీల నాకు; ననుఁ బొల్లగఁజేయగ నీకుఁ బాడియే?
కటకట! నా పరాక్రమము గాసిగఁ జక్రము చేతనంటితే?

భీష్మ. II. 161

(5) విలంబిత ద్రుతము :

ఉ॥ ఇమ్మనుజాధమున్ గుణవిహీను బహిష్కృతుఁజేసి ధర్మమా
ర్గమ్మునఁ గౌరవాన్వయముఁ గావుము; పాండుతనూజులం బ్రతా
పమ్మెసఁగంగ నేలు, మిది పథ్యముసు; మ్మొకనక్క నిచ్చి సిం
హమ్ముల విల్చికోలుఁబదె? యన్యులె వారలు కౌరవేశ్వరా!

సభా. II. 181.

## IV. వృత్తాశ్రితము :

### (1) ద్రుతము :

a. భీష్ముని చతుర్థదివస యుద్ధము – 167 నుండి 181 వఱకు పదునొకండు కందములు – యుద్ధత్వర. (భీష్మ. II.)

b. శ్రీకృష్ణుఁడు పరీక్షిత్తును బ్రదికించుట – శపథవాక్యములు – 3 కందములు + 2 గీతములు – ఉత్సుకతాత్వర (అశ్వ III. 190–194)
బాలుని పంచప్రాణములు వచ్చుటకు పంచపద్యములు.

c. ధర్మజున కర్జునుని సమాధానము – 11 కందములు – యుద్ధత్వర.
(కర్ణ. III 37–48)

### (2) విలంబితము :

a. షోడశరాజుల చరిత్రములకు 16 సీసములు. ఉపదేశ విలంబనము.
ద్రోణ. II. 197 – 212

b. ఉపపాండవులకై ధర్మజుని శోకము – 3 స్రగ్ధరలు – శోకవిలంబనము.
సౌప్తిక. II. 14 – 16.

c. గాంధారి పౌలికలను చూచుట – 4 లయగ్రాహులు. భయ శోక విలంబనము –
స్త్రీ. II. 5 – 8.

d. అశ్వత్థామ యుపపాండవులను జంపుట – 5 స్రగ్ధరలు – రౌద్ర విలంబనము.
సౌప్తిక. I. 181 – 189.

### (3) మధ్యవృత్తి :

a. ఉదంకుని యురగస్తుతి – 4 వృత్తములు (ఆది. I. 105 – 108.)

b. ఆస్తీకుని జనమేజయస్తుతి – 6 వృత్తములు (ఆది. II. 224 – 229.)

c. ద్రౌపది తన భర్తలను వర్ణించుట – 7 వృత్తములు (అర. VI. 207 – 214.)

d. ద్రౌపది సందేశము – 11 వృత్తములు (ఉద్యో. III. 101 – 114.)

లఘుగురుచ్ఛందముల సమ్మిశ్రణమువలన వృత్తాశ్రితములయిన సంకీర్ణవృత్తులు సులక్ష ణీయము లగుచున్నవి. అక్షర, గణ, వాక్య, వృత్తాశ్రయములయిన యీ శుద్ధసంకీర్ణవృత్తులు నానావస్తురసభావములందు యథోచితముగఁ బ్రయోగింపఁ దగియున్నవి. వివిధవస్తురసభావము లందు వివిధచ్ఛందోవృత్తుల యౌచిత్యమును నిరూపించుటకు ఆయా రసభావాదులను రూపించు చిత్తవృత్తుల స్వరూపములను గ్రహింపవలసియున్నది. చిత్తముయొక్క తత్త్వమును సాంఖ్య యోగ శారీర జీవ మనస్తత్వ శాస్త్రములు విస్తరించి వివరించియున్నవి రసశాస్త్రము ఈ దర్శ నముల ననువర్తించినదే కనుక ఆయా శాస్త్రములందలి చిత్తవృత్తి దర్శనమును విచారింప వలెను.

చిత్తము త్రిగుణాత్మకము. త్రిగుణముల స్వరూప, సామర్థ్య, ధర్మముల వివేకము—

''ప్రీత్యప్రీతి విషాదాత్మకాః
ప్రకాశ ప్రవృత్తి నియమార్థాః
అన్యోన్యాభిభ వాశ్రయ జనన
మిథునవృత్తయశ్చ గుణాః''

సాం. కా. 12.

సుఖము, దుఃఖము, మోహము గుణముల స్వరూపములు. ప్రకాశనము, ప్రవర్తనము, నిరోధము గుణముల సామర్థ్యములు. అన్యోన్యాభిభవము, అన్యోన్యాశ్రయము, అన్యోన్యప్రకటనము, అన్యోన్యసాంగత్యము గుణముల ధర్మములు.

''సత్వం లఘు, ప్రకాశక మిష్టం;
ఉపష్టంభకం చలం చ రజః;
గురు వరణక మేవ తమః;
ప్రదీపవ చ్చార్థతో వృత్తిః''

సాం. కా. 13.

సత్వము లఘువు, ప్రకాశకము.
రజస్సు ప్రేరకము, చలము.
తమస్సు గురువు, నిరోధకము.

ఇవి ప్రకృతియొక్క గుణములు. పరస్పర విరుద్ధధర్మములుగల యివ్వి కలిసియుండి అన్యో న్యాభిభవన, ప్రకటన, సాంగత్యములచే నానావిధ విరూపపరిణామములు పొంది వికృతిరూప

ప్రపంచమును ఆవిష్కరించుచున్నవి. వీనియందు అన్యతమగుణోత్కర్షవల్ల చిత్తమునఁ గలుగు అవస్థలను యోగశాస్త్రము నిరూపించుచున్నది.

మూఢము, క్షిప్తము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము అను చిత్తముయొక్క పంచావస్థల స్వరూపస్వభావముల వివేకము—

1. మూఢావస్థ :

తమోగుణము ప్రధానము, సత్త్వరజస్సులుగౌణములు అయిన యవస్థ. నిద్ర, తంద్ర, మోహము, భయము, ఆలస్యము, దైన్యము, భ్రమ మున్నగునవి తమోలక్షణములు. కామక్రోధలోభమోహాదులు ఈ యవస్థయందు ఉత్పన్నములగును. ఇది నీచ మనుష్యప్రకృతి. అజ్ఞాన, అధర్మ, ద్వేషములందు మానవుఁడు ప్రవర్తించును.

2. క్షిప్తావస్థ :

రజోగుణము ప్రధానము, సత్త్వతమస్సులు గౌణములు అయిన యవస్థ. దుఃఖము, చాంచల్యము, చింత, శోకము, రాగము మున్నగునవి రజోలక్షణములు. ఈ దశయందు గౌణముగా నున్న తమస్సు అతిశయమైనచో ద్వేషాదులు ఉత్పన్నములయి మానవుఁడు అజ్ఞాన, అధర్మములందు ప్రవర్తించును. సత్త్వము అతిశయమైనచో రాగాదులు ఉత్పన్నములయి జ్ఞానధర్మములందు ప్రవర్తించును. ఇది సాధారణ సంసారుల ప్రకృతి.

3. విక్షిప్తావస్థ :

సత్త్వగుణము ప్రధానము, రజస్తమస్సులు గౌణములు అయిన యవస్థ. సుఖము, ప్రశాంతత, క్షమ, శ్రద్ధ, ధైర్యము, ఉత్సాహము, వీర్యము, దానము, దయ, మున్నగునవి సత్వలక్షణములు. అనాసక్తి, నిష్కామకర్మ ఈ యవస్థయం దుత్పన్నములగును. జ్ఞానధర్మవైరాగ్యములందు మానవుఁడు ప్రవర్తించును. ఇది యుత్తమపురుషుల ప్రకృతి.

చిత్తముయొక్క మూఢ, క్షిప్త, విక్షిప్తావస్థలయందలి లక్షణములన్నియు రసశాస్త్రములందు పేర్కొనఁబడిన స్థాయి, సంచారిభావములే యనుట సులభముగ గుర్తింపవచ్చును. సాంఖ్యయోగశాస్త్ర ప్రసిద్ధములయిన యీచిత్తావస్థలు, తల్లక్షణములు రసశాస్త్రములందు చిత్తవృత్తులుగా, భావములుగా పరిభాషింపఁబడినవి.

శరీరతత్త్వ పరిశీలనాత్మకమైన యాయుర్వేదమున వాతపిత్తశ్లేష్మము లను మూఁడు ధాతుదోషములు పేర్కొనఁబడినవి. శరీరతత్త్వ మీధాతువుల ప్రకోపమువల్ల వివిధములైన వికారములకు లోనగును. ఈ వికారములే రోగములు. రోగలక్షణనిదానమునకు నాడి యొక

ముఖ్యసాధనము. ధాతుదోషములు హృదయవృత్తియందు దోషముల నుత్పాదించును. హృదయవృత్తియనఁగా హృదయస్పంద పరంపరావర్తనము. హృదయస్పందమే నాడి యనఁబడినది. హృదయోద్గతమైన రక్తము నాడులయందు ప్రవహించును. రక్తప్రసారమందలి గతి నాడి యొక్క సంకోచవికాసరూపస్పందనముచే గుర్తింపఁబడును.

శుశ్రుతాచార్యుఁడు ఆకాశాదిపంచభూతములు సత్త్వాదిత్రిగుణోద్భూతములని తెలిపి, పాంచభౌతికమానవశరీరమున సారభూతములైన ధాతువులు సత్త్వాదిత్రిగుణాత్మకములే యనెను. శార్‌ఙ్గధర మిశ్రుఁడు పిత్తవాతశ్లేష్మములను శరీరధాతువులకు సత్త్వరజస్తమోగుణములకుఁ గల సంబంధము నిట్లు వివరించెను.

"పవన స్తేషు బలవాన్ విభాగకరణా న్మతః
రజోగుణమయః సూక్ష్మః శీతో రూక్షో లఘు శ్చలః

శార్‌ఙ్గధర సంహిత 5-26

"పిత్త ముష్ణం ద్రవం పీతం, నీలం సత్త్వగుణోత్తరం
కటు తిక్త రసం జ్ఞేయం విదగ్ధం చామ్లతాం వ్రజేత్" 5-30

"కఫః స్నిగ్ధో గురుః శ్వేతః, పిచ్ఛిల శ్శీతల స్తథా
తమోగుణాధికః స్వాదుః, విదగ్ధో లవణో భవేత్" 5-34

"పిత్తం పంగు, కఫః పంగుః, పంగవో మలధాతవః
వాయునా యత్ర నీయంతే, తత్ర గచ్ఛంతి మేఘవత్" 5-25

సాంఖ్యయోగశాస్త్రప్రసిద్ధములయిన సత్త్వాదిగుణములకు, శరీరశాస్త్రప్రసిద్ధములైన పిత్తాదిధాతువులకును సాదృశ్యము స్పష్టము. ఈ ధాతువులవృద్ధికి ఆశ్రయము చేతనాస్థానమైన హృదయము.

వాతాదిధాతువుల యుద్రేకమువల్ల నాడీవర్తనమునందుఁ గలుగు భేదములు బసవరాజీయమున స్పష్టముగ వివరింపఁబడినవి.

"వాతా ద్వక్రగతి ర్నాడీ, చపలా పిత్తవాహినీ
స్థిరా శ్లేష్మవతీ జ్ఞేయా, సంసర్గా న్మిశ్ర లక్షణం" 1-49

"వాతే వాతాధికా నాడీ, వ్యాళీవ కుటిలా సదా
అత్యంతదుష్టా వహతి, స్తబ్ధా తంత్రీసమాకృతిః" 1-50

"పిత్తాధికే తు చపలా, నాడీ వహతి కాకవత్
బకదర్దురసంచారా, చటకావర్తికా గతిః" 1-51

"కఫేన దుష్టనాడీ తు, హంసకుక్కుటగామినీ
కపోతమందసంచారా, వహతీతి వినిశ్చయః 1-52

ఇవి నాడియొక్క ఏకధాతూద్రేకజన్యములైన శుద్ధగతులు. ధాతుద్వయ ధాతుత్రయోద్రేకజన్యములైన సంకీర్ణగతులనుగూడ బసవరాజీయమిట్లు వర్ణించినది :

"ముహు స్సర్పగతీం నాడీం, ముహు ర్భేకగతిం తథా
వాతపిత్త ద్వయోద్భూతాం, ప్రవదంతి విచక్షణాః" 1-55

"భుజగాదిగతీం నాడీం, రాజహంసగతిం తథా
వాతశ్లేష్మసముద్భూతాం, ప్రవదంతి వినిశ్చయం" 1-56

మండూకాదిగతీం నాడీం, మయూరాదిగతిం తథా
పిత్తశ్లేష్మ సముద్భూతాం, ప్రాహు ర్వైద్యవిశారదాః 1-57

ధాతుత్రయ సన్నిపాతమున నాడీగతి యిట్లుండునట :

"మందం మందం శిథిలశిథిలం వ్యాకులం వాకులం వా
స్థిత్వా స్థిత్వా వహతి ధమనీ యాతి నాశం చ సూక్ష్మా
నిత్యం స్కంధే స్ఫురతి పునర ప్యంగుళీం సంస్పృశే ద్వా
భావై రేవం బహువిధతరైః సన్నిపాతే త్వసాధ్యా" 1-58

అసాధ్యనాడి :

"యాత్యుత్కటా స్థిరాత్యంతం
యాత్యేవం మందగామినీ
యా చ సూక్ష్మా చ వక్రా చ
తామసాధ్యాం చ నిర్దిశేత్" 1-59

ఈ విధముగ బసవరాజు వాతాది ధాతుజన్యములయిన శుద్ధసంకీర్ణహృదయగతులను భుజగ మండూక హంస మయూర కుక్కుట కాక చటకాది జంతుపక్షివిశేషముల గతివిశేషముల సాదృశ్యమున రమ్యముగా నిరూపించెను.

శార్దూలవిక్రీడితము, మత్తేభ విక్రీడితము. భుజంగప్రయాతము, వనమయూరము, ఆటవెలఁది – ఇత్యాది నామములచే ఛాందసికులు పద్యములందలి గతివిశేషములను లక్షించుట యీ మార్గము ననుసరించియే యున్నది. జగణ, తగణ, యగణ, నగణ, మగణాదులందు మండూక మయూర భుజంగ, చటకా రాజహంసాది గతులనుగూడ గుర్తింపవచ్చును.

"హృదయం చేతనాస్థానం ఓజస శ్చాశ్రయో భవేత్" 5–47

"గ్లాని రోజఃక్షయా ద్దుఃఖాత్, అజీర్ణాచ్చ శ్రమాద్భవేత్" 6–27

"యస్యా మర్ధేప్యనుత్సాహః తదాలస్య ముదీరితం" 6–28

"తమః కఫాభ్యాం నిద్రా స్యాత్, మూర్ఛా పిత్తతమోభవా
రజః పిత్తానిలైః భ్రాంతిః, తంద్రా శ్లేష్మతమోఽనిలైః" 6–26

ఇత్యాది శార్ఙ్గధరసంహితావచనములు సంచారిభావముల ధాతుదోషజన్యత్వమును నిరూపించుచున్నవి.

విషయేంద్రియసన్నికర్షమున చిత్తమునం దుత్పన్నములగు వృత్తుల స్వరూపస్వభావములనుగుఱించి జీవతత్త్వమనస్తత్త్వవేత్తల దర్శనములుగూడ నిట్లేయున్నవి.

పరిణామవాద ప్రతిష్ఠాపనాచార్యుఁడైన ప్రకృతితత్త్వవేత్త డార్విన్ చిత్తవృత్తులను గుఱించి యిట్లనెను –

"Emotions and sensations have often been classed as exciting or depressing. When all the organs of the body and mind.... .perform their functions more energetically and rapidly than usual, a man or animal is said to be excited, and under an opposite state, to be depressed. Anger and joy are from the first exciting emotions".

"Several states of mind appear at first to be exciting but soon become depressing to an extreme degree."

"Fear is the most depressing of all the emotions."

"In excitement there will be increased action of the heart and of the respiratory organs. In depression the circulation becomes languid, respiration is almost forgotten and deep sighs are drawn"[3]

అంతర్బహిరంగములు అత్యంతము శక్తిమంతములుగ, త్వరితములుగఁ బనిచేయుట హృదయముయొక్క యుద్రిక్తవృత్తి లక్షణములు. తద్విరుద్ధముగఁ బనిచేయుట అపలవృత్తి

లక్షణము. హర్షము, క్రోధము ఆదినుండియు నుద్రిక్త వృత్తులే. శోకము ఒక్కొక్కప్పుడు ఉద్రిక్తవృత్తి, భయము అత్యంతము అలసవృత్తి. శోకభయజుగుప్సాదులందు ఉద్రిక్తముగ నారంభించిన వృత్తి క్రమముగ అలసమగును. ఉద్రిక్తావస్థయందు హృదయముయొక్కయు, శ్వాసకోశములయొక్కయు వ్యాపారము మిక్కిలి త్వరాన్వితమై యుండును. అలసావస్థయందు రక్తప్రసరణము మిక్కిలి మందమై యుండును. ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు అతినీరసములు, అతి దీర్ఘములు, భారములునై యుండును.

విల్హెల్మ్ వుంట్ అను జర్మన్ మనస్తత్వవేత్త "Metronome" అను ఉపకరణము సాయమున విషయేంద్రియ సన్నికర్షోత్పన్నములయిన చైతన్యవృత్తుల స్వరూప స్వభావములను కనిపట్టి వివరించిన యంశములు ప్రస్తుతాంశమునకు మిక్కిలి యుపయోగకరముగానున్నవి.

బాహ్యార్థాలంబనమున జిత్తమునఁ గలుగు మార్పులను మూఁడువిధములయిన జంటలుగా వుంట్ పండితుఁడు పరిష్కరించెను.

1. సుఖము – దుఃఖము
2. శ్రాంతి – విశ్రాంతి
3. ఉద్రేకము – ఆలస్యము

సర్వవిధములయిన యనుభావములందును ఈ లక్షణములందు అన్నియో కొన్నియో సమ్మిశ్రితములై యుండును. చిత్తమునఁగలుగు వృత్తులు హర్షశోకాదిభావములతో సంబద్ధములై యుండును. శ్రాంతి – విశ్రాంతి, ఉద్రేకము – ఆలస్యము నను జంటలు కాలాశ్రితమైన చిత్త వృత్తి లక్షణములు.

మెట్రొనోమ్ అను యంత్రము భిన్నభిన్నములైన కాలవ్యవధానములలో ధ్వనులను ఉత్పాదించును. ఆ ధ్వనులు శ్రుతిగోచరములై చిత్తమునం దుత్పాదించు వృత్తులను. అనుభవములను వుంట్ పరిశీలించెను. ధ్వనులు అతిత్వరితముగ నుత్పన్నములైనచో చిత్తమునందలి వృత్తి యతిత్వరాన్విత మగును. ఆలస్యముగ నుత్పన్నములైనచో చిత్తవృత్తి యలసమగును. రెండుధ్వనులు శ్రుతిగోచరములగుటకు నడిమి కాలవ్యవధియందు చిత్తము శ్రాంత మగును. రెండవధ్వని గోచరించినంత విశ్రాంతమగును. వ్యవధి యెంతఎక్కుడైన శ్రాంతి యంత యెక్కుడగును. ధ్వనిద్వయమునకు సామ్య మెంత యెక్కుడుండిన విశ్రాంతి యంత యెక్కుడగును. ధ్వనిద్వయమునడిమి యంతర మెంతతక్కువైన నుద్రేక మంతయెక్కుడగును. అంతర మెంతయెక్కుడైన ఆలస్య మంత యెక్కుడగును. అత్యంతోద్రేకముగాని అత్యంతాలస్యముగాని జీవునకు పథ్యములు గావు. అట్లే అతిశ్రాంతిగాని అతి విశ్రాంతిగాని జీవునకు పథ్యములుకావు. శ్రాంతి విశ్రాంతులయు, ఉద్రేకాలస్యములయు సమస్థితి జీవుఁడు కాంక్షించును.

కనుకనే బాహ్యార్థ సన్నికర్షచే చిత్తమున నుత్పన్నములగు భావములు తత్కాలమునందలి హృదయముయొక్క వృత్తిస్వరూపమునుబట్టి సుఖమో, దుఃఖమో జీవునకుఁ గలిగించును.

ఆలస్యము దుఃఖసహితమైన విశ్రాంతి. ఉద్రేకము సుఖసహితమైన శ్రాంతి. ఆలస్యము తగ్గినచో విశ్రాంతి సుఖకరమగును. ఉద్రేకము పెరిగినచో శ్రాంతి దుఃఖకరమగును. వుంట్ పండితుఁడు వివరించిన

శ్రాంతి విశ్రాంతులను ఆరోహణావరోహణములకును
ఉద్రేకాలస్యములను ద్రుత విలంబితములకును

ఉపలక్షకములుగా ఛందోవిషయమున గ్రహింపఁదగియున్నది.

హర్షము, సంతోషము, ఉల్లాసము, ఆశ మున్నగుభావములు సుఖకరములనియు, క్రోధము, దుఃఖము, భయము, చింత మున్నగునవి దుఃఖకరములనియు, హర్షక్రోధము లుద్వేజకములు, శోకభయము లలసములు, ఆశాచింతాభయములు శ్రాంతికరములు ననియు వుంట్ పండితుఁడు వివరించెను.[4]

సాంఖ్యయోగశాస్త్రములు, శరీరజీవమనస్తత్త్వశాస్త్రములు, నిరూపించిన యంశములే రసశాస్త్రమునందును ప్రసంగింపఁబడినవి. రసాస్వాదనానుకూలములైన చిత్తవృత్తులకు అక్షర, గణ, విరామ, పద్యవృత్తులు వ్యంజకములనుట ప్రాచీన దార్శనికులు స్ఫుటముగ గుర్తించి ప్రపంచింపకున్నను ఆ యంశము వారికి అస్ఫుటముగ స్ఫురించియే యున్నది. అయితే రసస్వరూప నిరూపణప్రవణులైన వారు రసధర్మములైన గుణములను, ఆ గుణములను వ్యంజించు శబ్దార్థములను గూర్చియే విపులముగ ప్రపంచించిరి. కనుక అర్థవృత్తులైన భారత్యాదులు, శబ్దవృత్తులయిన ఉపనాగరకాదులు వారి దర్శనమున స్ఫుటముగ గోచరించినవి. రసప్రసంగమున వికాస విస్తర ద్రుతి దీప్తి విక్షేప క్షోభాదులయిన చిత్తవృత్తులను వారు ప్రస్ఫుటముగ లక్షించియుండిరి. ఆయారసములకు ఆయావృత్తులకు సంబంధమును లక్షించియుండిరి. అయినను రసాస్వాదమున చిత్తమునం దుత్పన్నములగు వృత్తులకు భారత్యాద్యర్థవృత్తులతోడను, ఉపనాగరకాది వర్ణవృత్తులతోడను వ్యంజకసంబంధమును నిరూపించిరేకాని ద్రుతవిలంబితాది – అక్షరవృత్తుల రసవ్యంజకతా సామర్థ్యమును స్ఫుటముగా వారు లక్షింపరైరి.

రసవ్యవహారమునం దాపతితములగు చిత్తవికారములు, చిత్తవృత్తులు, రసధర్మములయిన గుణములు, తద్వ్యంజకములగు శబ్దార్థవృత్తులు, చిత్తద్రవ్యగతములయిన సత్త్వరజస్తమోగుణములు – వీని పరస్పర సంబంధమునుగూర్చి ప్రాచీనలాక్షణికులకు ఏకాభిప్రాయమున్నట్లు కనిపించదు. అక్షర, వాక్యవృత్తులు రసవ్యంజకములని నిరూపించుట కిచ్చట పూర్వలాక్షణికుల యభిప్రాయములను బరామర్శింపవలసియున్నది.

చిత్తవృత్తుల సంఖ్యాస్వరూపములనుగుఱించిన యాలంకారికుల యభిభాషణములందు ఏకాభిప్రాయము కనిపించదు.

ఆనందవర్ధనులు ధ్వన్యాలోకమునందు గుణప్రసంగమున ద్రుతి, దీప్తి యను వృత్తులను పేర్కొనిరి.

"శృంగారే విప్రలంభాఖ్యే కరుణే చ ప్రకర్షవత్
మాధుర్యం; ఆర్ద్రతాం యాతి యత స్తత్రాధికం మనః II-8
"రౌద్రాదయో రసా దీప్త్యా లక్ష్యంతే కావ్యవర్తినః
తద్వ్యక్తిహేతూ శబ్దార్థా వాశ్రిత్యోజో వ్యవస్థితం" II-9
"సమర్పకత్వం కావ్యస్య యత్తు సర్వరసాన్ప్రతి
స ప్రసాదగుణో జ్ఞేయః సర్వసాధారణక్రియః" II-10

మాధుర్యౌజఃప్రసాదములను రసధర్మములయిన గుణములను వివరించుచు శృంగార కరుణాదులందు మాధుర్యగుణము, ఆర్ద్రతారూపచిత్తవృత్తి యుండుననియు, వీరాదిరసములందు ఓజోగుణము, దీప్తియను చిత్తవృత్తి యుండుననియు, ఆనందవర్ధనుల యభిప్రాయముగా గ్రహింపవలసియున్నది. ప్రసాదమను గుణము సర్వరససాధారణగుణమని చెప్పెనేకాని తత్సంబంధి చిత్తవృత్తిని ఆయన చెప్పలేదు.

"ఆస్వాదాపరనామ్ని అలౌకికే ద్రుతి విస్తర వికాసాత్మని భోగే"
ధ్వన్యా II P. 189.

అని యభినవగుప్తపాదులు ఆస్వాదమనఁబడు భోగము ద్రుతి విస్తర వికాస రూపమని చెప్పుచు మూఁడు వృత్తులను పేర్కొనిరి. ఆయన వేరొకచోట "ద్రుతివిస్తరవికాసాత్మా రజస్తమో వైచిత్ర్యానువిద్ధ సత్వమయ నిజచిత్స్వభావ నిర్వృతివిశ్రాంతి లక్షణః పరబ్రహ్మాస్వాదసవిధః"[5] అని భోగస్వరూపము వివరించెను. అభినవుల యీ మాటలను బాలప్రియ "అత్ర రజసో గుణస్య అనువేధేన ద్రుతిః, తమసో విస్తారః, సత్వస్య వికాసః ఇతి వివేకః" అని వ్యాఖ్యానించి యందులకు ప్రమాణముగా "యదా హి రజసోగుణస్య ద్రుతిః, తమసో విస్తారః, సత్వస్య వికాసః, తదా భోగః స్వరూపం లభతే" అను కావ్యప్రకాశసంకేత వాక్యమును ఉదహరించెను.

రజోవిజృంభణము ద్రుతిరూపమనియు, తమోవిజృంభణము విస్తారరూపమనియు, సత్వవిజృంభణము వికాసరూపమనియు అభినవుల యభిప్రాయముగా గ్రహింపవలసియున్నది. ఆయన దీప్తియన్నది విస్తారమే. అయినను "దీప్తిః ప్రతిపత్తుః హృదయే వికాసవిస్తారప్రజ్వలన స్వభావా। సా చ ముఖ్యతయా ఓజశ్శబ్దవాచ్యా"[6] అనుట వింతఁగొల్పుచున్నది. దీప్తి

వికాసవిస్తార ప్రజ్వలనస్వభావ యనుమాట స్పష్టముగా లేదు. దీప్తివిస్తారరూపమో, వికాస రూపమో ఆయన స్ఫుటముగ నిష్కర్షచేయలేదు ఇచ్చట ''వికాసరూపో యో విస్తారః తద్రూపం యత్ప్రజ్వలనం తత్స్వభావా తత్స్వరూపా దీప్తిర్నామ; తథావిధా కాచిచ్చిత్తవృత్తి రిత్యర్థః'' అను బాలప్రియ వివరణము కృతకమై యున్నది.

P. 208

రసము, గుణము, చిత్తవృత్తి యనువాని పరస్పరసంబంధము, పౌర్వాపర్యమును గుఱించి లాక్షణికులందు మతభేదములున్నవి.

''రౌద్రాదయో హి రసాః పరాం దీప్తి ముజ్జ్వలతాం జనయంతి'' అని ఆనందవర్ధనులు రౌద్రాదిరసములే దీప్త్యాదిచిత్తవృత్తులకు జనకము లనిరి.

ధ్వన్యా P. 208

''తేన కరుణేఽపి సర్వథైవ చిత్తం ద్రవతీత్యుక్తం భవతి'' అని యభినవగుప్తులు కరుణేఽపి'' యను సప్తమిచేత రసములు చిత్తవృత్తులకు ఉపాదానములన్న యభిప్రాయము వ్యక్తపఱచిరి.

P. 208

''తథా చ ఆర్ద్రితానామ చిత్తస్య శృంగారాది చర్వణాజన్యః కాఠిన్యాది పరిత్యాగః ; తేన ద్రుత్యాఖ్యో చిత్తవృత్తివిశేషో వా ఇతి భావః'' అని ద్రుత్యాది చిత్తవృత్తులు శృంగారాది రస చర్వణాజన్యములని బాలప్రియ స్పష్టముగ వక్కాణించెను.

ధ్వన్యా. 208

''ఆహ్లాదకత్వం మాధుర్యం శృంగారే ద్రుతికారణం''[7]

అను మమ్మటోక్తి రసధర్మమైన మాధుర్యగుణము కారణముగా చిత్తవృత్తియైన ద్రుతి కార్యముగా రూపించుచున్నది.

''చిత్తద్రవీభావమయో హ్లాదో మాధుర్య ముచ్యతే

సా.ద. 8-2

అను విశ్వనాధుని వచనము చిత్తవృత్తికి, రసమునకు, గుణమునకు అభేదమును సూచించుచున్నది.

''ద్రుత్యాది చిత్తవృత్తీనాం గుణవద్రసాస్వాదజన్యత్వాత్ గుణప్రయోజ్యత్వం నతు గుణ జన్యత్వం'' అని జగన్నాథ పండితుఁడు[8] రస గుణ, చిత్తవృత్తుల జనకజన్యత్వరూప పూర్వ మతమును ఖండించి ప్రయోజకప్రయోజ్యసంబంధమును ప్రతిపాదించెను. మాధుర్యాదిగుణములు

ద్రుత్యాది వృత్తులను ప్రయోగించును అనుటచే గుణములు చిత్తవృత్తి పూర్వవర్తులని పండితరాయల యభిప్రాయముగా గ్రహింపఁదగియున్నది.

ద్రుత్యాది చిత్తవృత్తులు శృంగారాదిరసాస్వాదజన్యములనుటగాని, ఆహ్లాదకత్వాది కార్యములనుటగాని, మాధుర్యాదిగుణాభిన్నములనుటగాని, గుణప్రయోజ్యములనుటగాని అంగీకరింపవలనుపడదు. చిత్తవృత్తి రస గుణములకు పరవర్తి యనుట వీనియందలి దోషము. నాయకాదులం దుత్పన్నములగు చిత్తవృత్తులు భావసమాగమమునఁ గలుగునవి గనుక వానికి భావజన్యత్వము – అనఁగా భావపరవర్తిత్వము నంగీకరింపవచ్చును. లోకమునందును ఇట్లే. కాని కావ్యరసాస్వాదమున సహృదయుని యందలి చిత్తవృత్తులు రసజన్యములు – అనఁగా రసపరవర్తులనుట యంగీకరింపవలనుగాదు.

చిత్తవృత్తి యుత్పత్తికి విభావాదికము కారణము. ఇవి రసపూర్వవర్తులు. మాధుర్యాది గుణవిశిష్ట శృంగారాది రసచర్వణమునకు ఉపాధులు – ఆస్వాదావిర్భావానుకూలక్షేత్రములు. ఇవిలేక యాస్వాదము లేదు. ఆస్వాదములేకయు నివి యున్నవి. లోకమున వృత్తులున్నవి. కాని యాస్వాదము లేదు.

చిత్తవృత్తులు నాయకాదులందున్నవి, కవియందున్నవి, సహృదయునియందున్నవి. నాయకాదులం దవి రత్యాదివికారములకుమాత్రమే ఉపాధులు. కవి సహృదయులందు రసాస్వాదమునకు ఉపాధులు. వృత్తి చిత్తమునకే పరిమితము. ఆస్వాదము ఆత్మవ్యాప్తము.

ఈ సందర్భమున ధనంజయుఁడు, అహోబలుఁడు చెప్పిన మాటలు సమంజసముగానున్నవి.

"స్వాదః కావ్యార్థ సంభేదాత్ ఆత్మానందసముద్భవః
వికాస విస్తర క్షోభ విక్షేపైః స చతుర్విధః 4—43

శృంగార వీర బీభత్స రౌద్రేషు మనసః క్రమాత్
హాస్యాద్భుత భయోత్కర్ష కరుణానాం తఏవ హి 4—44

అత స్తజ్జన్యతా తేషాం అత ఏవావధారణం 4—45

దశరూపకము

కావ్యార్థసంభేదమువల్ల శృంగార వీర బీభత్స రౌద్రములందు ఆత్మానందసముద్భవమైన ఆస్వాదము క్రమముగా మనస్సుయొక్క వికాస, విస్తర, క్షోభ, విక్షేపములచేత నాల్గువిధములుగా నుండునని ధనంజయుఁడు వికాసాది చిత్తవృత్తులు శృంగారాది రసాస్వాద భేదములకు కారణములని చెప్పెను. ఇచ్చట కారణములనఁగా కరణములు లేక సాధనములని యర్థము. "విక్షేపైః" అన్న తృతీయాప్రయోగము దీనికి సాధకము.

"వికాస విస్తర క్షోభ విక్షేపాఖ్యా శ్చతుర్విధాః
జాయంతే చేతసో ధర్మాః భావేన తు సమాగమే॥"

"వికాసః కుసుమస్యేవ పాదపస్యేవ విస్తరః
చేతసోఽబ్ధేరివ క్షోభః విక్షేపో మరుతో యథా॥"

"వికాసమూలః శృంగారో వీరో విస్తరమూలకః
విక్షేపోపాధికో రౌద్రో బీభత్సః క్షోభమూలకః॥"

"ఏతన్మూలాః హాస్య చిత్ర భయానక దయాః క్రమాత్
శృంగార హాస్యయోః వీరాద్భుతయో రౌద్రభీమయోః॥"

"బీభత్సదయయోః మైత్రీ స్యాత్ ఏకోపాధికత్వతః

సంజ్ఞాపరిచ్ఛేదము

భావసమాగమము గలిగినప్పుడు చిత్తమున వికాసము, విస్తరము, క్షోభము, విక్షేపము అను ధర్మములు పుట్టును. ఈ చిత్త ధర్మములు క్రమముగా శృంగార, వీర, బీభత్స, రౌద్రములకు మూలములగును. అహోబలుని యీ అభిప్రాయము మిక్కిలి సమంజసముగ నున్నది. భావ సమాగమము చిత్తవృత్తియుత్పత్తికి హేతువు. ఆ చిత్తవృత్తి రసవ్యక్తికి ఉపాధి. చిత్తవృత్తి రసాస్వాదపూర్వవర్తి. ఇట్టి చిత్తవృత్తు లెన్ని యన్నవిషయమునను ఆలంకారికులయందు మత భేదములు కలవు.

ఆనందవర్ధనులు ద్రుతి దీప్తులని, అభినవులు ద్రుతి విస్తర వికాసములని, ధనంజయుఁడు అహోబలుఁడు వికాస విస్తరక్షోభ విక్షేపములని సంఖ్యా నామ భేదములను ప్రతిపాదించిరి.

వికాస విక్షేప సంకోచ విస్తరములని భోజమహారాజు, సంకోచమను క్రొత్తదానిని చేర్చి నాలుగు చెప్పెను.[9] ప్రకాశవర్షుఁడు వికాససంకోచములను రెండువృత్తులే చెప్పెను.[10]

చిత్తముయొక్క సహజవృత్తి యొక్కఁడే యని యోగదర్శన సిద్ధాంతము.

"వృత్తిరేవాస్య విభున శ్చిత్తస్య సంకోచవికాసినీ"[11]

సత్వసంపర్కమున వికాసమును, తమస్సంపర్కమున సంకోచమును పొందు రజస్సుయొక్క వర్తనమే చిత్తముయొక్క స్వాభావికవృత్తి. ద్రుతి దీప్తి విస్తర విక్షేప క్షోభాదులన్నియు ఈ స్వాభావిక వృత్తియందుఁ గలుగు పరిణామములు. ఈ పరిణామములకుఁ గారణములు బాహ్యార్థములయిన విభావములు. ఇవి యాలంబనములుగా చిత్తమునం దుద్భవించిన వృత్తులు వికార రూపములు ధరించును. నిర్వికల్పమైన చిత్తమున జన్మించిన వికారము భావము అనఁబడును.

యోగశాస్త్రప్రసిద్ధములయిన చిత్తావస్థలయందు ఉత్పన్నములగు స్వభావములవంటివే యివి. కావ్య పరిభాషయందు వీనికి స్థాయిభావములు, సంచారిభావములు నని వ్యపదేశము.

''వికాస విస్తర క్షోభ విక్షేపాః భావే కించిదుత్థితాః భవంతి. రసే పునః సమ్యక్[12] అని న్యాయము. ఈషదుత్థితమైన వృత్తి భావమునకును, సమ్యగుత్థితమైనది రసమునకును ఉపాధి యగును. వృత్తియొక్క చిరాచిర, దృఢాదృఢావస్థానమే భావములయొక్క స్థాయిత్వ, వ్యభిచారిత్వమునకు హేతువు అని భావింపవలెను. వృత్తిభంగము రసభంగమునకుఁ గారణమగు ననియు భావింపఁదగి యున్నది.

రసములం పరస్పరముశత్రువులు, మిత్రములు గలవు. శత్రుత్వమిత్రత్వమున హేతువులు అభివ్యక్తమగు భూమికలయందలి సాజాత్యవైజాత్యములే యనుట యుక్తిసహము ననుభవసిద్ధమునై యున్నది. విరుద్ధరససంయోజనము నిషేధింపఁబడుటకుఁ గారణము సామాజికుని చిత్తమందలి భూమిక భంగమైనచో ఆస్వాదము భంగమగుటయే.

వృత్తివేఱు, వికారమువేఱు అనికూడ భావింపవలసియున్నది. వృత్తి వికారవ్యక్తికి భిత్తి. చిత్తమునకు నిర్వికారత్వము ఉండవచ్చునుగాని నిర్వృత్తిత్వముండఁజాలదు.

ద్రుత్యాదులు వృత్తులు. రత్యాదులు వికారములు.

ద్రుతి విస్తర వికాసాది చిత్తవృత్త్యుపాధికమై విభావాదిసంవలనమున వ్యక్తమైన రత్యాది చిత్తవికారము మాధుర్యాది గుణవిశిష్టమై శృంగారాదిరసముగా ఆస్వాదింపఁబడును కనుక రసాస్వాదానుకూల చిత్తవృత్తిని ఉత్పాదించుట బాహ్యార్థముయొక్క కర్తవ్యము.

శబ్దార్థరూపమైన కావ్యము సహృదయమునకు విభావము. కావ్యరసము నాస్వాదించుటకు యోగ్యమైన చిత్తవృత్తిని పఠితయం దుత్పత్తిచేయు లక్షణము కావ్యమందుండవలెను. పఠితయొక్క శ్రోత్రేంద్రియమునకు విషయమైనది కావ్యమందలి వాక్యము. వాక్యము ఆలంబనముగా వాక్యార్థమైన రసమును ఆస్వాదించుటకు యోగ్యమైన వృత్తి శ్రోతచిత్తమునఁ గలుగవలయును. కలుగవలయునన్నచో వాక్యమునం దట్టివృత్తి యుండవలయును.

శ్రుతమైన వాక్యము శ్రోతృచిత్తమున వృత్తినుత్పాదింపఁగా అవగతమైన వాక్యార్థము ఆ వృత్తియందు వికారమును రూపించును. ఆ వికారమే భావము. వృత్తి పుష్టమైనచో భావము పుష్టమై రసమగును. భావరసీకరణమున వృత్తియొక్క ప్రాధాన్య మిట్టిది. అక్షర, గణ, వాక్య, పద్య వృత్తియే ఛందోవృత్తి యని యీ వ్యాసమున వ్యపదేశింపఁబడినది.

## సూచికలు :

1. నాట్యశాస్త్రము (అభినవభారతి) : vii, పుట 347
2. సరస్వతీ కంఠాభరణము : ii-22,23

3. Expression of Emotions in Men and Animals : Pp. 80-86
4. Introduction to Psychology : Pp. 58-79
5. ధ్వన్యాలోకలోచనము : పుట 183
6 Ibid : పుట 108
7. కావ్యప్రకాశము : vii 168
8. రసగంగాధరము : పుట 203
9. సరస్వతీకంఠాభరణము : ii 64
10. రసార్ణవాలంకారము : iii 24
11. పాతంజలయోగ సూత్రములు (వాఖ్య) : 4-20
12. భావప్రకాశనము :

# ఛందోరీతి

వృత్తి నిర్విశేషము. అదియే సవిశేషమై రీతి యగును. విశేషమనఁగా గుణము. గుణములు మాధుర్యాదులు. అవి రసధర్మములు. శృంగారాది రసముల యాస్వాదము మాధుర్యాది గుణసహితమై యుండును. మాధుర్య గుణములేని శృంగారరసాస్వాదము లేదు. పరమార్థమున మాధుర్యమే శృంగారము.

చిత్తవృత్తికి ఛందోవృత్తి యనుకూలముగ నుండవలెను. రసగుణమునకు ఛందోగుణము అనుకూలముగ నుండవలెను. గురులఘ్వన్యతర బాహుళ్యము నాశ్రయించి ఛందోవృత్తి రూపొందును. గురులఘ్వక్షరక్రమనిబంధనము నాశ్రయించి ఛందోరీతి యేర్పడును. గురులఘువుల భిన్నక్రమములవల్ల ఛందోవృత్తియందు భిన్నగుణములుస్ఫురించును. అట్టి గుణములచే విశిష్టమైన వృత్తియందు తద్గుణానురూపమైన యాస్వాదము గలుగును గుణవద్వృత్తియైన రీతి యాస్వాదవిశేషమై గుణవద్రసాస్వాదనకు సహకరించును.

కావ్యశాస్త్రములందు రీతిశబ్దము, వైదర్భి, పాంచాలి, గౌడీయ యను రీతిత్రయము ప్రసిద్ధములై యున్నవి. రీతి గుణసంకలనము. సంకలనభేదముచే రీతిభేదము భావింపఁబడినది.

శ్లేష ప్రసాద మాధుర్యాదులగు పది కావ్యగుణములను భరతముని పేర్కొనెను.[1] వానిలో ఓజః ప్రసాద మాధుర్యములు మూఁడే ముఖ్యగుణములనియుఁ దక్కినవి ఈ మూటియందే అంతర్భవించుననియు భామహుఁడు[2] అభిప్రాయపడెను. భరతుఁడు కావ్యగుణములన్న పదింటిని శబ్దార్థగుణములుగా భావించి, దండి యీ గుణముల సంకలనమువల్ల వైదర్భి, గౌడి యని ప్రస్ఫుటభేదములగు రెండుమార్గము లేర్పడుచున్నవని వివరించెను.[3] దండి మార్గమన్నదానిని వామనుఁడు[4] రీతి యని పేర్కొని గుణాశ్రయములైన రీతులు మూఁడు స్ఫుటముగ లక్షింపఁదగియున్నవని వైదర్భీ గౌడీయ రీతులనడుమ పాంచాలీరీతిని ప్రవేశపెట్టెను.

దండివలె గుణములు శబ్దార్థధర్మములుగా వామనుఁడు గ్రహింపలేదు. గుణములు బంధధర్మములని యాతఁడు స్పష్టముచేసెను.

> "ఓజః ప్రసాద శ్లేష సమతా సమాధి మాధుర్య సౌకుమార్యోదారతార్థవ్యక్తి కాంతయః బంధగుణాః"
>
> "బంధః పదరచనా – తస్య గుణాః బంధగుణాః" 3–2–4

గుణములు పదధర్మములుకావు - పదబంధధర్మములు. పదబంధముల నాశ్రయించి గుణములు ప్రకాశించును. పదబంధమే వాక్యము గనుక ఒక్కొక్కవిధమైన పదబంధమువల్ల వాక్యమున నొక్కొక్క గుణము ప్రకాశించును. బంధము లెన్నివిధములో గుణము లన్నివిధములు. గుణములెన్నో రీతులన్ని యని భావింపవచ్చును గాని యిట్టి భావనయందు గౌరవ ముండుటచే లాఘవార్థము వామనుఁడు మూఁడురీతులనే భావించెను.

గుణసంకలన జన్యములయిన రీతులు ఆస్వాదవిశేషములనియు, పాంచాల్యాదులు ప్రాంతీయ రుచిభేదములనియు గ్రహింపఁదగును. రసములును ఆస్వాదవిశేషములే కనుక రీతిభేదములు రసభేద నిర్వాహకములని భావింపవచ్చును.

రసాభినివేశమున ఆనందవర్ధనాదులు మాధుర్యౌజః ప్రసాదములు మూఁడేయని భామహమతము ననుసరించిరి. కాని ఆయారసములందు ఆయాగుణముల తారతమ్యమును ప్రతిపాదించుటచే వారు భంగ్యంతరమున గుణదశకము నంగీకరించినట్లే యైనది.

శ్లేష, సౌకుమార్యము, మాధుర్యము.

ఉదారత, కాంతి, ఓజస్సు.

సమాధి, సమత, ప్రసాదము,

ఇవి తరతమభావమునే భిన్నములైనను సజాతీయములేయని చెప్పఁదగిన గుణములు.

మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము అను రసధర్మములైన గుణములు పరమార్థమున సత్వ, తమో, రజో గుణరూపములే. ఇవియన్నియు జీవచైతన్య ధర్మములు. జీవునిచే నుచ్చరింపఁబడిన వాక్యములం దివి యారోపితములగును.

పదబంధగుణములయిన మాధుర్యాదులు ఛందమునందును గవేషింపఁదగియే యున్నవి. పదము అర్థమునకు సంకేతము. ఒకానొక యర్థమునకు సంకేతముగా ఒకానొక యక్షరసంపుటి వ్యవహరింపఁబడుచున్నది. ఆ యక్షరసంపుటియే ఒకానొక లయకుఁగూడ సంకేతమై గణమనఁబడుచున్నది. విశిష్ట గురులఘు సన్నివేశముచే పదము విశిష్టలయావభాసక మగును. అట్టి యక్షరసన్నివేశముల బంధమే ఛందము.

"రీతిః స్యాత్ పదన్యాసభంగీ'' యను సింగభూపాలుని యభిభాషణము ననుసరించి ఛందమున గణన్యాసభంగియే రీతియని చెప్పవచ్చును. వామనాచార్యుని గుణస్వరూపవివేకము ననుసరించి ఛందోగుణస్వరూపము రూపింపవచ్చును.

1. ఓజస్సు :—

"పదన్యాసస్య గాఢత్వం వదంత్యోజః కవీశ్వరాః"

81 పుట

"గాఢబంధత్వ మోజః" 3-15

గాఢబంధత్వ మనఁగా సంయుక్తాక్షరత్వము, విసర్జనీయజిహ్వామూలీయోపధ్మానీయాది బాహుళ్యము, గుర్వక్షరప్రాచుర్యము మున్నగు లక్షణములని గోపేంద్రతిప్పభూపాలుఁడు వ్యాఖ్యానించెను. "సంయోగపర హ్రస్వప్రాచుర్యరూప మోజః" యని జగన్నాథపండితుఁడు.[7] ఓజస్సమాసభూయస్త్వం'' అని దండి [8] తీవ్రప్రయత్నోచ్చార్యతయా ఓజస్వితా'' అని విశ్వనాథుఁడు.[9] కనుక నిర్విరామత్వము, దీర్ఘపాదత్వము, సంయోగపరహ్రస్వాక్షరనిర్మితములైన మగణ యగణముల బాహుళ్యము ఛందమున ఓజోగుణము, ''ఘోషబాహుళ్యా ద్గాఢతా''.[10] అని యభినవులు.

శా. భీష్మద్రోణకృపాది ధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్వాకలితంబు సైన్యమిది యే చేరంగ శక్తుండనే ?"

విరా. IV. 52.

2. ప్రసాదము :—

"శ్లథత్వ మోజసా మిశ్రం ప్రసాదం చ ప్రచక్షతే"

81 పుట.

"శైథిల్యం ప్రసాదః" 3-1-6

ఓజోవిపర్యయము ప్రసాదము. సంయోగపరహ్రస్వాక్షర విరళత్వము, యథోచిత విరామత్వము, రగణబాహుళ్యము ప్రసాదగుణము.

ఉ. "కోపము సంహరింపు యదుకుంజర పాండవకోటికెల్లనున్
దేపవుగాదె నీవిటు లధీరతఁ బూనికి దప్పినన్ బ్రతి
జ్ఞాపరుఁడైన ధర్మసుతు శౌర్యము ధైర్యము బాహువీర్యమున్
రూపఱిపోకకాదె యనురూపమె నీకిది లోకనాయకా !"

భీష్మ. II. 161.

3. శ్లేషము :—

"యత్రైకపదవద్భావః పదానాం భూయసా మపి
అనాలక్షిత సంధీనాం స శ్లేషః పరమో గుణః

81 పుట.

"మసృణత్వం శ్లేషః" 3-1-10

"శ్లిష్ట మస్పృష్టశైథిల్యం, అల్పప్రాణాక్షరోత్తరం"[11] (దండి)

అనాలక్షిత సంధిత్వవశమున బహుపదము లేకపదమువలె భాసించుట శ్లేషము. స్వర సంధివశమున పాదమందలి యక్షరములు ఏకాక్షరసదృశముగ భాసించుట, అసంయుక్తదీర్ఘాక్షర ప్రాచుర్యము, సజాతీయనాదాక్షరబాహుళ్యము, సదృశస్వరనిర్మితములయిన గణములబంధము – పద్యమున ధారాశుద్ధిగలిగించు గుణము శ్లేషము.

శా. "ఆ నారాయణ పాండవేయగుణ మహాత్మ్యామలజ్యోత్స్నచి
త్తానందం బొనరింపఁగా జనుల కర్థాంశుప్రకాశంబుతో
మానై సాత్యవతేయ ధీవననిధిజన్మ శ్రీమహాభారతా
ఖ్యానాఖ్యామృతసూతి యొప్పు నిఖిలాఘధ్వాంతవిధ్వంసియై"

ఆది. III. 21.

4. సమత :—

"ప్రతిపాదం ప్రతిశ్లోకం ఏకమార్గ పరిగ్రహః
దుర్బంధో దుర్విభావశ్చ సమతేతి మతో గుణః"

81 పుట.

"మార్గాభేద స్సమతా" 3-1-11

ప్రతిపాదమునను, ప్రతిశ్లోకమునను ప్రక్రాంతమార్గమును వీడకుండుట సమత. గణ సామ్యము, విరామసామ్యము, విచ్ఛేదసామ్యము – ఇత్యాదికము ఛందమున సమతాగుణము.

సీ. "కుంజరనికురంబ కుంభస్థలీసంగ
సిందూరరుచులతోఁ జెలిమిచేసి

కేతనవ్రాత సంకీలిత మాణిక్య
రశ్మిలగెడ విహారంబుసలిపి
సైనికనికరవక్షఃస్థల పరిలిప్త
కాశ్మీరదీప్తులఁ గౌఁగిలించి
దండనాథోత్కర చండభావోద్వృత్త
చక్షుఃప్రభలు దారు సరసమాడి"

కల్యా. I. 116.

5. సమాధి :—

"ఆరోహం త్యవరోహంతి క్రమేణ యతయో హి యత్
సమాధిర్నామ స గుణః తేన పూతా సరస్వతీ"

పుట 82

"ఆరోహావరోహక్రమః సమాధిః" 3-1-12

హ్రస్వములనుండి దీర్ఘములకు ఆరోహణము, విపరీతము అవరోహణము. ఆరోహావరోహణముల క్రమనిబంధనము సమాధి. "యతయః" అనఁగా విరామములని వామనుని యభిప్రాయము కావచ్చును. సగణ, భగణముల క్రమవిన్యాసము, క్రమవర్ధమాన క్రమక్షీయమాణములైన యవాంతరవాక్యముల క్రమన్యాసము, గాఢత్వశైథిల్యముల సమ్యగ్యోజనము సమాధి గుణము.

కం. "ఆ శౌర్యం బాసత్వం
బా శీలం బాపరాక్రమాభీలత్వం
బా శుద్ధవ్రత మెందు న
నాశములని భీష్ముఁ బెద్ద నమ్మితిమిగదే!"

భీష్మ. I. 56

6. మాధుర్యము :—

"బంధే పృథక్పదత్వం చ మాధుర్య ముదితం బుధైః
అనేన హి పదన్యాసాః కామం ధారామధుశ్చ్యుతః"

పుట 82

"పృథక్పదత్వం మాధుర్యం" 3-1-20

అభినవులు "మాధుర్య మభ్య స్తపదత్వం" అని భాషించిరి.[12] పృథగ్గణపాదత్వము, అభ్య స్తగణపాదత్వము, స్ఫుటలయత్వము, అనుస్వారాంతాక్షరబాహుళ్యము, భగణప్రాచుర్య రూపమైన యవరోహణము మాధుర్యగుణము.

ఉ. "అక్కట పుత్ర నిన్ను గనినంతియ పుణ్యము కాని నాకు నీ
వెక్కుడు భక్తి నేసి నను నెప్పుడు నారయ నీ కుమారకుల్
మక్కువ నాకడం దిరుగ లాలనసేయుచు నుండునట్టి యా
మిక్కిలి నోము లేద యిటమీఁదికి నెవ్వరు దిక్కు నెప్పుమా"

ద్రోణ. II. 332

7. సౌకుమార్యము :

"బంధ స్యాజరఠత్వం చ సౌకుమార్య ముదాహృతం
ఏతేన వర్జితా వాచః రూక్షత్వా న్న శ్రుతిక్షమాః"

పుట 82

"అజరఠత్వం సౌకుమార్యం" 3-1-21

అపారుష్యము సౌకుమార్యము, రూక్షాక్షరరాహిత్యము, ద్విత్రివ్యంజన సంయుక్తము లైన యలఘుగుర్వక్షరవర్జనము, అల్పమైన యవరోహణము సౌకుమార్యము. తగణ, భగణ ప్రాచుర్యము.

ఉ. హా యను ధర్మరాజతనయా యను నన్నెడఁబాయ నీకుఁ జ
న్నే యనుఁ దల్లి నేఁపఁజనునే యనుఁ గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను నొంటిపోక దగవే యను నేగతిఁ బోవువాఁడ నే
నో యభిమన్యుఁడా యనుఁ బ్రియోక్తుల నుత్తరఁ దెల్పవే యనున్

ద్రోణ. II. 242

8. ఉదారత :

"వికటత్వం చ బంధస్య కథయంతి హ్యుదారతాం
వైచిత్రీం న ప్రపద్యంతే యయా శూన్యాః పదక్రమాః"

పుట 82

"వికటత్వ ముదారతా" 3-1-22

పదములు నర్తించినట్లుండుట యుదారత. ఉదారతయనఁగా ఎగిరి గంతువేయుట. శత్రంతాక్షరబాహుళ్యమువల్ల పద్యగతి నృత్యలీలాస్ఫోరకముగ నుండును. ఏక, ద్వి, త్రి, చతురాద్యక్షరములయిన పదముల కూర్పువల్ల పద్యమున పిండీబంధాదినృత్తవిశేషములు భాసించు నని యభినవులు నుడివియున్నారు.[13] మధ్యగురువైన జగణము పునఃపునరావృత్తమగుటవల్లఁ గూడ పద్యమున వికటత్వము భాసించును. పద్యగతియందలి చాపల్యమే వికటత్వము.

చం. "రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయముల సంచరచ్చటులసైనికమత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణిభోజకుకురాంధకవారిధియుం గలంగె ను
ద్ధురతరరోషమారుత నితాంతసమీరితమై క్షణంబునన్"

సభా I

9. అర్థవ్యక్తి :

"పశ్చాదివ గతి ర్వాచః పురస్తాదివ వస్తునః
యత్రార్థవ్యక్తిహేతుత్వా త్సార్థవ్యక్తిః స్మృతో గుణః"

పుట 82

"అర్థవ్యక్తిహేతుత్వ మర్థవ్యక్తిః" 3-1-23

ఎట్టిబంధమున శబ్దముకంటె నర్థమే ముందడుగు వేయుచున్నట్లుండునో అట్టి బంధమున అర్థవ్యక్తియను గుణముండును. శబ్దార్థజ్ఞాననిరపేక్షముగనే ఛంద మెచ్చట వర్ణ్యవస్తుస్వరూప ద్యోతకమగునో అచ్చట అర్థవ్యక్తియను గుణముండును. స్రగ్ధరాశార్దూలాదులు శ్రవణగోచరము లయినంతనే గంభీరమయిన యర్థము ప్రతిపాదింపఁబడుచున్నదని గోచరించుట.

"ఏల దీని నెడయుఁ జేయ నీ క్షణంబ యేగి పాం
చాలుఁ బట్టితెత్త మధికశౌర్యలీల మెఱయఁగాఁ
బోలు ననుచుఁ బెరిగి రాజపుత్రు లరిగి యార్చి పాం
చాలు పురము ముట్టికొని రసంఖ్యబలసమేతులై"

ఆది VI 66

10. కాంతి :

"ఔజ్జ్వల్యం కాంతి రిత్యాహుః గుణం గుణవిశారదాః
పురాణచిత్రస్థానీయం తేన వంధ్యం కవే ర్వచః"

పుట 82

"ఔజ్జ్వల్యం కాంతిః" 3-1-24

నవనవోన్మేషిత్వము కాంతి. అది లేనిచో బంధము పురాణచిత్రమువలెనుండును. వృత్తమున లేని గణమును భాసింపఁజేసి యన్యవృత్తచ్ఛాయలు గోచరింపఁజేయుట, అవరోహణాత్మకవృత్తమున ఆరోహణము భాసింపఁజేయుట, సగణస్ఫూర్తి, ఊష్మాక్షరబాహుళ్యము మున్నగునవి కాంతిగుణము.

చం. కనుగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగముల్
గనలఁగ సాంద్రఘర్మసలిలమ్ములు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటదాస్యరంగ వికటభ్రుకుటీ చటులప్రవృత్తన
ర్తనఘటనాప్రకార భయదస్ఫురణా పరిణద్ధమూర్తియై

వీరా II 133

గుణవివేచనానంతరము వామనుఁడు త్రివిధరీతులయందు గుణసంకలనస్వరూపము వివరించెను.

1. వైదర్భీరీతి :

"అస్పృష్టా దోషమాత్రాభిః సమగ్రగుణగుంభితా
విపంచీస్వరసౌభాగ్యా వైదర్భీ రీతి రిష్యతే" 1-2-11

దోషలేశరహితమైనది, సమగ్రగుణగుంభితమైనది, విపంచీస్వరసుభగమైనది వైదర్భీరీతి. శైథిల్య, పారుష్యాది దోషములులేక శ్లేషము, సౌకుమార్యము, కాంతి, ఔదార్యము, సమత, సమాధి గుణములుగలిగి, నాతిమధురము, నాత్యోజము నైన రీతి వైదర్భి, ప్రసాదగుణప్రధానమైనది వైదర్భియనుట యుచితము.

2. గౌడీరీతి :

"సమస్తా త్యుద్భటపదాం ఓజఃకాంతిగుణాన్వితాం
గౌడీయా మపి గాయంతి రీతిం రీతివిచక్షణాః" 1-2-12

సమస్తములయిన యత్యుద్భటపదములు గలది, ఓజఃకాంతిగుణములు గలది గౌడీయ. దీనియందు మాధుర్యసౌకుమార్యముల స్పర్శ యుండదు. శైథిల్య మసలుండరాదు. ఉద్ధత వికటత్వ ముండవచ్చును.

3. పాంచాలీరీతి :

''అశ్లిష్టశ్లథభావాం తు పురాణచ్ఛాయయాన్వితాం
మధురాం సుకుమారాం చ పాంచాలీం కవయో విదుః'' 1-2-13

శిథిలము, కాంతిహీనమునై మాధుర్య సౌకుమార్య గుణములు గలది పాంచాలి. శ్లేషము, ఓజస్సు బొత్తిగా ఉండఁగూడదు. లలితమైన వికటత్వ ముండవచ్చును.

''కావ్యశోభాయాః కర్తారో ధర్మాః గుణాః'' 3-1-1

కావ్యశోభాకరములైన ధర్మములు గుణములు. బంధవిశేషవశమునఁ గావ్యవాక్యమున ఆస్వాద విశేషము లావిర్భవించును. ''స్వదతే కావ్యపద్ధతిః'' ''శ్రోత్రరసాయనం'' ''ధారామధుశ్చ్యుతః'' ఇత్యాది ప్రయోగములవల్ల రీతి యాస్వాదవిశేషమని వామనాభిప్రాయముగా భావింపవలసియున్నది.

యౌవనదశావిర్భావమున యువతి శరీరమందు సాత్వికములయిన గుణములు స్ఫురించును.

''శోభా కాంతిశ్చ దీప్తిశ్చ మాధుర్యంచ ప్రగల్భతా
ఔదార్యం ధైర్య మిత్యేతే సప్తైవ స్యు రయత్నజాః''

సాద 3. 90

యువతియొక్క స్థితియందు, గతియందు నానావస్థలయం దీ నానాగుణములు వ్యక్తములగును. రసవద్వాక్యముయొక్క గతియందును ఈ గుణములు వ్యక్తములగునని వామనుని భావము. రసాత్మకమైన వాక్యమున రసగుణములు భాసించుట సహజముకదా ?

రసాస్వాదానుకూల చిత్తవృత్తి నుత్పాదించుట ఛందోవృత్తి ధర్మమని వెనుకఁ జెప్పఁబడినది. రసగుణమును వ్యక్తముచేయుట ఛందోగుణము ధర్మమని యిచ్చట ప్రతిపాదింపఁబడుచున్నది.

అక్షరబంధమైన ఛందమున బంధవిశేషవశమున ద్రుతవిలంబిత మధ్యవృత్తులు వ్యక్తము లగును. ఈ వృత్తులు చిత్తవృత్తివ్యంజకములని చెప్పఁబడినది. అక్షరపిండబంధమైన ఛందమున అక్షరపిండముల బంధవిశేషవశమున ఓజః ప్రసాద మాధుర్యాది గుణములు వ్యక్తము

లగును. ఛందోవృత్తి యీ గుణములతోఁగూడి యనుభూతమగును. గుణవద్వృత్తియే ఛందో రీతి. అదియే లయము - అనుభవవిశేషము.

గుణవద్వృత్తుల రసవ్యంజకతా పరిశీలనమున దిగ్దర్శకములయిన కొన్ని సూక్ష్మాంశములను వివేచించుట ప్రయోజనకారి యగును. ద్రుత, విలంబిత, మధ్య వృత్తులు అవరోహణారోహణమిశ్రగతి సంక్రాంతిచే ఓజోమాధుర్యప్రసాద గుణవ్యంజకములు కాఁగలవు.

ద్రుతవృత్తి + అవరోహణగతి — మధురము
విలంబితవృత్తి + అవరోహణగతి — మధురతరము
మధ్యవృత్తి + అవరోహణము — మధురతమము
ద్రుతవృత్తి + ఆరోహణము — దీప్తతమము
విలంబితవృత్తి + ఆరోహణము — దీప్తతరము
మధ్యవృత్తి + ఆరోహణము — దీప్తము
ద్రుతవృత్తి + మిశ్రగతి — ప్రసన్నము
విలంబితవృత్తి + మిశ్రగతి — ప్రసన్నతరము
మధ్యవృత్తి + మిశ్రగతి — ప్రసన్నతమము.

లఘుహ్రస్వకృతము, అలఘుహ్రస్వకృతములైన ద్రుతవృత్తియందును, హ్రస్వగురు, దీర్ఘ, దీర్ఘగురు కృతములైన విలంబనములందు భేదములు పరిగణింపవలసియే యున్నది.

## సూచికలు :


1. నాట్యశాస్త్రము : xvi 96
2. కావ్యాలంకారము : ii 1-2
3. కావ్యాదర్శము : i 40
4. కావ్యాలంకార సూత్రవృత్తి : 1-2-9
5. ధ్వన్యాలోకము : పుట 213
6. రసార్ణవసుధాకరము : 1-227
7. రసగంగాధరము (ప్రథమాననము) :
8. కావ్యాదర్శము : 1-80
9. సాహిత్యదర్పణము : 8-9
10. నాట్యశాస్త్రము (అభినవభారతి) : xiv-పుట 229
11. కావ్యాదర్శము : 1-43
12. నాట్యశాస్త్రము (అభినవభారతి) : xvi-పుట 344
13. Ibid : xvi-పుట 343

# ఛందః ప్రయోగౌచిత్యము

ఛందములయొక్క వస్తురసభావాద్యర్థానుకూలత వృత్తనామాశ్రితముగ నిబంధించు విధానము బహుధా వ్యభిచారిగనుక ఉపాదేయముకాదని వెనుకఁ జెప్పఁబడినది. రసములెన్నో యిప్పటికి తేలలేదు. ఆనందాత్మమైన రసము ఏకమేయయ్యు తదవచ్ఛేదకములయిన స్థాయి భావములు అనేకము లున్నవి. వ్యభిచారులని చెప్పఁబడిన నిర్వేదాదులందు పెక్కు స్థాయి పదము నధిరోహింప నర్హములన్నవాద మున్నది.

"విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః"[1]

అని భరతసూత్రము. విభావ, అనుభావ, వ్యభిచారి భావముల సమ్యగ్యోగమువల్ల సహృదయుని హృదయమున రసము నిష్పన్నమగును. రసము నిష్పన్నమగుటకు పూర్వరంగము విభావాదిసంయోగము. రసభేదమునకు విభావాదిభేదము కారణము. ఆలంబన, ఉద్దీపన, తటస్థ రూపమున విభావము త్రివిధము. స్థాయి సంచారి భావముల యుద్బోధమునకుఁ గారణత్వము వహించి విభావము బహుధా భిన్నమగుచున్నది. జడసాత్వికభేదముచేతను, చిత్తగాత్రవాగారంభాది భేదముచేతను అనుభావము బహుధా భిన్నమగుచున్నది. వ్యభిచారులైన హర్షావేగాదులు స్వోత్పత్తిహేతువులగు విషయముల భిన్నత్వమువల్ల బహుధా భిన్నములగుచున్నవి.

రసము లెనిమిది యన్న భరతమహర్షియే వానియందు అవాంతరభేదములను కల్పించెను. దాన ధర్మ దయా యుద్ధాదిరూపములచే ఒక్క వీరరసమే క్రమముగ నిరువదినాలుగు భేదములు ప్రాపించి యున్నది. సర్వభావములకును ఉదయ, సంధి, శబలతా శాంత్యాదులైన యవస్థాభేదములు గుర్తింపఁబడినవి. రసభావములకు రసభావత్వ, తదాభాసత్వములును, తదాభాసములందు, భేదములును భావింపఁబడియున్నవి.

ఒక్కొక్కరసము పోషింపఁబడు దశాంతరములందు వేఱువేఱు వ్యభిచారిభావములచే సంకరమగుచుండును. రసమునకు రసాంతరములు అంగములగుచుండును. విరుద్ధావిరుద్ధభావముల నిమజ్జనోన్మజ్జనాది దశాంతరములందు రసస్థితి యనంతవిధములుగా నుండును. మధురములయిన భావములందు దీప్తములు, పరుషములునైన భావాంతరములు సంక్రమించినప్పుడు, సుకుమారములు, ఆర్ద్రములునైన భావములు సంక్రమించినప్పుడు హృదయవర్తనము భిన్నభిన్నముగా నుండును. ఉద్బుద్ధమైన స్థాయి విరుద్ధావిరుద్ధసంచారిభావములచే సంకరమై పర్యంతమున రసత్వము పొందుటకు అనంతములయిన దశాంతరములను ప్రాపించును.

రసవ్యవహార మింత క్లిష్టమైనప్పుడు ఈ రసమునకు ఈ వృత్తము అనుకూలము అని నిర్దేశించుట యసాధ్యము. కనుక ఛందములయొక్క వస్తురసభావాది వ్యంజకతాసామర్థ్యము వృత్తనామేతరమైన ఛందోధర్మము నాశ్రయించి యుండుననుట యుచితము. ఆ ధర్మము ఛందోవృత్తియనియు, నానావిధములైన ఛందోవృత్తులు నానావిధములైన ఛందోగుణములచే సంక్రాంతములై నానారసభావవ్యంజనా సమర్థములగుననియు భావించుట సమంజసము.

ఛందములయొక్క ప్రయోగౌచిత్యము వానియొక్క గుణవద్వృత్తిని ఆశ్రయించి యుండును. చిత్తవృత్తులు, చిత్తవికారములు సత్వాదిత్రిగుణముల పరిణామములే కనుక రసతత్వమున త్రిగుణముల వర్తనమును పరిశీలించి తదనుకూలములయిన ఛందోవృత్తిరీతులను నిర్ణయింప యత్నింపవలసియున్నది.

రసములు, గుణములు, చిత్తవృత్తులు త్రిగుణసంబద్ధములను సిద్ధాంతమున రసదార్శనికులలో మతభేదములులేవు. ఆ సిద్ధాంతమును వారువారు ప్రపంచించిన మార్గములందు కొన్ని భేదములున్నవి.

''త్రైగుణ్యోద్భవ మత్ర లోకచరితం నానారసం దృశ్యతే"[2] అని కాళిదాసమహాకవి త్రైగుణ్యోద్భము, నానారసమునైన లోకచరితము నాట్యమున దర్శింపఁబడునని నాట్యపరముగఁ జెప్పినమాట కావ్యపరముగ సాహిత్యదార్శనికు లన్వయించిరి. వృత్తివిచార సందర్భమున ఆనందవర్ధనాదు లిట్టి యభిప్రాయముకలవారే యని గుర్తించితిమి కాని వారెవ్వరును రసగుణ సంబంధమును స్పష్టముగఁ బరిష్కరించి చూపించియుండలేదు.

ఈ విషయమున శారదాతనయుఁడు శివుఁడు సూర్యునకుఁ జెప్పినదని యొకమతమును, వాసుకి నారదునకుఁ జెప్పినదని యింకొకమతమును తన భావప్రకాశనమున వివరించెను.[3]

| | | శివ మతము | | వాసుకి మతము |
|---|---|---|---|---|
| 1. | శృంగారము | రాజస - సాత్వికము | — | రాజసము |
| 2. | హాస్యము | రాజస - తామసము | — | సాత్వికము |
| 3. | వీరము | సాత్విక - రాజసము | — | రాజస - సాత్వికము |
| 4. | అద్భుతము | రాజస - సాత్వికము | — | సాత్వికము |
| 5. | రౌద్రము | రాజస - తామసము | — | రాజస - తామసము |
| 6. | కరుణము | తామస - సాత్వికము | — | తామసము |
| 7. | బీభత్సము | తామస - రాజసము | — | తామస - రాజసము |
| 8. | భయానకము | సాత్విక - తామసము | — | తామసము |

ఈ మతములను పరిశీలించి అచ్యుతరాయలు తన సాహిత్యసారమున నింకొక మతమును ప్రతిపాదించెను.[4]

శాంత శృంగార కరుణములు – సాత్వికములు
హాస్య అద్భుత భయానకములు – రాజసములు
వీర బీభత్స రౌద్రములు – తామసములు

జాగ్రత్, స్వప్న, సుషుప్తులను మూఁడవస్థలును ఒక్కొక్కటి మరల జాగ్రత్-జాగ్రత్, జాగ్రత్ – స్వప్న, జాగ్రత్-సుషుప్తి యను తీరున మూఁడేసి భేదములుగా నేర్పడి మొత్తము నవావస్థలు సిద్ధించినట్లే సత్వరజస్తమోగుణములు మూఁడును మరల మూఁడేసిగా భేదిల్లి నవరససిద్ధి యగుచున్నదని యచ్యుతరాయలు వివరించెను. ఆయన మత మిది :—

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | శాంతము | — | సాత్విక | – | సాత్వికము |
| 2. | శృంగారము | — | సాత్విక | – | రాజసము |
| 3. | కరుణము | — | సాత్విక | – | తామసము |
| 4. | హాస్యము | — | రాజస | – | సాత్వికము |
| 5. | అద్భుతము | — | రాజస | – | రాజసము. |
| 6. | భయానకము | — | రాజస | – | తామసము |
| 7. | వీరము | — | తామస | – | సాత్త్వికము |
| 8. | బీభత్సము | — | తామస | – | రాజసము |
| 9. | రౌద్రము | — | తామస | – | తామసము. |

అవస్థానవకసాదృశ్యమున అచ్యుతరాయలు చేసిన రసనవకనిరూపణము స్పష్టముగనే యున్నది. అయినను ఇది స్థూలమైన మార్గమునే నిర్దేశించును గాని సూక్ష్మపరిశీలనకు అంతగా నుపకరింపదు.

రజస్సు క్రియాత్మకము. సత్వతమస్సులు నిష్క్రియములు. లఘువైన సత్వము క్రియను వికసింపఁజేయును. గురువైన తమస్సు క్రియను సంకోచింపఁజేయును. అక్షరమందు స్వరములు స్వయంగమనశక్తిగలవి. వ్యంజనములు స్వరముల నాశ్రయించియే చలనవంతములగుచున్నవి. కనుక స్వరములు రజోగుణములుగను వ్యంజనములు సత్వతమోరూపములుగను గ్రహింపవచ్చును. స్వరములయొక్క గమనము వాని యంగములయిన వ్యంజనములయొక్క లాఘవగౌరవములనుబట్టి ద్రుతము, విలంబితము నగుచుండును. లఘుప్రయత్నోచ్చారణీయములయిన వ్యంజనములు సాత్వికములనియు, గురుప్రయత్నోచ్చారణీయములు తామ

సములనియు భావింపఁదగును. సాత్వికవ్యంజనములు ఉచ్చారణమున వాగింద్రియమునకు, శ్రవణమున శ్రోత్రేంద్రియమునకు సుఖకరములనియు, తామసవ్యంజనములు దుఃఖకరములనియు వివేకింపవచ్చును.

సంవారప్రయత్న నిష్పన్నములైన నాదములు సాత్వికములు.
వివారప్రయత్న నిష్పన్నములైన శ్వాసములు తామసములు.

అని విభాగము చేయఁదగును.

| | | | | |
|---|---|---|---|---|
| నాదములందును | — | అల్పప్రాణములు | - | సాత్విక సాత్వికములు |
| | | మహాప్రాణములు | - | సాత్విక తామసములు |
| | | యణ్ణులు | - | సాత్విక రాజసములు. |
| శ్వాసములందును | — | అల్పప్రాణములు | - | తామస సాత్వికములు |
| | | మహాప్రాణములు | - | తామస తామసములు |
| | | శర్రులు | - | తామస రాజసములు. |

నని యవాంతర భేదకల్పనము చేయవచ్చును.

"శకారా ద్రాజసోత్పత్తిః, షకారా త్తామసోద్భవః
సకారా త్సత్వసంభూతిః

నందీశ్వరకాశిక - 26

నాసిక సర్వోత్తమస్థానము, ప్రాణపథము గనుక నాసికాస్థానములగు అనునాసికములు పరసారభూతములు.

మాతృకాప్రాసాదః (మౌనతంత్రము)

స్వరము స్పందరూపము. ఆస్పందము వ్యంజనానువిద్ధమై లాఘవగౌరవములు ప్రాపించును. స్పందములకు లఘుత్వగురుత్వములవలె హ్రస్వత్వదీర్ఘత్వములు కలవు. ఇవి రజోవృత్తిమాత్రములు. చతుర్విధములయిన యీ స్పందములు చిత్తవృత్తివ్యంజకములు.

అక్షరములకు మంత్రశాస్త్రములందు ప్రసిద్ధములైయున్న శక్తులుగూడ ఛందఃశిల్పానుశీలనమున ఉపాదేయములే. ముఖయంత్రమందలి మూర్ధాదిస్థానములకు అగ్న్యాదు లధిదైవతములుగా భావింపఁబడినవి. తత్తద్దేవతాకములయిన స్థానములం దుత్పన్నములయిన యక్షరములు తత్తద్దేవతాశక్తులు గలిగియుండుననియు, అట్టి యక్షరములు శ్రోతయందు ఆశక్తులను

ప్రకోపింపఁజేయుననియు మంత్రశాస్త్రములు చెప్పుచున్నవి. ''ఋ టు ర షాణాం మూర్ధా'' ఇత్యాది వైయాకరణ దర్శనము నిచ్చట అనుసంధించుకొనవలయును.

అక్షరములకువలె అక్షరసంహితలైన గణములకును చిత్తవృత్తివ్యంజనసామర్థ్యము కలదని ఛాందసికులు దర్శించియున్నారు. వారి దర్శనముకూడ యథావసరము స్వీకరింపఁదగియే యున్నది.

కవిసర్పగారుడమునుండి గణరససంబంధము నుపదేశించు పద్యములను లింగమగుంట తిమ్మన యుదాహరించెను.[5] అప్పకవియు[6] నీ ప్రసంగము గావించెను.

| | కవిసర్పగారుడము | అప్పకవీయము |
|---|---|---|
| మగణము | రౌద్రము | రౌద్రము |
| యగణము | కరుణము | కరుణము |
| రగణము | భయానకము | శృంగారము |
| సగణము | ? | ఘోరము |
| తగణము | శాంతము | శాంతము |
| జగణము | వీరము | వీరము |
| భగణము | హాస్యము | హాస్యము |
| నగణము | ? | అద్భుతము. |

రౌద్ర కరుణ శాంత వీర హాస్యముల విషయమున నిరువురును ఏకాభిప్రాయమునే వెలిబుచ్చిరి. అన్యరసముల విషయమున భేదాభిప్రాయము చూపిరి. ఈ లాక్షణికుల యభిప్రాయములను యథావసరము స్వీకరింపఁదగినవే. సూర్యేంద్రచంద్రగణముల రసానుకూలతనుగుఱించి యీ లాక్షణికు లేల ప్రసంగింపలేదో.

వివిధసాహిత్యశాస్త్రకర్తలు స్థాయి సంచారి భావముల లక్షణములను వారికిఁ దోచిన తెఱఁగున నిర్వచించియున్నారు. ఏయొక్క నిర్వచనమును ఆ భావముల స్వరూపమును సమగ్రముగ రూపింపఁజాలకున్నను సర్వనిర్వచనములు అంశమున సత్యములే. వీనియందు కొన్ని చిత్తవృత్తి ప్రధానముగఁ జేయఁబడినవి గలవు. వృత్తౌచిత్యపరిశీలనమున నిట్టినిర్వచనములు గ్రహింపఁదగియున్నవి.

ధ్వన్యాచార్యులు సంఘటనా, పద, పదైకదేశ, లింగ, వచన, నిపాతాదికమైన వ్యంజక సామాగ్రి యెంతయో నిరూపించిరి. కాని ఛందముయొక్క రసాదివ్యంజకతను గుఱించి వారు ప్రసంగింపరైరి. పరమార్థమున ఛందోఽంగములన్నియు రసాదివ్యంజకములే. వర్ణాది వృత్త

పర్యంతమైన ఛందస్సామగ్రిని ఆంధ్రమహాభారతకవు లెట్లు వస్తురసభావాది వ్యంజకముగ విని యోగించిరో పరిశీలింపవలసియున్నది.

నిర్మాణవిశేషమువలన ఛందములు విశిష్టవస్తురసభావ నిర్వాహకములు కాఁగలవని యింత వఱకు వివరింపఁబడినది. ఛందముల నిర్మాణమునందేకాక వాని యలంకరణమునందుఁగూడ కవి యవధానవంతుఁడగును. నిర్మాణసౌష్ఠవమునకుఁదోడు అలంకరసౌష్టవముకూడ సిద్ధించినచో ఛందముయొక్క వశీకరణశక్తి బలీయమగును. గుణములు ఛందశ్శోభాకరములుకాఁగా, అలంకరణములు ఛందశ్శోభాతిశయహేతువులు కాఁగలవు. కనుక ఇప్పుడు ఛందోఽలంకరణము ననుశీలింపవలయును.

## సూచికలు :

1. నాట్యశాస్త్రము : vi అధ్యాయము. 288 పుట
2. మాళవికాగ్నిమిత్రము : 1-4.
3. భావప్రకాశనము : 2 వ అధికారము.
4. సాహిత్యసారము : vi - 47. 48.
5. సులక్షణసారము : పుటలు. 155 - 159.
6. అప్పకవీయము : vi 77 - 78.

# ప్రాసము

గురులఘ్వక్షరాన్యతర బాహుళ్యాత్మకమైన వృత్తియు, గురులఘుక్రమనివేశనాత్మకమైన రీతియు ఛందమును రసాద్యర్థనిర్వహణసమర్థముగా రూపించు ధర్మములని వెనుకఁ జెప్పఁబడినది. ఛందోనిర్మాణసౌష్ఠవము తదంగసౌష్ఠవముపై నాధారపడియుండుననియుఁ జెప్పఁబడినది. ఛందమునకు రసాదివ్యంజనసామర్థ్యాతిశయము నాపాదించు ప్రాసము, వడి యను రెండు విశేష లక్షణములుగూడ ఆంధ్రులచే భావింపఁబడినవి. ఇవి ఛందమునకు శోభాతిశయమును గలిగించు లక్షణవిశేషములు – అంగసమవాయులై యంగధర్మవిశేషవ్యంజకము లయినవి.

ప్రాసము అను పదము సంస్కృతలక్షణగ్రంథములం దగపడదు అలంకారశాస్త్రము లందు అనుప్రాసము అను పదము కనఁబడును. అది శబ్దాలంకారభేదము. సంస్కృతచ్ఛందో గ్రంథములందు దాని ప్రసంగము లేదు. ఆంధ్రమునందువలె సంస్కృతమున ప్రాసము ఛందమునకు అంగముగాని, లక్షణముగాని, అలంకారముగాని కాదు. భరతముని యుపదేశించిన ఛందోదశాంగములలోఁ బ్రాసము పేర్కొనఁబడలేదు.

సంస్కృతలాక్షణికులు పేర్కొన్న యనుప్రాసభేదములలో నొకటి యాంధ్రచ్ఛందము లందు ప్రాసముగా రూపొంది వృత్తజాతులందు నియతమైన లక్షణముగాఁ గుదురుకొన్నది. మాధుర్య గుణమును వివరించు సందర్భమున ననుప్రాసమును దండి యిట్లు లక్షించెను :

మధురం రసవత్ వాచి
వస్తున్యపి రసస్థితిః
యేన మాద్యంతి ధీమంతః
మధునేవ మధువ్రతాః॥

యయా కయాచిత్ శ్రుత్యా యత్
సమాన మనుభూయతే
తద్రూపా హి పదాసత్తిః
సానుప్రాసా రసావహా॥

వర్ణావృత్తి రనుప్రాసః
పాదేషు చ పదేషు చ
పూర్వానుభవ సంస్కార
బోధినీ యద్యదూరతా॥

చంద్రో శరన్నిశో త్తంసే
కుంద స్తబక విభ్రమే
ఇంద్రనీల సమం లక్ష్మ
సందధా త్యలినశ్రియం॥

చారు చంద్రమసం భీరు
బింబం పశ్యైత దంబరే
మన్మనో మన్మథాయ త్తం
నిర్దయం హంతు ముద్యతః॥

ఇత్యనుప్రాస మిచ్ఛంతి
నాతిదూరాంతరశ్రుతిం;
నతు రామాముఖాంభోజ
సదృశ శ్చంద్రమా ఇతి॥

కావ్యాదర్శము: I:51,52.55.56,57,58

మాధుర్యమనఁగా రసవత్త్వము. రసము వాక్కునందును, వస్తువునందును ఉండును. సమాన శ్రుతిక శబ్దానుభవమునకుఁ దోడుపడు సానుప్రాసయైన పదాసత్తి రసావహ. అనుప్రాసమనఁగా వర్ణావృత్తి. అది పాదములందును, బదములందును నుండవచ్చును. పూర్వానుభవసంస్కార బోధకుఁ దగినంత యదూరమున వర్ణావృత్తి జరుగవలెను. అతి దూరాంతరశ్రుతియైన యనుప్రాసము సహృదయ హృదయంగమము కాదు.

దండి యిచ్చట స్పష్టముగాఁ జెప్పకున్నను ఆయన 56, 57 శ్లోకములందుఁ బ్రదర్శించినవి క్రమముగాఁ బాదానుప్రాసము, పదానుప్రాసము ననుట సుగ్రహము. భోజాదు లిట్టియనుప్రాస భేదములను పెక్కింటిని విభజించి నిరూపించిరి.

ఆవృత్తి ర్యాతు వర్ణానాం
నాతి దూరాంతరస్థితా
అలంకారః స విద్వద్భి
రనుప్రాసః ప్రదర్శ్యతే॥

సర. కంఠా II. 70.

అనుప్రాసము మాధుర్యలక్షణముగా దండి ప్రతిపాదించెను. అది యలంకారమని భోజరాజు భావించెను. భోజుని కారికను వ్యాఖ్యానించుచు రామసింహుఁడు 'అనుప్రాసము' అను పదము నిట్లు నిర్వచించెను :

"ప్రాచీన వర్ణ జాత్యనుగతః, సహృదయ హృదయావర్జకతయా ప్రకృష్టశ్చ వర్ణానాం న్యాసః అనుప్రాసః ఇతి కాశ్మీరికా నిరుక్తిః."

మమ్మటాదులును నిట్టి యభిప్రాయమునే వ్యక్తముచేసిరి.

"వర్ణసామ్య మనుప్రాసః, ఛేక వృత్తి గతో ద్విధా"

"స్వరవైసాదృశ్యేపి వ్యంజనసదృశత్వం వర్ణసామ్యం । రసాద్యనుగతః ప్రకృష్టో న్యాసః అనుప్రాసః ।" అని మమ్మటుఁడు.

కావ్యప్రకాశము IX-104

"అనుప్రాసః శబ్దసామ్యం, వైషమ్యేపి స్వరస్య యత్"

"స్వరమాత్రసాదృశ్యం తు వైచిత్ర్యాభావాత్ న గణితం । రసాద్యనుగతత్వేన ప్రకర్షేణ న్యాసః అనుప్రాసః" అని విశ్వనాథుఁడు.

సాహిత్యదర్పణము X-2

సహృదయహృదయావర్జకత కారణముగాఁ బ్రకర్షపొందిన వర్ణన్యాసము అనుప్రాసమను నలంకారము. నాతిదూరాంతరస్థితియైన సదృశవర్ణావృత్తి శ్రుతిసుఖావహ యగును గనుక నట్టిది శబ్దాలంకారము. అట్టి వర్ణావృత్తి రసాద్యనుగుణముగ నుండవలెను.

అనుప్రాసము శ్రుతి, వృత్తి, ఛేక, లాటాంతాది భేదములచే బహుప్రకారము. అది పద, పాద, శ్లోకార్థ, శ్లోకగతమై యుండవచ్చును. అనఁగా ఆవృత్తమగుచున్నది వర్ణముగాని, పదముగాని, పాదముగాని, పాదఖండముగాని కావచ్చును. ఒకప్పుడు శ్లోకార్థము, శ్లోకముకూడ నాతిదూరాంతరముగ నావృత్తములు కావచ్చును. అట్టిదియు నొకవిధమైన యనుప్రాసాలంకారమే. "కాదన కిట్టిపాటి యపకారము" అను పద్యమును (ఆది I : 125) నన్నయయు, "దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోకప్రతాపస్ఫురత్" అనుపద్యమును (విరా. II : 55) తిక్కనయు నాతి దూరాంతరముగ నావృత్తిచేయుట* రసాదివ్యంజకమై యలంకారత్వమును బ్రాపించుచున్నదని యెఱుంగవలయును.

ప్రతిపాద ద్వితీయస్థానగత సదృశవ్యంజనావృత్తిరూపమైన యనుప్రాసభేదమును దండి యొక్కఁడే చక్కఁగా రూపించెను. దాని నాతఁడు మాధుర్యలక్షణముగనే గణించెను. అతని లక్ష్యమిది :

---

* ఆది. I-125 వ పద్యము ఆది II-204 వ పద్యముగా నావృత్తమైనది పద్యావృత్తికి ఇది సంస్కారబోధనానుకూలమైన యంతరమే యనఁదగును.

"చంద్రే శరన్నిశోత్తంసే
కుంద స్తబక విభ్రమే
ఇంద్రనీలసమం లక్ష్మ
సందధా త్యలినః శ్రియం"

I-56.

ఆంధ్రుల ప్రాసస్వరూప మిదియే. దండి లక్ష్యమందలి ప్రాసము ఆంధ్రచ్ఛాందసికు లందఱును నిరూపించిన సంయుతాసంయుతప్రాసభేదమే యని సులభముగ గ్రహింపవచ్చును.

సంస్కృతచ్ఛందశ్శాస్త్రకర్త లెవ్వరును నిట్టి యనుప్రాసభేదమును ఛందమున కంగ ముగాఁగాని, అలంకారముగాఁగాని పేర్కొనియుండలేదు. జయకీర్తి యొక్కఁడుమాత్రము తన ఛందోఽనుశాసనమున దీనినిగురించి ప్రసంగించెను. ఛందశ్శాస్త్రసంజ్ఞలను వివరించుచుఁ బ్రథ మాధికరణమున జయకీర్తి—

"పాదో ఽక్షర మాత్రా నియ
మోదిత పిండో ఽథ పాదవత్ పద్యం స్యాత్
పాద ద్వితీయవర్ణః
పాదం పాదం య ఏతి సో ఽనుప్రాసః"

I. 125.

అని పాదమును, పద్యమును, అనుప్రాసమును నిర్వచించెను. 'ప్రతిపాదమునందును వచ్చు పాద ద్వితీయవర్ణము అనుప్రాసము' అని జయకీర్తి యనుప్రాసలక్షణమును స్పష్టముగా వివరించెను. లక్షణశ్లోకమున అనుప్రాసమును బాటించెను. లక్షణము, లక్ష్యమునైన యీ కారిక ఆంధ్రమునఁ గందముగా నెలకొన్న యార్యాగీతియందు నిబద్ధమైయున్నది. ప్రాకృతసంప్రదాయము ననుస రించి యార్యాగీతిని స్కంధకనామమున జయకీర్తి తనగ్రంథమున నిరూపించెను (V-13) జయకీర్తి యనుప్రాసమును ప్రథమాధికారమునందే నిర్వచించియున్నను సర్వసంస్కృత చ్ఛందములకు నీ యనుప్రాసనియమము వర్తించునని యాతని యభిప్రాయముగా భావింపరాదు. కర్ణాటజాత్యధికారమునఁ గర్ణాటచ్ఛందములను నిరూపించు సందర్భమునందే ఆతఁడు లక్ష్యలక్షణ ములం దీ నియమమును బాటించి యుండుటచే నీ యనుప్రాసలక్షణము దాక్షిణాత్యచ్ఛందములకు మాత్రమే పరిమితముచేయుట యాతని యాశయముగా గ్రహింపవలసియున్నది.

జయకీర్తి పదునొకండవ శతాబ్దికిఁ జెందిన కర్ణాటజైనపండితుఁడు. కన్నడులు, తెలుఁగులు నాతనినాఁటికే ప్రాసమును బాటించుచుండిరి. ఆ ప్రాసలక్షణమునే యాతఁడు వివరించెను. సంస్కృతచ్ఛందోఽనుశాసనముచేయుచుఁ దత్సంప్రదాయమునుబట్టి జయకీర్తి దీనిని 'అను ప్రాసము' అన్నను నిది దాక్షిణాత్యుల ప్రాసమే యనుట స్పష్టము.

"ఆద్యో వళిః ద్వితీయః ప్రాసః"

ఆ. శ. చిం

అని వాగనుశాసనుని ప్రాసలక్షణము. ఈ సూత్రముపై అప్పకవి వివరణము :

"ప్రథమపాద ద్వితీయాక్షరంబు ప్రాస
మయ్యెఁ బద పద్యముల నడుగడుగునందు
నదియు రెండవవర్ణమై యమరు సీస
గీత దండక మంజరీ కృతులఁ దక్క—"

III-28

ప్రథమపాద ద్వితీయాక్షరము ప్రాసమైనచోఁ దక్కినపాదముల ద్వితీయాక్షరములు అను ప్రాసము లనుట న్యాయమే. ప్రథమపాదద్వితీయాక్షరమునననుసరించి ద్వితీయాదిపాదముల ద్వితీయాక్షరములు ఉంచఁబడుట యనుప్రాసమే. ప్రాసము అను పదము దాక్షిణాత్యుల ఛందః పరిభాష.

అనుప్రాసమునకు వ్యంజనసామ్యమే ముఖ్యమనియు, స్వరసామ్యము లేకున్నను దోషము లేదనియు సంస్కృతాలంకారికుల యభిప్రాయము. ప్రాసవిషయమున నాంధ్రుల యభిప్రాయము నిదియే.

"ప్రాసములకెల్లఁ దుల్యాక్షరంబులైనఁ
జాలు, స్వరభేదమైన దోషంబులేదు"

III. 289.

అని యప్పకవి చెప్పినాఁడు. ఇచ్చట అక్షరమనఁగా వ్యంజనమని యప్పకవి యభిప్రాయము.

ఆంధ్రులు యతిని వడి లేక వళి యను దాక్షిణాత్యపదముచే వ్యవహరించుటయుఁ, బ్రాసమును సంస్కృతనామముచేతనే వ్యవహరించుటయుఁ జూడఁగాఁ బ్రాసము నాంధ్రులు తమిళము నుండికాక సూటిగనో, కన్నడద్వారముననో సంస్కృతమునుండియే గ్రహించియుందురని తోఁచును ద్వితీయాక్షరమైత్రీరూపములగు 'ఎదుగైతొడై' భేదములు తమిళచ్ఛందోగ్రంధములందు వివరింపఁబడియున్నవి. ఆ భేదములలో 'అడియెదుగైతొడై' - అనఁగా పాదద్వితీయాక్షరమైత్రి-తెలుఁగునఁ బ్రాసమునకు సమానము. ఎదుగై తొడై భేదములు తమిళచ్ఛందములం దైచ్ఛికములని తెలియుచున్నది. ఆంధ్రుల ప్రాసము కేవల మైచ్ఛికముకాదు. వృత్తజాతులం దది నియతము. ఉపజాతులందునుఁ గొన్నింట నియతమే. సీస గీతాదులందు నియతము కాకున్నను నిషిద్ధముకాదు. కనుక ప్రాసము ఆంధ్రమునఁ గొన్ని ఛందములకు లక్షణము, కొన్నింటి కలంకారము నని భావింపవచ్చును. సర్వచ్ఛందస్సామాన్యము కానందువలన ఛందమునకు అంగ

మనిగాని, యలంకారమనిగాని యనుటకంటె కేశసంస్కరణ తిలకధారణాదికమువలె శోభాసూచమైన లక్షణముగానే ప్రాసమును గ్రహింపవలసియున్నది.

అనుప్రాసమువలె ప్రాసముగూడ రసావహమే యని భావింపవచ్చును. నియతస్థానాశ్రితమైన సదృశవర్ణావృత్తి ఛందమునకు శ్రవ్యతాతిశయము నాపాదించుట సత్యమ. అయినను నంతమాత్రమే ప్రాసముయొక్క ప్రయోజనమనుట సమంజసముకాఁజాలదు. రసప్రసంగమున్నచోట ప్రాసాక్షరము రసవ్యంజకము కావలసియే యుండును. అన్యత్ర శ్రుతిరంజనమునందే యది విశ్రమించును.

ఆంధ్రచ్ఛందోలాక్షణికులు ప్రాసాక్షరవిన్యాస వైచిత్రీభేదములు కొన్నింటిని గుర్తించియున్నారు. ఆదిచ్ఛాందసికుఁడైన మల్లియరేచన కవిజనాశ్రయమునం దాఱు ప్రాసభేదములను బేర్కొనినాడు.

> భాసురములగుచు సుకర
> ప్రాసానుప్రాస దుష్కరప్రాసాంత్య
> ప్రాస ద్విప్రాస త్రి
> ప్రాసములన షడ్విధములఁ బరగును గృతులన్.
>
> సంజ్ఞాధికారము

1. సుకరప్రాసము
2. దుష్కరప్రాసము
3. ద్విప్రాసము
4. త్రిప్రాసము
5. అంత్యప్రాసము
6. అనుప్రాసము

అని ప్రాసములు ఆఱువిధములు అనంతామాత్యుఁడు సుకరప్రాసమును విడిచి చతుప్ప్రాసమును జేర్చి షడ్విధప్రాసములను జెప్పెను. అప్పకవి సుకరప్రాసమును, చతుప్ప్రాసమును జేర్చి సప్తవిధప్రాసములను చెప్పెను. అనంతుఁడును, అప్పకవియు వీనిని శబ్దాలంకారము లనిరి. రేచన యట్లనలేదు, అనకుండుటయే యుచితము. షడ్విధప్రాసములు శబ్దాలంకారములు కావు. అవి శబ్దాలంకారభేదములుగా నే యాలంకారికుఁడును జెప్పియుండలేదు. శబ్దాలంకారము లనఁబడినవి పద్యమునను, గద్యమునను నుండవచ్చును. షడ్విధప్రాసములు పద్యములందుమాత్రమే ఉండఁదగినవి. కనుక వీనిని శబ్దాలంకారము లనుటయందు సామంజస్యములేదు. ఛందమునందే యుండఁదగినవి కనుక వీనికి ఛందోఽలంకారములని యీ వ్యాసమున వ్యపదేశముచేయఁబడినది.

షడ్విధప్రాసములకు రేచన చెప్పిన లక్షణములనుబట్టి చూచినచో వీనిని శబ్దాలంకారము లనుట ఆతనికి సమ్మతముగాదని స్పష్టపడఁగలదు.

"మఱి యనుప్రాసంబన్నది ప్రాసాక్షరంబు పెక్కెడల నిడి చెప్పునది." (సంజ్ఞాధికారము) ఇది రేచన చెప్పిన యనుప్రాసలక్షణము. ప్రాసమునం దేయక్షరముండునో ఆ యక్షరమునే పద్యమునఁ బెక్కెడల నిడి చెప్పినచో అనుప్రాసము అను నలంకారమేర్పడును. ఇది కేవలము ఛందస్సంబంధియైన యలంకారము. ఏదోయొక యక్షరమును బద్యమునుఁ బెక్కెడల నిడి చెప్పినచో నేర్పడు అనుప్రాసము శబ్దాలంకారము. అట్టిది గద్యమునందు నుండవచ్చును.

అప్పకవి యీ రహస్యమును గుర్తింపలేదని యాతని యనుప్రాసలక్షణమువలన నూహింపనగుచున్నది.

"బడిబడిని వర్ణమొక్కండు కడకు వెడలఁ
బలుకఁబడెనేని నది యనుప్రాసమయ్యెఁ
గంజలోచన యవి యలంకారశాస్త్ర
కథితములు వీని నేడింటిఁ గానవలయు"

అప్పక. III. 381

ఇది శబ్దాలంకారమైన యనుప్రాసముయొక్క లక్షణము. రేచన యనుప్రాసలక్షణముకంటె నిది భిన్నము, "ఇంక శబ్దాలంకారంబులగు విశేషప్రాసంబు లెఱింగించెద" నని సుకరదుష్కరాది సప్తవిధప్రాసములను జెప్పుటయే కాక "ఇవి యలంకారశాస్త్రకథితములు వీని నేడింటిఁ గానవలయు" నని చెప్పుట మిక్కిలి ప్రామాదికము. ఛందఃశాస్త్రప్రసక్తములయిన యీ యలంకారములకు శబ్దాలంకారములతోఁ గొంత పోలిక యున్నది కాని యివి యవియే యనుట మాత్రము యుక్తముకాదు. లక్షణనిబంధమునను, స్వరూపగ్రహణమునందును అప్పకవి పొరపడినను లక్ష్యమున రేచననే యనుసరించెను. (చూ. II-1391)

ఈ క్రింది యుదాహరణములవలన శబ్దాలంకారమైన యనుప్రాసమునకును, ఛందోఽలంకారమైన యనుప్రాసమునకును భేదము స్పష్టమగును.

వివిధోత్తుంగ తరంగ ఘట్టన చలద్వేలావనైలావలీ
లవలీ లుంగ లవంగ సంగత లతా లాస్యంబు లీక్షించుచున్.

ఆది. II. 30.

ఇందు బిందుపూర్వక గకారము, లకారము బహువారము లావృత్తములై యున్నవిగనుక వానివలన ననుప్రాసమను నలంకారము సిద్ధించుచున్నది. ఆవృత్తములయిన యక్షరములలో నేదియు ప్రాసాక్షరము కాదు గనుక నీ యనుప్రాసము గద్యపద్యోభయసామాన్యమై శబ్దాలంకార మనఁ దగియున్నది.

"అందమరబృంద వంద్యున
కిందుకళాభరణునకు నుమేశ్వరునకు నా
నందం బొందఁగ నందఱు
నందకధరుఁ డుత్సవం బొనర్పం బంచెన్"

ఆది. VIII. 191.

ఇందావృత్తమైన బిందుపూర్వక దకారము ప్రాసాక్షరముగూడ నై యుండుటచే దానివలన సిద్ధించిన యనుప్రాసము ఛందోఽలంకారము.

అంత్యప్రాసమునకు రేచన లక్షణ మిట్లున్నది - "మఱి యంత్యప్రాసమన్నది మొదటి పాదము కడపటి యక్షరంబు నాలుగుపాదంబుల కడపడ నిడి చెప్పునది." (సంజ్ఞా) లక్షణమునఁ బాదప్రసంగము కలదుగాన పాదనియమరహితమైన గద్యమున నిది యుండఁజాలదనుట స్పష్టము. దీని లక్షణము నిబంధించుటయందును అప్పకవి పొరపడెనేమో యనిపించుచున్నది.

"పదములఁదుది నొక్కపగిది యక్షరములు
దనరు నంత్యప్రాసమునకు నెందు."

III. 381.

అని యప్పకవి యంత్యప్రాసలక్షణము. "పదముల" ననఁగా సుప్తిఙంతములయిన పదములైనచో రేచనలక్షణముకంటె భిన్నమై యప్పకవిలక్షణము ప్రామాదికమగుచున్నది. పదముల యంతములందొక్కపగిది యక్షరములుండుట యంత్యానుప్రాసమను శబ్దాలంకారముయొక్క లక్షణము. నాల్గుపాదముల యంతములందును సదృశాక్షరములుండుట ఛందోఽలంకారలక్షణము. 'పదము' అనఁగా పాదమని యప్పకవి యభిప్రాయమైనచో లక్షణమున దోషముండదు. లక్ష్యము లనుబట్టి చూడఁగాఁ బాదమనుటకే యాతఁడు పదమనెనని తేలుచున్నది.

"———మోహనాకార ! యభిమన్యు
వీర ! నిర్వికార ! వినుతసార !"

శ్రీ. II. 82

పదాంతములందు సదృశవర్ణావృత్తియుండుటచే నిది యంత్యానుప్రాస మనఁబడు శబ్దాలంకారము.

త్రిజగదవన నిత్యక్రీడనోద్యత్ప్రమోదా !
రజనిచర విఘాతారంభ లీలావినోదా !

విరాట. III. 20.

పాదాంతములందే సదృశవర్ణావృత్తి యుండుటచే నిది యంత్యప్రాస మనఁబడు ఛందోఽలంకారము. వీని నామములందే భేదమున్నది. అలంకారశాస్త్రసంబంధియైనది "అంత్యానుప్రాసము." ఛందశ్శాస్త్రసంబంధియైనది "అంత్యప్రాసము". ఇది ప్రాసభేదము : అది అనుప్రాసభేదము.

ద్వి. త్రి. చతుష్ప్రాసములు యమకభేదములను బోలినవి. పోలివేనకాని యవియే యివి కావు. దండి చేసిన యమకలక్షణము —

"అవ్యపేత వ్యపేతాత్మా వ్యావృత్తి ర్వర్ణసంహతేః
యమకం; తచ్చ పాదానాం ఆదిమధ్యాంత గోచరం."

కావ్యాదర్శము. III. 1.

పాదములయొక్క ఆదిమధ్యాంతములం దెచ్చటనైనను అవ్యవహితముగాఁగాని, వ్యవహితముగాఁగాని కొన్నివర్ణములచే నేర్పడిన సమూహమును పునఃపునరావృత్తముచేయుట యమకము. ద్వి త్రి చతుష్ప్రాసములు పాదాది వ్యపేతయమకములవంటివని చెప్పవచ్చును. పాదచతుష్టయగత పాదాదివ్యపేతయమకమునకు దండి యుదాహరణము —

"కమలేః సమ కేశం తే
కమలేర్ష్యాకరం ముఖం
కమ లేఖ్యం కరోషి త్వం
కమలే వోన్మదిష్ణుషు"

III. 29.

ఈ లక్ష్యమునుబట్టి యావృత్తము కావలసిన వర్ణసంహతియొక్క లక్షణముల నిట్లు వివేచింపవచ్చును.

1. వర్ణసంహతియందు స్వరవ్యంజనసాదృశ్య ముండునట్లు ఆవృత్తము కావలెను.

2. వర్ణసంహతి యేకపదరూపము కానక్కఱలేదు.

దండి ప్రదర్శించిన యమకభేదములనుఁబట్టి చూడఁగా సదృశవర్ణసంహతియొక్క ఆవృత్తి పాదచతుష్టయమునను ఉండితీరనక్కఱలేదు. పాదద్వయమునఁ, పాదత్రయమునఁగూడ ఉండవచ్చును.

ఛందోఽలంకారములయిన ద్విత్రిప్రాసములు నిట్టివే. కాని యావృత్తమగుచున్న వర్ణసంహతియందు స్వరభేదమున్నను దోషములేదు. ప్రాసమునకువలె వీనికిని వ్యంజనమే ప్రధానము. ఆవృత్తమగుచున్న వర్ణసంహతి భిన్నపదములకుఁ జెందిన వర్ణములతో నేర్పడవచ్చును. ప్రాసమువలెనే ద్వి త్రి ప్రాసములుగూడ గద్యమునం దుండవుగనుక ఛందోఽలంకారములే యగునుగాని శబ్దాలంకారములు కాఁజాలవు. యమకము గద్యమందును ఉండునుగనుక నివి యమకముకంటె భిన్నములు. ద్వి త్రిప్రాసములకుఁ బాదాది వ్యపేతయమక మొక్కదానితోడనే కొంత సాదృశ్యముగలదు.

"మకర వ్యూహం బనియెడు
మకరాలయ మపుడు దర్పమహిమోజ్జ్వలుఁడై
మకరక్రీడం జండత
మ కరాభీలముగఁ జొచ్చె మారుతి యధిపా!

భీష్మ. II. 276.

దీనియందు యమకచ్ఛాయ కొంత గోచరించుచున్నది. కాని ద్వి త్రి ప్రాసములన్నింటను బాదప్రథ మాక్షరావృత్తి యుండదు. ద్వితీయాక్షరముతోపాటు తృతీయాక్షరములుగూడ వ్యంజనప్రాధాన్య ముతోఁ బునరావృత్తము లగును.

ఓంకార వాచ్యునకు నన
హంకార నిరూఢ భావనారాధ్యునకున్
హ్రీంకారమయ మనోజ్ఞా
లంకారోల్లాస నిత్యలాలిత్యునకున్.

విరా. I. 32.

ద్విప్రాస స్వరూపమిది. త్రి చతురాదిప్రాసముల స్వరూపము నిట్లే యుండును. యమకము లని యతస్థానములు. ఇవి నియతస్థానములు.

సుకర దుష్కర ప్రాసములు కేవల మలంకారభేదములని చెప్పఁదగినవికావు. ప్రాసాక్షర గత రసవ్యంజకతా ధర్మభేదములుగా వీనిని గణించుటుచితము. రేచన వీని స్వరూపమును గూడ చక్కఁగా నిర్వచించెను.

"సుకరప్రాసంబన్నది సులభాక్షరంబులు ప్రాసంబిడి చెప్పునది." "దుష్కరప్రాసం బన్నది విషమాక్షరంబులు ప్రాసంబిడి చెప్పునది." (సంజ్ఞా), సుకరమనఁగా సులభమనియు, దుష్కరమనఁగా విషమము అనియు రేచన యభిప్రాయము. వక్తకు ఎట్టి యక్షరముల యుచ్చా రణము సుకరమో అవి సుకరములు విషమస్థానములయిన వర్ణముల సంయోగముచే నేర్పడిన యక్షరము విషమాక్షరము. ఇట్టి యక్షరముల యుచ్చారణము దుష్కరము. రేచన యభి ప్రాయమును అప్పకవి యింకను స్ఫుటముచేసెను.

"ప్రాసంబు సులభాక్షరంబైన సుకరంబు
దుర్లభంబైనను దుష్కరంబు"

III. 381.

సులభాక్షరము సుకరము, దుర్లభాక్షరము దుష్కరము నన్న వివేకము అర్థవంతముగా నున్నది. భాషయందు సుకరముగా నుచ్చరింపఁదగిన యక్షరములే సులభములు – విరివిగా లభించునవి.

ఉచ్చారణదుష్కరములయిన యక్షరములు దుర్లభములే - అరుదుగా లభించునవి. సుకరదుష్కర ప్రాసములకు వారిచ్చిన యుదాహరణములనుబట్టి సులభదుర్లభాక్షరముల స్వరూపము గొంత వఱకు నిర్ణయించుకొనవచ్చును. సుకరప్రాసమునకు రేచన లక్ష్యము :

పరమోపకార ధరణీ
సురవరసురభూజ సుగుణసుందర......

అప్పకవి లక్ష్యము :

కమలదళనయన సకలా
గమవేద్య పురాణపురుష కరుణాకర మ
ద్రమహీశప్రియతనయా
రమణ యనుచుఁ బలుక సుఖకరప్రాసగున్.

III. 382

అసంయుక్తము, అద్విరుక్తము, అబిందుపూర్వకము, అల్పప్రాణమునై సుఖముగా నుచ్చరింపఁ దగిన యక్షరము సుకరప్రాసాక్షరమని వీరి లక్ష్యములవలన గుర్తింపనగుచున్నది. సుకరప్రాస మును అప్పకవి 'సుఖకరప్రాసము' అనుట గమనింపవలెను. ఏ యక్షరము ఉచ్చారణమున వక్తకు, శ్రవణమున శ్రోతకుఁ, బ్రయోగమునఁ గవికి సుఖకరమో ఆ యక్షరముగల ప్రాసము సుకరప్రాసము. అక్షరములయొక్క సుఖకరత్వమునఁ దారతమ్యము, రసాదివ్యంజనమున నట్టియక్షరముల యౌచిత్యము పరిశీలింపఁదగియే యున్నది.

దుష్కరప్రాసమునకు రేచన యుదాహరణము :

"స్వఃకాంతాసమయోషిదు
రఃకృతరతిచిహ్న దుష్కరప్రాసం బా
విఃకృతమగు నిట్లు———"

అప్పకవి యుదాహరణము :

దుష్కృతగిరి వజ్రాయుధ
పుష్కరసదనాధినాథ బుధనుత దవశో
చిష్కేశాహిర యనన్
దుష్కరమని దీనిఁ బల్కుదురు ప్రాసజ్ఞుల్.

III. 383

స్థానకరణప్రయత్నాదులందు విషమములయిన వర్ణముల సంయోగములు, విసర్గపూర్వకములు దుష్కరప్రాసాక్షరములు. భాషయందుఁ దఱచుగా లభింపనివి, ఉచ్చారణమున దుఃఖకరము లయినవి – ర్భ, ర్జ్ఞ, గ్మ, ధ్మ, ష్మ, ష్ట్రి – మున్నగు నక్షరములు దుష్కరప్రాసాక్షరములే యనవలెను. న్న, ల్ల, ంగ వంటివి కేవలము దుష్కరము లనఁజాలము. కనుక సుకర దుష్కర ప్రాసములనడుమ నెన్నియో భేదములు సంభావ్యము లగుచున్నవి.

సుకరములయిన యక్షరములుండఁగా దుష్కరములయిన యక్షరములను ప్రాసముకొఱ కెన్నికచేయుటయందు కవికి విశిష్టప్రయోజనాపేక్ష యేదియో ఉండవలెను వక్తృవాచ్యాద్యౌచిత్య దృష్టితో కవులు ప్రాసాక్షరముల నెన్నికచేయుదురని భావించుట యుచితము. ప్రాసాక్షర నిష్ఠమైన రసాదివ్యంజకతాధర్మము అనుశీలింపఁదగియేయున్నది. ప్రాసమువంటి ప్రముఖస్థానమున బహువార మభ్యస్తమైన యక్షరము ఛందమున స్వీయగుణమును సంక్రమింపఁజేసి రసమును భంజించుటకుఁ బోషించుటకు సమర్థమైయుండును. కవిత్రయము రసభావవ్యంజకముగఁ బ్రాసాక్షరము నిర్మించిన సందర్భములు పెక్కుగలవు.

దుర్భర యగు నినుఁ గర్కటి
గర్భము ధరియించినట్లు గైకొని నాకై
నిర్భరవిధ్వంసదశా
విర్భావముఁ దెచ్చికొనుట వెరవై యున్నే ?

విరా. I. 322.

మూర్ధన్యరేఫము మహాప్రాణోష్ఠ్యముతో సంయుక్తమై యుచ్చారణమునకుఁ బారుష్యము భారము గలిగించుచున్నది. సైరంధ్రీసౌందర్యలోలుఁడై తన భర్త తన్ను దిరస్కరింపవచ్చుననియు, సైరంధ్రి నాదరించినచోఁ దన కాత్మనాశనదశ యావిర్భవింపవచ్చుననియు భయపడి సుదేష్ణ పలికిన వాక్యమిది. "రిఫ్యతే విపాట్యతే వస్త్రాది పాటనధ్వనివ దుచ్చార్యతే ఇతి రేఫః" అను న్యాయమున వస్త్రాదులను చింపునప్పుడు జనించు కఠోరధ్వనివంటి ధ్వనిగలది రేఫము. కర్కటి గర్భమందలి యండములు పిల్లలై తల్లి యుదరమును జీల్చికొని బయటికివచ్చి మాతృవినాశన హేతువులగునని లోకన్యాయము. పద్యమందలి ప్రాసాక్షరమైన 'ర్భ' యొక్క యుచ్చారణము వస్త్రాదిపాటనజన్యమైన కఠోరధ్వని నుత్పాదించుచు కర్కటీగర్భదారణమును వ్యంజించుచున్నది. 'భ' కార గర్భమందలి రకారము పద్యమందలి యలంకారముతోఁ జక్కగా సంవదించుచున్నది. మహాప్రాణమైన భకారము ఆత్మవినాశనోత్ప్రేక్షచే సుదేష్ణకుఁ గలిగిన భయముతోడి దుఃఖమును, తన్మూలకమైన ప్రాణవాయువ్యయరూప నిఃశ్వాసగాఢత్వమును బట్టియిచ్చుచున్నది. పద్యమందలి యితరాక్షరము లన్నింటికంటె భారమై 'ర్భ' యన్నయక్షరము పద్యమునఁ దన ప్రాభవమును స్థాపించుకొనుచు పద్యార్థవ్యంజనమునకుఁ బూచీపడుచున్నది. శ్రోత్రేంద్రియపాత మాత్రముననే సుదేష్ణాచిత్తగత భయభ్రాంతిని సహృదయుని హృదయమున సంక్రమింపఁజేయుచున్నది.

సాంతస్థసంయోగములు దారుపిండములవంటివని యాజ్ఞవల్క్యశిక్షావచనము గలదు.[2] అవి పెళు సుగానుండి కట్టెవిఱిగినట్లు విఱుగునేకాని మెత్తగాఁ గలిసియుండవు. రకార భకార సంయోగ మట్టిదారుపిండము. కట్టెవిఱిచినట్టు నిష్ఠురముగాఁ బలికిన యామె వాక్యధర్మమును ప్రాసా క్షరము చక్కఁగా నిరూపించుచున్నది. సుదేష్ణపలికిన యీ వాక్యమునకు ద్రౌపది సమాధానమునఁ బ్రాసాక్షరము బిందుపూర్వక ధకారము.

బంధుశతంబులు శౌర్యమ
దాంధములై శక్తిసంపదాఖీలతమై
సింధురసదృశత నున్నను
సంధులుసంధు లెడలించి చంపుదు రతనిన్.

విరా. I 325.

తన శీలమును, భర్తశీలమును శంకించుచున్న సుదేష్ణపట్ల ద్రౌపదికి కోపము, ఏవగింపుఁ గలిగి నవి. కాని యా భావములను వెల్లడించుట కప్పటియవస్థలో నామె కవకాశములేదు. ఎట్లయిన నామె యాశ్రయమును దాను పొందవలయును. తనచిత్తమందలి క్రోధజుగుప్సల నణంచుకొని, సుదేష్ణచిత్తమందలి శంకాభయముల నపనయించుటకై ద్రౌపది పలికిన వాక్యమున బిందుపూర్వక ధకారము ప్రాసస్థానమున నిల్చినది. క్రోధభయజుగుప్సాది దుఃఖకరభావములు చిత్తము నావే శించినప్పుడు వాగుచ్చారణమునఁ బ్రాణవ్యయాధిక్యము సహజము. మహాప్రాణాక్షరము లట్టి వాక్యములందు రూపొందును. నిశ్శ్వాసభారలక్షణములు మహాప్రాణాక్షరములు. ప్రాసస్థాన మందలి ధకారము అనుస్వారసంపర్కమున మధురమై దుర్భరగా భాసించుచున్న సైరంధ్రిని సుదేష్ణ యాదరించునట్లు చేయుచున్నది.

"ముఖనాసికా వచనో అనుస్వారః"[3] అనున్యాయమున వదనద్వారమున నిర్గమింపవలసిన వాయువు కొంత నాసికాద్వారమునఁగూడ నిర్గమించుటచే బిందుపూర్వక ధకారము కేవల ధకార మంత భారమగుటలేదు. రక్తసంజ్ఞకమైన[4] యనునాసికము సంపర్కమునచే ధకారముగూడ శ్రోతను రంజింపఁజేయుచున్నది.

గంగాధర పింగజటా
సంగమ మంగళవిశాల సలిలతరంగన్
గంగానది సేవించెను
గంగాద్వారమున విగతకల్మషుఁ డగుచున్.

ఆది. VIII. 126

ఇది కవివాక్కు. పరమేశ్వర జటాజూట సంపర్కమునఁ బవిత్రతఁ బ్రాపించిన గంగానదిని స్మరించి కవిచిత్తము భక్తిభావరంజిత మగుచున్నది. ఆ హృదయమాధుర్యము బిందుపూర్వక గకారరూపము ధరించి ప్రాస ప్రాసేతరస్థానములఁ బ్రత్యక్షమగుచున్నది.

"నాసాదుత్పద్యతే రంగః
కాంస్యేన సమ నిస్వనః"[5]

అను న్యాయమున రంగనామకమైన యనుస్వారము హృదయమునుండి యుద్భవించి, నాసాద్వారమున నిర్గమించి కంచుతాళములు మ్రోగినట్లు కంగుమనును. కాంస్యతాల ధ్వనివలె శ్రోతృచిత్త రంజకమగుటచే ననుస్వారము 'రంగ' మనఁబడినది. గంగాధరేత్యాది పద్యమున నట్టి యనుస్వారము సరళనాదవర్ణానుగతమై యత్యంతము శ్రుతిసుఖావహ మగుచున్నది. ప్రాసస్థానగతమైన బిందుపూర్వక గకారము సప్తవార మభ్యస్తమై స్థాయిత్వముబొంది పద్యము పద్యమంతయుఁ గాంస్యతాలధ్వనిమయమైనట్లు భాసించుచు వర్ణ్యవస్తుగతమైన వక్తృప్రీతిని సుష్ఠుగా వ్యంజించుచున్నది.

ప్రాసాక్షరము పదమధ్యగతమో, పదాంతగతమో యైనచోఁ బాదగతి లలితముగనుండును. నన్నయ్యపద్య మట్లు నడచుచున్నది. అట్టిప్రాసములను లలితప్రాసము లనవచ్చును. ప్రాసస్థానమునఁ బదాద్యక్షరము నిలిచినచోఁ బాదగతియందు భంగము గోచరించును. ఆ భంగము తఱచు చమత్కారహేతువగును. పదారంభాక్షరమున ఊనిక యుండును. ఊనిక లేని యక్షరము ప్రాసస్థానమున నుండి పాదగతియం దొదిగిపోవును ఊనికగల యక్షరము పాదగతికి క్షణమాత్రనిరోధము గల్పించి యించుక దుమికించును. లాక్షణికులు సంధిగతప్రాసములన్న విట్టివి. శ్రుతి చమత్కారకారులగు వీనిని ప్రౌఢప్రాసము లనవచ్చును. తిక్కనకుఁ బ్రౌఢప్రాసములనిన మక్కువ.

గాంగేయునిఁ గుంభజుఁ గ
ర్ణుం గడచితి మింక నుద్ధురుండగు మద్రే
శుం గూల్పు మంతతోడఁ దె
గుం గురుపతి పని జయంబు గొనుము కడంకన్.

శల్య. I. 94.

కౌరవపక్షమందలి మహావీరులందఱును దెగిరి. పాండవులకు విజయము నిశ్చితకల్పమైనది. కడపటి సేనాపతి శల్యుఁడు. అతనిని గూల్చినచో జయము సిద్ధించినట్లే. శల్యుని గూల్పుమని శ్రీకృష్ణదేవుఁడు ధర్మజుని బురికొల్పుచున్న వాక్యమిది. ద్వితీయ తృతీయ, చతుర్థ పాదారంభాక్షరములతోఁ బదములు ముగిసి, ప్రాసస్థానములందు భిన్నపదాద్యక్షరములు నిలుచుటచే పద్యగతి మాటిమాటికిఁ దెగి వాక్యార్థము ఛందోగతిచేఁ జక్కగా వ్యంజింపఁబడుచున్నది. 'మద్రేశుం గూల్పు' 'తెగుం గురుపతి పని' యన్న ప్రచోదకవాక్యములు పాదావసానములను గడచి విశ్రమించుట, వాని యవసానములు, ద్రుతాంతములగుట, ఈ సర్వమును బ్రాసస్థానగతమగుట పద్యమున కసాధారణగతివిశేషమును, మనోరంజకతను ఆపాదించుచున్నవి. సంధిగతమైన ప్రౌఢప్రాసము, పద్యమందంతటను నిండియున్న బిందుపూర్వకాక్షరములును గందపద్య

మునఁ గౌదమసింగపుఁబిల్ల తురంగలింపులను నిరూపించుచున్నవి. స్వపక్షవిజయ నియతాప్తి జనితమైన హర్షముతో శ్రీకృష్ణదేవుఁడు ధర్మజుని శల్యవధమునకుఁ బ్రోత్సహించు వాక్యము హర్షోత్సాహమధురమై చెంగుచెంగున దుముకుచుండుట సహజము.

గర్జద్గుణుఁడై పగతుర
జర్జరితాంగులుగఁ జేసె సాయకజాల
స్ఫూర్జన చూపఱు వొగడఁగ
నిర్జరవరనందనుండు నిమిషార్ధములోన్.

విరా. V. 37.

లాక్షణికు లిట్టిప్రాసమును దుష్కరప్రాసమనిరి. భిన్నస్థానజన్యములయిన రకార జకారముల సంయోగము ఉచ్చారణ శ్రవణ దుఃఖకారి. వాక్యార్థమును అక్షరములందు రూపించు సభినివేశము లేనిచోఁగవి యిట్టి దుర్లభాక్షరము నెన్నికచేయుఁడు. మూర్ధన్యమైన రేఫ మాగ్నేయమనియుఁ, దాలవ్యమైన జకారము వాయవ్యమనియు మంత్రశాస్త్రప్రసిద్ధి. వాయ్వగ్నిసంయోగ మెట్లు ఛేదక దాహకలక్షణమో అట్లే రేఫ జకారసంయోగము శ్రుతివిదారక సంతాపకలక్షణము. అర్జునునకు ఉఱుములతోఁ బిడుగులుగురియు మేఘములతోడి సామ్యము వాక్యార్థమున ధ్వనించుచున్నది. కనులు మిఱుమిట్లుగొల్పు కాంతులతోఁ, జెవులు చిల్లులువడఁజేయు శబ్దముతోఁ బిడుగుపడినప్పు డెట్లు క్షణమాత్రన మహావిధ్వంసము జరుగునో పద్యార్థము తెలుపుచున్నది. అర్జునునియందుఁ బర్జన్యత్వమును ధ్వనించుచున్న యీ పద్యమున నట్టి రూపకధ్వని ప్రాసాక్షరముచే సుష్ఠుగా సమర్థింపఁబడుచున్నది. 'గర్జత్' 'స్ఫూర్జన' పదములు పిడుగుపాటును వినిపించుచున్నవి.

కార్చిచ్చు గవిసి మృగముల
నేర్చుకరణి నేఁడు భీష్ముఁ డేచినకడిమిం
బేర్చి మనసేనఁ బొదివె శ
రార్చుల; నవ్వీరుఁ గన్నులారం గంటే ?

భీష్మ. III. 278.

పరుషతాలవ్య చకారసంయోగమున నాగ్నేయమైన రేఫము పరుషతరమై పద్యార్థమును జక్కఁగా భాసింపఁజేయుచున్నది. "కేచన వర్ణాః సంతాపయంతీవ నికృంతంతీవ రేఫ కకారాదయ ఇవ" అన్న యభినవుల వాక్యము నిట స్మరింపవలెను.

దృష్టాంతము సెప్పెదనని
కష్టాత్మా నీవు నన్ను గాకము నరు ను
త్కృష్టమరాళముగాగ ని
కృష్టపుగథఁ జెప్పితిది సభిత్వముతెలిఁగే ?

కర్ణ. II. 97.

"శల్యుండు సెప్పిన యుపాఖ్యానంబునం జిత్తం బెఱియుచునికింజేసి'' కర్ణుఁడు శల్యునితోఁ బలికిన వాక్యమిది. ఎఱియుట యనఁగా మండుట. కోపప్రజ్వలితహృదయనిర్గతమైన యీ వాక్యమునఁ బ్రాసస్థానమున మూర్ధన్యద్వయసంయోగనిష్పన్నమైన 'ష్ట' కారము నిల్చుట యుచితముగ నున్నది. అట్టి సంయోగము మూర్ధన్యమైన 'ఱు' కారసన్నికర్షచే దీప్త్యతిశయవ్యంజక మగుచున్నది. ఊష్మ పరుషస్పర్శసంయోగము-ష్ట-రగిలి రగిలి పగిలిన యగ్నిపర్వతధ్వనిని దలపింపఁజేయుచున్నది. క ట ప లను Plosives అనియు శ ష లను Fricatives అనియు నాంగ్లమున వ్యవహరింతురు. ఆ యాంగ్లపరిభాష యీ సందర్భమున 'ష్ట' ప్రాసమును సార్థకము చేయుచున్నది.

> పెట్టక కట్టక మౌళిం
> బుట్టినక్రియ దీధితులు నభోభాగంబుఁ
> ముట్టి వెలుంగఁగ నింద్రుని
> పట్టి కిరీటంబు వొలిచెఁ బ్రస్ఫురితంబై

విరా. IV. 167.

మూర్ధన్యటకారద్వయ సంయోగము ''మౌళిం బుట్టినక్రియ" ఎన్న యర్థమును సమర్థించుచు మస్తకమకుటసంయోగమును బ్రత్యక్షకల్పము గావించుచున్నది.

> నెట్టన యాపగాసుతుఁడు నేలకు వ్రాలె ననంగ విన్న నా
> కట్టడివీను లేమి వినుకాఱియ కోర్వవు ; దుర్వినీతికిం
> బుట్టినయిల్లనై వినకపోవఁగవచ్చునె యింక నాకు ; నే
> దిట్టఁడనైతి నెల్లవియుఁ దెల్లముగా విననేర్తు సంజయా !

భీష్మ. I. 65.

భీష్మమరణము విని విలపించు ధృతరాష్ట్రుని వాక్యమిది. ఉచ్చతరస్థానజన్యమైన టకారము ద్విరుక్తమై ధృతరాష్ట్రవిలాపమందలి యుచ్చస్వరత్వమును సూచించుచున్నది. మూర్ధతాడన రూపమైన ధృతరాష్ట్రుని శోకోద్రేకాభినయముగూడ ప్రాసాక్షరములం దనుమేయమగుచున్నది. ద్విరుక్తపరుషటకారశ్రుతి వీనులను గాఱియవెట్టుచుంట యనుభవసిద్ధము.

సమరప్రస్థానసన్నద్ధుండై ధర్మజునకు మ్రొక్కవచ్చిన పాండవసర్వసేనాపతియగు దృష్టద్యుమ్నుని వర్ణించు పద్యమునఁ దిక్కన 'ష్ట'కార ప్రాసమును గూర్చెను.

> సాష్టాంగమెఱగి సమరా
> వష్టంభం బొప్ప దివ్యవాహనలీలో
> త్కృష్టగతిన్ ముంగలియై
> ధృష్టద్యుమ్నుండు వొలిచెఁ దేజోమహిమన్

ఉద్యో. IV. 129.

మూర్ధన్యపరుషోష్మసంయోగమైన 'ష్ట' అత్యంతశ్రుతిసంతాపకము అగ్నిసంభవుఁడై, తేజో మహితుఁడైన ధృష్టద్యుమ్నుని వర్ణనమునఁ బ్రాసస్థానమం దాగ్నేయాక్షరసంపుటి నివిష్టమగుట పరమోచితముగా నున్నది యుద్ధారంభమునఁ బాండవసేనలు కదలునప్పుడుగూడ ధృష్టద్యుమ్న వర్ణనమునఁ దిక్కన "పుష్టోదంచిత" – ఇత్యాదిపద్యమున 'ష్ట'కారప్రాసమునే ప్రయోగించెను.

కాశిరాజదుహితల నపహరించి కొనిపోవు తన్నెదిరించిన రాజులతో భీష్ముఁడు పోరాడు సందర్భమున నన్నయ శకటరేఫప్రాసము నుపయోగించుట మిక్కిలి సరసముగనున్నది.

నెఱి నుఱక వైరివీరుల
నెఱఁకులు దూఱంగ నేయ నృపపుంగవు నం
పఱ కోర్వక పిఱుసని రని
వెఱచి విషణ్ణులయి సకలవిషయాధిపతుల్

ఆది IV. 203.

రేఫమే శ్రుతినికర్తనశీలము. శకటరేఫముమాట చెప్పనేల? నెఱఁకులనఁగా మర్మములు. భీష్ముని బాణములవలెనే శకటరేఫము మర్మచ్ఛేది. అట్టి శకటరేఫము బహువార మావృత్తమై యీ పద్యమున మర్మచ్ఛేదకమైన భీష్ముని యంపఱను దలపించుచున్నది. "వివిధ విషయాధిపతుల్ వెఱచి విషణ్ణులయి పిఱుసనిరి" అన్నమాటయం దొక చమత్కారము భావింపఁదగి యున్నది. విషయాధిపతు లనఁగా నింద్రియములు. శకటరేఫోచ్చారణమున వాగింద్రియము, శ్రవణమున శ్రోత్రేంద్రియము, దర్శనమున నేత్రేంద్రియము విషణ్ణములగు ననుట యనుభవ వేద్యము. ప్రాసానుప్రాసరూపమునఁ బద్యమునం దావృత్తమైన శకటరేఫము సహృదయశ్రోత్రా ద్యుద్వేజకమై పద్యార్థానురూపముగ నున్నది.

"భవేత్ శ్రుతికటు ర్వర్ణః శ్రవణోద్వేజనే పటుః" అను చంద్రాలోకవాక్యమును "శ్రుతిభీతిప్రదో వర్ణః కార్ణ్యాన్మృత్ శ్రుతికటు ర్భవేత్" అన్న సాహిత్యసారవాక్యమును (విష రత్నము. 182 పుట) నిచ్చట స్మరింపవలెను.

తాను గీచకుని వధించుతెఱంగును వర్ణించుచు భీముఁడు ద్రౌపదితోఁ బల్కిన వాక్యమునఁ దిక్కన యిట్లే శకటరేఫమును బ్రాసానుప్రాసరూపమునఁ బ్రయోగించెను.

ఎఱిఁగిఁ బిఱుసనిన వెసఁ బై
కుఱుకుదు సాళువము కాకి నొడిసినభంగిన్
వెఱచఱవం బొదువుదుఁ బఱి
పఱిసేయుదు నీదు పూన్కి పారంబెయిదన్

విరా. II. 282.

సాళువము కాకి నొడిసినభంగి బెదరి పాఱు శ్రోత్రేంద్రియమును శకటరేఫము తఱిమితఱిమి పట్టుకొనుచున్నది. భీమసేనుఁడు కీచకునిఁ బఱిపఱిచేసినట్లుగా బహువార మావృత్తమై 'ఱ' కారము శ్రవణేంద్రియమును జీల్చుచున్నది.

కణ్వుని యాదేశముననుసరించి దౌష్యంతిం దోడ్కొని 'దుష్యంతుపాలికి వచ్చి సకల సామంతమంత్రిపురోహిత పౌరజనపరివృతుండై యున్న యా రాజుం గనుంగొని శకుంతల తనలో ననుకొనిన వాక్యములందు రేఫ, శకటరేఫములు క్రమముగాఁ బ్రాసాక్షరస్థితి నందుట రసోచితమై యున్నది. పతి యనాదరణమువలన శకుంతల చిత్తమునఁ గ్రమవృద్ధినందిన దీప్తి నీప్రాసము లుపలక్షించుచున్నవి.

గురు నాశ్రమంబునను ము
న్నరుదుగఁ బతివలనఁ గనిన యనురాగము నా
దరణము ననుగ్రహంబును
గరుణయు సంభ్రమము నపుడు గానక యెడలో

ఆది. IV. 68.

ఎఱుఁగఁడొకొ నన్ను నెఱిఁగియు
నెఱుఁగని యట్లుండునొక్కొ ! యెడ దవ్వగుటన్
మఱచెనొకొ ? ముగ్ధ లధిపులు
మఱవరె ? బహుకార్యభార మగ్నులుగారే ?

ఆది. IV. 69.

పతి యత్యంతానురాగమునఁ దన్నును, దనకుమారుని నాదరించునని యాశపడి వచ్చిన శకుంతల దుష్యంతుని తూష్ణీంభావమును గాంచి యాశాభంగము పొందినది. ఆశాభంగజనితమైన యామె చిత్తసంతాపస్వరూపమును నన్నయ సాధురేఫప్రాసమునఁ బ్రతిపాదించెను. దుష్యంతునియందు కాపట్యము శంకించిన శకుంతల చిత్తసంతాపము కోపసాదృశ్యమును బ్రాపించి యామె స్వగత వాగనుభావమున శకటరేఫరూపముఁ దాల్చినది. బహుకార్యభారమగ్నులగు నధిపులకు మఱపు సహజమేకదా యన్న భావముదయించినంత శకుంతలచిత్తము కొంతచల్లబడినది. ఆ చల్లదనము "తలఁపఁగ నాఁడు వల్కినవిధంబు" - అను ననంతరపద్యమందలి లకారప్రాసావిర్భావము నకుఁ దగిన క్షేత్రమగుచున్నది. దుష్యంతుని చూడ్కులు క్రమముగ విరసము లగుచుండుట గమనించిన శకుంతల చిత్తమున మరల శంకపొడమినది. నవప్రియులైన ధరాధినాథులను నమ్మరాదను నిశ్చయము గలిగినది. దానితోఁ దిరిగి యామెచిత్తము కోపదీప్తమైనది. ఆమె స్వగతవాగనుభావమునఁ దిరిగి శకటరేఫము ప్రత్యక్షమైనది.

"మఱచినఁ దలపింపందగు
నెఱుఁగనినాఁ దెల్లపాట నెఱిఁగింపనగున్
మఱి యెఱిఁగి యెఱుఁగనొల్లని
కఱటిం దెలుపంగఁ గమల గర్భుని వశమే ?

ఆది. IV. 72.

ఇచ్చటఁ బ్రాసానుప్రాసరూపమునఁ బునఃపునరావృత్తమైన శకటరేఫము శకుంతలా కోపదీప్తిని సుష్ఠుగా వ్యంజించుచున్నది.

విభావవర్ణనమున శకటరేఫముయొక్క వ్యంజకత శాపగ్రస్తుఁడై, కురూపియై దమయంతీవిరహార్తుఁడై యున్న బాహుకుని వర్ణించు జీవలునివాక్యమున గుర్తింపవచ్చును.

అఱపొఱడు కుఱుచచేతులు
నొఱవశరీరంబు గలిగి యొరులకుఁ జూడం
గొఱగాకుండియు మన్మథు
నొఱపులఁ బడియెడు నితండు యువతీప్రియుఁడై

ఆరణ్య. II. 135.

లఘ్వక్షరబహుళమైన ఈ కందము చిట్టిచిట్టి యంగప్రత్యంగములతోడి బాహుకుని గుజ్జురూపమును స్వీయ స్వరూపాల్పతచేఁ బ్రత్యక్షకల్పము గావించుచు, బాహుకుని వికృతస్వరూపదర్శనమున నేత్రేంద్రియమునకుఁ గలుగు నుద్వేగమును దనయందలి శకటరేఫముల వికృతధ్వనిమూలమున సహృదయుని శ్రోత్రేంద్రియమునకుఁ గలిగించుచున్నది. అంగప్రత్యంగముల ఖర్వత్వసంకుచితత్వములచే వర్ణ్యవస్తుస్వరూపావభాసకమై యీ పద్యము ఛందోనిష్ఠమైన యర్థవ్యక్తి యను గుణమును జాటిచూపుచున్నది.

మహాప్రాణాక్షరప్రాసములను గవిత్రయము పెక్కుపట్టుల రసాదివ్యంజకముగఁ బ్రయోగించియున్నారు. భయశోకవిస్మయముల యావేశముచే సర్వగాత్రము నొకదశయందు శ్లథబంధమగును. నాదతంతువులు శిథిలావస్థయం దుండఁగా ప్రాణవాయువు నిర్నిరోధముగఁ బ్రవహించి హకారాది మహాప్రాణాక్షరములను నిష్పాదించును హకారముఁ, దత్సంపర్కముఁ దఱుచు భయాశ్చర్యముల యారంభదశయందును, శోకక్రోధముల యవసానదశయందును ఉచితముగ నుండును. ఆశ్చర్య మొకవిధమగు భయమే యని మన తత్త్వవేత్తల యభిప్రాయము. అలోకసామాన్యమైన యర్థము ఆశ్చర్యమున కాలంబనము. అది యనర్థశంకాస్పదమైనచో భయకారణమగును. అదియే మిథ్యాకల్పమైనచో హాసకారణమగును.

ఓహో ! యిమ్మెయి ధర్మ
ద్రోహోక్తులు వలుకనగునె ? దోసం బదిగా
దే హరిహరి మనమునఁ దగ
వూహింపక నన్నుఁ బలుకు టుచితమె నీకున్ ?

అరణ్య. I. 364.

తన్నుఁ గామించివచ్చిన యూర్వశి యధర్మోక్తులకు అర్జునుఁడు చెప్పిన సమాధాన మీవాక్యము. "నిర్వికారధైర్యధుర్యుండైన యర్జునుం డిట్లనియె" నని నన్నయ్య పీఠబంధవాక్యము నిర్వికారుఁ డనఁగా నిచ్చటఁ గామవికారరహితుఁడనిమాత్రమే యర్థము. వాక్యోచ్చారణకాలమున నర్జునుని చిత్తమున నాశ్చర్యభావమున్నది. అది యనర్థశంకాన్వితము గనుక భయసజాతీయమునై యున్నది. 'ఓహో' యన్న యక్షరసంపుటి యుచ్చారణకాలమున విస్ఫారితవక్త్రనేత్రరూపమైన యర్జునుని గాత్రారంభానుభావము భావింపనగుచున్నది. ధర్మద్రోహాత్మకమైన యూర్వశి వాంఛ భయకారణము అది యాకస్మికము, నసాధారణము నగుట యాశ్చర్యమునకుఁ గారణము. తత్కాలమునందలి యర్జునుని ధైర్యము కామనిరోధమాత్ర పర్యావసాయియే. భయాశ్చర్యముల నాతఁడు నిరోధింపఁజాలకపోయెను. అనిరుద్ధములయిన వాని వ్యక్తియే మహాప్రాణాక్షరము.

వేఱొకచోఁ దిక్కన యర్జుననిచేఁ బలికించిన వాక్యమునందును నిట్టిప్రాసము పరిశీలింపఁ దగియున్నది.

ఓహో ! యిట్టివి గలవే
బాహాదర్పమున రిపులఁ బరిమార్చి తుదిన్
మహాత్మ్యం బెడలఁగ భి
క్షాహారతనొందఁ దలంపనగునె నరేంద్రా !

శాంతి. I. 48.

కర్ణవృత్తాంతశ్రవణమున నిర్విణ్ణుఁడై, రాజ్యత్యాగమొనర్చి మునివృత్తి నడవుల నుండఁబోదు నని పలికిన ధర్మజునితో నర్జునుఁడు పలికిన వాక్యమిది. వాక్యోచ్చారణకాలమున నర్జునుని చిత్తవృత్తి స్వరూపమును దిక్కన యిట్లు వర్ణించెను – "ఇంద్రాంశసంజనితత్వకలిత తేజోధనుండగు నర్ధసంజయుండు దన యూష్మలత్వంబున నవ్వాక్యంబులు దుస్సహంబులైనం బదరి దరస్మితంబునఁ దద్వికారంబుఁ గప్పి యప్పుడమితేని కిట్లనియె." ఊష్మలమైన యర్జునుని చిత్తవృత్తి యూష్మరేఫాది మూర్ధన్యాక్షరములందు వ్యక్తముకావలసియుండెను. గురువైన యోజోమయచ్ఛందముననను వ్యక్తముకావలసియుండెను కాని యర్జునుఁ డాయూష్మలత నణంచి దరస్మితముతో వాక్యమునుబలికెను. అర్జునుని దరస్మితము కోపగర్భమగుటచే నవ

హేళనరూపము. కోపగర్భమైన యర్జునుని హాసవచనము ఆశ్చర్యప్రకటనాత్మకమై యున్నది. ఆ యాశ్చర్యమునకు గుర్తు హకారప్రాసము.

దుర్యోధనుఁడు దన్నంగరాజ్యమున కధిపతిఁ గావింపఁగాఁ "గర్ణుండు మణికటక కేయూర హారాదిభూషణభూషితుండై సకలరాజచిహ్నంబుల నొప్పి పరమహర్షంబుతోడం గురుపతి కిట్లనియె,"

బృహదబ్ధి మేఖలాఖిల
మహీతలక్షత్రవర సమక్షమున మహా
మహిమాన్వితుఁగా నన్నును
మహీశుఁగాఁ జేసి తతిసమర్థత వెలయన్

ఆది. VI. 50.

కర్ణునిచిత్తమందలి హర్షము అద్భుతరసవ్యభిచారి. అచింతితోపనత మహార్థలాభఫలమైన యాశ్చర్యముచేఁ బరవశుఁడైన కర్ణునివాక్యము మహాప్రాణాక్షరబంధురము, హకారప్రాసము. యౌవరాజ్యాధికారమేని లేని దుర్యోధనుఁడు, సూతపుత్రుఁడైన తన్ను సర్వరాజలోకసమక్షమునఁ దక్షణమ అంగరాజ్యపట్టాభిషిక్తుని గావించుట కర్ణుని యాశ్చర్యమునకు విషయము. స్వీయరాజ్యలబ్ధి యాశ్చర్యమున హర్షసంచారమునకు విషయము.

అనుద్యూతపరాజితులై, యరణ్యవాసప్రస్థితులైన పాండవులలో భీమసేనుఁడు సభాసదులం జూచి "సంభృతక్రోధుఁడై" పలికిన వాక్యము మహాప్రాణోత్తరము, హకారప్రాసము.

సాహసమున మద్బాహుగ
దాహతి దుర్యోధనాదులగు రిపుల జగ
ద్ద్రోహులఁ జంపుదు నత్యు
గ్రాహవమున హరిహరాదు లడ్డంబైనన్

సభా II. 295.

సంభృతక్రోధుఁడై పలికిన భీమునివాక్యము అత్యుష్ణము. దీర్ఘమునైన యొక బృహన్నిశ్శ్వాసమువలె నున్నది చాలసేపు బిగఁబట్టియుంచిన యూర్పు అత్యంత ముష్ణమగుట సహజము. హృదయము భావసంభరితమైనప్పుడు శరీరబంధము సడలుట, తత్కారణమునఁ దత్కాలోచ్చారితమైన వాక్యము నిశ్శ్వాసనసంసర్గాతిశయముగల దగుట ప్రకృతిసిద్ధములైన యంశములు. ఇచ్చట భీమవాక్యము మహాప్రాణబహుళము, అవిచ్ఛిన్నమునై యతిసహజముగనున్నది. సంయుక్తములు, నసంయుక్తములునైన రేఫము లెడనెడ నిలిచి వాక్యమునకుఁ బారుష్య మాపాదించుచున్నవి. మహాప్రాణాక్షరబహుళమైన భీమప్రతిజ్ఞావాక్యము లఘుతరమైన కందముగా

రూపొందినది. ఆ సందర్భమునందే అర్జునుని ప్రతిజ్ఞావాక్యము అల్పప్రాణాక్షరబహుళమై మత్తేభవిక్రీడితముగా రూపొందినది ఏకనిశ్వాసనివర్తితమైన వాక్యమునందలి యక్షరములు మహాప్రాణములైనచో నల్పసంఖ్యాకములగుటయు, నల్పప్రాణములైనచో నధికసంఖ్యాకములగుటయు లోకానుభవసిద్ధమైన విషయము.

గూఢక్రోధవచనములందు మహాప్రాణద్విత్వప్రాసము పెక్కుసందర్భముల గుర్తింపనగుచున్నది.

వృద్ధులు గతాయువులు దు
ర్బుద్ధులునగువారిచేతఁ బోదురె శస్త్రా
స్త్రోద్ధతియు బాహుగర్వస
మృద్ధియుఁగల పాండుసుతు లమిత్రధ్వంసీ !

భీష్మ. II. 124

అర్జునుఁడు కౌరవసేనలను జిందరవందరచేయుచుండఁగా నీవుపేక్షచేయుచున్నావని తన్ను మందలించుచున్న దుర్యోధనుని వాక్యములు విని చిఱునవ్వునవ్వుచు భీష్ముఁడు పలికిన వాక్యమిది. దుర్యోధనుని మూర్ఖత్వమునకు భీష్ముని చిత్తమునఁ గలిగిన క్రోధ మాయన చిఱునవ్వువెనుక దాగియున్నది. అది ద్విరుక్తధకారప్రాసమునఁ దొంగిచూచుచున్నది.

వృద్ధని జాత్యంధుండని
బుద్ధివిహీనుఁడని నన్నుఁ బుత్రుఁడు బలద
ర్పోద్ధతుఁడై మెచ్చఁ డసం
బద్ధంబులెకాని విన(డు పలికినపలుకుల్

ఆరణ్య. I. 388.

దుర్యోధనునిమీఁద నెంత వ్యామోహమున్ననుఁ, బెద్దలను, దన్నుఁ దిరస్కరించి యాతఁ డాత్మనాశము, వంశనాశముఁ గొనితెచ్చికొనుచున్నాఁడని ధృతరాష్ట్రునకుఁ గొడుకుమీఁద గూఢమైన క్రోధముగూడఁగలదు. అది యీ పద్యమందలి ద్విరుక్తధకారప్రాసమున వ్యక్తమగుచున్నది.

శ్రీకృష్ణున కర్ఘ్యమిచ్చుట యనుచితమని విమర్శించిన శిశుపాలునితో భీష్ముఁడనిన - "వృద్ధు లొకలక్ష యున్నను" - ఇత్యాదిపద్యమునందును ద్విరుక్తధకారము గూఢక్రోధవ్యంజకమగుట గుర్తింపనగును.

పాండుకుమారుల నుపేక్షించుచున్నావని భీష్ముని మందలించినట్లే ద్రోణునిఁగూడ దుర్యోధనుఁడు మందలించును. తన ప్రాణమిత్రుఁడైన కర్ణుఁడు భీమునిచే భంగపడి పాఱుటఁగాంచి దుర్యోధనుఁడు రయమున ద్రోణునికడ కరిగి యాయన నాక్షేపించుచు నిట్లనును :

ఈభంగి నీ వడంగుట
మాభాగ్యము గాక యింక మాటలు వలదీ
క్షోభం బెట్టులడఁగుఁ జెపు
మా భయదీయ బలశౌర్యమతులకుఁ దగఁగాన్

ద్రోణ. VI. 165.

దుర్యోధనుని గూఢక్రోధము భకారమునం దణఁగియున్నది. అది గుర్తించి ద్రోణుఁడాతనికి వాత పెట్టినట్లు సమాధానము చెప్పును.

విభావవర్ణనమున భకారప్రాసముయొక్క వ్యంజకత —

"ఉభయబలంబులుఁ బురికొని
యిభతురగస్యందనంబు లిలఁ ద్రోవులుగా
సభయాశ్చర్యాత్మకులై
నభశ్చరులు వొగడ నీసునం బోరాడెన్

ద్రోణ. III. 123

సభయాశ్చర్యహేతువైన యుద్ధమును వర్ణించు పద్యమున భకారప్రాసము యుక్తముగ నున్నది. లఘ్వక్షరబాహుళ్యకృత ద్రుతగతి యుద్ధత్వరావ్యంజకము. భకారప్రాసము భయాశ్చర్యవ్యంజకము.

యకారము అలవోకగాఁ బలుకఁదగిన యక్షరము. ఇది యంతఃస్థము. అంతస్థముల యుచ్చారణమున స్థానకరణములు స్పృశించియు స్పృశింపనట్లుండును. కనుక వీని శ్రుతి చెవికి సోకియుసోకనట్లుండును ముఖ్యముగా య వ లల శ్రుతి యట్టిది. శ్రుతిసుఖగ్రాహ్యములయిన యివి ప్రసన్నమాధుర్యమును వ్యంజించుటకుఁ దగిన యక్షరములు.

నాయున్న బాముఁ దలఁపవ
యీయెడ లీచీర యిట్టి యేవపుఁజందం
బోయన్న మదనవికృతిం
జేయుననుట యెంతయును నిషిద్ధముగాదే?

విరాట II. 49.

"కలుషించియు దుర్వారంబైన పరిభవవికారంబు దోఁపకుండఁ దన్నుందాన యుపశమించుకొని వీఁడు దురభిమానియై యున్నవాఁడు వేగిరపాటు వలనుగాదు వెరవుతోన తప్పించుకొనవలయు నని తలంచి" ద్రౌపది కీచకునితోఁ బలికిన వాక్యమిది. ఈ వాక్యవిన్యాసమునందలి యక్షర నిర్మాణము ద్రౌపది బుద్ధిపూర్వకముగ ప్రయత్నించి చేసినదనుట స్పష్టము. కీచకునకుఁ దన

యందు జాలిపుట్టింపవలెనని ద్రౌపది యత్నము. తన వాక్యార్థమున, వాక్యవిన్యాసమున, వాక్య గతాక్షరస్వరూపమున శ్రోతృచిత్తమును గరుణార్ద్రముగావించు లక్షణములు రూపించుటకు ద్రౌపది యథాశక్తి ప్రయత్నించినట్లు వాక్యచ్ఛందమందలి లఘుదీర్ఘాక్షరవిన్యాసము, ప్రాసానుప్రాసరూపములైన లఘ్వలఘుయకారములు స్పష్టముచేయుచున్నవి. యకారమే సహజముగ లఘువు. సంహితావశమున నాగతమైన యకార మత్యంతము లఘువు. తాలవ్యములు వాయవ్యములు. వానిలో యకారము మలయానిలతుల్యము.

కపోతోపాఖ్యానమునఁ గపోతదంపతుల వాక్యములయందును లఘుయకారప్రాసవిశిష్టత గుర్తింపవచ్చును. తన్ను వధించిన వ్యాధున కాతిథ్యమిచ్చి రక్షింపుమని కపోతి బోధింపఁగాఁ గపోతము ''శోకము డిగ్గవిడిచి కరుణన్'' లుబ్ధకునితోఁ బలికినమాట :

ఓయన్న డస్సినాఁడవు
మా యింటికి నతిథివైతి మసలక నీకుం
జేయవలయు నాతిథ్యం
బేయది భవదీప్సితార్థ మెఱిగింపవనా !

శాంతి. III. 315

కరుణార్ద్రశీతలమైన చిత్తవృత్తికి లక్షకముగా లఘుయకారమును గ్రహింపవచ్చును. స్వీయ శోకమును విస్మరించి లుబ్ధకుని దుఃఖమును భావించిన కపోతముయొక్క చిత్తము కరుణాభరితమై ప్రసన్నము, మధురమునై యున్నది.

అతిథిసత్కారార్థ మాత్మదేహార్పణము గావించిన పతిని దలంచి పలవించు కపోతి వాక్యమునందును లఘుయకారములు ప్రాసములందు నెలకొన్నవి.

''నా యాకలి కోర్వవెపుడు
వేయైనను నేగొనంగ వెండి యనుభవిం
తాయాసపడుటఁ గనుఁగొని
నోయుదు నను బాసి యిటు సనుట దగవగునే ?

శాంతి. III. 330

బంధుమరణశోకవ్యాకులుఁడు, ప్రాయోపవేశకృతబుద్ధి యగు ధర్మజుఁడు పలికిన వాక్యమున (శాంతి. I 203), ధర్మజునకు మనస్తాపోపశమనంబుగా ద్రౌపదిపలికిన స్వీయపరాభవ స్మారకమైన వాక్యమునను (శాంతి. I 103), అభిమన్యుమృతికై శోకించు నర్జునుని వాక్యమునను (ద్రోణ. II 242) మఱియుఁ బెక్కుపట్టులందును యకారప్రాసముయొక్క రసవ్యంజకత గుర్తింపవచ్చును.

గరుడుఁడు తమదాస్యవిముక్తికై కద్రువను బ్రార్థించువాక్యమున శ్రోతృచిత్తద్రవీకరణా శయసూచకమై యకారప్రాసము పరమోచితముగ నున్నది.

మా యీ దాస్యము వాయు ను
పాయము నేయుండు సన్నుఁ బనుపుం డిష్టం
బేయది దానిన తెత్తు న
జేయుఁడనై యమరవరులఁ జేకొనియైనన్

ఆది. II. 53.

దీర్ఘాక్షరములు, యకారప్రాసానుప్రాసములు పద్యమున నత్యంతమైన సుకుమారస్పర్శ నుత్పాదించుచున్నవి. శ్రోతయైన కద్రువచిత్తమును సుకుమారము, నార్ద్రముగావించుటకు గరుడుని వాక్యము సర్వథా సమర్థమై యున్నది.

పాండవులకడకు సంజయుని రాయబారమంపుచు ధృతరాష్ట్రుఁడు పలికిన యుపక్రమోప సంహారవాక్యములు పరిశీలింపఁదగినవి. ఉపక్రమవాక్యము :—

మీయయ్య మీరు వనవా
సాయాసము నిస్తరించి యభ్యుదయమునన్
డాయుట విని ముదితాత్ముం
డై యిట పుత్తెంచె నన్ను ననుమీ మొదలన్

ఉద్యోగ. I 260

**ఉపసంహారవాక్యము :—**

నెయ్యము వాటించి కడుం
దియ్యమెసఁగ నలుకలెల్లఁ దీరునటులుగాఁ
గయ్యమనుమాట లోనుగ
నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగుగాన్

I. 271

"శాంతిప్రకారంబునఁ గార్యంబునడపి యొక్కటియై మనుట యొడంగూర్చి రమ్మ రథంబెక్కి పొమ్మ" – ఉపక్రమవాక్యమందలి యకారప్రాసము ఉపసంహారవాక్యమున ద్విరుక్తమైనది. 'తీయని' మాటలకంటెను 'తియ్యని' మాటలు మిక్కిలితీపిగా నుండునని ధృతరాష్ట్రుని యాశ యముగాఁబోలు.

ప్రాసాక్షరగతమైన యిట్టి వ్యంజనసామర్థ్యము ప్రసంగవశమున నింకను నిరూపింపఁ బడును.

ఈ యనుశీలనమువలనఁ బ్రాసము వర్ణవీప్సారూపమని విదితమగుచున్నది. 'వ్యాప్తుమిచ్ఛా వీప్సా' యను న్యాయమునఁ బద్యపాదచతుష్టయమునను ద్వితీయస్థానమునఁ దుల్యవర్ణముచే వ్యాపింపవలెనన్న వక్తయిచ్ఛయే ప్రాసావిర్భావమునకుఁ గారణమని భావించుట సమంజసము. పద్యమున నియతానియతస్థానములఁ దుల్యాక్షరము వ్యాపించినచో నాపద్యమున శ్రుతిసామ్యము సుప్రతిష్ఠితమై శ్రోతకు ఆహ్లాదాతిశయము లభించును.

''వీప్సాయాం ద్విరుక్తిః'' అని న్యాయము. వక్త యెచ్చట దేనిచే వ్యాపింప నిచ్ఛించునో యచ్చట దానిని ద్విరుక్తముచేయును. ద్విరుక్తి త్రిచతురాద్యుక్తికి ఉపలక్షకము. ప్రాసమునం దేకవర్ణము చతురుక్తమగును. ద్వి త్రి ప్రాసములందు వర్ణద్వయ వర్ణత్రయములు చతురుక్తములగును. అట్లే యంత్యప్రాసములందును బాదాంతములయందు ఏక ద్వి త్రి వర్ణముల ద్వి త్రి చతురుక్తి యుండును. ప్రాసాక్షరముచేఁ బద్యమంతటను వ్యాపించుట యనుప్రాసము.

ఏ పదముచేత, పదావయవముచేతఁ బద్యపాదారంభపాదాంతములు వ్యాప్తములై యుండునో ఆ పదపదావయవార్థమునకు ఆపద్యమునఁ బ్రాధాన్యము వచ్చును. ఆ యర్థముచే పద్యమును వ్యాప్తముచేయవలెనన్న వక్తయిచ్ఛయే ఆ పదపదావయవములం పాదారంభపాదాంతములందుఁ బునఃపునరుక్తములగుటకుఁ గారణము.

పునరుక్తి యనఁగా నావృత్తి ఆవృత్తమైన యక్షరము లేక అక్షరసంహతి యర్థవంతము కావచ్చును కాకపోవచ్చును. అనర్థకమైన యక్షరము, అక్షరసంహతియు రసభావాద్యర్థమును వ్యంజించుటకు సమర్థములే యని గుర్తించితిమిగదా. వాచకరూపమునఁగాని, వ్యంజకరూపమునఁగాని పునఃపునరావృత్తమైన వర్ణసంపుటి ప్రయోజనవంతమే యగుచున్నది.

సంభ్రమావేగ విస్మయ హర్ష శోకాదిభావములందు తత్తద్భావముల యుత్పత్తికిఁ గారణములయిన విభావముల రూపగుణక్రియాదులు పునఃపునరుక్తములగును. అట్టి పునరుక్తులు పద్యపాదముల యారంభములందుఁగాని, అంతములందుఁగాని నిల్చినచో ద్వి త్రి ప్రాసములో, యంత్యప్రాసములో రూపొందును. ఆ కారణమునఁ బద్యమునకు శోభాతిశయముకలుగును. పద్యశోభాతిశయకర్తలైన యిట్టి సార్థకానర్థక వర్ణ వర్ణ సముచ్చయ ద్విత్రిచతురుక్తులు అలంకారములు - ఛందోఽలంకారములు.

ఆ కలకలమున మేల్కని
యా కెలఁకులయిండ్ల రాజు లదియేమనుచున్
వే కదియం గని యా జను
లాకులరవ మెసఁగ నిట్టులనిరి నరేంద్రా !

సౌప్తిక. I. 164

అశ్వత్థామ చేసిన సౌప్తికప్రళయమును దిలకించి జనులెట్లు కలవరంపడి గొల్లుమనిరో "ఆ కల కల" "ఆ కెలకుల", "ఆకులరవ" అను వర్ణసంపుటములు పునఃపునరావృత్తివలన వ్యక్త మగుచున్నది. ఈ పునరావృత్తివలనఁ బద్యముయొక్క ప్రథమ, ద్వితీయ, చతుర్థ పాదము లందు ద్విప్రాసము సిద్ధించుచున్నది. ప్రథమద్వితీయపాదములందు చతుష్ప్రాసముగూడ సిద్ధించు చున్నది. ఇట్లు పద్యమలంకృతమై యర్థసమ్యక్సమర్పణ సమర్థమగుచున్నది. శ్రోత కాదర పాత్ర మగుచున్నది.

> ప్రార్థుఁడు వేడీ పొదువుఁడు
> బార్థుఁడ యెటవోయె దింకఁ బార్థుఁడ రావే
> పార్థుఁడ యిక్కడ నెద్దియు
> పార్థునిఁ బట్టుఁడను నులివు బహుళంబయ్యెన్

ద్రోణ. III. 46

ఎవ్వనినోట విన్ననుఁ బార్థనామమే. సర్వులకుఁ బార్థునిఁ బట్టవలెనన్న వాంఛయే. కౌరవసేనా వీరుల యీ సంభ్రమమును వ్యంజించుటకుఁ బార్థనామబహుళోక్తి. బహుళమైన పార్థనామపులు లివు పాదత్రయము నారంభమున వినఁబడి పద్యమున ద్విప్రాసమును గల్పించుచున్నది. అర్థ శబ్దవీప్స యేకమాత్రప్రయత్నముచే నిర్వర్తింపఁబడిన యిట్టిపట్టుల ఛందోఽలంకార మతిసహజమై ఛందోదేహమున సుశ్లిష్టముగ నత్తియుండును.

> పెంచితి ధర్మమార్గమునఁ బ్రీతియొనర్చుచు ధారుణీప్రజన్
> మంచి తనేకయాగముల మానుగ దక్షిణలిచ్చి విప్రులన్
> నించితి సజ్జనస్తుతుల నిర్మలమైన యశంబు దిక్కులన్
> సంచితపుణ్య సర్వగుణసంపద నెవ్వరు నీసమానులే?

ఆది. II. 203.

క్రియావీప్సారూపమైన యిందలి ద్విప్రాసము పెంచితి, మంచితి, నించితి అనుతీరున జనమే జయుని ధర్మక్రియానిరతిని వ్యంజించుచు నాయన సంచితపుణ్యత్వమును జక్కగా సమర్థించు చున్నది. అతిశయోక్తిరూపమైన స్తుతివాక్యము అలంకృతమై లోకాతిశాయిత్వమును బ్రాపించి యందమునం దర్థముతో స్పర్థించుచున్నట్లున్నది.

> కాండమహాతరంగముల వైరుల ముంచు
> విజయాంబురాశికి వేలనగుదు
> బాణరశ్ములఁ బరిపంథులఁ బొదివెడు
> నర్జునాదిత్యున కభ్రమగుదు

విశిఖోగ్రశిఖల విద్విషుల నేర్చు కిరీటి
ఘోరదావాగ్ని కాసారమగుదు
బదరవేగమున నరాతులఁ గూల్చు పా
ర్థాతివాయువునకు నచలమగుదు

కర్ణ. II 95

ఇది కర్ణునివాక్యము. సర్వపాదములందును 'అగుదు' నన్నపదము ఆవృత్తమై రూపొందిన యంత్యద్విప్రాసము క్రియాసమభిహారవ్యంజకమై కర్ణుని యుత్సాహమునకు దీప్తి గలిగించు చున్నది. పాదచతుష్టయమున నిర్వహింపఁబడిన రూపకాలంకారముచే నర్థమెట్లలంకృతమై దీప్తమగుచున్నదో అట్లే పాదచతుష్టయమున నివిష్టమైన యంత్యద్విఁప్రాసాలంకారముచే వాచక మలంకృతమై ఛందమునకు దీప్తికలుగుచున్నది.

ఇట్లే పాదముల యారంభావసానములందు ద్విత్రిచతుఃపంచాద్యక్షర సంపుటముల పునః పునరావృత్తి యర్థసమర్థకమై యలంకారిత్వమును సార్థకముగావించికొనుట యనుశీలించి గుర్తింప వచ్చును. పాదఖండ, పాదావృత్తియు నందందుఁ గనఁబడుచున్నది.

ద్విప్రాసాద్యలంకారస్వరూపములను లాక్షణికులు నిర్దేశించిన తెఱగున నిరూపించి, వివిధా లంకారములందుఁ గవిత్రయము ప్రదర్శించిన యవాంతరభేదములను వివేచింపవలయును.

## ద్విప్రాసము

ద్వి త్రి చతురాదిప్రాసముల యావిర్భావమునకు భంగ్యంతరమునఁ గారణాంతరముకూడ భావింపఁదగియున్నది. పూర్వానుభవసంస్కారబోధకు అనుకూలించు తెఱఁగున నాతిదూరాంతర ముగ వర్ణము నావృత్తముగావించుట యనుప్రాసమనఁబడినది. అతిదూరాంతరస్థితికి దండి యిచ్చిన యుదాహరణమిది —

''న తు రామాముఖాంభోజ సదృశశ్చంద్రమా ఇతి'' 1-58

ఇందు ''మా'' యను వర్ణములు నవాక్షరవ్యవహితములై యున్నవి. 'రామా' యందలి 'మా' శ్రుతియొక్క సంస్కారము 'చంద్రమాః' పదమందలి 'మా' శ్రుతిపర్యంతము నిలువదు గనుక నిట్టి యనుప్రాసము నిష్ప్రయోజనమని దండియభిప్రాయము. ఇది సమంజసమే. ప్రాసము విషయమునను ననుభవసిద్ధమైన యీ యంశము గుర్తింపవలసియే యున్నది.

ప్రాసాక్షరశ్రుతి కందపద్యమున నిల్చినంత దృఢముగా నుత్పలాదులందు నిలువదు.

కమ్మని లతాంతములకు మ్మొగ్గనసివచ్చు మధు
పమ్ముల సుగీతనినదమ్ము లెసఁగన్......

లయగ్రాహియందు ప్రాసాక్షరము నాతిదూరాంతరస్థితమగుటచే దానిసంస్కారము శక్తిమంతమై సుష్ఠుగా ననుభవింపఁబడుచున్నది.

కనుక దశాధికాక్షరపాదములయిన వృత్తములందు ప్రాసాక్షరశ్రుతిసంస్కారము నిలువక ప్రాసానుభవము బలిష్ఠముగనుండదు. ఐనను ప్రతిపాదద్వితీయస్థానమున సదృశవ్యంజనశ్రుతి కలవడియున్న తెలుఁగుచెవులు దూరాంతరమునందైనను నట్టి యక్షరావృత్తిని నిరీక్షించుచునే యుండును. ఇరువదియక్షరముల యనంతరము వచ్చినను దానిని గ్రహింపఁగలిగియుండును.

అతిదూరాంతరస్థితమైన ప్రాసాక్షరశ్రుత్యనుభవము ఆ యక్షరము ద్విరుక్తమో, సంయుక్తమో, బిందుపూర్వకమో యైనచో శ్రుతిసంస్కారము బలీయమై యనుభవము స్ఫుటతరముగా నుండును.

"అనయము నొచ్చుచున్నయవి యంగములెల్లను వేగవచ్చుటన్
మనము వశమ్ముగాదు జననాయక ప్రొద్దునువోయె..."

"నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు..."

"చిత్తము వొక్కెడుం బురుషసింహునిఁ బౌత్రకులాగ్రగణ్యు న
త్యుత్తమతేజు భూరిగుణు నొప్పెడు మెత్తనిమేనివాని..."

"అర్జునుఁ డైంద్రబాణము సమంచితభక్తి ధరించి మంత్రవి
స్ఫూర్జితగాండివుండయి రిపుప్రకరంబులు సంచలింప..."

ఈ పద్యములందలి ప్రాసాక్షరము లొకదానికంటె నొకటి శక్తిమత్తరములై యనుభవసౌష్ఠవమునకుఁ దోడ్పడుచున్నవి. ఇట్లే ప్రాసస్థానమునం దావృత్తమైనది యేకాక్షరమైనప్పటికంటె ద్విత్రిచతురాద్యక్షరసంపుటి యైనప్పుడు గలుగు శ్రుతి సంస్కారము ఉత్తరోత్తరము బలీయమై యనుభవము ద్రఢీయమగును కనుకనే కవు లెడనెడ ద్విప్రాసాదులను యత్నించి నిర్మించుచుందురు. ఛందమును శ్రవ్యతరముచేయు నిట్టి కవిసంరంభమంతయు శ్రవ్యతామాత్రవిశ్రాంతము కాదు. పద్యసమర్పితమైన రసాద్యర్థమును ఊర్జితము, దీపితము గావించుటయందే మహాకవికిఁ దాత్పర్యము.

ద్విత్రిచతుష్ప్రాసములందుగూడ, ప్రాసమునందువలె వ్యంజనముననే ప్రాధాన్యము. స్వరము భేదిల్లినను దోసములేదు. లాక్షణికు లీమాట యనకున్నను వారి యుదాహరణము లీయంశమునే సూచించుచున్నవి. ద్విప్రాసమునకు రేచన లక్ష్యము :

దోసంబులేక వస్తుని
వాసంబై వెలయఁ జెప్పవలయును ద్వంద్వ
ప్రాసం బుచితాక్షర వి
న్యాసంబుగఁ గృతుల రేచ ! నయతత్త్వనిధీ !

(సంజ్ఞాధికారము)

1, 3, 4 పాదములందు ఉత్వవిశిష్టబకారముండఁగా, 2వ పాదమున ఐత్వవిశిష్ట బకారమున్నది. అప్పకవి స్వరసామ్యముగూడ పాటించెను. స్వరవ్యంజనోభయసామ్యము శ్రవ్యతరమగుట నిజమే. అయినను ప్రాసమున వ్యంజనమునకే ప్రాముఖ్యముగనుక నిచ్చట రేచనమతమే గ్రహింపఁబడుచున్నది.

అనియతగురులఘ్వక్షరక్రమములయిన జాత్యుపజాతులందు ద్వంద్వాది ప్రాసములకును గురులఘుక్రమనియతిలేదు. ప్రాసాక్షరము లొకపాదమున గురువులు, నింకొకపాదమున లఘువులునైనను గావచ్చును. స్వరమెట్లు భేదిల్లినను వ్యంజనము తుల్యమైయుండినఁ జాలును. ద్వంద్వాదిప్రాసములందలి యక్షరము లేకపదస్థములైనచో శ్రవ్యత అతిశయముగానుండును. కాని యట్లుండవలెనని నియమములేదు.

"మఱి ద్విప్రాసంబనిన రెండక్షరములు ప్రాసంబిడి చెప్పునది"

అని రేచన ద్విప్రాసలక్షణము చెప్పెను. లక్ష్యమునుబట్టి యది పాదచతుష్టయమున నుండవలెననియే తోఁచును. కాని పాదద్వయ, పాదత్రయములందు మాత్రమే యున్నను ద్విత్రిప్రాసములు సౌందర్యహేతువులు కాకమానవు.

అజరామరపదకర పద
భజనా ! సంసారజలధిపారీణస్తో
త్రజనా ! స్వమూర్తివైదిక
యజనా ! పాశ్చాత్యనాడికార్ద్రివ్యజనా !

అశ్వ. IV. 287

ఇందు ద్విప్రాసము మూఁడుపాదములందే యున్నది. అయినను నది పద్యము నెట్లు శ్రవ్యతరముగావించుచున్నదో స్పష్టముగఁ దెలియుచునేయున్నది. రెండుమూఁడుచరణములందే గోచరించు ద్వంద్వాది ప్రాసములు యాదృచ్ఛికములని త్రోసివేయనక్కఱలేదు. యాదృచ్ఛికములయినను నవి యథాశక్తి ఛందమునకు శ్రవ్యతఁ గలిగించునవియే. ప్రయోజనాపేక్షచే నొకప్పుడు రెండు మూఁడుపాదములందే నిర్వహించి యన్యపాదములందు విసర్జింపవచ్చును. ఇవి యలంకారములు గనుక నియమములు కావు. వీని నివేశనము నెప్పు డెట్లెంతవఱకు చేయవలెనను విషయమునఁ

గవి స్వతంత్రుఁడు. ప్రాసనియమములేని సీసగీతాదులందు అలంకారప్రాయముగ నన్నయ ప్రాసములను గొన్నింట పాటించినాఁడు. ఆ పాటించుట వేర్వేఱుతీరులఁ బాటించినాఁడు. సీసమునఁ బ్రాసనివేశవైవిధ్యము లాక్షణికులును అంగీకరించినారు.

యమకమున దండి ప్రదర్శించిన వైవిధ్యమును జూడఁగా సర్వపాదములందును దానినిఁ బాటింపవలసిన యవసరములేదని స్పష్టమగుచున్నది. కనుక ద్వంద్వాదిప్రాసములను కవి స్వేచ్ఛానురోధముగ బహుభంగులఁ బ్రయోగించికొనవచ్చును.

ద్వంద్వప్రాసమును గవిత్రయము పదునైదుతెఱఁగులఁ బ్రయోగించినట్లు కనఁబడుచున్నది.

(1) పాదచతుష్టయమున :

విపరీతప్రతిభాషలేమిటికి నుర్వీనాథ యీపుత్రగా
త్రపరిష్వంగసుఖంబు చేకొనుము ముక్తాహారకర్పూరసాం
ద్రపరాగప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుం బుత్రగా
త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడుఁ శీతమే ?

ఆది. IV. 91

(2) 1, 2, 3 పాదములందు :

అమలనివాతసౌధములయందు మరాళమనోజ్ఞతూలత
ల్పముల శయించి రేపులు శుభస్థితి మాగధసూతగీతనా
దములఁ బ్రమోదముంబొరయు ధర్మసుతుండకొ కాన భూమిభా
గమున శయించి మేల్కను శృగాలనినాదవికీర్ణకర్ణుఁడై

అర. V. 329

(3) 2, 3, 4 పాదములందు :

అక్కట మృదుగాత్రులు గడుఁ
జిక్కని మనసులు గుమారసింహులు గవ లిం
పెక్కిన సుఖముల కర్హులు
ప్రుక్కినవయనోర్చి యున్కిచోద్యం బరయన్,

అర. V. 332

(4) 1, 3, 4 పాదములందు :

అంగారములు గొనువేడ్కఁ బుష్పఫలావళీలలిత
తుంగద్రుమప్రకరంబుఁ గరుణావిదూరుఁడై కూల్చు

నంగారకారుఁబోల సమకట్టె నర్థలోభంబు
నం గురుకులహానికరుండు ధారుణీనాథ నీ సుతుఁడు

సభా. II. 182

(5) 1, 2, 4 పాదములందు :

ఆ కలకలమున మేల్కని
యా కెలఁకులయిండ్లరాజు లది యేమనుచున్
వే కదియంగని యా జను
లాకులరవమెసఁగ నిట్లు లనిరి నరేంద్రా !

సౌప్తిక. I 164

(6) 1, 2 పాదములందు :

వీనికి మార్కొనఁ జాలెదు
దానికిఁ దగువాని ధర్మతనయుని పురిలో
నానానియుద్ధలంపటు
నే నొక్కనిఁ గంటి నిపుణుఁ డిందుల కతఁడున్

విరాట. II. 9.

(7) 1, 3 పాదములందు :

గోవులకు వెనుకయై వెసఁ
బోవుచునున్నారు గడవఁబోవకమున్నన్
బోవలయు నడ్డపడియెదు
దీవస మెదఁగలిగెనేని దేవర కడఁకన్

విరాట. III. 138

(8) 1, 4 పాదములందు :

చండవిరోధితిమిర మా
ర్తాండులనఁగఁ దగినవీరు దమలో నిట్లు
ద్దండతఁ బెనఁగుట ధృతరా
ష్ట్రిం డవినయలోభముష్కరుండగుటఁ జుమీ

భీష్మ. II. 311.

(9) 2, 3 పాదములందు :

భీమునిదెసఁ గాళింగో
ద్దామగజానీక సంగతత్వస్ఫురణా
భీమగతిం దఱిమెం గురు
భూమీశుఁడు భీష్మగురులు పోరెడు బలిమిన్

భీష్మ. II. 292

(10) 2, 4 పాదములందు :

నాఁడట్లు నీవు నీదగు
పోఁడిమి నెడి యడఁగుటయును భువనంబుల కె
వ్వాఁడును రక్షకుఁ డయ్యెడు
వాఁడిమగఁడు లేమిఁ ద్రిదశవర్గము మునులున్

ఉద్యో. I. 192.

(11) 3, 4 పాదములందు :

తన్నుఁ దనతమ్ములను నా
కన్నకొడుకులట్ల తలఁతుఁగాని విభేదం
బెన్నఁడు నామది లేమికి
వెన్నుఁడ దైవంబ సాక్షి వినుము పలికెదన్

విరాట. III. 193.

(12) 1, 2–3, 4 పాదముల భిన్నములు :

నీతనయుండు సింహకమనీయతరంబగు భీము నుల్లస
త్కేతన మర్ధచంద్రశరతీవ్రహతిన్ మణికింకిణీనినా
దాతిశయంబుతోడఁ బడునట్లుగ నేసి శరాసనంబు బల్
వాతిశరంబునం దునిమె వారి వరూథిని యేపడంగఁగన్

శల్య. I. 240

(13) 1, 3–2, 4 పాదములందు భిన్నములు :

ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయతనేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చె నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖమై
భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁ ద్రికూటతటిత్రిమార్గగా
సుకృతిఁ బ్రభంజనప్రియతనూజున కంతకమూర్తి కయ్యెడన్

సభా. II. 51.

(14) 2, 3–1, 4 పాదముల భిన్నములు :

విను ఋగ్వేదము కృష్ణుని
వినుతించుట యరుదె యఖిలవేదంబులుఁ ద
జ్జనితవిలాసంబులు వే
దనిరూపితవస్తువుననఁ దాన కుమారా !

అను V. 364

(15) చక్రవాళ ద్విప్రాసము :

శరణాగత సంశ్రితభయ
హరణా సురనికరశేఖరానర్ఘమణి
స్ఫురణా పరిచయరంజిత
చరణా వనమాలికాభుజంగాభరణా !

విరాట. I. 38

ఈ పద్యమునఁ బ్రథమపాదారంభమున నివేశితమైన ద్విప్రాసము చతుర్థపాదము నంత మందుఁగూడ నిర్వహింపఁబడినది. ద్విప్రాసాంత్యప్రాసములవలన గలుగు శ్రవ్యత యేకత్ర సిద్ధించుచున్నది.

పాదద్వయ పాదత్రయములందు మాత్రమే యివి యుండుట వీని యతినిర్వహణమునఁగవి త్రయమున కాసక్తిలేమికి నిదర్శనము. ఇన్నితెఱంగుల వీనియునికి నానావిధములయిన శ్రవ్యత లను యథాశక్తి, యథావసరము సాధించుటయందుఁ గవిత్రయమువారి యాదరణమునకు గుఱుతు. పృథగ్యత్నాతిశయ నిరపేక్షముగ నెంతశ్రవ్యత సిద్ధించిన నంతటితోడనే వారు తృప్తి పడిరని భావింపఁదగియున్నది.

పాదచతుష్టయమున నిర్వహింపఁబడిన ద్విప్రాసములు భారతమునఁ జాలతక్కువ. పాద త్రయ, పాదద్వయములందు నిర్వహింపఁబడినవి పెక్కుగలవు.

## త్రి చతుష్ప్రాసములు

కవిత్రయము వీని నత్యంతవిరళముగఁ బ్రయోగించిరి. పాదచతుష్టయమున నిర్వహింపఁ బడిన త్రిప్రాసము ఒక్కఁడే కనఁబడుచున్నది. అదియు నల్పప్రయత్ననిర్వర్తితమే.

మంగళము విష్ణుదేవుఁడు
మంగళ మెమ్మెఁ దలంప మధురిపుఁ డుద్య

న్మంగళ మంభోజాక్షుఁడు
మంగళ మఖిలము విహంగమధ్వజుఁ డరయన్.

శాంతి. II. 51

సర్వపాదముల నిర్వహింపఁబడిన చతుఃప్రాసములు భారతమునం దగపడవు. అనతినిర్వర్తితములయిన చతురార్ధ్వప్రాసములు నందందుఁగలవు. ఇట్టివి కేవలశ్రవ్యతకొఱకుఁగాక విశేష ప్రయోజనాపేక్షచేఁ బరిమితముగ నిర్వహింపఁబడినవని గుర్తింపవచ్చును.

"పరిఘుజలంబులం దమలపంకరుహోత్పలకైరవాది సుం
దరకుసుమంబులున్ ఘనపథంబున నుజ్జ్వలతారకానిరం
తరకుసుమంబులున్ వెలయుఁ దత్పురవప్రము పాదపీఠికా
శిరముల కొప్ప నర్చనలు సేసిన పువ్వుల యవ్విధంబునన్

ఆది. VIII. 76.

ద్వితీయ తృతీయపాదములందు అయత్నసిద్ధమైన షట్ప్రాసము శ్రవ్యతాపాదకమకాక అర్థసమర్థకముగూడ నగుచున్నది. పరిఘయందలి కుసుమములకును, ఘనపథమునందలి తారకలం దారోపితములయిన కుసుమములకుఁ గల యత్యంతమైన సాదృశ్యమును నిరూపించుచు నీయలంకారము పద్యమందలి రూపకానుప్రాణితమైన యుత్ప్రేక్షాలంకారమును శక్తిమత్తరము గావించుచున్నది.

"కృష్ణసారథ్యమున నొప్పు క్రీడి యిపుడు
కౌరవానీకములనెల్లఁ గసిమసంగి
కృష్ణసారథ్యమున నొప్పు క్రీడియైన
నెట్లు సేయంగవలయుఁ దా నట్లుసేసె"

భీష్మ. II. 92.

పద్యముయొక్క పూర్వోత్తరభాగములందలి యర్థములు ఉపమేయోపమానభావమును బొందుచు పాదఖండావృత్తియొక్క యావశ్యకమును నిరూపించుచున్నవి. పాదఖండపునరావృత్తిచే నర్జునుని పరాక్రమము అనుపమని సూచింపఁబడి ఛందోఽలంకారముచే ననన్వయాలంకారము రమ్యముగ ధ్వనించుచున్నది.

"నారలుగట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో
భారమునం గృశుండయిన బ్రాహ్మణుఁ డీలలితాంగిఁ బెండ్లియై
నారలుగట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో
భారముదాల్చి యుండుమని పంపక మిన్నక యుండనేర్చునే?

అరణ్య. II. 329.

ప్రథమపాద మక్షరశః తృతీయపాదముగా నావృత్తమై తదుభయపాదప్రతిపాదితమైన యర్థముయొక్క యైక్యము చక్కగా వ్యక్తమగుచున్నది. పతివ్రతాశిరోమణియైన లోపాముద్రా దేవియొక్క సహధర్మచారిణీత్వము ఈ పాదావృత్తిచే సుష్ఠుగా ధ్వనితమై ఛందోఽలంకారము యొక్క ఉత్తరకథార్థధ్వననసామర్థ్యము ప్రతిష్ఠితమగుచున్నది.

ఉపజాతులందుఁగూడ ద్వంద్వాదిప్రాసములు గవేషింపఁదగి యున్నవి.

ఎవ్వనివాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజి నడఁగు
నెవ్వనిచారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబునొఱపుఁ గఱపు
నెవ్వనికడకంట నివ్వటిల్లెడు చూడ్కి
మానితసంపద లీనుచుండు
నెవ్వనిగుణలత లేడువారాసుల
కడపటికొండపైఁ గలయఁబ్రాకు

విరాట. II. 191.

సీసపాదచతుష్టయము నారంభములందు 'ఎవ్వని' యన్నపదమావృత్తమై సిద్ధించిన ద్విప్రాసము పద్యమున వర్ణింపఁబడిన వైభవమంతయు నొకానొక మహాపురుషునకుఁ జెందినదన్న యర్థమున కుద్దీప్తిఁగలిగించుచున్నది.

"అంగనాజనుల యుత్తుంగసంగతకుచ
కుంకుమచందన పంకములయు
వారివ ధమ్మిల్లభారావకలితది
వ్యామోదబహుపుష్ప దామములయు
వారివ ముఖసకర్పూరతాంబూలాది
వాసనాసురభి నిశ్శ్వాసములయు
వారివ పరిధానచారుధూపములయు
విలసితసౌరభావలులు దాల్చి

ఆది. III. 156

ఇచ్చటఁ బాదత్రయమున ద్విప్రాసము స్ఫుటము. అది స్వయముగ ఛందమును సుందరముగావించుటయేకాక యీపద్యమందలి సర్వపాదగతప్రాసయతినియమమునఁ జాలవఱకైక్య

మును సాధించి దానిని ఫలవత్తరముచేయుచున్నది. పద్యసమష్టిశ్రుతి యిట్లు రమ్యతాతిశయమును బ్రాపించుచున్నది.

యయాతిదేవయానుల సంధానమునకు దూతత్వము వహించిన సుగంధమందానిలమును శ్రోత్రరసాయనమైన సీసపద్యమున నిబంధించి నన్నయ తటస్థవిభావవర్ణమున ఛందమును చక్కనిసాధనముగా నుపయోగించుకొనెను. శృంగారరసతటస్థవిభావవర్ణనమున విపులములు, నలంకృతములునైన సుందరచ్ఛందముల నుపయోగించుట నన్నయగారి పరిపాటి.

## అంత్యప్రాసము

అంత్యప్రాసము నాల్గుపాదముల యంతములందు నుండవలెనని సామాన్యనియమము. "మొదటిపాదము కడపటి యక్షరంబు నాల్గుపాదముల కడపట నిడి చెప్పుట'' యని రేచన యంత్యప్రాసలక్షణము. ప్రాసమునకువలె వ్యంజనసామ్య మున్నంతమాత్రమున నంత్యప్రాసమునకుఁ జాలదు.

"చరణములకడఁ గూర్చు ప్రాసముల కెల్ల
నన్నియు సమస్వరంబులై యమరవలయు''

III 239.

అని యప్పకవి స్వరములుగూడ సమములై యుండవలెనని చెప్పుచున్నాఁడు.

త్రిజగదవన నిత్యక్రీడనోద్యత్ప్రమోదా!
రజనిచరవిఘాతారంభ లీలావినోదా!
భజననిరతసౌఖ్యప్రాప్తి జాగ్రత్ప్రసాదా!
నిజతనువిభవత్వోస్మీలనాచ్ఛిన్ననాదా!

విరాట. III 240.

ఇది లాక్షణిక నియమానుసారియైన యంత్యప్రాసము.

భరితనియమచేతః పద్మవిజ్ఞానకేలీ
పరిమళపరిపాకప్రౌఢ సంపర్కశాలీ
పరిణతికృతదూష్యద్భంగి ఘాతాళిహేలా!
కరణభృతిజగత్సంస్కర్తృతానందశీలా!

శ్రీ. 187.

లాక్షణికుల యభిప్రాయమున నిది యంత్యప్రాసముకాదు. నాల్గుపాదముల యంతము లందును వ్యంజనసామ్యమున్నను స్వరసామ్యము లేదు. పూర్వపాదద్వయమున నొకస్వరము, ఉత్తరపాదద్వయమున నింకొకస్వరము నున్నవి. శ్రుతిసుభగమైన యిట్టి యక్షరనివేశమును అంత్యప్రాసభేదముగా లాక్షణికులు చెప్పియుండవలసినది.

అకృతకమధురోక్తివ్యాప్తసందీప్తసారా
సకలభువనరక్షాశాలి శుంభద్విహారా
శుకజనకమనీషా శుద్ధ బుద్ధానుభావా
సకృపకృతవిలాసా సంభృతానందభావా

స్వర్గా. 97

లాక్షణికులదృష్టిలో నిదియు నంత్యప్రాసముకాదు. నాల్గుపాదముల యంతములందును స్వరసామ్యమున్నను వ్యంజనసామ్యములేదు. పూర్వపాదద్వయమున నొకవ్యంజనము, ఉత్తర పాదద్వయమున నింకొకవ్యంజనమునున్నవి. అయినను నీ యక్షరసన్నివేశము శ్రుతిరమ్యగనే యున్నది. లాక్షణికు లిట్టిదాని నంత్యప్రాసభేదముగా లక్షింపకుండుట శోచనీయము.

జగదవనవినోదా సత్యజాతప్రమోదా
సగుణవిగుణభంగీ సంయమారామసంగీ
విగతవికృతమూర్తీ విశ్వభూతప్రవర్తీ
సుగమగహనభూమా సోమపింఛాభిరామా

అను. III.347.

లాక్షణికుల మతమున నిది యంత్యప్రాసము కాఁజాలదు. అంత్యప్రాసము పాదాంత మందే యుండవలెనని రేచన యనెఁగదా. కాని చిత్రకవిపెద్దన యంత్యప్రాసమునకు లక్ష్యము సీసపద్యమునం దిట్లుచూపెను.

పొదలు రాఘవదాస కదనజయోల్లాస
కదియు నంత్యప్రాస మిది సువాస

లక్షణసారసంగ్రహము. I. 65.

దీనినిఁబట్టి యంత్యప్రాసము సీసగీతాదులందు నుండవచ్చుననియుఁ, బాదాంతములందేకాక పాదఖండాంతములందు నుండవచ్చుననియు విదితమగుచున్నది. పాదాంత పాదఖండాంతముల వంటి ఛందోనియతస్థానములందలి యంత్యప్రాసములు ఛందోఽలంకారములుగా గణింపవలసినవే కాని శబ్దాలంకారములక్రింద జమకట్టఁదగినవికావు. అనియతస్థానగతమైనదే శబ్దాలంకారము.

అంత్యప్రాసవిన్యాసము పెక్కుతెఱంగులఁ జేయవచ్చుననుటకు రగడలనుగూర్చి యప్పకవి చెప్పినమాటయే నిదర్శనముగా నున్నది.

ఆద్యంత్యప్రాసంబులు
భేద్యంబులు రెంటరెంటఁ బెనిచి పదంబుల్
హృద్యంబులు గూర్చిన నన
వద్యంబుగ రగడలెల్ల వాలుం గృతులన్

IV. 479.

రగడలం దంత్యప్రాసము లుండవలయును. అవి రెండేసిపాదములకు భేదిల్లుచునుండవలయును. రగడలందు నియతమైన ఈ భేదము అన్యచ్ఛందములం దైచ్ఛికమని భావించుటలో దోసముండదు. శ్రుతిరంజనార్థము కవి యథేష్టముగఁ బాదచతుష్టయమునఁ, బాదద్వయమునఁ, బాదఖండాంతముల - నింకను బెక్కుభంగుల ఛందోనియతస్థానములం దంత్యప్రాసములను గూర్పవచ్చును. శ్రుతిరంజనప్రకారము లనంతములుగదా.

అంత్యప్రాసమునుగుఱించి యప్పకవి చెప్పిన మఱియొక విశేషముగూడ గమనింపఁదగి యున్నది.

"అంఘ్రితుది వ్రాయి డాపలియక్షరంబు
గురువయినఁ బ్రాస మొక్కయక్కరమ యగును
గాక లఘువైన వర్ణయుగ్మంబు నడచు
స్వరవిభేదంబుగాక కావ్యంబులందు"

III. 388.

పాదాంతమున 'గగ' మున్నచోఁ బ్రాసాక్షర మొక్కఁడే. 'లగ' మున్నచోఁ బ్రాసాక్షరములు రెండు. రెండింటను స్వరభేదము పనికిరాదు - అనఁగా ప్రథమపాదాంతమునందలి స్వరవ్యంజనము లట్లే యన్యపాదాంతములం దావృత్తములుకావలెను. అప్పకవి చెప్పిన యీ భేదము 'అంత్య ద్విప్రాసము' అనఁదగియున్నది.

"అవ్యయనిర్మలవిభవా !
దివ్యప్రభవా ! సుఖైకదీప్తానుభవా ;"

ఉద్యోగ. III.

కవిత్రయము భారతమునఁ బ్రయోగించిన యంత్యప్రాసవిన్యాసభంగు లీక్రిందివిధముగా నున్నవి—

(1) సర్వపాదములందు :

ప్రణవమయగరిష్ఠోపాయ సంవేద్యభూమా !
భణనమననదూర స్ఫారవిస్తారసీమా !
గుణవిభవనిరాసాకుంఠితోల్లాసధామా !
గణనరహితలీలాకల్పనిత్యాభిరామా !

శల్య. I. 405.

(2) 1, 2 పాదములందు :

ఆశ్చర్యకరణకరుణా !
నిశ్చలశుచిహృదయభావనీయవిహరణా !
పశ్చిమనాడీసరణ పు
రశ్చరణధ్యేయ ! భక్తరమణవిధేయా !

శల్య. I. 404.

(3) 2, 4 పాదములందు ;

త్రిభువనాంకుశదీప్తినిధీ సమ
స్తభువనాశ్రయ ధర్మధురంధరా
శుభయశఃపరిశోభితపూర్వది
క్ప్రభువిలాస కృపారసబంధురా

ఆది. IV. 275

(4) 3, 4 పాదములందు :

అసురదళనలీలా వ్యాప్తదీప్తారశోచి
ర్లసితపరశుగాఢాలంకృతి ప్రౌఢముద్రా
వ్యసనమహిత బాహాప్రస్ఫురత్కాంతిహృద్యా
హసనసురభివిద్యా హంసనాదైకవేద్యా

భీష్మ. II. 410

(5) 1, 2 – 3, 4 పాదముల భిన్నము :

శ్రుతిమౌళిరత్నమూర్తీ !
శతధృతిముఖపద్మషండసౌరభకీర్తీ !
రతిపతిహితాహితాక్షా !
సతతసమాచరితభక్తజనసంరక్షా

ఉద్యోగ. I. 384.

(6) ప్రతిపాదఖండాంతగతము :

సదయవిమలదృష్టీ ! సంశ్రితాశీఃప్రవృష్టీ !
హృదయకమలవాసా ! యిద్ధమాయావిలాసా !
విదితనిఖిలభూతీ ! విశ్వరక్షాత్తహేతీ !
సదసదుపచితాత్మా ! సంభృతానందవర్త్మా !

(పాదపాదమునఁ బ్రాసాక్షరము మారును.) ఉద్యోగ. I. 385.

(7) నిరతిశయమహత్త్వోన్మేష, నిర్ధూతదోషా
విరతహృదయరమ్యావేశ, నిత్యప్రకాశా
భరితభువనతేజోభవ్య, యోగానుభావా
స్ఫురితగుణసమగ్రశ్రీపుణ్య, నైర్గుణ్యగణ్యా

(యతిచ్ఛేదము నతిక్రమించి రెండక్షరములకు నియతము.) భీష్మ. I 306

(8) ప్రతిపాదోపాంతగతము :

త్వరితవిహితగాఢధ్యాయిసమ్మోదవాదా
స్ఫురదదరిదృఢశూలస్ఫూర్తిసంశస్తహస్తా
తరణిశశిమయత్వోదారతాచిత్రనేత్రా
పరమనియతినిష్ఠాభవ్యహృత్పద్మసద్మా

అను. IV. 451.

(9) ద్వితీయచతుర్థపాదఖండాంతగతము :

అభిమతఫలసంపాదన
విభవమహీయఃప్రసాద ! విశ్రుతవేదా
ఋభువిభువిలోచనాంబుజ
శుభదరవిత్వాహరిత్వ సుభగహరత్వా

(యతిచ్ఛేదమునందు, పాదాంతమందు) శాంతి. VI. 623.

(10) ప్రథమద్వితీయ పాదఖండాంతగతము :

సమస్తభువనాశ్రయా । వినయసత్యనిత్యోదయా
సమీహితగుణక్రియా । స్థిరవిశాలకీర్తిప్రియా

అరణ్య. II. 358.

(యతిచ్ఛేదమునకు మూఁడక్షరములు వెనుకగా నియతము)

ఉపజాతులందుఁగూడ అంత్యప్రాసములు గుర్తింపవచ్చును. ఏకాక్షరాది షడక్షరపర్యంత మైన యక్షరసముచ్చయము పెక్కుసీసపద్యములఁ బాదాంతములం దావృత్తమగుట తిక్కన రచనయం దగపడుచున్నది. ఆవృత్తములయిన పదసముచ్చయములు ప్రాయికముగఁ బ్రత్యయములో, పదములో, సమాసములోయైయున్నవి. ఇట్లేర్పడిన యంత్యప్రాసములవలన శ్రుతి రంజనముకంటె అర్థోద్దీప్తి యతిశయముగఁ గలుగుచున్నది.

సీ రాత్రిమైఁ దాఁకి క్రూరతఁబోరి మగఁటిమి వాసిన యంగారపర్ణుకంటె
ఘోషయాత్రావిధిఁ గురురాజుఁ జెఱపట్టి మానమేదిన చిత్రసేనుకంటె
ఖాండవోద్యానంబుఁ గావనేఱక సిగ్గువడి చన్న నిర్జరప్రభునికంటెఁ
గ్రీడాకిరాతుఁడై క్రోడంబునకుఁగాఁగ బెనఁగి చిక్కిన త్రిలోచనునికంటె

కర్ణ. II. 24.

సీ॥ కడఁగి బుద్ధీంద్రియకర్మేంద్రియంబులయందు సంయతచిత్తులైనవారు
ధృతి నహంకారప్రతిగ్రహాపేక్షలయందు నివృత్తాత్ములైనవారు
నల్పభోజనులు ననారంభకులునయ్యు నత్యంతసంతోషులైనవారు

ఆరణ్య. II. 241.

సీ॥ శక్రాదిసురలతో సంగ్రామమొనరించి ఖాండవం బేర్చె నొక్కరుఁడకాఁడె
యాదవబలమెల్లఁ నాగఁ ద్రోచి సుభద్రఁ గడిమిమైఁ దెచ్చె నొక్కరుఁడకాఁడె
దిగ్విజయంబునఁ దేజంబు నేసె నిక్కురువంశమునకు నొక్కరుఁడకాఁడె
బలముతో గంధర్వపతి నోర్చి విడిపించెఁ గౌరవేశ్వరుని నొక్కరుఁడకాఁడె

విరాట. IV. 210.

## అంత్యప్రాసములందలి యక్షరమైత్రి

''ప్రాసములకెల్లఁ దుల్యాక్షరంబులైనఁ జాలు'' నని యప్పకవి ప్రాససామాన్యలక్షణముగాఁ జెప్పెను. అంత్యప్రాసములందు స్వరసాదృశ్యముకూడ నుండవలెననెను. సామాన్య

ప్రాసములం దంగీకరింపఁబడిన యక్షరమైత్రీభేదములన్నియు నంత్యప్రాసముల విషయమునఁ గూడ నంగీకార్యములగునో కాదో లాక్షణికులు చెప్పలేదు. అంగీకార్యములు కావనియే వారి లక్ష్యములవలన గ్రహింపవలసియున్నది. అయిననుఁ దిక్కనమాత్రము కొన్నియక్షరమైత్రీ భేదముల నంత్యప్రాసములందును బ్రయోగించెను.

I. శ-స లకు :

"క్రమలలితవికాసా గాఢభక్తిప్రకాశా"

ఉద్యో. II. 334.

II. ల-శ లకు :

మునిహృత్కమలమరాళా !
జననమరణహరణచరణసరసిజలీలా !

అశ్వ. II. 227.

III. సంయుతాసంయుతమైత్రి :

"సదసదుపచితాత్మా సంభృతానందవర్త్మా

ఉద్యోగ. I. 385.

(త్మా-ర్త్మా మైత్రి ద్రోణ 2-383, శాంతి 1-400పద్యములందును గలదు)

## అనుప్రాసములు

ప్రాసాక్షరమును ఛందమునఁ బెక్కెడల నిడుట యనుప్రాసమను ఛందోలంకారము. విశిష్టశ్రుతికమైన యక్షరము పద్యమందు బహువారము లావృత్తమై పద్యమును స్వీయగుణ సంక్రాంతము గావించును. మధురసుకుమారాక్షరానుప్రాసము మధురరసములందును, కటుపరుషాక్షరానుప్రాసము దీప్తరసములందును ఉచితముగా నుండును. రసప్రసంగము లేనిపట్లఁ గూడ అనుప్రాసము ఛందమును శ్రుతిరంజకము గావించి చరితార్థమేయగును. నన్నయగారి యక్షర రమ్యత చాలవఱ కీయనుప్రాసము నాశ్రయించియున్నది.

అంగజరాజ్యలక్ష్మి పొడవైనదియొక్కొ యనంగ నొప్పు చి
త్రాంగదయందుఁ బార్థుఁడు మహాప్రణయప్రవణాంతరంగుఁడై

యంగజభోగసంగమున నమ్మణిపూరుపురిన్ సమస్తలో
కాంగణరంగసంగతవిహార యశోంగదుఁ డుండె లీలతోన్

ఆది. VIII. 143.

ఇందు బిందుపూర్వక గకారావృత్తి మాధుర్యవ్యంజకమై శృంగారరసమును జక్కఁగాఁ బోషించు చున్నది.

దక్షమఖక్షయకరు నిట
లాక్షజహుతభక్ష్యభక్షితానంగు విరూ
పాక్షు మహోక్షధ్వజుఁ బ్ర
త్యక్షముగాఁ గాంచె నుగ్రతపమున పేర్మిన్

అరణ్య. III. 49.

షకారయుక్తమయిన దుష్కరప్రాసాక్షరానుప్రాసము సగరకృతమహోగ్రతపోదీప్తిని వ్యంజించు చున్నది.

రాజతిలక రాజరాజకంఠీరవ
రాజరత్న దివసరాజతేజ
రాజరాజ యనుచు రాజన్య సైంధవ
రాజుఁ బనవుచుండె నాజిలోన

స్త్రీ. II. 99.

సైంధవమృతికి శోకించు దుస్సలశోకమును భావించి కరుణార్ద్రయైన గాంధారి శ్రీకృష్ణదేవునితోఁ బలికిన వాక్యమిది. రాజశబ్దపునఃపునరుక్తివలన సిద్ధించిన యిందలి జకారానుప్రాసము గాంధారి నోట మిక్కిలి శోభిల్లుచున్నది. రాజరాజగు దుర్యోధనునిగూర్చిన యామె శోకవాక్యముగూడ నిట్లే జకారానుప్రాసయుక్తమగుట సహజము. దుస్సల శోకమును దనశోకముతోఁ గలిపి గాంధారి యీవాక్య ముచ్చరించినదా యనిపించుచున్నది. కౌరవనాశనమునకుఁ గారణము శ్రీకృష్ణుఁడే యన్న కోపము గాంధారిచిత్తమందుండి శోకమయవాక్యమందును జకారానుప్రాసమునఁ బొడసూపుచున్నది. సరళమయ్యుఁ దాలవ్యమగుటచే జకార మీషత్పరుషవృత్తిగల యక్షరము.

ప్రాసాక్షరముల రసాదివ్యంజనసామర్థ్యము వెనుక నిరూపింపఁబడినది. అనుప్రాసముల వ్యంజకతయు నామార్గముననే గవేషింపవలెను.

# ప్రాసాక్షరమైత్రి

ప్రాసస్థానమునఁ దుల్యాక్షరమే యావృత్తము కావలెనన్న నియమము కాలక్రమమున సడలింపఁబడినది. శ్రుతిసాదృశ్యము, భాషాపరిణామము, సంధికార్యములు – మున్నగువానిని బురస్కరించుకొని కొన్నియక్షరములు మిత్రములుగా నంగీకరింపఁబడినవి. ప్రాసస్థానమునఁ దుల్యాక్షరమునకుమాఱు మిత్రాక్షర ముండినఁజాలునని చెప్పఁబడినది. ప్రాసమైత్రీభేదములను రేచన పేర్కొనలేదు. కవిత్రయమువారి ప్రయోగముల ననుసరించి యనంతరలాక్షణికులు పెక్కు మైత్రీభేదములను బేర్కొనిరి. అప్పకవినాఁటి కట్టిభేదములు పదునేఁడయ్యెను.

లాక్షణికులు – ముఖ్యముగా అప్పకవి – నిరూపించినమార్గమునఁ గవిత్రయమువారు ప్రయోగించిన ప్రాసాక్షరమైత్రీభేదము లిచ్చటఁ బరిశీలింపఁబడుచున్నవి.

## I. లఘుయకార ప్రాసము :

"ప్రకృతిభావంబుఁ జెందిన ప్రాణములకు
మొదలి యంతస్థ్సములు ప్రాసములకు నిలుచు
నఱమఱలులేక లఘుయకారాహ్వయముల
నా యజునితంద్రి ఫణిరాజశాయి యనఁగ"

III. 361.

సహజయకారమునకు, నాగమలఘుయకారమునకు మైత్రిచెల్లునని యప్పకవి తాత్పర్యము.

"ఈయున్న పౌష్య ప్రోలికిఁ
బోయి కడుంబెద్దదవ్వు వోయినయ ట్ల
త్యాయత విమలతపోమహి
మా యిన్నిదినమ్ము లేలమసలితి చెపుమా

ఆది. I. 117.

"ఆయెలనాగభర్త కడు నాకటఁ దూలుచువచ్చె వచ్చినన్
దోయజనేత్ర సంభ్రమముతోఁ దగుపీఠము వెట్టి"

అర. V. 10.

"శ్రీయన గౌరినాఁ బరగుచెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముఁదాల్చి"

విరా. I. 1.

ఈ మైత్రిని ముప్వురు కవులును ధారాళముగఁ బ్రయోగించిరి.

## II. ఋయుతాయుత ప్రాసము :

వట్రుసుడితోఁ గూడిన యక్షరమునకును గూడని యక్షరమునకును మైత్రిచెల్లును.

"అమృతముతో నుద్భవమై
యమరేశ్వరయోగ్యమయిన హయరత్నము —"

ఆది. II. 26.

"పితృదైవతకార్యములం
దతిభక్తిని మాంసమిడుట యర్హంబని —"

అర. V. 56.

"అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గా
ర్ముకవిద్యాప్రౌఢిమై నిరూఢులయిన యీ"

విరా. IV. 53.

ఈ మైత్రిని ముప్వురును ధారాళముగఁ బ్రయోగించిరి.

## III. సార్థబిందుక నిరర్థబిందుకాక్షర మైత్రి :

అప్పకవి దీనిని ఖండాఖండప్రాసమని పేర్కొని లక్షణమిట్లు చెప్పెను :

"నిడుపులు నరసున్నలు దమ
కెడమనుగల కచటతపల కిలఁ బ్రాసములై
తొడరును నిర్బిందువు లొ
క్కెడ ఖండాఖండసంజ్ఞ నినశశినయనా"

III. 302.

సఖండాఖండాక్షరమైత్రి దీర్ఘముమీఁది కచటతపల విషయమున చెల్లునని లక్షణముచెప్పియు సరళములకుఁగూడ అప్పకవి లక్ష్యములు చూపెను. భారతమున ఖండాఖండప్రాసములు మిక్కిలి యరుదు.

"ఆ పన్నగముఖ్యులఁ దన
వీఁపునఁ బెట్టికొని పఱచి విపినములు మహా"

ఆది. II. 45.

"ఏతెంచితి మత్ప్రార్థనఁ
బ్రాఁతిగఁ జేకొనకయునికి పాడియె నీకున్"

అర. VII. 195.

"ఆకొలువువారు గర మచ
లాకృతి నొకపలుకులేక యందఱు వింజం
బాఁకిడినకరణి..."

ఉద్యో. III. 255.

సార్ధబిందుక నిరర్ధబిందుక శకటరేఫములకు నన్నయ, యెఱ్ఱన మైత్రిచేసిన ట్లగపడదు. హ్రస్వము మీఁది యఖండశకటరేఫముతో సఖండశకటరేఫమునకు మైత్రి తిక్కన రెండుచోట్లఁ బ్రయోగించెను.

"బిగువెడలక నిలిచిపడున్
నగములు ; వేతసచయంబు నమ్రంబై పె
ల్లగు మీవేగము గడపి యె
సఁగుఁ బూర్వస్థితిన బ్రతుకు సమకూరంగన్"

శాంతి. III. 88.

"తగ నా కురువృద్ధునకు నొ
సఁగె నాఁటికి దివ్యదృష్టి సాత్యవతేయుం"

ఆశ్రమ. II. 121.

## IV. సంయుతాసంయుత ప్రాసము :

"రలలు తమక్రింద జడ్డలై క్రాలు వ్రాలు
ప్రాసవర్ణంబులై వానిఁ బాసియైనఁ
గూడియైనను బెఱయడుగులను నిలుచు
సంయుతాసంయుతప్రాససంజ్ఞఁ దనరి"

III. 315.

రేఫలకారపరసంయుక్తములకుఁ దదసంయుక్తలకు మైత్రిచెల్లును. లకారసంయోగములకు భారతమునఁ బ్రయోగము కనఁబడదు.

"స్వచా ! రిత్రముఁ దప్పకుండఁగఁ బరీక్షితు కాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబులన్"

ఆది. II. 177.

"పాత్రతయును సంపదయు వి
ధాతృఁడు సంధించుఁ జూవె తఱితోఁ బురుషున్"

శాంతి. IV. 374.

ఎట్టిన యీ మైత్రిచేసిన జాడలేదు. సంయుతాక్షరముతో మైత్రినందిన యసంయుతాక్షరము బుత్వ విశిష్టమే యగుటచే శ్రుతితౌల్యము గలదు. కనుకనే నన్నయతిక్కనలకు సమ్మతమై యుండును.

## V. ఉభయ ప్రాసము :

"ధాత్రిఁ బాణినీయసూత్రములను దృతీ
యోష్మమును ద్రుతంబు నొక్కచోటఁ
గ్రమత షాక్షరము ణకారంబునై ప్రాస
ములకు నుభయసంజ్ఞఁ బొసఁగు రెండు"

III. 329.

ఆదేశ షకార ణకారములకు సకార నకారములకు మైత్రిచెల్లును. సషలమైత్రి భారతమునఁ గనఁబడలేదు. ఆదేశ ణకారముతోడనే కాక సహజ ణకారముతోఁగూడ నకారమునకు మైత్రి కనఁబడుచున్నది.

"త్రిణయనగాత్రస్పర్శం
బున నిజగాత్రము పవిత్రమును—"

అరణ్య. I. 333.

(త్రినయన యని రూపాంతరము గలదు.)

"దుర్నిమిత్తముల్ పుట్టిన నిర్ణయించి"

అర. I. 49.

"ద్రోణుఁడు భీష్మఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులున్
ద్రాణము లానుయోధనునిపాలివ యంద్రు—"

ఉద్యో. I. 299.

సహజ ణకారమునకు నకారముతో మైత్రి—

"దుర్నయమున శకునికర్ణదుశ్శాసనులీ"

ఆది III. 12.

"కర్ణుండు రేఁచిపెట్టఁగ
దుర్నయపరులయిన శకునిదుశ్శాసనులీ"

ఉద్యో. II. 248.

"ఏతెంచితి మత్ప్రార్థనఁ
బ్రాఁతిగఁ జేకొనకయునికి పాడియె నీకున్"

అర. VII. 195.

"ఆకొలువువారు గర మచ
లాకృతి నొకపలుకులేక యందఱు వింజం
బాఁకిడినకరణి...

ఉద్యో. III. 255.

సార్ధబిందుక నిరర్ధబిందుక సరళములకు నన్నయ, యెఱ్ఱన మైత్రిచేసిన ట్లగపడదు. హ్రస్వము మీఁది యఖండసరళముతో సఖండసరళమునకు మైత్రి తిక్కన రెండుచోట్లఁ బ్రయోగించెను.

"బిగువెడలక నిలిచిపడున్
నగములు ; వేతసచయంబు నమ్రంబై పె
ల్లగు మీవేగము గడపి యె
సఁగుఁ బూర్వస్థితిన బ్రతుకు సమకూరంగన్"

శాంతి. III. 88.

"తగ నా కురువృద్ధునకు నొ
సఁగె నాఁటికి దివ్యదృష్టి సాత్యవతేయుం"

ఆశ్రమ. II. 121.

IV. సంయుతాసంయుత ప్రాసము :

"రలలు తమక్రింద జడ్డలై క్రాలు వ్రాలు
ప్రాసవర్ణంబులై వానిఁ బాసియైనఁ
గూడియైనను బెఱయడుగులను నిలుచు
సంయుతాసంయుతప్రాససంజ్ఞఁ దనరి"

III. 315.

రేఫలకారపరసంయుక్తములకుఁ దదసంయుక్తలకు మైత్రిచెల్లును. లకారసంయోగములకు భారతమునఁ బ్రయోగము కనఁబడదు.

"స్వచా : రిత్రముఁ దప్పకుండఁగఁ బరీక్షితు కాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబులన్"

ఆది. II. 177.

"కురుకులము పొలియుటకు మది
యెఱియంగా నున్న నాకు నితఁడీరాజున్"

శల్య. II. 308.

## IX. ల—ళ ప్రాసము :

అప్పకవి దీనిని అభేదప్రాస మనెను.

"రేఫమునకుఁ బైనుండు మాతృకకుఁ బెద్ద
లా యభేదాహ్వయప్రాసమై యొసంగు"

III. 363.

లకారమునకుఁ గొన్నిచోట్ల ళకారమాదేశమగును. అట్టి యాదేశ ళకారముతోడను, సహజ ళకారముతోడను లకారమునకు మైత్రి భారతమునఁ గలదు. ఆదేశ ళకారమునకు—

"బలుఁ డశ్వాత్థామ రిపు
ప్రళయాంతకుఁ డస్త్రశస్త్రపరిణతుఁ డగుచున్"

ఆది. III. 79.

"ప్రళయాంభోధరముక్త సాంద్రవిసరత్పాషాణవర్షంబు మి
క్కిలియై శైలముఁ గప్పునట్లు నరు నక్షీణాస్త్ర—"

విరా. V. 84.

సహజ ళకారమునకు—

"వా। ణీలీలాస్పద విలసత్
చాళుక్యాన్వయపయోధిసంపూర్ణశశీ"

ఆది. IV. 1.

"ఉ। న్మీలితక్రమవిక్రమైకసమృద్ధినై లయవిక్రియా
వేళ నింతయు సంహరింతు—"

అర. IV. 279

"భల్లం బొక్కట విల్లుద్రుంచి రయమొప్పన్ నాల్గిటన్ వాజులం
దైళ్ళన్ బెట్టుగనేసి సూతుతల సందీప్తైకబాణాహతిన్"

ద్రోణ. IV. 33

భారతమునం దీ ప్రయోగములు పెక్కు గలవు.

## X. డ-ల ప్రాసము :

"కడఁగి నాకును సద్గతి కలుగవలయు"

అర. II. 262

నన్నయ చేసికొనిన ప్రాసయతి - యతి ప్రయోగనియమముల ననుసరించి యీ చరణమున డ-ల మైత్రి యంగీకరింపవలసియే యున్నది.

"కొడుకులుఁ దానును గుఱ్ఱపు
దళములఁ గరిఘటల భటరథవ్రాతములన్"

ఉద్యో. I. 220

"దడములఁ" అని ముద్రింపఁబడినది. కాని 'దళము' అని పాఠాంతరము చూపఁబడినది. భీష్మ. I: 93 పద్యమునందు నిట్టిస్థితియే యున్నది.

## XI. థ-ధ ప్రాసము :

"గ్రంథ మంథశబ్దంబులఁ గల ద్వితీయ
వర్ణములు రెండును నఘోషవర్ణములగు
నైన నిజవర్గభవచతుర్థాక్షరములఁ
గలియుఁ బ్రాసంబులను స్వవర్గజము లనఁగ"

III. 345

అప్పకవి థధలకు మైత్రి చెప్పుచు దానికి స్వవర్గజప్రాసమని పెద్దపేరుపెట్టెను. లక్ష్యములందు దథలమైత్రియుఁ జూపెను. కవిత్రయమునకు స్వవర్గజప్రాసము విస్తృతార్థమున - అనఁగా సర్వవర్గముల విషయమున - సమ్మతముగాదు. థధలకు, దథలకు, డఢలకు మాత్రమే మైత్రి వారికిష్టముగాఁ గనఁబడుచున్నది.

థ ధ లకు :

"బాంధవసౌహృదప్రణయ భక్తివిశేషములొప్ప నీ మనో
గ్రంథి యడంగఁజేయ నెసకంబున..."

అర. IV. 160

"గంధవహసుతుఁడు గవియ న
మంథరగతి నెవ్వఁడాగు మనయోధులలోన్"

ద్రోణ. I. 88

నన్నయ దీనిని వాడినట్లగపడదు.

ద ధ లకు :

"కాదన కిట్టిపాటి యపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁజేసి చేసె నృపపుంగవ నీవు..."

ఆది. I. 125

"సంపాదనఁజేసిచేసె నృపపావనవల్లభ" యను పాఠాంతరము నన్నయరచన యనిపించుటలేదు.

"దు। ర్మదమునఁ దగియెడు బుద్ధులు
విధిమూడిన మర్త్యుఁడేల విను నుచితోక్తుల్"

స్త్రీ. II. 40

ఎఱ్ఱన దీనిని వాడినట్లగపడదు.

డ ధ లకు :

"వేడుక నమ్మునిముందటఁ
బాడితి మాడితిమి పెక్కుపరిహాసంబుల్
రూఢిగఁ బలికితి మెట్లున్"

ఆది VIII. 156

"ఏడక్షౌహిణు లెన్నఁ బాండవబలం బేకాదశాక్షౌహిణుల్
రూఢిం గౌరవసైన్య మీయుభయమున్..."

ఆది I 70.

"ఏడు నాటించె దర్పంబు రూఢికెక్క"

కర్ణ I. 80

రూఢిశబ్దమునకు రూడి యను వికృతిరూపమును గల్పించి యీ ప్రయోగములన్నియుఁ గొట్టివేయవచ్చును. ఎఱ్ఱన యీ మైత్రి చేసినట్లులేదు.

"దండము కాషాయంబును
ముండితయు గమండలువును మోక్షమొసఁగ వె
ట్లండేని లింగములకు న
ఖండజ్ఞానప్రదత్వకలనయుఁ గలదే?"

శాంతి. VI 178

'అంటేని' లేక 'అందేని' యనుటకు 'అండేని' యని వికృతిరూపము కల్పితముగాఁ దోచుచున్నది. తిక్కన టడలకు మైత్రిచేసియుండెనేమో. (అను. IV. 374 . విరాట. I. ఆకొండు.)

## XII. వికల్ప ప్రాసము

"పంచవర్గంబులను గనుపట్టునట్టి
వొల్లు లనునాసికాక్షరంబులను గలిసి
తమదు పంచమములుఁ దృతీయములు నగుచు
నమరుఁ బ్రాసంబులకు వికల్పాహ్వాయముల"

III 327

వర్గాక్షరముల కనునాసికములు పరమైనచో నవి తమవర్గపు టనునాసికములుగాఁగాని, తృతీయాక్షరములుగాఁగాని మారును. దిఙ్మండలము – దిగ్మండలము. వీనిలో దిగ్మండలమునందలి 'గ్మ'కు సహజముగ పదమందున్న 'గ్మ'తో మైత్రిచేయుట వికల్పప్రాసమని యప్పకవి యభిప్రాయము.

"అగ్నిహతిఁజేసి మానవ
భుగ్నివహము మరణబాధఁ బొందించుచు...

అది. III. 136.

వికల్పరూపములు వ్యాకరణశాస్త్రప్రసిద్ధములై యుండఁగా నిట్టివానిని ప్రత్యేకముగాఁ జెప్పవలసిన యవసరములేదు. ఇట్టివానిని చెప్పినప్పుడు సంధివశమునఁ గాకున్నను వర్ణవిపరిణామవశమున వికల్పరూపములుగల పదములందలి వికల్పితాక్షరములను బ్రాసములందు వాడినచో నట్టివానినిగూడ ప్రాసభేదములుగా గణింపవచ్చును. నగరు–నవరు; కిన్క–కింక; పూన్చు–పూంచు మున్నగున విట్టివి భారతమునఁ గలవు.

వివిధోత్పాతంబులకున్
నవశలలోఁ దోఁచు కీడునకు...

శాంతి, II. 308

"పంకజనాభ మాపడినపాటులు రాజ్యము గోలుపోకయున్
గింకకు మూలమై కడఁగి గెల్పు కిరీటికి నీఁదలంచి—"

ద్రోణ. III. 153

"పూంచిన రథమున మణిమయ
పంచాననకేతు వెత్తె బంధురభంగిన్

విరాట. IV. 45

## XIII. అనునాసిక ప్రాసము :

"తమకుఁదాము ద్విత్వంబులై తనరుననియుఁ
బూర్ణబిందులు డాపలఁ బొరయుననియుఁ
గలసి యనునాసికప్రాసము లనుపేర
నమ లమరుఁ గావ్యములయందుఁ దమకుఁదాము !

III. 340

సహజముగ ద్విత్వము నందిన నమలు బిందుపూర్వకములయిన నమలతో ప్రాసమున మైత్రిపొందునని యప్పకవి యభిప్రాయము :

"మిన్నేరు పాదమున ధా
తంనాభిని గుసుమశరు నెదం గాంచిన" 341

"భ । క్తింమురసంహరు పూజలు
సమ్మదమున సలుపఁ గలుగు సకలార్థంబుల్" 342

అనిన యప్పకవి లక్ష్యములందు న,మలు బిందుపూర్వకముగా వ్రాయబడియున్నవి. పూర్వ మట్టి లేఖనపద్ధతి యుండెనేమో 'ంము'నకు 'మ్ము' అనియే నేఁటి లేఖనపద్ధతి. ధాతన్ + నాభి యనునప్పుడు 'ధాతంనాభి' యని లిఖింపవలసిన యవసరములేదు 'ధాతన్నాభి' యనియే వ్రాయవలెను. 'భక్తిన్ + మురసంహరు' ననునది 'భక్తిన్మురసంహరు'నని వ్రాయఁదగును. 'భక్తిమ్మురసంహరు' ననిగాని 'భక్తింమురసంహరు' ననిగాని వ్రాయుటకు ద్రుతమునకు మకారవిధి యుండవలెను. చింతామణ్యాదులం దట్టివిధి లేనందునఁ బ్రౌఢవ్యాకరణము "ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు" నని సూత్రింపవలసివచ్చెను. ఈ విధాన మవసరమైన ప్రయోగములు నన్నయరచనయందే రెండుమూఁడున్నవి.

"కమ్మని లతాంతముల కుమ్మొనసి వచ్చు మధు పమ్ముల"

ఆది. v. 138.

"కర్ణరం । ధ్రమ్మను నంజలిం దవిలి త్రావుదు రట్టి మునీంద్రలోకవం
ద్యుమ్మని నప్పరాశరసుతున్..."

ఆది. I. 77

"ప్రమో । దమ్ముగాఁ బ్రబవద్బృహజ్జలధారలొప్పఁగ వృష్టిఁజే
సెమ్మహానదులున్ మహాసరసీవరంబులు నిండఁగాన్

అర. III. 113

ఎఱ్ఱన, తిక్కన యిట్టిప్రయోగములు చేసినట్లగపడదు "ధాతంనాభిని" అని యప్పకవి చెప్పిన ప్రయోగములవంటివి తిక్కన రచనయందుఁ గలవు. ద్విత్వనకారప్రాసమును నన్నయ 11 పర్యాయములు, ఎఱ్ఱన 7 పర్యాయము వాడిరిగాని యప్పకవిచెప్పిన విశేషము వానియందులేదు.

"మున్నెన్నఁడు నివ్విధమేఁ
గన్నదిగా దమ్మ లెడలె గాండీవము లా
పున్నీభుజముల శక్తియు
మిన్నకపోఁ జిత్రమిది యమిత్రధ్వంసీ!

ద్రోణ. III 127

"అన్నివిధంబులం బఱిచియైనను నక్కటికంబులేక వా
రిన్నెఱిమాలి కానలఁ జరింపఁగఁ బంపిన..."

శాంతి II. 353, 243. ద్రోణ. V. 32

## XIV. ప్రాసమైత్రి ప్రాసము :

"గట్టిబిందువుమీఁది బకారమునకు
జమిలి మా ప్రాసమైత్రినా జరుగుచుండు"

III. 343.

బిందుపూర్వక బకారమునకు ద్విరుక్త మకారమునకు మైత్రిచెల్లును.

"ఇమ్మగ సర్వలోకములు నెవ్వనియేని ముఖామృతాంశుబిం
బమ్మున నుద్భవంబయిన భారతవాగమృతంబు గర్ణరం
ధ్రమ్మను నంజలిం దవిలి త్రావుదు రట్టి మునీంద్రలోకవం
ద్యుం బరముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబుభక్తితోన్"

ఆది. I 77.

ప్రాసమైత్రిప్రాసమునకు దీనినే యెల్లరును లక్ష్యముగాఁ జూపుదురు. దీని నాల్గవపాదమునకు "లోకవంద్యుమ్మని నప్పరాశరతున్" అని పాఠాంతరము గలదు. పాఠాంతరమును స్వీకరించి నచో నిది యనునాసికప్రాసభేదమగును. కొన్నిముద్రణములందు 'ఇంబుగ' 'బింబంబున' 'రంధ్రంబను' 'వంద్యుంబరమున్' అనుతీరునఁ బ్రాసములందు బిందుపూర్వకబకారములే కనఁ బడుచున్నవి. అప్పుడు విశేషమేమియు నుండదు.

ఎఱ్ఱన, తిక్కన యిట్టి ప్రయోగములు గావించినజాడ యగపడలేదు.

## XV. సంయుక్తవిశేష ప్రాసము :

ప్రథమపాదమందలి ప్రాసాక్షరమునం దెన్నివ్యంజనములు సంయుక్తములై యుండునో అన్నివ్యంజనములు తక్కినపాదములందలి ప్రాసాక్షరములందును సంయుక్తములై యుండవలెనని ప్రాససామాన్యనియమము. సంయోగమునఁ బ్రథమవ్యంజనము రేఫమైనచో నన్నిపాదములందును రేఫసంయోగము లేకున్నను దోషములేదని కొందఱమతము.

నన్నయగాని యెఱ్ఱనగాని యిట్టిప్రాసము నెచ్చటను వాడినట్లు కనిపింపదు. తిక్కన కిట్టి ప్రాసమైత్రి యిష్టమేయని తోఁచును.

"ద్యూతక్రీడకుఁ గొండొక
నేర్తుఁ గపటమున నొవ్వని జనంబులు"

విరా. I. 196

ఇందలి 'నేర్తున్' అను పదమునకు 'నేతున్' అను రూపాంతరము కల్పించి యిచ్చట విశేషమేమియు లేదనినట్లు పరిష్కర్తలు ముద్రించిరి.

"కద్రువ గన్గొని సంతో
షద్రుతమతి యగుచుఁ బిలిచి సవతికిఁ జూపెన్
భద్రాత్మక యవ్వినతయుఁ
దద్ద్రోహం బెఱుఁగలేమి దైన్యము నొందెన్"

అను. I. 200

ఇచ్చటఁ జతుర్థపాదమునమాత్రము దకారద్వయమున్నది. ఇతరపాదములందలి ప్రాసాక్షరములును దకారద్వయసహితములేయై యుండవలెను. సంయుక్తవిశేషప్రాసమునుబట్టి సరేఫనీరేఫసంయోగములమైత్రియే చెల్లును. 'పుత్త్ర-శత్రు' వంటి పదములమైత్రి భారతమునఁగలదు. "అనచిచ" అను పాణినీయసూత్రముచే (8-4-47 సి. కౌ.) అచ్చునకుఁ బరమందున్న యరలకు వైకల్పికముగ ద్విత్వము గలుగును. కనుక 'కద్ద్రువ' 'మిత్త్ర' 'శత్త్రు' - మున్నగు రూపములు సిద్ధించి ప్రాసమైత్రీసాధారణమైన నియమము సురక్షితమగును.

## XVI. సంధిగత ప్రాసము :

"సంధిఁ గూడినవ్రాలు ప్రాసంబులైన
నవియె సంధిగతాఖ్యల నమరుచుండు
దివిజు లాశ్చర్యమొంద శౌరి వడవైచెఁ
జెంగి పోనీక మధురలోనం గరి నన"

III. 372

సంధిఁగూడిన సర్వవిధములైన యక్షరములను లోఁగొనఁగల విశాలమైన నిర్వచనముచేసియు నప్పకవి గసడదవాదేశ సరళాదేశములకే లక్ష్యములను జూపి యూరకుండెను. అనంతామాత్యుని యభిప్రాయమునుబట్టి చూడఁగాఁ (ఛందోదర్పణము - I అశ్వా. 59, 60, 61, 62, 63, 64, 65 పద్యములు) పెక్కుతీరుల సంధిగతాక్షరము లీ ప్రాసవిశేషమునఁ జేరఁదగియున్నవని తోఁచును. స్వతస్సిద్ధమైన యక్షరస్వరూపముతో సంధివశమున సిద్ధించిన యక్షరస్వరూపము మైత్రినందుటయే యీ ప్రాసవిశేషముయొక్క తాత్పర్యము.

a. సరళాదేశము :

"అంబాలికకును గుణర
త్నాంబుధి పాండురవిరాజితాంగుఁడు ప్రభవిం
చెంబాండురాజు..."

ఆది. IV. 257

"సుందరిఁ బాంచాలేంద్రసు
తం దోడ్కొనిరమ్ము పొమ్ము దడయక యనినన్"

సభా. II. 211

"సంజయ మురభంజనుని ధ
నంజయునిం జీరికింగొనఁడు గర్ణుం డిం
ద్రుం జెనకియైన గెల్తున
నుం జచ్చెనె యట్టివాఁడునుం గయ్యమునన్"

కర్ణ. I. 20

"ముందటియట్ల యింకఁ బదుమూఁడుదినంబులమాత్రకున్ భవ
న్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ యం
తం దగఁ దోఁచి మత్ప్రతు లుదాత్తమతిన్ భవదీయవాంఛితం
బుం దలకొల్పఁజాలుదు రపూర్వమనఃప్రమదంబు సేకుఱన్"

విరా. III. 63

ఎఱ్ఱన యిట్టిమైత్రిని బ్రయోగించినట్లగపడదు.

b. గసడదవాదేశము :

"చే సమరికొంచుఁ బొడువఁగ
డాసినఁ దద్భుజముతోడ దగ్గఱఁగ..."

ఆది. VI. 206

నన్నయయం దీప్రయోగ మొక్కఁడే కనఁబడుచున్నది. ఎఱ్ఱన దీనిని వాడినజాడ లేదు. తిక్కన యం దివి పెక్కుగలవు.

"పైఁ బడిపోయెఁగాక ధృతరాష్ట్రుఁడు గన్నదియేమి యాసభం
దావలదన్నఁ గీడుడుగదా పతిఁలేడనఁబడ్డ కాంత..."

కర్ణ. III. 224

"అది యట్టులుండె నీతోఁ
బదరం బనిలేదు నాకుఁ బద్మభవుని మా
ట దలంపవలయు..."

శాంతి. IV 409

"నెగయునెడ నగ్గమైనను
బిగియారుచుఁ బిఱుఁదు సనినఁ బిడికిటఁ గొఱసం
ది గడు బెడిదముగ

అశ్వ. II. 219. విరా II. 351

c. క్రొత్తాదిసంధి :

"ఇవ్వనితకు వరుఁడగునని
నెవ్వగ మీరాజు చులుక నియమము సేసెన్"

ఆది. VII. 232

"నెచ్చెలులు దన్నుఁ గొలువం
బచ్చవిలుతు కలిమియెల్లఁ బద్మాననయై"

అర. VII. 175

"నెమ్మది నిద్రింపంగాఁ
బొమ్ము ప్రభాతమున రథముఁ బూన్పఁగవలయున్"

ద్రోణ. II. 317

d. పుంప్వాదేశము :

"తపము నుదాత్తశౌర్యము నుదగ్రబలంబును గల్గు క్రీడి క
య్యపువెర పెక్కుడై గెలుచునట్లుగ..."

కర్ణ. III. 251

"అపసవ్యముగాఁగఁ దిరిగి యరిగిరి శోకా
ర్తపుటొడళులతో...."

స్త్రీ. II. 125

e. మూఁడు శబ్దసంధి :

"ఎప్పటియట్ల నిల్చెఁ గని యేను మనంబున నద్భుతంబుతో
ముప్పిరియైన కౌతుకము మోదము నెక్కొన..."

అను. I. 376

"కయ్యమునకుఁ బరమసాధకంబుగఁ గలిగెఁ
ముయ్యంచుతుంగ యచ్చట"

మౌసల. 54

f. దుగ్గకారాదేశ సంధి :

"ఏతెరువునఁ బాపమొలసె నేనియు దానిఁ
బాతురు ప్రాయశ్చిత్త..."

అను. IV. 260

"తెత్తముగాక నరేంద్ర మ
రుత్తకలితమైన దానరూపము..."

అశ్వ. III. 138

"మఖ। వ్రాతంబులుఁ గ్రతువులుఁ బెడఁ
బాతురు దుర్మార్గకర్మపరులై ...."

ఆర. IV. 297

g. ద్విరుక్తటకారాదేశ సంది :

"పట్టువడిన సుగ్రీవునిఁ
గట్టెదురం గాంచి యెద్ది కలుషితమతియై"

ఆర. VII. 103

"నెట్టన సభలో వేవుర
కట్టెదుర నరాతితనము గాకెంతయు"

ఉద్యో. I. 344

h. త్రికసంధి :

"ఇక్కమలాక్షి శకుంతల
యెక్కడియది దీని జన్మ మెవ్విధమని"

ఆది. IV. 34

"ఎప్పాట నెవ్వరికి విధిఁ
దప్పింపవశంబె ధైర్యధనఘనుడఁవు నీ
విప్పరుసున..."

ద్రోణ. II. 150

సంస్కృతసంధిగతములయిన ప్రాసములుగూడ పెక్కుతీరులవి కలవు. అవియు గుర్తింపఁదగినవే.

a. యణాదేశసంధి :

"సాత్యవతేయ విష్ణుపదసంభవమై విబుధేశ్వరాబ్ధిసం
గత్యుపశోభితంబయి జగద్విదితంబగు..."

ఆది. I. 73

"సత్యవ్రతులార వరం
బత్యంతప్రీతి మిమ్ము నడిగెద..."

అర. IV. 395

"సత్యప్రతిజ్ఞుఁడవు నీ
వత్యద్భుత బాహువీర్య లనుజన్ములు..."

భీష్మ. II. 282

b. అనునాసికసంధి :

"నన్నుఁ దలంచి తీర్థగమనం బొనరింపఁ దలంచెనట్టి వి
ద్వన్నుత దేవవల్లభుఁడు దాన కృతార్థుఁడనైతి..."

అర. II. 302

"శే। షాన్నంబు మేన నిండఁగ
సన్నుతుఁడై యలమికొనుచుఁ జనియె..."

అర. VI. 118.

"కన్నారఁ జూతుఁగాని జ
గన్నుత భీష్మునకుఁ గోలుగా నీఁజాలన్"

భీష్మ. III. 280

c. శ్చుత్వాదేశసంధి :

"వచ్చితి రాధేయుఁడఁ గను
విచ్చి ననుంజూడు భరతవీరాగ్రణి నీ
సచ్చరితముఫలమే యి
ట్లిచ్చట నీయునికి ధాత నేమననేర్తున్"

ద్రోణ. I. 40.

d. ష్టుత్వాదేశసంధి :

"దుష్టమనస్కుండగు నా
ధృష్టద్యుమ్నుండు దక్క దేవా సుజనో

తక్కృష్టుఁడగు గురుని దెగుటకు
నిష్టాపముఁ బొందె భూతనికరం బెల్లన్"

ద్రోణ. I. 78.

e. జస్త్వాదేశసంధి :

"సద్వినుతచరిత్రుండు భ
రద్వాజుండను మునీశ్వరప్రవరుఁడు"

ఆది. V 194

"భోగ్యమ నీకు నింక రణభూమిఁ బృథాసుతులం జయించి స
మ్యగ్యశశాలివై భువనమాన్య ..."

అర. VI. 92.

"పదితూపుల నేపడంచి బహువిధగతులన్
దదనీకంబున...."

కర్ణ. II. 176.

f. విసర్గసంధి ;

"శస్త్రప్రకారనిపుణుం
డస్త్రవిదుఁడు దూరపాతనాభీలుఁడు వ
ర్చస్త్రాసితరిపుఁడు....

విరాట. V. 6

"కౌస్తుభరత్నాస్థిమాలికాశబలితవ
క్షస్తల సుమహితనిగమ
ప్రస్తవనీయప్రకార పరమోదారా !

ద్రోణ. IV. 336

"పశ్చిమనాడీసరణపు
రశ్చరణధ్యేయ భక్తరమణవిధేయా"

శల్య. I. 404.

g. తోర్లిసంధి :

ధ । మ్మిమల్లికుసుమాంగరాగస
ముల్లసన సుగంధియగుచు మునివరుమీఁదన్

ఆది. IV. 40.

శో । ఖిల్లినిటలమునఁ బటుద
ర్పోల్లసితుం డగుచు నాఱె నొకనారసమున్

కర్ణ. III. 198

## XVII. తద్భవవ్యాజ ప్రాసము :

లాక్షణికులు తద్భవవ్యాజయతులనుగుఱించి చెప్పిరిగాని తద్భవవ్యాజప్రాసములనుగుఱించి ప్రసంగించియుండలేదు. అయినను నిట్టిప్రాసభేదములు గుర్తింపఁదగినవే.

"అవసరజ్ఞుండయి వ్యాసుఁ డేతెంచె నంత నత్తపసి
కవిలగడ్డంబును గవిలజడలుఁ గవిలకన్నులును

ఆది. IV 254.

"ఈసును రోసముగల దు
శ్శాసను నొప్పించి పఱపి చతురంగములన్"

ద్రోణ. II. 139

"నీసైనికు లెంతయు సం
తోసిల్లుచు నార్చిరపుడు ; దుఃఖితులై..."

ద్రోణ. II. 131.

"రిత్తతడవు గాకుండఁగ
నిత్తఱి నాచార్యుతోడి యీసుడిగి వెసన్"

ద్రోణ. III. 68

## XVIII. ఔపవిభక్తిక ప్రాసము :

"ప్రీతుఁడనైతి నీవలనఁ బేర్చిన పుణ్యఫలంబులెల్ల నీ
చేతివయయ్యె నీదగు ప్రసిద్ధి...."

ఆరణ్య. VI. 125.

"ఒంటిమెయిఁ దాఁక నా ము
క్కంటికి వశమగునె కృష్ణగాండీవుల ని
ట్లంట యుడిగి తగురథికుల
జంటఁగొని రణమ్మొసలుపు శత్రులు దలఁకన్"

కర్ణ II. 85

"పటుశరముల మీఁదికి డా
పటికిన్ వలపటికి నపరభాగమునకు ముం
దటికిఁ జదల నడపె సము
త్కటరయమున శిరముఁ గందుకక్రీడమెయిన్"

ద్రోణ. IV. 322.

## XIX. అంతోష్మసంధి ప్రాసము :

"యుద్ధముమీఁది వేడ్కయు మహోగ్రవిరోధుల నల్కఁజేయు ద
ర్పోద్ధతియున్ సుయోధనుని యున్నతి నైఁపనియేపు..."

ఉద్యో. III. 255.

"వృద్ధని జాత్యంధుండని
బుద్ధివిహీనుఁడని నన్నుఁ బుత్రుఁడు బలద
ర్పోద్ధతుఁడై మెచ్చఁ డసం
బద్ధంబులెకాని వినఁడు పలికినపలుకుల్"

ఆరణ్య I. 388.

## XX. అవగ్రహాయుతాయుత ప్రాసము :

ఖండాఖండప్రాసమును జెప్పినట్లే దీనినిగూడ నొకప్రాసభేదముగఁ చెప్పవలసియున్నది.

స్వాహాప్రియుక్రియఁ బురుషుఁడు
సోఽహమనిన కాన్పు రుద్ర యతనిఁగనుటకున్"

అను. IV. 180

"అంబరమాది యనిలతే
జోఽంబుధరలు వరుసతోడ నగుఁజూరె..."

అశ్వ. II. 146.

ఇచ్చట అవగ్రహరూపముననున్న 'అ' కారమునకు యతిమైత్రిని బొసఁగించుటయందుఁ బ్రాధాన్యమున్నది.

## సూచికలు :

1. తైత్తిరీయప్రాతిశాఖ్యము – వైదికాభరణవ్యాఖ్య : 1-19
2. యాజ్ఞవల్క్యశిక్ష : 202-204
3. సిద్ధాంతకౌముది : సంజ్ఞా 9
4. ఋక్ప్రాతిశాఖ్యము : 1-56
5. యాజ్ఞవల్క్యశిక్ష : 194
6. చంద్రాలోకము : ii-2

# యతి

"విశ్రాంతి విరతి విశ్రమ
విశ్రామ విరామ విరమ విరమణ లనఁగా
విశ్రుతమగు యతి కృతి కధి
కశ్రావ్యంబై బెడంగుగా నిడవలయున్.

సంజ్ఞాధికారము

కవిజనాశ్రయమున రేచన చెప్పిన యీ యభిప్రాయమును ఆంధ్రచ్ఛందోలాక్షణికులందఱు నంగీకరించిరి. జనాశ్రయుఁడుగూడ

"యతి రవధిః ఛేదః ఇతి పర్యాయాః" 1-40

అని తెలిపెను. యతి, విచ్ఛేద, విరామ, విశ్రామాది పదములు అభిన్నములను నభిప్రాయము సంస్కృతచ్ఛాందసికులందు కొందఱకున్నది.

"యతి ర్జిహ్వేష్టవిశ్రామ
స్థానం కవిభి రుచ్యతే
సా విచ్ఛేద విరామాద్యైః
పదై ర్వాచ్యా యథేచ్ఛయా" 1-12

అని ఛందోమంజరియందుఁ జెప్పఁబడినది. లక్షణనిబంధనసౌకర్యముకొఱకు యతిశబ్దమునకుఁ బర్యాయవాచకములుగా విరామాదిశబ్దములను లాక్షణికులు వాడుకచేయుచున్నను నవి యథార్థముగా నేకధర్మబోధకములు కావనియు, భిన్నస్వరూపములు, భిన్నస్వభావములు ననియు వెనుకఁ దెలుపఁబడియున్నది.

యతి పదచ్ఛేదరూపము, విరామ మర్థచ్ఛేదరూపమునన్న భరతముని యభిప్రాయమే సమంజసమైనది. యతి నియతస్థానము. విరామ మనియతస్థానము. యతి ఛందోవశము. విరామము రసాద్యర్థవశము. పాశ్చాత్యచ్ఛాందసికులుగూడ Metrical Pause, Rhetorical Pause అని ఛందోవశమై పాదమధ్యనియతస్థానగతమైన యతికిని, అర్థవశమై యనియతస్థానమైన విరామమునకును భేదము భావించియుండిరి.

యతి — Caesura = Cutting — విచ్ఛేదము.

విరామము — Repose = Resting — విశ్రాంతి.

అని వారు వివేచించియుండిరి. భరతముని చేసిన వివేకము నిట్టిదే. పాదచ్ఛేదరూపమైన యతి, వాక్యచ్ఛేదరూపమైన విరామము పద్యములందు కలిసియుండవచ్చును. కలియకయు నుండ వచ్చును. కలిసియుండినచోఁ బద్యమందలి లయ ప్రస్ఫుటమగును.

పెంచితి ధర్మమార్గమునఁ బ్రీతి యొనర్చుచు ధారుణీప్రజన్
మంచితనేకయాగముల మానుగ దక్షిణలిచ్చి విప్రులన్
నించితి సజ్జనస్తుతుల నిర్మలమైన యశంబు దిక్కులన్
సంచితపుణ్య సర్వగుణ సంపద నెవ్వరు నీసమానులే.

ఆది. II. 203

ఛందోవశమైన యతి, యర్థవశమైన విరామము పాదములన్నింటియందుఁ గలసివర్తించుటచేఁ బద్యముయొక్క గతి స్ఫుటముగా గోచరించుచున్నది. కాని పద్యములన్నియు నిట్లే యుండవు. పెక్కింట విరామము యతితో సహకరింపదు.

ఈ వసుధాధినాథుల జయించినయట్టిదకాదు; చక్కనై
పోవక నిల్వు నాకెదిరి పోర, మదీయధనుర్విముక్త నా
నావిధమార్గణోగ్రగహనంబున దిగ్భ్రమఁబొంద కెమ్మెయిన్
బోవఁగవచ్చు నీకనుచుఁ బూరుకులోత్తముఁ దాఁకె వీఁకతోన్.

ఆది. VI. 205

ప్రయోగవశమున నర్థదర్శకమైన విరామము బలవత్తరమై ఛందోగతిదర్శకమైన యతినిఁ దిరస్కరించుచున్నది. ఉత్పలమాలయొక్క సహజగతి యీ పద్యమునఁ బ్రస్ఫుటముగ భాసించుటలేదు. అతిక్రాంతయతికములైన విరామములు ఓజోవ్యంజకము లగుచున్నవి.

"ఏవం యథాయ థోద్వేగః
సుధియాం నోపజాయతే
తథా తథా మధురతా
నిమిత్తం యతి రిష్యతే"

అని కవికల్పలతయందుఁ జెప్పఁబడినట్లు శ్రోతృచిత్తమున మాధుర్యము వ్యంజించుట యతి ధర్మము. అది యతిక్రాంతమైనచో శ్రోత యుద్వేగము పొందును. కనుక కవి మాధుర్యము వ్యంజింపఁదలచినచో యతివిరామసామరస్యమును పాటించును. ఓజస్సును పాటింపఁ దలంచినచో యతిని తిరస్కరించి విరామమున విలంబనముచేయును. జనమేజయస్తుతిరూపమైన పద్యమున యతివిరామసహకారమువల్ల మాధుర్యము, సాళ్వనిందారూపమైన పద్యమున యతి-విరామ వైరముచే ఓజస్సు వ్యక్తమగుచుండుట స్పష్టము.

అక్షరచ్ఛందములందుకంటె మాత్రానియతచ్ఛందములందు యతికిఁ బ్రాధాన్యమెక్కువ. వానియందది గతినియామకము. యతిభేదమువలన గతిభేదము గలుగుట లాక్షణికులు గుర్తించియే ఒకేవిధమగు నక్షరసన్నివేశమును యతిభేదము చేసి వృత్తభేదములు నిరూపించిరి. (ఛందోమంజరి – ద్వితీయస్తబకము)

"గురునిధన మనులఘు రితి శశికలా"

పదునాల్గు లఘువులపై నొక గురువు గలిగి ఏడక్షరములకు యతిచ్ఛేదము గల వృత్తము శశికళ.

"స్రగియమపి చ రసనవరచిత యతిః"

అదియే ఆఱక్షరములకు యతిచ్ఛేదముగలిగి స్రక్ అనబడుచున్నది.

"వసుమునియతి రితి మణిగుణనికరః"

ఎనిమిదియక్షరములకు యతిచేత నదియే మణిగుణనికరమైనది. సప్తాక్షరచ్ఛేదమున మిశ్రగతియు, షడక్షరచ్ఛేదమునఁ ద్ర్యస్రగతియు, అష్టాక్షరచ్ఛేదమునఁ జతురస్రగతియు సిద్ధించుచున్నది.

'జ్ఞాతినాశనమునఁ గాదె సకల దేవ'

శాంతి. I. 54

ఇట్టి యతిచ్ఛేదముచే నిదియే తేటగీతి యగుచున్నది.

జ్ఞాతినాశనమునఁ గాదె సకలదేవ

ఇట్టి యతిచ్ఛేదముచే నిదియే యాటవెలఁది యగుచున్నది. సీసపాదపూర్వార్ధముకూడ నగుచున్నది.

"ధరణినాథ వినుము మధువు ధార లెల్లఁ బ్రొద్దునున్"

ఇది యుత్సాహము. దీనియందు నాల్గుగణములపై విచ్ఛేదము. యతిచ్ఛినమైన పాదము పూర్వార్ధమునఁ బదునొకండక్షరము లున్నవి.

"నీవు ధర్మ భంగి నెఱుఁగ నేర్తు నీతి కౌశలం"

ఇదియును ఉత్సాహమే. దీనియందు యతిచ్ఛిన్నమైన పాదము పూర్వార్ధమునఁ దొమ్మిదియక్షరములే కలవు. ఈ రెండు ఉత్సాహములందు అక్షరాశ్రితమై యతిచ్ఛేదము భేదిల్లుచున్నది. అట్టి భేదమువల్ల రెండవదాని గతికంటె మొదటిదాని గతి ద్రుతతరమగుచున్నది.

ఇట్లు యతిచ్ఛేదము నియతానియతచ్ఛందములందు గతినిరూపకమై రసాదివ్యంజక మగుచున్నది. చంపకోత్పలములందు యతిచ్ఛేదము పాదమధ్యగతమై పద్యగతియందు సామ్యము ప్రతిష్ఠించి చిత్తవిశ్రాంత్యతిశయహేతువై శృంగారాది సుకుమారరసములను వ్యంజించుటకు యోగ్యమైయున్నది. మత్తేభశార్దూలములందు అతిక్రాంతపాదమధ్యమైన యతిచ్ఛేదము ప్రాణఘాతహేతువై చిత్తమునకు శ్రాంతికరమగుటచే రౌద్రాది కటురసములను వ్యంజించుటకు యోగ్య

మగుచున్నది. *యతిచ్ఛేదమునం దింకొక యంశముకూడ గుర్తింపఁదగియున్నది. పాదమధ్యమున యతిచ్ఛేదము గుర్వక్షరముమీఁదఁగాని, లఘ్వక్షరముమీఁదఁగాని చేయవచ్చును. శార్దూలాదులందలి గుర్వక్షరముమీఁది యతి జిహ్వోభారకరమగుటయు, ఉత్పలాదులందలి లఘ్వక్షరముమీఁది యతి సుఖకరమగుటయు గుర్తింపవచ్చును గుర్వక్షరముమీఁది విశ్రాంతి పరుషము – పాశ్చాత్యు లిట్టిదానిని Masculine Caesura యందురు. లఘ్వక్షరముమీఁది యతి సుకుమారము. దీనిని పాశ్చాత్యులు Feminine Caesura అందురు.[2]

ఆంధ్రఛ్ఛందములందు పదచ్ఛేదరూపయతి నియతముకాదు. యతి యాంధ్రమున వళి లేక వడి యనఁబడినది. పాదప్రథమాక్షరశ్రుతి పాదమున నియతస్థానమునఁ బునఃశ్రుతమై శ్రోత్రేంద్రియమునకు విశ్రాంతిలభించును. తెలుఁగుల వడి యక్షరమైత్రీరూపము. సదృశాక్షరోచ్చారణమున వాగింద్రియమునకు, తచ్ఛ్రవణమున శ్రోత్రేంద్రియమునకు విశ్రాంతిగలుగును. పదచ్ఛేదము పద్యధారను గొంతవఱకు అరికట్టును. వడి ధారాశుద్ధికిఁ గొంత తోడ్పడును. "విరమము స్వరప్రధానము" అని యాంధ్రసంప్రదాయము. స్వరమాత్రసాదృశ్యమున వైచిత్రి యుండదుగనుక స్వరమైత్రితో వ్యంజనమైత్రిగూడ కొంతవఱకు విధింపఁబడినది. స్థానప్రయత్నాదిసామ్యమును బురస్కరించుకొని యంశమాత్రసాదృశ్యమున్న యక్షరములకుఁగూడ మైత్రి యంగీకరింపఁబడినది. అక్షరమైత్రీభేదములనుబట్టి లాక్షణికులు పెక్కు యతిభేదములు నిరూపించియున్నారు. యతిభేదములు ప్రధానముగ నాలుగు—

1. స్వరయతులు
2. వ్యంజనయతులు
3. ఉభయయతులు
4. ప్రాసయతులు.

వీనియందు కొన్ని యంతర్విభాగములు చేసి అప్పకవి మొత్తము 41 యతిభేదములు చెప్పెను. వీనిలో కవిత్రయము భారతమునఁ బ్రయోగించిన యతివిశేషములు ఇచ్చట పరిశీలింపఁబడుచున్నవి. ఈ పరిశీలనమున అప్పకవి విభాగమే ప్రధానముగా నవలంబింపఁబడుచున్నది.

# స్వ ర వ ళు లు

## 1. సర్వమైత్రివళులు :

విసంధి యనాచారమైనందున స్వరమైత్రివళులను కావ్యములందు నిరూపింపవీలుండదు. నుగాగమ యడాగమాది సంధికార్యములవలన స్వరములు వ్యంజనములతోఁ గలిసియే యుండును.

* ఈ రసాద్యనుకూలత యత్యాశ్రయము మాత్రమేకాని గత్యాశ్రయము కాదు.

"అద్వయమునకు వక్రతమద్వయంబు
నిద్వయమునకు ఋయుగంబు నెద్వయంబు
నుద్వయమునకు నంత్యవక్రద్వయంబుఁ
జెల్లు స్వరమైత్రివళులన శేషశయన ।" 3–11

అన్న అప్పకవి వచనము యతివిషయకమైన మైత్రీనిర్ణాయకముగ గ్రహింపఁదగియున్నది. ఈ మైత్రి వ్యంజనసహితమై యనంతరయతిభేదములందు రూపింపఁబడును.

"ఎట్లు వాయు నాకిందర ఋణము సెపుమ" ద్రోణ. V. 25

తిక్కన రచనయందు ఈ యుదాహరణ మొక్కఁడు కనిపించుచున్నది.

"ఋణములును మఱి పితరుల ఋణము దేహ" ఆది. V. 71

నన్నయ రచనయం దీయుదాహరణ మొక్కఁడు కనఁబడుచున్నది.

## 2. స్వరప్రధానవళి :

"తెలిసి పదాంతగతాక్షర
ములతోఁ బై శబ్దములకు మొదలగలుగు న
చ్చులు గూర్చిన సంధుల క
వ్వలి స్వరములె నిల్చు నుభయవళులనుదక్కన్" 3–15

వడియందు స్వరసంధి యున్నచో పరస్వరముతోడనే మైత్రి చేయవలెను. దీనికి ఉదాహరణములు సర్వసాధారణములు.

## 3. లుప్తవిసర్గవళి:

"దైవభాష నదంత సాంతముల మీఁద
నత్తు మొదలనుగల శబ్ద మదుకువేళ
నమరు నోత్వంబునకుఁ జెల్లు నయహలిపులు
జగతి లుప్తవిసర్గకస్వరవళులన" 3–17

అనంతుఁడు దీనిని గూఢస్వరయతి యనెను. అట్లనుటయే ఉచితము.

"విసర్జనీయస్య సః"[3] "ససజుషో రుః"[4] అను సూత్రములచే విసర్గము 'రు' అగును. "అతో రో రప్లుతా దప్లుతే"[5] అను సూత్రముచే 'రు' ఉత్వమగును. అది పూర్వమున్న "అ" తో కలిసి 'ఓ' యగును. దీనిమీఁది 'అ' కారమునకు "ఏఙః పదాంతా దతి"[6] యను సూత్ర

ముచే లోపమగును. ఇట్లు లుప్తమైన అకారము అవగ్రహముగాఁ జూపఁబడును. అనగా నది గూఢముగా నుండును. అట్టి గూఢమైన అకారముతో మైత్రిచేయుట గూఢస్వరయతి. అప్పకవి, అనంతుఁడు 'ఓత్వము'నకు అయహలకు యతి చెల్లుననుట యుక్తముగాదు. యతి చెల్లుచున్నది గూఢమైన అకారముతోడనే.

"మ। నోఽభియుక్తి నింద్రియముల నాగి — శాంతి. IV. 314
"సోఽహమనిన కాన్పు రుద్ర యతని గనుటకున్" — అను. IV. 180.
"తే। జోఽంబుధరలు వరుసతోడ నగుఁజూరె" — అశ్వ. II. 146.
"ఘూన। భోంతరంబు సంభృతాంధకార" — కర్ణ. III. 289

ఇది స్వరయతియే. అన్యోన్య శబ్దముకూడ ఇచ్చట చూపఁబడినది. దానియందును గూఢస్వరమునకే యతిమైత్రి తఱచు కనఁబడుచున్నది.

"అక్షతప్రకరంబు లన్యోన్యమస్త। కముల" — విరా. V. 397.
"అ। న్యోన్యనిశాతసాయకనిరంతరసంతత" — భీష్మ. I. 261.
"అన్యోన్యహితులరగుట నన్యులుర్వి" — సభా. II. 282.
"అన్యోన్యవిరుద్ధభాషణము లాడిన...." — ఉద్యోగ. I. 32.

4. ఋవళి :

ఇత్త్వైత్వంబులఁ దొలఁగక
ఋత్వంబును ఋవళియనఁగ రేఫముతో మి
త్రత్వంబు నెఱపు — 3-22

ఋవర్ణమునకు రిరీరెరేలతో మైత్రికలదు.

"ఋత్విజుండని విచారించి పూజించితే
ద్వైపాయనుం డుండ ధర్మయుక్తి" — సభా. II.

"ఋషులైరి వారు మరుద్గణంబు" — శల్య. II. 160.

ఇందు తిక్కన ఋ-రులకు మైత్రి పాటించెను. లాక్షణికులు దీనిని గుర్తించి సూత్రింపలేదు. అది "సత్పు।రుషులైరి వారు మరుద్గణంబు" అని వేమూరివారి ప్రతియందుఁ గలదు. కాని మూలమునుబట్టి చూచినచో నిది యపపాఠ మనవలసి యున్నది.

"స ప్తధా ప్రవిభాగం తు । కలశస్థం జగామ హ
తత్ర ర్షయ స్స ప్త జాతా । జజ్ఞిరే మరుతాంగణాః"[7]

అను మూలమునుబట్టి "స ప్తఋషులు" అను పాఠమే యు క్తము.

ఎఱ్ఱన రచనయందు ఋవళి ప్రయోగము కానరాదు. నన్నయ ప్రయోగమునే అప్పకవి యుదాహరించెను. కాని యీ ప్రయోగ మాతఁడు చూపిన స్వీయోదాహరణముల జాతిలోఁ జేరు నదిగాలేదు.

"విని । ర్జితకనక విలోచనాఖ్య ఋగ్యజుషాది..."
"వాహీ । కృతఖేచరకులలలామ రిపుజనభీమా 3—23

అని యాతని లక్ష్యములు. నన్నయ ప్రయోగ మిట్టిదికాదు. "విచారించి" అను ఇంచుక్ యు క్తమైన క్రియయందలి 'రి' తో 'ఋ' వర్గమునకు నన్నయప్రయోగమున మైత్రి చేకూరినది. ఇందలి 'రి' ఇంచుక్కు_కారణమున నైన సంధివశమున నేర్పడినది కాని స్వతస్సిద్ధము గాదు. కనుక నన్నయగారి ప్రయోగము ఉభయయతిభేదములలోఁ జెప్పదగినది. స్వరప్రధానవళిగాఁ బరిగణించుట మఱియు నుచితముగానుండును. ఇ_ఋలకు మైత్రి ప్రసిద్ధముగదా. 'ఋ' అను స్వరమునకు 'రి' యను వ్యంజనముతో మైత్రిచెప్పుట అప్పకవి యభిప్రాయమైనచో దీనిని స్వర వళులలోఁ జెప్పరాదు. అ, య, హ లకు మైత్రిచెప్పినట్లు వేఱుగాఁ జెప్పియుండవలయును.

## 5. ఋత్వసంబంధవళి :

"సొరిదిఁ గాదులఁ గల వట్రుసుడుల కెల్ల
ఋత్వమిత్రంబులగు నచ్చు లెనయ నైదుఁ
జెల్లు హయలును స్వరమైత్రిఁ జెందునపుడు
వెలయు నివి ఋత్వసంబంధవళు లనంగ" 3_26

"ఇందుండు మీవని కృష్ణమృగచర్మకృతకుశాసనము" ఆర. III. 97.
"హృదయమతులు దీనియెడఁ గడు నార్ద్రిమై" విరా. I.249.
"హృదయాహ్లాది చతుర్ధ మూర్జితకథోపేతంబు" విరాట. I. 7.

## 6. ఋత్వసామ్యవళి :

"వట్రువలు చెంది తమలోన వ్యంజనంబు
లన్నియును గూడు ఋత్వసామ్యవళులనఁగ

వృష్ణివంశాబ్ధిసోముఁడై పృథివిఁ బుట్టి
మృతునిగావించెఁ గంసునిఁ గృష్ణుఁడనఁగ" 3-34

భారతకవు లీవళిని ప్రయోగించినట్లు కనిపించదు.

7. వృద్ధివళి :

"తలకట్టుపై సంస్కృత
ములఁ గదియు పదాదివర్ణములకు వరుసతో
నెలకొను వక్రతమంబుల
కిలనుభయము చెల్లుచుండు వృద్ధివళులనన్" 3-37

"ఎఱ్ఱనార్యుండు సకలలోకైకవినుతు" అర. VII. 469.

"ఇ। ల్లెయొప్పారుచునుండగా నుదరభాగైకప్రదేశంబునన్" అర. IV. 262.

"భో। గైకపరాయణుల్ పురుషు లంగజుఁ డప్రతికార" విరా. III. 33.

"సహ। ప్రాక్షు నక్షరుని లోకైకనాధు" శాంతి. IV. 216.

తిక్కన 'అ' తోడను, 'ఎఱ్ఱన్న 'ఎ' తోడను మైత్రిచేసిరి.

8. ఋ-ఌ వళి:

దీనిని అప్పకవ్యాదు లెవ్వరును జెప్పలేదు. అనంతుఁడు మాత్రము ఌ-ళి మైత్రి యొకటి చెప్పెను. నన్నయ ప్రయోగమున ఋ-ఌ సంబంధవళి కనఁబడుచున్నది.

"అతని వంశమునవా రతిధనలుబ్ధులై
కృతవీర్యు ధనమెల్ల క్లృప్తిచేసి" ఆది. VII. 132.

నన్నయ యీ యతిని ఒక్కచోటనే ప్రయోగించెను. తిక్కన, ఎఱ్ఱన దీనిని ప్రయోగించి యుండలేదు. "ఋ ఌ వర్ణయోః మిథః సావర్ణ్యం వాచ్యం" అను వార్త్తికమును "ఋ ఌ వర్ణౌ మిథః సవర్ణౌ'' తైత్తిరీయప్రాతిశాఖ్యసూత్రమును నన్నయ్య యనుసరించియుండును.

## వ్యం జ న వ ళు లు

9. ప్రాణివిరామము :

''వ్యంజనంబులు సర్వమైత్రివలనఁ దమకుఁ
దాము ప్రాణివిరామాభిధానములను
జెంది మూఁడుతెఱంగులై చెల్లుచుండు" 3-45

"చెలులు తలకట్లు నాచా
పులునై త్వోత్వములు ; మిత్రములు గుడిగవయున్
సుడిగవయు నేత్వయుగమును ;
జెలువగుచుట్టములు ద్వివిధశృంగౌత్వమ్మల్" 3–46

స్వరమైత్రినిఁ బురస్కరించుకొనియే వ్యంజనమైత్రి చెల్లునన్న యీ నియమము సర్వ సామాన్యమైనది. ఈ నియమమునకుఁ గట్టుపడియే వ్యంజనములు పరస్పరమైత్రిని బొరయునో యిటుపైఁ జెప్పబడును.

## 10. వర్గజయతులు :

తమతమ యనునాసికవ
ర్ణములు విడిచి వెనుకలిపులు నాల్గును దమలోఁ
దమకు నరలేక నిలిచిన... 3–49

వర్గజయతి మైత్రికి లక్ష్యములు కవిత్రయరచనయందు పుష్కలముగఁ గలవు.

## 11. బిందుయతులు :

పనిఁబూని నిలుచుఁ దమదమ
యనునాసికములకు బిందుయతులను వెనుకన్
గనుపట్టు నాల్గులిపులును
బెనుసున్నలు డాసి తమకుఁ బిఱుఁదఁ గదియుచోన్. 3–52

కవిత్రయ మీయతిమైత్రి నెచ్చటను వాడినట్లగపడదు.

"ముకుళనంబును జృంభణంబును నొనర్చి" విరా. II. 241

విభక్తి 'ము' వర్ణస్థానీయమైన బిందుపూర్వక 'బు' వర్ణముతో 'ము' కారమునకు యతి కవిత్రయప్రయోగములందు కలదు ఉత్వవిశిష్టబకారముతోడనే ఈ మైత్రి కలదు. అన్యాచ్చులతోడి బకారమునకుఁగాని, పవర్గమునందలి యన్యవర్ణములకుఁగాని, ఇతరవర్గాక్షరములకుఁ దమతమయనునాసికములతోఁగాని యిట్టిమైత్రి కనఁబడదు.

## 12. తద్భవవ్యాజయతి :

విజ్ఞానము మొదలగువానికి తద్భవరూపములందు 'జ్ఞ'కు 'న' వచ్చును. 'న, ణ' లకు మైత్రి మున్ముందు చెప్పఁబడును. కనుక 'జ్ఞ'తో న ణ లకును చెప్పుట యీ యతి యుద్దేశము.

సంయుక్తయతి లక్షణమునుబట్టి 'జ్ఞ'కు 'జ'తోకూడ మైత్రి చెల్లునని లక్ష్యమందలి "జరిగి నణ లకు రెంటికి జ్ఞాతనర్చు" నన్న వాక్యమందలి మైత్రినిబట్టి భావింపఁదగియున్నది ఇది వర్గజ యతియే.

కవిత్రయ మీ తద్భవవ్యాజయతిమైత్రిని ప్రయోగించినట్లు కనఁబడదు.

## 13. విశేషవళి :

ప్రౌఢకవులు కొందఱు జ్ఞకారంబునకును
ప్రథమవర్గంబు తొలియక్కరములు నాల్గు
నిడుదురు ప్రబంధముల నొక్కయెడ విశేష
వళులనుచు సోమయాజులు వాడుకతన. 3-56

'జ్ఞ'కారముతో క, ఖ, గ, ఘ లకు మైత్రిచేయుట విశేషవళి. అట్టిమైత్రిని కల్పించినవాఁడు తిక్కన. ఆయనయు నొక్కచోటనే యీ మైత్రి పాటించెను.

"జ్ఞానము కేవలకృప న
జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము సేయం"

"ప్రకాశము" అనుటకు "ప్రజనితము" అని పాఠాంతరము చూపుదురు. పాఠాంతరము తిక్కన పలుకుబడిగా నగపడదు. 'జ్ఞా' యన్న యక్షరము తాలవ్యాక్షరద్వయసంయోగమే యైనను తదుచ్చారణమున గకారశ్రుతి లోకవ్యవహారమున గోచరించుటచే నిట్టిమైత్రి తిక్కన కిష్టమైయుండనోపు.

## 14. అనుస్వారసంబంధవళి:

ఆదిపూర్ణ యుతములై టతవర్గాక్ష
రములు తుదను గలుగు వ్రాలు దక్కఁ
బొసఁగు నొకటికొకటి భువి ననుస్వారసం
బంధయతులునాఁ బ్రబంధములను. 3-58

ఈ లక్షణమందలి పూర్ణము సిద్ధపూర్ణము. ఇట్టిమైత్రికి భారతమున లక్ష్యములు కాన రావు. సాధ్యపూర్ణమైనను లేవు.

## 15. అనునాసికాక్షరయతి:

"అల ద్రుతంబునకును మధ్యమానునాసి
కమునకును జెల్లు ననునాసికయతులనఁగ

డాపలను బూర్ణములుగల్గు టఠడఢలును
తథదధలును గ్రమంబున దానవారి" 3_62

బిందుపూర్వక ట ఠ డ ఢ లకు 'న'తోడను, బిందుపూర్వక త థ ద ధ లకు 'ణ' తోడను మైత్రి చెల్లును.

"అమ్మహితాత్ముఁ డిట్లను విను నారాయ
ణుం డవ్యయుం డనంతుండు శాంతి. IV. 81.

అని తిక్కన ప్రయోగము కలదు. దీనిని ప్రాసయతిక్రింద త్రోసివేయుటకుఁగూడ అవకాశము కలదు. నన్నయకువలె తిక్కనకు సీసములందు ప్రాసనివేశనియమములు లేవుగాన దీనిని అనునాసికాక్షరయతిగా గ్రహించుట కభ్యంతరముండరాదు.

## 16. ము విభక్తియతి :

"పున్నపుంసక తత్సమంబుల కడపలఁ
దత్సమానాంధ్ర దేశ్యశబ్దముల తుదలఁ
గదిసిన మకారశృంగముల్ కావ్యములను
బొసఁగు ము విభక్తియతులన పుఫుబుభులకు" 3_69

విభక్తి 'ము' వర్ణకమునకును పు ఫు బు భు లకును మైత్రిచెల్లును. ఉత్వవిశిష్టములయిన ప ఫ బ భ లకేకాక ఒత్వవిశిష్టములకును జెల్లునని గ్రహింపవలెను. విభక్తిమువర్ణకముయొక్క పూర్వరూపము ంబు, బు అగుటచే నీమైత్రి సహజమైనదే.

అంశం।బునను భరద్వాజు కలశమునఁ బుట్టె ఆది. III. 78.

ఖేదం।బున వ్రేలెద మథమలోకమున తెరువుసనన్ ఆది. II. 143.

హృదయం।బున గాఢాదరము భరితముగ నిట్లనియెన్ విరా. I. 45.

ఈ యుదాహరణములందు విభక్తి ము వర్ణముతో మైత్రిపొందుచున్న బువర్ణములు బిందుపూర్వకములై విభక్తిమువర్ణముయొక్క పూర్వరూపములై యున్నందున ఈ లక్షణమునకు అత్యుత్తమ లక్ష్యములుగా నెన్నదగియున్నవి.

ముద।మునఁ దలచిన నురగభయము బొందదు జనులన్ ఆది. II. 237.

భూమీశ్వరుఁ డసువియోగముం బ్రాపించెన్ అర. VI. 305.

పురుషుండు ప్రియశోకమునఁ బొంద శాం. I. 188.

అప్పకవి లక్షణమునుబట్టి యిట్టి లక్ష్యములను గ్రాహ్యములగును. విభక్తి మువర్ణమునకును పదాది పు ఫు బు భు లకును మైత్రి యిది.

కవిత్రయము చేసిన ఈ క్రింది ప్రయోగము లిచ్చట విమర్శింపఁదగియున్నవి.

ముకుళనంబును జృంభణంబును నొనర్చి విరా. II. 241.

లోకం।బుననుండి యనేకదివ్యమునిసంఘముతో ఆది. III. 91.

తీర్థం।బున కరిగె నగంబు లొక్కమొగి గ్రక్కదలన్ ఆది. II. 71.

పర్వం।బున మరియును నరుగుదెంచు ముద్గలుఁడును ఆర. VI. 119.

విభక్తి మువర్ణముతో పు ఫు బు భు లకు మైత్రి లక్షణమునఁ జెప్పఁబడినది. పై లక్ష్యములందు విభక్తిమువర్ణము లేదు. బిందుపూర్వక 'బు' వర్ణముతో పదాది ము, మొలు మైత్రి చెందుచున్నవి. ఇందలి బిందుపూర్వక 'బు' వర్ణములు విభక్తి 'ము' వర్ణస్థానీయములు. ఇట్టి వానితో కేవలముకారమునకు మైత్రికుదుర్చుటకు అప్పకవి లక్షణము సమర్థముకాఁజాలదు. వక్ష్యమాణ ముకారయతిమైత్రికి వీనిని లక్ష్యములుగా గ్రహింతమన్న వీనియందలి బిందుపూర్వక బువర్ణము విశిష్టమైయున్నది. వీనిని బిందుయతులకు లక్ష్యములుగా స్వీకరింతమన్న అట్టిమైత్రి కవిత్రయమునకు అభిమతమని చెప్పుటకు వేఱు లక్ష్యములు - అనఁగా ఉత్వవిశిష్టములుకాని బిందుపూర్వక ప ఫ బ భ లకు మువర్ణముతో మైత్రిచేయునవి భారతమునం దగపడుటలేదు.

విభక్తిమువర్ణస్థానీయమైన బిందుపూర్వక బువర్ణమునకు కేవల ముకారముతోడి మైత్రి యతిభేదముగాఁ జెప్పఁదగును.

## 17. ముకారయతి :

హెచ్చరికను పుఫుబుభులకు
నచ్చపు మాకొమ్ములే మహాకవు లాదిన్
మెచ్చులుగ నిలిపి రచ్చట
నచ్చటను ముకారయతు లటంచును గృతులన్ 3-72

పు ఫు బు భు లతో అచ్చపు ముకారమునకు మైత్రి కవిత్రయమునఁ గానరాదు.

"అష్టైమ్మెయిన్ । ములుముఁటం దగఁ బుచ్చుభంగి గలుగున్ భూనాథ"

శాం. II 418.

ఇచ్చట నట్టి మైత్రిని తిక్కన పాటించెనని భావింపవచ్చును. కాని—

"అల్లెమ్మెయి న్మలుముంటం దగఁ బుచ్చుభంగి గలుగు న్నూనాధ" అను తీరున వ్రాసి నచో నిచ్చట సంయుక్తయతి పాటింపఁబడినదని సమాధానము చెప్పుకొనుటకు వీలున్నది.

## 18. మవర్ణవిరామము :

......చరమానునాసికంబునకు నిట్లు
గ్రాలు కృతుల మవర్ణవిరామములన
దండిసున్నలు దాపల నుండెనేని
పెలుచ నంతస్థములు నూష్మములును కృష్ణ 3-76

యరలవలు, శషసహలును బిందుపూర్వకములై మవర్ణముతో మైత్రి చెందును.

కవిత్రయ మీమైత్రిని మన్నించిన ట్లగపడదు. కాని కొందఱు ఈ క్రిందిపంక్తి యుదాహరణము కావచ్చునని భావించుచున్నారు.

ఇం। ద్రావరజాదిమిత్రులు నమర్షము బొందిరి ధార్తరాష్ట్రులున్
సభా. II. 73.

దీనిని మవర్ణవిరామముగా భావింపవచ్చుననుట సరికాదు. బిందుపూర్వకములైన యరలవ, శషసహ లతో మవర్ణము మైత్రినందుటయే మవర్ణవిరామము. ఇది బిందుయతి యనుటకును వీలుపడదు. బిందుయతియందు మకారము బిందుపూర్వక పఫబభలతో మాత్రమే యతిమైత్రి నందును. ఇది అనుస్వారసంబంధవశిగాని, అనునాసికాక్షరయతిగాని కాఁజాలదు.

"అసహత్వము బొందిరి" అను పాఠాంతరము మాట యటుంచినచో నిది ప్రత్యేకముగాఁ బేర్కొనఁదగ్గ యతిభేదమే. బిందుపూర్వకమైన ఏ యక్షరముతోనైనను మవర్ణము మైత్రిపొందు ననఁదగును.

## 19. ఋజుయతి :

మొదలి యంతస్థవర్ణంబు తుదిని బొదలు
నూష్మమును ఋజుసంజ్ఞచే నొకటికొకటి
యతులగు ... ... 3-79

య-హ లకు మైత్రి చెల్లును అని భావము.

ఖా। హులు కసివోవ పీనిపనియుఙ్ ద్వరితక్రమవిక్రమంబునఙ్
శల్య. II. 126.

హతులై నానావిధోపాయనములు గొని సౌహార్దవాంఛ౯ జయశ్రీ
ఆది. V. 38.

హాయను ధర్మరాజతనయా యను ద్రోణ.

లక్ష్యములు పుష్కలముగాఁ గలవు.

## 20. ప్రత్యేకయతి :

ఉత్తరపదాద్యలిపి లోపమొదవుచుండు
తఱిని బ్రత్యేకయతినాఁగ దనరుచుండు
అరయ శార్ఙ్గంబు హరిచేతియది యనంగ
దివ్యచాపంబు శూలిచేతిది యనంగ 3-80

ఉత్తరపదాదిస్వరము లోపించినచో వ్యంజనముతో మైత్రి, లోపింపనిచో స్వరముతో మైత్రి యని లక్షణతాత్పర్యము.

అది, అవి యను శబ్దముల అత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగును.[8] చేతిది, చేతియది యని రూపద్వయమేర్పడును. లక్ష్యమునందు పూర్వపదము ఇదంతము. అదంతముల విషయమునను రూపద్వయమున్నది. కన్న + అది = కన్నది, కన్నయది.

కన్నది యనురూపమున ఉత్తరపదాద్యలిపి లోపమైనట్లే కదా. దీనియందును వ్యంజనమునకే యతి పాటింపవలెను. కాని కవిత్రయ ప్రయోగములు అన్యథా కనఁబడుచున్నవి.

దా। నిది కలరూపెఱుంగ నవనీపతి యుత్సుకుఁడయ్యె ఆది. IV. 30.

అ। ట్టిదియును ధర్మువే తగ ఘటించిన నిక్కము లేదయేని
ఉద్యో. III. 70.

ఇదంత పదముమీఁది ఉత్తరపదాద్యలిపి లోపమునకు నన్నయతిక్కనల ప్రయోగములు ఈ రెండే భారతమునఁ గనఁబడుచున్నవి. ఈ క్రిందివి అత్సంధులుగా గ్రహింపఁబడి స్వరమైత్రి పాటింపఁబడినది.

"అహిత మాచరించినదియు లేదు" సభా. I. 185.

"స। మాదరమునఁగాదె బ్రతికినవి యిజ్జగముల్" అర. VII. 314.

"నినుగ। న్నదిమొదలుగ నెల్లవారి కయ్యెభంగిన్" విరా. II. 99.

"..................... ..........పుడమిఁ బడను
న్నది పాఱినఁగని యదల్చి యవనీశుఁడు" శల్య. I. 383.

"అదంద నేడ్చుచున్నది కంటె" స్త్రీ. II. 73.

ఇట్టివి 'వాఁడు' శబ్దము చేరఁగా నేర్పడిన రూపములును గలవు. 'వాఁడు' నందలి 'వ' కారము పోగా మిగిలిన 'ఆఁడు' చేరి యేర్పడిన "ఉన్నాడు" వంటి పదములు యతిస్థానమునఁ గలవు. వీనియందు వ్యంజనమైత్రియే పాటింపఁబడినది.

"నాకు దక్షిణగా నిచ్చినాఁడ వింక" శాంతి. II. 87.

"నరసుత నీయనుజ్ఞ గొనినాఁడ" అర. I. 242.

"నాదు గుఱుతు సెప్పినారెవ్వ రనినను" అశ్వ. I. 45.

"ఉ। న్నారటుగాక మీకది మనంబున కప్రియమేని" ఉద్యో. III. 284.

"కల్పించి। నాఁడఁగావున నీ మనంబునందు" ద్రో. II. 170.

## 21. భిన్నయతి : పెఱయతి :

"గుడుసుపైఁ గ్రియనడుమ నా గుడుసు వచ్చి
భిన్నయతియగు రానిచోఁ బెఱయతియగు
నెదను లచ్చిని హరి ధరియించె ననఁగ
రిపులనెల్లనుఁ బోర హరించె ననఁగ" 3-81

ఇంచుక్కు పరమైనప్పుడు కొన్ని ధాతువులకు వికల్పముగా ఇయుడాగమ మగును. ఇయుడాగమ మైనచో నేర్పడు రూపములకు స్వరమైత్రియే చేయవలెను. అది భిన్నయతి. ఇయుడాగమము రాని రూపములకు వ్యంజనమైత్రి చేయవలెను. అది పెఱయతి. ఇది యప్పకవి యభిప్రాయము. ఇంచుగాగమమైనప్పుడు సిద్ధించు రూపము జగణమైనచో ఆ పదము నడిమి వ్యంజనముతోడనే మైత్రిచేయవలెననియు వేఱు గణ స్వరూప మేర్పడినచో స్వరముతోఁగాని వ్యంజనముతోఁగాని మైత్రి చేయవచ్చుననియు అనంతుని యభిప్రాయము.

అనఁగా ఏకస్వరక్రియల కించుక్కు చేరగా నేర్పడినరూపములందు వ్యంజనమైత్రియే. జగణమధ్యగతమైనదానికి వ్యంజనముతోడనే మైత్రిచేయవలెను.

"అంచితతిలకము శౌరి ధ
రించె ననఁగ జగణమధ్యరేఫవిరతి యా

నంచితతిలకము హరి ధరి
యించెననఁగ భిన్నవడికి నిత్వము చెల్లున్" ఛం. ద. I. 121.

"సిరికిఁ దొలంగి కానల వసించి" అర. V. 342.

"ధా। త్రీరమణుండు మేటిగ నుతించుట" అర. IV. 199.

"చెప్పికొనుచుఁ దగ వసించెఁ దదీయ" శాంతి. III 60.

జగణేతర రూపములందు ఉభయయతి :

"వీరలు దైవశక్తిఁ బ్రభవించినవారగు టేమి సందియం
బీరమణీయకాంతి నుపమింపఁగ వేల్పుల కారె ?"

ఇందు ప్రథమపాదమున వ్యంజనమైత్రియు, ద్వితీయపాదమున స్వరమైత్రియుఁ గలవు.

"చంప నచ్చేరువఁ జప్పరంబున శయ
నించు యుధామన్యుఁ డెఱిఁగి కడఁగి" సౌప్తి. I 169.

ఇందు స్వరమైత్రి పాటింపఁబడినది.

"నేఁడు నెమ్మది శయనింపఁజూచె" అర. IV. 315.

ఇందు వ్యంజనమైత్రి పాటింపఁబడినది.

"ఎట్లడం। గించెనొకో శిఖండియను కృత్రిమవాయువు" భీష్మ. I.

ఇచ్చట వ్యంజనమైత్రి పాటింపఁబడినది. ఈ యతిమైత్రి ఋత్వసంబంధవశిగాకూడ గ్రహింపఁదగి యున్నది.

ఇయుడాగమములేని యించుగాగగమములందు భారతకవులు విశేషముగా వ్యంజనమైత్రినే పాటించిరి.

ఇంచుకయేని పాపమున కెన్నడు రోయక యెల్లవారి బా
ధించి మనుష్యమాంసములు దించును గ్రొవ్వితి వానినెల్లఁ గ్ర
క్కించెద నీమదాంధ్య ముడిగించెద నిప్పడ కాలుఁద్రొపోలి కే
గించెదఁ జక్కనై నిలుము గిట్టి రణంబున రాక్షసాధమా ఆది. IV. 297.

"వేఱ వానికిఁ గీడు గావింపనేల ?" అర. V. 39.

"జితదైత్యుండు శతక్రతుండు నను భిక్షింపంగ" అర. VII. 292.

"దం। డితుఁజేసి మనలఁ బెట్టించుకొనియె" విరా. I. 74.

"దివియు భువియును జూచి ప్రార్థించి" విరా. I. 174.

"కలు । షించిన నొండొండ చెమటవొడమ" విరా. II. 33.

"రంజాదుల యించుక్పకారంబునకు సబిందుకంబున క్రప్రే
రణంబున ద్విరుక్తలకారంబగు" బా. వ్యా. క్రియా. 71.

కనుక ఇంచుగాగమమైన శబ్దములందువలెనే "ఇల్లు" చేరినవానికిని ఉభయయతిగా భావింప వచ్చును.

"చేకుఱ నేలినట్లు విలసిల్లునె ?" ఆర VI. 149.

"మూ । ర్ఛిల్లె నరుఁడు బంధులెల్లఁ జేష్టలు దక్కన్" ద్రోణ. II. 274.

ఇట్టిపట్ల భారతకవులు వ్యంజనమైత్రియే పాటించిరి.

## 22. ఏకతరయతులు :

అనంతాదులు దీనిని ఎక్కటియతి యనిరి.

"మ ర ఱ ల వ ములన నేన
క్కరములు తమతమ కెవళ్లు" రేచన.

"మ ర వ ల ఱ లేకతరవళు
లరయఁగ తమతమక" వి. పెద్దన.

ధర నెక్కటి వళ్లై తగు
శ ర మ ఱ వలు వానిలోఁ జెలంగును లాకుఁ జా
సరి శాయన విశ్రమవే
శ రమాధిప రెండునుం గలసివర్తించున్ అనంతుఁడు

ఛందోదర్పణము 1-117

రేచన పెద్దనల మతమున లరఱమవలు తమకుఁదామే యతిమైత్రిచెందును. అనంతుని మతమున లళలకు మైత్రి యున్నందున మఱరవలు మాత్రయే ఎక్కటివళులు. కాని అనంతుఁడు మకారమునకు బిందుపూర్వకములైన అంతస్థములతో ఊష్మములతో మైత్రిచెప్పెను. "ప్రకట పకార వకార ద్వికమునకుం జను నభేదవిరతి" అనియు నాతఁడే చెప్పెను. కాఁగా అనంతుని మతమున ర, ఱ లు మాత్రమే ఎక్కటివడికి నిల్చినవని భావింపఁదగును. అప్పకవియు నిదియే మార్గము నవలంబించెను.

"మహిని రేఫాక్షరంబును మఱి శకటాంగ
నామక అకారమును సవర్ణంబులయ్యు
కావ్యములయందు నొకటికొక్కటి గలయక
తమకుఁ దామయ యగు నేకతరయతు లన" 3-85

అని యప్పకవి స్వమతమును స్పష్టముగాఁ జెప్పెను. అప్పకవి రేఫ శకటరేఫములకు ప్రాస మైత్రికూడ నిరాకరించెను కాని భారతకవులు రేఫశకటరేఫములకు ప్రాసములందు మైత్రిపాటించి యుండిరి. (చూ. ప్రాసము)

"ఱాయో కాకిట్లు రూపఱక వినవోర్చెన్" ఉ. III. 419.

"రాతిపయిని నుప్పుగొనుట రాత్రి దధిమధూ" అను. IV. 110.

రాయి శబ్దమున శకటరేఫమయినచో రెండవలక్ష్యమునను, సాధురేఫమయినచో మొదటి లక్ష్యమునను ఈ మైత్రి కలదు.

"ఎరగి ప్రియము వలికి తెరువిత్తు రిట్టిద" ఆది. VII. 112.

"మఱి మ్రొక్కునది వీరి కెఱుగుటదక్క" అను. IV. 105.

'ఎరగు' నందు సాధురేఫమైనచోఁ దిక్కన్న, శకటరేఫమైనచో నన్నయ ఈ మైత్రి పాటించినట్లగును.

## 23. అభేదవిరతులు :

"వేదముఖమున వబయోరభేద యనుట
వలన వబలొక్కటొక్కటి నిలుచువిరతి
కవని లడలకు ళళలకు నట్లకలిమిఁ
జేసి తమలోన నివియునుఁ జెల్లుచుండు" 3-87

వబలకు, లడలకు, ళళలకు అభేదముగనుక అభేదవిరతులు మూఁడుతెఱఁగులు. వీనిలో వబలకు, ళళలకు మైత్రి భారతమునఁ గలదు.

A. వ బ లకు :

"సూనృత । వ్రత మొకబావి మేలు మఱి బావులు" ఆది. IV. 93.

"వ । ర్వతము గ్రహించునట్లు తన బాహుల వాని గ్రహించి అర. I. 311.

పాండవ । వరుఁడగు ధర్మజున కిచ్చి బ్రదుకుము నెమ్మిన్

ఉద్యో. II. 245.

"బాధ గావించి కుడిచి శవంబు దొలుచు" శాంతి. III. 182.

B. లళలకు :

"లలితకృశోదరంబుఁ దరళత్రివళీయుత" ఆది. IV. 43.

"కే । ళీరసికుండు వారి నవలీలమెయిన్" అర. VII. 71.

"తూ । లిన వెసనెంతయుం గవళించు" విరా. II. 31.

"లీలం గేల నమర్చి మత్తగజకేళీసుందరోల్లాస" కర్ణ. III. 210.

"త । లంచి యుత్తమగోయుగళంబు విలిచి" శాంతి. IV. 155.

లడలకు యతిమైత్రి భారతమునఁ గనఁబడదు. కాని నన్నయ—

"నో । డుదురు నన్మను లిందుఁ గోల్మొసడుల్ గొనున్"

ఆది VIII. 148.

అని ప్రయోగించెను. 'మొసళల్' అన్న ప్రసిద్ధరూపమునే నన్నయ్య వాడెనని భావించినచో నిచ్చట లడల కభేదయతి పాటింపఁబడినదని చెప్పవచ్చును. ఇది తప్ప లడలకభేదయతిమైత్రి యన్యత్ర భారతమునఁ గానరాదు. ప్రాసమైత్రి యున్నపట్లను ఇట్టి రూపాంతర వ్యవహారమే బాధకమగుచున్నది.

## 24. అభేదవర్గయతి :

"తన కరలేని బకారం
బునకు స్వవర్గజములైన మొదలిలిపులు రెం
టను బైలిపి నొకటను వా
యనుప్రాయి యభేదవర్గయతినా నెనయున్." 3–98

"వే । ల్పులలోపలఁ బెద్ద ధర్మువున సత్యమునఁ" ఆది. V. 92.

"వె । ల్వడఁగఁ బఁచెఁ గడుఁ బాపమతిఁ" ఆది. VI. 230.

"స్ఫీతస్వాంతుఁ డనంతసంతతసమావిర్భూత" అర. VI. 103.

"అ । పారశరావలుల నడుమ వారింపంగా" అర. VII. 199.

"పుట్టిన సంతసంబుసనువుం బరికించితిగాదె" విరా. II. 278.

"మద్రే। శ్వరుఁడు గృపుడుం బరవఁ బరగి దివిజుల్ నెగడ"
శ్రీ. II. 73.

"పెనుఁబ్రాపై యుండ నేను వెఱతునె" శాంతి. III. 292.

సం।వాసన మావహిల్లు జనపంక్తులు గీర్తనసేయ స్వర్గా. 92.

25 ఊష్మవిశ్రాంతులు:

"అంత్యవర్ణంబుఁబాసి యూష్మాక్షరంబు
లూష్మవిశ్రాంతులన జెల్లు నొకటికొకటి" 3–104

హకారము తప్ప తక్కిన యూష్మములు – శ, ష, స లు పరస్పరము మైత్రినందును. దీనికి లక్ష్యములు పుష్కలముగఁ గలవు.

26. సరసవళులు :

హయ లత్వమునకు శషసలు
నయవర్తన చఛజఝులకు నలి మధ్యమవ
ర్గయుతానునాసికము ని
శ్చయముగ ద్రుతమునకుఁ జెల్లుసరసవళులనన్. 3–105

A. అ య హ లకు :

"అమరేంద్రారాతు లిట్లాహవముఖమున నేయంగఁ దత్తీక్ష్ణ" ఆది.

"అ కుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు" విరా. I. 98.

లక్ష్యములు కొల్లలుగా నున్నవి.

B. శ ష స చ ఛ జ ఝ లకు :

"సం।చారిత ధాతునిర్ఝర విశాలశిలోచ్చయ" ఆది. VI. 77.

"జగతిఁ బ్రసిద్ధుఁడై వెలయు సంవరణుండు" ఆది. VII. 68.

"శశిరేఖ నమృతంబు జాలువాఱ" విరా. I. 12

"జననమరణాదులైన సంసారదురితములకు" విరా. I. 23

లక్ష్యములు పుష్కలముగా నున్నవి

C. న ణ లకు :

"నిషాదగణముండి ధారుణీప్రజకుఁ గడున్" ఆది. II 59.

"నినదంబున గగన ధారుణీ మధ్యము" అర. VII. 116.

"వీ। ణల కిచ్చునట్టి తిన్నని యెలుంగు" విరా. II 76.

లక్ష్యములు సమృద్ధిగా నున్నవి.

27. సంయుక్తవిరతులు :

ఒకటిరెండు జడ్డలుండెడు వర్ణంబు
విశ్రమస్థలమున వెలసెనేని
నవల దాని కెద్దియైన సంయుక్తవి
శ్రామసంజ్ఞచేఁ బొసంగుచుండు. 3_108

రెండు మూఁడు వ్యంజనములతోఁ గూడిన సంయుక్తాక్షరము పదాదినున్నప్పుడు వాని యందలి ఆదిమధ్యాంతగతములైన యంగములలో నేయొక్కదానితో మైత్రిగల యక్షరమునైనను యతిస్థానమున నుంచవచ్చును. అప్పకవి సామాన్యముగాఁ జెప్పినను సంయుక్తాక్షరమునందు సిద్ధసంయోగములు, సాధ్యసంయోగములు – అని రెండుభేదములు గుర్తింపఁదగియున్నవి.

1. క్షమ, స్థిరము, స్వరము, క్ష్మా, స్ఫురణ, మ్లాన, భ్రమ, స్నాన, జ్ఞానము–ఇత్యాదులందలివి సిద్ధసంయోగములు.

2. దుర్భర, సన్మతి, అనుస్థానము, దుస్తరము, ఉత్కంపము, ఇత్యాదులు – సంధివశమున నేర్పడినవి సాధ్యసంయోగములు. సిద్ధసంయోగములం దేయంగముతోనైన మైత్రిచేయుట, సాధ్యసంయోగములందు పరాంగముతోడనే మైత్రిచేయుట భారతమున–విశేషించి నన్నయ రచనయందు సామాన్యలక్షణముగా నగపడును.

సంయుక్తాక్షరముతో యతిమైత్రి చెల్లించునప్పుడు భారతకవులు సాధారణముగా నీ క్రింది యంశములను పాటించినట్లు తోఁచును.

a. స్పర్శములు, ఊష్మములు, అంతస్థములునైన వర్ణములు ఉత్తరోత్తరము దుర్బలములుగా భావించి వాని సంయోగములందు బలీయమైనదానికే యతిమైత్రి పాటించుట.

b. రేఫపరసంయోగమున ప్రగ్రహవర్జనన్యాయము ననుసరించి రేఫేతరమునకే మైత్రిపాటించుట.

c. ఉపసర్గసంయోగములందు పదాదివర్ణమునకే మైత్రి పాటించుట.

d. సాధ్య సంయోగమున పరవర్ణమునకే మైత్రిపాటించుట.

ఇవి యవ్యభిచారినియమములు కావు. ప్రాయోభావమునఁ జెప్పఁదగినవి. ఆ ప్రాయోభావమైనను నన్నయ విషయముననే వర్తించును. తిక్కన యిట్టి నియతి యేదియు పాటించినట్లు కనఁబడదు.

ఈ సందర్భమునఁ దిక్కన చేసిన విశేష మొకఁడు గుర్తింపఁదగియున్నది. పూర్వపాదాంతస్థమైన ద్రుతమును ఉత్తరపదాదివర్ణముతో సంశ్లిష్టముచేసి ఆయన యతిస్థానమున వణలతో మైత్రిచేయుట పెక్కుపట్ల కనఁబడుచున్నది. నన్నయ కిది యంత అభిమతముగా నగపడదు. ఆయన ఒక్కచోట మాత్రమే యిట్టి ప్రయోగముచేసెను.

"వ్రచ్చి వధింతుఁగాక యిటు వచ్చి శ్రమంపడియున్న నిచ్చట
న్మెచ్చగు వీరిదైన సుఖనిద్రకు భంగము సేయనేర్తునే ?"

ఆది. VI. 200.

పరుషసరళములతో నిట్టిసంశ్లేషమున వింతలేదు స్థిరములతోడి సంశ్లేషమును, ఊష్మాంతస్థములతోడి సంశ్లేషము అసాధారణమై అసహజమనిపించును. తిక్కన సర్వవిధ వర్ణములతోడను ఇట్టి సంశ్లేషమును చేసి యతినియతి పాటించితినని తృప్తిపడినట్లు తోఁచును.

పాదాది సంశ్లేషము :

"నిర్వహించుచున్।భేదములేని భక్తి మతి నిర్మలవృత్తిగ విరా. I. 15.

"ఇంతకున్।మఱచుట గల్గెనే నది వినంబనిలేదు" విరా. II. 169.

"గలిగినన్।రాని మ్మెలుగింపు మీమొనం గలవారిఁ" కర్ణ. III. 212.

"నీకున్।పాలనయన కలుగఁ గారణం బేమి ?" అను. IV. 424.

యతిస్థాన సంశ్లేషము .

"నరుఁడమ్మై విని వచ్చె నన్నరునకున్ సంశప్తకశ్రేణి" కర్ణ. II. 150.

"నను నీవప్పుడు సూతమందిరమునన్ మద్యంబు దెమ్మన్న"

విరా. II. 158.

ఉభయత్ర సంశ్లేషము :

"తుదిన్।భరమై యుండదె యేపడంపుము రిపున్ సంరంభమే
పారగన్" కర్ణ. II. 307.

"శోభిల్లుచున్ । మణిదండద్యుతి మంజరీస్ఫురణమున్ సంశోభి"
శల్య. I. 278.

ఇట్టివానిని ద్రుతసంబంధవళులని యొకతెగగాఁ జెప్పవచ్చునేమో. లేదా – ద్రుతమునకు బిందుత్వము కల్పించి వీనిని బిందుయతులలో చేర్చవచ్చునేమో.

ద్రుతముతోడనే కాక బహువచన లకారముతోఁగూడ తిక్కన యిట్టి సంశ్లేషములు చేసెను. పాదాదియందు :

"మత్ప్రతుల్ । గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్" విరా. II. 55.

యతిస్థానమున :

"కా । ల్వురమొత్తంబులు రూపడంగె సిడముల్ నుగ్గయ్యె"
కర్ణ. II. 200.

పాదారంభమున వినఁబడిన శబ్దశ్రుతి యతిస్థానమునఁగూడ వినఁబడవలెననుటయే వడి నియమ పరమార్థము. తిక్కన యవలంబించిన యీ సంశ్లేషప్రక్రియ యా యర్థమును సాధించుచునేయున్నది.

## 28. అంతోష్మసంధివడి :

"..................వర్గహల్లు
హల్లులకుఁ బై హకారంబు పొందునపుడు
కంధిబంధన యంతోష్మ సంధివిరమ
ణాఖ్యచే దావి కెయ్యదియైనఁ జెల్లు. 3–115

ఇట్టి వడిమైత్రి భారతకవులు ప్రయోగించినట్లు లేదు. అంతోష్మసంధివడియందు వర్గాక్షరమునకుఁగాని హకారమునకుఁగాని మైత్రి చెల్లునని యప్పకవి యభిప్రాయముగా ఆతఁడిచ్చిన లక్ష్యములవలన గ్రహింపఁదగియున్నది. ఇట్టి సంధులయందు హకారస్వరమైత్రికూడ పాటింపఁదగునని యాతని యభిప్రాయ మగునోకాదో. అనంతామాత్యుఁడు "వికల్పయతి" యని యంతోష్మవడినే చెప్పుచు అందు అచ్చుతోగూఁడ మైత్రి పాటింపఁదగునని లక్ష్యమున స్పష్టము చేసెను.

హయుతమై పొల్లుల వికల్పయతులు చెల్లు
దేవకీనందనుఁడు జగద్ధితుఁ డనంగ
హలధరుఁడు సంగరాంగణోద్ధతుఁ డనంగ
అవని మోచినయవి కకుబ్భస్తు లనఁగ
ఛందో. I 123.

స్వరమైత్రిగల యంతోష్మవడికి ఎఱ్ఱనప్రయోగ మొకటి కనఁబడుచున్నది.

"ఏను వాఙ్మనఃక్రియల తద్ధితమ కోరి" అర. V. 21.

అంత్యోష్మవశి ఈషన్నిత మైన సంయుక్త విశ్రమభేదమే.

## 29. వికల్ప విరమణములు :

"వ్యాకరణసూత్రముల సంధు లతుకునపుడు
రెండువిధముల రూపము లుండెనేని
వసుధ నయ్యక్కరముల కవ్వల వికల్ప
సంధివిరమణమన రెండు జరుగుచుండు 3-116

"యరో ఽనునాసికే ఆనునాసికో వా" యను సూత్రమువలన సిద్ధించు రూపములందలి సంయోగములకు యతిమైత్రి చేయునప్పుడు వర్గాక్షరమునకుఁగాని, అనునాసికమునకుఁగాని చేయవచ్చును.

ఏతత్ + మురారి = ఏతన్మురారి; ఏతద్మురారి

'న్మ' యందలి న,మ లతోఁగాని 'ద్మ' యందలి ద, మ లతోఁగాని మైత్రిగల యక్షరమును యతిస్థానమున నిలుపవచ్చును. అప్పకవి వికల్పవిరమణము అనంతుని వికల్పయతికంటె భిన్నము. అనంతుఁడు దీనిని యుక్తవికల్పయతి యని ఒక్క గకారమునకే పరిమితము చేసెను. భారతమున గకారయుక్తమైన దొక్కచే యిట్టి యతిమైత్రి తిక్కన ప్రయోగించినది కలదు.

"వా। ఙ్మానసములు సునియతములు గావింతురు." శాంతి V. 90.

వా గ్మానసములు అను వైకల్పికరూపమును స్వీకరించినచో నిది సంయుక్తాక్షరయతియై విశేషమేమియు నుండదు.

అప్పకవి సంధివశమున సిద్ధించిన వికల్పములకే దీనిని పరిమితము చేసెను. అన్యథా వికల్పరూపములుగల పదములనుగూడ కవులు ప్రయోగించిరి. అపదాదిగకారము వకారమగుటచే రూపద్వయము సిద్ధించు పదములనుగూడ వికల్పయతి విశేషములుగ స్వీకరింపవచ్చునేమో.

"వినుము నరేంద్ర విప్రుఁ డలివెన్ జమదగ్నిసుతుండు" శాం. I. 35.

"వింతయె కాముశక్తి నుడివింప" ఆది. VII. 59.

"పదివే। వురు గాచిన నెల్లి సైంధవుని" ద్రోణ. III. 346.

# ఉ భ య వ శు లు

## 30. యుష్మదస్మచ్ఛబ్దయతి :

"..................యుష్మదస్మచ్ఛబ్ద
ద్వితయమునకుఁ బైఁ బ్రాణము
లతికిన నుభయంబుఁ జెల్లు" 3-122

నన్నయప్రయోగ మొక్కటి మాత్రమే యిట్టిది కలదు. అందు వ్యంజనమైత్రి పాటింపఁ బడినది. ఎఱ్ఱన ప్రయోగమున స్వరమైత్రి యున్నది.

"ప్రస్తుతఫణి సత్ర భయ
త్రస్తాత్మలమైన యస్మదాదులకెల్లన్ ఆది-2-219.
"ఒనరించితె యనఘ యస్మదుదరములోనన్" ఆరణ్య. IV 260.

తత్, ఏతత్, మత్, భవత్, త్వత్ ఇత్యాదులను అప్పకవి యేల చెప్పలేదో. అట్టివానికి అచ్చులు చేరినప్పుడు స్వరమైత్రియే భారతమునఁ గనఁబడుచున్నది.

"ఒకరునిచేతి ప్రోపునుఁ దదున్నతి ప్రాపును" ఉద్యో II. 77.
"అక్కడ లేఁడె వీఁడు భవదాత్మజుఁ గోల్పడె" ఉద్యో. II. 182.
"అ। నాకులమై నిలుచుటయుఁ దదాప్తులుఁ బ్రజలున్ ఆది. IV. 246.

## 31. పరరూపయతి:

"పరరూపము నిత్యంబై
పరగు శకంధ్వాదులకు నుభయముం జెల్లున్" 3-126

వేదండమునకు :

వే। దండగండవిదారి ఘోరతరాసిభాసి భుజార్గళా" ఆది. III. 228.
"వే। దండముఖాంగముల్ తృణవితానముగాఁ గొని" భీష్మ. I. 234.
"వే। దండంబుల ఘోటముల రథంబుల భటులన్" కర్ణ. II. 311

ఉభయమైత్రియున్నది.

సారంగమునకు :

సా। రంగియపోలె నుండె కురురాజ భవత్సుతు సేన

మనీషకు :

"నీ మగఁ డంత యెక్కుడె మనీషులు" ఆర. VI. 16.
"మ । నీషిజనము సెప్పు మాననీయచరిత్రా" శాంతి. III. 401.
"స । న్నిహితంబని చెప్పుదురు మనీషిజనంబుల్" శాంతి. III. 409.

మార్తాండ :

"మా । ర్తాండులనఁగఁ దగిన వీరు తమలో" భీష్మ. II. 311.
"రాత్రిపుచ్చి తోతెంచు మార్తాండు లనఁగ" విరాట. IV 254.
"ధరణీచక్రము దిర్దిరన్ దిరిగె మార్తాండుండు" ద్రోణ. V. 377.
"ఉ । ద్యమ బహులత మోమార్తాండ" ఉద్యో. II. 334.

గమనిక :– శకంధ్వాదులందు వ్యంజనమైత్రి పాటించుటయే భారతమున సర్వసామాన్యలక్షణముగాఁ గనఁబడుచున్నది.

## 32. ప్రాదియతులు :

ఆంధ్రమునకుఁ జేరని పరాజపులు మూఁడు
గాక తక్కిన యుపసర్గకముల తలల
స్వరము లతికిన వాని కవ్వలను నిలుచు
నచ్చయిన హల్లయినఁ బ్రాదియతి యనంగ. 3–132

ప్ర : వ్యంజనముతో :

"ప్రారంభ శిష్టజనపాలనసక్త" ఆది. II. 240
"పౌరబాంధవజన ప్రార్థనీయు" ఆర. VI. 295.
"ప్రాణము లాసుయోధనునిపాలివ యంద్రు" ఉద్యో. I. 299.
"పార్థివ । ప్రాగ్రసరుండు ధర్మజుని పన్పిది" ఆర. V. 416.

స్వరముతో :

"ప్రారంభణంబు ధర్మాధర్మములు" శాంతి. IV. 242.
"బనవానికిఁ గామ మప్రాప్య మరయ" శాంతి. III. 456.
"అనవుడు మద్రరాజసుత ప్రాంజలియై" ఆర. VII. 225.

ప్రతి : వ్యంజనముతో :

"దానికి శివుఁడు ప్రత్యక్షమయ్యె" ఆది. VII. 36.

"తపమున హరుఁడు ప్రత్యక్షమై నిలిచిన" కర్ణ. I. 205.

స్వరముతో :

"ప్ర। త్యక్షమై వరంబు లడుగుఁడనిన" శాంతి. III. 379.

"ప్ర। త్యక్షమై యభీష్ట మడుగుమనిన" శాంతి. VI. 247.

అతి : వ్యంజనముతో :

"అ। త్యంతవీరులులేరు భూవిదిత ప్రతాపబలోద్ధతిన్" అర. III. 353.

"తగునే రాజకులప్రసూతులకు నత్యంతంబు" అర. VI. 192

"అ। త్యంతరయంబునం దన రథంబు" భీష్మ. III. 246.

స్వరముతో :

"అ। త్యమితశక్తిమెయిన్ వెలింగినయట్టి భార్గవు" ఆది III. 142.

"అ। త్యుత్తమభక్తి నేన తగ నోపి" అర. V. 304.

"అ। త్యంతవిభూతి పెంపెసఁగునట్టి నినున్" విరాట. I. 21.

సు :వ్యంజనముతో :

"శ్రుతులు నౌపనిషదసూక్తులు గోస్వరూ
పంబులని సరోజభవుఁడు సెప్పి" అను. III. 95.

సర్వముతో :

"యుగాదియం। దొదవ సృజింతు ఋగ్యజుషసూక్తులు"
అర. IV. 272.

అభి : వ్యంజనముతో :

"అ। భ్యుదితుండై నిర్గమించె బుధనుతుఁడు" ఆది. III. 125.

"ప్రీతుఁడునై తి నిచ్చెద నభీష్టవరంబులు" అర. IV. 393.

"అ। భ్యర్చితమైన భారత మపారకృపాపరతంత్రవృత్తిమై" విరా. I.

స్వరముతో :

"ఈతెఱఁగైనఁ బొమ్మను నభీష్టముఁ జేకుఱు" అర. V. 357.

"అ। భ్యంతరభూమిఁ జొచ్చి తఱియంజని" విరా. II. 331.

''ఈయెడ కిప్డు వచ్చితి నభీష్టము'' ఆ|శ. II. 82.

''వేదా । భ్యసనంబులు సేయుచుండు నాతఁడు నియతిఁ'' శాంతి. IV. 137.

అధి : వ్యంజనముతో :

దమము సంతోష మధ్యయనంబు అర. V. 44.

ధరణీవల్లభ చిత్త మధ్యాత్మమనగఁ శాంతి. VI. 94.

అప : వ్యంజనముతో :

అ।పార్థీకృతజన్ముఁ డగుట పరమార్థమిలన్ ఆర. I. 28.

పరిగతుండగుచు నపానుఁడుండు ఆర. V. 101

స్వరముతో :

అను వివేకమది యపార్థకంబు అర. IV. 128.

అనూనహేతువులుగా నపానుఁడు నడచున్ అశ్వ. II. 46.

అకట ! దీన నింకేమి యపాయమగునె ! విరా. II. 62.

ఉప : వ్యంజనముతో :

ఉ।పాయము సేయుండు నన్ను బనుపుండు ఆది. II. 53.

పడయవచ్చునె యెన్ని యుపాయములను విరా. II. 47.

బహువిధవ్యూహ భేదనోపాయములను ఆది. V. 230.

స్వరముతో :

ఐన మఱియును బహువిధోపాయములను
అరిగె నర్తనమండపోపాంతమునకు విరా. III. 43

సం : వ్యంజనముతో :

మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్ ఆది. III. 203.

నె।మ్మనమున సంతసిల్లుఁడు సమస్తజగంబులు ఆర. IV. 377.

మనమున కెట్టు లూఱట సమస్తము నట్టుల విరా. III. 68.

మమ్ముఁ జేకొని కరుణాసమ|గ్రబుద్ధి ఆర. V. 241.

స్వరముతో :

అనవరతానంద సుఖసమగ్రత యొసఁగెన్ ఆర. VII. 468.

దుః।ఖేంధనపావకాయిత సమీక్షణ విరా. I. 333.

అను : వ్యంజనముతో :

అకరుణా।న్వితులై సీతమ్మ లతివివేకవిదూరుల్ ఆది I. 85.

సేనా।న్వితులై ధృత రాష్ట్రసుతులు నిరతిశయ ఆర. V. 387.

సమ।న్వితయతిజనకృత్యమటు వివేకింపుదగన్ శాంతి I 61.

స్వరముతో :

అ।న్వయమున జనియించినాఁడ వక్కట ధర్మ ఆర. VI. 169

వి : వ్యంజనముతో :

వ్యపగతమైన జీవ మది వచ్చునుపాయము ఆది. I. 150

వ్యపేతమగునట్టి బుద్ధివైభవము ఆర. V. 90.

వీక్షణము పురుషునకగు విధము వినుము శాంతి. VI. 153.

అస్త్ర।వ్యస్తంబగునేని నాకు వగపు గదిరెడున్ ద్రోణ. II. 303.

స్వరముతో :

వ్యూహాభావము సూచి నన్నసదుగా నూహించెదో భీమ! శల్య. II.

రణం।బరయం జిత్రము సెప్పు మత్తెఱఁగు సువ్యక్తంబుగా కర్ణ. II. 150.

వ్యవసితవచనంబు లధమమగు లోకము శాంతి. IV. 114

ధర్మ।వ్యాపారజలాభిలాషినై యున్నాఁడన్ శాంతి. III. 354.

అకృతకమధురోక్తి వ్యాప్తసందీప్తసారా స్వర్గా. 97.

ఉత్ : వ్యంజనముతో :

యు।ద్ధమ్మున నోర్చు నాతని నుదగ్రమహాభుజశక్తి సభా. I. 161.

ధాత్రి సమస్తమున్ బృహదుదగ్రభుజాగ్రమునం ఆర. IV. 203.

దర్పమునన వర్తిల్లు నుదగ్రహృదయుఁడు విరా. I.

స్వరముతో :

ఉ।దగ్రశోకవహ్ని నార్పవచ్చు — అర. V. 121.

హరులను సూతుఁ జంపిన నుదగ్రత — కర్ణ. II. 240

నిర్ : వ్యంజనముతో :

ని।రాసంబగుఁ బాయు నురగరక్షోభయముల్ — ఆది. II. 124.

రతికి గంధర్వపతికి నిరంతరంబు — విరా. III. 40

ని।రాలంబనబోధఘనుఁడు రాజవరేణ్యా — శాంతి. IV. 358.

స్వరముతో :

అనఘ యుపనేత మఱియు నిరంతరాధ్యాపకుండు — ఆది. IV. 49.

ని।రాగసుండ సద్గుణాన్వితుండ — సభా. V. 186.

అపరిమితప్రకార వినిరస్తసమస్తవికార — విరా. III. 238.

ని।రాసంబొనరించి తమ్ము నరసెద ననుమీ — ఉద్యో. I. 368.

పరి : వ్యంజనములో :

సుచరిత్ర యుదాసీననృపపరీక్షనడచునే — ఆశ్రమ. II. 48

స్వరముతో .

ప।ర్యుషితశుష్కంబుల నుడుగవలయు — శాంతి. I. 322.

పరా : వ్యంజనముతో :

రక్తనేత్రుఁడై పరాక్రమమున — సభా. II. 269.

రావణు నేనెఱుంగుదుఁ బరాక్రమదుస్సహు — అర. VII. 23.

రధికవరుని పటుపరాక్రమంబు — ద్రోణ. II. 105

స్వరముతో :

ఇట్లు లంఘించిపోయి పరేతభూమి — విరా. II. 14.

అట్టిది యొకచూపునం బరానందంబున్ — శాం. VI. 159.

దుర్ : వ్యంజనముతో :

దుఃరారంభున కిచ్చినం బరమదుఃఖమగన్ అను. II. 401.

స్వరముతో :

అప్రమాణమను దురాత్మకులకు అర. I. 232.

అలవున దున్మివైవుఁడు దుర్మాత్ముల అర. VI. 172.

ఆపోవక యునికియును దురభిమానము ఉద్యో. II. 32.

అనూను డవు నీకు నీదురాగ్రహ మగునే ఉద్యో. III. 330.

33 నిత్యసమాసయతులు :

ఒక్క సమసమున శబ్దయుగముగూడి
పదము లేర్పాటుగాఁ గానఁబడని ప్రాణ
సంధులకు నిత్యసమసన శ్రాంతులును న
ఖండవిశ్రమములు నన రెండుఁజెల్లు'' 3_135

''లోకంబునఁ గర్ణాటవ
నాకోద్వీపాంతరీప నాస్తిపదార్థా
నేకాన్యోన్య జనార్దన
నాకాదుల నిత్యసమసనం బండ్రు బుధుల్" 3_136

"అవిగ్రహో అస్వపదవిగ్రహో వా నిత్యసమాసః" అని న్యాయము ఇట్టివి కాకున్నను సంజ్ఞాసంకేతాదిరూపముల లోకకావ్యవ్యవహారములందు అఖండ శబ్దములుగా భావింపఁబడుచున్న సమస్తపదములు నిత్యసమాసములుగా నిచ్చట గణింపఁబడినవి. కవులు అట్టివానికి ఉభయయతి పాటించినారు. సహార్థకములయిన సాంబ, సాదరాది పదములును, నాస్తి, అనేక - ఇత్యాది నఞ్ సమాసములును నిత్యసమాసములుగనే పరిగణింపఁబడినవి.

A. సహార్థకములు : (స్వరమునకు)

సాకారమై వచ్చి యఖిలంబుఁ జూడంగ అర. V. 122.

అపుడు మందాకిని సాకారయై వచ్చి శాంతి. VI. 252.

-ఆజిదుస్సహుండు సాంగవేద వేది విరా. V. 118.

ఇట్లనియెన్ బాంచాలితోడ సాదరవృత్తిన్ విరా. II. 97.

వ్యంజనమునకు :

సాంగంబులై యుండ సకలవేదంబులు ఆది

సకలబుద్ధివృత్తి సాక్షి శాంతి. II. 49.

సాక్షాత్కృతిఁగూర్చి నిలుచు శాశ్వతపదవిన్ అను. III. 314.

B. నఞ్ సమాసములు :

స్వరమునకు :

అహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకు ఆది. I. 105

అ నాదరంబున నెప్పటియట్ల యున్న సభా. I.

అప్పుడు నీవు సూడగ ననంతములై ఆరణ్య. VI. 7.

వ్యంజనమునకు :

ప్రతానమ్ముల గ్రేణిసేయుచు ననారతము౯ ఆది. VIII. 71

నను నేసినఁగాని యనుడు నాకేశసుతున్ విరా. V. 124

సన్నాహమహోగ్రతం జనిరి నాకవిరోధి అర. VII 42

C. సంజ్ఞావాచక సమాసము :

నారాయణ :

నారాయణునట్లు వాసిగ ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడు౯ ఆది. I.

నారాయణ బిరుదాంక భీమరమణీయగుణ అర. V. 1

అభయకారి సశీర్షు నారాయణుని శాంతి. IV. 217

అతుల విజ్ఞానఘనుఁడు నారాయణుండు శాంతి. IV. 328

ఉభయమైత్రి యున్నది.

జనార్దన :

నగవులకేనియు౯ విను జనార్దన ఆది. VI. 397.

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

మురాంతక — మురారి :

అరుణ కమలాక్షుఁ డగుచు మురాంతకుండు ఉద్యో. III. 364

అనవిని మోము విచ్చుచు మురారి — ఉద్యో. III 207

ము । రారాతి రహస్యమున ననంతప్రీతిẕ — ఆది. VIII. 182.

స్వరమైత్రియే కనఁబడుచున్నది.

ఉపేంద్ర :

వా । రేతప మాచరించిరొ యుపేంద్రుని — ఉద్యో. II. 330.

ఒ । ప్పెడు ఘనచక్రముంగొని యుపేంద్రుడు — ద్రోణ. II. 112

ఇందువంశవిభుఁ డుపేంద్రుఁ డింద్రప్రస్థ — ఆది. VIII. 215.

తిక్కన ఉభయమైత్రి, నన్నయ స్వరమైత్రి పాటించిరి.

వృకోదర :

ఉన్నవీరుండు వృకోదరుండు — ఆది. VII. 195

న । ట్లుండెడుఁగాక యేనును వృకోదరుఁడుẕ — ఉద్యో. II. 134.

స్వరమైత్రియే కనఁబడుచున్నది.

జటాయు :

ఉ । గ్రారి విభేదవిక్రము జటాయు నెఱుంగవె — అర. VI. 346

జ । టాయువనంబరగు పక్షి నరయుఁడునన్నుẕ — అర. VI. 355

స్వరమైత్రియే కనఁబడుచున్నది.

ధూమ్రాక్ష :

ధూ । మ్రాక్షువెనుక కొదిగె నంతఁ గొంత — అర VII. 86

చిత్రాంగద :

చి । త్రాంగదయందుఁ బార్థుఁడు మహాప్రణయ — ఆది. VIII. 146.

విమలాదిత్య :

విమ । లాదిత్యతనూజ విక్రమాదిత్యనిభా — ఆది. I. 163.

స్వరమైత్రియే కనఁబడుచున్నది.

ఘటోత్కచ :

ఉరుతరభీమరూపుఁడు ఘటోత్కచనాముఁడు — ఆది. VI. 235

ఓడు పెఱుఁగు దన్నులును ఘటోత్కచుఁడుఁ దగం — ద్రోణ. V. 102

స్వరమైత్రియే కనఁబడుచున్నది.

దామోదర :

దా।మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని యుక్తమకాకది — సభా. II. 18.

దా।మోదరఁ నీపెంపెఱుంగ నొరుల కలవియే — శాంతి, I. 390

స్వరమైత్రియే కనఁబడుచున్నది.

పరీక్షిత్ :

ప।పరీక్షితుఁ గఱచున పై నేఁడరిందము నతని౽ — ఆది. II 189.

స్వచా।రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితు గాచినయట్లు — ఆది. II. 177.

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

విశ్వామిత్ర :

శమహీనుఁడైన విశ్వామిత్రు చేసిన — ఆది. II. 94

వి।శ్వామిత్రున కెట్టులైన సంప్రార్థనతో — ఉద్యో. III. 319.

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది. ''దీనిని ''విశ్వా + మిత్ర" అనుతీరున స్వరసంధి రహితముగనే కవిత్రయము గ్రహించినట్లు తోఁచును.

దశార్ణ :

జననియుఁ బేర్మి దశార్ణరాజ — అర. II. 151

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

దాశార్హ :

అవివేకం బెఱిఁగించి తిందఱకు దాశార్హుండు — సభా. II. 8

స్వరమైత్రియే కనఁబడుచున్నది.

జాతివాచక సమాసములు :

వాతాయన :

తరుణులుఁ బతులు వాతాయనమున — విరా. II. 238

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

బాణాసన — శరాసన :

బా।ణాసన బాణభాసిత మహాభుజుఁడై అది. V. 47.

శ।రాసనగురు భూరిసత్త్వ నసితకృశాంగుఁ అది. V. 212

హరులు వేదములు శరాసనంబు కర్ణ. I 282

శ।రాసనము పుచ్చికొని శర మరి నమర్చె ద్రోణ. II. 373.

స్వరమైత్రియే కనఁబడుచున్నది.

నిశాట :

శరము లేయుటయు నిశాటవరుఁడు అర. VII. 131.

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

స్వాంత :

స్వాంతము బాహుగర్వమదసంతమసాంధము గాగ విరా. II. 331.

స్వాంతత్రాసకరంబునై దురభివేశంబైన యాలోను విరా. II. 327.

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

అక్షౌహిణి — అక్షోహిణి :

సహస్రా।క్షోహిణు లట్లగుట మీరు సూడరె ఉద్యో. I. 236

కూరిమివెలయ నక్షోహిణిపైఁ గొంత ద్రోణ. IV. 139.

కోరి పతులనుజేయు మక్షోహిణులకు ఉద్యో IV. 109

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

ఏకాంత :

కామ సంభోగముల సదేకాంతగృహము అది. VIII. 74.

క్రాలుచునుండ నేకాంతయోగ అర. III. 319.

ఏ।కాంతమ యిమ్మెయిఁ వెడలి తక్కటి నీవు అర. V. 120

ఉభయమైత్రి యున్నది.

ధరామర :

నా।రాయణునట్లు వాసిగ ధరామరవంశ విభూషణుండు

రాజయోగ్యములు ధరామరార్హంబులు. శాంతి. I. 244

నన్నయ్యయందు స్వరమైత్రి, తిక్కనయందు వ్యంజనమైత్రి కనఁబడుచున్నది.

పదాతి :

దంతుల నమితపదాతుల నొడఁగూర్చి ఆది. II. 21

చం।దంబున బహులపదాతిచయము ద్రోణ. III. 62

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

కుమార :

మానితులైన పాండవకుమారులు ఆది. VII 22.

కు।మారులు నీతోడి పొత్తుమనియెద మనఁగా ఉద్యో. III 348

నృపకు।మార నీవు నాకొలఁది యిట్లరయ కర్ణ. I. 308

తిక్కనయందు మాత్రమే ఉభయమైత్రి కనఁబడుచున్నది.

శృంగార :

శృం।గారవిలాసలీల యెసఁగఁ దనముందట నున్న ఆది. V. 141

శృం।గారము సేసి సమ్మదవికాస మెలర్పఁగ ఉద్యో. IV. 118

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

సమాజ :

స।మాజసురక్ష్మాజ రాజమార్తాండ ఆది. II. 239

మంటయుఁబోని శో।త్రవసమాజము విరా. III. 229

మనుజులతోడ నిర్జరసమాజము అర. IV. 244

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

అంతరంగ :

సంతో।షామృతమునఁ దేలి రంతరంగములందుఁ అర. VII. 198

వ్యాసంగ తరంగితాంతరంగుం డగుచుఁ విరా. II 329

స్వరమైత్రియే కనఁబడుచున్నది.

కాకోదర :

కా।కోదరసంహతిఁ హుతవహో।గ్రసమ।గ్ర శిఖాచయంబులఁ
ఆది. I. 124.

స్వరమైత్రియే కనఁబడుచున్నది.

సమేత :

స్మితముఖులై రి బ్రాహ్మణసమేతులు — అర. III. 375.

ఏతెంచి వినయసమేతులగుచు (ప్రాస) — అర. III. 276

స।మేతంబు విను మమ్మహీధరమున — శాంతి. VI. 294

ఉభయమైత్రి యున్నది.

పారావార :

పా।రావారరవంబువోలె ననివార్యంబై — అర. II. 55

స్వరమైత్రియే కనఁబడుచున్నది.

(c) ద్వీప :

ద్వీపమునం బ్రబోధపరిదీప్తుని — శాంతి. VI 514

వివిధపత్తన వనద్వీపవర్షములతో — అర. IV. 257

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

ద్వార :

ద్వారమునఁ మహారుధిరధారలు బోరన నొల్కి — ఆది. VI. 302.

ద్వారమునందుఁ గాంచె ద్రుపదక్షితిపాలతనూజ — అర. VI. 144.

వఱలు నరపతిమందిర ద్వారభూమి — విరా. III 75

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

అన్యోన్య :

అ।న్యోన్యహితు లరగుట నన్యులుర్వి — సభా. II 282

అక్షతప్రకరంబు లన్యోన్యమ।స్తకముల — విరా. V. 397.

అ।న్యోన్య నిశాతసాయక నిరంతర — భీష్మ. I. 261

స్వరమైత్రియే కనఁబడుచున్నది. విశేషించి 'అ' తోడనే మైత్రి కనఁబడుచున్నది.

క్యజ్ ప్రత్యయాంతములు :

క్యజ్ ప్రత్యయాంతపదములందు స్వరసంధి లేదు. ఇవి సమాసములు కావు. వీనియందు వ్యంజనమైత్రియే చేయవలయును. ఇవి ఉభయయతులలోఁ జేరవు.

ఇం।ద్రాయితుఁ డాంబికేయుఁ డుచితస్థితి ఆర. I. 92
కుమా।రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు ఆది. V. 6
భ।ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విరా I. 1.
సరో।జాయితలోచనంబులు ప్రసన్నముఖంబు విరా. I. 234.
శ।బ్దాయమాన వనవిభాగుఁ డగుచు ఆర. IV. 152

## 34. దేశ్య నిత్యసమాస యతి :

రూపఱఁ బెంపఱఁ బెల్లఱ
నే పఱచుటః క్రిక్కిఱియుట నిల గ్రచ్చఱయున్
రూపఱి, యుక్కఱి మొదలుగ
క్ష్మాపతి ! యివి దేశ్యనిత్యసమసనపదముల్. 3-191

అఱ, ఇఱియులతో నేర్పడిన దేశ్యసమాసములందు ఉభయయతి చెల్లును. చిత్రకవి పెద్దన యన్నట్లు దీనిని దేశీయయతి యనుటయే మేలు. నన్నయ రచనయం దిట్టివి యగపడుట లేదు. ఎఱ్ఱన, తిక్కన వీనిని ఉభయయతులుగనే ప్రయోగించిరి. యథార్థమున కివి సమాసము లనఁదగినవి కావు. భయపడు, క్రొవ్వారువంటి క్రియాపదములు. ఇంచుగాదులు చేరిన రూపములయందువలె వీనియందును ఉభయయతి చెల్లుట సహజమే.

స్వరమైత్రి :

ఉ।క్కఱఁ దొరగించుచుం గపిబలావళిఁ ద్రుంచె ఆర. VII. 124
క్ర।చ్చఱ భవదీయ రక్షణమునంద వెలుంగుచునుండు ఆర. IV. 367
క్ర।చ్చఱ నిలఁ బంచి చక్కఁసగ మక్కడ నెవ్వరికేని ఉద్యో. III. 361.
పొ।ల్పఱ మఱి మ్రొగ్గనేసిన ధరాధిప కర్ణ. I. 83
క్రి।క్కిఱిసిన మఱి పాసినిల్చి రింతను నంతణ విరా. III. 196.
రూ।పఱియున్నఁ గని యుడుకాఱుఁగాక ఉద్యో. I.

వ్యంజనమైత్రి :

ఉ।క్కఱ మఱి నీకు నీతెఱఁగు గాదన కేఖలుఁదొక్కొ ఆర. VI. 321
నేనలు। క్కఱ రభసంబుమై నడరి కవ్వడి విరా. V. 143

గమనిక :- ఏమఱ పాదమునకు వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

ఏఁమఱ కెఱుఁగనియట్ల గూఢమతి నుండు ఆది. VI. 155

ఏఁమఱినట్లుండుఁ దృణంబుమేయు మలయుఁగా మాయామృగంబు
ఆర. VI. 327.

మానీతోపాయవృత్తి నేమఱుట లేక శాంతి II. 187

బోరన, తెగటాఱు, - ఇత్యాదులుకూడ ఈ సందర్భమున గణింపఁదగియున్నవి.

బోఁరన దమయంతీ స్వయంవరమునకు ఆర. II. 29

బోఁరన కీర్తించిరి సంతతస్తుతి పదారావంబు ఆది. II. 235.

వ్యంజనమైత్రియే కనఁబడుచున్నది.

అలయక రిపుఁ దెగటార్పవలయు (స్వర) శాంతి. III. 36.

'అఱు'నకు 'ఆర్చు' ప్రేరణార్థకమని భావింపఁదగును.

ఒకొండు : ఒక్కొండు :

మాఁకొనరిన సైన్యముల్ పదునొకొంటికి ఉద్యో. VI. 140.

ఒఁక్కొండై నను నొవ్వఁడింతకును కర్ణ. I. 225.

ఒఁక్కొండును లేదధిప ! నీదు కొడుకులు స్త్రీ. I. 83.

"పదునొకొంటికి" దేశ్యనిత్యసమానము కాదన్న అప్పకవి యభిప్రాయము సరికాదు. అచ్చట అఖండవడి లేదని చెప్పుటకై యాతఁడు తిక్కన స్వరప్రధానవడి చేసెనని చెప్పెను. తక్కిన ప్రయోగములను అతఁడు గమనించియుండిన నట్లనియుండక పోవునేమో. రూపఱు, క్రిక్కిఱియువంటివి క్రియాపదములే కాని సమాసములుకావు. 'ఒక్కొండు' అనునదియే నిజమైన సమాసము. దీనిని అప్పకవి నిరసించుట వింతయే. ఒక్క + ఒండు అనుతీరున తిక్కన్న దీనిని సమాసముగనే పరిగణించెను. అట్టిపట్ల ఉభయయతి పాటించెను. 'ఒక్క' కు 'ఒక్కొ' యను రూపాంతరమున్నది. 'ఒక్కొ' యన్న రూపమునకు నన్నయ తిక్కనలు వ్యంజనమైత్రియే పాటించిరి.

ఒఁక్కొమొగిన్ బెల్లగిలంగ బిట్టడరె సక్రోధాంతరంగంబునన్
కర్ణ. I. 352

కౌరవులొఁక్కొట నందఱు గురుననుజ్ఞఁ గొని మృగయా ఆది. V.233

## 35. నిత్యయతులు :

ఏని యను నాంధ్రశబ్దము

తో నతికిన పూర్వపదము తుది వ్రాయికి న

చై చ్ఛనను వ్యంజనవర్ణం
బైన రచింపుదురు నిత్యయతులనుచుఁ గవుల్ 3_213

ఏనికి కవిత్రయము స్వరమైత్రియే పాటించిరి.

ఇద్దయశోర్థ లెందేనిఁ బుట్టిరి ఆది. III. 86.
ఇతరునిఁ గా ననుందలఁచెనేని అర. VII. 47.
"ఇం।పేనిఁ దురంగశాలలకునెల్లను ముఖ్యుఁడవై" విరా. I.
నీ।కిచ్చెద వగపుడుగు మింకనేనియు నధిపా ద్రోణ. II. 219.

ఏనికి నేనియను రూపాంతరముగలదు. నేనికి నన్నయతిక్కనలు వ్యంజనమైత్రినే పాటించిరి.

।ఎన్నడున్।నేని మోహముగాదు దిగ్గరణీరవిందు ఆది. VII. 142.
నీవునుఁ జూచి తట్టిసభనేని వినంబడ దేయుగంబులన్ సభా. II. 95.
నిపుణతఁ దలఁకుడిగి పోరనేనియుఁ జాలున్ ద్రోణ. II. 299.

## 36. రాగమసంధి వళి :

"అలను పదంబు మొదలను రాగమంబు
వచ్చు సంధికి నుభయంబు వళికిఁ జెల్లు" 3_215

తెలుఁగున రేఫాగమము వచ్చు సందర్భములు ఇతరములుకూడ కలవు. తిక్కన ప్రయోగములు :

అరదమునకు గవిసె వాలురమ్ములు నిగుడన్ శల్య. I. 167.
సా।త్యకియును రభసమున వాలురమ్ములు నిగుడన్ శల్య. I. 312.

రాగమసంధివళి చెప్పిన యప్పకవి టుగాగమాదులనుగూడ చెప్పియుండవలసినది. అట్టి ఆగమసంధివళులు భారతమునఁ గలవు.

టుగాగమవళి :

ఎఱుకలేని కఱకుటెఱు కపేక్షించె అర. II. 91.
తరచు।టూర్పుగాడ్పులపరిమళముల్లసిల్ల విరా. II. 288.
ఆపాదింపఁబడి మెఱుగుటద్దముకరణిన్ శాంతి. IV. 187.

నుగాగమవళి :

కావించు।నవియును నెఱను నోనాడునవియు విరా. III. 162.

నోన్ + ఆడునవి యనుకొన్నచో స్వరమైత్రి

నోన్ + నాడునవి యనుకొన్నచో వ్యంజనమైత్రి

(నాటునకు నాడు రూపాంతరము)

## 37. విభాగవళి :

తులసీభూషణ సంఖ్యకు
తెలుఁగున, బరిమాణసంఖ్యఁ దేటపఱచుప
ట్టుల నేసియను పదమునకు
నలరు విభాగవళియనఁగ నచ్చునుహల్లున్ 3–218

దీనికి భారతమునఁ బ్రయోగములు లభింపలేదు.

## 38. నామాఖండ విశ్రమము :

అప్ప అయ్య అన్న అర నవ్వ అమ్మక్క
ఆయి యనుపదంబు లదుకు సంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామాఖండ
వళులనంగ నూదఁబడకయైన 3–221

· కొ।మ్మనదండనాధుండు మధురకీర్తి విరా. I. 10.

తిక్కన భారతమునందలి యీ ప్రయోగమున వ్యంజనమైత్రి పాటించెను. నిర్వచనోత్తర రామాయణమునం దాయనయే స్వరమైత్రి పాటించెను.

"అ।న్నమకుం గొమ్మనమంత్రికిన్ సుతుఁడ దిక్కాంకుండ"

ఎట్టిన క్రియాపదముతోఁజేరిన 'అయ్య'కు వ్యంజనమైత్రి చేసెను.

చెప్ప।వయ్య పుణ్యసతీప్రభావంబు నాకు అర. V. 3.

దీనికి "చెప్ప।వలయుఁ బుణ్యసతీప్రభావంబు నాకు" అని వేమూరివారి ప్రతియందలి పాఠము.

నన్నయ్య క్రియాపదముల కయ్య చేర్చినప్పుడు స్వరమైత్రియే పాటించెను.

ఆ జరత్కారుఁ గని చెప్పవయ్య ఆది. II. 145.

తిక్కనయు నట్లే :

పో।వన్న కుమార యట్లయిన నాయువు శ్రీయును ఉద్యో. III. 348.

## 39. పంచమీవిభక్తి విరామము :

తత్సమంబుఁ జేయుతఱిని బంచమి నన్న
నంచె నను విభక్తు లదుకుసంధి
మెలఁగు గృతుల పంచమీవిభక్తి విరామ
మనఁగ నచ్చునకును హల్లునకును. 3-238.

'అన్న', 'అంచె' అని యప్పకవి చెప్పిన ప్రత్యయములను కవిత్రయము 'కన్న', 'కంచె' అనియే భావించినట్లున్నది.

క్రతువున యాజకోత్తములకంచెఁ బ్రసిద్ధులు అది. II. 226.
ప్రేఁకనయగుదాని నాకసముకంచె అర. VII. 433.
"ఇంటం దెవులనఁ జచ్చుటకంచెం బాపంబులొండు గలవె"
భీష్మ. I. 98.

## 40. చతుర్థీవిభక్తి విరామము :

అప్పకవి దీనిని ఏల చెప్పలేదో. దీనియందు సర్వమైత్రియే పాటింపవలెనని భారతకవుల యభిప్రాయముగాఁ గనఁబడుచున్నది.

అనఘ మామామ శకుని నాకై కడంగి సభా. II. 174.
అని తానెలిగించి పీటికై నూల్కొలిపెన్ విరా. IV. 268.
అనలమ్మునఁ గాచికొనుటకై లెమ్మనఘా శాం. III. 318.

## 41. కాకుస్వరయతి : ప్లుతయతి :

పలుకులతలఁగల వ్రాలకు
వలనగుచోఁ బ్లుతము నిలిపి వానికినెల్లన్
వళులుగఁ జెప్పినఁ గావ్యం
బుల నవి కాకుస్వరంబుఁ బ్లుతవళియు నగున్. 3-241

"భీతి శోక తర్క గీత దూరాహ్వాన
సంశయార్థములను జరుగుఁ బ్లుతము" అప్ప. 3-242

భయ శోక సంశయాదులవల్లఁ గల్గు సర్వవికారమునకు కాకువు అనిపేరు. అది ఆ, ఈ, ఏ, ఓ అను రూపముల త్రిమాత్రాకమై యుండును. సంబోధనమాత్రమైన ప్లుతముకంచె కాకుస్వరప్లుతము భిన్నమైనదనియే భావింపఁదగియున్నది.

సంబోధనమున :

"అ।త్యాయతవిమల తపోమహి
మా!యిన్నిదినమ్ము లేల మసలితి చెపుమా'' ఆది. I. 117.
వలతురు నాధులంట మగువా ! కడుబేలతనంబు ఆర. V 298.
నె!మ్మనముల్ విస్మయమందఁ జూచెదరు భామా విరా. I. 321.

(వ్యంజనములకే మైత్రి)

సంప్రార్థనమున :

'ఈ!వే నృప నీదుపుత్రిఁ గృప యేర్పడ దానముగాఁగ నావుడున్
ఆను. I. 53.
కొ!నితె!మ్మా చూతముగాని నీ గమనవేగంబున్ విరా. II. 89.
మనకొక్కటి నిశ్చయింపుమా తగుబుద్ధిన్ ఆర. VII. 44.

ప్రశ్నార్థమున :

కా!దే వెలసితి నీవు ధర్మదేవత యనఁగన్ ఆర. VII. 229.
ధీయుత యనిపలికి మఱచితే మునినాధా ఆది. VIII 317.
ధ!రారాజ్యం బిచ్చిపోయిరా పోరా ఉద్యో. II. 204.
అనుమానింపకు తోడఁబుట్టువులుగారా తున్మితూఁటాడె'' శాంతి. I. 287.

(ఉభయమైత్రి)

సంశయార్థమున :

కుసుమసముద్గమం బగునొకో ఆది. III 170.
న!న్నుత్తల మందఁ జేయుటకునో విరా. II. 84.

(ఉభయమైత్రి)

శోకార్థమున :

ఒక్క దనుజాధముండు మొత్తో యనంగ ఆర. V. 177.

ఆశ్చర్యార్థమున :

'వ్రా!లినదెస వ్రాలకుండిన బలే మముబోటులకున్'' ఉద్యో. II. 97.

## 42. ప్లుతయుగ విశ్రాంతి .

తా మేవర్ణములయినను
క్ష్మామండలమునను ప్రాణమైత్రి గలిగినన్
దామోదర ప్లుతయుగవి
శ్రామములనఁగాఁ బ్లుతాక్షరద్వయమమరున్. 3_256

కాకు ప్లుత విరామములందు వ్యంజనసామ్యముకూడ అవసరము. వ్యంజనసామ్యము అక్కఱలేకయే మిత్రములైన ప్లుతస్వరములకు ప్లుతయుగవిశ్రాంతియందు యతి చెల్లును.

మాయరవి యేల క్రుంకఁడొా
కో యను నిట్టేల తడసెనో యను విరా. II. 312.

దీనియందు వ్యంజనమైత్రి లేదు. యథార్థమున కిది స్వరయతులలోఁ జెప్పఁదగినదే.

## 43. ప్రాసయతి :

గీతముల సీసములను సంగీతములను
విరతి విడనాడి యొక్కొక్క చరణమునను
రెంటికినిఁ బ్రాసవర్ణంబు నంటఁబలుకఁ
బ్రాసవిశ్రాంతులంద్రు కబ్బముల వాని. 3_258

తేఁటగీతి, ఆటవెలఁది, సీసము మున్నగు ఉపజాతులందు ప్రాసయతులు కూర్పవచ్చును. లయగ్రాహి, లయవిభాతి మున్నగు ఉద్ధురమాలావృత్తములందు ప్రాసయతి నియతము.

ప్రాసభేదము లెన్నియో ప్రాసయతిభేదము లన్నియని భావింపఁదగియున్నది.

ర - ఋ మైత్రి :

గారవమున నిచ్చి యా ఋషితోడ ఆది. VII. 87.

డ - ఢ మైత్రి :

ఏడు నాటించె దర్పంబు రూఢికెక్క కర్ణ I. 80.

డ - ల మైత్రి :

కడగి నాకును సద్గతి గలుగవలయు అర. II. 262.

(నన్నయ్యనియమమునను సరించి యిచ్చట ప్రాసయతియే యుండవలయును)

ల -ళ మైత్రి :

చాలపెద్దయగు దయాళుఁ గొలుతు శాంతి II. 21.

నలఁగి మాసిన దీపకళిక వోలె విరా. I. 294.

అళినీలకుటిల కుంతలములకాంతియు ఆది. III. 27.

ర - ఱ మైత్రి

ఎఱిగి ప్రియమువల్కి తెరువిత్తు రిట్టిద ఆది. VII. 112.

న - ణ మైత్రి :

యౌ నిరంతరప్రమాణ సంఖ్య ఆది. I. 81.

సబిందు - నిర్బిందుమైత్రి :

వీఁకదఱిగి కాందిశీకులైరి ఆది II. 100.

శ - స మైత్రి :

చతుర్దసుల నుభయపక్షవశత వచ్చు. అను. IV. 147.

(చతుర్దశి + లు = చతుర్దసులు, పూర్వరూపమైన 'శి'తో మైత్రిచేసినట్లు భావింపవలెను)

ఋయుతాయుత మైత్రి :

అతులపుణ్యమతివి పితృభక్తుఁడవు గాన అర. IV. 265.

ఈదృశములును సత్త్వగుణోదితములు శాంతి. IV. 288.

సంధిగతము :

మ్రింగనున్న నయ్యసురతోడం గడంగి ఆది. VI. 214.

అంత్యోష్మసంధి :

ఉద్ధతులును బాహుయుద్ధపరులు విరా. III. 114.

ఉద్ధతుండు మల్లయుద్ధప్రసాధనం సభా. I. 201.

## - ఇతర విశేషములు -

స్వరసంధివశమునను, వ్యంజనసంధివశమునను జెల్లుఁబడియగుచున్న అనేకయతిభేదములను అప్పకవ్యాదులు చెప్పిరి. అట్లే సంధివశమున యతిమైత్రి చెల్లుచున్న కొన్ని సందర్భములను గుర్తింపవలసియున్నది. ఈ క్రింది యాదేశములు గమనింపవలెను. అట్టి ఆదేశములు రానిచో యతిమైత్రి కుదురదుగనుక నవి గుర్తింపఁదగినవే.

ఉన్మదమాతంగము గూలనేసిన కృపాణస్ఫార కర్ణ. I. 84.

వేదవిధ్యను।ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతమున్ ఆది. I 158.
ఎ।క్కుఁడు గర్వంబున వచ్చె మార్కొ౯నిన రక్షోనాథు శల్య. II. 192.
తే।జోమయుండవు బ్రాహ్మణుండవు సువ్రతుండవు ఆది. I. 154
మౌళిం।బుట్టినక్రియ దీధితులు నభోభాగమునన్ విరా. III. 165.
నుతచరితుండు తద్దయు మనోవ్యథ అర. VII. 156

ఉదాహృతలక్ష్యములందు నానాసంధికార్యములవల్ల సిద్ధించిన యక్షరస్వరూపమునుబట్టియే యతిమైత్రి చెల్లుచుండుట స్పష్టమే.

A. ఏవార్థక యతి :

పర్వం।బ కడున్ మేలనఁగ శాంతిపర్వము వెలయున్ ఆది. I. 158.

నన్నయ వ్యంజనమైత్రియే పాటించెను.

ఉ - వు మైత్రి :

ఉర్వి నిక్ష్వాకువంశోద్భవుండు చూవె అర. VI. 154.

ఎఱ్ఱనరచనయందే ఈ యొక్క ప్రయోగము కలదు. దీనికి "ఉత్పలాక్షి యిక్ష్వాకువంశో ద్భవుండు" అని పాఠాంతరము చూపఁబడినది. వేమూరివారిప్రతియందు ఈ పాఠాంతరమే ప్రధానపాఠముగా నున్నది.

B. యతి భంగములు :

భూతస్వభా।వంబయంద్రు కొంద అమితతేజ శాంతి. V. 67.
ధిక్కరించుట లోకహితంబుగాదు కర్ణ. III. 253.

వేమూరివారిప్రతియందు నిట్లేయున్నది.

ఈ రెండింటిని ఇట్లు సవరింపవచ్చును.

భూతస్వభా।వమ యటంద్రు కొంద అమితతేజ - ప్రాసయతి
ఒరు ల।ధఃకరించుట లోకహితంబుగాదు.

**అఖండవడి:**

కవిత్రయమువా రఖండవడిని ఉపయోగింపలేదని కొందఱి యభిప్రాయము. ఈ యభి ప్రాయము వ్యాపించుటకు ముఖ్యకారణము అప్పకవి. అతనికి అఖండవడి యంగీకార్యము కానందున పెక్కు ఉభయయతిభేదముల నాతఁడు కల్పనచేసినాఁడు.

మానుగ విశ్రమాక్షరసమంచితమై స్వర మూఁదినన్ దదీ
యానుగుణాక్షంబె కొనియైనను జెప్పఁగనొప్పు నీక్రియన్
భానుసహస్రభాసి వృషభాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవడి పొల్పగు నాదికవిప్రసిద్ధమై

కవిజనా. P. 72.

ఇది కవిజనాశ్రయమున ప్రక్షిప్తమని పరిష్కర్తలు సూచించినారు. లింగమగుంట తిమ్మన దీనిని భీమన ఛందమందలిదని చెప్పి తన సులక్షణసారమునం దుద్ధరించికొనినాఁడు.

'భాను' నందలి 'భా' తో "వృషభాధిప" యందలి 'భా'కి మైత్రిచేయుట అఖండవడి. వృషభ + అధిపుఁడు = వృషభాధిపుఁడు అనుపట్ల స్వరసంధిగలదు. వృషభాధిప పదమును సమాసఘటిత పదద్వయముగా గ్రహించినచో 'భా'యందలి స్వరముతోడనే మైత్రి చేయవలెను. దానిని అఖండపదముగా గ్రహించినచో 'భా' యందలి వ్యంజనముతో మైత్రిచేయఁదగును. అఖండ పదముగా గ్రహించి వ్యంజనములో మైత్రిచేయుటకు అఖండవడి యనిపేరు. సవర్ణదీర్ఘసంధి, గుణసంధి జరుగు పెక్కుపదములను అఖండపదములుగా గ్రహించి అఖండవడిమైత్రి పాటించు నవకాశమును పరిమితముచేయు తలంపుతో అప్పకవి అఖండవడులుగా స్వీకరింపఁదగిన పెక్కింటిని ఉభయయతిభేదములుగాఁ జెప్పి అఖండవడియను సామాన్యయతిభేదమును తిరస్కరించెను. అఖండవడియని అన్యులన్నదానిని నిత్యసమాసయతి యనెను.

అప్పకవికి పూర్వులైన రేచన, అనంతుఁడు మున్నగువా రఖండయతి నంగీకరించిరి. అనంతుఁడు నిత్యసమాసయతినిగూర్చి చెప్పి "ఈ నిత్యసమాసయతిపే రఖండయతి" అని పేర్కొనెను. అఖండవడి వ్యాప్తిని అరికట్టుటకై అప్పకవి దానిపట్ల చూపిన నిరసనమును చక్కగా గ్రహింపక నవీన పండితులు కవిత్రయప్రయోగములను పెక్కింటిని దిద్దివైచిరి. కవిత్రయము అఖండవడిపట్ల విముఖులుకారు.

'వృషభాధిప'వంటి సర్వసంధిగల సమస్తపదములుమాత్రమే అఖండపదములు కావు. క్రియాపదములుగూడ అఖండపదములుగా గ్రహింపఁదగినవి కలవు. ఇంచుగ్యతిగాఁ జూపఁబడినవి ఇట్టివే. "చూచుచుండు"వంటి క్రియాపదములు నిట్టివే. భారతకవు లిట్లేభావించినట్లు తోఁచును. ఇట్టి యఖండపదములుగా భావింపఁదగినవానియందు ఉభయయతి పాటించుట న్యాయమే. కాని సమాసములందు, క్రియారూపములందు మాత్రమేకాక వ్యస్తపదములు సంధింపఁబడినప్పు డేర్పడిన యక్షరముల విషయముననుఁ గొన్నిపట్ల కవిత్రయము వ్యంజన మైత్రి పాటించినట్లు కనఁబడుచున్నది.

"చూచె మనంబునఁ దలంచుచుండుదు నేనుఁ" ఆది. VI. 35.

దీనిని "తలంతు జొలయక యేనునన్" అని దిద్దివైచిరి.

"చూచు।చుండు మనవుడు మాతలి చోద్యమందె" ఆది. IV. 71.

"ధృతి।మంతులు బొందుదురు భేద మదిగావున" ఆది. VIII. 114.

దీనిని "భేదమతి"యని దిద్దివైచిరి.

ఎదలో।నిడికొని యేకాగ్రబుద్ధి నిష్ఠాత్ముండై" ఆది. V. 116.

'ఉ।త్కారరవముల్ మహీరుహశిఖాంతములందు శిఖండి' అర. IV. 13.

"శిఖండములందు" అని పాఠాంతరము.

ఎఱ్ఱన :

"చెప్పవయ్య పుణ్యసతీప్రభావంబు నాకు" అర. V. 3.

"చెప్పవలయు"నని పాఠాంతరము.

తిక్కన :

"పెడబొబ్బ।లును సింహనాదంబు లుల్లసిల్ల" విరా V. 168.

"అమ।లమతీ నీకన్నకొడుకు లట్లరయఁదగున్" ఉద్యో. II. 74.

"నామనమార దీనిఁ గనినప్పుడు" సౌ. II 96.

"జ।నావళి పురజనులు హస్తినాపురమునకున్" ఆశ్వ. IV. 93.

"మతిఁ గింకిరిపడక యోలమాసపడక" అను I 68.

"ఆదిత్యు నుదయాస్తమయ కాలముల నిద్ర" శాంతి. I. 293.

("ఉదయాస్తమగు" అను పాఠాంతరము అసంగతము.)

పాదారంభాక్షరశ్రుతికి సదృశమైనశ్రుతి పాదమున నియతస్థానమున వినిపించుట యతిమైత్రిలక్షణము. ఆ లక్షణము సిద్ధించు యతిమైత్రీభేద మెట్టిదైనను అంగీకరింపఁదగినదే యనుట పరమార్థము.

## సూచికలు :

1. ఛందోమంజరి (వ్యాఖ్యానము) : పుట — 6.
2. The Principles of English Metre : P. 33.
3. సిద్ధాంతకౌముది : హల్సంధి — 138.
4. Ibid : స్వాదిసంధి — 192.
5. Ibid : స్వాదిసంధి — 193.
6. Ibid : అచ్సంధి — 86.
7. మహాభారతము : శల్యపర్వము — 38 అధ్యా — 35, 36 శ్లో.
8. బాలవ్యాకరణము : సంధి — 45.

# వడి : ప్రయోగ వైచిత్రి

చరణముయొక్క యగ్రమునను గేంద్రమునను బ్రతిష్ఠపొందిన యక్షరము స్వీయధర్మమును జరణముయొక్క కీలకస్థానములందు నెలకొల్పి పద్యమును శ్రవ్యము గావించుటయే కాక యథాశక్తి రసౌద్యర్థవ్యంజకముగూడ కాఁగలుగుచున్నది. సాంస్కృతికులందు వివాదాస్పదమై యుండిన పదచ్ఛేదరూపయతిని దిరస్కరించినను ఆంధ్రులు సదృశవర్ణావృత్తిరూపమైన వడిని సర్వచ్ఛందస్సాధారణలక్షణముగా నియమించుకొని ఛందమునకు సౌందర్యాతిశయమును సమకూర్చుకొనిరి.

పాదమధ్య పాదాంత యుక్పాదాంతములందు బహువారములు పదచ్ఛేదము గావించుటవలనఁ బద్యగమన స్వరూపము విభాగశః గోచరించును. కాని పునఃపునర్యమనమువలనఁ బద్యమున నఖండధారావాహిత కుంటుపడును. గురులఘుక్రమము నాశ్రయించిన పద్యగతి యతిచ్ఛేదముచేఁ బ్రస్ఫుటమగుట సత్యము. ఐనను బ్రస్ఫుటమైనదానియందుకంటె స్ఫుటాస్ఫుటమైనదానియందు అతిశయముగ రమించుట లోకస్వభావము. పదచ్ఛేదము తిరస్కృతమై ధారాళముగ సాగిపోవుచున్న పాదమున నొకానొకచోఁ బాదారంభాక్షరము పునఃశ్రుతమై శ్రోత్రేంద్రియము చమత్కృతమగును.

> "స్వరసంధ్యాప్త సౌందర్యా
> త్తద్భేదే పీష్యతే క్వచిత్"

అని సంస్కృతచ్ఛాందసికులుగూడ స్వరసంధానలబ్ధసౌందర్యమున లోలురై నిషిద్ధమైన నామధాతుభేదమును సమ్మతించిరి.

Rime అను ఛందోలక్షణమున వ్యంజనసాదృశ్యముకంటె స్వరసాదృశ్యమే రమ్యతరముగా నుండుననియు Keen - Kine అను Rime కంటె Keen - Been అను Rime శ్రవ్యతరమై వాంఛనీయమగుచున్నదని పాశ్చాత్యుల యభిప్రాయము. ఇందలి తత్త్వమును గుఱించి Catherine Ing చెప్పిన యభిప్రాయము సమంజసముగ నున్నది.

"The return to the same pitch seems to be the satisfaction that the ear gets through Rhyme. The same is felt when a phrase in music returns to the same note."

సదృశస్వర పునఃశ్రుతి గానమునకుఁ బ్రాణము. గానలయానుసంధానమున శ్రోత్రేంద్రియమునకు మార్గము చూపునది అదియే ఛందమునందును సదృశస్వరావృత్తిరూపమైన వడి లయానుసంధానసాధనమని యాంధ్రులు భావించిరని చెప్పవచ్చును. 'విరమము స్వరప్రధానము' గనుక పాదమధ్యమున పాదారంభస్వరసదృశస్వర శ్రుతి లయానుసంధానసాధనమే యగుచున్నది. సదృశస్వరమనఁగా మిత్రస్వరము స్థానప్రయత్నసామ్యము స్వరముల మైత్రికిఁ గారణము.

స్వరోత్పత్తి స్థానములు :

| | | |
|---|---|---|
| అ, ఆ | — | కంఠము |
| ఇ, ఈ | — | తాలువు |
| ఉ, ఊ | — | ఓష్ఠములు |
| ఋ, ౠ | — | మూర్ధము |
| ఌ, ౡ | — | దంతములు |
| ఎ, ఏ, ఐ | — | కంఠతాలువులు |
| ఒ, ఓ, ఔ | — | కంఠోష్ఠములు. |

స్థానసాదృశ్యమును బురస్కరించుకొని వడియందు స్వరములకు మైత్రి నిర్ణయింపఁబడినది.

స్వరములలో ఏఓలు గుణములనియు, ఐ ఔలు వృద్ధులనియుఁ జెప్పఁబడుచున్నవి. అ - ఇల సంయోగమున ఏ, ఐలు, అ - ఉల సంయోగమున ఓఔలు నిష్పన్నములైనవి. ఏఓలు ప్రశ్లిష్టావయవములు. ఐఔలు విశ్లిష్టావయవములు. అనఁగా ఏఓలయందు వాని యవయవములైన అ + ఇ, అ + ఉ లు ప్రశ్లిష్టములై యున్నవి - అంతరము కానరానంతగాఁ గలిసియున్నవి. ఐ, ఔ లందుఁ గొంత యంతరముతోఁ గలిసియున్నవి.

"ప్రశ్లిష్టావర్ణా వేతౌ" అని ఎఓలను గూర్చియు,
"వివృతతరావర్ణా వేతౌ" అని ఐఔలను గూర్చియు—

భాష్యమునఁ వివరింపఁబడినది. "మాత్రాసంసర్గా దవరే అపృథక్ శ్రుతీ" అని ప్రాతిశాఖ్యము చెప్పుచున్నది. ఏఓ ఐఔల యందు ఏఓలు అవరములు, అవి యపృథక్శ్రుతులు - వానియందలి యవయవములు వేర్వేఱుగా వినఁబడవు. "మాత్రాపాదార్ధ విచ్ఛేదే గుణసాంకర్య సంభవః" అని విచ్ఛేదకాలప్రమాణలక్షణము చెప్పఁబడినది. ఏఓలయందు వాని యవయవములైన అ + ఇ, అ + ఉ లు ⅛ మాత్ర యంతరముతోఁ గలిసియుండుటచేత అవయవగుణసాంకర్యము గలిగి విభాగ మేర్పడకయున్నది. ఐ, ఔలయందు అవర్ణము వివృతరముగా - విస్పష్టముగా వినిపించుచున్నది. వాని యవయవములు వ్యంజనసంయోగములందలి యవయవములవలెనే మాత్రాపాదాంతరములై యున్నవి. "సంయుక్తయోః వ్యంజనయోః మాత్రాపాదో ఽంతరం భవేత్" అని విచ్ఛేదరహస్యము. ఏఓలకు, ఐఔలకు అన్యస్వరములతోడిమైత్రి నిర్ణయించుపట్ల సీ

యంశములు దృష్టియందుంచుకోఁబడినవి. ప్రశ్లిష్టా వర్ణములగు ఏఓ లకు 'అ'తో మైత్రిలేదు. వివృతతరావర్ణములగు ఐఔ లకు 'అ'తో మైత్రికలదు.

స్వరములందు అ, ఇ, ఉ లు క్రమముగా మధ్యము, ఉచ్చము, నీచము నని వెనుక వివరింపఁబడినది. 'ఇ' వర్ణగుణసాంకర్యముచే ఎఏలుగూడ ఉచ్చములగుచున్నవి 'ఉ'వర్ణగుణ సాంకర్యముచే ఒఓలుగూడ నీచములగుచున్నవి. ఐ ఔలందు అవర్ణమే ప్రస్ఫుటతర మగుటచే వానికిఁ బ్రధానముగా అవర్ణముతోడనే మైత్రి. ఏఓలతోడి మైత్రి యానుషంగికము, క్వాచిత్కము – వృద్ధిసంధియైన సందర్భములందే యట్టి మైత్రియగును. ఐఔలయందు చరమాంగములగు ఇ, ఉలకు ఐఔలతో మైత్రిలేదు.

స్వవర్గజయతులు, ఊష్మవిశ్రాంతులు, అనునాసికాక్షరయతులు–మున్నగు యతిభేదములు వర్ణముల యుత్పత్తిస్థానముల, సాదృశ్యసామీప్యాదిలక్షణముల నాశ్రయించియే యున్నవనుట స్పష్టమే. కనుక సదృశశ్రుతియొక్క పునశ్శ్రుతియుఁ, దత్కల్పితమైన శ్రవ్యతయు యతిమైత్రీభేదముల యాశయమనుట పరమార్థము.

ఐనను శ్రవ్యతాసంపాదనమాత్రమే యతిమైత్రికిఁ బరమప్రయోజనమని తలంపరాదు. రసాద్యర్థప్రసంగ మున్నపట్ల మహాకవుల రచనయం దవి రసాదివ్యంజనసాధనములుగాఁగూడఁ బనికివచ్చును. కవిత్రయము పెక్కుసందర్భములందు యత్యక్షరములను రసాదివ్యంజకములుగ నుపయోగించియున్నారు.

స్వరములం దేది వడియందు నిల్చునో అది తన యుచ్చత్వాది ధర్మమును ఛందమున స్థాపించి వక్తయొక్క తత్కాలచిత్తధర్మమును వ్యంజింప సమర్థమగుచున్నది.

"ఆ శౌర్యం బా సత్వం
బా శీలం బా పరాక్రమాభీలత్వం
బా శుద్ధవ్రత మెందు న
నాశములని భీష్ముఁ బెద్ద నమ్మితిమిగదే"

భీష్మ. I. 56

సర్వపాదములందును ఆద్యక్షరము 'అ'వర్ణమైయున్నది. అది మధ్యస్వరము – అనఁగా స్వరితము. కంఠబిలవివారమాత్రమున నుత్పాదింపఁదగిన అవర్ణము సుఖప్రయోజ్యము. శోకశిథిలమైన చిత్తవృత్తియందు ధృతరాష్ట్రుఁడు అయత్ననిర్వర్త్యమైన అవర్ణమున విలంబించుచు వాక్యము నుచ్చరించుట యుచితముగానున్నది. పద్యమంతయు దీర్ఘమైన అవర్ణమయమై ధృతరాష్ట్రుని విలాపధారను వ్యంజించుచున్నది.

"ఆ రూపం బవికార మా భుజబలం బత్యంతనిర్గర్వ మా
శూరత్వంబు దయారసానుగత మా శుంభత్క్రియాజ్ఞాన మా
ర్యారంభప్రతికూలవాదరహితం బా యాగి సమ్మానవి
స్తారోదారము మాద్రి పిన్నకొడు కేతన్మాత్రుఁడే చూడఁగన్.

విరా. II. 209

యత్యక్షరములు స్వరితములు, అనుదాత్తములునై సహదేవదీనదశాస్మరణమునఁ జింతాలసమైన ద్రౌపది చిత్తవృత్తిని జక్కఁగా వ్యక్తముచేయుచున్నవి.

"ఏల రాఁ బనిచెన్ మహీశులనెల్లఁ జుట్టమపోలె ము
న్నేల సత్కృతిఁజేసె నిందఱ కిమ్మహారథు లుండఁగా
నేల కన్యకనిచ్చె విప్రున కిందు నేఁడు శఠుండు పాం
చాలుఁ డిప్పుడ వీని నిర్గతసత్త్వుఁజేయుద మాజిలోన్"

ఆది. VII. 190

ద్రౌపదీస్వయంవరమునకు వచ్చిన రాజులందఱును భగ్నాశులై ద్రుపదునిపైఁ జెలరేఁగి పలికిన సక్రోధవాక్యములందు ఉదాత్తమైన 'ఏ'కారము వడియం దుండుట యుచితముగనున్నది. క్రోధోద్రిక్తులై రాజులందఱును 'ఏల, ఏల' యని యధిక్షేపపూర్వకముగ నుచ్చైఃస్వరమున వీరాలాపము లాడుచుండుట యత్యక్షరముచేఁ బ్రత్యక్షకల్పముగావింపఁబడుచున్నది.

పుత్త్రుల కేల భేదమగు భూనుత యేనును నీవు జాహ్నవీ
పుత్త్రుఁడు నుండఁగా నహితమున్ భయమున్ దొరకొన్నె నాకు నా
పుత్త్రులకున్ బ్రసాదకృతబుద్ధులు వేల్పులు గాన దీనికిన్
మిత్త్రనిధీ యెడంబడుము మిన్నక సంశయమంద నేటికిన్."

సభా II. 133.

ఓష్ఠ్యములై యనుదాత్తములైన ఉకారముతోడి పవర్గములు పాదత్రయమున వడిస్థానము లాక్రమించి ధృతరాష్ట్రుఁ డా వాక్యములను సానునయముగ రహస్యముగఁ బలుకుచున్నజాడను బట్టి యిచ్చుచున్నవి.

"ఈ దుర్యోధనుఁ డింతగర్వి యగునే యీ యున్నవారెల్ల నా
చే దైన్యంబునఁ బొందు టొప్పదని చర్చింపండ యీ భంగికిన్
లేదే యొండు దెఱంగు సత్కులముఁ బాలింపంగ వర్జింపరా
దే దుష్టాత్మకు నీచు నొక్కరునిఁ బోదే భేద మీ జాతికిన్."

ఉద్యోగ. III. 378.

సర్వపాదములందును ఉదాత్తమైన స్వరము యతియందు నిల్చి దుర్యోధనకృతతిరస్కారమునఁ గోపించి సభయెల్ల విన నుచ్చైఃస్వరమునఁ బలుకుచున్న శ్రీకృష్ణదేవుని క్రోధోద్రేకాభినయము ఛందముచేఁ జక్కఁగా నిర్వహింపఁబడుచున్నది. సాక్షేపక్రోధధిక్కారవ్యంజకమై యుదాత్త స్వరము వడియందేకాక వాక్యాంతములందును ధ్వజప్రాయముగ నిల్చి ఛందమును తనమయము గావించుకొనుచున్నది.

స్వరప్రధానములయిన ప్లుత కాకు స్వరయతులు రసవ్యంజములన్న యర్థము వాని నామ కరణమందే కనఁబడుచున్నది.

> "భీతి శోక తర్క గీత దూరాహ్వాన
> సంశయార్థములను జరుగుఁ బ్లుతము"

అని యప్పకవి ప్లుతప్రయోగోచిత సందర్భములను బేర్కొనెను. భయశోకాదివికారములవలన స్వరమునఁ గలుగు లౌల్యమునకు కాకువు అనిపేరు. అది తరుచుగాఁ ద్రిమాత్రాకప్లుతరూపమై యుండును.

ప్లుతమును, గాకువును గవిత్రయము రమ్యముగ నుపయోగించిన పట్టులు గలవు. సంబోధన సంప్రార్థనములందలి ప్లుతము సామాన్యముగా స్వరితమై కనఁబడుచున్నది.

> అ ! త్యాయత విమలతపోమహి
> మా ! యిన్నిదినమ్ము లేల మసలితి చెపుమా !

ఆది. I 117.

పౌష్యపత్నీకుండలాహరణమునందలి కష్టమును పైలుఁ డెఱుంగును. ఎఱింగియే యుదంకుని కార్యసిద్ధికి వలయు సాధనములన్నియు నాతనికిఁ దెలియకుండ తానే యేర్పాటుగావించెను నాలవ నాఁటి కెట్లో తిరిగివచ్చిన ప్రియశిష్యుని గాంచి పైలుఁడు మృదుహాస్యగర్భముగా సంబోధించు చున్నాఁడు.

మందులు మాకులు నుపయోగించినచో భర్తలు వశులగుదురన్న భ్రాంతితోఁ దన వశీకృతభర్తృత్వ రహస్యమునుగూర్చి ప్రశ్నించిన సత్యభామను ద్రౌపది సాదరమందహాసముగ మందలించుచున్నది —

> "వలతురు నాథు లంట మగువా కడు బేలతనంబు"

అర. V. 296

నిశ్చయగర్భమైన సంప్రశ్నమునఁగూడ 'ఆ'కారప్లుతము వ్యంజక మగుచున్నది —

> వారు దెసలొత్తికొన్నియు ధ
> రా రా జ్యం బిచ్చిపోయిరా పోరా తా

రారణ్యపీడఁ బడియును
రారాజుం జెఱకుఁబాపరా మన మెఱుఁగన్.

ఉద్యో. II. 204.

సంశయాదులందలి కాకువు అనుదాత్తమైన ఓకారరూపమై యుండును—

"అసదృశయౌవనంబింది యనన్యధనంబగునొక్కొ నాకు ని
క్కుసుమసముద్గమంబును నగోచరదుర్గమదుర్గవల్లరీ
కుసుమసముద్గమం బగునొకో పతిలాభము లేమిఁజేసి యొ
ప్పెసఁగఁగ దేవయాని పతి నేమితపం బొనరించి కాంచెనో

ఆది. III. 170

ఉత్ప్రేక్షా కాకువు—

"విశదశారదాంబుద పరివేష్టనమునఁ
బొలుచు గగనంబుప్రతిబింబమో యనంగ"

అర. IV. 147

ఉత్కటైకతరకోటికి సంశయరూపమైన సంభావనము సందేహసజాతీయమైన భావమే.

ఆశ్చర్యప్రశంసాదులందు ఉదాత్తకాకువు—

"నీ వెఱుఁగనియది యెయ్యది
దేవోత్తమ ధర్మగతులతెఱఁగెల్ల భవ
ద్భావాధీనమగుటఁ గా
దే వెలసితి నీవు ధర్మదేవతయనఁగాన్."

అర. VII. 229

"అనుడు ముదంబు నమ్మమియు నాత్మఁ బెనంగొన నన్నతోడ ని
ట్లను విదురుండు పెద్దవడి కక్కట నీమది కార్యవృత్తి నూ
ల్కొనియె సుయోధనుంగని యకుంఠితనిశ్చయమై యతండు వ్రా
లినదెస వ్రాలకుండిన బలే మముబోఁటులకుం బ్రియంబగున్."

ఉద్యోగ II. 97

ప్లుతయుగ విశ్రాంతియందలి వ్యంజననిరాదరణము సాతిశయభావావేశ లక్షణముగా గుర్తింపవలసి యున్నది

"మాయరవి యేల క్రుంకఁడొ
కో యను నిట్లేల తడసెనో యను......"

విరా. II. 312

ఉభయయతులందలి స్వరవ్యంజనాన్యతరప్రాధాన్యముకూడ పెక్కుసందర్భములం దర్థ విశేషద్యోతకముగాఁ గవిత్రయము ప్రయోగించియున్నారు.

''పాయకపాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు వాసిగ ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడున్ దన కిష్టుఁడున్....''

ఆది. I. 25

నారాయణశబ్దము ద్వితీయపాదమున స్వరమైత్రితో, తృతీయపాదమున వ్యంజనమైత్రితోఁ బ్రయుక్తమై యున్నది. స్వరమైత్రి యున్నచోట శబ్దమునకు యౌగికార్థము ప్రధానము. వ్యంజనమైత్రి యున్నచోట పదము సంకేతమాత్రము. భారతఘోరరణమున శోకావిష్టుఁడై యున్న యర్జునునకుఁ దోడ్పడిన నారాయణుఁడు జ్ఞానమునకు నిలయమైన పరమేశ్వరుఁడు. భారతరచనమున నన్నయకుఁ దోడ్పడిన నారాయణభట్టు కేవలము నారాయణనామ సంకేతితుఁడు. స్వరముతోడి మైత్రి యున్నచో నర్థవిశేషస్ఫూర్తి యన్యత్రకూడ గుర్తింపఁదగును.

"అతులవిజ్ఞానఘనుఁడు నారాయణుండు"

శాంతి. IV. 328

"అభయకారి సశీర్ష నారాయణుని"

శాంతి. IV. 217.

వ్యంజనమైత్రి యున్నచోట సంకేతమాత్రమగుటయు గుర్తింపఁదగును.

"నా। రాయణ రవితేజ రాజరాజనరేంద్రా !

అర. IV. - 1

"నా। రాయణ బిరుదాంక భీమ రమణీయగుణ —"

అర. V. 1

ఇట్లే మిగిలిన శబ్దములవిషయమునను బరిశీలించి స్వరమైత్రి యౌగికార్థప్రాధాన్యమునకును, వ్యంజనమైత్రి సంకేతమాత్రత్వమునకును సూచకములని యెఱుంగవచ్చును.

వడియందలి యక్షరముల రసాదివ్యంజకతాలక్షణము నిట్లే యన్వేషించి కవిత్రయమువారు వడిప్రయోగమునఁ గావించిన శిల్పమును గ్రహింపవలయును.

# విరామప్రయోగము

విచ్ఛేదరూపమైన యతిని విడనాడుటవలన ఆంధ్రచ్ఛందములందు అర్థచ్ఛేదరూపమైన విరామమునకుఁ బ్రాధాన్యము కలుగుచున్నది. యతివలెనే విరామముగూడ ప్రయోగవిషయము. యతిచ్ఛేదానుసారము సంస్కృతమున శ్లోకములనుఁ బఠింపవలెను. తెలుఁగున విరామానుసారమే పఠింపవలసియున్నది. ఛందోఽనుసారియైన విచ్ఛేదనియమము లేనప్పుడు కవియు రసాద్యర్థానుసారముగ విరామములు నిర్మింపవలసియుండును. ఆంధ్రచ్ఛాందసికు లెవ్వరును అర్థచ్ఛేదరూపమైన విరామమును గుఱించి ప్రసంగించియుండలేదు. విరామము వడికిఁ బర్యాయపదమన్న యభిప్రాయము వ్యక్తముచేసి యూరకుండిరి. అది సమంజసము కాదు. వడి యక్షరమైత్రీరూపము. విరామము అర్థానుదర్శకమైన విచ్ఛేదము. వళిస్థానమునఁ బద్యము నిలువదు. విరామస్థానమున యథారసము నిల్చితీరవలయును. అట్లు నిల్చిన కాలముయొక్క ప్రమాణముపై బద్యముయొక్క లయ యెకవిధముగా నాధారపడియుండును. విరామములనడిమి కాలప్రమాణము, విరామకాలప్రమాణము లయద్యోతకములై రసాద్యర్థవ్యంజకములే యగుచున్నవి.

రసప్రవణుఁడైన భరతముని విరామస్వరూపమును, తత్ప్రయోగౌచిత్యమునుగుఱించి కావ్యకర్తకుఁ, బ్రయోగకర్తకును గొన్ని యంశము లుపదేశించెను.

"విరామో హ్యర్థానుదర్శకః"

నా. శా. XVII-P. 400.

"యత్రార్ధస్య సమాప్తిః స్యాత్
స విరామ ఇతి స్మృతః"

నా. శా. XIV–104.

అర్థసమాప్తియనఁగా అవాంతరార్థసమాప్తి యని యభినవులు వాఖ్యానించిరి. అవాంతరార్థసమాప్తిరూపమైన విరామము ఒకవిధమైన యతియేయని యాయన యభిప్రాయము. విరామము అని యతస్థానగతమైన యతి యనుట సమంజసమే.

"ప్రయోగీ ప్రతిపాద మంకురీకృత్య పఠన్ మధ్యే విశ్రామ్యతి ।
విశ్రాంతౌ చాత్ర వృత్తభంగో ఽర్థభంగో ఽభినేయః"

N. S. XIV–P. 245.

ప్రయోక్త ప్రతిపాదమును బ్రారంభించి పఠించుచు మధ్య విశ్రమించును. అట్లు విశ్రమించిన చోట వృత్తభంగముగాని, అర్థభంగముగాని అభినీతితము కావలెను. భంగమనఁగా విభాగము - భేదము. యతివిరామములు కలిసినపట్ల నిది కుదురును. కలియనిపట్ల యతియచ్ఛేదము నతిక్రమించి యైనను విశ్రమింపవచ్చుననియు. "క్వచి దుపాంత్యో వా" యని భట్టశంకరాది ప్రయోగ నిపుణుల యభిప్రాయమనియు నభినవులు వివరించిరి.

భరతమహర్షియుఁ బాఠ్యాంగమైన విరామమును గుఱించి చెప్పుచు "అథ విరామః అర్థ సమాప్తౌ కార్యవశాత్, ఛందోవశాత్। కస్మాత్, దృశ్యంతే హ్యేక ద్వి త్రి చతురక్షరా విరామాః" అనెను. విరామము నర్థవశమునఁ బ్రయోగింపవలెనుగాని ఛందోవశమునఁ గాదు. దృశ్యకావ్య నిర్మాత ప్రయోగపరతంత్రుఁడు గనుక అతఁడు రసోచితవిరామవంతమైన వృత్తమును ఎన్నిక చేయ యత్నింపవలెననియు, ప్రయోక్త కేవలమును కవిపరతంత్రుఁడు కాక అర్థపరతంత్రుఁడై విరామము ప్రయోగింపవలెననియు నభినవు లిచ్చట వ్యాఖ్యానముచేసిరి. భరతమహర్షియు—

"సమీక్ష్య వృత్తే కర్తవ్యో విరామో రసభావతః

N. S. XVII–144.

అని కావ్యనిర్మాత నాదేశించియుండెను. రసభావవ్యంజకములగునట్లు కవివృత్తమున విరామములు ఏర్పాటుచేసియుంచవలెను. ఒకవేళ కవి యట్టి యేర్పాటు చేయనిచో ప్రయోక్త కేవలము ఛందోవశుఁడై వృత్తపాదసముద్భవములైన విచ్ఛేదములందే విశ్రమింపక వాని నతిక్రమించి యైనను రసభావానుకూలముగ విరామమును బ్రయోగింపవలెనని ముని యుపదేశము.

శ్రవ్యకావ్యమైన మహాభారతమునఁ బ్రయోక్తయొక్క ప్రసక్తి లేదని భావింపరాదు రస ప్రధానమైన కావ్యము దృశ్యమైనను, శ్రవ్యమైనను ప్రయోగము నపేక్షించును. అంగనైపథ్య సత్వరూపమైన యభినయములు లేకున్నను శ్రవ్యకావ్యమున వాచికాభినయావసర మున్నది. అపఠితమైన కావ్యము అశ్రుతమై నిరర్థకమగును. కావ్యము పఠితము కావలెను. బ్రయోగము వలన కావ్యార్థము సమ్యగభినీతము కావలెను. రసాద్యర్థాభినయమునఁ బ్రయోక్తకుఁ దోడ్పడు తీరునఁ గవి ఛందములను రసోచితవిరామవంతములుగ నిర్మింపవలెను. యతిచ్ఛేదరహితములైన తెలుఁగుఛందముల రసాదివ్యంజనసామర్థ్యము యథోచితవిరామములనే యాశ్రయించు చున్నది.

పద్యవర్తనము విరామముల నాశ్రయించి ద్రుతముగ, మధ్యముగ, విలంబితముగ నుండ వచ్చును. అల్పాక్షర వాక్యములచే విరామములనడిమి వ్యవధి యల్పమై పద్యవర్తనము ద్రుత మగును. బహ్వక్షరవాక్యములచే వ్యవధి దీర్ఘమై పద్యవర్తనము విలంబితముగా భాసించును. వాక్యములు ప్రాణప్రసారప్రమాణోపలక్షకములని వెనుకఁ జెప్పఁబడినది. నిశ్వాసత్వరా జన కములయిన భావములందు అల్పాక్షరవాక్యములచే ద్రుతివృత్తియగు ఛందము ఉచితమనియు,

విశ్వాసభార జనకములయిన భావములందు బహ్వక్షరవాక్యములచే విలంబితవృత్తియగు ఛందము ఉచితమగుననియు భావింపవలెను. విరామాశ్రిత లయలనుగుఱించి భరతముని యభిప్రాయమిట్లున్నది.

"తత్ర హాస్యశృంగారయో ర్మధ్యలయః, కరుణే విలంబితః,
వీర రౌద్రాద్భుత బీభత్స భయానకేషు ద్రుతః"

నాట్యశాస్త్రము XVII–131.

ఇది స్థూలమైన సూచన ఛందోవృత్తి ప్రసంగమునఁ జర్చింపఁబడిన యంశములను దృష్టియందుంచుకొని కవిత్రయమువారి విరామప్రయోగనిపుణత్వమును దిఙ్మాత్రముగఁ బరిశీలింపవలెను.

రత్యాదిభావములు సంచారిభావముల నిమజ్జనోన్మజ్జనములచే నిరంతరము క్షణక్షణపరివర్తనశీలములై యుండును. విరుద్ధములు నవిరుద్ధములునగు భావముల సంయోగముచేఁ జిత్తవృత్తి తరచు సంకీర్ణమై యుండును. అట్టిపట్ల ఛందముయొక్క యక్షర విరామాద్యాశ్రయమైన వర్తనము క్షణక్షణపరివర్తమానమై యుండును.

"Where emotions of a varied and complex type are involved the Rhythm and verse pattern are changed with every phrase or sentence"

Shakespeare - P. 381.

అని Henrie Fluchre చెప్పినమాట సత్యము. వక్త చిత్తవృత్తి తన్మయీభవనమున శ్రోతకుఁ దోడ్పడవలసిన ఛందము వక్తయొక్క చిత్తవృత్తి మారినట్లెల్ల మారవలసియే యుండును.

చ॥ ఇటు దగునయ్య్య కృష్ణ! శమియింపుము, సాత్యకిఁ జంపినాఁడ విం
కట చనితేని ; నీదగు సహాయతఁ గౌరవసేన రూపుమా
పుట యవలీల నాకు ; నను౯ బొల్లగఁ జేయుట నీకుఁ బాడియే?
కటకట! నా పరాక్రమము గాసినఁ జక్రము చేత నంటితే?

భీష్మ. II, 181.

భీష్ముని సంహరింతునని చక్రము చేతఁబట్టి ముందున కుఱుకుచున్న కృష్ణుని భయసంభ్రమాక్రాంతహృదయుఁడై వారించుచు నర్జునుఁ డనిన వాక్యమిది. ప్రార్థన, నిషేధము, నిశ్చయము, దైన్యము – మున్నగు భావపరంపరచే సంక్రాంతమైన భయమువల్లఁ బలుతెఱంగులఁ బరిభ్రాంతమగుచున్న పార్థుని హృదయముయొక్క ద్రుత, విలంబిత మిశ్రవర్తనమును ఛందోవర్తనమునఁ జూడవచ్చును. 'కృష్ణ!' 'కటకట' అనుటయందు ద్రుతవిరామము, 'పాడియే' 'అంటితే' అనుపట్ల విలంబితవిరామము ప్రయుక్తములు కావలెను.

'విలంబితే విరామే హి సదా గుర్వక్షరం భవేత్'

అని భరతముని యాదేశము. విరామము విలంబితమగుపట్ల గుర్వక్షరము - అనఁగాఁ దీర్ఘాక్షరమును కవి నిబంధింపవలెను. దానిని ప్రయోక్త త్రిమాత్రాకప్లుతముగా నుచ్చరింపవలెను.

హా యను ధర్మరాజతనయా యను నన్నొడఁబాయ నీకుఁ జ
న్నే యనుఁ దల్లి నేఁపఁజనునే యనుఁ గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను నొంటి వోక దగవే యను నేగతిఁ బోవువాఁడ నే
నో యభిమన్యుఁడా యనుఁ బ్రియోక్తుల నుత్తరఁ దేల్పవే యనున్.

ద్రోణ II. 242

ఈ పద్యమునం దధోరేఖాంకితములయిన యక్షరములన్నియు దీర్ఘమాత్రములు కావు. ప్లుతములు, భరతముని వీనిని 'కృషము' లనెను. కృషమనఁగా విలంబితలయయనియు, నట్టి కృష్యాక్షరములను ద్విమాత్రాకములుగా నుచ్చరింపవలెననియు నభినవులు వ్యాఖ్యానించిరి. వీనిని బహుమాత్రాకములుగ నుచ్చరించి వీనియనంతరము బహుమాత్రాక విరామము చేయవలెను. అప్పుడు విలాపధర్మము సుష్ఠుగా వ్యక్తమగును. ఉత్పలమాలయందు 9 అక్షరములకు ఛేదము తిక్కన యీ పద్యమున నొక్కయక్షర మతిక్రమించెను. ఆ యతిక్రమణము శోకదీప్తివ్యంజకము. ప్లుతాక్షరములమీఁది విలంబనమును, దదనంతరమైన విలంబితవిరామమును ఆ దీప్తికిఁ బ్రకాశకములు. దీర్ఘ, ప్లుతముల బహుళప్రయోగముచేతను విలంబితవిరామములచేతను నుత్పలమాలయందు సహజముగ నుండు దీర్ఘతకంటె నత్యంత మతిశయమైన దైర్ఘ్య మీ పద్యమున భాసించుచున్నది.

విలంబితవిరామములందు - సంబోధనాదులందు-కొన్నిపట్ల లఘ్వక్షరప్రయోగ ముండుటయే యుచితముగాఁ గనిపించును.

సీ॥ హా మహారాజ ! మహామహీరక్షణ
దక్షదక్షిణబాహుదండ ! దండి
తారాతి ! నిషధరాజాగ్రణి !...

అరణ్య II. 82.

'ఇచ్చట మహాప్రాణాక్షరములు, సమాసములు ప్రాణవ్యయహేతువులై సంబోధనము లఘ్వంతమగుట సహజము. ధీరచిత్తయగు దమయంతి పతిని స్మరించుచు, నిట్టూర్చుచు, సగద్గదముగ విలపించుట లఘ్వంతసంబోధనములందు సువ్యక్తమగుచున్నది.

కం॥ ఏమిర ! పనులని యార్వవు !
నీ మాటలు నిలువఁబడియెనే పసరమ !...

కర్ణ. III. 221.

'ఏమిర' 'పసరమ' అనుపట్ల లఘ్వక్షరాంతసంబోధనములు - ఆ పదముల యుచ్చారణమును త్రుంచి భీమసేనుఁడు క్రోధావహేళనవికటదృష్టితో దుశ్శాసనునిమొగము దిలకించుచుండిన యభినయమును జక్కఁగాఁ జాటుచున్నవి. వీక్షణక్రియా తాత్పర్యమున వాగ్విచ్ఛేదము రసవంతముగ నున్నది.

ఉపకీచకులు కీచకునిశవముతోఁ గలిపికట్టితన్ను శ్మశానమునకుఁ గొంపోవుచుండ ద్రౌపది భర్తలను బిలుచుచుఁ గావించిన రోదనము గమనింపఁదగియున్నది.

ఉ॥ ఆనతవైరి యో జయ ! మహాద్భుతవిక్రమ ! యో జయంత ! దు
ర్మానవిఘూర్ణమానరిపుమర్దన ! యో విజయాభిధాన ! తే
జోనిహతహితప్రకటశూరగుణప్రతిభాస ? యో జయ
త్సేన ! విరోధిబాహుబలజృంభణభంజన ! యో జయద్బలా !

విరాట. III. 21.

ఈ పద్యమునకుఁ బాదములు నాలుగే. ద్రౌపదికి భర్తలు ఐదుగురు. ఐదుగురను గేకలువెట్టి పిలుచుట యీ పద్యమునఁ బూర్తికావలెను. తిక్కన ఆ పిలుపులను చక్కఁగాఁ బంపకము చేసెను. 'ఓ' 'ఓ' యన్న ద్రౌపది కేకలు ఒకదానికంటె నొకటి క్రమముగా దీర్ఘతరము లగుచుండుట పంచపాండవ వర్ణనాత్మకములయిన సమాసముల క్రమవర్ధనమున గుర్తింపవచ్చును. ఒక్కొక్క కేక యంతమున నలసి గద్గదవడు ద్రౌపది కంఠవ్యాపారము హ్రస్వాంతములయిన సంబోధనముల స్ఫుటమగుచున్నది. ఈ సంబోధనముల యనంతరము విరామవిలంబనము రసవ్యంజకమగును.

సమాసఘటనమువలన నేర్పడిన విరామములచే వర్ణ్యవస్తుస్వరూపము సాక్షాత్కరించునట్లు ఛందమును నిర్మించుటయు నొకవిధమగు శిల్పము.

మ॥ గుణరావంబుఁ గృపాణఘట్టనరవక్షోభంబునుం, గింకిణీ
క్వణనవ్యావృతహేషితస్వనములున్, ఘంటావినాదాత్తఘో
షణనానాపటుబృంహితధ్వనియు శశ్వద్గాఢమై...

విరాట. III. 160

ఒకొక్కదానివలనఁ గలుగుచున్న ధ్వని క్రమముగ గాఢతరము, దీర్ఘతరమునై యన్యధ్వనులను గబళించివైచుట సమాసముల క్రమవర్ధనమున దర్శింపవచ్చును.

మ॥ ధరణీనాథుఁడు దానుఁ దమ్ములును దుర్దాంతోద్ధతిం గూడి మో
హర మత్యూర్జితభంగి నేర్చికొని యుద్యద్విక్రమం చొప్ప బం

ధురసంరంభత నున్నఁ జూచి బలవద్దోః స్తంభలీలాభయం
కరరేఖావలమానచాపుఁడయి వీకం దాఁకె నా సేనతోన్

విరాట. V. 296.

ఉత్తరగోగ్రహణమున దుర్యోధనాదుల నర్జునుఁ డోడించి పాఱఁద్రోలినతెఱంగును ఉత్తరుఁడు తన తండ్రికి వర్ణించి చెప్పుచున్నాఁడు. దృష్టమైన యర్థమును స్మరించి, స్మృతమైన యర్థమును యథాతథముగా ఉత్తరుఁడు తనవాక్యమునఁ బ్రతిపాదించుచున్నాఁడు. అర్జునుఁడు తన మీఁదికి రాఁబోవుచున్నాడఁని గుర్తించినంతనే దుర్యోధనుఁడు తన తమ్ములనందఱను జుట్టు చేర్చికొని రణమునకు సన్నద్ధుఁడయ్యెను. అతని సన్నాహము "దుర్దాంతోద్ధతి" "అత్యూర్జిత భంగి" "ఉద్యద్విక్రమంబు" బంధురసంరంభత" - యనుతీరునఁ బ్రుంపులను అతుకువెట్టి కూర్చినట్లున్నది. దానిని క్షణములో భగ్నముగావించిన యర్జునుని పరాక్రమవిజృంభణము 'బల వద్దోః స్తంభలీలాభయంకరరేఖావలమానచాపుఁడయి' - యన్నట్లు అఖండముగ, దృఢముగ నున్నది. అది యుత్తరుఁడు చూచినవిషయము. అప్రత్యక్షమున జరిగిన యీ సన్నివేశము విరాటునకుఁ బ్రత్యక్షము కావలయునన్నచో నుత్తరునివాక్యము ఇట్టి తీరున నిబద్ధము కావలయును. ఇది పద్యరచనయందలి శిల్పవిశేషము.

ఛందముల రసాద్యర్థవిశేష సమర్పణానుకూల ప్రయోగశిల్పమును బరిశీలించు సందర్భ మునఁ గవిత్రయమువారి యీ దృశనైపుణి యింకను విస్తరించి ప్రదర్శింపఁబడును.

# విశేషచ్ఛందములు

## దండకము

దండకము గద్యపద్యోభయమిశ్రమైన ఛందోవిశేషము. పాదమునందలి యక్షరసంఖ్య ఇరువదియాఱింటిని మించిన పద్యములు ఉద్ధురమాలావృత్తము లనఁబడును. దండకము ఆ తెగకుఁ జెందినది. పాదనియమరహితమై యఖండదండాకృతి యగుటచే దీనికి దండకమను నామము కలిగియుండవచ్చును. దండకములను గద్యరూపమునను, పద్యరూపమునను నిర్మింప వచ్చును

"దండకా శ్చండవృష్ట్యాద్యాః
పాదాంశ నియమోదితాః
అపాదనియమా శ్చోక్తాః
గణధా గద్యదండకాః" 1-23

అని జయకీర్తి ఛందోఽనుశాసనమున చండవృష్టి మున్నగు దండకములు పాదాంశనియమములతోడను, గద్యదండకములు పాదనియమరహితముగ గణములతోడను జెప్పఁబడునని వివరించెను. అతఁడే—

"దండకా వృత్తశబ్దాదికాః వృత్తవ త్తైహి; పాదోక్తలక్ష్మేతరా దండకాః యే తు తే గద్యపూర్వాశ్చ మాలాదికాః; తే ఽధవా నేకధా"[1] యని వృత్తదండకములు, గద్యదండకములు నను విభాగములు పేర్కొనెను. వృత్తదండకములు సమవృత్తజాతికి చెందినవని సూచించుచు కేదారభట్టు దండకములను సమవృత్తముల యనంతరము ప్రసంగించెను.

స భ య ర తాది గణములం దేగణము నవలంబించియైనను దండకములు నిర్మింప వచ్చును. గల, లగములతోడను నిర్మింపవచ్చును. లఘువులతో నారంభించి యామీఁద నేదేని గణమును బహువారము లావృత్తము చేయవచ్చును. సంస్కృతాంధ్రలాక్షణికులు పెక్కు దండకభేదములు చెప్పియున్నారు. వానియందు జాతి, ఉపజాతి, వృత్త, గద్యలక్షణములైన దండకభేదములు గలవు.

ఆంధ్రమహాభారతమున దండక మొక్కఁడే యున్నది. అది నన్నయరచన.

"శ్రీకంఠ లోకేశ లోకోద్భవస్థానసంహారకారీ.......కారుణ్య
మూర్తీ త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః"—
ఆరణ్య. I. 324.

పాదవిభాగవిరహితమైన యిది గద్యదండకము. దీనియందు నూటముప్పదియాఱు తగణములు, ఒకగురువు కలవు.

"తాః గౌ కామబాణః" 2-399

అని హేమచంద్రుఁడు తన ఛందోఽనుశాసనమున కామబాణము అను దండకభేదలక్షణము చెప్పెను. అనియతసంఖ్యాక తగణములపై గురుద్వయ ముండుట కామబాణ లక్షణము. కాని నన్నయ దండకమున ఒక్క గురువే యున్నది. ఆంధ్రలాక్షణికుల నియమమిట్లే యున్నది:

"విద్వాంసులెల్లన్ హకారంబెకానీ నకారంబెకానీ సకారంబెకానీ
వంచింపందగు న్మొందుగా నిందుఁ; గాదేని యాదిం దకారంబు కల్పించి
యామీఁదివెల్లం దకారంబులే మెండుగా నిచ్చకుస్వచ్చునందాక నిర్మించి
గుర్వంతముం జేసినం దండకంబండ్రు"
అప్ప. IV. 443.

అనియప్పకవి పెక్కు తగణములపై నొక్క గురువున్న దండకమును జెప్పెను. అప్పకవి యిట్టి దండకమునకు నామకరణము చేయకున్నను హేమచంద్రునిలక్షణమునుఁబట్టి నన్నయ రచించిన దండకము కామబాణము అని చెప్పుకొనవచ్చును.

కం. ఇది నియమములేని మహా
పథమునఁ గావలసినంత వక్కాణింపన్
గొదలేక నమరు దండక
ముదధీంద్రశయాన తావకోత్తమనుతులన్.
IV. 442.

అని యప్పకవి దండకమును, తత్ప్రయోజనమును గొనియాడెను. దండకము అనంతమైన మహాపథమఁట. తృప్తితీర భగవంతుని స్తుతించుకొనుటకుఁ దగిన ఛందమఁట.

స్తుతికిఁ బాత్రమైన వస్తువునందు చిత్తమును ఏకాగ్రము కావించుటకీ దండకములు ఏకగణబహువారావృత్తిరూపమున నిర్మితములని భావింపవచ్చును. దండకముయొక్క గతి దానియందు ఆవృత్తమైన గణముయొక్క స్వరూపమునుబట్టి యుండును. అఖండైకవాక్యరూపమైన దండకముయొక్క గతి వక్తయొక్క తత్కాలచిత్తగతిచే నియతమగును.

నన్నయ్య రచించిన దండకమునందు ఆవృత్తమైనది తగణము. గురుబహుళము, లఘ్వంతమునైన తగణము విలంబితావరోహణగతిగర్భము. ఉద్రేకప్రశమనరూప సుఖమయచిత్తవృత్తిని తగణావృత్తి వ్యంజించును.

క్రోధోద్రేకమున మాయాకిరాతునితోఁ బోరిపోరి ఆ కిరాతుఁడు పరమేశ్వరుఁడగుట దర్శించి, ప్రశాంతక్రోధుఁడై పరమేశ్వరాపరాధజనిత పశ్చాత్తాపశోకముచే దీప్తము, నార్ద్రము నైన చిత్తవృత్తిగల పార్థునినోట నన్నయ్య యీ దండకమును పలికించెను. పరమేశ్వర దర్శనమున కృతార్థుఁడైన పార్థుఁడు మృదుమందహృదయస్పందుఁడగుట సహజము. మహాదేవాంకితమైన యాతని వాగ్విన్యాసము మందమధురగతి యగుటయు సహజము.

గద్యదండకములు పాదాంతయతికములని సంప్రదాయము. సుదీర్ఘైకపాదమైన గద్యదండకము నిర్మించి పార్థుఁడు పొంగిపొరలివచ్చు తన భక్త్యావేశమును పరమేశ్వరునకు అఖండైక వాక్యరూపమున నివేదించెనని నన్నయ సూచించెను.

# పద్మకము

ఇది అష్టిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 16 అక్షరములు. గణములు : న భ జ జ జ గ. పది యక్షరములమీఁద యతి.

సంస్కృతలాక్షణికులు దీనిని మంగళమంగన యని పేర్కొని నాల్గక్షరములమీఁద యతి విధించిరి. ఆంధ్రలాక్షణికులు పదునొకండవ యక్షరమున వడి నిలిపి పద్మకమనుపేర వ్యవహరించిరి.

నన్నయ రచించినపద్మకము యతివిషయమున సంస్కృతాంధ్రలాక్షణికుల నియమములకు భిన్నముగ నున్నది. ఆయన ఎనిమిదవయక్షరము యతిస్థానముగఁ బాటించెను.

"కొడుకుపల్కు విని కూడదునాక దురాత్ముఁడై
కడఁగి మీకు నపకారమునేసి ధరిత్రి వె
ల్వడఁగఁబంచెఁ గడుఁ బాపమతిన్ ధృతరాష్ట్రుఁ డె
య్యెడల దుర్జనుల నేమఱి నమ్మఁగఁబోలునే ?"

ఆది. VII. 230.

పద్మకగతియందు చంపకమాలాలక్షణము కొంత భాసించుచున్నది. నగణమువెంట నొకజగణము, పాదాంతమున లగము నున్నచో నిది చంపకమాలయే యగును. ద్వితీయస్థానమున జగణలోప

మును బురస్కరించుకొని నన్నయ పద్మకమున యతి యేడక్షరములమీఁద నియమించుకొని యుండవచ్చును. చంపకమాలాసామ్యమున లాక్షణికులు దీనికిఁగూడ పదియక్షరములమీఁద యతి చెప్పిరి.

పద్మకపాదమందలి 16 అక్షరములలో 11 లఘువులు 5 గురువులు. చంపకమాలవలె నిదియు ద్రుతగతి, జగణబాహుళ్యము గలది.

నన్నయ రచించిన పద్మకము వ్యాసవాక్యము. హిడింబవధ యనంతరము పాండవులు శాలిహోత్రుని యాశ్రమున కేఁగి యందు విశ్రమించియుండిరి. వనవాసాయాసఖిన్నులై యనిశ్చిత గమ్యులై సంచరించుచున్న పాండవులకు భావిశుభములను సూచించి యోదార్చుతలంపుతో వ్యాస భగవానుఁడు వారికి దర్శనమిచ్చును లక్ష్యహీనులై తిరుగుచున్న వారికి తాపోపశమనము గావించుటకై మహర్షి తనంత తానై వచ్చెను. తన మనుమలకు, కోడలికి చిత్తశాంతికరమగు నుపదేశ మొసఁగుటకై కరుణాతురుఁడై వచ్చిన మహర్షివాక్యము ద్రుతగతియైన పద్మకమున నిబంధింపఁ బడి తత్కాలమందలి యాయన చిత్తమందలి త్వరను వ్యక్తముచేయుచున్నది. వృత్తమున పండ్రెండు పర్యాయములు గోచరింపవలసిన జగణము రెండుపర్యాయములుమాత్రమే భాసించు చున్నది. అదియు ధృతరాష్ట్రనిందాత్మకమైన పద్యపూర్వార్ధమునందే. జగణస్థగనమున నతి శయముగ భాసించు భగణము పద్యమునకు అవరోహణము నాపాదించి వక్తయొక్క మధుర చిత్తవృత్తిని వ్యంజించుచున్నది.

సర్వలోకవత్సలుఁడైన వ్యాసభగవానుని చిత్తమున స్థాయిభావము వాత్సల్యము. ధృత రాష్ట్రునియందు తత్కాలమున జనించిన క్రోధము ఆ వాత్సల్యమునకు అంగము. భగణ, గల రూపమైన యవరోహణము వాత్సల్యమాధుర్యమును, జగణరూపమైన యుత్ప్లుతి వాత్సల్యస్థాయి యందు సంచరించు క్రోధదీప్తిని జక్కఁగా వ్యంజించుచున్నవి.

## మ ణి భూ ష ణ ము

ఇది అతిశక్వరీఛందమునఁ బుట్టినది. పంక్తికి పదునైదక్షరములు. ర న భ భ ర గణ ములు. పదియవ యక్షరము యతి.

కేదారభట్టు, జయకీర్తి దీనిని రమణీయక మనిరి. రమణీయకమునకు జయకీర్తి 4 వ యక్షరము యతి నిర్దేశించెను. హేమచంద్రుఁడు దీనిని సుందరము అనెను. దీనినే జయకీర్తి పాదాంతయతికముచేసి మణిభూషణము అనెను. కవిజనాశ్రయమున నిది మణిభూషణశ్రీ యనఁ

బడినది. ఆంధ్రలాక్షణికు లందఱును దీనికి పదింట యతి చెప్పియున్నారు. నన్నయ్యయు పదింటనే యతి యుంచెను.

మణిభూషణము ఉత్పలమాలవంటిది. మొదటి భగణమును, చివరి లగమును వొలగించినచో ఉత్పలమాల మణిభూషణమగును.

ఆంధ్రమహాభారతమున కేవలమొక్కఁడే మణిభూషణము కలదు.

"రామవిక్రముఁ డజేయుఁ డరాతిగజావలీ
సామజాహితుఁడు సాంబుఁడు సాల్వచమూపతిన్
క్షేమవృద్ధియనువాని నకృత్రిమసాహసో
ద్దాముఁ దాకె శరధారల ధారుణి గప్పుచున్."

యదుకుమారుఁడైన సాంబుఁడు క్షేమవృద్ధియను సాళ్వచమూపతిని దాకిన సందర్భమున నన్నయ్య ఈ వృత్తమునుపయోగించెను. పదునైదక్షరములందు తొమ్మిది లఘువులైన పాదము మణిభూషణగతిని కొంత ద్రుతముచేయును.

సాళ్వవిజృంభణము నెట్లైన నరికట్టి యాదవులకు శాత్రవోపద్రవము దొలగింపఁగోరి యదుకుమారులు విపక్షజిఘాంసతో బయలుదేరిరి. వారిలో సాంబుఁడు క్షేమవృద్ధిపైఁబడుట యీ వృత్తమున వస్తువు.

"ఉత్సాహ స్సర్వకృత్యేషు సత్వరా మానసీ క్రియా"[2] యను న్యాయమున వైరిజిఘాంసోత్సాహులయిన యదుకుమారుల చిత్తములు సత్వరములయి యున్నవి. సాంబుని యుద్ధోత్సాహమును వర్ణించు నీ మణిభూషణము ద్రుతగతియై రసవ్యంజకముగా నున్నది.

"రామవిక్రముఁ డజేయుఁ డరాతిగజావలీ"

నన్నయ్య పద్మకమునందువలె దీనియందును యతిస్థానమును 7 వ యక్షరము చేసియుండవలసినది. ఉత్పలమాలయందు యతిస్థానము 10 వ అక్షరము. ఉత్పలమాలయందలి మొదటి భగణమును దొలఁగించినచో మణిభూషణము రూపొందును. కనుక మణిభూషణమున 7 వ యక్షరము యతి కాఁదగును. పద్మకమున నన్నయ ఇట్టిమార్గమే యవలంబించెను.

లక్షణము ననుసరించి మణిభూషణమున జగణము లేనేలేదు. అయినను పదవశమున నన్నయ్య దీనియందు జగణములను భాసింపఁజేసెను. ద్రుతగతియందు చంగుననెగిరి దుముకుచున్న యదుకుమారుల హృదయస్థితిని వృత్తమందలి యక్షరవృత్తి చక్కగా వ్యంజించుచున్నది.

# రథోద్ధతము

ఇది త్రిష్టుప్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 11 అక్షరములు. ర న ర లగ గణములు. ఏడవ యక్షరము యతి.

సంస్కృత లాక్షణికులు దీనిని రథోద్ధతయని స్త్రీలింగముతో వ్యవహరించిరి. తెలుఁగు లాక్షణికులు రథోద్ధతము అని నపుంసకముగా వాడిరి. అప్పకవి దీనిని పదాంతికము అనెను.

సంస్కృతలాక్షణికులెల్లరు దీనికి పాదాంతయతినే సూచించిరి. తెలుఁగున 7వ యక్షరము యతియనుట యెల్లరు నంగీకరించిరి.

16 మాత్రలుగల చరణము 4+4 లేక 5+3 అనుతీరున 8మాత్రల ఖండములు రెండుగా విభజింపఁబడి పాదమధ్యము యతిచ్ఛేదముగా గ్రహింపఁబడినది. రథోద్ధతము తాలలయాన్వితమైన గేయము.

దీనిని నన్నయ్యయే ఒక్కపర్యాయము వాడెను. అదియు సభాపర్వద్వితీయాశ్వాసము చివర రాజరాజును సంబోధించుటకు. పాదమందలి 11 అక్షరములలో 5 గురువులు. కనుకనిది మధ్యగతిగల పద్యము. గురులఘుసమత్వమున సుఖప్రయోజ్యమై మధురచిత్తవృత్తి వ్యంజకము కాఁగలుగుచున్నది.

"విసర్గయుక్తైః పాదాంతైః విరాజతి రథోద్ధతా
కలాపరిచయైః యాతా లటభేవ ప్రగల్భతాం" సువృ. 2-13

"అవిసర్గైస్తు పాదాంతైః నిష్ప్రభేవ రథోద్ధతా
అప్రార్థనాప్రణయినీ మ్లానమానేవ మానినీ" 2-14

"రథోద్ధతా విభావేషు భవ్యా చంద్రోదయాదిషు" 3-17

"కలానిపుణయైన కోమలివలె విసర్గయుక్తములయిన పాదాంతములచే రథోద్ధత శోభిల్లును. అయాచితప్రణయినియై నిస్తేజయగు మానినివలె విసర్గహీనపాదాంతయైన రథోద్ధత వెలవెలబోవును. చంద్రోదయాదులగు తటస్థవిభావముల వర్ణనమందు రథోద్ధత యుచితముగా నుండును." అని క్షేమేంద్రమహాకవి రథోద్ధతానిర్మాణమర్మమును, ప్రయోగౌచిత్యమును వివరించెను.

రథోద్ధత సహజముగనే శ్రోతృచిత్తాపహారిణియైన మధురవృత్తమనియు, విసర్గాంతపాదత్వమున నది అత్యంతప్రౌఢత్వము వహించుననియు క్షేమేంద్రుని యాశయము. విసర్గాంతపాదత్వము తెలుఁగుభాషయందు చెల్లదు. కనుక నన్నయ్య లఘురకారవృత్తిచే రథోద్ధతను

శ్రవ్యతరము గావించెను. తన ప్రీతికి ఆలంబనమైన రాజరాజుగుణగణములను గొనియాడుట యందు రథోద్ధతను వాడి ఆలంబనోద్దీపనవిభావ వర్ణనమునందును రథోద్ధత ప్రయోగార్హమే యని నన్నయ నిరూపించెను.

"హార హీర ధవళాంశు నిర్మలో
దారకీర్తి! రణదర్ప సద్గుణా!
వైరివీర రసవైద్య! మన్మథా
కార! ధీర! పరగండభైరవా!

సభా. 2-320.

# పృథ్వి

ఇది అత్యష్టిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 17 అక్షరములు. జ స జ స య లగ గణములు. 12వ అక్షరము యతి.

సంస్కృతాంధ్ర లాక్షణికులెల్లరు దీనిని పృథ్వియనియే వ్యవహరించిరి. భరతముని మాత్రము విలంబితగతి యని పేర్కొనెను. సంస్కృతలాక్షణికులు దీనికి 9వయక్షరము యతిగా నిర్ణయించిరి. ఆంధ్రులు 12వ యక్షరముగా పాటించిరి.

"......యతిరపి స్వభావా ద్యథా
విలంబితగతి స్తథా ద్విజై ర్నామతః"

N. S. 15. 115.

అని భరతముని యతినిర్ణయము వర్ణ్యవస్తుస్వభావానుకూలముగ చేసికొనఁదగునని కవిరుచికి వదలిపెట్టెను. సంస్కృతలక్షణమును పాటించినచో యతి లఘ్వక్షరమగును. కాని తెలుఁగు కవు లుపయోగించిన సంస్కృతవృత్తములందు సాధారణముగా యతిస్థానమున లఘ్వక్షరముండు నాచారము కనఁబడదు. వృత్తము హ్రస్వముతో నారంభించినను యతిస్థానమున మాత్రము దీర్ఘమేయుండును. హ్రస్వముపై విశ్రమించి యూపిరి తీసికొని దీర్ఘముతో నుత్తరఖండము నారంభించుటయందు తెలుఁగుజాతి యొక సుఖవిశేషమును గుర్తించినదనవచ్చును. నియతాక్షర వృత్తములం దిది సంప్రదాయమైనది. సంస్కృతలాక్షణికులు చేసిన యతినిర్ణయమును అతిక్ర మించి తెలుఁగుకవులు స్థానాంతరమున యతినిర్ణయము చేసికొన్నచోటుల నిట్టి లక్షణము గుర్తింప నగును. పృథ్వియందు 12 వ యక్షరము యతిగా నిర్ణయించుటయందును తెలుఁగుకవు లీ యంశ

మునే పాటించి రనవచ్చును. జగణారబ్ధములయిన పద్యములు తెలుఁగుభాషకు సహజములుకావు. సూర్యేంద్రగణములందు జగణములేమి గుర్తింపఁదగును. సంస్కృతమునందును జగణముతో నారంభించు వృత్తములు తక్కువయే. ఉన్నవానియందుఁగూడ కవులు విస్తారముగా నుపయోగించినవి మిక్కిలి తక్కువ. ఉపేంద్రవజ్ర, వంశస్థ, వృత్తములు రెండుమాత్రమే మహాకవులు విరివిగా నుపయోగించిరి. పంచచామరము, పృథ్వి మున్నగునవి విరళముగనే ఉపయుక్తములైనవి.

మధ్యగురువైన జగణము ఉత్ప్లుతగతి గలది. ఎగిరి గంతువేసినట్లు, ఎత్తి కూలవైచినట్లు జగణశ్రుతి యసాధారణమైన యనుభూతి కలిగించును. సరళముగా సాగుచున్న పద్యగతియందు ఈ యుత్ప్లుతి యొక్కొక్కప్పుడు చమత్కారహేతు వగుటయుఁగలదు. కనుకనే తెలుఁగుకవులు కందమున ద్వితీయపాదాదిని జగణమును అప్పుడప్పుడు కోరి కూర్చుకొందురు. అట్టికూర్పు కవిత్రయము రచనయందు తఱచు విశేషభావస్ఫోరక మగుటయు కలదు.

అత్యుత్కటోత్సాహముచే హృదయ మొక్కొక్కతరి ఎగిరి గంతువైచినట్లు స్పందించును. అతిసాహసోపేతములైన చర్యలకుఁ గడంగునప్పుడును హృదయస్పందము ఉత్ప్లుత మగుట యనుభవ విషయము.

సత్వానువిద్ధరజోవిజృంభణరూపమైన పిత్తప్రకోపమున నాడి మండూకప్లుతగతి యగునని వైద్యశాస్త్రములు చెప్పుచున్నవి.

> "పిత్తాధికే తు చపలా నాడీ వహతి కాకవత్
> బకదర్దుర సంచారా చటకావర్తికా గతిః"
>
> — బసవరాజీయము.

ఇట్టి హృదయగతియందు పృథ్వీవృత్తము ఉచితముగా నుండునని చెప్పవచ్చును. అనఁగా ఇట్టి హృదయగతియందు కవినిబద్ధవక్తయు, ఇట్టి హృదయగతిగల వస్తువును వర్ణించుటయందు కవియు పృథ్వీవృత్తమును ప్రయోగించుట ఉచితముగానుండును. భారతమునఁగల 6 పృథ్వీ వృత్తములును నన్నయ్యరచనలే. అందొకటి ఆరణ్యపర్వద్వితీయాశ్వాసాంతమున నన్నయ రాజరాజును స్తుతించి సంబోధించినది. మిగిలినవి వేర్వేఱు సందర్భములం దుపయోగింపఁబడినవి.

1. శమీకమహాముని కవజ్ఞగావించి శృంగిచే శపింపఁబడుటకుఁ బూర్వము పరీక్షిత్తు వేటాడి యలయుటను వర్ణించు సందర్భమునందలిది —

> "అమిత్రమదభేది యొక్కరుఁడ యమ్మృగాన్వేషణ
> భ్రమాకులితచిత్తుఁడై పాఱుచున్ ముందటన్

శమీకుఁడనువాని నొక్క మునిసత్తమున్ సంతత
క్షమాదమసమన్వితున్ గనియెఁ గానసాంతంబునన్

ఆది. II. 167.

ఏటువడి పాఱిన మృగమును వెన్నాడి యడవియంతయుఁ గ్రుమ్మఱి భ్రమాకులచిత్తుఁడైన పరీక్షిత్తు క్షమాదమసమన్వితుఁడగు శమీకుని గాంచుట వర్ణ్యాంశము. శమీకదర్శనము పరీక్షిత్తు మృతికి నాంది. మృగాన్వేషణభ్రమాకులితచిత్తుఁడైన పరీక్షిత్తుయొక్క మృగగతక్రోధోద్దీప్త హృదయగతి పద్యాదియందలి జగణోత్ప్లుతియందు చక్కగా భాసించుచున్నది. మృగవధోత్సాహ భంగము, తజ్జనితక్రోధము, శమీకదర్శనజనిత మృగదర్శనప్రత్యాశ, తద్భంగము, పునరుద్దీప్తమైన క్రోధావేశము, శమీకునికృతి, శృంగిశాపము – ఇట్లుప రీక్షిన్మరణమునకుఁ గారణపరంపర యుత్పన్నమైన యీ ఘట్టమున భిన్నవృత్తస్వీకరణమే శిల్పము. విశేషించి యసాధారణము, ద్రుతోత్ప్లుతవికలగతి యగు వృత్తమును స్వీకరించుట మహాశిల్పము.

"సాక్షేపక్రోధ ధిక్కారే పరం పృథ్వీ భరక్షమా" 3-21

అని క్షేమేంద్రుఁడు పృథ్వీవృత్తవినియోగమును సూచించెను. నన్నయ్య పృథ్వీవృత్తవినియోగము క్షేమేంద్రమతము ననుసరించుచునే యున్నది. శమీకునిపట్ల సాక్షేపక్రోధధిక్కారము ప్రకటింపఁబోవు పాండురాజును వర్ణించుచున్నది.

2. మృగయావ్యసనమునం దగిలి పాండురాజు మృగరూపధారులై క్రీడించుచున్న మునిదంపతుల వధించి, శప్తుఁడై, పశ్చాత్తప్తుఁడై, నిర్వేదావిష్టుఁడై సకలలౌకికభోగైశ్వర్యములను త్యజించు సందర్భమునందలిది. ఈ సన్నివేశము పై సన్నివేశముతోఁ జక్కగా సంవదించుచున్నది. సన్నివేశసంవాదమున ఛందస్సంవాదము సముచితమకదా.

"అమూల్యమణిభూషణంబులు గజాశ్వబృందంబులున్
సమృద్ధధనధాన్యరాసులుఁ బ్రశస్తగోవర్గముల్
క్రమంబునను భూసురేశుల కగణ్యపుణ్యార్థియై
అమర్త్యనిభుఁ డిచ్చెఁ బాండువిభుఁ డత్యుదారస్థితిన్"

ఆది. IV. 62.

పృథ్వీవృత్తమునకు జగణము ప్రాణము. ప్రతిచరణమునను ప్రథమతృతీయస్థానముల జగణములుగలవు. యతిస్థానమును పదమధ్యస్థితము గావించినచో మూఁడవ జగణమునుగూడ భాసింపఁజేయవచ్చును. పాదమునందలి పూర్వోత్తరఖండముల ప్రారంభమున జగణము భాసించి అట్టిపద్యము శక్తిమత్తరమగును.

ఈ పద్యమున మొదటి మూఁడుపాదములందును ప్రారంభమున, యతిస్థానమున జగణము భాసించుచున్నది. అవశ్యంభావియగు శాపానుభవోత్ప్రేక్షచేఁ గలిగిన యకాలవైరాగ్యము కారణమైన పాండురాజు త్యాగోత్సాహము, నిశ్చయము ఈ జగణములందు చక్కఁగా భాసించుచున్నది.

3. పాండుకుమారుల బలపరాక్రమగుణసంపదకు అసూయాగ్రస్తుఁడైన దుర్యోధనుఁడు శకునిదుశ్శాసనాదులతో భీమవధవిషయకమైన తన పాపనిశ్చయము నెఱింగించు సందర్భమున దుర్యోధన వాక్యము—

"ఉపాంశువధఁజేసి మధ్యము మదోద్ధతుం జంపి ని
స్సపత్నముగ ధర్మనందను నశక్తు బంధించి యే
నపాండవముగా సముద్రవలయాఖిలక్షోణి మత్
కృపాణపటుశక్తి నత్యధికకీర్తినై యేలెదన్"

ఆది. V. 168

పృథ్వీరాజ్యహరణోత్సాహమును, తదంగమైన పృథానందనోపాంశువధోత్సాహమును పృథ్వీవృత్తమున నిబంధించుట వృత్తనామాశ్రితమైన శిల్పము. "మదోద్ధతు" ననుటయందు క్రోధము, 'అశక్తు' ననుటయందు ఆక్షేపము, 'నిస్సపత్నము' 'అపాండవము' అనుటయందు ధిక్కారము సుష్ఠుగా భాసించి దుర్యోధనుని పాపనిశ్చయకారణమైన క్రూరోత్సాహము పద్యమున సమగ్రముగ నిర్వహింపఁబడినది. పద్యమందలి ముఖ్యాంశములు పెక్కు జగణములందే కూర్పఁబడుట గుర్తింపవచ్చును.

పద్యమందలి పూర్వోత్తరార్ధములందు అక్షర, పదరచనా రూపమైన శిల్పమును గుర్తింపవచ్చును. పూర్వార్ధమందలి మహాప్రాణవ్యంజనము, నీచమధ్యస్వరములు, వ్యస్తపదములు దుర్యోధనుఁ డావాక్యఖండములను రహస్యముగ, అనుదాత్తస్వరమున, సనిశ్శ్వసితముగ, ససంభ్రమముగ నుచ్చరించెనని స్పష్టముచేయుచున్నది. ఉత్తరార్ధమునందలి సమస్తపదములు, నాదాక్షరములు, విశేషించి చతుర్థపాదమందలి ఉదాత్తస్వరములు దుర్యోధనుఁ డావాక్యమును అనర్గళముగ క్రమవర్ధమానస్వరమున నుచ్చరించెనని స్ఫుటముచేయుచున్నవి.

భీమవధ ధర్మజబంధనములు రహస్యవిషయములు. అపాండవమైన క్షోణీరాజ్యపాలనము ప్రకాశవిషయము. స్వరవ్యంజనవిన్యాసశిల్పము వాక్యార్థవ్యంజకమైన వాచికాభినయమునకు చక్కఁగా నుపకరించుచున్నది.

"అసమాసైః పదై ర్భాతి పృథ్వీ పృథ్వీ పృథక్ స్థితైః"

సువృ. 2-27.

వ్యస్తములైన యసమస్తపదములచే పృథ్వీవృత్తము పృథువుగా భాసించునవి క్షేమేంద్రుఁ డొక రహస్యమును వెల్లడించెను. నన్నయ యారహస్యమునే పైపద్యమందలి పూర్వార్ధమున ప్రదర్శించెను.

4. జగత్కంటకులగు సుందోపసుందులనడుమ భేదముపుట్టించి వారి పరస్పరసంహార మునకుఁ గారణము గాఁగల యపూర్వలావణ్యవతియగు యువతిని బ్రహ్మయాదేశమున విశ్వకర్మ సృజించు సందర్భమునందలిది.

"తిలాణుమణికోటి సంఘటిత దివ్యదేహంబుతోఁ
దిలోత్తమ యనంగ నొక్క యువతీలలామంబు ను
త్పలాక్షి సృజియించె సర్వగుణభాసి రూపక్రియా
కలావిదుఁడు విశ్వకర్మ తనకౌశలం బేర్పడన్"

ఆది. VIII. 103.

పరస్పరగాఢానురాగబద్ధులైన ఏకమనస్కులై సుందోపసుందులను సోదరులను తన సౌందర్యముచే లోభపెట్టి వారినడుమ భేదముపుట్టించి వారు పరస్పరము స్పర్ధించి సంహరించు కొనునట్లు చేయఁగల రమణిని విశ్వకర్మ నిర్మింపవలెను. సుందోపసుందవిభేదనము అసాధారణ కర్మ. అపూర్వసౌందర్యవతికిమాత్రమే అది సాధ్యము. అట్టి యపూర్వసుందరీరూపనిర్మాణ మున విశ్వకర్మ ప్రవృత్తుఁడైన విషయమును అపూర్వవృత్తమే చక్కగా ప్రతిపాదింప సమర్థ మగునని నన్నయ్య పృథ్వీవృత్తము నెన్నికచేసికొనెను. విశ్వకర్మ తనకౌశలమంతయు వినియో గించి క్షణములో తిలోత్తమను సృష్టించెను. లోకోత్తరవస్తునిర్మాణమున ఉత్కటోత్సాహ బంధురమైన విశ్వకర్మ హృదయస్పందము నన్నయ్య నిర్మించిన యీ వృత్తబంధమున ప్రతిస్పం దించుచున్నది.

## శిఖరిణి

ఇది పదునేడవదైన యత్యష్టిచ్ఛందమునఁ బుట్టినది. గణములు య మ న స భ లగములు.

సంస్కృతలాక్షణికులు దీనికి షడక్షర విరతి విధించిరి. ఆంధ్రలాక్షణికులు పండ్రెండు మీఁద యతిచెప్పిరి.

భారతమున తిక్కన్న మాత్రమే స్త్రీపర్వ ప్రథమాశ్వాసాంతమున హరిహరనాథదేవుని సంబోధించుటకు ఒక్కపర్యాయమే ఉపయోగించెను.

"తపస్స్వాధ్యాయాది క్షపితమలచిత్తప్రకలితా !
విపజ్జాలజ్వాలా విరమణసుధావృష్టిలలితా !
జపాపుష్పశ్రీరచ్ఛవికిరణ సంసర్జనధురా !
సపర్యానిర్వాహప్రచురకలన స్థైర్యమధురా !

శ్రీ. 1-187.

2, 3 చరణములందు ఉభయకవిమిత్రుఁడు తిక్కన సంస్కృతాంధ్రలక్షణములను రెంటిని మన్నించి ఏడింటను, పదుమూడింటను యతిమైత్రి కూర్చినట్లున్నది. ఈపద్యమునుబట్టి చూడఁగా మందాక్రాంతా, స్రగ్ధరలందువలె శిఖరిణియందుకూడ యతిద్వయ ముండుటయే శ్రుతి రమ్యతాతిశయకారి యనిపించుచున్నది.

"ఉపపన్న పరిచ్ఛేదకాలే శిఖరిణీ మతా"[3] యని క్షేమేంద్రుఁడు; ఆశ్వాసోపసంహారమున శిఖరిణీప్రయోగము ఉచితమే.

"శిఖరిణ్యాః సమారోహాత్ సహజైవోజసః స్థితిః" వృ. ర. 2-31

క్షేమేంద్రుఁడు చెప్పినట్లుగా ఆరోహణగతియైన శిఖరిణికి ఓజోగుణము సహజము. భక్త్యావేశమునఁ గావింపఁబడు పరమేశ్వరస్తుతియందు ఓజోగుణము భాసించుననుట స్తోత్రములందు సుప్రసిద్ధమే.

"శిఖరిణ్యాః పదైశ్ఛిన్నైః స్వరూపం పరిహీయతే యని[4] క్షేమేంద్రుఁడు హెచ్చరించి యున్నాఁడు. సమాసబంధురమైన రచనచే తిక్కన్న శిఖరిణి స్వరూపసౌభాగ్యమును బక్కఁగా పోషించినాఁడు.

ఇష్టదేవతాస్తుతియందలి దీప్తి క్రోధాదులందలి దీప్తివంటిదికాదు. గురుదేవాదివిషయకమైన రతియే భక్తి. అది మధురము. భక్త్యావేశమందలి దీప్తి మాధుర్యగుణసంక్రాంతమై యుండును. తిక్కన ఓజస్వినియైన శిఖరిణియొక్క ఓజస్సును పోషించుచు దానియందు మాధుర్యమునుగూడ సంక్రమింపఁజేసెను. ప్రథమద్వితీయ చరణములయొక్కయు, తృతీయ చతుర్థ చరణములయొక్కయు అంతములందు లలితద్విప్రాసములు నిల్పి ఓజోమయములైన శిఖరిణిపాదములను మాధుర్యపర్యవసాయులుగా సంస్కరించెను.

## మందాక్రాంత

ఇదియును అత్యష్టిచ్ఛందమునఁ బుట్టినదే పాదమునకు 17 అక్షరములు. గణములు మ భ న త త గగములు.

సంస్కృతమర్యాదననుసరించి మందాక్రాంతకు రెండువిరతులు. నాల్గక్షరములకు మొదటి విరతి. ఆ మీఁద మరి ఆఱక్షరములకు రెండవవిరతి. ఆంధ్రులు పదియక్షరములపై ఒక్క విరతినే పాటించిరి.

స్త్రీపర్వ ద్వితీయాశ్వాసాంతమున హరిహరనాథదేవుని సంబోధించుచు తిక్కన వ్రాసిన మందాక్రాంత యొక్కఁడే భారతమునఁ గలదు.

"వీణానాదప్రతిమ నిగమావిర్భవత్సారపుణ్య
శ్రేణీసంపాదితవిమలతాస్పద్ధమ నిర్లేపచిత్త
త్రాణక్రీడాకలన సతతోత్సాహవద్దివ్యభావా!
ప్రాణాపానాహరణనిపుణ ప్రావణీయానుభావా!"

స్త్రీ II. 185.

స్త్రీపర్వమందు తానుపయోగించిన ఛందముల మాధుర్యమును తిక్కన్న తానే ప్రశంసించు కొనుచుండెనా యనిపించుచున్న దీపద్యము. వీణానాదప్రతిమములైన వేదనాదముల లయించి నిర్మలములు నిర్లిప్తములునైన చిత్తములను త్రాణముచేయుట కుత్సహించువాఁడట హరిహర నాథుఁడు. ఆస్వామి తన నానావిధమధురచ్ఛందోమయ పర్వమును విని యానందించి తన్ను రక్షించునని తిక్కన్న యాశయము. స్త్రీపర్వద్వితీయాశ్వాసమందలి స్త్రీల రోదనములను విని కూడ స్వామి కరుణార్ద్రుఁడయ్యెనన్న ధ్వనియు ఈపద్యమునఁ గలదు. ''మోహసంబైన యిట్టి యేడ్పు లెందు అంబుజాక్ష వింటిమే'' అని గాంధారి కురుకాంతల విలాపమాధుర్యమును ప్రశం సించినది. ఆ మధురనాదములు తిక్కన్న చెవులయందు మారుమ్రోగుచు ఆయనచిత్తమును కరుణరసమయము గావించుచుండెఁ గాబోలు. ఆయననోట వీణానాదప్రతిమమధురమైన మందా క్రాంతము వెలువడెను. రౌద్రరసావిష్టమైన హృదయముతో సౌప్తికపర్వమున హరిహరనాథుని స్రగ్ధరావృత్తములతో సంబోధించుట యెట్టియౌచిత్యమో ఇదియు నట్టియౌచిత్యమే.

స్త్రీపర్వమున ప్రథమాశ్వాసము ప్రధానముగ ధృతరాష్ట్రవిలాపమయము. అతని విలాప మునందు అంతర్వాహినియై పాండవద్వేషము కలదు. ఓజఃప్రదీప్తమైన యార్ద్రత అతని చిత్త లక్షణము. ఆయాశ్వాసము చివర తిక్కన్న ఓజస్వినియైన శిఖరిణిని వాడెను. ద్వితీయాశ్వాస మంతయు, గాంధారీవిలాపము. ఆమె చిత్తము కరుణమయము. ఆయాశ్వాసము చివర మధుర మంథరమైన మందాక్రాంతమును తిక్కన్న వాడెను. పర్వరసానుసారియైన వృత్తమును పర్వాంతమున ప్రయోగించుట ఛందోమర్మజ్ఞతకు పరకోటి.

మందాక్రాంతమున నందమైనగతి సంపాదించుటకు క్షేమేంద్రుఁడు సూచించిన యుపాయ మిది —

"మంధరాక్రాంతవిస్రబ్ధైః చతుర్భిః ప్రథమాక్షరైః
మధ్యషట్కే ఒతిచతురే మందాక్రాంతా విరాజతే" 2-34.

ప్రతిచరణమునను మొదటినాల్గక్షరములు విలంబముగ నడువవలెను. అనఁగా అచ్చట గుర్వక్షరముల స్థానమున దీర్ఘాక్షరము లుండవలెను. తిక్కన్న పద్య మట్లేయున్నది. కనుకనే హృదయ ప్రసాదకముగ నున్నది.

"ప్రావృట్ ప్రవాస వ్యసనే మందాక్రాంతా విరాజతే" అని క్షేమేంద్రుఁడు మేఘ సందేశమందలి మందాక్రాంతల రసనిర్వాహకత్వమునకు ముగ్ధుఁడై పలికెను. మధురమందగతి యైన మందాక్రాంత విప్రలంభమునందును, కరుణమునందును ఉచితముగ నుండుననుట సత్యమే. కరుణరసతరంగిణియగు స్త్రీపర్వముయొక్క పర్యంతమున మందాక్రాంతనే వాడి కవిబ్రహ్మ యౌచిత్యమును పాటించెను.

## మణిమాల

ఇది ప్రకృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 21 అక్షరములు. గణములు స జ స జ స జ స. 10 అక్షరముల మీఁద యతి.

సంస్కృతచ్ఛందోలాక్షణికు లెవ్వరును ఈ వృత్తమును జెప్పినట్లు కనిపించదు. మణి మాలయనుపేరి వృత్తమును పల్వురు లాక్షణికులు చెప్పిరికాని దాని లక్షణము వేఱు.

పండ్రెండవ ఛందమునఁ బుట్టిన ఒక మణిమాలను జయదేవ, హేమచంద్ర, కేదారభట్ట, జయకీర్తులు పేర్కొనిరి. దానిలక్షణము - గణములు - త య త య పాదాంత విరతి.

హేమచంద్ర కేదారభట్టులు ఆఱక్షరములకు విచ్ఛేదముకూడ చెప్పిరి.

పదునెనిమిదవ ఛందమునఁ బుట్టిన మఱియొక మణిమాలను హేమచంద్ర జయకీర్తులు పేర్కొనిరి. దాని లక్షణము :—

గణములు : భ భ భ భ భ స. పదునొకం డక్షరములకు విచ్ఛేదము.

తిక్కన స్త్రీపర్వప్రథమాశ్వాసమున నొక మణిమాలను రచించెను.

"భవదీయసూను లరిసైన్యపంక్తిఁ గొని కాల్చి రెల్లఁ బొగడన్
వివిధాస్త్రశస్త్రమయ సాంద్రవృష్టిఁ దెగటాఱి పెంపుమిగులన్

దివికేఁగి యందు మహనీయతేజ మెసగంగ హృద్యబలభిత్
ధ్రువసౌఖ్యసంపదలు గాంచి తోషమునఁ దేలి రేల వగవన్''

శ్రీ. I. 108.

సజ, సజ, సజ స యనుతీరున సమాక్షరమాత్రాసంఖ్యాకములైన యావృత్తులతో నడచు నీవృత్తమున యతిస్థానము 11 వ యక్షరమగుటకంటె 13 వ యక్షరమగుట యుచిత మనిపించును. తాలలయాన్వితమైన గతిని భంజించి చంపకమాలాదుల కోవలో దీనిని జేర్పఁ గోరి యాంధ్రులు పదిపై యతినిల్పిరేమో. లేక గుర్వక్షరముపై యతినిలుపు నాచారమువెంట నిట్లు చేసిరో. ఎట్లయినను పదునొకంట యతి యశ్రవ్యమనక తప్పదు. తిక్కన్న పదునొకండవ యక్షరమున యతిమైత్రి పాటించినను పండ్రెండక్షరములమీఁద విచ్ఛేదమునుగూడ కొంతవఱకు పాటించుటచేత ఈ పద్యమున గతిభంగముగాని శ్రవ్యతాభంగముగాని కలుగలేదు.

జగణ సగణము లారోహణగతులు. తన్మయమైన మణిమాలావృత్తము ఓజోగుణ వ్యంజకము.

"దీప్త్యాత్మవిస్తృతే ర్హేతుః
ఓజో వీరరసస్థితిః'' మమ్మట. 8-69

అను న్యాయమున మణిమాల వీరరసవ్యంజకము. అనఁగా చిత్తమునకు చిఉద్దీప్తి, ఉన్నతి గలిగించునది.

గీ. తనుజశోకార్తయైన గాంధారిఁ జూచి
యడలు తనదు చిత్తంబున నతిశయిల్ల
నలతఁదేర్పఁగఁ దలచి తా నల్లఁజేరి
యమ్మహాదేవితోడ......

శ్రీ. II. 107.

కృపాచార్యుఁడు పలికినవాక్యము ఈ వృత్తము. శోకముచే క్రుంగిపోవుచున్న గాంధారిహృదయ మునకు దీప్తి, ధీరత చేకూర్చుటకు కృపాచార్యుఁడు లయాన్వితమైన యారోహణగతిని ఆశ్ర యించి హితవాక్యము నుచ్చరించుట పరమోచితముగ నున్నది. కృపాచార్యుఁడు తానే శోకా ర్తుఁడై యుండియు లేని యుత్సాహమును దెచ్చికొని పలికిన ట్లీవృత్తమే చెప్పుచున్నది. లక్షణము ననుసరించి పాదమున మూఁడుజగణము లుండవలసియుండగా లక్ష్యమున నొక్కఁడును రూపు కట్టుటలేదు. పదవ్యవస్థావశమున జగణములన్నియు శకలములై సగణములకు పూర్వాపరము లందు అంగమాత్రములైనవి. జగణముయొక్క యుత్ప్లుతి వృత్తరుచిత్వస్థాయియైన శోకాలసతచే నిర్వీర్యమైనది.

"సుకుమారరసస్యాత్ర రక్షాయై వృత్త ముద్ధతం
వాక్పాకేనైవ గళితం కవినా నీత మల్పతాం"

అని క్షేమేంద్రుఁడు[5] పరుషవృత్తసరళీకరణమర్మమును వివరించెను. ఓజస్వియైన వృత్తమును పదపాకముచే తిక్కన్న యార్ద్రముచేసి సుకుమారచిత్తవృత్తి వ్యంజనయోగ్యము గావించు కొనినాఁడు.

## మంజుభాషిణి

ఇది అతిజగతీచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 13 అక్షరములు. గణములు – స జ స జ గ. 8 అక్షరముల మీఁద యతి

సంస్కృతలాక్షణికులు దీనిని విలంబిత, కనకప్రభ, జయ, నందిని, మనోవతి, సుమంగళి, ప్రచోదిత, సునందిని మున్నగు భిన్నభిన్న నామములతో వ్యవహరించిరి. మంజు భాషిణి యన్న వృత్తరత్నాకరనామమునే ఆంధ్రులు చేపట్టిరి. సంస్కృతమున దీనికి పాదాంత ముననే విరతి. ఆంధ్రమున 9వ యక్షరము. 7వ యక్షరమైనచో శ్రవ్యతరముగా నుండును.

భారతమున స్త్రీపర్వప్రథమాశ్వాసమందలి 63వ పద్యము ఒక్కఁడే మంజుభాషిణి. అది తిక్కన్నరచన.

మంజుభాషిణి మణిమాలాపూర్వఖండమని సులభముగ గుర్తింపవచ్చును.

"ధనమంతయుం బొలియ దారుణంబుగాఁ
దనయవ్రజంబుఁ దెగ దైన్య మారఁగాఁ
దన బంధులందఱు మృతంబు బొంద నె
వ్వనినైన శోకమను వహ్ని గాల్పదే ?"

ఇది వ్యాసమహర్షితో ధృతరాష్ట్రుఁ డనినవాక్యము. పుత్రశోకార్తుఁడైన ధృతరాష్ట్రుని ఓదార్చుటకు వ్యాసభగవానుఁడు రాఁగా "గద్గదిక నెలుంగు రాలుపడ" ధృతరాష్ట్రుఁడు పలికిన వాక్యములం దిదియొకటి. శోకమును అగ్నిగా, సాగరముగా రూపించుట కావ్యపరిపాటి. శోకాగ్ని చిత్తమును తప్తముచేయును, శోకాబ్ధి యార్ద్రము చేయును. తత్కాలమున ధృతరాష్ట్రుని శోకమను వహ్ని కాల్చుచున్నది. ధృతరాష్ట్రుని చిత్తము శోకతప్తమకాక పశ్చాత్తప్తముగూడ నైయున్నది "భవంబిది కాల్పనె ? తంద్రీ !" యని ఆయన వాపోయెను. శోకతాప పశ్చాత్తాప

ములచే ధృతరాష్ట్రుని చిత్తము అత్యంత ముత్తప్తమైయున్నది. అట్టిచిత్తవృత్తి మంజుభాషిణీ వృత్తమందలి యక్షరవృత్తియందు సుష్ఠుగా భాసించుచున్నది. మణిమాలాఖండమైన మంజుభాషిణీ గతి ద్రుతారోహణమున ఓజస్విని. కనుక జ్వలితహృదయస్పంద వ్యంజిని.

# దోధకము

ఇది త్రిష్టుప్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 11 అక్షరములు. గణములు : భ భ భ గగ. 6 అక్షరములమీఁద యతి. సంస్కృతమున పాదాంతమున యతి.

రేచనాదులు దీనిని తోధకము అనిరి. అనంతుఁడు, చిత్రకవిపెద్దన, తోదకము ; అప్ప కవి దోదకము ; లింగమగుంట తిమ్మన తోవకము అనిరి. సంస్కృతప్రాకృతములందు విర హాంక పింగళాదులు దీనిని తరంగక, ఖిత్తక, బంధు నామములతోఁగూడ వ్యవహరించిరి. అన్యులు దోధకమనిరి.

తిక్కన్న దీనిని స్త్రీపర్వప్రథమాశ్వాసమున రెండుపర్యాయములు వాడెను. తనోదార్ప వచ్చిన వ్యాసమహర్షితో "గద్గదిక నెలుఁగు రాలుపడ'' శోకార్తుఁడగు ధృతరాష్ట్రుఁడు పలికినది మొదటిది. ఆధృతరాష్ట్రు నోదార్చుచు వ్యాసమహర్షి పలికినది రెండవది.

దోధకమును గుఱించి క్షేమేంద్రుని పలుకిది :

"దోధక తోటక నర్కుట యుక్తం
ముక్తకమేవ విరాజతి సూక్తం
నిర్విషయస్తు రసాదిషు తేషాం
నిర్ణియమశ్చ సదా వినియోగః'' 3-23

దోధక తోటక నర్కుటములు ముక్తకములైన సూక్తులందే చక్కగా శోభిల్లును. రసాదులందు వీనికి ఔచిత్యనియతి లేదు.

"త్ర్యక్షరైః త్ర్యక్షరైరేవ
ఛ్ఛేదై రాభాతి దోధకం
అతోఽల్పై రధికైర్వాపి
య(గ)తిం తాల మివోజ్ఝతి'' 2-9

త్ర్యక్షర విచ్ఛేదములచే దోధకము శోభవహించును. అంతకంటె అల్పములు నధికములునైన విచ్ఛేదములు దోధక లయను భంజించును. అని దోధకనిర్మాణమున క్షేమేంద్రుని యుపదేశము.

తిక్కన్న దోధక నిర్మాణవిషయమునఁగాని, వినియోగవిషయమునఁగాని, క్షేమేంద్రుని యభిప్రాయములను పూర్తిగా మన్నించినట్లు తోఁచదు. దోధకము సర్గబంధాదులయందు ఉచితము గాదని, వస్తురసభావాది వ్యంజకతయందు దోధకమునకు విలక్షణమైన సామర్థ్యము ఏదియు లేదని క్షేమేంద్రుని యభిప్రాయము. త్ర్యక్షరచ్ఛేదములచే దోధకము శోభిల్లునని క్షేమేంద్రుని యాశయము.

దోధకము మహాకావ్యబంధమునఁ బ్రయోగింపఁదగినదనియే తిక్కన్న భావించెను రస వ్యంజకత్వమున, విశేషించి కరుణరసవ్యంజకత్వమున నది సమర్థమనియు ఆయన భావించెను.

మమ్మటుఁడు హతవృత్తమను కావ్యదోషమునుగూర్చి వివరించుచు రసాననుగుణత్వరూప హతవృత్తదోషమునకు ఉదాహరణముగా —

''హానృప హాబుధ హాకవిబంధో'' ఇత్యాది దోధకవృత్తమును చూపి ''హాస్యరసవ్యంజక మేతద్వృత్తమ్'' అని తీర్మానము చేసెను.

పటెన్హామ్ అను ఆంగ్లచ్ఛందోవేత్తకూడ ఇట్టి యభిప్రాయమునే ప్రకటించెను.

> "If ye use too many dactils together
> ye make your musike too light and of
> no solemn gravitie.. ........ "

Elizebethen Lyrics. P. 55.

ప్రదీప, ఉద్యోతాదులగు కావ్యప్రకాశ వ్యాఖ్యానములందును ఈ యంశము సమర్థింపఁబడినది. "హాస్యే దోధకస్య ప్రతిపదవిచ్ఛేదిత్వే నానుగుణ్యం" అన్నమాట ఉదాహృతశ్లోక విషయమున సత్యమే కావచ్చును. ప్రతిపదవిచ్ఛేదిత్వ మొకప్పుడు మాధుర్యవ్యంజకము కావచ్చును గాని సర్వథా హాస్యరసవ్యంజకమే కావలెనని నిశ్చయింప నలవికాదు రసతత్త్వజ్ఞశేఖరుఁడైన తిక్కన శోకార్తుఁడగు ధృతరాష్ట్రుని వాక్యమును దోధకమున నిబంధించి హతవృత్తదోషమునకుఁ బాల్పడెనని భావించుట సాహసమేయగును.

నాట్యశాస్త్రమందలి దోధకవృత్త లక్షణలక్ష్యశ్లోకములు ఈ సందర్భమునఁ గొంత తోడ్పడఁగలవు.

> ''ఆద్యం చతుర్థ మంత్యం చ సప్తమం దశమం తథా
> గురూణి త్రైష్టుభే పాదే యత్ర స్యుః దోధకంతు తత్''

XV. 37.

దీనికిఁ బాఠాంతరము —

> 'భౌతుభగావితి యస్య గణా స్స్యుః
> స్యాచ్చ యతి స్త్రిచతుర్భి రథః

త్రైష్టుభ మేవహి తత్ ఖలు నామ్నా
దోధకవృత్త మితి ప్రవదంతి”

XV. 38.

ద్వితీయచరణమునకు “పాఠవశాచ్చ గతిః స్ఖలితా స్యాత్” అని మఱియొకపాఠము కలదు :

“ప్రస్ఖలితాగ్రపద ప్రవిచారం
మత్తవిఘూర్ణిత గాత్రవిలాసం
పశ్య విలాసిని కుంజర మేతం
దోధకవృత్త మయం ప్రకరోతి”

XV. 39.

వీనిలో 38వ శ్లోకము ప్రక్షిప్తమను భావమున కుండలీకృతమై యున్నది. దీనియందు లక్షణము త్రికములతోఁ జెప్పఁబడియున్నది. ఇది భరతమతవిరుద్ధప్రక్రియ గనుక అభినవ గుప్తపాదు లీ శ్లోకములను భరతకృతములు కావని తిరస్కరించియున్నారు. విశేషించి దోధక లక్షణము దీనియందు సరిగాఁ జెప్పఁబడలేదు. దోధకము త్రిష్టుప్ఛందమునఁ బుట్టినది. అనగా పాదమునకు 11 అక్షరము లుండును.

“భౌతు భగౌ ఇతి యస్య గణాః స్యుః” అన్న లక్షణమునుబట్టి దోధకమున గణములు భ భ భ గ కావలసివచ్చును. అట్లయిన పాదమునకు అక్షరములు పదియే యగును. లక్షణలక్ష్య ములను కలిపిచెప్పిన ఈ శ్లోకమున 1, 3, 4 పాదములందు పదునొకండేసి అక్షరములున్నవి. రెండవ పాదమునమాత్రము పదియే ఉన్నవి. ఇట్లనేకవిధముల నీ శ్లోకము దుష్టమై యున్నది.*

“భౌ భ గ గా ఇతి యస్య గణాః స్యుః” అని మొదటిపాదమును సవరించి “పాతవశాచ్చ గతిః స్ఖలితా స్యాత్” అన్న పాఠాంతరమును ద్వితీయపాదముగా స్వీకరించినచో నీ శ్లోకము దోష రహిత మగుటయే కాక గుణవంతముకూడ కాఁగలదు. దోధకము పఠనమున స్ఖలితగతి యను టయే దీనియందలి గుణము. భరతముని కృతమైన లక్ష్యముకూడ ఈ యర్థమునే సమర్థించు చున్నది.

“తొట్రుపడుచున్న ముందటికాళ్ళు గలదై, మదముచే తిరుగుడుపడుచున్న మేనియొయ్యా రముగలదై యీ కుంజరము దోధకవర్తనము చేయుచున్నది చూడుము” అని శ్లోకభావము.

“దుధ్” ధాతువునకు కోపించు, క్షోభించు ఇత్యాదులర్థములు. దుధితపదమునకు Troubled, Perplexed, Turbid అన్న యర్థములు Monier Williams నిఘంటువునం దొసఁగఁ

---

* ఈ శ్లోకము నాధారము చేసికొని ఆచార్య వెలాంకరుగారు “జయదామన్” అను గ్రంథము (పుట 124) నందు భరతముని దోధకమునకు ‘భభభగ’ అని లక్షణము చెప్పినట్లు వ్రాసినారు.

బడినవి. దోధకమనఁగా ప్రకోపకము, ప్రక్షోభకము సనియర్థములు చెప్పుకొనవచ్చును. దోధక గతి స్ఖలితఘూర్ణితగతి యని భరతుని యభిప్రాయము స్పష్టము. మందమందముగా దోధకములతో (స్ఖలనములతో) దోధకము గీయమానమగునని యభినవగుప్తులు వ్యాఖ్యానించిరి.

భగణము ద్రుతావరోహణగతి గలది. తన్మయమైన దోధకమును ద్రుతావరోహణగతి గలదియే. పాదాంతగురుద్వయముచే పర్యంతవిలంబనముకూడ భావింపఁదగును. మూర్ఛదేరి "గద్గదిక నెలుంగు రాలుపడ" ధృతరాష్ట్రుఁడు పలికిన వాక్యము స్ఖలితఘూర్ణిత పర్యంత విలంబిత గతి యగుట సహజము.

"మానుష జన్మము మాస్యవివేకా!
మానసదుఃఖ సమాజము నెల్లం
దాన ఘటించుచు దైన్యము దెచ్చుం
గాన భవంబిది గాల్పనె తండ్రీ!"

స్త్రీ. I. 62.

సమాజము, ఘటించు, భవంబిది యన్నపదములందు జగణస్వరూపము భాసించి, పద్యమున క్రమముగ నుండవలసిన యవరోహణమును భంజించుచు, గతియందు స్ఖలనముతోడి కంపనమును వ్యక్తముచేయుచున్నది. పాదములందలి పదక్షేపరూపవిరామములు ఉత్తరోత్తరపాదములందు క్రమాధికసంఖ్యాకములై వాక్యోచ్చారణమున క్రమముగ నేర్పడుచున్న విలంబనమును బట్టి యిచ్చుచున్నవి. ప్రథమపాదము ద్వివిరామము, ద్వితీయపాదము త్రివిరామము, తృతీయపాదము చతుర్విరామము, చతుర్థపాదము పంచవిరామము నగునట్లు పదములు వ్యవస్థాపితములై యున్నవి.

త్ర్యక్షరాత్మక ప్రతిపద విచ్ఛేదమునకు అంతగా నవకాశమీయని యీ దోధకము హాస్య వ్యంజక మగుటలేదు. శోకమూర్ఛాలసుని గళితహృదయ నిర్గతమైన స్ఖలితకంపితవాగ్గతినే వ్యంజించుచున్నది.

నియత రసవ్యంజకతా లక్షణము లేని దోధకము ప్రకరణబలమున నే రసమునైన వ్యంజింపఁగలదేమో! రసభంజకముగామియే భంగ్యంతరమున రసవ్యంజకమగుట కావచ్చుఁగదా!

తిక్కన రచించిన రెండవదోధకము వ్యాసవాక్యము. (స్త్రీ. I. 71). ధృతరాష్ట్రవచనమునకుఁ బ్రతివచనమైన వ్యాసమహర్షి వాక్యములందు దోధకము రూపొందుటకుఁ గారణము ఉక్తిప్రత్యుక్తులయందు పరస్పరప్రభావజన్యమైన యక్షరవిన్యాససామ్యమును రూపొందించు లోకధర్మమే. ఛందస్సంవాదశిల్పము స్థలాంతరమునఁ బ్రపంచింపఁబడినది. వాక్యశ్రుతివల్ల వక్తృచిత్తవృత్తి గుర్తించి యట్టి వృత్తినే యవలంబించి వాక్యవిన్యాసముచేయుట వాక్యప్రయోగ నిపుణులగు మహాపురుషులకు సహజము.

# తో ద క ము

ఇది జగతీచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 12 అక్షరములు. గణములు : న జ జ య. ఏడక్షరములమీఁద యతి.

హేమచంద్రుఁడు, కేదారభట్టు తామరసము అనియు; జయకీర్తి లలితపదయనియు దీనిని వ్యవహరించిరి.

దోధకవృత్తపాద ప్రథమాక్షరమైన గురువును రెండు లఘువులుగా మార్చినచో తోదక వృత్తపాద మేర్పడును. దోధక తోదకముల సంబంధము ఉత్పలచంపకముల సంబంధమువంటిది. పాదాదిగురువును రెండు లఘువులు చేయుటవల్ల గణక్రమమంతయు మారినట్లు భాసించును. చంపకోత్పలముల విషయమున నీ మార్పు ఆభాసకల్పమే యైనను తోదక దోధకముల విషయమున పారమార్థికమే యనఁదగియున్నది.

11 అక్షరముల దోధకపాదమున 5 గురువులు, 6 లఘువులు. కనుక అక్షరాశ్రితమైన గతి మధ్యమము లేక ఈషద్ద్రుతము.

12 అక్షరముల తోదకపాదమున 4 గురువులు, 8 లఘువులు కనుక దీనిగతి ద్రుతతరము.

స్త్రీపర్వ ప్రథమాశ్వాసమున 81 వ పద్యమొక్కఁడే భారతమందలి తోదకవృత్తము. వ్యాసభగవానుఁడు ధృతరాష్ట్రునకుఁ గావించిన హితబోధయందు చరమవాక్య మీతోదకవృత్తము. చోదనార్థకమైన తుద్‌ధాతువునుండి నిష్పన్నమైనది తోదకశబ్దము. తోదకమనఁగా చోదకమే.

"తమతమ తప్పులఁ దా రెరియంగా
విమలమతీ ! యిటు పీరికినై శో
కమున దహింపఁగఁ గాదు మనంబుఁ ;
సముచిత మిత్తఱి శాంతము సుమ్మీ"

స్త్రీ - I - 81.

ఆత్మదోషదగ్ధులైన పుత్రులకొఱకై శోకించి తన చిత్తమును దహించుకొనక శాంతివహించుట వివేకమని వ్యాసమహర్షి ధృతరాష్ట్రుని ప్రచోదించుటయందు తోదకము ఉచితమనియే చెప్పఁదగును. యతి, విరామముల సంపాదమున వృత్తగతియందు సమత సిద్ధించి వక్తయైన మహర్షి యొక్క సమచిత్తతను వ్యక్తముచేయుచున్నది. శోకము అన్నపదము ద్వితీయ తృతీయ పాదముల నడుమ విభక్తమై శోకమును భంజింపుమన్న వక్త యభిప్రాయమును స్ఫుటీకరించుచున్నది.

# తోటకము

ఇది జగతీచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 12 అక్షరములు. గణములు ; స స స స. 8 అక్షరములమీఁద యతి. సంస్కృతమున పాదాంతయతి.

సంస్కృతలాక్షణికులచే భ్రమరావళి, నందిని, ఛిత్తకము, అను నామములచే వ్యవహరింపఁబడినది. భరత, పింగళ, జయదేవ, జయకీర్తి, హేమచంద్రాదులు పలువురు తోటకనామముననే వ్యవహరించిరి.

సగణము ద్రుతారోహణగతి గలది. తదేకమయమైన తోటకము అట్టిగతికలదే. పాశ్చాత్యులిట్టిగతిని Anapaestic గతియందురు. Anapaestus అనగా సగణము.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | Iambic | — లగ — | | ఆరోహణము |
| 2. | Trochaic | — గల — | | అవరోహణము |
| 3. | Anapaestic | — స — | | ద్రుతారోహణము |
| 4. | Dactylic | — భ — | | ద్రుతావరోహణము |
| 5. | Amphibrachic | — జ — | | ఉత్ప్లుతము. |

ఇవి యాంగ్లచ్ఛందములందు ప్రసిద్ధములైన లయలు. Anapaestic గతి "Swift and forcible" అనఁగా ద్రుతము, ఓజస్వి యని ఆంగ్ల రసజ్ఞుల యభిప్రాయము. (Hudson P. 156). ఆరోహణరూపగాఢత్వము ఓజస్సు అని భారతీయలాక్షణికులును అభిప్రాయము వ్యక్తపఱచియున్నారు.

క్రోధ, భయ, శోక, జుగుప్సాది భావములచే చిత్తము ఉద్విగ్నమైనప్పుడు వాక్యమునందిట్టిగతి భాసించును. ఉద్వేగమనఁగా ద్రుతారోహణమే కదా.

ఆంధ్రభారతమున మూఁడు తోటకవృత్తములు గలవు. అందొకటి నన్నయ్యది. రెండు తిక్కన్నవి. నన్నయ్య తోటకము రాజరాజనరేంద్ర సంబోధనాత్మకమైనది. ఆదిపర్వ ప్రథమాశ్వాసాంతమందలి 161 పద్యము. ఆశ్వాసాంతముల విశేషవృత్తసంవరణమున కవికి కామచారము సంప్రదాయ మంగీకరించినది.

తిక్కన్న తోటకములం దొకటి పుత్రశోకార్తుఁడయ్యు లోభము విడువని ధృతరాష్ట్రునకు విదురుఁడు సంసారగహనము తెలంగెటింగించు సందర్భమునందలిది. దుఃఖబహుళమైన సంసారగహనమునఁ బయనించుచున్న యొక విప్రునకు ఆ గహనమున ననేక భయంకరమృగములు, పలువురు తెక్కలికాంద్రును గోచరింపఁగా నాతనియందుఁ గలిగిన భీభరము తోటకమున వర్ణింపఁబడినది.

"గరుపాఱగ మేను ప్రకంపమునన్
బొరి తొట్రుపడన్ బదముల్; తొలగం
జొర నెచ్చోటు లేమి ననువ్వయభీ
భరమొందినఁ జేర్పడు చిత్తముతోన్"

తి. I. 45.

పులకప్రకంపములు విప్రునిభావావేశమునకు చిహ్నములు. భయాతిరేకమున నుత్తప్తము నుత్కంపితమునైన విప్రుని చిత్తస్థితి వృత్తమందలి యుత్స్ఖలితగతియందు ప్రతిబింబించుచున్నది.

చతుర్వారావృత్తమైన సగణము పద్యగతియందు సామ్యము ప్రతిష్ఠింప యత్నించుచుండ నానారూపమైన పదచ్ఛేదము దానిని భంగముచేయుచున్నది. గణవశమున ధారారూపమున తాళలయాన్వితముగ సాగవలసిన పద్యగతి పదవశమున శకలితమై విప్రునిపదముల తొట్రుపాటును వ్యక్తముచేయుచున్నది. ఉత్సాహభంగమునఁ జేర్పడి వికలమైన చిత్తముయొక్క స్థితిని, గాత్రముయొక్క గతిని రూపించుచు ఛందము అర్థానురూపమై శిల్పమగుచున్నది.

తిక్కన్న రెండవ తోటకము గాంధారి వాక్యము.

"సతతంబును శిష్యులు సద్వినయా
న్వితులై ప్రణమిల్లెడు వీరి పద
ద్వితయంబు గడుం జెడఁదిన్నవి సూ
చితె నక్కలు దైవముచెయ్దిఁ గటా!"

తి. II. 122.

ధృష్టద్యుమ్న కృపాణచ్ఛిన్నమైన శిరముతో, నక్కలుదిన్న పాదములతో రణభూమిని బడియున్న ద్రోణాచార్యుని మొండెమును దిలకించి విలపించు గాంధారి యన్న వాక్యమిది.

చతుర్మాత్రాకములైన నాల్గు సగణములతో నిర్మితమైన తోటకపాదమున షడక్షరవిచ్ఛేదము గతిసామ్యమును ప్రతిష్ఠింపఁగలదు. అష్టాక్షరవిచ్ఛేదముచే పాదము విషమఖండములై గతియందు వైకల్యమేర్పడును. పదవ్యవస్థావశమున సగణములు మఱుగుపడినచో తోటకవృత్తగతి విపరీతమగును. తిక్కన్న తోటకమున ద్రుతారోహణగతి చక్కగా రూపొందక భగణస్వరూప ముహుర్ముహురవభాసనమున మాటిమాటికి నవరోహణము గోచరించుచున్నది. ద్రోణాచార్యుని భూతపూర్వవైభవముయొక్క స్మరణమున గాంధారి చిత్తమున నావిర్భవించుచున్న యుత్సాహము భిన్నశిరశ్చరణుఁడై పడియున్న యాచార్యుని ప్రకృతవికృతావస్థాదర్శనమున జనించుచున్న విషాదముచేఁ దిరస్కృతమగుచున్నది. ఛందోవృత్తియు వక్తృచిత్తవృత్తియు పరస్పరసంవాదమున సుందరములై కవిబ్రహ్మ ఛందోనిర్మాణశిల్పమును చాటుచున్నవి.

పద్యపూర్వార్ధమున పాదద్వయము సవర్ణదీర్ఘసంధిచే సమన్వితములై స్వార్థసమర్థకము లగుటయు, ఉత్తరార్ధమున "చూచితె" యను పదము సంస్థానవైచిత్రిచే చతుర్థతృతీయచరణముల యాద్యంతములను ఖండించుచు పర్యుఁడైన ద్రోణుని "నక్కలు చెడఁదిన్న పాదద్వయమును దలపింపఁజేయుటయు గుర్తింపఁదగును.

క్షేమేంద్రుఁడు తోటకమునకుఁగూడ రసాదివ్యంజకతా నియమము లేదనెను.[8] "తుట్" ధాతువు కలహార్థకము. తోటకమనఁగా కలహశీలము. భరతమహర్షి తోటకవృత్తలక్ష్యమునందు కలహశీలయగు నాయికను వర్ణించి వృత్తనామము సమర్థించెను. విరుద్ధభావసంఘర్షణమే కలహమైనచో తిక్కన్న తోటకవృత్తము సార్థకనామమే యగుచున్నది.

"ద్రుతతాలలయై రేవ వ్యక్తం రూక్షాక్షరైః పదైః
ప్రవర్తయతి యచ్చిత్తం తత్తోటక ముదీరితం" 2-16

అని క్షేమేంద్రుఁడు ద్రుతతాలలయాన్వితమైన తోటకము రూక్షాక్షరపదయుక్తమై చిత్తమును నర్తింపఁజేయునని చెప్పెను. జగణమువలె సగణమును నృత్తస్ఫోరకము; ఉత్సాహవ్యంజకము. తిక్కన్న యథావసరము సగణములను భంజించి తోటకముయొక్క నర్తనమును వికటము గావించెను.

# స్వాగతము

ఇది త్రిష్టుప్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 11 అక్షరములు. గణములు : ర న భ గగ, 6 అక్షరములమీఁద యతి.

11 అక్షరములలో 6 లఘువులు 5 గురువులు గల స్వాగతము మధ్యలయాత్మకము. యతిచ్ఛేదము పాదమును అక్షరవిషమములయ్యు మాత్రాసమకములయిన రెండు ఖండములు చేయుచున్నది. ఎనిమిది మాత్రలకాలములో పూర్వఖండమునందు 6 అక్షరములు, ఉత్తరఖండమున 5 అక్షరములు నడచును. కనుక పూర్వఖండము ద్రుతతరగతిగలది. గురులఘ్వక్షరముల నిష్పత్తినిబట్టి గతియందు విలంబనము గోచరించినను చతురస్రమయిన దీని గతి కొంతవఱకు ద్రుతమునకు సన్నిహితమే యనవచ్చును.

స్వాగతమునకు మణిభూషణమునకును గొంత సాదృశ్యమున్నది. మొదటి తొమ్మిది యక్షరములయొక్క స్వరూప మొక్కటియే. అయినను 15 అక్షరములలో 9 లఘువులుగల

మణిభూషణచరణముయొక్క ద్రుతగతి యథార్థమైనది కాగా స్వాగతచరణముయొక్క ద్రుతగతి ప్రాతిభాసికమే యగుచున్నది.

భారతమందలి మూఁడు స్వాగతములలో నన్నయ్యవి రెండు; తిక్కన్న దొక్కటి. ఆది పర్వసప్తమాశ్వాసాంతిమందలి స్వాగతము రాజరాజును సంబోధించునది. నన్నయ్య రెండవ స్వాగతము ఆరణ్యపర్వ ప్రథమాశ్వాసమున 158 వ పద్యము.

155 వ పద్యమైన మణిభూషణమున సాంబుఁడను యాదవకుమారుఁడు సాళ్వచమూపతి యైన క్షేమధూర్తి నెదుర్కొనుట వర్ణింపఁబడినది. సాంబునిధాటి కాగఁజాలక క్షేమధూర్తి రణరంగమునకుఁ దొలఁగఁగా వేగవంతుఁడనువాఁడు సాంబునిపైఁ గవియుట 158 వ పద్యమైన స్వాగతమున వర్ణింపఁబడినది.

"వేగవంతుఁడను వీరుఁడు సాంబున్
వేగవంతుఁడయి పేఁకను దాఁకెన్
వేగబాణపటలీ తతులన్ ది
గ్భాగముల్ విశిఖపంజరముల్ గాన్.

ఆర. I. 158.

ఆరంభమున నొకభగణమును జేర్చినచో నిదియు మణిభూషణమువలె ఉత్పలమాలాపాదఖండము కాఁగలదు. గతిసామ్యముగల వృత్తములు ప్రతివీరుల ఉత్సాహసాదృశ్యమును వ్యంజించును. గతిసామ్యము ఉత్సాహసామ్యమును వ్యంజించునట్లే వృత్తపాదప్రమాణ వైషమ్యము ఆ వృత్తములందు వర్ణింపఁబడిన వీరుల యుత్సాహప్రమాణ తారతమ్యనుగూడ వ్యంజించును. అల్పాయుష్యము వ్యర్థమునైన వేగవంతుని వేగమును నన్నయ్య ప్రాతిభాసిక ద్రుతగతియైన లఘువృత్తమున వర్ణించి, తన వృత్తప్రయోగనైపుణ్యమును తుళ్ళున మెఱయించెను. పద్యమందలి హలంతపదములు వేగవంతుని శరములు గాలికిఁదేలిపోవుటను వ్యంజించుచున్నవి.

స్త్రీపర్వ ప్రథమాశ్వాసమందలి 109 వ వృత్తము తిక్కన్న రచించిన స్వాగతము.

"అందొకండును రణావని భీతిం
బొంద కేటులనుఁ బోటుల దప్పిం
బొందియైన మొలివోవఁడ; దానం
బొంది యూర్ధ్వగతిఁ బుణ్యచరిత్రా!"

పుత్రశోకార్తయైన గాంధారిని ఊఱార్పఁబూనిన కృపాచార్యుని వాక్యమిది. కృపుఁడు తానే శోకగళితచిత్తుఁడై యుండెను. తెచ్చికోలు ధైర్యముతో నాతఁడు గాంధారి నోదార్పసమకట్టెను. కురుకుమారులెల్లరు శత్రువులఁజంపి ప్రతాపము మెఱసి రణరంగమున వీరమరణమంది ఇంద్ర

భోగము లనుభవించుచున్నారని మణిమాలావృత్తమున బ్రతిపాదించి దానివెంటనే స్వాగతవృత్తమున వీరమరణమంది నీ కుమారులందఱును నూర్ధ్వగతి నందిరని అదే యంశమును భంగ్యంతరమునఁ జెప్పుచున్నాఁడు. ప్రాతిభాసిక ద్రుతగతియైన స్వాగతము కృపుని కృత్రిమోత్సాహమునకు చక్కఁగాఁ దగియున్నది. కౌరవుల వీరస్వర్గయాత్ర స్వాగత వృత్తవర్ణితమగుటవల్ల స్వర్గమునకు వారు స్వాగతులను భావము ప్రతీతమై ముద్రాలంకారము ధ్వనించుచున్నది.

"సాకారాద్యైః విసర్గాంతైః సర్వపాదైః సవిభ్రమా
స్వాగతా స్వాగతా భాతి కవికర్మవిలాసినీ" 2-15

యని క్షేమేంద్రుఁడు స్వాగతవృత్తమున సవిలాస మందగమనము సాధించు నుపాయము ఉపదేశించెను. రసనిర్వహణ ప్రవణములైన నన్నయ తిక్కనల స్వాగతవృత్తములు శ్రవ్యతామాత్ర ఫలమైన ఈ యుపదేశమును అనువర్తింపలేదు.

# వ న మ యూ ర ము

ఇది శక్వరీచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 14 అక్షరములు. గణములు : భ జ స న గగ. 8 అక్షరములమీఁద యతి.

సంస్కృతచ్ఛాందసికులు దీనిని ఇందువదన, కాంత, మహిత, వరసుందరి, స్ఖలిత యను నామాంతరముల వ్యవహరించిరి. జయకీర్తిమాత్రము వనమయూర మనెను.

భారతమున ముువ్వురు కవులును ఒక్కొక్క వనమయూరము వ్రాసిరి. ఇది మంగళమహాశ్రీవృత్తముయొక్క ఉత్తరఖండమని సులభముగ గుర్తింపవచ్చును. లయగ్రాహి వృత్త పాదోత్తరఖండముతోడి దీని సాదృశ్యాతిశయమును సుగ్రహము.

మంగళమహాశ్రీ :— భజసన । భజసన । గగ
లయగ్రాహి :— భజసన । భజసన । భయ

ఇది అక్షరచ్ఛందముగా నిబంధింపఁబడినను పరమార్థమునం దిది మాత్రాచ్ఛందమే.

"ఘోర నొాడ లస్త్రపరిపూతముగ ధీరో
దారతఁ బిఱిందికిఁ బదంబిడక దృప్యత్
వైరితతి నొంచి తెగువారగుట మేలు
ర్వీరమణకోటి కని వేదములు సెప్పఁగా"

త్రి. I. 110.

3 + 2 = 5 మాత్రల యావృత్తులలో నిది ఖండగతిని నడచుచుంట స్పష్టము. ద్రుతావరోహణ గతియందు విలంబితలయాత్మకమైన యీ వృత్తము సత్త్వానువిద్ధమైన తమోగుణమును వ్యంజించును. అనఁగా సుఖమయమోహావస్థను వ్యంజించును.

మంత్రమయములయిన యస్త్రములు దాకి రణరంగమున వీరమరణమునందుట క్షత్రియులకు పరమధర్మమని వేదప్రామాణ్యమును బేర్కొని కృపాచార్యుఁడు గాంధారి నూరార్చువాక్య మీ వనమయూరవృత్తము. ధర్మనిష్ఠమైన గాంధారి హృదయమునకు వేదప్రామాణ్యసహితముగఁ బునరుక్తమైన వీరమృతుల యశోచ్యత్వతత్త్వము హత్తినట్లున్నది. శోకమోహితయైన యామెకు పుత్రుల స్వర్గప్రాప్తినిశ్చయహేతుకమైన తృప్తి కలుగుచున్నది.

గాంధారిహృదయగతి శోకస్థాయిచే విలంబితమైయుండగా పుత్రుల స్వర్గప్రాప్తిజ్ఞానము వల్లఁ గలిగిన హర్షము దానియందు కొంతత్వర నుత్పాదించుచున్నది.

వైద్యశాస్త్రమున సత్వరజోరూపమైన శరీరతత్త్వమునకు పిత్తమనియు, సత్త్వతమోరూపమైనదానికి కఫము లేక శ్లేష్మము అనియు పేళ్ళు. పిత్తము ఉష్ణము, ద్రుతము; కఫము శీతము మందము. పిత్తనాడి మండూకగతియని చెప్పఁబడినది.

"కఫేన దుష్టనాడీ తు హంస కుక్కుట గామినీ
కపోత మందసంచారా వహతీతి వినిశ్చయః" బసవ. 1-52

పిత్త శ్లేష్మ సాంకర్యమున—

"మండూకాదిగతీం నాడీం మయూరాదిగతిం తథా
పిత్తశ్లేష్మ సముద్భూతాం ప్రాహు ర్వైద్యవిశారదాః" బసవ. 1-57

హర్షమిశ్రితశోకావిష్టమైన గాంధారి హృదయము, అట్టిదేయైన కృపాచార్యుని హృదయముతో ఈ వనమయూరవృత్తమున సంవదించుచున్నది. మేఘావృతమైన దుర్దినమున హర్షమున వర్తించు వనమయూరముయొక్క ఖండగతియైన వృత్తమునుబోలిన చిత్తవర్తనమును వనమయూరవృత్తమున నిబంధించి కవిబ్రహ్మ ముద్రాలంకారధ్వనిసహితముగ ఛందశ్శిల్పము వెలయించెను. "పిరిందికి" "పదంబిడక" అనుస్థలముల జగణావభాసనకృత మండూకగతి గుర్తింపవచ్చును.

ఆదిపర్వ పంచమాశ్వాసముచివర నన్నయ్య వ్రాసిన వనమయూరవృత్తము రాజరాజ స్తుతిరూపము.

ఆరణ్యపర్వ షష్ఠాశ్వాసాంతమున ఎఱ్ఱన వ్రాసిన వనమయూరవృత్తముకూడ రాజరాజ స్తుతిరూపమే.

# నర్కుటము

ఇది అత్యష్టిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 17 అక్షరములు. గణములు : న జ భ జ జ లగ. 10 అక్షరములమీఁద యతి.

అప్పకవిమాత్రము కోకిలకాకము అనెను. సంస్కృతచ్ఛాందసికులు అవితథ, నర్దటకము, కోకిలము, అనియు వ్యవహరించిరి. కోకిలకమునకు 7 అక్షరములమీఁద, 13 అక్షరముల మీఁద విరతులు.

చంపకమాల పాదాంతమందలి నాల్గక్షరములను విడిచినచో నర్కుటమగునని గుర్తింపవచ్చును. 17 అక్షరములలో 12 లఘువులయిన నర్కుటకము ద్రుతగతిగలదనియును స్పష్టము, భారతమందలి రెండునర్కుటములును తిక్కన రచించినవే.

స్త్రీపర్వప్రథమాశ్వాసమందలి 113 వ వృత్తము నర్కుటము.

"వినుము మరుత్తనూభవుఁడు విశ్రుతధర్మగతిం
జనక కురుక్షితీశ్వరుని జంపె గదాసమరం
బున; నది యే మెఱింగి చని, పోయినరేయి గడుం
గనలున ముట్టి మువ్వురముఁ గ్రౌర్య ముదగ్రముగ౯"

గాంధారి నోదార్చుసందర్భమున కృపాచార్యుఁడు పలికిన వాక్యమిది: 'కురుకుమారుల మరణంబు సంభావనీయంబ' యని గాంధారికి నచ్చబల్కి యామె చిత్తమునందలి శోకమునకుఁగొంత యుపశమనముగల్గించి అయినను దుర్యోధనవధమున భీముఁ డధర్మపథము నవలంబించెనని యామెకుఁ బాండవులపైఁ గొంత కోపముపుట్టించి యామీఁద అశ్వత్థామాదులగు తాము గావించిన సౌప్తిక ప్రళయకర్మను వివరించువాఁడై కృపుఁడు ఈ వాక్యమును బలికెను.

మహాదారుణము, పాపిష్ఠమునైన ఉపపాండవాదుల సౌప్తికవధమును స్మరించియు, తత్ శ్రవణమున గాంధారి కుపితయై తమ్ము నిందించునో యన్న సంశయముచేతను కృపునిహృదయము తటతట గొట్టుకొనియుండవలయును. పరమాధర్మమైన యుపపాండవసౌప్తిక సంహారమును విని ధృతరాష్ట్రుఁడు హర్షించినను గాంధారి హర్షింపదని కృపుఁడెఱుఁగును. తాము కావించినది వధయేయైనను "సమరంబు సేసితిమి" అనుటయు, వక్తవ్యాంశమును సాగదీసి, యొక వచనఖండముచే సంధింపఁబడిన రెండు వృత్తములలో ప్రపంచించి మఱియొక వచనఖండమున ముగించుటయు కృపుని హృదయమందలి తడబాటును వ్యక్తముచేయుచున్నవి.

చంపకమాలయొక్క యసమగ్రరూపమైన నర్కుటవృత్తము, అసమాప్తమైన అందలి వాక్యమును నీ యంశమును బలపఱచుచున్నవి. ద్రుతగతియైన నర్కుటమున "తనూభవుఁడు"

"క్షితీశ్వరుఁడు" "గదాసమరము" "ఎఱింగి" "ఉద్గ్రమునన్" అనుపట్టుల జగణోత్ప్లుతి భాసించుచు, కృపుని శంకాకుల ప్రతిహింసా స్మరణోద్దీప్తచిత్తవృత్తిని చక్కఁగా వ్యంజించుచున్నది.

రెండవ నర్కుటము స్త్రీపర్వ ద్వితీయాశ్వాసమందలి 145 వ పద్యము. ఇది గాంధారీ వాక్యము.

> "త్వరితరథాశ్వమారుత గతస్ఫురితాకృతియై
> శరబహుళార్చిరుద్గమవిశాలతఁ బొల్చు ధను
> ర్గురుఁడను చిచ్చుపై శలభకోటిగతిం బడి ద్రుం
> దిరి కనుగొంటె యేవుర నుదీర్ణులఁ గేకయులన్"

రణరంగమున నిహతులై పడియున్న వీరులనుగాంచి, వారి బలపరాక్రమ, సౌందర్యగుణ సంపదలను స్మరించి గాంధారి పరిపరివిధములఁ బరిదేవనము చేయును. వృత్తపాదగతియందు ప్రారంభమున ద్రుతి, యెడనెడ నుత్ప్లుతి, నిర్నిరుద్ధమైన వ్యాప్తియు భాసించి వర్ణ్యవస్తువైన ద్రోణాచార్యుని రథాశ్వత్వరితగతి, ఆయన ప్రతాపాగ్నియొక్క విపులవ్యాప్తి, తత్జ్వాలలైన శరముల యుత్ప్లుతి శబ్దమయరూపము దాల్చి, వాక్యార్థమందలి రూపకమునకు ఉద్దీప్తి గలిగించుచున్నవి.

ద్రౌణికృతమైన ఉపపాండవపంచక సంహారవృత్తాంతము, ద్రోణకృత కేకయపంచక సంహారవృత్తాంతము, నర్కుటవృత్తములందే నిబంధించి భిన్నవక్తలయందైనను వర్ణ్యవృత్త సంవాదమున వాక్యవృత్తి సంవాదము స్వాభావికముగ సిద్ధించునని కవిబ్రహ్మ నిరూపించెను.

తోటక దోధకములకువలె నర్కుటమునకును రసాదులందు నిర్విషయత్వమును క్షేమేంద్రుఁడు వక్కాణించెను.[9] ఆసర్గాంతమైన ప్రయోగము సంస్కృతకావ్యములందు నర్కుటమునకు లేమియే క్షేమేంద్రుని యభిప్రాయమునకుఁ గారణము కావచ్చును. చంపకమాలాప్రియులైన తెలుఁగుకవుల కావ్యముల విషయమున నీ యభిప్రాయము సమంజసమనుటకు వలనుపడదు.

## బంధురము

ఇది అభికృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 25 అక్షరములు. గణములు : న న న న స భ భ భ గ. 15 అక్షరములమీఁద యతి.

హేమచంద్రుఁడు, జయకీర్తి దీనికి హంసలయయని పేరిడి 8, 7 యతిచ్ఛేదములుగా నిర్ణయించిరి.

యతిచ్ఛేదముచే నేర్పడిన దీని పూర్వఖండము 'మణిగణనికర' మనియు, ఉత్తరఖండము 'చిత్రపద' మనియు స్పష్టము. లఘువృత్తద్వయసంధానమున నేర్పడిన యిట్టి దీర్ఘవృత్తములు పెక్కు గలవు. సంధింపఁబడిన ఖండములు కొన్నిపట్ల విషమగతులు. బంధురమున నుభయ ఖండములును చతురస్రగతులే. అందు పూర్వఖండము ద్రుతతరగతి; ఉత్తరఖండము ద్రుత గతి. పూర్వఖండము సమగతి. ఉత్తరఖండము అవరోహణగతి. చిత్రపదనామకమైన యుత్తరఖండమున దోధకమునకంటె అంతమందలి యొక్క గురువే తక్కువ. కాఁగా బంధుర వృత్తము మణిగణనికర దోధకవృత్తముల సంధానరూపమని చెప్పఁదగును.

భారతమున తిక్కన రచించిన బంధురవృత్త మొక్కఁడే కలదు.

"సకల రథములును నఖిలగజములున్
సర్వహయంబులతో బెరయన్
శకలములుగ భటనికర మఖిలమున్
జావగ ద్రౌపది పుత్రులలో
నొకఁడును బ్రదుకక పొడిపొడియుగ న
య్యుర్వికి వారలమామల మ
స్తకములు గడమవడక వడి బలిగా
సంతసమందఁ బిశాచతతుల్"

సౌ. I. 115.

"పాండవశిబిరంబున" అశ్వత్థామాదులగు తాము గావించిన క్రూరవిధ్వంసక కర్మ స్వరూపమును కృపుఁడు గాంధారికి వర్ణించిచెప్పు వాక్యమిది. తత్కాలమున కృపునిచిత్తవృత్తి తత్కర్మాచరణకాలమందువలె కేవలక్రోధోత్సాహమయముకాదు. స్వయంకృత రౌద్రకర్మస్మరణ జనితదీప్తి యొకవంక, తత్ఫలముగఁ బాండవులకుఁ గల్గు శోక క్రోధములభావనవలన భయముచేఁ బొడసూపుచున్న క్షోభమొకవంక కృపుని చిత్తమును బర్యాయక్రమమున నాక్రమించుచున్నవి. "ధర్మపుత్రాదులబారింబడక తొలంగుట భీతులగు మాకుఁ గర్తవ్యంబై యున్నయది." యను కృపుని యనంతరవాక్యమువలన నిట్లూహింపవలసియున్నది.

రౌద్రకర్మాచరణకాలమున కర్తయొక్కయుఁ, దద్దర్శనకాలమున ద్రష్టయొక్కయు, స్మరణకాలమున స్మర్తయొక్కయు, శ్రవణకాలమున శ్రోతయొక్కయు, చిత్తస్పందము సదృశమే యనఁదగును. సర్వనాశనమైన పాండవశిబిరమును గాంధారికి భావగోచరమగునట్లు కృపుఁడు వర్ణించెను. ఆవర్ణనము పూర్వార్ధము సర్వలఘువైన మణిగణనికరముగా నేర్పడిన బంధురవృత్తమున నిబంధింపఁబడినది. ద్వితీయాశ్వాసారంభమున గాంధారి పొలికలను దర్శించి నప్పుడు ఆమెకు దృష్టిగోచరమైన తత్స్వరూపమును దిక్కన్న మణిగణనికరముననే నిబంధించి

యుండుట ఆయన వర్ణనానుగుణవృత్తప్రయోగనిపుణతకు నిదర్శనము. ఈదర్శనమునఁ గల్గిన యామె శోకభయములు అవరోహణగతియగు లయగ్రాహియందు వర్ణింపఁబడినవి. శోకము, భయము depressing feelings అని డార్విన్[10] ప్రభృతులు వక్కాణించియుండిరి. శోకభయములు ఆరంభమున చిత్తగతిని ద్రుతముచేయుననియు, క్రమముగ విలంబిత, అవరోహణము మును ఆపాదించుననియు జీవతత్త్వమనస్తత్త్వవేత్తల యభిప్రాయము. క్రోధభయములు విరుద్ధములు, విరుద్ధగతిసంకరమగు బంధురవృత్తమున క్రోధభయసంకులచిత్తవృత్తిని వ్యంజించుట యుచితము.

బంధురవృత్తమున 8 అక్షరములమీఁద, 15 అక్షరములమీఁద యతులుండుట సమంజసము. తిక్కన్న మణిగణనికరభాగమున యతిని పాటింపకున్నను మొదటి మూఁడుపాదములందు విరామరూపవిచ్ఛేదమును పాటించెను.

# ద్రుతవిలంబితము

ఇది జగతీచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 12 అక్షరములు. గణములు : న భ భ ర. 6 అక్షరములమీఁద యతి.

భరతముని దీనిని హరిణప్లుతమనెను. నాట్యశా. V. 68. ప్రాకృతపైంగళమున నిది సుందరి యని పేర్కొనఁబడినది.

[illegible] ద్రుతవిలంబితమున మొదటి యాఱక్షరములలో ఐదులఘువులు గనుక గతిద్రుతము. చివరి [illegible]క్షరములలో గురులఘువులు సమానము కనుక గతి మధ్యమము. అయినను ఇది ద్రుత వి[illegible]తము అని పిలువఁబడుటకుఁ గారణము లేకపోలేదు. అల్పాక్షరమైన పాదమున గురులఘువు[illegible]ఖ్య సమానమేయైనను గురువులే బలీయములై పాదగతియందు విలంబనమునే భాసింపఁజే[illegible]. కనుక ద్రుతవిలంబితమందలి యుత్తరార్ధముయొక్క గతి విలంబితమే.

భారతమున రెండు ద్రుతవిలంబితములు గలవు. అందొకటి నన్నయ్య ఆదిపర్వద్వితీయాశ్వాసాంతమున రాజరాజును సంబోధించినది.

రెండవది తిక్కన్న స్త్రీపర్వప్రథమాశ్వాసమున వ్రాసిన 119 వ పద్యము.

"చనఁగ నాతఁడు సాత్యకి వాయునం
దనుఁడు గాండివి దమ్ములు సూరెలం
జనిరి ; ద్రౌపది సంభృతశోకయై
చనియెఁ జుట్టపుఁజానలు సుట్టురాన్"

ధృతరాష్ట్రుఁడు గాంధారీసహితుఁడై పౌలికలనికిఁ బోవుచుండెననువార్తను విని శోకార్తు లగు నా వృద్ధదంపతులయం దక్కటికము అగ్గలముకాఁగా తానును వారిని దర్శింపవలెనని ధర్మ జుఁడుకూడ "కదలుండని పలికి చనియెఁ గలనివలనికిన్". ఆయనయు, ద్రౌపదియు జనిన తెఱఁగును ఈ ద్రుతవిలంబితము వర్ణించుచున్నది. 'పలికిచనియెఁగలనివలనికిన్' అన్నవాక్యము వల్ల ధర్మజుఁడు దిగ్గనలేచి చరచర త్వరితగతిని నడచిపోయెనని విదితమగుచునేయున్నది. వృత్తము పూర్వార్ధమున సోదరానుగతుఁడైన ధర్మజుని ద్రుతగమనము, ఉత్తరార్ధమున సబంధు స్త్రీక, సంభృతశోకయైన ద్రౌపదీదేవి విలంబితగమనమును వర్ణింపఁబడినవి. పురుషసహజ మైన ద్రుతగతి, స్త్రీసహజమైన విలంబితగతి క్రమబద్ధములై ద్రుతవిలంబితమున వర్ణింపఁబడుట మిక్కిలి యుచితముగా నున్నది.

"ప్రారంభే ద్రుతవిన్యాసం పర్యంతేషు విలంబితం
విచ్ఛిత్యా సర్వపాదానాం భాతి ద్రుతవిలంబితం" [11]

అని క్షేమేంద్రుఁడు ద్రుతవిలంబితనిర్మాణమున శ్రవ్యతాసాధనరహస్యమును వివరించెను. ఛంద మునకు అర్థానువర్తనమే ముఖ్యధర్మముగనుక తిక్కన పాండవుల సామూహికయానమును సూచించువాఁడై ప్రథమద్వితీయపాదముల సంచారమును అవిచ్ఛిన్నముగ నిబంధించెను.

## శుద్ధ విరాటి

ఇది పంక్తిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 10 అక్షరములు. గణములు : మ స 5 అక్షరములమీఁద యతి.

సంస్కృతలాక్షణికులు దీనిని శుద్ధవిరాట్ అని వ్యవహరించిరి. దశాక్షరపా నస ముక్కునకు విరాట్ అని వైదికచ్ఛందఃపభాషిష "విరాజో దిశః" అని పింగళుఁడు.

పదియక్షరముల పాదమున ఆఱుగురువులుగల దీని గతి యతివిలంబితము. భయశోకాది భావభారమున మందమైన హృదయస్పందము శుద్ధవిరాటియందలి యక్షరబంధమును బోలియుండు నని భావింపఁదగియున్నది.

ఆంధ్రమహాభారతమునం దొక్కఁడే శుద్ధవిరాటి కలదు. అది తిక్కన రచించినది. స్త్రీపర్వప్రథమాశ్వాసమున 125 వ పద్యము.

"ఉల్లం బప్రియమొందఁ, గ్రొత్త సం
ధిల్లన్ నెవ్వగ, దీనవక్త్రుఁడై

యొల్లంబోవుచు నుచ్చె నవ్విభుం
దల్లం గౌఁగిట నా నృపాలకున్"

"పుత్రశోకార్తుఁడగు పాండురాజపుత్రుండు పుత్రశోకార్తిం బొగులు విచిత్రవీర్యపుత్రుకడకుం జని తత్పార్శ్వవర్తులచేత నావేదితుండగుచు నాథూవల్లభు పాదంబులకుం బ్రణతుండగుటయు" పుత్ర హంత సమక్షమున హతపుత్రుఁడైన ధృతరాష్ట్రుఁడు పునరుద్బుద్ధశోకావేగమున మూర్చాకల్ప మైన యవస్థనంది యప్రీతితో మెల్లగా నాతనిని గౌఁగిలించుకొనుట యిందు వర్ణింపఁబడినది. విలంబితము నవరోహణాభిముఖమునైన వృత్తపాదగతి శోకభారమున మూర్చాళువైన హృదయ మును బట్టియిచ్చుచున్నది.

# మణిగణనికరము

ఇది అతిశక్వరీచ్ఛందమునఁ బుట్టినది పాదమునకు 15 అక్షరములు. గణములు : న న న న స. 8 అక్షరములమీఁద యతి.

సంస్కృతమునఁ గొందఱు దీనిని మణిగుణనికరము అనిరి. న న న న స - గణయుక్తమైన పాదము యతిచ్ఛేదభేదములనుబట్టి భిన్నవృత్తములుగా సంస్కృతలాక్షణికులచే వర్ణింపఁ బడినది.

న న న న స —— 7 మీఁద విచ్ఛేదము - చంద్రవర్త్మ, చంద్రావర్తా, శశికలా.
—— 6 మీఁద విచ్ఛేదము - మాలా, శరభ, స్రక్.
—— 4, 5, 9 మీఁద విచ్ఛేదములు - రుచిర

చతురస్రగతియందు నాలుగు ఆవృత్తులుగల మణిగణనికరపాదలక్షణము నల, నల, నల, స యనిచెప్పినచో గత్యనుసారియై సమంజసముగ నుండెడిది.

మణిగణనికరము తిక్కన్న రచించినది శ్రీపర్వద్వితీయాశ్వాసమున 3 వ పద్యము ఒక్కఁడే. దీని స్వరూపప్రయోగౌచిత్యాదికము స్థలాంతరమున విపులముగ వివరింపఁబడినది. (చూ. ఛందస్సంవాదము)

# ప్రహరణకలితము

ఇది శక్వరీచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 14 అక్షరములు. గణములు : న న భ న లగ. 7 అక్షరములమీఁద యతి.

జయకీర్తి దీనిని ప్రహరణకలిక యనెను. సంస్కృతమునఁగూడ విచ్ఛేదము ఏడేసి యక్షరములకే.

ఇది మణిగణనికరము వంటిదే. మణిగణనికరమున 14 లఘువులపై నొక్కఁడే గురువు. ప్రహరణకలితమున ఆఱేసిలఘువులపై నొక్కగురువు చొప్పున రెండుఖండములు. ఈ రెండు వృత్తములును చతురస్రగతియందు నాల్గావృత్తులు గలవే. రెండును ద్రుతగతి గలవే. ప్రహరణమనఁగా ఛేదము. విచ్ఛేదకలితమని దీనియర్థము కావచ్చును.

స్త్రీపర్వ ప్రథమాశ్వాసమునందలి 185 పద్యము ఒక్కఁడే ప్రహరణకలితము. అది తిక్కన రచన.

> "ఇది యిటు లగుట దెలిసిఁగి పలికె నా
> విదురుఁడు సభఁ గోవిదులు వొగడఁగా ;
> నది వినియును నే నడఁపన దురితం ;
> బొదవెఁ గలఁక ; నేటొలయ కుండునే ?"

తన పాదములకు మ్రొక్కి వెక్కుచున్న ద్రౌపది నూరార్చుచుఁ గొన్నివాక్యములు పలికి తనకును ద్రౌపదికిని పుత్రశోకకల్పితమైన యవస్థాసామ్యమును బేర్కొని యట్టియవస్థకుఁ దన యుపేక్షయే కారణమని గాంధారి పలుకు సందర్భ మిది. కౌరవపాండవవంశనాశన కారణమైన దారుణరణస్మరణమున గాంధారి హృదయమున నొదవిన కలఁక యీ యక్షరశకలముల వికల గతియందు స్ఫుటమగుచున్నది. ప్రథమాశ్వాసమునందలి యీ ప్రహరణకలిత ద్వితీయాశ్వాసాదియందలి మణిగణనికరమునకు నాంది యగుచున్నది. ఛందోరూపమున నిర్వహింపఁబడిన యంకావతారప్రక్రియ యొకచమత్కారవిశేషము.

ఈ వృత్తమున యతిస్థానమున లఘ్వక్షర ముండుట యసాధారణవిషయము. మణిగణనికరమునను నిట్లేయున్నది. దీనియందు మాత్రాగణాశ్రితమైన గతికి ప్రాధాన్యమీయఁబడినది.

# మేదిని

ఇది అష్టిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 16 అక్షరములు. గణములు : న జ భ జ ర గ. 10 అక్షరములమీఁద యతి.

సంస్కృతచ్ఛాందసికులలో హేమచంద్ర కేదారభట్టులుమాత్రమే దీనిని వాణిని యనుపేరఁ బేర్కొనిరి. ఆంధ్రులలో అప్పకవియొకఁడు దీనికి వాణి యనికూడ పేరిడెను.

విచ్ఛేదపర్యంత మిది చంపకమాలయే. చివర గతి మారినది. చంపకమాలాగతి యాంధ్రులకు చిరపరిచితము, ప్రియతరమునై యున్నది. ఆరబ్ధమైన చంపకమాలాగతి విచ్ఛేదానంతరము భగ్నమై తెలుఁగుచెవులకు మేదినీవృత్తగతి యాశాభంగకారి యగుచున్నది. పర్యంతగతి భంగము న నాశాభంగమును వ్యంజించుటకు మేదిని యుచితమైనవృత్తమని నిశ్చయింపవచ్చును.

భారతమున స్త్రీపర్వప్రథమాశ్వాసమందలి 152వ పద్యమొక్కఁడేఁ మేదినీవృత్తము. అది తిక్కన్న రచన.

"విను మిటు లేటికిం జనిన వృత్త మూది యల్గన్ ?
జనము నుతించు నీదు గురు సార ధీర బుద్ధిన్ ;
నిను నతిశాంతచిత్తయని నిక్క మేను గందున్
మనమున ; నిట్టి నీకగునె మత్సరంబు వత్సా ?"

ఇది వ్యాసభగవానుని వాక్యము. తనకుఁ బ్రణతులైన పాండవులను పుత్రఘాతకులన్న కోపము దీపింప దీవింపనొల్లక శపింపఁబూని ధర్మజుని సంబోధింప నుంకించు గాంధారిచిత్త వృత్తిని దివ్యబోధమున నెఱింగి తత్క్షణమ యచ్చటఁ బ్రత్యక్షమై వ్యాసభగవానుఁ డామె శాప వ్యవసాయమును నివారించి, సగౌరవసాంత్వనవచనములు గొన్నిపలికి తదవసానమునఁ బలికిన వాక్యమిది. గాంధారి శాంతచిత్తతయందు దనకుఁగల ప్రత్యయము అప్పటి యామె శాపోద్యమ కారణమున భంగమగుట వ్యాసమహర్షి గాంధారికి అతృప్తితోఁ దెలుపుచున్నాఁడు. అధర్మపరులైన తన పుత్రులను జంపిరని ధర్మపరులయిన పాండవులను శపింపఁబూనిన గాంధారి ధర్మ భంగమునకు ఒడిగట్టి స్వవృత్తభంగము గావించుకొని వ్యాసమహర్షికి చిత్తభంగము గలిగించినది. మహర్షి తన భగ్నచిత్తవృత్తిని వ్యక్తముచేసిన వాక్యము భగ్నవృత్తియైన వృత్తముగా రూపొందుట యతి సహజము. ధార్మికము, సుపరిచితమునైన గాంధారివృత్తమునఁ గలిగిన భంగమునకు వ్యాసమహర్షిపొందిన యతృప్తి ప్రారబ్ధమైన చంపకమాలాగతి భంగమగుటచే శ్రోతచిత్తమునఁ గలిగిన యతృప్తితో నీమేదినీవృత్తమున సంవదించుచున్నది.

"ఏటికిఁ జనిన వృత్తమూదిన్ యల్గన్'' అను వాక్యమున చంపకమాలాగతినే యూది తద్భంగమునకు అల్గనేలయని తిక్కన తెలుఁగులను మందలించుచు "నీదు గురుసారధీరబుద్ధిఁ జనము నుతించుఁ'' అని పర్యంతగురుబాహుళ్యసన్నివేశముచే, గురువు, ధీరము, సారమునైన మేదినీవృత్తమును తాత్కాలికమైన యతృప్తినివీడి తెలుఁగులు నిన్నుమెత్తురు లెమ్మని యూరడించుచుండెనా యనిపించుచున్నది. విచారరమణీయయములయిన యిట్టిచమత్కృతులు మహాకవులకు అయత్నసిద్ధములుగదా!

# ప్రణవము

ఇది పంక్తిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 10 అక్షరములు. గణములు : మ న య గ. 5 అక్షరములమీఁద యతి.

భరతముని దీనిని కువలయమాల యనెను. N. S. XV.

సంస్కృతలాక్షణికులును, ఆంధ్రలాక్షణికులందు అనంతాదులు కొందఱును దీనిని పణవము అనిరి. స్వరూపమునుబట్టి చూచినచో పణవము అను ఔపమికనామమే యుచితముగా నున్నది. పణవము అనఁగా హుడుక్క యను వాద్యవిశేషము.



గురువులచే ఆద్యంతముల స్థూలమై నడుమ లఘువులచే సూక్ష్మమైన యాకారముగల పణవవృత్తము హుడుక్కను బోలియుండును. శ్రీపర్వప్రథమాశ్వాసమున తిక్కన్న రచించిన 145 వ పద్యమొక్కఁడే భారతమందలి పణవవృత్తము.

"నీ యుల్లం బొక నియతిం గార్యం
బాయత్తంబుగ ననుసంధింపం
జేయం జాలవు ; చెడుతెర్వుం బోఁ
బాయం ద్రోవవు ; బలిమిం బుత్రున్"

క్రోధోన్మత్తుఁడై భీముని యాయసప్రతిరూపమును గౌఁగిటఁబట్టి పొడిపొడియొనర్చిన ధృతరాష్ట్రుని అవహేళనపూర్వకముగ మందలించుచు నిందించు శ్రీకృష్ణుని వాక్యమిది. కౌరవవంశనిర్మూలనమునకు ధృతరాష్ట్రుని లోభము, పుత్రవ్యామోహము, అనిశ్చితచిత్తత్వము గారణములని శ్రీకృష్ణుఁడు ఖండితముగఁ జాటుట పణవవృత్తమున నిబంధింపఁబడినది. లఘుమధ్యమైన పణవవృత్తగతి రగణగతివంటిది. ఆద్యంతారోహణమైన రగణగతి డోలాగతిసదృశమై యాందోళనాత్మకముగ నుండును. తత్సమచ్ఛందస్సంప్రదాయవిరుద్ధముగ నీ పణవవృత్తమునఁ గూడ లఘ్వక్షరము యతిస్థానమున నిల్చుట గుర్తింపవలెను.

అనిశ్చయడోలాగతియైన ధృతరాష్ట్రుని చిత్తవృత్తిని అట్టి గతిగల పణవమున ప్రతిపాదించుట యుచితమే.

# స్రగ్విణి

ఇది జగతీచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 12 అక్షరములు, గణములు : ర ర ర ర. 6 అక్షరములమీఁద యతి.

నాట్యశాస్త్రమున పద్మినియనియు, ప్రాకృతపైంగళమున లక్ష్మీధరయనియు నిది పేర్కొనఁబడినది.

రగణైక నిర్మితమైన స్రగ్విణి అఖండతరంగమాలా డోలనమునుబోలిన ధీరవిలంబనగతి గలది. డోలాగతివలె నిద్రపుచ్చు లక్షణముగలది. ఉద్విగ్నచిత్తమును మందీకరించి ప్రసన్నము చేయునది.

భారతమున రెండు స్రగ్విణీవృత్తములు గలవు. అందొకటి యారణ్యపర్వ పంచమాశ్వాసమున రాజరాజును స్తుతించుచు ఎఱ్ఱన్న వ్రాసినది. రెండవది స్త్రీపర్వ ప్రథమాశ్వాసమున తిక్కన రచించిన 140 వ పద్యము.

"ఏమి నీపుత్రుచే నెన్నియే భంగులన్
వేమఱుం బాటు నీవెంట భావించుచున్
సామసంపాదివై సైపు మా తప్పులన్
ధీమహత్వంబు సంధిల్లు నీకిమ్మెయిన్"

భీమసేనుని యాయసప్రతిమను చూర్ణముగావించి ప్రతిహింసాపూర్తికి లోలోన హర్షించుచు పైకి కపటశోకము నటించుచున్న ధృతరాష్ట్రుని కౌటిల్యమును అపహసించుచు, అధర్మ క్రౌర్యమును ఖండించుచు సమచిత్తుఁడవు గమ్మని యుపచారవచన సహితముగ శ్రీకృష్ణుఁడు పల్కిన వాక్యమిది. ఏకగణకృతమైన వృత్తమున గతిసామ్యము స్వతస్సిద్ధము. సమగతియైన వాక్యశ్రవణము శ్రోతచిత్తమున సమతను ప్రతిష్ఠింప సమర్థమగును సమస్పందియైన హృదయము ధీమహత్వసంధాయకము కాఁగలదు. శ్రీకృష్ణుని వాక్యార్థము సిద్ధించుటకు వాక్యము నందలి యక్షరగతి సంవాదము రూపమున సహకరించుచున్నది. భంగ్యంతరమున స్వపక్ష పరపక్ష దోషములను సమబుద్ధితో భావించి పాండుపుత్రులను క్షమించి ప్రశాంతచిత్తుఁడవు గమ్మని శ్రీకృష్ణుని వాక్యము బోధించుచున్నది. దుర్యోధనాదుల దోషములను పాండవులు క్షమించిరా? ప్రతిజిఘాంసువులై నూర్వురు కౌరవులను వధించిరికదా! అట్టి పాండవులను ధృతరాష్ట్రుఁడేల క్షమింపవలె? తమయందులేని సామము నన్యుల కుపదేశించుచు, చేయవలసినదంతయుఁ జేసి, మా తప్పులను సైపుమనుటయందు నిగూఢమైన వక్రతయున్నది. అది శ్రీకృష్ణుని వాక్యమైన స్రగ్విణీగతియందు నున్నది. భుజంగప్రయాతమునందలి వక్రత ఛాయామాత్రముగ స్రగ్విణి యందుండుట యనుభవవేద్యము.

# భుజంగప్రయాతము

ఇది జగతీచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 12 అక్షరములు. గణములు : య య య య. 7 అక్షరములమీఁద యతి.

భరతముని దీనిని అప్రమేయ యని వ్యవహరించెను. "స్రగ్విణీ" పదము స్రగ్విణీవృత్త గతిసూచకమైనట్లు 'భుజంగప్రయాతం' పదము భుజంగప్రయాతగతిని సూచించుచున్నది. ఏకగణ చతుర్వారావృత్తిచే నిర్మింపఁబడిన వృత్తపాదములు తాలలయాన్వితగతికి అమరియుండును. అట్టి వానియందు యతిచ్ఛేదము అవృత్తియంతముకూడ అగును. అట్లుకానిచో తాళపాతము, యతి చ్ఛేదము కలియక గతి కుంటువడును. స్రగ్విణియు, భుజంగప్రయాతమును షడక్షరచ్ఛేదమునఁ దాళలయకు అమరునవి. స్రగ్విణియందు ఆఱక్షరములపై యతిని పాటించిన తెలుఁగువారు భుజంగ ప్రయాతమున నేడక్షరములపై నేల పాటించిరో! యతిస్థానమున గుర్వక్షర ముండవలెనన్న యభి ప్రాయముచేఁ గావచ్చును.

భుజంగప్రయాతము విలంబనమున నారోహణగతిగలది. దైన్యసంతాపముల మిశ్రణ మున హృదయగతి విలంబితారోహణము గావచ్చును.

మహాభారతమునఁగల రెండుభుజంగప్రయాతములును దిక్కన స్త్రీపర్వమున రచించినవే. మొదటిది ప్రథమాశ్వాసమున 88 వ పద్యము.

"వినీతుండవై ధర్మవేదిత్వబుద్ధిన్
దనర్పొందు నీవిట్లు దైన్యాతిరేకం
బునంబొంది శోకాగ్నిఁ బొక్కంగఁ గుంతీ
తనూజాగ్రజుం డాత్మఁ దాఁ గుందకున్నే ?"

పుత్రశోకసంతప్తచిత్తుఁడై పశ్చాత్తాపజనిత మరణవాంఛాధీనుఁడై యున్న ధృతరాష్ట్రుని ఓదా ర్చుచు వ్యాసమహర్షి పలికిన వాక్యమిది. పుత్రహంతలని పాండవులయెడ ధృతరాష్ట్రునకు ద్వేషము గలుగరాదని వ్యాసమహర్షి యభిప్రాయము. నిర్వికారచిత్తుఁడైన వ్యాసమహర్షి చిత్త స్పందగతిని ఈ వృత్తగతియం దన్వేషించుట వ్యర్థము. మహాకవి, సర్వజంతుహృదయజ్ఞుఁ డైన యా మహర్షివాక్యమున వర్ణ్యవస్త్వవస్థాప్రతిఫలనము సమాలోచింపఁదగును. ఈ వాక్యా ర్థము ధృతరాష్ట్రుని తత్కాలావస్థ. దైన్యముచే నలసము, శోకాగ్నిచే దీప్తమునైన ధృతరా ష్ట్రుని చిత్తావస్థ విలంబితారోహణగతియందు స్పష్టగా భాసించుచున్నది. కవినిబద్ధవక్త మహా కవియైనప్పుడు అతని వాక్యమున అర్థానుగుణచ్ఛందస్త్వము అత్యంతము సహజమగును గదా

రెండవ భుజంగప్రయాతము స్త్రీపర్వ ద్వితీయాశ్వాసమందలి 106 వ పద్యము.

"కురుక్షోణినాథుండు గోరంగ మైత్రీ
ధురం దాల్చి తా నేర్పుతో సారథిత్వం
బరిశ్రేణిసంత్రాసియై పూని కర్ణుం
బరిక్షోభితుంజేసె భాషాస్త్రపంక్తిన్"

రణరంగమున మృతులై పడియున్న మహావీరులను వారిచుట్టుఁజేరి విలపించుచున్న వారి సతీసుతాది బంధువర్గములను దిలకించుచు గాంధారివిలాపముచేయు సందర్భమున నిది శల్యవిషయకమైన గాంధారీ వాక్యము. ధర్మజుని పక్షమునఁ జేరవచ్చునన్న శల్యుఁడు దుర్యోధనుని కుటిలనీతిలోఁబడి యాతని పక్షమునఁ జేరును. అతనిపక్షమున నుండియే తనకు తగుసమయమున సాయము చేయుమని కోరిన ధర్మజుని కుటిలనీతికి లోఁబడి కర్ణునకు ఉత్సాహభంగము గావించుట కంగీకరించును. పైకి కౌరవపక్షమందుండి లోలోన పాండవపక్షమునకుఁ దోడ్పడిన శల్యుని ధర్మరాజు స్వయముగ సంహరించెను. కర్ణమరణమునకుఁ గారకుఁడైన శల్యుని మరణమునుగుఱించి గాంధారి విలాపము ఉపచారమాత్రమే. మాటలందు మార్దవము, మనసునందు క్రౌర్యము – బహిరంతర్వర్తన విరోధరూపమైన కౌటిల్యమిచ్చట నిండియున్నది. శోకాతిభారమున విలంబితమైన గాంధారిహృదయగతి మిత్రద్రోహియైన శల్యునిఁజూచి యించుక రోషదీపితమై యారోహణభావము పొందినది. తామసమైన శోకమున రాజసమైన క్రోధము సంక్రమించి గాంధారి హృదయగతి మందమయ్యు దీప్తమైయుండెనని గుర్తింపవచ్చును. రజస్తమః ప్రధానమైన తత్త్వము వాతశ్లేష్మము. వాతశ్లేష్మనాడీగతిని గుఱించి బసవరాజీయ వర్ణనము—

"భుజగాదిగతిం నాడీం రాజహంసగతిం తథా" 1–56.

వాతనాడి 'వ్యాళీవ కుటిలా సదా' యని వర్ణింపఁబడినది. శల్యవిషయక కృతకశోకవ్యంజకమైన గాంధారి వాక్యము వ్యాళివలె కుటిలగతియైన భుజంగప్రయాతమున నిబంధింపఁబడి గత్యాశ్రితము, నామాశ్రితమునైన ఛందశ్శిల్పము నిర్వహింపఁబడినది.

## ఇంద్రవజ్ర

ఇది త్రిష్టుప్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 11 అక్షరములు. గణములు, త త జ గగ. 7 అక్షరములమీఁద యతి.

గురుబహుళమైన ఇంద్రవజ్ర విలంబితగతి.

"శిష్యాణా ముపదేశార్థే వృత్తి రిష్టా విలంబితా"

యనున్యాయమున ఉపదేశవాక్యమున వక్త యుచ్చారణగతి విలంబితముగా నుండవలెను. మహాభారతమున స్త్రీపర్వప్రథమాశ్వాసమునఁ దిక్కన రచించిన 29 వ పద్యమొక్కఁడే ఇంద్రవజ్ర. అది శోకాక్రాంతుఁడై యంతఃపరితాపపీడితుఁ డగుచున్న ధృతరాష్ట్రునకు జగదనిత్యత్వ వర్ణనాత్మకముగ వైరాగ్యము నుపదేశించు విదురుని వాక్యము.

"చింతాపరత్వంబునఁ జెందు దుఃఖా
క్రాంతత్వ ; ముర్వీశ్వర ! కానఁ గీడుం
జింతింపఁ డార్యాత్ముఁ ; డచింతనుండై
యంతఃపరీతాపము నార్పఁజాలుఁ"

శోకసంతాపోద్విగ్నమైన ధృతరాష్ట్రుని హృదయగతిని మందీకరించి యుపశాంతము గావించుటకు విదురుఁడు తన యుపదేశవాక్యమును విలంబితవృత్తితో నుచ్చరింపవలెను అట్టి విలంబితోచ్చారణమునకు వృత్తమునందలి యక్షరములు సహకరింపవలెను. అభినయమర్మజ్ఞుఁడైన కవి వాక్యార్థవ్యంజక వాచికాభినయమున వక్తకు సౌలభ్యము సమకూర్చు నక్షరవిన్యాసముగల వృత్తమును ఎన్నికచేయును. రసైకప్రవణుఁడైన తిక్కన యభినయమార్మికతకు ఆయన సర్వరచనయు నిదర్శనమగుట జగద్విఖ్యాతముకదా !

# ఉపేంద్రవజ్ర

ఇది త్రిష్టుప్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 11 అక్షరములు. గణములు : జ త జ గగ. 7 అక్షరములమీఁద యతి.

పదునొకండక్షరములలో ఐదు లఘువులుగల ఉపేంద్రవజ్ర మధ్యగతి. లఘ్వారంభమగుటచే ఆరోహణగతి. జగణబాహుళ్యమున ఉత్ప్లుతగతి.

మహాభారతమున స్త్రీపర్వ ప్రథమాశ్వాసమునఁ దిక్కన్న రచించిన 136 వ పద్యమొక్కఁడే ఉపేంద్రవజ్ర.

ధృతరాష్ట్రుని క్రోధమునకు ఆయసప్రతిరూపమును ఎరవైచి భీముని రక్షించుకొని యాయసప్రతిమాభంజనమునఁ గసిదీర్చికొంటినని లోలోన హర్షించు చీకురాజును అవహేళనచేయుచుఁ బలికిన శ్రీకృష్ణదేవుని వాక్యమును తిక్కన ఉపేంద్రవజ్రయందు నిబంధించెను.

"మరుత్తనూజుం బొరిమాన్పఁ జూచుచు
బరిస్ఫురత్ కోపనిబద్ధుఁడై యి
ద్ధరావిభుండం చిది తల్గనే సం
స్మరించి యీకోపు నమర్చికొంటిన్"

జగణముయొక్క ఉత్ప్లుతి యెత్తికూలవైచినట్లుండి యాక్షేపవ్యంజకమగునని వెనుక చెప్పఁబడినది. ఈ పద్యమున జగణప్లుతి అతిశయముగ భాసించుచుండుట స్పష్టము. ఉద్దిష్టకార్యసిద్ధిచేఁ గలిగిన శ్రీకృష్ణుని యుత్సాహము ఆరోహణగతియందు వ్యక్తమగుచున్నది "మరుత్" "స్ఫురత్" అను పదములందలి పరుషవ్యంజనశ్రుతి శ్రవణోద్వేగియై ధృతరాష్ట్రుని హఠాదుద్ధిత క్రోధాగ్నిస్ఫురణమును సుష్ఠుగా వ్యంజించుచున్నది. అంతియకాక మరుత్, స్ఫురత్ పదములు ప్రతిద్వంద్వభావమున భీమధృతరాష్ట్రస్థానీయతను భజించి పద్యార్థమును పత్యక్షకల్పము చేయుచున్నవి.

గురులఘ్వక్షర సంఖ్యాదృష్టిచే మధ్యగతియైనను ఈ యుపేంద్రవజ్ర ద్రుతగతిగా భాసించుచున్నది. మరుత్, స్ఫురత్ పదముల శత్రంతత్వ మా ద్రుతికిఁ గారణమని భావింపనగుచున్నది.

నిసర్గశ్లథబంధమైన వృత్తమును ఉత్తేజితము చేయుటకు క్షేమేంద్రుఁ డొక యుపాయమును దెలిపినాఁడు.

"శాలినీ శ్లథబంధైవ స్వభావేన విభావ్యతే
ఉత్తేజయేత్ తాం యత్నేన మందదీపశిఖా మివ॥" 2-10

"శత్రంతాక్షరసంయోగైః కించిత్ కార్కశ్యకారిభిః
అంతే విసర్జనీయైశ్చ శాలినీ యాతి దీప్తతాం॥" 2-11

ఒకశాలిని విషయమే కాదు. సర్వవృత్తముల విషయము నింతే. తిక్కన్న యీ మార్గమునే యవలంబించి మధ్యవృత్తియైన ఉపేంద్రవజ్రయందు కొంత ద్రుతత్వమును భాసింపఁజేసెను.

"ప్రయోగార్థే తు మధ్యమా"యని వాక్య ప్రయోగమున మధ్యవృత్తియైన యుచ్చారణము ఉచితమని చెప్పఁబడినది. వాక్యప్రయోగనిపుణుఁడైన శ్రీకృష్ణుని వచనమును మధ్యవృత్తియందే నిబంధించి కవిబ్రహ్మ యౌచిత్యమును పాటించెను.

నామాశ్రితమైన యౌచిత్యముగూడ ఈ వృత్తప్రయోగమున భావింపఁదగియున్నది. శ్రీకృష్ణుఁడు మాయోపాయనిపుణుఁడు. ప్రతిపక్షభంజనమునం దాయన ప్రయోగించు వజ్రాయుధము ఉపాయమే. ఆయన చక్రమునకైన తిరుగుకలదుకాని ఆయన యుపాయమునకుఁ దిరుగు

లేదనుట పురాణప్రసిద్ధము. ఉపేంద్రుని వజ్రాయుధము ఉపాయమేయన్న భావమును సూచించు తీరున తిక్కన శ్రీకృష్ణుని యుపాయవర్ణనమును ఉపేంద్రవజ్రయందు నిబంధించుట చమత్కార కారి యగుచున్నది.

## ఉ ప జా తి

ఇది త్రిష్టుప్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 11 అక్షరములు. గణములు : 1, 3 పాదములు – జ త జ గగ. 2, 4 పాదములు – త త జ గగ. 7 అక్షరములమీఁద యతి.

ఉపజాతి యను పదము మిశ్రవృత్తజాతికి సామాన్యవాచకము. ఇంద్రవజ్రోపేంద్రవజ్ర లయు, ఇంద్రవంశ వంశస్థలయు మిశ్రణమున నేర్పడినవానిని ఉపజాతులని సామాన్యముగ నందురు. కాని హేమచంద్రుఁడు కావ్యానుశాసన ద్వితీయాధ్యాయమున ఇంద్రవజ్రోపేంద్రవజ్రల లక్షణముచెప్పి

"ఏతయోః పరయోశ్చ సంకర ఉపజాతి శ్చతుర్దశధా" అని 156 వ సూత్రమునఁ జెప్పెను. దీనిపై లఘుటీక ;

"సర్వజాతీనాం ఉక్తాదీనాం ప్రాయో గాయత్ర్యాదీనాం ఇతఃపరాసాం జగత్యాదీనాం కృత నామాకృతనామ విసదృశ ప్రస్తారరూప స్వస్వపాదానాం స్వల్పభేదానాం సంకరః ఉపజాతి రితి బహుశ్రుతాః ప్రాహుః"

సర్వచ్ఛందములందును స్వస్థానపరస్థానములైన పాదముల సాంకర్యమున ఉపజాతి వృత్తము లనంతములు కల్పింపవచ్చును. సాంకర్యము అల్పభేదముగల పాదములకే చేయ వలెను. చంపకోత్పలములకు, శార్దూలమత్తేభములకు సాంకర్యము చేయవచ్చును.

మహాభారతమునఁ దిక్కన్నచే రచింపఁబడిన స్త్రీపర్వ ప్రథమాశ్వాసమందలి 64 వ పద్య మొక్కఁడే ఉపజాతివృత్తము. దీని ప్రథమ తృతీయపాదములు ఉపేంద్రవజ్రా సంబంధులు. ద్వితీయ చతుర్థపాదములు ఇంద్రవజ్రా సంబంధులు. ఇట్టి యుపజాతివృత్తమునకు విపరీతాఖ్యా నకి యని సంస్కృతలాక్షణికులు పేరిడియున్నారు.

ప్రథమ ద్వితీయపాదములు ఇంద్రవజ్ర, ద్వితీయ చతుర్థ పాదములు ఉపేంద్రవజ్రయైన యుపజాతివృత్తమును వారు ఆఖ్యానకి యనిరి. తిక్కన్న వ్రాసిన యుపజాతి విపరీతఖ్యానకి.

"మునీంద్ర నిర్భాగ్యత ముట్టి చావం
గానేరదయ్యెం ; గడుగట్టి చిత్తం

బనూన మూర్ఛం దెగటారియుం దా
రానేర్చె నిమ్మేనికిఁ గ్రమ్మఱంగ॥"

పుత్రశోకార్తి యుత్కటమై మూర్ఛిల్లి తెలిసి తన్నోదార్పవచ్చిన వ్యాసభగవానునకు దండనమస్కార మొనరించి యాయనతో ధృతరాష్ట్రుఁడు శోకదైన్య సంతాపములు వెళ్ళబోసికొనుచుఁ బలికిన వాక్యములం దిది యొకటి.

తోధదకవృత్తమున దైన్యమును, మంజుభాషిణీవృత్తమున శోకసంతాపమును వెల్లడించి ధృతరాష్ట్రుఁడు ఈ యుపజాతియందు పశ్చాత్తాపజనిత నిర్వేదమును వ్యక్తము చేయుచున్నాడు.

"తత్త్వజ్ఞానాపదీర్ష్యాదేః నిర్వేదః స్వావమాననం" 3-142

అని సాహిత్యదర్పణకారుఁడు. తత్త్వజ్ఞానజమైన నిర్వేదము స్థాయియనియు, అన్యము వ్యభిచారి యనియు పండితరాజు. ధృతరాష్ట్రుని స్థాయిచిత్తవృత్తి శోకము. ఈ నిర్వేదము వ్యభిచారి. "ఇంక నేమి సేయువాఁడ" నన్న ధృతరాష్ట్రుని వాక్యము ఆతని చిత్తమందలి "ఉపాయాభావ" జనితమైన విషాదమును సూచించుచున్నది.

ఉపేంద్రవజ్రాపాదములందలి జగణములనుగూడ వీలయినంతవఱకు పఱుగుపఱచి తిక్కన్న ఈ వృత్తమున అవరోహణాత్మకమైన విలంబితగతినే ప్రచురముగ భాసింపఁజేసెను. అనౌజస్యరూపమైన నిర్వేదమును వ్యక్తముచేయుటకు అవరోహియైన విలంబితగతి సమర్థమై యున్నది.

# జ ల ధ ర ము

అది అతిజగతీచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 13 అక్షరములు. గణములు : భ ర న భ గ. 9 అక్షరములమీఁద యతి.

ఆంధ్రలాక్షణికులు ఈ వృత్తమును జలదము అనిరి. సంస్కృతలాక్షణికు లెవ్వరును ఈ పేరుగాని, ఈ లక్షణముగాని కల్గిన వృత్తమును జెప్పినట్లు కనిపించదు. జలధరమనుపేర కవిజనాశ్రయుఁడు చెప్పిన వృత్తముయొక్క లక్షణము తిక్కన్న రచించిన లక్ష్యమునకు సరిపడదు. అది భ భ భ జ గగ గణములు, పదియక్షరములమీఁద యతి కలది. రేచనాదులు జలదమన్నదానినే తిక్కన్న జలధరమనెనని చెప్పవలసియున్నది.

జలదము ఉత్పలమాలాఖండమని కనఁబడుచునే యున్నది. వడియు ఉత్పలమాలకువలె 10వ అక్షరమే. ఉత్పలమాలపాదమును ఐదవగణము మొదటి యక్షరముమీఁద ఖండించినచో

జలధరవృత్తపాదము ఏర్పడును. ఉత్పలమాలాగతి యాంధ్రులకు చిరపరిచితము, ప్రియము నైనది. అట్టి యాంధ్రులచెవికి జలధరముయొక్క గతియందు వెలితి వెంటనే గోచరించును.

భారతమునఁ దిక్కన్న రచించినవే రెండు జలధరములు గలవు. ఒకటి స్త్రీపర్వ ప్రథమాశ్వాసమందలి 148 వ పద్యము.

"నీ పలుకెల్ల నిక్కమ యనింద్యగుణా !
యీ పురుషార్థహాని సుతు లీల్గుటకున్
దాపముఁబొంది తాల్మి దిగఁద్రావి మహా
కోపుఁడనైనఁ బాటిలె ; తగుఁ గినియన్"

ఇది ధృతరాష్ట్రి వాక్యము భీముని ఆయసప్రతిమను భంజించి ఆతనియందుఁ దనకుఁగల క్రోధమును బయటఁబెట్టికొని పెంగలియైన ధృతరాష్ట్రుని ప్రతిహింసాప్రవృత్తి యధర్మమని శ్రీకృష్ణుఁడు పలుతెఱంగుల నిరూపించి మందలింపఁగా ధృతరాష్ట్రుఁడు తన తప్పిదము నొప్పికొనుచు శ్రీకృష్ణునితోఁ బలికిన దీన వాక్యము. నలుగురలోఁ దన కుటిలబుద్ధి బయటఁబడినది. తాను నిందాభాజనుఁడైనాఁడు. తప్పనిసరియై ధృతరాష్ట్రుఁడు తన తప్పిదము నొప్పుకొనుచున్నాఁడు.

"అకార్యకరణజ్ఞాన గురువ్యతిక్రమ ప్రతిజ్ఞాభంగాదేః
చేతస్సంకోచః వ్రీడా" — కావ్యానుశాసనము

తన యకార్యకారణము తనకుఁ దెలిసిరాఁగా ధృతరాష్ట్రుఁడు తత్కాలమునఁ బొందిన భావము వ్రీడ. అది చిత్తసంకోచరూపము. శోకస్థాయికి అంగముగా జనించిన క్రోధమువల్ల అకార్యకరణము గావించి తజ్జన్యమైన వ్రీడవల్ల ధృతరాష్ట్రుఁడు చిత్తసంకోచము పొందినాఁడు. తన యపరాధమును అంగీకరింపకతీరక అనిష్టముగా నంగీకరించుచున్నాఁడు. త్రుంపులు త్రుంపులైన వాక్యములలో తన దోషమును అంగీకరించుచున్నాఁడా ! అనిపించునట్లుగా అసమాప్త సహజగతియగు జలధరవృత్తమున వాక్యమును బలుకుచున్నాఁడు.

'భ'గణ బహుళమైన జలధరము స్ఖలితగతి – అనఁగా అవరోహణగతి. వ్రీడచే దిగంబడుచున్న హృదయస్పందనమునకుఁ దగినది.

రెండవజలధరము స్త్రీపర్వప్రథమాశ్వాసమందలి 164 వ పద్యము. అది భీమసేనవాక్యము.

"ఆసభలోని కట్లు ద్రుపదాత్మజఁ దాఁ
గాసిగ నీడ్చి వల్వొలువఁగాఁ గినుకన్
జేసిన బాసకై పెదవిఁ జేర్చితి దు
శ్శాసను శోణితం ; బిది నిజం బరయన్."

దుర్యోధనాదులు క్రూరులుగనుక వారిని రణమునఁ జంపుట యుచితమేయైనను దుశ్శాసనుని శోణితము ద్రావుట "వృకవిధ మసురభంగి" యని తెగనాడిన గాంధారితోఁ దనచర్య కేవలము నటన యనియు, ప్రతిజ్ఞాపాలనార్థము అట్లు చేయవలసివచ్చినదనియు భీముఁడు సమాధానము చెప్పుచున్నాఁడు. ధృతరాష్ట్రుని భుజబలముకంటె గాంధారి తపోబలము కోటిమడుంగులు గొప్పదని భీముఁడెఱుంగును. ఆమె మాటలయందు కోపము కనిపించినంతనే అతఁడు భయకంపితుఁడైపోయెను. వినతుఁడై యామెకు సమాధానముచెప్పెను. దుర్యోధనుని యూరుభంజనమును ప్రతిజ్ఞానిర్వహణముపేర సమర్థించుకొనెను. సహేతుకమైన యా సమాధానమును గాంధారి యంగీకరించెను, అయినను ఆయమకు భీమునిపైఁ గోపము తీరలేదు. మరల నొక నేరము మోపినది. అది దుశ్శాసన రుధిరపానము. "అది వృకోదర ! వృకవిధ మసురభంగి" యన్న యామె మాటలయందలి పారుష్యమునకు భీముఁడు మరలఁ గంపించిపోయియుండును. తాను చెప్పఁబోవు సమాధానము ఆమెకు నచ్చునో లేదో ! శంకావితర్కభయసంకులమైన చిత్తముతో భీముఁడు రుధిరపానము ప్రతిజ్ఞాపాలనమునకై చేసిన యభినయమమాత్రమే యని చెప్పినాఁడు. బ్రహ్మాస్త్రమునకును బెదరని భీముఁడు గాంధారియెదుట గడగడలాడుచు పల్కినవాక్యము వికలగతియై త్రుంపులు త్రుంపులవలె నుండుట సహజము.

ఉత్పలమాలలే వ్రాయక ఈ రెండు సందర్భములందును తిక్కన యుత్పలమాలాఖండములను వ్రాయుట విశిష్టప్రయోజనాపేక్షచేతనే యని భావింపఁదగియున్నది.

# క్రౌంచపదము

ఇది సంకృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 24 అక్షరములు. గణములు : భ మ స భ న న న య. 10, 18 అక్షరములమీఁద యతులు.

జయకీర్తి దీనిని హంసపదము అనెను. హేమచంద్ర కేదారభట్టాదుల హంసపద దీనికంటె భిన్నము. ఆంధ్రలాక్షణికులు హంసపదను ప్రత్యేకము చెప్పినట్లు కనిపించదు.

జయకీర్తి హంసపదమునకు 5, 10, 18 అక్షరములమీఁద మూఁడు యతులు విధించెను. (ఛందోనుశాసనము : 2 - 255)

పింగళుఁడు మొదలు సంస్కృతచ్ఛాందసికు లందఱును క్రౌంచపదను జెప్పిరి. కాని యది అభికృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 25 అక్షరములు. 5, 10, 18 అక్షరములమీఁద యతులు. తెలుఁగు క్రౌంచపదముయొక్క ఉపాంతగురువు సంస్కృతక్రౌంచ పదయందు లఘుద్వయమైనది. రెండింటికి నిదియే భేదము. కన్నడులు సంస్కృత లక్షణమునే యవలంబించిరి.

సంస్కృత కన్నడ క్రౌంచపదముల యుత్తరఖండము కేవలము మణిగణనికరము. పూర్వఖండము మత్తావృత్తము. తెలుఁగు క్రౌంచపదమున ఉత్తరఖండము కొంచెము మారిన మణిగణనికరము ఉపాంతలఘుద్వయము గురువుగా మారినది.

మత్తా మణిగణనికరములు కలిసి క్రౌంచపదయగును. సంస్కృతమున 6 అక్షరముల మీఁద జెప్పఁబడిన విరతియందు ప్రాసమును కన్నడులు పాటించిరి. అది చూచియే కావలె జయకీర్తి తన లక్ష్యలక్షణాత్మక క్రౌంచపదయందు 6 అక్షరములపై ప్రాసమును పాటించెను. "క్రౌంచపదం భాత్ కించ మసౌ భ్నౌ త్రినగణగురు శరశర వసుయతయః'' అని జయకీర్తి లక్షణము, లక్ష్యము.[12] "క్రౌంచపదా భ్మౌ స్భౌ ననన న్గా ఇషు శర వసు ముని విరతి రిహభవేత్"[13] అన్న కేదారభట్టుగాని యితరులుగాని, జయకీర్తివలె ప్రాసమును పాటింపలేదు.

ఆంధ్రలాక్షణికులందు గణ, యతి నియమములందు ఏకాభిప్రాయమున్నను 6 అక్షరముల మీఁది ప్రాసమును అప్పకవి యొక్కఁడుమాత్రము ఒప్పలేదు. ఆ ప్రాసమును పాటించినచో సంస్కృతమునందువలె 6 అక్షరములమీఁదకూడ యతి పాటించినట్లే యగును.

కవిజనాశ్రయుని క్రౌంచపదలక్షణము గణ ప్రాస యతి నియమములందు సమగ్రమై యున్నది. స్థానత్రయమున యతిమైత్రి పాటింపఁబడుటచే కవిజనాశ్రయుని లక్షణమునుబట్టి వృత్తద్వయఘటితమైన క్రౌంచపదమునకు ఏకవృత్తత్వము సిద్ధించుచున్నది. తిక్కన్న క్రౌంచపదము కవిజనాశ్రయుని మార్గమునే అనువర్తించినది. ఉత్తరఖండమున వడిమైత్రియున్నను పాదాద్యక్షరముతో నుత్తరఖండాద్యక్షరము మైత్రిపొందని కారణమున నన్నెచోడని క్రౌంచపదమున రెండువృత్తములు నతుకుపెట్టినట్లే యున్నవి.

క్రౌంచపదమందలి ఖండములు రెండును పదునాఱేసి మాత్రలు గలవి. చతురస్రగతి గలవి. పూర్వఖండగతి గుర్వక్షర బాహుళ్యమున విలంబితము; ఉత్తరఖండమున గతి లఘ్వక్షర బాహుళ్యమున ద్రుతము. అత్యంత విలంబితము, అత్యంత ద్రుతమునైన అతివిరుద్ధగతులు క్రౌంచపదమున సంధింపఁబడినవి.

ఆంధ్రమహాభారతమున స్త్రీపర్వ ప్రథమాశ్వాసమునఁ దిక్కన్న వ్రాసిన 166 వ పద్యమొక్కఁడే క్రౌంచపదము.

> ''కౌరవసేనావీరులు లావుం గడిమియు జలమును గడక యెలర్పన్
> ధీరతసొంపుం గ్రూరతపెంపుం దెగువయు నెఱపఁగఁ దెరలక వీఁకన్
> బోరనఁ ద్రోవంగా రభసం బేపును గలితనమును బొలుపు వహింపన్
> వారు భయంబుం గూరుటకుం గావలసెను రుధిరము వదనము నేర్పన్''

ఇది గాంధారీ శాపభీతుఁడైన భీముని వాక్యము. గదాయిద్ధధర్మమును త్యజించి దుర్యోధనుని యూరువులు భంజించినందులకు గాంధారి కోపించి పలుకఁగా భీముఁడు భయకంపితుఁడై ప్రతిజ్ఞా పాలనమునకు ఆత్మరక్షణమునకుఁ దా నప్పుడట్లు చేయవలసివచ్చెనని చెప్పి యెట్లో ఆమె శాపమును దప్పించుకొనెను. ఆమె దుశ్శాసనుని వక్షోదారణము, రుధిరపానము, వృకవిధము, అసురభంగి యని చెప్పుచు భీముని "వృకోదర !" యని సక్రోధముగ సంబోధించెను. భీమునకు మరల భయ మయ్యెను. ప్రతిజ్ఞాపాలన ప్రాణత్రాణములే దీనికిని గారణములని భీముఁడు గాంధారికి సమా ధానము చెప్పుచున్నాఁడు. ప్రతిజ్ఞాపాలనమను దుర్బలహేతువును బెదరుబెదరుగా జలధరవృత్త మునవివేదించి ప్రాణరక్షణమను ప్రబలహేతువును క్రౌంచపదవృత్తమున వర్ణించుచున్నాఁడు.

కౌరవసేనావీరులు తనపైకి దుమికివచ్చుట, తాను భయకంపితుఁడై వారిని బెదరించుటకై రక్తమును వదనమునఁ జేర్చుట యన్న విరుద్ధాంశద్వయమును వ్యంజించుతీరున భీముఁడు విలం బతర, ద్రుతతర గతులచే ప్రతిభటములవలె భాసించు వాక్యఖండములతోఁ బలుకుచున్నాఁడు.

కౌరవసేనావిప్లుతిని తన్మూలకమైన భీమచిత్తవిద్రుతిని, భీమోన్మాదవిజృంభణమును తన్మూలకమైన కౌరవసేనా విద్రవమును ఈక్రౌంచపదము ప్రత్యక్షము చేయుచున్నది. సహజ ధీరుఁడయ్యు తత్కాలమున భయకంపితుఁడైన భీముని అస్థిరచిత్తావస్థకూడ ఈ క్రౌంచపదగతి యందు గుర్తింపఁదగియున్నది. క్షణక్షణ వివర్తమాన ధీరత్వ భీరుత్వ సన్నిపాత లక్షణవ్యంజ ముగా క్రౌంచపదము సంభావింపఁ దగియున్నది.

క్రౌంచపదవృత్తమున రెండుపాదములు గలిసి యొక ఆర్యాగీతి యగును. యతి ప్రాసాక్షర మైత్రిని చూచుకొన్నచో కందమే యగును. క్రౌంచపదపాదద్వయము నియతాక్షరమైన యార్యా గీతియని దీనిభావము.

## భాస్కరవిలసితము

ఇది అభికృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 25 అక్షరములు. గణములు : భ స జ య భ న న స గ. 12 అక్షరములమీఁద యతి.

సంస్కృతలాక్షణికు లీవృత్తమును జెప్పినట్లు కనిపించదు క్రౌంచపదమువలె నిదియు రెండు లఘువృత్తముల సంధానమున నేర్పడినట్లు తోఁచును. భసజయ, భననసగ యనుతీరున శ్రుతిసుభగములయిన రెండులఘువృత్తములు దీనియందు లక్షింపఁదగియున్నవి సంస్కృ తాంధ్రలాక్షణికు లెవ్వరును వీనినిఁ జెప్పకుండుట వింతగా నున్నది. భననసగ యనువృత్తము హరవిజయమను సంస్కృతకావ్యమున నుపయోగింపఁబడినట్లు H. D. Valankar వ్రాసినారు.

ఖండమునకు పదునాఱేసి మాత్రలుగలిగి భాస్కరవిలసితము చతురస్రగతిని నడచును. రెండుపాదములు కలిసినచో నిదియు ఆర్యాగీతి యగును.

పూర్వఖండమున 4, ఉత్తరఖండమున 3 గుర్వక్షరములుగల యీవృత్తపాదము ఉభయ ఖండములందును ద్రుత, ద్రుతతరగతుల గలది. భయశోకాది సంతాపకరభావముల యుత్కటావస్థకు ఇట్టిగతి యుచితము.

ఆంధ్రమహాభారతమున భాస్కరవిలసితవృత్త మొక్కఁడేకలదు. అది స్త్రీపర్వద్వితీయాశ్వాసమునందలి 50 వ పద్యము.

"కౌరవనృపతి తనూజశతంబుఁ గంటె పవనసుతు పటుభుజలీలా
ఘోరతఁ దడబడ మేదినిమీఁదం గూలె; వికటముఖ కరచరణత్వం
బేరికయిన గనుగొన్న విషాదం బెంతయు మది నొలయఁగ
ప్రియకాంతల్
చేరి విలపనము దద్దయు నార్తిం జేయఁగ నునికి వనట తిరిఁబెట్టుఁ"

దుర్యోధనుని శవమును దిలకించి శోకతప్తయై యనేకభంగుల విలాపంబుచేసి తక్కటి తనయుల దెస నాలోకించి విష్ణుదేవునితో గాంధారి పలికిన వాక్యమిది. దుర్యోధనునకై యనేకభంగుల విలపించి యించుక యుపశమించిన గాంధారిహృదయము తక్కటిపుత్రులఁ దిలకించినంతనే పునరుద్దీపితశోకతాపంబున మరల ద్రుతగతి యగుట యీవృత్తగతియందు గుర్తింపవచ్చును.

''ఏరికైనఁ గనుగొన్న విషాదము" గలిగించు దృశ్యము వర్ణించు నీవృత్తము విషాద భావవ్యంజకము కావలెను.

"మానసో వివిధ స్పాదః విషాదః" అని భావప్రకాశనము [14] మనస్సు వివిధముగఁ జలించుటయే విషాదము. గురువులు, లఘువులు నందందుఁ బ్రోవులువడియున్న యీవృత్తగతి చంచలమై యుండుటచే విషాదవ్యంజనమున సమర్థమై యున్నదనియే చెప్పవలెను. "తిరివెట్టుట" యనఁగా సుడివెట్టుట, చిత్తభ్రమణము. చంచలగతియైన వృత్తము చిత్తభ్రమణవ్యంజకమే. ఈవృత్తమునఁగూడ పూర్వఖండమున ఏడక్షరములపై ప్రాసయతివి పాటించియుండిన గతి హృద్యతరమై యుండెడిది.

# సరసిజము

ఇది సంకృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 24 అక్షరములు. గణములు : మ త య న న న న స. 9, 17 అక్షరములమీఁద యతులు.

సంస్కృతలాక్షణికు లెవ్వరు నీవృత్తమును జెప్పినట్లు కనఁబడదు. క్రౌంచపదమునందు వలె దీనియందును ఉత్తరఖండము మణిగణనికరమే. క్రౌంచపదపూర్వఖండము మత్తావృత్తము కాగా సరసిజపూర్వఖండము సుందరలేఖావృత్తము. సుందరలేఖావృత్తము ''మాత్ త్యౌ స్తశ్చేత్ సుందరలేఖా'' (2–74) అని జయకీర్తిచేత మాత్రమే లక్షింపఁబడినది. తెలుఁగులాక్షణికు లెవ్వరును దీనినిఁ జెప్పలేదు.

క్రౌంచపదమునందువలె దీనియందును పూర్వఖండమున నాల్గక్షరములమీఁద ప్రాసయతి పాటింపఁబడినది. కవిజనాశ్రయుఁడాదిగా ఆంధ్రలాక్షణికులెల్లరును నీలక్షణము చెప్పకున్నను లక్ష్యములందు పాటించియేయున్నారు. క్రౌంచపదపాదమందలి ద్వితీయతృతీయాక్షరములు లఘువులు. ఈ రెండునుగలిసి సరసిజమున నొక్కగురువైనవి. క్రౌంచపదమందలి ఉత్తరఖండో పాంతగురువు సరసిజమున రెండులఘువులై యాఖండము శుద్ధమైన మణిగణనికరమైనది.

ఆంధ్రమహాభారతమున సరసిజవృత్తము తిక్కనకృతమైనది యొక్కఁడే కలదు. అది స్త్రీపర్వద్వితీయాశ్వాసమందలి 37 వ పద్యము.

> ''శ్రీరమ్యత్వం బారఁగఁ బెం పూర్జితముగ మణివిరచిత మకుటములుం
> దారుం జూడన్ సారవిభూతిన్ ధరణిపు లనిమిషధవ నిభు లగుచున్
> భూరిప్రీతిన్ సూరెలఁ గొల్వన్ భువనవినుతమగు పొలుపువెలయ ను
> న్నీరాజుండున్; దారుణదైవం బిటు వఱచునె తుది నితనిఁ గటకటా!''

ఇది గాంధారీవాక్యము. శ్రీరమ్యత్వంబారఁగఁ బెంపూర్జితమైన దుర్యోధనచక్రవర్తి భూత పూర్వవైభవమును స్మరించు గాంధారి మందధీరోదాత్త చిత్తస్పందములు, ఆ చక్రవర్తి వర్తమానశోచనీయావస్థను దిలకించు ఆమె చిత్తస్పందద్రుతియు వృత్తముయొక్క పూర్వోత్తర ఖండములందు సుష్ఠుగా భాసించుచున్నవి. దుర్యోధనచక్రవర్తి స్థితివిపర్యయమును వర్ణించుటకు కవిబ్రహ్మ గతివిపర్యయముగల వృత్తమును ఎన్నికచేయుట వృత్తప్రయోగౌచిత్యపరిజ్ఞానమునకు నికషాయమానముగ నున్నది.

''మణివిరచిత మకుటము''లన్న పదము ఉత్తరఖండమైన మణిగణనికరనామమునందలి యేకదేశమును ముద్రించి ముద్రాలంకారమును ధ్వనించుచున్నది. వృత్తపాదము సగమువఱకుఁ గల గతిగౌరవము ఆకస్మికముగ లాఘవముపొంది గతిపతనమున కటకటా యనిపించుచున్నది.

సరసిజమునందును పాదద్వయముకలిసి యార్యాగీతియగుట గుర్తింపఁదగును.

# అంబురుహము

ఇది కృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 20 అక్షరములు. గణములు: భ భ భ భ ర స లగ. 12 అక్షరములమీఁద యతి.

సంస్కృత లాక్షణికులలో నీవృత్తమును జెప్పినవారిద్దరే. అందు జయకీర్తి భాసురమనియు, హేమచంద్రుఁడు నందకమనియు దీనినిఁ బేర్కొనియున్నారు.

ఇది మానినిపూర్వఖండమును, మత్తకోకిలయుత్తరఖండమును నతుకఁగా నేర్పడినది. పూర్వఖండమున చతురస్రగతియు, నుత్తరఖండమున మిశ్రగతియుఁ గలది.

ఆంధ్రమహాభారతమున రెండు అంబురుహవృత్తములు గలవు. అందు ఒకటి నన్నయ్య సభాపర్వప్రథమాశ్వాసాంతమున రాజరాజనరేంద్రుని సంబోధించినది. రెండవది స్త్రీపర్వప్రథమాశ్వాసమునఁ దిక్కన రచించిన 177 వ పద్యము.

"పెద్దయుఁగాలము వారలఁ జూడఁగఁ బ్రేముడించుచు దుర్భరా
పద్దశ నొందుట నమ్మహితాత్మల పట్టులందఱు ద్రుంగుటన్
దద్దయు శోకమునం బొరి నశ్రుల ధారలొల్కఁ వగర్పుతో
సద్దురవస్థతెఱంగు గనుంగొని యంతకంపెను నార్తులై"

"కుంతీదర్శనంబు సేయరన్నా" యన్న గాంధారిపనుపునఁ దన దెసకు వచ్చుచున్న కొడుకులం జూచుచు కుంతిపడిన యవస్థ నీపద్యము వర్ణించుచున్నది. కుంతి చిత్తమున విజయాన్వితులైన పుత్రుల సందర్శనమునఁ బ్రీతియు, వారిపట్టులందఱును ద్రుంగిరికదా యన్న శోకమును మిశ్రితములయి యున్నవి. పుత్రులతోడి చిరసమాగమజనితమైన యానందము చివరకు తత్పుత్రశోకస్మరణజనితదుఃఖముతో మిశ్రితమగుట వృత్తగతియందు స్ఫుటముగ భాసించుచున్నది.

పూర్వఖండమంతయు చతురస్రగతియందు నడచినది. ఉత్తరఖండాదియందు దానిలో త్ర్యస్రగతి కలిసినది. చతురస్రగతి మధ్యమము, త్ర్యస్రము ద్రుతము. మిశ్రభావమున మిశ్రగతి యుచితము. "వగర్పు" "తెఱంగు" "కనుంగొని" యను పదములయందు స్ఫురించు జగణప్లుతి మధురమైన చిత్తవృత్తియందు శోకోద్దీప్తిసంక్రమణమును సూచించుచున్నది. దుఃఖము వలన కన్నీరుగార్చుచు కుంతీదేవి వగర్చుట (వెక్కుట) జగణస్ఫూర్తియందు వ్యక్తమగుచున్నది.

## లయవిభాతి

ఇది ఉద్ధురమాలావృత్తము. పాదమునకు 34 అక్షరములు. గణములు: స స స స స స స స స 9, 18, 27 అక్షరములమీఁద యతులు.

దీనిని సంస్కృతలాక్షణికు లెవ్వరును జెప్పినట్లు కనఁబడదు. పంచమాత్రాకములైన యావృత్తులతో ఖండగతియందు తాలలయాన్వితముగ నడచు నీవృత్తమునకు త్రికములలో లక్షణముచెప్పుట సమంజసముకాదు. ఆ త్రికములగతి ననుసరించినచో దీని యందలి లయ భాసించదు.

నలల, భల । నలల, భల । నలల, భల । నలల, గగ

అనుతీరున నీవృత్తము నడచును. ఇట్టిగతిగల రగడ ద్విరదగతి యనఁబడును. లయవిభాతి పాదము చివర ఒక్కమాత్ర చేరినచో విజయభద్రరగడ యగును. 34 అక్షరములలో ఐదే గురువులగుటచే అక్షరాశ్రితమైన యీవృత్తిగతి యత్యంతద్రుతమని స్ఫుటము. కాని పంచ మాత్రాకములయిన యావృత్తులతో తాలప్రమాణమున నడుచు దీనియందలి తాలాశ్రితమైనలయ విలంబితమే. ఆవృత్తులన్నియు గుర్వక్షరములతో నారంభించు లయగ్రాహిగతియందు ఆవరోహణపూర్వకమైన ద్రుతిభాసించును. లయవిభాతియం దది యంతగా భాసింపదు. పైగా పద స్వరూపవశమున ఆరోహణముభాసించు నవకాశముకూడ కలదు. కనుక లయగ్రాహి శోక ద్రుతికి, లయవిభాతి యుత్సాహద్రుతికిఁ దగియుండునని భావింపవచ్చును.

భారతమున లయవిభాతులు రెండు కలవు. రెండును తిక్కన రచనలే. ఒకటి స్త్రీపర్వ ప్రథమాశ్వాసమందలి 131 వ పద్యము.

"పెరుగఁగ నిజాంగములు సరభస పరిస్ఫురణ
మరుదుగ, జనావలులు నిరుపమవిధం బి
న్నరపతి బలంబసఁగఁ గరయుగము తోలవియ
నురము సదియం, బెలుచఁ దొరఁగఁగఁ బొరిన్ నె
త్తురులు ముఖరంధ్రములఁ బరవశత మానసము
బొరయుటకుఁ జొచ్చియును సరిగొనఁగఁ గంటిన్
వరసుతున కిప్పుడను పరమ పదవిన్ మగుడఁ
గురునృపతి యాప్రతిమఁ బొరి నిటులు పుచ్చెన్"

"దశసహస్రసామజసమానబలుండగు నయ్యంధనృపతి గంధవహనందన ప్రతిరూపంబు భగ్నంబు సేసి పెంపున నిర్భరహర్షంబునొంది"న తెలుంగు నీలయవిభాతి వర్ణించుచున్నది. క్రోధోత్క-

టము, హర్షనిర్భరమునైన ధృతరాష్ట్రుని హృదయగతి యొక్క త్వరవృత్తగతియందు చక్కఁగా వ్యక్తమగుచున్నది. క్రూరోత్సాహరూపమైన క్రోధము హృదయమును సత్వరముచేయును. రౌద్రకర్మనిర్వహణోద్భూతమైన హర్షముకూడ అట్టిదే. క్రోధముచే జ్వలితము, హర్షముచే లఘువునైన హృదయగతి యతిత్వరాన్వితమగుట సహజము. వాక్యార్థమువలెనే వాక్యమందలి యక్షరవృత్తియు శ్రోతహృదయమును దడదడలాడించునట్లున్నది. నిజాంగ"ములు "పరిస్ఫురణ" "జనావలులు" అను పదములందు జగణము భాసించి, ధృతరాష్ట్రుని హృదయము యొక్క ఉత్సాహోత్ప్లుతిని వ్యక్తముచేయుచున్నది.

రెండవ లయవిభాతి స్త్రీపర్వద్వితీయాశ్వాసమందలి 73 వ పద్యము—

"అరయ నిది పెద్దయని పరులమొనఁ జిత్తమున
సరకుగొన కుగ్రమగు బరవస మెలర్పన్
ద్వరితగతిఁ జొచ్చి కురువరుఁడు దలరన్ గవిసి
కరితతులు, దేరుల నికరములు దురంగో
త్కరములును గాల్బలము నెరవులును గీటడఁగ
శరగురుఁడు గర్ణుఁడును గురుసతుఁడు మద్రే
శ్వరుఁడు గృపుడుం బరవఁ బరగి దివిజుల్ వొగడ
ధరఁబడి ముకుంద ! మన నరతనయుఁ డొప్పెఁ"

డప్పిగూర్చి నిదురవోయినవానివలెఁ జెలువమింతయుఁ దొలఁగక రణస్థలిఁ బడియున్న యభిమన్యుకుమారుని దిలకించి యాతని లోకోత్తరపరాక్రమమును వర్ణించుచు గాంధారి విలపించుచున్నది. కురుక్షేత్రమున మృతులైనవారిలో అభిమన్యునకు విలక్షణమైన ప్రాధాన్యమున్నది. అతని పద్మవ్యూహభేదనవృత్తాంతము యుద్ధపర్వములందలి సర్వవీరకృత్యములకును కిరీటము వంటిది. గాంధారి యావృత్తాంతమునే ఈవృత్తమున స్మరించి యభివర్ణించుచున్నది. ఉదాత్తమైన వస్తువును వర్ణించుటకు ఉదాత్తమైన వృత్తము ఉపయోగింపఁబడినది.

ఆత్మదోష మావంతయులేక పరులద్రోహమునకుగురియై కౌరవుల యధర్మయుద్ధమునకుఁ బ్రత్యక్షనిదర్శనమై పడియున్న యభిమన్యునిఁ దిలకించి గాంధారిహృదయము కరుణాతురమై విద్రుతమగుట "రలమన" వ్యంజనసహితమైన ద్రుతగతియందు గుర్తింపవచ్చును.

# లయగ్రాహి

ఇది ఉద్ధురమాలావృత్తము. పాదమునకు 30 అక్షరములు. గణములు : భ జ స న భ జ స న భ య. 8, 16, 24 అక్షరముల మీఁద ప్రాసయతులు.

సంస్కృతలాక్షణికులలో దీనిని హేమచంద్రుఁడు వృత్తలలితము (2-383) అనియు, జయకీర్తి వృత్తలలితము లేక లలితవృత్తము (2-271) అనియు పేర్కొనియున్నారు.

"వృత్తలలితం లలితవృత్తమపి సుందర ల
యాత్తవరనం భ జ స నా భ జ స నా భ్యౌ"

అను జయకీర్తి లక్ష్యలక్షణపద్యము ఆంధ్రలాక్షణికులు చెప్పిన ప్రాసయతి నియమమునుగూడ చాలవఱకు పాటించుచున్నది. లయగ్రాహియందు "విరామములు చెందవుసుమీ" యని చిత్రకవి పెద్దనయు, "అందముగఁ బ్రాసములు గ్రందుకొను" నని యనంతామాత్యుఁడును జెప్పియున్నారు. యతిస్థానమునఁ బ్రాసయతిని పాటించుట ఆంధ్రులవిశిష్టలక్షణము కనుక లయగ్రాహి దేశీయమైన ఛందమే. మాత్రాప్రమాణమున తాలలయాన్వితముగ నడచు దీనికి త్రికములతో లక్షణము జెప్పుట యసమంజసము.

భల భల భల భల భల భల భల గగ

యనుతీరున పాదమును విభజించుట లయానుగుణముగ నుండును. పంచమాత్రాకములైన యావృత్తులతో నడచుటచే దీనియందలి లయవిలంబితము. దీర్ఘాక్షరానంతర హ్రస్వాక్షర నివేశనమువల్ల దీనిగతి యవరోహి, లఘుబాహుళ్యమున ద్రుతము. స్ఫుటతాలలయాన్వితమైన యీ వృత్తమును లయగ్రాహియనుట యుచితముగనున్నది. ద్రుతావరోహణమున మధురలలితగతియైన దీనిని వృత్తలలితము, లలితవృత్తము అనుటయు సరసముగనున్నది.

ఆంధ్రమహాభారతమున నన్నయవి మూఁడు, తిక్కన్నవి నాల్గు, ఎఱ్ఱన్నది యొక్కఁడు మొత్త మెనిమిది లయగ్రాహులున్నవి. తిక్కన్న లయగ్రాహులను గుఱించి స్థలాంతరమునఁ జర్చింపఁబడినది. (చూ. ఛందస్సంవాదము). నన్నయ్య రచించిన మూడింటిలో నొకటి ధౌమ్యుఁడు గావించిన సూర్యస్తవమునందు, రెండు వసంతర్తువర్ణనమునందు వినియుక్తములైనవి. దేవతాదిస్తుతులయందు తాలలయాన్వితమైన లయగ్రాహి చిత్తైకాగ్రతాసంపాదకమై మిక్కిలియుచితముగనుండును. విస్తృతమైనవృత్తము లలితవృత్తగతిచే హృదయమున లలితగతి నాధానముచేసి ధ్యేతృధ్యేయలయసంపాదకము కాఁగలదని భావింపఁదగియున్నది.

(చూ. అరణ్య. 1-40)

శృంగారాదిమధురరసముల యభివ్యక్తికి సహకరించు తటస్థవిభావముల వర్ణనమునందును లయగ్రాహి సర్వథా సమర్థమే యని నన్నయ్యప్రయోగము నిరూపించుచున్నది.

(చూ. ఆది. v. 138, 139)

వసంతావిర్భావమున మధుపముల సుగీతనినదమ్ములు, కోకిలకులమ్ముల రవమ్ములు, మధురమ్ములై వ్యాపింపఁగా విస్తారరమణీయమైన శతశృంగపర్వతారణ్యమును నన్నయ లయగ్రాహియందు వర్ణించెను. చందనతమాలతరులందు, కదళీవనములందు, అనిమీలదరవిందములందు, సందళితపుష్పమకరందములందుఁ దగులుచు నమందగతి వీచు మందలయానిలయమును నన్నయ్య మరియొక లయగ్రాహియందు వర్ణించెను. "మందమలయానిల మమందగతి" వీచుట విలంబితలయాన్వితమైన లయగ్రాహి ద్రుతతావరోహణగతియందు నడచుటవంటిదే.

ఘోరతపోనిష్ఠుఁడై యున్న పాండురాజు చిత్తమున రత్యావిర్భావము అంతంతమాత్రమునఁ గాదు. ఆలంబన ఉద్దీపనసామగ్రియేకాక తటస్థసామగ్రియు సమ్మోహనదక్షము కావలసియున్నది. నన్నయ్య యట్టిసామగ్రిని సమకూర్చు యత్నమునకు అంగముగా నీ లయగ్రాహి వృత్తమును స్వీకరించెను. తటస్థవిభావవర్ణనమున నన్నయ్య యిట్టి ఛందశ్శిల్పము నవలంబించుట దుష్యంతచరిత్రమునఁగూడ గుర్తింపవచ్చును.

అరణ్యపర్వసప్తమాశ్వాసమున ఎఱ్ఱన్న రచించిన 76 వ పద్యము లయగ్రాహి. ఈవృత్తము రావణప్రబోధితుఁడై కుంభకర్ణుఁడు రామలక్ష్మణులతో యుద్ధముచేయఁబోవుటను వర్ణించుచున్నది. "ఉదార భుజసారణ విదూరిత దిగంతుఁడు", "పదభార వినమద్భూభారు డు" నగు కుంభకర్ణుని ఆయతభుజములను, గురుచరణములకు స్వరూపమాత్రముచే రూపెంచుటకు లయగ్రాహి సమర్థమే యనవచ్చును.

# వ స ం త తి ల క ము

ఇది శక్వరీచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 14 అక్షరములు. గణములు ; త భ జ జ గగ. 7 అక్షరములమీఁద యతి.

ఇది సింహోన్నత, సింహోద్ధత, ఉద్ధర్షిణి, మధుమాధవి, శోభావతి, కర్ణోత్పల మున్నగు నానానామములచే వ్యవహరింపఁబడినది. సంస్కృతలాక్షణికులు దీనికి పాదాంతయతినే భావించి నట్లు తోఁచును.

14 అక్షరములలో సగము గురువులు, సగము లఘువులునైన వసంతతిలకము మధ్యగతి కావలయును. కాని ఆద్యంతముల గుర్వక్షరసమావేశ ముండుటచే పాదమున విలంబితాందోళిత

గతి భాసించును. పదవ్యవస్థావశమున జగణములు నిరాకృతములైనచో అవరోహణ మతిశయముగ భాసించును జగణములు ఆకృతములయినచో ఆరోహణము అతిశయించును.

వసంతతిలకావృత్త వినియోగౌచిత్యమును గుఱించి ప్రాచీనుల యభిప్రాయములు భిన్నములుగ, విరుద్ధములుగ నున్నవి.

"నాయికావర్ణనే కార్యం వసంతతిలకాదికం" అని[15] కాత్యాయనుఁడు చెప్పెనని యభినవగుప్తపాదు లుదాహరించిరి. భరతముని లక్ష్యము శృంగారనాయికనే వర్ణించుచున్నది.[16]

"వీరే వసంతతిలకాదయః" — భోజమహారాజు.[17]

"వసంతతిలకం భాతి సంకరే వీరరౌద్రయోః" — క్షేమేంద్రుఁడు.[18]

"మధురాయాం యావదార్యా
మాలతీ చ ప్రహర్షిణీ
మంజుభాషిణ్యపి జ్ఞేయా
వసంతతిలకా తథా" — అచ్యుతరాయలు

సాహిత్యసార 7-158.

భారతకవుల యభిప్రాయము వీనికి భిన్నముగా నున్నది. ఆంధ్రభారతమున నన్నయ్యవి మూఁడు, తిక్కన్న దొక్కటి మొత్తము నాల్గు వసంతతిలకావృత్తము లున్నవి. నన్నయ్య వ్రాసిన మూఁడింటిలో రెండు రాజరాజును సంబోధించుటకు ఆదిపర్వ ద్వితీయాశ్వాసాంతమునం దొకటియు, ఆరణ్యపర్వతృతీయాశ్వాసాంతమునం దొకటియు నుపయుక్తములయినవి. మూఁడవది ఆదిపర్వ పంచమాశ్వాసమందలి 29 వ పద్యము.

"ఈ బాలు నెత్తుకొని యింటికిఁ జన్న నన్నున్
నా బంధు లందఱు మనంబున నే మనారె
ట్లీబాలు సూర్యనిభు నిచ్చట డించిపోవం
గా బుద్ధిపుట్టు ? నని కన్య మనంబులోనన్"

కన్యాసహజమైన చాపల్యమున ప్రార్థింపఁగా ప్రత్యక్షమైన సూర్యుని ప్రసాదమునఁ, దనకు సద్యోజాతుఁడైన పుత్రుని బంధుభీతిచే నింటికిఁ దీసికొనిపోఁజాలకయు, సూర్యసమతేజుఁడైన యా పసికందును అచ్చట డించిపోఁజాలకయు కుంతి వందురి వగచుట నన్నయ్య వసంతతిలకమున వర్ణించెను. పెక్కు జగణములు పిహితములైనను స్వస్థానమున బలముగా నిల్చిన

రెండు జగణములు జనాపవాదభీతి, పుత్రఘాతభీతి కుంతీ హృదయమును చకితముగావించినతీరును బట్టి యిచ్చుచున్నవి. జగణద్వయకల్పితమైన యారోహణముచే వృత్తమునఁ గొంత దోలాగతి భాసించి కుంతీదేవి యప్రాప్తనిశ్చయమైన చిత్తస్థితిని వ్యక్తము చేయుచున్నది.

తిక్కన రచించిన వసంతతిలకావృత్తము స్త్రీపర్వ ప్రథమాశ్వాసమందలి 10 వ పద్యము.

"హా పుత్రవర్గ మిటు లారడిఁబోవ దీప్త
వ్యాపార మేది మది వందుచు దీనవృత్తిన్
బ్రాపించి యన్యు లకృపన్ బరికింప నింకే
నోపన్ భవం బెడలియుండఁగ జీవితోదన్"

విపులార్తిఁగూరి, ధృతిదూలి, ధరణింగూలి, తలదోర్చుకొనుచు ధృతరాష్ట్రుఁడు సంజయునితోఁ బలికిన వాక్యమిది దీప్తవ్యాపారమేదుట యనఁగా ఓజోనాశము పొందుట. (ఓజో దీప్తాబలే[19]) దీనవృత్తిన్ బ్రాపించుట యనఁగా ఆలస్యరూపమైన మాంద్యమును పొందుట. ఓజో విపర్యయము అవరోహణము, మాంద్యము విలంబనము. జగణతిరోధానమున వసంతతిలకము నిస్తేజమై మందగళితగతియగును. తిక్కన్న జగణములను నిరాకరించి యీ వసంతతిలకమున అవరోహియైన విలంబితగతిని భాసింపఁజేసెను. ధృతరాష్ట్రుఁడు చింతాలసుఁడై తలవాల్చుకొనుచు బలికిన యీ వాక్యముయొక్క గతి యలసము, గళితము నగుట నైజము.

వసంతతిలక నిర్మాణమందలి మర్మములను క్షేమేంద్రమహాకవి యిట్లు వివరించెను.

"వసంతతిలకాస్యాగ్రే సాకారే ప్రథమాక్షరే
ఓజసా జాయతే కాంతిః సవికాసవిలాసినీ" 2-20

"ఆకారేపి కృతే పూర్వం బంధే ఉల్పపదపేశలే
వసంతతిలకం ధత్తే నిర్గ్రంధి రమణీయతాం" 2-21

వసంతతిలకముయొక్క ప్రథమాక్షరము ఆకారమై బంధము సమాసభూయిష్ఠమైనచో (ఓజ స్సమాసభూయస్త్వం) కాంతియనుగుణము చక్కఁగా వికాసముపొంది యందగించును.

ప్రథమాక్షరము ఆకారమేయైనను లఘుసుకుమారపదములచే గ్రంధిరహితమైన వసంత తిలకము మాధుర్యగుణమును పొందును. (మాధుర్యం రమణీయతా)[20]

నన్నయ్య తిక్కనలు వసంతతిలకమునందు ఓజస్సును భంజించి మాధుర్యమును వ్యంజించుటకు ఈ మర్మములనే కాక మర్మాంతరములనుగూడ ఆశ్రయించిరని గుర్తించితిమి.

# మా ని ని

ఇది ఆకృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 22 అక్షరములు. గణములు : భ భ భ భ భ భ భ గ. 12 అక్షరములమీఁద యతి. 6, 12, 18 అక్షరములమీఁద యతులు.

సంస్కృతలాక్షణికులు దీనిని మదిర, లతాకుసుమ, సంగత నామముల వ్యవహరించి యున్నారు. నియతగతియగుటచేతఁ గావలె వారు యతినిర్దేశము ప్రత్యేకముగఁ జేయలేదు.

మానినియందు నన్నయ 12 అక్షరములమీఁద నొక్కయతినే పాటించెను. నన్నెచోడఁడును అట్లేచేసెను. తిక్కన తాను వ్రాసిన మూఁడు మానినీవృత్తములలో రెండింటియందు ఒక్క యతినే పాటించెను. మూఁడవ దానియందు 6, 12, 18 అక్షరములమీఁద మూఁడు యతులు పాటించెను.

కవిజనాశ్రయమునందలి లక్షణము 12 మీఁద నొక్కయతినే చెప్పుచున్నను లక్ష్యమున 6, 12, 18 మీఁద మూఁడుయతులు పాటింపఁబడియున్నవి.

"కారకముల్ క్రియ గన్గొన నేడు భ
కారము లొక్కగ గకారముతో
గారవమై చనగా యతి పంద్రెటః
గల్గిన మానిని కామినిభా !" కవిజనాశ్రయము.

అనంతుఁడు ;

"చెన్నుగ నద్రిభ సేవ్యగురు ల్విల
సిల్లు రసత్రయ చిత్రయతుల్
పన్నుగ నొందఁ బ్రభాసుర విశ్రమ
భంగిగ మానిని భవ్యమగున్"

"ప్రభాసురవిశ్రమ" అన్న మాటను ప్రభాకరవిశ్రమమని గ్రహించినచో 12మీఁద యతి నియత మనియు, 6, 18మీఁది యతులు పై చిత్రమాత్రములనియు అనంతుని యభిప్రాయముగా గ్రహింప వచ్చును.

చిత్రకవి పెద్దన —

ఏడ్పగురుల్ రవినేని రసత్రయి
నే న్వడి మానిని కెట్లిడనౌ

అని మానినియందలి యతిసంఖ్య పైకల్పికమని స్పష్టముచేసెను. వైచిత్రీసంపాదనార్థముగాని ప్రయోజనాంతరాపేక్షచేఁగాని కవి యతిత్రయమును స్వేచ్ఛానురోధముగఁ బాటింపవచ్చును. లేదా మానవచ్చును.

భారతమున నన్నయ్యవి రెండు, తిక్కనవి మూఁడు మొత్తము ఐదు మానినీవృత్తములు గలవు. ఆదిపర్వ చతుర్థాశ్వాసమందలి 20 వ పద్యము మానిని —

"ఏచి తనర్చి చలిర్చిన క్రోవుల నిమ్మగుతావుల జొంపములం
బూచిన మంచి యశోకములన్ సుర పొన్నలఁ బొన్నల గేదగులం
గాచి పెడంగుగఁ బండిన యా సహకారములం గదళీతతులం
జూచుచు వీనుల కింపెసఁగన్ వినుచున్ శుకకోకిలసుస్వరముల్"

మాలినీనదీతీరమున, కణ్వాశ్రమోపాంతమున దుష్యంతమహారాజునకు స్వాగతిపచరించిన నందనచైత్రరథసమానమైన వనమును వర్ణించుచున్న వృత్తమిది. మృగయాఖేదమున నలసి యున్న దుష్యంతునకు తాపాపనోదనముగావించి మంగళస్వాగతపూర్వకముగ నృత్తగీతముల చిత్తరంజనము సలుపుచున్న యావనము భావిశకుంతలా దుష్యంతపరిణయమునకు పెండ్లి పందిరి వలెనున్నది. భగణైకనిర్మితమై యవరోహణగతియం దుండవలసినవృత్తము పదవ్యవస్థావశమున జగణ, సగణ స్వరూపనిర్మాపకమై యారోహణగతి సంక్రాంత మగుచున్నది. ఏకగణావృత్తిచే సమగతియై ప్రసాదగుణమును, అవరోహణములందు మాధుర్యమును ఆరోహణములందు ఓజస్సును సంక్రమింపఁజేయుచు వృత్తము శ్రోతృచిత్తమును మాధుర్యదీపితము చేయుచున్నది. చతురస్రగతియందు స్ఫుటతాలలయాన్వితమైన ఛందము హృదయసుఖావహమై శృంగారతటస్థ విభావవర్ణనమునకుఁ దగియున్నది.

నన్నయ్యరచించిన రెండవమానినీవృత్తము ఆదిపర్వము అష్టమాశ్వాసమందలి 91 వ పద్యము. "పరాక్రమప్రణయ వశీకృతాఖిలరాజన్యులయి సుఖంబుండిన" తమపాలికి ప్రీతితోఁ జనుదెంచిన నారదమునీంద్రుని పాండవులు ససంభ్రములై సత్కరించుట యీ వృత్తమున వర్ణింపఁబడినది. చతురస్రావరోహణగతి ప్రసాదమాధుర్యములను, ఎడనెడభాసించు జగణము ఉత్ప్లుతిచే ఓజస్సును వ్యంజించుచున్నది. సుఖంబున్న పాండవులు ఆకస్మికమైన దేవముని యాగమనమున భక్తిసంభ్రమావేశము పొందుట వృత్తగతియందు సువ్యక్తమగుచునే యున్నది.

తిక్కన్న స్త్రీపర్వ ప్రథమాశ్వాసమున వ్రాసిన 90 వ పద్యము మానిని.

"కావున నీదెస నాతనికిన్ విముఖత్వము గల్గదు భక్తిమెయిన్
దా వినయంబెనయం గొనియాడుట తప్పదు, కాంచెద; వాతనిపై

నీవును నెయ్యము గారుణికత్వము నెక్కొన దమ్ములు నవ్విభుఁడున్
వేవురఁబెట్టుగ సంతతికల్మియు నేమది నిల్పుము పెంపొలయన్''

హతులైన పుత్రకులఁబట్ల శోకాగ్నిని, పుత్రహంతకులపట్ల ద్వేషాగ్నిని జల్లార్చుకొని ప్రసన్నచిత్తుఁడవై పాండవులపట్ల పుత్రవాత్సల్యము నలవఱచుకొనుమని వ్యాసభగవానుఁడు ధృతరాష్ట్రున కుపదేశించు సందర్భమునందలి వాక్య మిది. ఉదారుఁడు, కరుణాళువునైన ధర్మజుఁడు పుత్రశతమరణార్తుఁడైన తన పెదతండ్రిని పరమభక్త్యాదరములతో నాదరించుననియు, ధృతరాష్ట్రుఁడును మృతపుత్రశతకమును మఱచి పాండవపంచకమునే పుత్రసహస్రముగాఁ బ్రేమించుట యలవఱచుకొన్నచో జీవితశేషము ప్రసాదమధురముగా నడచిపోఁగలదనియు వ్యాసుని వాక్యార్థము. మధ్యావరోహణమున స్ఫుటలయాన్వితమైన గతిగల ఛందము వాక్యార్థమును సర్వథా సమర్థించుచున్నది. పదవ్యవస్థయు సర్వథా అవరోహణమునే ధ్రువపఱచుచు జగణస్ఫూర్తి లేశమునుగూడఁ దలయెత్తనిచ్చుటలేదు. గణపదస్వరూపసంవాదము విశేషముగాఁ బాటింపఁబడి పృథక్పదత్వరూప మాధుర్యమునకు అభ్యస్తగణత్వరూప మాధుర్యము పోషకమగుచున్నది.

స్త్రీపర్వద్వితీయాశ్వాసమునఁ దిక్కనవ్రాసిన 12వ పద్యముకూడ మానినీవృత్తమే. అసువులంబాసియు ఆననకాంతులుపాయక రణరంగమునఁబడియున్న మహావీరులను దిలకించి గాంధారి పరమకరుణార్ద్రయై విలాపముచేసిన వాక్యమును తిక్కన మానినీవృత్తమున నిబంధించెను.

''కూలియుఁ గాంతి యిగుర్పఁగఁ దేజము గుందక వహ్నులు క్రూరశిఖా
జాల మడంగియుఁ డాయ వెలింగెడు చందము నొందిరి
శల్యుఁడుఁ బాం
చాలుఁడుఁ గర్ణుఁడుఁ బాపగురుండును శాంతనవుండు; నిజంబున కీ
బాలుఁడు వీరిప్రభం గడచెన్; గుణభద్రుని గంటె
సుభద్రసుతున్ ?''

యతిత్రయసహితమైన యీ మానినీవృత్తమును దిక్కన ప్రత్యేకమైన యభినివేశముతో నిర్మించినట్లు తోఁచును. అన్యమానినీవృత్తములందు 12పై నొక్కయతినే పాటించి యీయొక్కచోటమాత్రమే 6, 12, 18 అక్షరములమీఁద మూఁడుయతులను పాటించుటకు వర్ణ్యవస్తుగతమైన యుదాత్తతయే కారణమని భావింపవలసియున్నది. రణరంగమందలి శోక భయ జుగుప్సాప్రేరకములయిన దృశ్యములను గాంధారి తొలిచూపునఁ జూచెను. మలిచూపున శోకవ్యాకులలై విలపించు తన కోడండ్రను, రణహతులై పడియున్న మహావీరులను జూచెను. శ్రీకృష్ణుని

యవతారప్రయోజనమును ఆయనకు వర్ణించిచూపెను. శోకాలసమైన గాంధారిహృదయమున మృతవీరుల మహావీరకృత్యముల స్మరణవల్ల కొంతహర్షత్వర తత్కాలమున సంక్రమించుటచే మధ్యగతి భాసించుట సహజము. ఉదాత్తప్రకృతియైన గాంధారి శోకమునకు హర్షము అంగమై వృత్తముయొక్క యవరోహణగతియందు అసకృదవభాసిత జగణస్ఫూర్తికిఁ గారణమగుచున్నది. భీష్మద్రోణాదులపట్ల, విశేషించి యభిమన్యునిపట్ల గాంధారికిఁగల యత్యంతమైన ప్రీతి సమాంతర స్థానత్రయ పునఃపునరావృత్త సరూపస్వరవ్యంజన రూపమైన యతిత్రయముచే శ్రుతిరమ్యమైన ఈమానినీవృత్తమున వ్యక్తమగుచున్నది.

తిక్కన్న రచించిన మరియొక మానినీవృత్తము స్త్రీపర్వద్వితీయాశ్వాసమందలి 31 వ పద్యము.

"జూదమునప్పుడు సర్వజనంబులుచూచి భయంపడి యిప్పని యి
మ్మేదిని నేనలకుం గురుకోటికి మృత్యువుగాని నిజం బలతిం
బోదని యాడరె? యమ్మెయి నాదగు బుద్ధికిఁ దోచిన సత్యము దా
మోదర పాటిలదే? కొడుకంచుఁ బ్రియోక్తులు వల్కినఁ
బెంపుసెడున్"

రణమున కెత్తిచనుచు భక్తితోఁ దన్నుఁ జూడవచ్చి యాశీర్వదింపుమని దుర్యోధనుఁడు ప్రార్థించుటయు, ధర్మ మేపక్షమందుండిన నాపక్షమునకు జయమగునని తాను పలుకుటయు వివరించి, "ఇట్లననేల యంటేని" అని ఈ మానినీ వృత్తమున గాంధారి తాను దీవనకుం జొరని కారణము వివరించుచున్నది. జూదమునప్పటి దుర్యోధనాదుల యధర్మకార్యములను దిలకించి సర్వజనములును కౌరవనాశనము తప్పదని పలికిరి. ధర్మమే జయించునని తానును ఎఱుంగును అధర్మపరుఁడైన పుత్రుని విజయివిగమ్మని యాశీర్వదించి తనమాటను వమ్ముగావించుకొనుటకు గాంధారిహృదయ మంగీకరింపలేదు. పతివ్రతాత్వమహత్వముగల తనపలుకు అతథ్యముకారాదు అనిన గాంధారి యభిమాన మీ వాక్యమున స్పష్టమగుచున్నది. "కొడుకంచుఁ బ్రియోక్తులు వల్కినఁ బెంపుసెడున్" అన్న గాంధారి మానిని. ఆమె వాక్యమును మానినీవృత్తమున నిబంధించుట వృత్తనామాశ్రితమైన యౌచిత్యము.

# కవిరాజ విరాజితము

ఇది వికృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 23 అక్షరములు. గణములు : న జ జ జ జ జ జ లగ. 7, 13, 19 అక్షరములమీఁద యతులు.

దీనిని హేమచంద్రుఁడు హంసగతియనియు, జయకీర్తి మహాతరుజీదయితయనియు వ్యవహరించిరి. ఛందోమంజరియందు ఇది శ్రవణాభరణ మనఁబడినది. "విరాజితము" అని నామాంతరముగూడ పేర్కొనఁబడినది.

మానినియందలి మొదటియక్షరమైన దీర్ఘమును రెండు హ్రస్వములుగా మార్చినచో కవిరాజవిరాజితము ఏర్పడును. స్వల్పమైన యీ మార్పువలన గణక్రమమంతయు మారి పద్యగతియందేదో విపరీతమైన మార్పు వచ్చినట్లు భ్రాంతిఁగొల్పును. ఉత్పలచంపకముల భేదమెట్టిదో మానినీ కవిరాజవిరాజితముల భేదమును అట్టిద. పాదప్రథమాక్షరమును మార్చినందువలన పాదమంతయు మారినట్లు భ్రాంతికలుగును. గతియందు లయయందు పారమార్థికమైన మార్పేమియు లేదు.

కవిరాజవిరాజితము మానినివలెనే చతురస్రగతియందు తాలలయాన్వితమై నడచును. తాలలయానుగుణమైన దీని లక్షణము నల భ భ భ భ భ భ గ అని యుండవలెను.

మానినివలె నిదియు యతిత్రయయుత మగుట శ్రవ్యతాతిశయహేతువై తాలలయోత్కర్షాపాదకమై సమంజసముగ నుండును. మానినియందు ఒక్కయతినే చెప్పిన లాక్షణికులుగూడ కవిరాజవిరాజితమున మూఁడుయతులు చెప్పిరి. రెండింటను మూఁడుయతులు చెప్పుటయే న్యాయము. అయినను భారతకవులు యతిత్రయమును విభాషగా స్వీకరించినట్లు కనిపించును.

భారతమున నన్నయ్య రచించినవి రెండు, తిక్కన్న రచించినవి నాల్గు మొత్తము ఆఱు కవిరాజవిరాజితములు గలవు. నన్నయ్య రెండింటను 13పై నొక్కయతినే పాటించెను. తిక్కన్న మూఁడింట నన్నయ్యనే యనుసరించినను ఒక్కదానియందు యతిత్రయమును పాటించెను.

నన్నయ్య కవిరాజవిరాజితములు రెండును కవివాక్యములే. మొదటిది ఆదిపర్వ చతుర్థాశ్వాసమునందలి 21 వ పద్యము.

"చని చని ముందట నాజ్యహవిర్ధ్రుత సౌరభధూమ లతాతతులన్
బెనఁగిన మ్రాకుల కొమ్మలమీఁద నపేతలతాంతములై నను బా
యని మధుపప్రకరంబులఁ జూచి జనాధిపుఁ డంత నెఱింగెఁ దపో
వనమిది యల్లదె దివ్యమునీంద్రు నివాసము దా నగునంచు నెదన్"

మాలినీ నదీతీరమందలి సుందరవనముల రమణీయభావముచే నాకృష్టుఁడై చనిచని దుష్యంతుఁడు కణ్వాశ్రమమును దరియుట యిందు వర్ణింపఁబడినది. దీనిముం దొక మానినీ వృత్తము గలదు. వృత్తములు రెండును సాదృశ్యాతిశయము గలవి. వానియందు వర్ణింపఁబడిన వస్తువుకూడ సదృశమైనదే. మానినియందు పుష్పఫల, శుకకోకిలాలాపములచే నేత్ర శ్రోత్రేంద్రియములకాహ్లాదము గలిగించుచు శృంగారభావమునకుఁదగిన యుపవనప్రకృతి వర్ణింపఁబడినది. దానివెంటనున్న యీ కవిరాజవిరాజితమున గతపత్రపుష్పఫలమయ్యు ఆజ్యహవిర్గంధముచేఁ జిత్తమును బరవశము గావించుచున్న కణ్వతపోవనప్రకృతి వర్ణింపఁబడినది. శృంగారరసోచితమైన ప్రకృతిసౌందర్యము శాంతరసోచితమైనదిగాఁ బరిణమించుట వృత్తపరిణామముచే సమర్థింపఁబడినది. హృదయసుఖావహత్వమున తుల్యమయ్యు బహిర్లక్షణములచే భిన్నముగ భాసించుచున్న దృశ్యద్వయమును అట్టివేయైన వృత్తద్వయమున వర్ణించుట ఇచ్చటి చమత్కారము. లక్షణానుసరణమున భాసింపవలసిన పెక్కు జగణములు పదవ్యవస్థావశమున నణఁచివేయఁబడినవి. భాసించుచున్న జగణములు దుష్యంతుని హృదయమున కణ్వదర్శనకుతూహలావిర్భావమునకు క్షేత్రమును పదనుచేయుచున్నవి.

అరణ్యపర్వము ద్వితీయాశ్వాసమున దమయంతీచరిత్రమున నన్నయ్య యింకొక కవిరాజవిరాజితము రచించెను. అజగరగ్రస్తయైన దమయంతిని మృత్యువునుండి కాపాడి, యామె సౌందర్యముచేత నాకర్షింపఁబడి యొక కిరాతుఁడు ఆమెపై మరులుకొని తనకోరిక నామె కెఱింగించుట నన్నయ్య కవిరాజవిరాజితమున వర్ణించెను.

రజనికరాననఁ బీనపయోధరరాజిత రాజసుతన్ విలసత్
గజపతిగామిని జందనగంధి బ్రకాశితకాంతిసమన్వితఁ బం
కజదళలోచనఁ జూచి కిరాతుఁడు కాము నిశాతశరాహతుఁడై
నిజహృదయం బెఱిఁగించె లతాంగి కనింద్యచరిత్రకు వేడుకతోన్''

అరణ్య. II. 91.

దమయంతీ రూపసౌందర్యము కిరాతుని హృదయమునఁ గల్గించిన చతురమధురలలిత వృత్తి పద్యగతియందు చక్కఁగా భాసించుచున్నది. దమయంత్యాలంబనకమైన రతిభావముచే మధురమై నాతిద్రుతము, నాతివిలంబితమునైన కిరాతుని హృదయగతి తాలలయాన్వితత్వమున నృత్తప్రాయమైన ఈ వృత్తగతియందు స్ఫుటముగ గోచరించుచునే యున్నది. తరుచైన జగణస్ఫూర్తి కిరాతుని వేడుకను వ్యంజించుచున్నది.

తిక్కన్న రచించిన కవిరాజవిరాజితములు నాల్గును పాత్రవాక్యములే. స్త్రీపర్వ ప్రథమాశ్వాసమందలి రెండును విదురవాక్యములు. ద్వితీయాశ్వాసమందలి రెండును గాంధారీవాక్యములు.

సంసారగహనమునఁ దిరుగుచు మోహకూపమునంబడి లతాక్రాంతమై ప్రేయసీప్రియ పుత్త్రా హముతో మధుధారలఁ గ్రోలుచున్న విప్రుని శోచనీయావస్థ స్వీయావస్థాసంవాదమున హృదయ మును హరింపఁ గరుణారసభరితుఁడై యా విప్రుని సంసారమోక్షప్రకారముఁ దెలుపుమనిన ధృత రాష్ట్రునకు విదురుఁడు చెప్పిన సమాధానము కవిరాజవిరాజితము.

> "అనవుడు నిట్లను నన్నరపాలున కాక్షఁడు; మోక్షమునర్థి జగత్
> జనులకు బుట్టుట సన్మతిఁ గోరి విశారదు లాదరసంభృతులై
> యనఘ! సుదుస్తరమైన భవంబున కచ్చగు నియ్యితిహాసము బో
> ధనమహనీయ విధంబునఁ జెప్పి రుదాత్తగుణాశ్రయతా మహితా"

స్త్రీ. I. 51.

పరగతసుఖదుఃఖాదిభావనచే భావితమైన యంతఃకరణము సత్త్వమనఁబడును. సత్త్వ మనఁగా సమత్వమే. కూపపతితుఁడైన విప్రునియవస్థ విని ధృతరాష్ట్రునకు "అనయముఁ గృప పుట్టె." కృప సత్త్వలక్షణము. ధృతరాష్ట్రుని యప్పటి యవస్థను జూచి విదురునకు కృపపుట్టెను. కరుణావేశమున సత్త్వస్థితినందిన ధృతరాష్ట్రునకు సంసారతత్త్వమును విప్పిచెప్పి యా సత్త్వస్థితిని దృఢతరము చేయవలెనని విదురుని కాంక్ష. కనుక వాక్యార్థమును హృదయమున హత్తునట్లు ప్రతిపాదించువాఁడై విదురుఁడు మధురసుందరగతియైన ఛందము నవలంబించెను. వాక్యచ్ఛందము వాక్యార్థబోధనమహిమ గలది. జ్ఞానులు పతితలోకమునం దాదరసంభృతులై బోధనమహనీయ మైన యితిహాసమార్గము నవలంబించి తత్త్వోపదేశము చేయుదురు. వాచ్యాలంకారమైన యితి హాసమువలెనే వాచకాలంకారమైన ఛందముగూడ బోధనమహనీయము. వక్తయొక్క ఆదర సంభృతచిత్తమునకు సుందరగతియైన ఛందము స్వతస్సిద్ధమైన ఫలము. విశారదులైనవారు లోకులకు బ్రహ్మానందమునందు అర్థిపుట్టించుటకై వాక్యమును తదర్థబోధనసమర్థమైన ఛందముచే సుందరముగావింతురు. ఛందస్సుందరవాక్యమునందు సాదరమైన శ్రోతృచిత్తము తదర్థభావన యం దాదరము వహించును. ఇతిహాసముఖమున వర్ణితమైన యర్థము విని సత్త్వదీప్తచిత్తుఁడై పరమార్థగ్రహణమునఁ గుతూహలియైన ధృతరాష్ట్రునకు ఆ చిత్తస్థితిని దృఢతరముచేయుటకై విదురుఁడు తన వాక్యగతిని స్ఫుటలయాన్వితముగ నుచ్చరించెను. ఈ యొక్క కవిరాజ విరాజితముననే యతిత్రయనియమపాలనము కావించుటయందు తిక్కన్న యాశయ మిట్టిదని భావింపఁదగియున్నది. సహజసుందరగతియైన వృత్తమును యతిత్రయముచే నలంకరించి శ్రోతకు రంజనాతిశయము నుత్పాదింపవలెనన్న వక్తయత్నమే శిల్పము.

తన వాక్యసౌందర్యమున బద్ధాదరుఁడైన ధృతరాష్ట్రునకు విదురుఁడు ఆ యితిహాసము యొక్క పరమార్థము అభివ్యక్తముగా వివరించుటకు గద్యము నవలంబించెను. అది విని ధృత రాష్ట్రుఁడు "హిత ముపదేశించితి నీ వతినిర్మలచిత్తవృత్తి వగుట......ఇంకను జెప్పుము ధృతి

కారకవచనపద్ధతిన్ విశదముగన్" అని విదురుని బ్రార్థించినాఁడు. అప్పుడు విదురుఁడు చెప్పిన సమాధానవాక్యముకూడ కవిరాజవిరాజితమే.

> "అనయము లోలకమై విషయప్రచయంబను దుస్తరపంకమునన్
> మునుఁగుచుఁ దేలుచునుండఁగఁ గాలము ముట్టి దుజ్ఞ జర నెవ్వగపై
> కొన దొరకొల్పి క్రమంబున నంగము క్రొవ్వును జెల్వును బాపి ప్రయో
> జనరహితంబుగఁజేసి యపాత్రపుఁ జా వొనరించుఁ గురుప్రవరా !"

ఉద్యో. I. 55.

సమచతురస్రగతిచేఁ దన చిత్తస్పందమునందు ఏకాగ్రతారూపమైన దృతిని ఆధానము చేసిన కవిరాజవిరాజితచ్ఛందమునందు ధృతరాష్ట్రుఁ డాసక్తుఁడైనాఁడు. మధురగతియైన యట్టి వాగ్విన్యాసము మరలమరల విన నభిలషించినాఁడు. విదురుఁడది గుర్తించియే ధృతికారకవచన పద్ధతియైన కవిరాజవిరాజితముననే తన సమాధానమును మరల ఆరంభించెను. విదురుఁడింకొక రహస్యమునుగూడ గుర్తించెనని చమత్కారముకొఱకు భావింపవచ్చును. యతిత్రయముచే నత్యంతసుందరమైన ఛందము ధృతరాష్ట్రుని చిత్తమును శరీరమాత్రమైన శబ్దముదెసకు మితి మీరి యాకర్షించుచున్నది. ధృతరాష్ట్రుని మనస్సు తన వాక్యార్థమున లగ్నమగుటయే విదురునకు అభిమతము. కనుక ధృతరాష్ట్రుని కోరిక మేరకు కవిరాజవిరాజితముననే వాక్యమును నడుపుచు ఏకయతిపాలనమున దాని సౌందర్యాతిశయము నరికట్టెను. కానిచో తిక్కన్న యింతసన్నిహిత ముగా నున్న యీ రెండుపద్యములందు యతివిషయమున నిట్టిభేదము నేలచేయవలెను? వస్త్వైక్య సూచకముగా వృత్తైక్యముతోపాటు ప్రాసైక్యముగూడ గుర్తింపవచ్చును.

స్త్రీపర్వద్వితీయాశ్వాసమందలి రెండుకవిరాజవిరాజితములును గాంధారీవాక్యములు. ఒకటి ద్రోణశరపాతితుఁడై యున్న విరాటునిఁ దిలకించి గాంధారి విలపించినది. దీనియందు విరళముగ భాసించిన జగణములు దీర్ఘములయిన గురువులవలన అతీవ్రములయి వృత్తముయొక్క యవ రోహణమునకు అంతరాయముగలిగింప సమర్థము లగుటలేదు. ద్రోణునిచే ధర్మమార్గమున హతుఁడైన వృద్ధవిరాటుఁడు గాంధారీహృదయమును శోకార్ద్రమునుమాత్రమే కావించెను.

స్త్రీ. II. 83.

తనచేఁ జావనున్న సాత్యకిని రక్షించుటకై యర్జునుఁడు తనచేయి నఱుకఁగా నాశ్చర్య విచారస్తబ్ధుఁడై యున్న తన శిరమును సాత్యకి నఱుకఁగా గూలియున్న భూరిశ్రవునిఁ జూచి గాంధారి విలపించిన వాక్యమందలి కవిరాజవిరాజితము గాంధారిశోకమునఁ గలిసిన ద్వేషమును గూడ వ్యంజించుచున్నది,

"సాత్యకి యేపుని ద్రుంచె శిరంబు దడంగి? జగం
బున నొరులింత నికృష్టపుఁ గర్మము హొంతనుఁ జేదురె?"

శ్రీ. II. 131.

అన్న భాగమునందలి యల్పవ్యవహిత జగణములు అర్థపరిణామానుగుణమైన ఛందోగతిపరిణామ మును చక్కఁగా వ్యక్తముచేయుచున్నవి.

# స్రగ్ధర

ఇది ప్రకృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 21 అక్షరములు. గణములు : మ ర భ న య య య. 7, 14 అక్షరములమీఁద యతులు.

21 అక్షరములలో 12 గురువులుగల స్రగ్ధరాగతి విలంబితము. నడిమి యాఱక్షరములు లఘువులగుటచేత స్రగ్ధరాగతి రగణగతివంటిది, జగణగతికంటె విపరీతమైనది. మొదటి యేడ క్షరములలో ఆఱుగురువులు, నడిమి యేడక్షరములలో ఒక్కగురువు, చివరి యేడక్షరములలో ఐదుగురువులు గలిగి, ఏడేసి యక్షరములమీఁద విచ్ఛేదములుగల స్రగ్ధరయందు లయను నిరూ పించు యతి సంగీతశాస్త్రపరిభాషయందు వేదిమధ్యయతి యనఁబడును.

స్రగ్ధరావృత్తవినియోగమునుగుఱించి ప్రాచీనుల యభిప్రాయములు వివిధములుగా నున్నవి.

"వీరస్య భుజదండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్" అని కాత్యాయనోక్తిగా ఛందోంగమైన శరీ రాశ్రయసంభూతస్థానమును వివరించు సందర్భమున అభినవగుప్తపాదు లుదాహరించిరి.[21]

"సావేగపవనాదీనాం వర్ణనే స్రగ్ధరా మతా'' యని[22] క్షేమేంద్రుఁడనెను. ''శృంగారాదౌ పృథ్వీ స్రగ్ధరాదీనాం" అని కావ్యప్రకాశవ్యాఖ్యలగు ప్రదీపోద్ద్యోతాదులందు చేర్కొనఁబడినట్లు వామనాచార్యఝల్కీకర్ ఉద్ధరించియున్నారు.[23] ''రౌద్రే స్రగ్ధరాదయః'' అని భోజమహారాజు తెలిపియున్నాఁడు.[24]

"గుర్వక్షరప్రాయకృతం భీభత్సే కరుణే తథా
కదాచి ద్వీరరౌద్రాభ్యాం యదా ధర్షణజం భవేత్"[25]

అని భరతముని చెప్పుటవల్ల గుర్వక్షరప్రాయకృతమైన స్రగ్ధర కరుణ బీభత్స వీర రౌద్రము లందు యథావసరము ప్రయోగింపఁదగినదని యాయన యభిప్రాయముగా నూహింపఁదగును.

చిత్తవృత్తిపరిస్పందము మసృణవాహిమైనచోట గుర్వక్షరప్రాయవృత్తము ఉచితము. కరుణ బీభత్స రౌద్రముల ఒకానొకదశయందు చిత్తస్పందము మందమగును. అట్టిదశయం దారసములను వ్యంజించుటకు గుర్వక్షరప్రాయమైన స్రగ్ధర సమర్థమగును.

ఆంధ్ర మహాభారతమున —

నన్నయ రచించినవి 1

తిక్కన్న రచించినవి 9

ఎఱ్ఱన్న రచించినవి 2

మొత్తము 12 స్రగ్ధరావృత్తములు గలవు.

స్రగ్ధర అసంస్యూతవిరామమైనచో శోభించునని క్షేమేంద్రుఁడనెను. ఏడేసియక్షరములకు స్ఫుటమైన విచ్ఛేదముండినచో స్రగ్ధరయొక్కగతి స్పష్టముగా నుండుననుట సత్యమ. కాని విచ్ఛేదనియతి తెలుఁగున లేదు. విశేషించి వృత్తమును స్వస్వరూపములో ప్రదర్శించుటయందు శిల్పములేదు. దానిని రసోచితమైనలీరున భిన్నగతుల నడిపించుటయందే కవినైపుణ్యమున్నది. విచ్ఛిన్నములయిన ఖండములను కలిపికుట్టి యఖండపాదముగా నిర్మించుటయు వ్యంజకతాదృష్టిచే నిర్మాణశిల్పమే.

"అంతం గౌంతేయుఁ డత్యాయతయశుఁడు నరుండగ్గి పాంచాలదంతి
ధ్వాంతంబుఁ జాని వాహోత్తమతుహినతతిఁ దద్భటోదారతారా
సంతానంబుఁ శరాంశూచ్ఛయవిభవమునఁ
శాంతిఁ బొందించియుద్యత్
ధ్వాంతారాతిప్రభుండై తనరుచు వెలిఁగెఁ దద్రణవ్యోమవీథిన్"

ఆది. VI. 80.

ఆదిపర్వపంచమాశ్వాసమున నన్నయ్య పాండురాజ దిగ్విజయవర్ణనమును మహాస్రగ్ధరయందు నిబంధించెను. ఆఱవయాశ్వాసమునఁ బాండవమధ్యముని ద్రుపదసేనావిజయమును స్రగ్ధరయందు నిబంధించెను. రణవ్యోమవీథియందు ధ్వాంతారాతిప్రభుండై తనరుచు వెలింగిన యర్జునుని పరాక్రమవిస్తృతిని విస్తారగంభీరమయిన వృత్తమున వర్ణించి కుమారుఁడయ్యు నర్జునుఁడు పాండురాజునంతటి ప్రతాపశాలియని నన్నయ సూచించెను.

తిక్కన్న సౌప్తికపర్వమున రచించిన స్రగ్ధరల యౌచిత్యమునుగుఱించి స్థలాంతరమునఁ బ్రసంగింపఁబడినది. (చూడు. ఛందస్సంవాదము) విరాటపర్వమునఁ దిక్కన్న రచించిన స్రగ్ధర యొకఁడుగలదు.

"మౌళిస్రక్సంగ రంగ న్మధుకరపటలీ మానసాకృష్టివిద్యా
శాలిస్ఫారాబ్జరేఖాంజలిపుట ఘటనాచారుఫాలస్థలక్ష్మా
ఫాలశ్రేణీ విశాలాంబకకుముదవనీ బాంధవాయత్త చంద్ర
శ్రీలీలాగాధకాంతిస్మితవదనరుచిస్ఫీతు నాగేంద్రకేతున్"

విరాట. III. 78.

భరతముని గతి లయాశ్రితమైన వృత్తప్రయోగౌచిత్యమును ప్రతిపాదించినను ఛందఃప్రకరణమున నానావృత్తములకు లక్ష్యములను రచించుపట్ల ప్రధానముగా నవలంబించినపద్ధతి వృత్తనామసార్థక్యనిరూపకమైన యర్థమును వృత్తనామ ముద్రాపూర్వకముగ నిబంధించుటయేయని చెప్పవచ్చును. స్రగ్ధరయనఁగా మాలనుధరించునదని యర్థము. భరతముని స్రగ్ధరావృత్తలక్ష్యమునం దీయర్థమునే సమర్థించెను.

"ఏతై ర్నానాప్రకారైః కుసుమసురభిభి ర్విప్రకీర్ణైశ్చ తైస్తైః
వాసంతైః పుష్పబృందైః నరవర ! వసుధా స్రగ్ధరేవాద్య భాతి"

N. S. XV. 131.

ఇట్లు వృత్తనామాంకితము, వృత్తనామార్థసమర్థకమునగునట్లు లక్ష్యము నిర్మించుటవల్ల వాక్యార్థము ఛందోనువర్తియగునని యభినవులు ఒకచోట వివరించిరి.

"సాక్షా ద్వసంతతిలకేవ విభాతి నారీ"

N. S. XV. 88.

యన్న వసంతతిలకాలక్ష్యపద్యముక్రింద యభినవవ్యాఖ్య—"సాక్షాదితి ఛందోనువర్తినీ త్యర్థః" అని. "స్రగ్ధరేవ" యన్న మాటకును అర్థమిదే యనవచ్చును.

తిక్కన్న "మౌళిస్రక్సంగరంగన్మధుకరపటలీ" త్యాదిస్రగ్ధరావృత్తమున వృత్తనామైకదేశమును ముద్రించి సామంతరాజుల స్రక్సంగమౌళులను ప్రసంగించి భరతముని మార్గానుసరణమున వృత్తౌచిత్యమును బాటించెను. గుర్వక్షరబాహుళ్యమున ధీరోదాత్తగతియైన వృత్తమున దుర్యోధనచక్రవర్తి వైభవోదాత్తతను వర్ణించుటయు, వర్ణ్యవస్తూదాత్తతకుఁ దగిన తెలుఁగున వృత్తమంతయు నేకసమాసఘటితముచేయుట, అంత్యానుప్రాసమును వృత్తావసానమున పతాకవలె నిలిపి దుర్యోధనుని నాగేంద్రకేతుత్వమును స్ఫురింపఁజేయుట ఈ స్రగ్ధరయందు గుర్తింపఁదగిన యితర శిల్పరహస్యములు. "స్రక్సంగరంగన్మధుకర" యన్న పదఘటన విశాలమై నానామాలికాలంకృతమైన రాజన్యమౌళులనెడు విశాలనాట్యరంగమున మధుకరపటలి నృత్తగానములను ప్రవర్తింపఁజేయుటను స్ఫురణకుఁ దెచ్చుచున్నది. ఏకసమాసఘటనము పాండవపరోక్షమున నఖండముగ సాగుచున్న దుర్యోధనుని వైభవమును దలపించుచున్నది.

సంజయుని రాయబారపు బండారము బయటఁ బెట్టుచు ధర్మరాజు దుర్యోధనుని మూర్ఖత్వముఁ దలఁచి "వెడవెడ యలుక పొడమినఁ" బలికిన వాక్యములలోఁ బాండుపుత్రప్రతాప ప్రశంసాత్మకమయినది స్రగ్ధరావృత్తము. వెడవెడపొడమిన యలుకకింతటి దీర్ఘగంభీరవృత్త మక్కఱలేదు. కాని యిట్టి వాగ్వృత్తి నవలంబించుటయందు ధర్మజునకు నిగూఢమైన యాశయ మున్నది. తన నల్వురతమ్ముల మహాప్రతాపము నేకవాక్యమునఁ బ్రతిపాదించి, యట్టిప్రతాపమే విజృంభించుట యనివార్యమైనచోఁ గౌరవులకు సర్వనాశనము తప్పదని కౌరవదూతకుఁ దోపింపఁ జేసి బెదరింపుమాత్రమున యుద్ధమును నివారింపవలెనని ధర్మజుని యాశయము. కనుకనే ఆయన యింతటి యావేశముతో స్రగ్ధరావృత్తమును బ్రయోగించి వెంటనే "కావున" అని త్ర్యక్షర మాత్ర ప్రమాణమైన వచనమును బలికెను. ఆద్యంతముల విస్తరించి, నడుమ ప్రసన్నమైన స్రగ్ధరాపంక్తి గాండీవమువలె, భీముని బాహాదండములవలె, వేదండద్వంద్వమువలె నుండుట పద్యపాద స్వరూపదర్శనమున భావుకులు గుర్తింపఁగలరు. వర్ణ్యవస్తుస్వరూపావభాసకమైన యిట్టి వృత్త ప్రయోగమే ఛందోరీతియం దర్థవ్యక్తి యను గుణముగా వివరింపఁబడినది.

శాంతిపర్వము–ద్వితీయాశ్వాసమందలి 440 వ పద్యము స్రగ్ధర. సోదరులయిన సదముఁడును, దముఁడును అంబరీషుని సేనాపతియగు సుదేవునిచే హతులగుటఁగాంచి విదముఁడను దానవుఁడు సుదేవునిమీఁద "బాహాసముల్లాసిత ఘనరుచిరాసిప్రభాభాసురుండై" విజృంభించుట తిక్కన్నచే స్రగ్ధరయందు వర్ణింపఁబడినది.

ఎఱ్ఱన్న వ్రాసిన స్రగ్ధరలు రెండును ఆరణ్యపర్వ సప్తమాశ్వాసమం దున్నవి. వానిలో మొదటిది శ్రీరామచంద్రునితో హనుమ పలికిన వాక్యము. (7–16)

"దుర్వారవారోఘ గంభీరాలంఘ్య ప్రౌఢవేగంబగుచు...బిట్టాలోకింపంగ నుగ్రంబగు జలనిధి"ని వర్ణించుటకు హనుమంతుఁడు విస్తారగంభీరమయిన స్రగ్ధర నుపయోగించుట వర్ణ్యవస్తు సదృశమగుచున్నది. సావేగసాగరకల్లోలమాలావర్ణనమున స్రగ్ధరాప్రయోగము క్షేమేంద్ర మార్గానుసారి.

సప్తమాశ్వాసమందలి 91 వ పద్యముకూడ స్రగ్ధరయే. లంకాలుంటాకుఁడైన హనుమంతుఁడు ఉద్యల్లఘుగమనోల్లాసియై చంచద్భుజరచితమహాభూరుహంబెత్తి ధూమ్రాక్షుని వ్రేయుట ఎఱ్ఱన్న స్రగ్ధరయందు వర్ణించెను. వీరభుజదండవర్ణనమున స్రగ్ధర యుచితమనిన కాత్యాయన మతము నిచ్చట యనుసంధింపఁదగును.

# మహాస్రగ్ధర

ఇది ఆకృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 22 అక్షరములు. గణములు : స త త న స ర ర గ. 8, 15 అక్షరములమీఁద యతులు.

సంస్కృత లాక్షణికులలో మహాస్రగ్ధరను జెప్పినవారు హేమచంద్ర జయకీర్తు లిద్దరే. కేదారభట్టుకూడ మహాస్రగ్ధరను జెప్పెనుగాని దానిలక్షణము ఇది కాదు.

శార్దూలవృత్తపాద ప్రథమాక్షరమైన గురువును రెండు లఘువులుగా మార్చినచో మత్తేభ వృత్తమైనట్లు స్రగ్ధరయే పాదప్రథమ గుర్వక్షరమును రెండు లఘువులుచేయఁగా మహాస్రగ్ధర యగును. గురులఘువులసంఖ్య సమానమై మహాస్రగ్ధరగతియందు కొంత ద్రుతి కలిగినట్లగును. మధ్యమున ఆఱు లఘువులు ప్రోవుపడుట స్రగ్ధరయందువలె దీనియందును ఆద్యంతములందు విలంబనము, నడుమ ద్రుతి ఏర్పడి గురులఘుసంఖ్యాసమత్వమున మొత్తముపాదమున భాసింప వలసిన మధ్యగతి భాసింపదు. కనుక స్రగ్ధరా మహాస్రగ్ధరలకు రసాద్యౌచిత్యమున నెన్నఁదగిన భేదము కానరాదు. సంస్కృతలాక్షణికులు మహాస్రగ్ధరను ప్రత్యేకించి పేర్కొనమికిఁగూడ ఇదియే కారణముకావచ్చును. మత్తేభవిక్రీడితముకూడ శార్దూలవిక్రీడితముకంటె అంతభిన్నము కానందువల్లనే సంస్కృతలాక్షణికులుగాని కవులుగాని దానియందు ప్రత్యేకాభినివేశము చూపక శార్దూలమునే ఆదరించిరి. రసభావాది వ్యంజకతయందు స్రగ్ధరామహాస్రగ్ధరలకు భేదములేదని భావించుటయే యుచితము.

ఆంధ్రభారతమునందలి మహాస్రగ్ధరలు మొత్తము 20. అందు —

| | | |
|---|---|---|
| నన్నయ్య రచించినవి | — | 2 |
| తిక్కన్న రచించినవి | — | 16 |
| ఎఱ్ఱన్న రచించినవి | — | 2 |

ఆదిపర్వ పంచమాశ్వాసమున 38వ పద్యము స్రగ్ధర. దిగ్విజయయాత్రాసందర్భమునఁ బాండురాజు భుజవీర్యమును వర్ణించుటకు స్రగ్ధరను వినియోగించి నన్నయ్య కాత్యాయనోక్త మార్గము ననుసరించి వృత్తౌచిత్యమును పాటించెను.

ఆదిపర్వ ద్వితీయాశ్వాసమున దేవదానవయుద్ధమున నరనారాయణులు ప్రదర్శించిన ప్రతాప మును నన్నయ్య మహాస్రగ్ధరయందు వర్ణించెను. (ఆది. II. 22)

"అమరేంద్రారాతు లిట్లాహవముఖమున నే యంగఁ దత్తీక్ష్ణబాణౌ
ఘము ఘోరంబై సురానీకముపయిఁ దెలుచన్ గప్పినన్ జూచి దైత్యో
త్తములం గోదండచక్రోద్యతభుజులు మహా దారుణుల్ వీరలక్ష్మీ
రమణుల్ దుర్వారవాత్యారయమున నరనారాయణుల్ దాకి రల్కన్"
ఆది II. 22.

కోదండ చక్రోద్యతభుజులగు నరనారాయణులు దుర్వారవాత్యారయమున దానవులందాకుట ఈ వృత్తమునఁ బ్రధానవస్తువు. ఈ వృత్తవినియోగము కాత్యాయన క్షేమేంద్రుల యుపదేశములను అనుసరించుట స్పష్టము.

ఎఱ్ఱన్న ఆరణ్యపర్వ పంచమాశ్వాసమున వ్రాసిన 421 వ పద్యము మహాస్రగ్ధర. భీమ నకుల సహదేవులు గంధర్వులతోఁ బోరుసందర్భమున వారియుబ్బును, సరభసగతిని వర్ణించుటకు ఎఱ్ఱన్న మహాస్రగ్ధరను ఉపయోగించెను. "రౌద్రే స్రగ్ధరాదయః" అను భోజరాజోపదేశమును[26] ఇది యనువర్తించుచున్నది.

ఎఱ్ఱన్న రచించిన రెండవ మహాస్రగ్ధర అరణ్యపర్వ సప్తమాశ్వాసమందలి 87వ పద్యము.

"విశ్వగ్రసనరస లసత్కాలమేఘంబ పోలెన్ ఘనగర్జాఘోష మొప్పన్" ధూమ్రాక్షుఁడు వీరారంభుఁడై సకల హరిచమూసంఘమును విహ్వలము గావించిన తెఱఁగు వర్ణించుటకు ఎఱ్ఱన మహాస్రగ్ధర నుపయోగించుట యుచితముగనే యున్నది.

తిక్కన్న సౌప్తికపర్వమున నుపయోగించిన మహాస్రగ్ధరల యౌచిత్యము స్థలాంతరమున వివరింపఁబడినది (చూ. ఛందస్సంవాదము). ఆయన శాంతిపర్వమున, (II. 434) స్వర్గారోహణ పర్వమునఁగూడ ఒక్కొక్క మహాస్రగ్ధరను ఉపయోగించెను.

స్వర్గారోహణపర్వమందలి 34 వ పద్యము—

"వసురుద్రాదిత్య గంధర్వ గరుడ
భుజగవ్రాతముల్ వైభవం బు
ల్లసనం బొందంగ, సిద్ధుల్
మనముల ముదముల్ బల్లవింపంగ, సాధ్యుల్
హసితస్వాంతంబులం బెల్లలమికొనఁగ న
త్యాదరోత్కర్షముల్ పాం
డుసుతోపాంతంబునం బిండుకొని నిలిచి చూ
డ్కుల్ తదంగంబు గప్పన్"

ఉదాత్తప్రస్తువర్ణనమున స్రగ్ధరావృత్తము సమర్థముగా నుండునని దుర్యోధన వైభవవర్ణనమునఁ దిక్కన్న నిరూపించెను. ధర్మజుని లోకోత్తర వైభవవర్ణనమున మహాస్రగ్ధర నుపయోగించి తిక్కన దుర్యోధనుని లౌకికవైభవమును స్మరణకుఁ దెచ్చుచున్నట్లు తోఁచును. ఆడంబరసహితమైన దుర్యోధనవైభవమును వర్ణించు స్రగ్ధరయందు తిక్కన చూపినశిల్పము ధర్మజుని నిరాడంబరవైభవము వర్ణించు మహాస్రగ్ధరయందు చూపలేదు. ఆ చూపకుండుటయే శిల్పము. దివ్యమైన ధర్మజుని వైభవము స్వయంవిరాజమానమైనది. దానిని వర్ణించు వాక్కునకు అలంకారాంతరావశ్యకము లేదు వాక్కునే అలంకరించు ఆయన వైభవమును వాక్కులచే నలంకరింపఁ బూనుట యవివేకమని తిక్కన్న భావము.

# మత్తకోకిలము

ఇది ధృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 18 అక్షరములు : గణములు : ర స జ జ భ ర. 10 అక్షరములమీఁద యతి.

దీనిని పింగళుఁడు హరనర్తనము అని, హేమచంద్రుఁడు ఉజ్జ్వలము అని, జయకీర్తి మాలికోత్తరమాలికయని, కేదారభట్టు హరనర్తకము అని వ్యవహరించిరి. 8, 13 అక్షరములపై విచ్ఛేదము చెప్పిరి. సంస్కృతలాక్షణికులలో జయకీర్తియొక్కఁడే మత్తకోకిలమను వృత్తమును జెప్పెను. దాని లక్షణము న భ జ ర. హేమచంద్ర కేదారభట్టులు దీనినే ప్రియంవద యనిరి. ఆంధ్రలాక్షణికులును ప్రియంవదయే యనిరి.

ఇది త్ర్యస్రచతురస్రగతుల సమ్మిశ్రణమున నేర్పడిన మిశ్రగతిని నడచును. ఆ వృత్తికి 7 మాత్రలు. (3 + 4)

గలభ గలభ గలభ గలగ యని దీనికి లక్షణముచెప్పినచో దీనియందలి తాలలయను రూపించినట్లయ్యెడిది. పాదాంతమున నొకగురువుగాని రెండు లఘువులుగాని చేరినచో ఏడేసి మాత్రల యావృత్తులు నాల్గు పూర్తియయ్యెడివి.

18 అక్షరములలో 10 లఘువులగుటచే దీని యక్షరగతి యించుక ద్రుతము. సప్తమాత్రాక ఖండావృత్తియగుటచే తాలాశ్రయమైన లయ విలంబితము. కనుక మధురభావావేశమున హృదయము ఇంచుక త్వరితగతియైనస్థితిని వ్యంజించుట కీవృత్తము తగియున్నదని భావింపవచ్చును.

ఆంధ్రమహాభారతమున మొత్తము 47 మత్తకోకిలవృత్తములు గలవు. వానిలో—

| | | |
|---|---|---|
| నన్నయ్య రచించినవి | — | 26 |
| ఎఱ్ఱన్న రచించినవి | — | 13 |
| తిక్కన్న రచించినవి | — | 8 |

నన్నయ్యయు, ఆయనమార్గము ననుసరించి యెఱ్ఱనయు మత్తకోకిలములను ఎక్కువగా వాడిరి. తిక్కన్న చాల తక్కువగా వాడెను. కవిత్రయము ఈ వృత్తము నెట్టి సందర్భముల నుపయోగించిరో పరిశీలింపవలెను.

నన్నయ్య :

1. పాములనేల చంపఁబూనితివని భయపడి యడిగిన డుండుభమునకు కోపముతో రురుఁడు సమాధానము చెప్పుట.
ఆది. I. 153.
2. ఋత్విజుల యనుమతితో జనమేజయుఁడు సర్పయాగము గావింప కృతనిశ్చయుఁ డగుట.
ఆది. II. 207
3. ఆదిపర్వ తృతీయాశ్వాసాంతమున రాజరాజస్తుతి.
4. పాడియాలకై తాను ద్రుపదుని యాచింపఁబోవుటను గుఱించి ద్రోణుఁడు భీష్మునకుఁ జెప్పుట.
ఆది. V. 218.
5. ద్రోణుని శిక్షచే అర్జునుఁ డందఱకంటె గొప్ప విలుకాఁడగుట.
ఆది. V. 245
6. పితృదేవతలతో భార్గవుఁడు తన ప్రతిజ్ఞనుగూర్చి చెప్పుట.
ఆది. VII. 141.
7. ద్రౌపది నర్జునున కిచ్చినందుకు రాజులందఱు ద్రుపదునిపైఁ గోపించుట.
ఆది. VII. 189.
8. కౌరవులు పాండవులు నన్న భేదభావము తనకు లేదని భీష్ముఁడు ప్రకటించుట.
ఆది. VIII. 29
9. సుభద్రను హరించిన యర్జునునిపై బలదేవాదులు ఆగ్రహించుట.
ఆది. VIII. 205
10. అభిమన్యుఁడు వేదధనుర్వేదాది విద్యలు నేర్చుట.
ఆది. VIII. 227.
11. ఆదిపర్వ – అష్టమాశ్వాసాంతమున రాజరాజ స్తుతి.
12. రాజసూయము చేయనిశ్చయించి ధర్మజుఁడు శ్రీకృష్ణుని దయను గొనియాడుట.
సభా. I. 275.
13. ధర్మజునకు భీష్ముఁడు అర్ఘ్యదానయోగ్యులను దెలుపుట.
సభా. II. 4.
14. కులదూషకుఁడైన దుర్యోధనుని అర్జునునిచేఁ జంపింపుమని విదురుఁడు ధృతరాష్ట్రునకు రహస్యముగ బోధించుట.
సభా. II. 180.

15. విదురుఁడు వికర్ణుని ధర్మనిర్ణయమును బొగడుట.
సభా. II. 236.

16. అడవుల కేఁగుచున్న పుత్రులనుగూర్చి విలపించు కుంతి శ్రీకృష్ణుని ప్రార్థించుట.
సభా. II. 288.

17. మహావీరులయిన పాండవుల కెట్టి యాపదలును రాఁజాలవని విదురుఁడు ధృతరాష్ట్రునితో ననుట.
అర. I. 46.

18. దిక్పాలకులు నిన్ను గోరుచున్నారని నలుఁడు దమయంతికిఁ జెప్పుట.
అర. II. 49.

19. దమయంతి యడవిలో నొక యాశ్రమముఁ గాంచుట.
అర. II. 97.

20. నలుఁడు పుష్కరునితో రెండవసారి జూదమాడుట.
అర. II. 229.

21. కాలకేయాదులను జంపుటకై సముద్రజలము ద్రావుమని యగస్త్యునిఁ బ్రార్థింప విష్ణువు మునులను ప్రోత్సహించుట.
అర. III. 16.

22. ఋష్యశృంగమహిమచే అంగదేశమున వానకురియుట.
అర. III. 113.

23. హనుమంతుడు భీమునకు సాయముచేయుదునని చెప్పుట.
అర. III. 352.

24. తామే కౌరవుల గెలువఁగలమని భీముఁడు హనుమతో ననుట.
అర. III. 353.

25. సౌగంధికాపహరణ సందర్భమున భీముఁడు కుబేరసేవకులను ధిక్కరించి పలుకుట.
అర. III. 362.

26. తన్నుఁ బట్టుకొన్న యజగరముతో భీముఁడు తాను పాండుపుత్రుఁడైన భీముఁడగుట వివరించుట.
అర. IV. 107.

ఎఱ్ఱన్న :

1. నారాయణుఁడు మార్కండేయునకుఁ దనప్రభావమును దెలుపుట.
అర IV. 268.

2. నారాయణుఁడు మార్కండేయునకుఁ దనప్రభావమును దెలుపుట.
అర. IV. 279.

3. మార్కండేయుఁడు ధర్మజునకు కలిధర్మములు తెలుపుట.
అర. IV. 305.

4. శలుఁడు వామదేవుని యశ్వములను దాచికొనుట.

ఆర. IV. 340.

5. కువలాశ్వుఁడు విష్ణువును స్తుతించుట.

ఆర. IV. 376.

6. కువలాశ్వుఁడు విష్ణువును స్తుతించుట.

ఆర. IV. 378.

7. ఇంద్రుఁడు కేశితో యుద్ధముచేయుట.

ఆర. V. 180.

8. ఘోషయాత్రయందైన పరాభవమును సైచి దుర్యోధనుఁ డెట్లు బ్రతుకఁగలిగెనని జనమేజయుఁడు వైశంపాయను నడుగుట.

ఆర. VI. 4.

9. సన్యాసిరూపమున నున్న రావణుఁడు సీతకుఁ దన్నెఱింగించుట.

ఆర. VI. 338.

10. వానరసేనావర్ణనము.

ఆర. VII. 64.

11. వానరసేన లంకపై విజృంభించుట.

ఆర. VII. 66.

12. యక్షుఁడు తాను ధర్ముఁడగుట ధర్మజున కెఱింగించుట.

ఆర. VII. 462.

13. ధర్మజుఁడు ధర్మునిఁ గొనియాడుట.

ఆర. VII. 468.

తిక్కన్న :

1. విదురుఁడు ధృతరాష్ట్రుని యవివేకమును నిందించుట.

స్త్రీ. I. 21.

2. విదురుఁడు వార్ధక్యమును వర్ణించుట.

స్త్రీ. I. 41.

3. ధర్మరాజు పశ్చాత్తప్తుఁడై గాంధారితోఁ బలుకుట.

స్త్రీ. I. 175.

4. గాంధారి ద్రౌపది నూరార్చుట.

స్త్రీ. I. 183.

5. శూరసేనుని శవమునుగాంచి గాంధారి విలపించుట.

స్త్రీ. II. 88.

6. భగదత్తుని శవమునుగాంచి గాంధారి విలపించుట.

స్త్రీ. II. 108.

7. శకుని శవమునుగాంచి గాంధారి విలపించుట.

స్త్రీ. II. 138.

8. ధృష్టద్యుమ్న పుత్రుల శవములనుగాంచి గాంధారి విలపించుట.

స్త్రీ. II. 144.

భారతమునందలి నలుబదియేడు మత్తకోకిలములు నానావిధములయిన సందర్భములందు నానారసార్థముల నిర్వహణమునం దుపయుక్తములై యున్నవి. స్తవనమున, ఉపదేశమున, కథనమున, వర్ణనమున, సంభాషణమునఁ బెక్కు తెఱఁగుల నీవృత్త ముపయుక్తమై యున్నది. క్రోధము, శోకము, ఉత్సాహము, పశ్చాత్తాపము, దైన్యము, హర్షము — మున్నగు పెక్కు భావములను వ్యంజించువాక్యము లీఛందమున నిబద్ధములై యున్నవి. యథారసము, యథావసరము కవిత్రయ మీ వృత్తము నెట్లునిర్మించి, యలంకరించి వినియోగించిరో దిఙ్మాత్రము పరిశీలింతము :

"మానితంబగు నాతపోమహిమం ద్రిలోకపరాభవం
జేను జేయఁగఁబూని చేసితి నిట్టి దొక్క ప్రతిజ్ఞ మున్
దీని నెట్టులు గ్రమ్మఱింతు మదీయభాషిత మెన్నఁడు
న్నేని మోఘముగాదు దిగ్ధరణీరవీందు లెఱుంగఁగాన్"

ఆది. VII. 142.

ఔర్వుఁడు తన ప్రతిజ్ఞనుగుఱించి పితృదేవతల కెఱిఁగించుచుఁ బలికినవాక్యమిది. తపోఽహంకారము, క్షత్రియులపట్ల క్రోధము దీపింపఁ బలికిన యీ వాక్యమునం దేడుజగణములు రూపొందుట యుచితముగా నున్నది. మత్తకోకిలమునఁ బాదమునకు రెండుజగణములు శాస్త్రముచే విధింపఁబడియున్నవి. కాని నన్నయ పద్యమునఁ బ్రకాశించు జగణము లవికావు. ఇవి యౌవనచాపల్యమునఁ బలికిన తపోబలమత్తుని వాక్యమున స్వయముగ సిద్ధించినవి. మత్తకోకిల గమనమునం దవరోహణరూప స్ఖలితత్వము సహజముగ నుండవలెను. అట్టిగతి మాధుర్యమత్తతకు లక్షణము. ఔర్వునిమదము ఓజోమయము. కనుక నన్నయ స్ఖలనమును ఉత్ప్లుతిగా భాసింపఁ జేసెను. యతిస్థానమునఁ బదము భిన్నముగామిచేఁ బాదోచ్చారణముకూడ ఓజోదీప్తమగుచున్నది. ఇట్లు నన్నయ మత్తకోకిలమునకు సహజమైన సుకుమార మాధుర్యమును భంజించి దీప్తమాధుర్యమును వ్యంజించెను. ఔర్వుని వాక్యమునందలి క్రోధము స్వతపోబలస్మరణపూర్వక ప్రతిజ్ఞాకథనాత్మకమయిన దీప్తహర్షము. దీప్తహర్షమే గర్వము. ''గర్వో మదః ప్రభావ శ్రీవిద్యాసత్కులతాదిజః''[27] అన్న సాహిత్యదర్పణోక్తిని, ''గర్వో అభిజనలావణ్య బలైశ్వర్యాదిభిర్మదః''[28] అన్న దశరూపకోక్తిని స్మరింపవలెను. తపోబలమత్తుని వాక్యమును ఇట్టి మత్తకోకిలావృత్తమున నిబంధించుట యుచితముగ నున్నది.

"ధారుణీధర ! ధర్మతత్త్వనిధాన ! దానవదర్పసం
హార ! వారిజనాభ ! బంధుజనానురంజనకారి ! నీ

కారణంబునఁజేసి మాకు జగంబునంగల భూపతుల్
భూరివిక్రమవశ్యులై రి విభుత్వ మేర్పడుచుండఁగన్"

సభా. I. 276.

రాజసూయాధ్వరము చేయుమని తన్నుఁ బ్రోత్సహించిన శ్రీకృష్ణదేవుని గొనియాడుచు ధర్మరాజు పలికిన వాక్యమిది. దీనియందు తొంగితొంగి చూచుచున్న జగణములు ధర్మజుని ప్రభావ శ్రీజనితమైన మృదుగర్వమును సుకుమారముగ వ్యంజించుచున్నవి. "గూఢాహంకార రూపమైన[29] యంతర్మదము ధీరోదాత్తనాయక లక్షణము. ధర్మజుఁ డట్టివాఁడు. ఆయనవాక్యము నట్టిద. తమ సర్వాభ్యుదయమునకును తన సోదరుల ప్రతాపము, శ్రీకృష్ణుని కరుణావిశేషము గారణమని ధర్మజుఁ డెఱుంగును. కనుక ఆయన శ్రీకృష్ణ ప్రశంసారూపవాక్యమున నాత్మోత్కర్ష దోఁబూచు లాడుచున్నది. స్తుతి ప్రీతివ్యంజకము. ఈ స్తుతివాక్యము విశేషించి మృదువుగ నలకరింప బడియున్నది. "ధారుణీ" "కారణం" అనుతీరునఁ బ్రథమ తృతీయ చరణములును, "హారవా", "భూరివి" అనుతీరున ద్వితీయ చతుర్థ చరణములును ద్విప్రాసాలంకార ఘటితములై యున్నవి. 'ధర' – 'ధర్మ'; 'నిధాన' – 'దాన'; 'సంహార' – 'వారిజ' – ఇత్యాది పదముల సన్నివేశమున ముక్తపదగ్రస్తాలంకార చ్ఛాయలు శ్రుతిగోచరము లగుచున్నవి. సంబోధనబహుళమై పద్యము సవిరామ సుకుమారముగ నడచుచున్నది. సర్వదిగ్విజేతయై రాజసూయాధ్వరము గావింపనున్న ధర్మజునినోటఁ దత్కాలమందీ మత్తకోకిలాచ్ఛందము పరమోచితమై యున్నది.

శ్రీమద్రామాయణ కథనసందర్భమున నెఱ్ఱన లంకానగరాక్రమణమున వానరసేనల విజృంభణమును మత్తకోకిలమున వర్ణించెను.

"తాలసాలశిలాగ్రహస్తు లుదగ్రగోత్రమహీధరో
త్తాలదేహు లనేకవర్ణులు ధారితాఖిలదిఙ్ముఖా
భీలవాలశిఖాగ్రు లుగ్రగభీరసత్త్వులు వానరుల్
కాలకల్పులు పేర్చి సంతసకట్టి రాహవకేళికిన్"

అరణ్య VII. 64.

సంగరోత్సాహమునఁ జెంగుచెంగున దుముకు వానరవీరు లీ ఛందమునందలి జగణములం దగపడుచునే యున్నారు. గుర్వక్షరములు పెక్కు దీర్ఘాక్షరములై తాలములయు, వానరుల వాలములయు, దేహములయు ఉత్తాలత్వము సుష్ఠుగా రూపింపఁబడుచున్నది. లకార ప్రాసానుప్రాసము వానరుల యుత్సాహానందమును, "గ్ర" పునరావృత్తి వారి శత్రుభీకరత్వమును ధ్వనించుచున్నవి. దృఢములు, మితదీర్ఘములునైన సమాసములు వీచులయొక్కయు, వ్యూహముయొక్కయు దార్ఢ్యమును భాసింపఁజేయుచున్నది. జగణసహితములైన సమాసము లొక్కొక్కటి యొక్కొక్క మహాతరంగమువలెఁ బొంగి సాగుచున్నది. ఈ పద్యమునం దిట్లు నిర్వహింపఁబడిన వానరసేనా

విజృంభణమునం దెట్టనాఠ్యునకు "ఘనసాగర వీచివికాసరేఖఁ గానఁగ నయ్యె" నఁట (65 వ పద్యము).

"జీవమేటికి రాజ్యమేటికిఁ జెల్లెఁ జుట్టల బిడ్డలం
జావఁజూచినయట్టి ద్రోహికి సర్వసంపద లేటికిన్
నావుడున్ మఱుమాటలాడఁగ నాలుకాడక యుండి య
ద్దేవి యూర్పు నిగిడ్చెనుష్ణము, దీర్ఘముం, బరుషంబుగన్"

శ్రీ I. 175.

"క్రోధపరుషాక్షరంబుల నిమ్మహారాజెచట నున్నవాఁడనిన" "భయకంపిత గాత్రుండగుచుం జేతులు మొగిచి సవినయంబుగా మెత్తనిమాటల" ధర్మజుఁడు గాంధారితోఁ బలికిన వాక్యమిది. వృత్తమునఁ బూర్వార్ధము ధర్మజవాక్యము. సవినయముగ నాయనపలికిన మెత్తనివాక్యమునం దొక్క జగణముగూడ కనంబడదు. గల, భ, గల, భ రూపములఁ బదములు ఘటితములై మత్తకోకిలమునకు సహజమైన యవరోహణాత్మకమిశ్రగతి సుష్ఠుగా రూపుదాల్చినది. క్రోధ పరుషమైన గాంధారి చిత్తవృత్తియందలి త్వరయంతయు ధర్మజుని వాక్యమందలి యవరోహణ ప్రభావముచేతను సప్తమాత్రాకములయిన యావృత్తుల విలంబితవర్తన ప్రభావముచేతను బూర్తిగా గళితమైపోయినది. ఆమె మఱుమాటలాడ నాలుకాడక ఉష్ణము, దీర్ఘము, పరుషము, నగు ఊర్పు నిగిడ్చినదఁట. ఆయూర్పే అక్షరసహితమైన వాక్యముగా రూపొందినచో నెట్లుం డునో భావుకు లూహింపవలసియున్నది. ఆ యూర్పును దిక్కనయే ఛందోమయవాక్యముగఁ దీర్చియుండినచో ఛందఃపరమరహస్యమొకఁడు లోకమునకు లభించియుండెడిది.

"అంగదంబులుఁ గంకణంబులు హారవల్లులు నాదిగా
నంగకంబు భూషణంబులు హారికాంతి వెలుంగఁగా
సంగరాంగణ భూమికిందమ చారుభావ మలంక్రియా
సంగతింగలిగింప నొప్పిరి శౌరి చూచితె వీరలన్"

శ్రీ. II. 145.

"ద్రోణ బాణ సంపీడితప్రాణులై పడియున్న" ధృష్టద్యుమ్న నందనులను జూపి గాంధారి శ్రీకృష్ణునితోఁ బలికిన వాక్యమిది. సమరతలమున వీరశయనమందియున్న పుత్రపౌత్ర బంధుజనములను దిలకించి, తిలకించి, వారికై విలపించు నారీజనముల శోకాలాపములు విని విని గాంధారి హృదయము కరుణరసనిర్భరమై యున్నది. ఆమె యాత్మశోకదుఃఖమును మఱచి యన్యశోక తాదాత్మ్యమునఁ బరమార్ద్రమధురచిత్తయై యున్నది. శత్రుమిత్రభేదము విస్మరించి రణనిహతులై పడియున్న వీరులనెల్లరను పరమప్రీతితోఁ బ్రశంసించుచున్నది. వీరమరణమునందిన బాలురగు ధృష్టద్యుమ్ననందనులను బ్రశంసించు గాంధారీవాక్యము తాలలయాన్వితమై మధుర

గీతమువలె శ్రవణానందకరమగుచున్నది. నారీజనశోకాలాపములం దీ యంశము లోకప్రసిద్ధమై యున్నది.

గాంధారికి యుద్ధభూమి తొలుత బీభత్సభయానకదృశ్యమయముగ గోచరించెను. క్రమ క్రమముగ నాస్థితి మారి సమరభూమి సమలంకృతమైన యొక రంగభూమివలె నామెకు భాసింపఁ జొచ్చినది. ఆమె యిప్పుడు ప్రేక్షకస్థానీయ. నానావిధములయిన భూషణములు తమ గాత్రముల నలంకరించుచుండ రణభూమిఁ బడియున్న వీరకుమారుల చారుభావము సంగరాంగణ భూమికి అలంక్రియాసంగతిం గలిగించుచున్నదఁట సమలంకృత సమరాంగణ వర్ణనాత్మకమైన గాంధారీవాక్యమును సమలంకరించి కవిబ్రహ్మ తన శిల్పపారంగతత్వమును జాటుకొనినాఁడు. ప్రాసస్థానమందలి బిందుపూర్వక గకారము స్థానాంతరములందుఁ బునఃపునరావృత్తమై యను ప్రాసాలంకారమును రూపించుచు రమణీయముగ నలంకృతమైన సమరాంగణమునఁ గాంస్యతాల ధ్వనులను కంగుకంగున వినిపించుచున్నది.

# తరలము

ఇది అతిధృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 19 అక్షరములు. గణములు : న భ ర స జ జ గ. 11 అక్షరములమీఁద యతి.

సంస్కృతమున హేమచంద్ర జయకీర్తులు మాత్రమే దీనినిఁ జెప్పిరి. మత్తకోకిలపాద ప్రథమాక్షరమైన దీర్ఘమును రెండు హ్రస్వములుగా మార్చినచో తరలము ఏర్పడును.

3 + 4 = 7 మాత్రల యావృత్తులతో నిదియు మత్తకోకిలవలె మిశ్రగతియందు నడచును. లక్షణమున గోచరించు భేదము మత్తకోకిలా తరలములకు గతియందు, లయయందు గోచరింపదు.

న భ గలభ గలభ గలగ యనుతీరున లక్షణము విధించినచో తాలలయాన్వితమైన దీని గతిని సూచించినట్లయ్యెడిది. 19 అక్షరములలో 12 లఘువులైన దీనిగతి ద్రుతమని చెప్పఁ దగును. సప్తమాత్రాఖండావృత్తి యగుటచే తాలాశ్రయమైనలయ విలంబితము. కనుక తరలముకూడ మత్తకోకిలమువలె మధురభావముచే త్వరితగతియైన హృదయస్థితిని వ్యంజించుటకుఁ దగియున్నదని భావింపవచ్చును.

తరలము అనఁగా చంచలము, తరంగితము, కంపితమునని యర్థములు. తరలవృత్త గతియు నట్టిదే. హర్షాదులవల్ల హృదయగతి చంచలమైన యవస్థను వర్ణించుటకు తరలము తగియుండునని చెప్పవచ్చును.

ఆంధ్రమహాభారతమున మొత్తము 38 తరలవృత్తములు గలవు. వీనిలో—

నన్నయ్య రచించినవి — 25
ఎఱ్ఱన్న రచించినవి — 8
తిక్కన్న రచించినవి — 5

తరలవృత్తమును నన్నయ్యయు, ఆయననుసరించి ఎఱ్ఱనయు ఎక్కువగా నుపయోగించి నట్లు స్పష్టమే. తిక్కన స్త్రీపర్వమందే తరలములు వాడెను.

కవిత్రయము తరలవృత్తము నెట్టిసందర్భముల నుపయోగించిరో పరిశీలింపవలెను.

నన్నయ్య - 25

1. హరిహరాజగజాననార్కాది దేవతలను స్తుతించుట.
ఆది. I. 21.
2. పదునెన్మిదినాళ్ల జరిగిన భారతయుద్ధము - సేనాపతులు.
ఆది. I 67.
3. వినత, కద్రువ తమకుఁ బుత్రులను బ్రసాదింపుమని కశ్యపునిఁ గోరుట.
ఆది. II. 3.
4. ఆస్తీకుఁడు సర్పయాగమున జనమేజయుని దీవించుట.
ఆది. II. 224.
5. తన్నుఁ గోరిన పరాశరునితో మత్స్యగంధి మొఱపెట్టుకొనుట.
ఆది. III 40.
6. దేవయాని యయాతికిఁ దన్నెఱింగించుకొనుట.
ఆది. III. 142.
7. గంగాజలములకు సేతువులు కట్టుచున్న భీష్ముని శంతనుఁడు చూచుట.
ఆది. IV. 164.
8. కిందముఁడు పాండురాజును శపింపఁబోవుట.
ఆది. V. 51.
9. దుర్యోధనుఁడు పురోచనుని లక్కయిల్లు గట్టఁబంపుట.
ఆది. VI. 138.
10. భీముఁడు బాగుగా భుజించి బకునిఁ జంపఁబోవుట.
ఆది. VI 288.
11. ద్రౌపదిజన్మకాలమునం దామె రూపవర్ణనము.
ఆది VII. 19.
12. నారదుఁడు ధర్మజాదులకు సుందోపసుందకథఁ జెప్పవచ్చుట.
ఆది. VII. 90.

13. సౌభద్రతీర్థమున స్నానమాడఁబోవు అర్జునుని మునులు వారించుట.
ఆది. VIII. 148.

14. జరాసంధునిఁ గృష్ణుఁడు మందలించుట.
సభా. I. 191.

15. రాజులను బలియిచ్చుట తగదని కృష్ణుఁడు జరాసంధునితో ననుట.
సభా. I. 192.

16. అర్జునజితులై యుత్తరకురుభూముల రాజులు ధర్మజునకు కప్పమిచ్చుట.
సభా. I. 240.

17. యాగభంగముగాకుండ రాజులను వారింపుమని ధర్మజుఁడు భీష్మునిఁగోరుట.
సభా. II. 35.

18. పాండవులు జూదమందోడిన రాజ్యమును ద్రౌపది సంపాదించి యిచ్చుట.
సభా. II. 268.

19. పాండవు లడవులపాలగుటకు కుంతి శోకించుట.
సభా. II. 287.

20. పాండవులప్రతిజ్ఞలు విని ధృతరాష్ట్రుఁడు విలపించుట.
సభా. II. 310.

21. పాండవులను బిలిపింపుమని విదురుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట.
సభా. II. 314.

22. భీమకిమ్మీరులు పోరాడుట.
అర. I. 118.

23. ఇంద్రుఁడు అర్జునునిఁ బొగడుట.
అర. I. 374.

24. బలరాముఁడు దుర్యోధనుని దండించి పాండవులకు రాజ్యమిత్తుననుట.
అర. III. 166.

25. సౌగంధికరక్షకులు భీముని నిరోధించుట.
అర. III. 360.

ఎఱ్ఱన్న – 8

1. కువలాశ్వుఁడు రాక్షసులఁ జంపఁబోవుట.
అర. IV. 403.

2. ఇంద్రుఁడు కుమారస్వామి నెదిరించుట
అర. V. 217.

3. అర్జునుఁడు గంధర్వులతోఁ బోరుట.
అర. V. 420.

4. పరాభవఖిన్నుఁడై యున్న దుర్యోధనుని శకుని మందలించుట.
అర. VI. 32.

5. స్వప్నమునఁ దోచి రాక్షసులు దుర్యోధనునకు ఉత్సాహముకలిగించుట.
అర. VI. 48.

6. ద్యుమత్సేనుఁడు కొడుకునుగానక విలపించుట.

ఆర. VII. 270.

7. కొలనియొడ్డునఁ బడియున్న తమ్ములఁగాంచి ధర్మజుఁడు విలపించుట.

ఆర. VII 403.

8. ఆశ్వాసాంత పద్యము.

ఆర. VII

తిక్కన్న – 5

1. శోకవికలాత్ముఁడైన ధృతరాష్ట్రుని వర్ణన.

స్త్రీ. I. 4.

2. దుర్యోధనకళేబరముఁ జూచి గాంధారి విలపించుట.

స్త్రీ. II. 27.

3. దుశ్శాసనకళేబరముఁ జూచి గాంధారి విలపించుట.

స్త్రీ. II. 63

4. అభిమన్యునిగూర్చి ఉత్తర విలపించుట.

స్త్రీ. II. 79.

5. కర్ణునిగూర్చి కుంతి విలపించుట.

స్త్రీ. II. 174.

కవిత్రయమువారి తరలవృత్తప్రయోగము నానారసభావములం దగపడుచున్నది. రతి, విస్మయము, ప్రీతి, హర్షమున్నగు మధురభావములందును, క్రోధము, భీతి, దుఃఖము మున్నగు దీప్తభావములందును తరలవృత్తప్రయోగమున్నది. ద్రుతకథనమున, క్రియాత్వరా వర్ణనమునఁ దరలప్రయోగము కనఁబడుచున్నది. కొన్నియెడల నామముద్రయుఁ గలదు. తిక్కన తరలములన్నియు శోకతరళ చిత్తవృత్తివ్యంజకములుగనే యున్నవి.

"కనియె ముందట నమ్మహీపతి గాంగసైకతభూములం
బనుగొనం ధను వభ్యసించుచు బాణసంహతి నేతులన్
ఘనముగా నమరాపగౌఘము గట్టియున్న కుమారు న
త్యసఘు నాత్మసమాను నాత్మజు నాపగేయు మహాయశున్"

ఆది. IV. 165.

"కని పుట్టిననాఁడ చూచినవాఁడుగావున నప్పు డెఱుంగనేరక విస్మయాకులితచిత్తుఁడై యుండె". శరసేతుబంధనమున గంగాప్రవాహము నరికట్టియున్న యాత్మసదృశుఁడైన బాలుఁగాంచి హర్ష, విస్మయ, శంకాకులుఁడైన శంతనుని చిత్తవృత్తిని మిశ్రగతిచే దరలవృత్తియైన వృత్తమున వర్ణించుట యౌచిత్యభాసురముగ నున్నది. అనుస్వారానునాసిక వృత్తిసహితమైన మహాప్రాణాక్షరానుప్రవేశము విస్మయహర్షామోదమును జక్కఁగా వ్యంజించుచున్నది.

"ధరణిలోఁ గల రాజులెల్లను దారుణక్షయకాలసా
గరములట్లు గలంగి రిప్డు మఖప్రయోగము విఘ్నముం
బొరయకుండఁ బ్రజాపకారము వృష్టికుందఁగ నీవు చె
చ్చెరఁ బితామహ వీరి కిప్పుడు చిత్తశాంతి యొనర్పవే."

సభా. II. 35.

"సకలక్షత్రియక్షోభంబు సూచి భయసంభ్రమాక్రాంత హృదయుండయి" ధర్మరాజు భీష్మునితో నన్న వాక్యమిది. ఎదనెద జగణస్వరూపము భాసించి ధర్మజుని యాగభంగ భయోత్పత్తిని వ్యంజించుచున్నది. ప్రాసమందలి రేఫము స్థలాంతరములందు విరళముగ ననువృత్తమై ధర్మజుని చిత్తతారళ్యమునఁ గొంత పారుష్యరూపమైన దీప్తిని స్ఫురింపఁజేయుచున్నది. విస్మయతారళ్యము కంటె భయతారళ్యము భిన్నమగుట వర్ణభేదముచే సూచింపఁబడినది.

"ఇది మనుష్యకృతంబు గాదు సురేంద్రకిన్నరపన్నగ
త్రిదశనిర్మితమైన కర్మము దీని నెంతయు నేర్పడం
బిదపఁ జూచెదఁగాక యంచు విభీతిదూరుఁడు నీరువ
ట్టొదవఁ దత్సలిలాశయంబు సముత్సుకుండయి చొచ్చినన్"

అరణ్య. VII. 403.

"పద్మాకరకూలంబునందు నిద్రావివశులుంబోలెఁ బడియున్న తమ్ములంగని దుఃఖితుండై" ధర్మజుఁడనిన వాక్యమిది. ధర్మజుని దుఃఖమున విస్మయము, భీతి మిశ్రితములయియే యున్నవి. వాక్యారంభము జగణబహుళమై విస్మయభయోద్రేకమును వ్యక్తముచేయుచున్నది, కాని ఆయన 'విభీతిదూరుఁడు' కనుక నాయుత్పత్తి వెంటనే యణఁగిపోయినది. తారళ్యమునందును ధీరత్వము వీడని ధర్మజుని శీలమునకుఁ దగిన ట్లీపద్యము గాంభీర్యము నొలుకఁబోయుచున్నది. 'కిన్నర పన్నగ' 'నిర్మితమైనకర్మము' ననుపట్టుల శబ్దాలంకారము నిర్మింపఁబడి వాక్యము ఆమహాప్రభువు యొక్క ధీరపురుషలక్షణమును, మూర్తిమత్త్వమును స్ఫురింపఁజేయుచున్నది. ప్రయత్న నిర్మితమైన కర్మము శిల్పమనఁబడును. ప్రయత్ననిర్మితమైన యిచ్చటి యలంకారము భీమాదుల యవశదశాగతి త్రిదశులకుటిలశిల్పమనుటను ధ్వనించుచున్నది, ఎట్టిన యీతరళవృత్తనిర్మాణము రమణీయశిల్పమై యాశ్చర్యముగొలుపుచున్నది.

"శౌరిని వారలచేతి యున్నతభూరుహాయుధముల్ పర
స్పరకఠోరశిరఃస్థలంబులపై వడిం బడి మత్తకుం
జర శిరఃపతితంబులైన లసన్మృణాళములట్లు జ
ర్జరితమయ్యెఁ దదారవప్రతిశబ్ద మొప్పనగంబులన్"

అర. I. 118.

"దారుణభంగిఁ బొంగి కిమ్మీరసమీరసూనులు సమీరవిధూతపయోధులట్లయై" "యొక్కముహూ ర్తంబు వృక్షయుద్ధంబు" సేసినతెఱంగు నన్నయ తరలవృత్తమున వర్ణించెను. కిమ్మీర సమీర కుమారుల దారుణభంగియైన పొంగు దీనియందలి యేడుజగణములలోఁ జూడవచ్చును. శాస్త్రము విధించినపట్టులందుఁ గాక స్థలాంతరములం దాజగణములను స్ఫురింపఁజేసి నన్నయ పద్యమునఁ గాంటియను గుణమునుఁ బుష్కలముగ సాధనముచేసెను. ప్రాసమునందలి రేఫము స్థలాంత రముల బహువారములావృత్తమై "తదారవము" పద్యమునఁ బ్రతిశబ్దమిచ్చుచున్నట్లున్నది. పద్యము చెంగుచెంగున దుముకుచు 'ముహూర్తంబు' మాత్రన ముగిసినదా యనిపించుచున్నది. హ్రస్వగురువులచేత వృత్తగమన మతిత్వరాన్వితమగుచు వర్ణితమైనభీమకిమ్మీరుల రణక్రియా త్వరను చక్కఁగా రూపించుచున్నది.

"అరులనెల్లను గెల్చి మేదినియంతయుం గొని తేజముఞ
సిరియుఁ బెంపును గీర్తియుఞ విలసిల్లగా మనుచుండియుఞ
బురుషసింహులు పాండుభూవరపుత్రు లక్కట మోదముం
బొరయనేర్తురె నిన్నుఁ గోల్పడిపోయి పుష్కరలోచనా"

శ్రీ. II. 80.

అభిమన్యునిగూర్చిన యుత్తర విలాపవాక్యమిది. ఛందమునందలి తాలాశ్రయములయిన యక్షరావృత్తులు విశేషభాగము విభాగశః గోచరించి తాలనిరూపితమైన లయ పద్యమున స్ఫుట ముగ భాసించుచున్నది. శోకైకతానమైన యుత్తరచిత్తవృత్తి ఇట్టి స్ఫుటలయాన్విత మధురపద వృత్తిచే శ్రోతృచిత్తమునఁ జక్కఁగా సమర్పితమగుచున్నది. తాలపాతానుకూల పదనివేశము సహృదయశ్రోత్రైకతానతాసంపాదకమై వాక్యసమర్పితమైన యర్థమున చిత్తమున కేకాగ్రవ్యాప్తిని సమకూర్చుచున్నది.

"తరళదీధితిపుంజ నిర్భరదారుణాయుధపాణులై
తెరలఁ ద్రోచి దివౌకసుల్ పఱతెంచి యార్చుచుఁ దాఁకి రా
శరవణోద్భవు నాతఁడుం దగ సంభ్రమస్ఫుటరోషవి
స్ఫురితనిష్ఠురహాసజృంభణముఞ వహించినఁ జెచ్చెరఞ"

ఆరణ్య. V. 217.

"సంభ్రమస్ఫుట రోషవిస్ఫురణము"నఁ దరళవృత్తత్వరగతి యుచితము. దివౌకసులు పఱతెంచు త్వర యెట్లీపద్యగమనమున స్ఫుటమగుచున్నదో అట్లే జగణస్థగనముచే శరవణోద్భవుని నిష్ఠుర హాససూచితమైన యనుద్రిక్తనిశ్చలస్థితియు వ్యక్తమగుచున్నది. ముద్రాలంకారము ఛందో ముఖమునకుఁ బ్రస్ఫుటమైన శోభను గలిగించుచుండుట సులక్షణీయము.

# ఉ త్సా హ ము

ఇది జాతివృత్తము, ఏడు సూర్యగణములపై నొక గురువు. ఐదవగణము మొదటి యక్షరము వడి.

"జాతి ర్మాత్రాకృతా భవేత్" ఛందోమంజరి. 1-4

"జాతి ర్మాత్రాగణాశ్రితా" జయకీర్తి. 1-20

"మాత్రాభి ర్గణనా యత్ర
సా జాతి రితి కాశ్యపః" అగ్నిపురాణము

"ఉపగణమాత్రాభిరన్వితా జాతిః"[30]

వృత్తము, జాతి యన్న లౌకికచ్ఛందోభేదములందు వృత్తము అక్షరసంఖ్యాతము. జాతులలో ప్రాసనియమములేనివి ఉపజాతులు. గురులఘువులలో ప్రథమపాదాదియందు ఏదియుండునో తక్కినపాదములయందును అట్లే యుండవలెనని జాతులకు నియమము. ఉపజాతుల కీనియమము లేదు.

ఉపజాతులను ప్రాసము, పాదాద్యక్షరనియమము పాటించి జాతులుగా మార్చుకొనవచ్చును. అట్లే సర్వపాదములందును గురులఘునివేశము ఏకరూపముచేసి జాతులను వర్ణవృత్తములుగా మార్చుకొనవచ్చును.

ఉత్సాహము వృత్తముకాదనియు జాతియనియు పై నియమభేదములవల్ల స్పష్టమే. కాని వృత్తశబ్దము కేదారభట్టాదులు సర్వపద్యములకు సామాన్యవాచకముగా నుపయోగించియున్నారు. వర్ణమాత్రాచ్ఛందము లన్నింటిని వర్ణించిన తనగ్రంథమునకు కేదారభట్టు వృత్తరత్నాకరమని పేరుపెట్టెను. ఆ గ్రంథమున జాతిభేదములనుగూడ వర్ణించెఁగదా! శ్రవ్యత దేనియందు వర్తించునో అది వృత్తమని యభినవు లన్నమాట సమంజసముగనున్నది. అట్టివృత్తము అక్షరగణాన్వితమైనచో అక్షరవృత్తము, మాత్రాగణాశ్రితమైనచో మాత్రావృత్తము. ఉత్సాహము మాత్రావృత్తము అనఁదగును. కందము చతుర్మాత్రాగణనిర్మితమైనట్లు ఉత్సాహము త్రిమాత్రాకగణనిర్మితము. మాత్రాసంఖ్యాసమకములైన గణములతో నిర్మించినపద్యములు జాతులు. చతుర్మాత్రానిర్మితమైన కందము, త్రిమాత్రాక గణనిర్మితమైన ఉత్సాహము జాతులలో విలక్షణమైనవి. వీనిని తత్సమజాతు లనఁదగును.

"ఊహ నేడకాగ హగణమొండె నగణమొండెఁ ద
త్సాహచర్యమొండె గురుకసహితముగ నొనర్ప ను
త్సాహమయ్యె—" కవిజనాశ్రయము. పుట. 47.

ఆంధ్రలాక్షణికులందఱు నిదేతీరు లక్షణముచెప్పిరి. సంస్కృతలాక్షణికులలో ఉత్సాహవృత్తమును జెప్పినవాఁడు జయకీర్తి యొక్కఁడే.

"ఊహితోక్తితో గలాంశసప్తకం నిరంతరం;
గో హి నైధనే; సకారసప్తకం యదా ఽ భవా;
వ్యాహితం తదుభమిశ్రసప్తకం యదా తధో
త్సాహ మాహు రుత్సవం చ గోగ్రహాదికే బుధాః"

VI. 30.

గల నగణములం దేయొక్కదానిచేనైన ఉత్సాహమును నిర్మింపవచ్చును. రెండిటి సాంకర్యమునను నిర్మింపవచ్చును.

ఏడు గలములమీఁది గురువు గలది ఉత్సాహమే. అయినను —

"ఏడుహమ్ములుఁ గముఁ వడెన్మిదిఁ సుగంధికిఁ"

అని చిత్రకవి పెద్దన చెప్పనేల? లక్షణసార సంగ్రహము. పుట. 33.

"ఆనతారి రేచ హంసయాన కొప్పు గుంజర
స్థానవిశ్రమంబు గో ర జ ద్వయంబు రేఫతో

పుట. 23.

అని కవిసార్వభౌముఁడు చెప్పనేల?

"అవిరళమతి కురుకువరదుఁడని విచికిలిత బదుమూ
డవయెడ వడి యిరువదియొకలఘువు గము బలుకనగుఁ"

4–349

అని యప్పకవి చెప్పనేల?

ఏడినగణములపై గురువు అనఁగా –
ఏడు హగణములపై గురువు — సుగంధి
ఏడు నగణములపై గురువు – విచికిలిత

అనుటయందు సామంజస్యము లేదనవలయును.

అట్లే ర జ ర జ ర యన్నచో హంసయాన యనుటయు నసమంజసమే. ఏడు హముల మీఁద గ యన్నను ర జ ర జ ర యన్నను ఒక్కటియే. అక్షరవర్గీకరణభేదమే కాని యక్షరక్రమభేదము లేదు. కనుక సుగంధి, హంసయాన, విచికిలిత యన్నవి యుత్సాహవృత్తభేదములే

కాని అన్యవృత్తములు కావు.* ఈ తీరున వృత్తభేదము చెప్పఁబూనినచో కందము, గీతము, ఆటవెలఁది, సీసము మున్నగువానియందు అనంతభేదములు చెప్పవచ్చును.

ఏడు త్రిమాత్రాక ఖండములపై నొక్కగురు వుండుట ఉత్సాహవృత్త లక్షణము. అనఁగా ఉత్సాహము త్ర్యస్రగతివృత్తము. ఆ వృత్తియందలి మూఁడుమాత్రలు నగణముగాని, హగణముగాని కావచ్చును. నగణ మావృత్తమైనచో గతి ద్రుతతరమగును. హగణ మావృత్తమైనచో గతి మధ్యమగును. నగణ హగణములు పర్యాయావృత్తములయినచో గతి ద్రుతమగును. త్ర్యస్రగతియగుటచే లయ ద్రుతమే. గలాంశబాహుళ్యముచే అవరోహణము కలుగును. అవరోహణమున ద్రుతగతి గనుక మధురభావములచే త్వరాన్వితమైన చిత్తవృత్తిని వ్యంజించుటకు ఉత్సాహము యోగ్యము అగునని భావింపఁదగును.

ఆంధ్రమహాభారతమున 13 ఉత్సాహవృత్తములుకలవు. వీనిలో —

నన్నయ్య రచించినవి — 4
ఎఱ్ఱన్న రచించినవి — 2
తిక్కన్న రచించినవి — 7

తిక్కన్న యుత్సాహవృత్తము లన్నియు స్త్రీపర్వమందే యున్నవి.

ఉత్సాహము వీరరస స్థాయిభావము. నామసామ్యమునుబట్టి ఉత్సాహవృత్తము ఉత్సాహస్థాయివ్యంజకమని విశ్వసింపఁబడుచున్నది. ద్రుతగతిచేతకూడ ఈ వృత్తము ఉత్సాహవ్యంజకము కాఁగలదు. అవరోహణగతి యైనప్పుడు యుద్ధోత్సాహవ్యంజనమున నంత సమర్థము కాఁజాలదని చెప్పవలసియుండును. యుద్ధవీరుని హృదయగతి యోజోమయమైన యారోహణ రూపమున నుండవలెఁగదా!

కవిత్రయ మీవృత్తము నెట్టి సందర్భముల నుపయోగించిరో పరిశీలింపవలయును —

నన్నయ్య — 4

1. కురుకుమారులు ద్రుపదుని బంధించి తేఁబోవుట.

ఆది. VI. 65.

2. భీముఁడు పూర్వదిక్పతుల నోడించుట.

సభా. I. 244.

---

* నాల్గుపాదములందును గురులఘుక్రమ మొక్కతీరుననే యుండిన యుత్సాహభేదములను వృత్తభేదములుగా నిబంధించుట యీ లాక్షణికుల తాత్పర్యము కావచ్చును.

3. ఆశ్వాసాంతమున రాజరాజ స్తుతి.

సభా. II. 321.

4. ఆశ్వాసాంతమున రాజరాజ స్తుతి.

ఆర. I. 400.

ఎఱ్ఱన్న - 2

1. రాముని( బరాభవించుటకు( దోడ్పడుమని రావణు(డు మారీచు నడుగుట.

అరణ్య. VI. 318.

2. రామరావణుల ద్వంద్వయుద్ధము.

అరణ్య. VII. 76.

తిక్కన్న - 7

1. సంసారగహనమున కూపమున( బడియుండి విప్రు(డు మధుధారలు గ్రోలుట.

స్త్రీ. I. 48.

2. శోకము మానుమని వ్యాసు(డు ధృతరాష్ట్రునకు బోధించుట.

స్త్రీ. I. 66.

3. కౌరవనాశనము దేవగుహ్యమని వ్యాసు(డు ధృతరాష్ట్రునకు( దెలుపుట.

స్త్రీ. I. 85.

4. గాంధారి బాహ్లికుని శవమును గాంచి విలపించుట.

స్త్రీ. II. 93.

5. గాంధారి సైంధవుని శవమును గాంచి విలపించుట.

స్త్రీ. II. 100.

6. గాంధారి జయత్సేనుని శవముని గాంచి విలపించుట.

స్త్రీ. II. 141.

7. గాంధారి సుకేతుని శవమును గాంచి విలపించుట.

స్త్రీ. II. 152.

ముువ్వురలో తిక్కన్నయే ఉత్సాహవృత్తము నెక్కువ పర్యాయములు వాడెను. ఆయన రచించిన ఏడు ఉత్సాహవృత్తములును కరుణరసప్రధానమైన స్త్రీపర్వమునందే యుండుట ముఖ్యముగా గమనింప(దగిన విషయము.

నన్నయ రచించిన యుత్సాహవృత్తములు నాల్గింటిలో రెండు రాజరాజ స్తుతియందు వినియుక్తములు. మిగిలినవానిలో నొకటి కురుకుమారులు గురుదక్షిణగా ద్రుపదుని బంధించి తెత్తుమని యుత్సహించి బయలుదేరుటను వర్ణించునది.

దాన, ధర్మ, దయా యుద్ధాది భేదములచే వీరము బహుప్రకారములై యున్నదని రస దార్శనికులు వివేచించిరి. బహుప్రకారమయిన వీరమునకు స్థాయియైన యుత్సాహముకూడ

బహుప్రకారమనుట న్యాయము. దానదయావీరములకు స్థాయియైన యుత్సాహము శుద్ధసాత్త్వికము. యుద్ధవీరస్థాయి రజోబహుళము. ఉద్ధతవీరులందు అదియే తమోనువిద్ధమై క్రోధకల్పమగును. ప్రతినాయక వధాంతమైన వీరము తద్విజయమాక్రాంతమైన వీరముకంటె పరుషతరము. అవరోహణద్రుతగతియైన యుత్సాహవృత్తము దీప్తవీరరసవ్యంజనమున సమర్థము కాఁజాలదు. అట్టి రసములందు వినియుక్తమైన యుత్సాహము గతిత్వరచేత రసవ్యక్తికిఁ గారణము కాకున్నను సహకారి కాఁగలదనియు, అట్టి వృత్తవినియోగము నామాశ్రితమైన అర్థ చమత్కారజనకము మాత్రమే యగుననియుఁ జెప్పఁదగును.

"ఉత్సాహ స్సర్వకృత్యేషు సత్వరా మానసీ క్రియా
సహజాహార్యభేదేన స ద్విధా పరికీర్తితః"

(భావప్రకాశము : 34 పుట)

నన్నయ్య రచించిన మొదటి యుత్సాహవృత్తమందలి కురుకుమారుల యుత్సాహము ఆహార్యము – కృత్రిమము – ఆభాసము. కురుకుమారుల ద్రుపద విజయయాత్ర నిష్ఫలమై వారి యుత్సాహము ఆభాసముగాఁ బరిణమించుటచేత నన్నయ్య ఆ సందర్భమున నుత్సాహవృత్తము వాడుట యుచితముగ నున్నది. ఉత్సాహవృత్తము ఉత్సాహాభాసవ్యంజకమని నన్నయ్య భావించి యుండెనని యూహింపవచ్చును. ఆ సందర్భమున అర్జునుని వాక్యములు (68, 69, పద్యములు) దీనిని సమర్థించుచున్నవి.

"ఏల దీని నెడయుఁజేయ నీక్షణంబ యేఁగి పాం
చాలుఁ బట్టితెత్త మధికశౌర్యలీల మెఱయఁగాఁ
బోలు ననుచుఁ బెరేఁగి రాజపుత్రు లరిగి యార్చి పాం
చాలుపురము ముట్టికొని రసంఖ్యబలసమేతులై"

ఆది. VI. 65.

ఈ యుత్సాహమునఁ బాండవులు పాల్గొనకుంటయు గుర్తింపవలెను.

నన్నయ్య సభాపర్వ ప్రథమాశ్వాసమున భీముని పూర్వ దిగ్విజయ యాత్రాఫలితములను వర్ణించుచు వ్రాసిన 244వ పద్యము ఉత్సాహము. ఇది భీముని యుత్సాహమును కాక ఉత్సాహ ఫలమును వర్ణించుచున్నదని గుర్తింపవలెను. విశేషించి ఇది కవివాక్యము. ఉత్సాహియగు నాయకుని చిత్తము కార్యముయొక్క ఆరంభావస్థయందు ఆరోహణగతి, నిర్వహణావస్థయందు అవరోహణగతి యగుట సహజము. ఫలప్రాప్తిచే నాయకుని చిత్తము, తత్సంవాదమున భావుకుఁడైన కవిచిత్తము అవరోహణద్రుతగతిచే మాధుర్యయుక్తములగునను భావము మర్మజ్ఞులెఱిఁగినయంశము. నన్నయ్య రసభావమర్మజ్ఞతకీ యుత్సాహవృత్తప్రయోగము ఒక చక్కని నిదర్శనము.

ఎట్టన్న శ్రీరామచంద్రునిఁ బరాభవించు యత్నమునఁ దనకుఁ దోడగుమని రావణుఁడు మారీచునిఁగోరు సందర్భమున నుత్సాహవృత్తమును వ్రాయుటయందును నిగూఢశిల్పము గలదు. స్వయముగ కార్యము నిర్వహింపలేని యిచ్చటి రావణుఁడు సచివాయత్తసిద్ధి యగుటచే మధ్యముఁడు; కుటిలనీతి యగుటచే అధముఁడు నగుఁదగిన నాయకుఁడు. వాని యుత్సాహము దుర్బలము, కృత్రిమమునై ఫలనిర్వహణసమర్థము కాఁజాలదు. వక్తయైన రావణుని చిత్తస్థితి యిది. ఇఁక శ్రోతయైన మారీచుఁడు వీరపుబొత్తము కట్టిపెట్టి నిర్వేదముచే మునియైనవాఁడు. రావణుని వాక్యము వానియందు ఉత్సాహమును వ్యంజించుటకు మారుగా భీతిని రేకెత్తించినవి. నగణబాహుళ్యమున త్వరాతిశయత్వము ప్రాపించిన యిచ్చటివృత్తము రావణుని వీరిముకంటె అవిమృశ్యకారితారూపమైన సాహసమును సమర్థించుచున్నది. ఎడనెడ భాసించుచున్న జగణస్వరూపము రావణుని చిత్తమందలి దీప్తినిఁ బట్టియిచ్చుచున్నది. యుద్ధవీరము వ్యంజించుటకుఁ గావలసిన దీప్తిని జగణస్ఫురణచే ఎట్టన యీ వృత్తమునకు సమకూర్చెను.

రామరావణద్వంద్వయుద్ధ సందర్భమునఁ దాను ఉపయోగించిన ఉత్సాహవృత్తమున నెట్టన మిక్కిలి ప్రయత్నపరుఁడగుట గుర్తింపవచ్చును.

> "అమరవైరివిభుఁడు దశరథాగ్రసుతుఁడు నేపునన్
> సమరసత్ప్రతాపకోప జాజ్వలత్ శరీరులై
> తుములబాణపటలవృష్టిఁ దొప్పఁదోగి యిర్వురున్
> దమక మేది తమక తమక తనిసి రాహవంబునన్"

అర. VII. 76.

ఇదియు నగణబాహుళ్యమున ద్రుతతరగతి యగుచున్నది. "సత్" "జ్వలత్" అను తకారాంతపదములు ఆ ద్రుతికి కార్కశ్యమును ఆపాదించుచున్నవి. "ప్రతాప" "శరీరు" అన్న పదములు జగణోత్ప్లుతిని గలిగించుచున్నవి. ఇట్లు వృత్తమునం దారోహణరూపమైన ఓజస్సు ఉత్పన్నమై సమాసభూయస్త్వరూపమైన యోజస్సుతోఁ గలిసి వర్ధిల్లినది. ఇంతవఱకు ద్వంద్వరణారోహణము. వృత్తము నుత్తరార్థమున రణముయొక్క అవరోహణము జగణ నిరాకరణమున గుర్తింపవచ్చును. నాయకప్రతినాయకులు తీవ్రరణముచే అలసిపోవుటను ఈ వృత్తము వర్ణించుచు చిత్తస్పంద ప్రకోపప్రశమనములను అక్షరవిన్యాసశిల్పముచే రూపించుచున్నది.

ఉత్సాహవృత్తము వీరరసవ్యంజకమను లోకసామాన్యమైన యభిప్రాయమునకు విరుద్ధముగా తిక్కన కరుణరసప్రధానమైన స్త్రీపర్వమున ప్రత్యేకాభినివేశముతో ఏడు పర్యాయము లుపయోగించుట వింతఁగొలుపక మానదు. నామాశ్రితమైన వృత్తప్రయోగౌచిత్యమున నాయనకు ప్రత్యయము లేదనుట స్పష్టము. రసప్రవణుఁడైన ఆయన చిత్తవృత్తివ్యంజకమయిన యక్షరవృత్తియందే తత్పరుండగును. అట్టి అక్షరవృత్తికి ఛాందసికు లొసంగిన నామముల సార్థక్య

మునం దాయనకు ఆసక్తిలేదు. ఎచ్చటనైన వృత్తనామాశ్రితచమత్కృతి నాయన ప్రదర్శిం చినచో అది ఆనుషంగికమే.

ద్రుతము, అవరోహియైన గతిచే మధురసుకుమార చిత్తవృత్తిని వ్యంజించుటకు సమర్థమైన ఉత్సాహవృత్తము మధురములయిన కరుణశాంతాదులను వ్యంజించుటకే సమర్థమై యుండునని యాయన యభిప్రాయముగా గ్రహింపఁదగియున్నది.

సంసారగహనమున విపత్కూపమునఁ బడి తలక్రిందై వ్రేలుచుండియు మధుసంచయము నుండి తొఱఁగు మధుధారల నానుచు, జీవితాశ విడువని విప్రుని యవస్థను తిక్కన్న యుత్సాహవృత్తమున నిబంధించెను.

"ధరణినాథ! వినుము మధువుధార లెల్లప్రొద్దునుం
దొరగుచుండ నతఁడు వాని దోహలమున నానుచుం
బొరయ డెప్డు తృప్తి; వగలప్రోకయైనయట్టి దు
స్తరపుటున్కి కొల్లఁబాటుఁ దక్కఁ డించుకేనియున్"

శ్రీ. I. 48.

ఇది విదురవాక్యము. వర్ణ్యుఁడైన విప్రుని చిత్తవృత్తి శ్రోతయైన ధృతరాష్ట్రునకు సాక్షాత్కరించునట్లు వర్ణించుట విదురుని యాశయము. ఆ విప్రుని "చేతోవృత్తంబు వికలాయత్తంబై" యుండెననియు, అయినను అతఁడు "జీవితాశయు విడువండు" అనియు తిక్కన్న అనంతరగద్యమున వివరించెను. నగణ గలముల మిశ్రణమున విదురునివాక్యము వికలమై యుండుట గుర్తింపవచ్చును. అయినను దానియందు ఆహ్లాదలక్షణము స్ఫుటముగనుండుట గలషట్కనిర్మితమై యక్షరగతిసామ్యప్రతిష్ఠితమైన చతుర్థపాదమున గుర్తింపనగుచున్నది. పృథగ్గణత్వ, పృథక్పదత్వ రూపమైన మాధుర్యగుణము పద్యమం దంతటను భాసించి మధువుధార లెల్లప్రొద్దునుం గురియుటను దలపించుచున్నది. ఉత్సాహార్థకమైన దోహలశబ్దము ముద్రాలంకారము ధ్వనించుచున్నది. క్లేశసహిష్ణుతారూపమైన యుత్సాహము వర్ణితమగుటచే నామసార్థక్యము నిరూపితమగుచున్నది. "ప్డు" "ప్తి" యను ఓష్ఠ్యసంయోగములు మధుధారల నానుచుండియుఁ దృప్తిఁబొరయకఁ బెదవులను దడవికొను విప్రుని యతృప్త్యనుభావమును ప్రత్యక్షము చేయుచున్నవి. వర్ణ అక్షర గణ పాద వృత్త పర్యంతవ్యాప్తము, నామాది గతి పర్యంతమునైన శిల్పమీ పద్యనిర్మాణమున అర్థ, రస, అవస్థా నిర్వాహకమై నిండారియున్నది. ఈ యుత్సాహవృత్తమున నిబద్ధమైన విప్రుని వృత్తమును విని యాతని చేతోవృత్తమును గ్రహించిన ధృతరాష్ట్రునకు చిత్తమున ఉత్సాహము పుట్టలేదు. "మనమునఁ గృప పుట్టెడు" అని యాతఁడు వక్తయైన విదురునితో ననుచున్నాఁడు. అతని చిత్తము ఉత్సాహదీప్తము కాలేదు. కరుణార్ద్రమైనది. ఆ వృత్తాంతమట్టిది. ఆ వృత్తమట్టిది. విదురుఁడు మహాయోగి. వశీకృతచిత్తుఁడు. చిత్తవశీకరణ దక్షుఁడు. సర్వజంతు హృదయమర్మ మెఱింగినవాఁడు.

"హృదయే చిత్తసంవిత్" అన్న యోగసూత్రమునఁ బతంజలిమహర్షి[31] స్వహృదయమున చిత్తనిరోధముచేసిన యోగికి సర్వజంతుచిత్తసంవేదనము గలుగునని వక్కాణించెను. రసమయుఁడైన తిక్కన్నయు మహాయోగియే కదా!

తిక్కన్న రచించిన రెండవ యుత్సాహవృత్తము వ్యాసవాక్యము.

"నీవు ధర్మభంగి నెఱుఁగనేర్తు; నీతికౌశలం
బావహిల్లు నీదు మనమునందుఁ; గాన నేను శో
కావిలత్వ ముడుపఁబూని యరుగుదెంచితిన్ సుతా
భావజనిత దుఃఖవార్ధిపార మెద్దు పుత్రకా"

శ్రీ. I. 68.

విదురబోధచే నీషదుపశమితశోకుఁడయ్యు నంతలోనే మరల శోకావిష్టుఁడై మూర్ఛమునింగిన ధృతరాష్ట్రునికి చిత్తతాపోపశాంతి ప్రసాదింప వచ్చిన వ్యాసభగవానుఁడు శోకతాపపశ్చాత్తాపములచే గలఁగియున్న యాతని హృదయమును బ్రసన్నమొనర్చుటకుఁ బలికిన వాక్యమిది.

విదురవాక్యమందలి యుత్సాహమునకు, దీనికి అక్షరవిన్యాసభేదమున్నది.

"క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః" అను సిద్ధాంతము ననుసరించి అక్షరవిన్యాసభేదసహిష్ణువులగు ఉత్సాహాదివృత్తములందు అక్షరక్రమభేదమువల్ల పరిణామభేదము సంభావనీయమగుచున్నది. విదురుని వాక్యమున తొమ్మిది నగణము లుండుటచే అక్షరగతి ద్రుతముగా నున్నది. వ్యాసవాక్యమున నగణములు అయిదే యగుటచే ద్రుతి కొంతతగ్గి గలస్వరూపముయొక్క యావృత్తికి అంతరాయము అల్పమై గతియందు సామ్యము ప్రతిష్ఠపొందుచున్నది, పద్యగతి మధ్యావస్థకు సన్నిహితమై ప్రసాదమాధుర్యగుణవ్యంజక మగుచున్నది. "శోకావిలత్వ ముడుపఁబూనిన" మహర్షివాక్యమున నిట్టిగుణము భాసింపవలసియే యున్నది. దీనికిముందు ధృతరాష్ట్రుఁడు పలికినవాక్యములు తోధక, మంజుభాషిణీ, ఉపజాతి వృత్తములందున్నవి. ఆ వాక్యములు శోక పశ్చాత్తాప దైన్యములచే వ్యాకులవిలంబితగతి యైన చిత్తమును వ్యంజించునవి. అట్టి ధృతరాష్ట్రుని హృదయగతియందు సామ్యమును నెలకొల్పుట, ద్రుతి నుత్పాదించుట వ్యాసవాక్యమునకుఁ గర్తవ్యము. వ్యాసవాక్యము అవరోహిగతిసామ్యము గలదగుటచే చిత్తప్రశమనమునకు సమర్థమైయున్నది.

మూఁడవ యుత్సాహముగూడ వ్యాసవాక్యమే. పై యుత్సాహచ్ఛందోమయవాక్యముచే శోకావిలత్వ ముడిపి భూతానిత్యత్వమును, కౌరవనాశనావశ్యంభావితా నిరూపకమగు దేవగుహ్యగతియు బోధించి వ్యాసమహర్షి ధృతరాష్ట్రునిచిత్తమున జన్మించిన ప్రశాంతిని సుస్థిరముచేయువాఁడై మరల ఉత్సాహచ్ఛందోబద్ధమైన వాక్యమును పలికెను.

"వినుము నారదుండు దీని వినఁగఁ జెప్పె ధర్మనం
దనున, కతని మనము కరుణఁ దవిలియున్కి హింసకుం
గొనకొనంగఁ జొరమి నతఁడు కురుకులంబుతోడి పొం
దునక పడదె జగము మెచ్చఁ దొడఁగి పెక్కుభంగులన్"

ఈవృత్తమున పదునైదు నగణములు గలవు. వానిలో విశేషభాగము ద్వితీయ, తృతీయ, చతుర్థ చరణముల పూర్వార్ధములందు సమావిష్టములై యున్నవి. పద్యము క్రమముగా ద్రుత్యతిశయమొంది సమస్పందమైన ధృతరాష్ట్రుని చిత్తమున ద్రుత్యాధానము చేయుచున్నది. ఆ ద్రుతియందు పృథగ్గణపదత్వలభ్యమైన మాధుర్యమునుగూడ సంక్రమింపఁజేయుచున్నది. దుర్యోధనాదులదెస శోకమును, ధర్మజాదులయెడ క్రోధమును విడిచి పాండవులపట్ల పుత్రత్వబుద్ధి భావింపుమని బోధింపఁబోవువాఁడై వ్యాసమహర్షి ధర్మజాదులపట్ల ధృతరాష్ట్రునకు కృపపుట్టుటకుఁ దగిన చిత్తభూమికను సిద్ధముచేయుచున్నాఁడు. మాధుర్యగుణోపేతమైన చిత్తద్రుతి శృంగార కరుణ శాంతాదులకు ఉచితమైనదని యాలంకారిక సిద్ధాంతము.

"ఏనిది యంతయు నెఱుఁగుదుఁ
గాన వృథా శోకవహ్నిఁ గాలమికిని నీ
మానసమునఁ గృపకలిమికి
గా నొడివితి; దేవగుహ్యగతియుఁ దెలిపితిన్"

అని మహర్షి తనవాక్యముల ప్రయోజనమును తానే తెలుపుచున్నాఁడు.

తిక్కన్న రచించిన కడమ నాలుగు ఉత్సాహవృత్తములు మృతులై పడియున్న బాహ్లిక, సైంధవ, జయత్సేన, సుకేతులను దిలకించిన గాంధారి విలాపవాక్యములందు వర్తించుచున్నవి.

మృతులైన మహావీరులను దర్శించి వారి ప్రతాపతేజోవైభవాదులను స్మరించినప్పుడు గాంధారిచిత్తస్థాయియైన శోకమున నానా విధములయిన భావాంతరములు సంచరించుట, మృతులు తన కత్యంతాప్తులైనపట్ల శోక ముత్కటమగుట, తనవలె బంధుమరణార్తలైన స్త్రీల రోదనములు విన్నప్పుడు చిత్తము కరుణార్ద్రమగుట గాంధారీవిలాపరూపములైన యుత్సాహవృత్తములందు గుర్తింపవచ్చును.

బాహ్లికునిఁగాంచి గాంధారి "పున్నమనాఁటి చందురునిచంద మమరెఁ జూడు మిక్కుటరు వృద్ధునాననంబు" అని శ్రీకృష్ణునకుఁ జూపుచు హర్షమిశ్రితమైన శోకముతోఁ బలికినవాక్యము ఉత్సాహము.

"వాఁడిమగఁడు నిద్రవోవు వాలుమృగమువోలెనై
వీఁడె బాహ్లికుండు వృష్ణివీర చూడు చచ్చియుం

బో(డి దొఱఁగకున్నయట్టి పొల్పునఁజా వెలుఁగు; వె
న్నీ(డితండు బలములెన్నిమేని: బెల్లు ప్రోచినన్''

నాల్గే నజములగుటచే దీనిగతి మధ్యమ పదఁదగియున్నది. అట్టిగతి ప్రసాదవ్యంజకము. బాహ్లీకవదనదర్శనమున గాంధారిచిత్తమున హర్షభావము సంచరించినది.

''ప్రసత్తి రుద్యరాదిభ్యోః హర్షః'' అని ధనంజయుఁడు. (దశరూ. 414) సైంధవకళేబర దర్శనమునను గాంధారివిలాపముత్సాహచ్ఛందమునసే నిబంధింపఁబడినది.

''తనయుఁ గాచుపనికిఁ బూని ధర్మపుత్ర వాయుసం
దనులు గవలుఁ జేయఁగలుగు దండిమగలు సేనలం
గొని వడింగడంగ సరకుఁగొనక నిల్చి యొక్కఁడున్
బెనఁగి యాగె సైంధవుండు బిరుదు దక్షుఁడుంగదే!''

శ్రీ. II. 100.

తన యల్లుఁడైన సైంధవునిఁ గాంచినప్పుడు గాంధారిహృదయగతి త్వరితతరమగుట సహజము. ఈ వృత్తమందలి పదినగణములచే నది సువ్యక్తమగుచున్నది. గాంధారీచిత్తమందలి త్వర యుత్సాహవ్యంజకముగామి స్పష్టమే. అది కరుణావిర్భావభూమికయగు చిత్తద్రుతి లక్షణము.

దుర్యోధనాదుల మృతగాత్రములను దిలకించినప్పటి గాంధారిచిత్తము శోకమయము. ఆ శోకము ఆమె స్వీయముగనుక పరిమితమై భావదశ నతిక్రమింపదు. అన్యమృతులను దర్శించినప్పుడు గాంధారిపొందిన శోకము సాధారణీకృతమైనది. పరగతశోకభావనచే భావితమై సత్వోద్రిక్తమైన యామె చిత్తమునందు ప్రతిబింబితమైన శోకము పుష్టమైనకొలఁది రసత్వము పొంది యాస్వాదయోగ్యమగును ఆమె సహృదయస్థానీయ.

జయత్సేనునిచుట్టుఁ జేరి విలపించు నాతని భార్యల దీననాదములు వినుచు గాంధారి తన యప్పటి చిత్తవృత్తిని తానే యొకయుత్సాహవృత్తమున వర్ణించుచున్నది. తిక్కన్న రససిద్ధాంత గర్భిత మీవృత్తము.

''మానినీజనంబు సేరి మగధనాధుఁడగు జయ
త్సేను చుట్టు నేడ్వ నధికదీననాదములకు నా
మానసంబు సాంద్రకరుణమయతఁ జెందె; మోహనం
బైన యిట్టియేడ్పు లెందు నంబుజాక్ష వింటిమే?''

శ్రీ. II. 141.

ప్రసాదమాధుర్యగుణములకు నిధియైన యీ పద్యము గాంధారి తత్కాలకరుణరసపార వశ్యమును చక్కఁగా వ్యక్తముచేయుచున్నది. మోహనములైన జయత్సేనపత్నుల రోదననాదములు గాంధారీహృదయమునఁ బ్రతిధ్వనించి యామె వాక్యమందలి వర్ణవిన్యాసమునఁ బ్రత్యక్షమై శ్రోతకు పరమాహ్లాదము ప్రసాదించుచున్నవి. ఈ వృత్తమందలి యక్షరములలో సగమువఱకు అనునాసికములు, బిందుపూర్వకసరళములు నగుట సులువుగా గుర్తింపవచ్చును. మిగిలినవానిలో కూడ పెక్కు సరళములు, అంతస్థములు నగుట గమనింపవచ్చును. గాంధారీవాక్యముఖమునఁ దిక్కన్న ప్రవచించిన యాయన రససిద్ధాంతమును బ్రపంచించుట కిది యదనుకాదు.

ధృష్టకేతువును, అతని పుత్రుఁడగు సుకేతువును దిలకించి గాంధారి పలికిన వాక్యముకూడ ఉత్సాహవృత్తమే. బాహ్లికదర్శనము మొదలు క్రమముగా గాంధారి సత్త్వాతిరేకము పొంది సహృదయస్థానీయతను బ్రాపించినది. ఇప్పుడు మరల ఆమె యామెయే యగుచున్నది.

> "అతని నందనుఁడు సుకేతుఁ డల్లవాఁడె ద్రోణపా
> తితుఁడు వీనిఁ జూడఁగా మదిన్ సుయోధనుండుఁ ద
> త్సుతుఁడు దోఁచుచున్నవారు; శోకవహ్నితాప మూ
> ర్జితముగాగ బంధుజనుల చిత్త మెంతకుందునో!"

స్త్రీ. II. 152.

ధృష్టకేతు సుకేతులను జూడఁగనే గాంధారిచిత్తమున సుయోధనుండు నతని సుతుఁడు లక్ష్మణకుమారుఁడును తోఁచుచున్నారు. వారు తోఁచుటతో ఆమె చిత్తమున మరల శోకము దీప్తమై వహ్నియగును. "మదిన్" "సుయోధనుండు" అను పదములయందలి లగస్వరూపము ఆరోహణాత్మకమైన యోజస్సును క్షణమాత్రము మెఱపించుచున్నవి. అణఁగాఱియున్న శోకవహ్నిని ఊర్జితముచేయు దీప్తియే ఓజస్సు.

# తరువోజ

ఇది జాతిచ్ఛందము. ద్విపద పాదద్వయము తరువోజ ఏకపాదము. ఇట్టిపాదమున రెండేసి గణములమీఁద మూఁడుయతు లుండును. ప్రాసనియతి కలదు. సర్వపాదములను ప్రథమపాదము ననుసరించి గుర్వాదులో లఘ్వాదులో కావలయును. తరువోజ జాతిచ్ఛందమే యైనను కంద, ఉత్సాహములవలె మాత్రాసమకములయిన గణములతో నిర్మింపఁబడినది కాదు. కనుక జాతులలో నిది దేశ్యజాతి యనఁదగియున్నది. అనఁగా ఉపగణనిర్మితమయ్యు పాదాద్యక్షర స్వరూపనియతి, ప్రాసనియతి కలదియని యర్థము. అక్కరలు నిట్టివే.

అనియతాక్షర సంఖ్యాకములు, విషమమాత్రాక్షర సంఖ్యాచరణములునైన దేశ్యజాతి, ఉప జాతులకు గతినియతిలేదు. కవీచ్ఛానుగుణముగ గురులఘువిన్యాసక్రమ భేదములచేతను, గురు లఘ్వన్యతర ప్రాధాన్యముచేతను నానావిధములయిన గతులు దీనియందు సంభావ్యము లగుచున్నవి. వీనియందలి లయయు కవీచ్ఛాధీనమే.

గణక్రమమున భేదమున్నను పాదప్రమాణమున సీసము తరువోజయు సమానములే. రెండింటను ఆఱింద్రగణములు రెండు సూర్యగణములే కలవు. సీసమునం దాఱింద్రగణములను వరుసగానుండి వానిమీఁద రెండు సూర్యగణములు వరుసగా నున్నవి. తరువోజయందు మూఁడింద్రగణములమీఁద నొక సూర్యగణము మరల మూడింద్రగణముఁమీఁద నొక సూర్య గణము నున్నవి. సీసపాదఖండములలో ఒకదానియందు నాల్గింద్రగణములు మరియొకదానియందు రెండింద్రగణములు రెండుసూర్యగణములు నుండుటచే ఆ రెండుఖండములు పమములుగావు. తరువోజయందు ఖండద్వయము సమానమే. కనుకనే రెండుఖండములను రెండుపాదములుగా పరిగణింపవీలగును. దేశీయచ్ఛందములందు సీసము, ఆటవెలఁది అర్ధసమవృత్తము లనఁదగును. తరువోజ సమవృత్తము. పాదఖండద్వయము ముమ్మూర్తుల పోలియుండుటవల్లనే తరువోజ పాదమున అఖండైకత్వభావన కలుగదు. అట్టిభావము కలిగించుటకే స్థానత్రయమున యతిమైత్రి విధింపఁబడినది. సహజముగనే ఏకత్వముభాసించు సీసపాదములం దిట్టినియతి యక్కఱలేకపో యినది. ద్విపదచరణములు రెండు కలిసి తరువోజ చరణమైనదా ? తరువోజ చరణమొక్కఁడు తునిసి ద్విపద చరణములు రెండైనవా ? యన్న యంశమున మతభేదములు గలవు.

తరువోజలో సగము ద్విపద యనుమాటకంటె ద్విపదకు రెట్టింపు తరువోజ యన్నమాటయే స్వాభావిక మనఁదగియున్నది. అల్పాక్షరపాదములను సంధించి యధికాక్షర పాదములుగా నిర్మించు సంప్రదాయము సంస్కృతమునందును విస్తారముగఁ గనవచ్చుచున్నది. క్రౌంచపదము బంధురము మొదలగున విట్టివే.

''ప్రమాణికా పదద్వయం వదంతి పంచచామరం'' అన్న పంచచామర[32] లక్షణము ఈ సంప్రదాయమునే లక్షించుచున్నది.

హయప్రచార, మధురగతి, ద్విరదగతి హరిణగతిరగడలు ద్విగుణితములై క్రమముగా తురగవల్గన హరిగతి, జయభద్ర, వృషభగతిరగడ లగుటయు ప్రసిద్ధమే.

"తురగవల్గనంబు రెంటితోడ విజయమంగళంబు" అప్పకవి[33]

"ద్విరదగతి రెట్టింప విజయభద్రము చెల్లు" అప్పకవి[34]

ఇత్యాదిగా రగడలకు లక్షణము చెప్పుటయు సంప్రదాయమే.

గాయత్రీచ్ఛందమే ఆదిమచ్ఛందమనియు తక్కినవన్నియు దానినుండియే పుట్టినవనియు వైదికచ్ఛందస్సంప్రదాయ ముండనేయున్నది. దీర్ఘపాదములయిన ఛందములను త్రుంచి హ్రస్వ

పాదములయిన చ్ఛందములు సృష్టించిరనుట స్వభావమునకును, సంప్రదాయమునకును అనుగుణముగాఁ దోఁపదు.

అల్పాక్షరములయిన రెండుపాదములతో ముగియు ద్విపదలో ముక్తకములైన సూక్తులను చెప్పవచ్చునుగాని మహాకావ్యమున విపులార్థములయిన వాక్యములు నిబంధించుట సాధ్యముకాదు. ''ద్విపదకు ద్విపదకుఁదెగఁ జెప్పవలయు'' నన్నసంప్రదాయము ద్విపదకు మహాకావ్యమందు ప్రయోగమును నిషేధించునదిగా నున్నది. ఎచ్చటికచ్చట తెగిపోవు ద్విపదలందు నిబంధింపఁబడిన మహావాక్యమునకు ఐక్యము సిద్ధింపదు. కనుకనే ద్విపదను కావ్యచ్ఛందముగా నుపయోగింపఁదలఁచిన సోమనాథుఁడు "తెగఁజెప్పవలయు" నన్నసంప్రదాయమును దెగఁగొట్టివైచినాఁడు. ఎనిమిది ద్విపదచరణములను గలిపి రెండేసిపాదములకుఁ గల ప్రాసను విడిచి యతిని కూర్చి ఏకతభాసించు నాలుగుపాదములతో విస్తృతవస్తునివేదమునకుఁ దగినట్లుగా తరువోజ నిర్మింపఁబడినవి. ఎత్తుగీతియతోఁ గలిసిన సీసముకంటె ఇది చిన్నది. దేశీయపద్యములందు ఉత్పలాదులప్రమాణముగల మధ్యాక్కరకంటె ఇది పెద్దది. భిన్నపరిమాణములుగల యర్థములను ఏకవాక్యముగా సమర్పించుటకు అనురూపములయిన వివిధప్రమాణములుగల పద్యములను సృష్టించుకొను యత్నముయొక్క ఫలితములే సీసము, తరువోజ.

తరువోజను నన్నెచోడఁడు తరువద యని వ్యవహరించెను. తరువోజ ధ్రువపద వికృతి యని పండితుల యభిప్రాయము. ధ్రువలు పెక్కుతెలుగులవి కలవు. అవి గేయములు. తరువోజ యొకప్పుడు గేయమే యైయుండుననుటకు విన్నకోట పెద్దన వాక్య మాధారము. స్త్రీలు రోళ్ళకడ పాడుకొనుటకు తరువోజ యనువైనదని పెద్దన్న యనెను. ''తలకొని తలఁబ్రాలు దంపెడిచోటఁ, తరుణులచే నొంపుదనరుఁ దర్వోజ" (కావ్యాలం. 8-50). తననాఁటి సంప్రదాయమునే ఆతఁడు పేర్కొనియుండును. నన్నయ్యకుఁ బూర్వమునుండియు శాసనములందు కూడ తరువోజ యుండుటయు, పాల్కురికి సోమనాథునినాఁటివఱకు ద్విపదయునికి మృగ్యమగుటయు తరువోజ ప్రాచీనతను, ద్విపద యర్వాచీనతను స్థాపింప సమర్థములు కావు. శాసనములందుఁగాని, కావ్యములందుఁగాని ద్విపద కాన్పింపమికి కారణము దాని ముక్తకసూక్తియోగ్యమైన అల్పపరిమాణతయే యనఁదగియున్నది. శ్రమాపనోదనార్థము స్త్రీలు రోకంటిపాటల తాలమునకుఁగూర్చి పాడుకొను మధురోక్తులకు మాత్రమే ద్విపదప్రయోగము పరిమితమై యుండెననియు, అట్టి సూక్తులవశమున నేకవాక్యత్వ - ఏకపాదత్వము ప్రాపించిన తరువోజ కావ్యాదిప్రయోగయోగ్యతను గడించెననియు భావింపఁదగును.

ఆంధ్రమహాభారతమున మొత్తము 19 తరువోజలు కలవు. వానిలో -

నన్నయ్య రచించినవి - 12
ఎఱ్ఱన్న రచించినవి - 2
తిక్కన్న రచించిన - 5

కవిత్రయము తరువోజను ఎట్టియెట్టి సందర్భములం దుపయోగించిరో పరిశీలింపవలెను,

నన్నయ్య - 12.

1. జరత్కారువు కన్యాన్వేషణము చేయుట.
ఆది. II. 151
2. శర్మిష్ఠ యయాతిని పతిగాఁ బడయవలెనని చింతించుట.
ఆది III. 172
3. కుంతి కర్ణజననమునకుఁ జింతించుట.
ఆది. V. 28.
4. పాండురాజు కుంతిని సంతానముపడయుమని వేడుట.
ఆది V. 145.
5. కణికుఁడు దుర్యోధనునకు నీతులు చెప్పనారంభించుట.
ఆది. VI 101.
6. దుర్యోధన ధృతరాష్ట్రులు పాండవులను రాజ్యభ్రష్టులనుజేయ నాలోచించుట.
ఆది. VI. 129.
7. బకునిబారిఁ బడవలసివచ్చి బ్రాహ్మణుఁడు చింతించుట.
ఆది. VI. 248.
8. ధృష్టద్యుమ్నుఁడు ద్రౌపదీస్వయంవరపణము ప్రకటించుట.
ఆది. VII. 169.
9. సుభద్రాపరిణయానంతర మింద్రుఁడు అర్జునుని ప్రశంసించుట.
ఆది. VIII. 195.
10. ప్రాతికామి ద్రౌపదితో ధర్మజుఁడు జూదమున నోడినతెఱఁగు వివరించుట.
సభా. II 207.
11. తాము నరనారాయణులగుట శ్రీకృష్ణుఁడు పార్థున కెఱిఁగించుట.
అర. I. 132.
12. ఇంద్రాదులను వరింపుమని నలుఁడనఁగా దమయంతి దుఃఖించుట.
అర. II. 47.

ఎఱ్ఱన్న - 2.

1. మార్కండేయుఁడు ధర్మజునకు కలిధర్మములు చెప్పుసందర్భమున.
అర. IV. 303.
2. శ్రీరాముని యార్తనాదము విని సీత విలపించుట.
ఆది. VI. 380.

తిక్కన్న - 4.

1. విదురుఁడు ధృతరాష్ట్రునకు సంసారగహనకథను చెప్పుట.
స్త్రీ. I. 44.
2. ద్రౌపదిని పరాభవింపఁదగదని గాంధారి దుర్యోధనునితో చెప్పుట.
స్త్రీ. II. 58.

3. విదురభీష్ముల హితములు విననందుకు గాంధారి పశ్చాత్తాపపడుట.

స్త్రీ. II. 157.

4. కర్ణుని స్మరించి ధర్మజుఁడు శోకించుట.

స్త్రీ. II. 181.

5. ధర్మజునకు భీష్ముఁ డేకాదశరుద్రులగుఱించి చెప్పుట.

అను. III. 58.

తరువోజ యలసము, సుకుమారమునైన ఛందమని కవిత్రయమువా రభిప్రాయపడినట్లు వారి ప్రయోగమునుబట్టి యూహింపఁదగియున్నది. చింత, శంక, దైన్యము, గ్లాని, శోకము మున్నగు నలసచిత్తవృత్తులందే తరువోజలు తఱచుగాఁ బ్రయోగింపఁబడియున్నవి. విశేషించి భారతమందలి పందొమ్మిది తరువోజలలో నేడు తరువోజలు స్త్రీవాక్యములై యుండుటచే విన్న కోట పెద్దన యన్నట్లు స్త్రైణమైన మృదువృత్తముగాఁ గవిత్రయము భావించిరనికూడ తలంపఁ దగియున్నది.

శర్మిష్ఠ స్వగతము (ఆది. III. 172), కుంతిస్వగతము (ఆది. V. 28), మాద్రి స్వగతము (ఆది. V. 145), దమయంతి విచారము (ఆర. II. 47), సీత విలాపము (ఆర. VI. 330), గాంధారి పశ్చాత్తాపము (స్త్రీ. II. 58, 157.) ఇవియన్నియు స్త్రీల చింతాలసవాక్యములై యున్నవి. పురుషుల వాక్యములందును జింతాదిభావములందే తరువోజ యగపడుచున్నది. జరత్కారుని కన్యాన్వేషణము (ఆది. II. 151), ప్రాతికామి ధర్మజుని యోటమినిగుఱించి ద్రౌపదికిఁ దెలుపుట (సభా. II. 207), బకునిబారిఁ బడవలసివచ్చినందులకు విప్రుఁడు విచారించుట (ఆది. VI. 250), కర్ణమృతికై ధర్మజుఁడు శోకించుట (స్త్రీ. II. 181) — శోక శంకాద్యలసభావములందే తరువోజప్రయోగ మగపడుచున్నది.

"అనవరతవ్రతాయాసఖేదమున నతికృశంబగుచున్న యంగంబునందుఁ
దనరి యేర్పడ సిరల్ దద్దయుమిదిమిఁ దలవడంచుకునుండఁ
దన పితృవరుల
ఘనముగా నూర్ధ్వాభిగమనులఁ జేయఁ గడఁగి వివాహంబుగా
జరత్కారుఁ
డనఘుండు దనకీర్తి కనురూపమైన యట్టికన్యక గానఁడయ్యె
మర్త్యమున"

ఆది. II. 152.

ఇందలి యింద్రగణములందు పెక్కు పంచమాత్రాకములు; త, ర, నగ రూపములు. కనుక పద్యము మందముగా నడచుచున్నది. తిరిగి తిరిగి యలసిన జరత్కారుని యవస్థను జక్కఁగా వ్యంజించుచున్నది. "ఆలస్యం శ్రమ గర్భాద్యైః"[35], "శ్రమః ఖేదో అధ్వరత్యాదేః"[36] అను

సాహిత్యదర్పణోక్తుల నిచ్చట స్మరింపవలెను. అధ్వగమనశ్రమరూపమైన జరత్కారుని యాలస్యము, హితాన్వాప్తిరూపమైన చింతయు నీ తరువోజ మందగమనమున సుఖముగా గుర్తింపనగుచున్నది.

"ఏ నేడ నింద్రాదు లేడ వారలకు
నెప్పుడు మ్రొక్కుదు నేను నీ ధనమ
భూనాథ నీగుణంబులు హంసచేతఁ
బొలుపుగా విని మనంబున నిల్పియున్న
దాన భవన్నిమిత్తమున నిట్లఖిల
ధారుణీనాథసార్థంబు రావింపఁ
గానిప్డు వలసె లోకఖ్యాతకీర్తి
కరుణించి పతిబుద్ధిఁగావింపు మిందు"

ఆరణ్య. II. 47.

దీనియందు పదునొకండు ర తలును, నెనిమిది సల నగలును గలవు. అనఁగా గుర్వక్షరసంక్రాంతి యధికముగా నున్నదని యర్థము. అందువలన బద్యమున విలంబనాతిశయము గలిగి దమయంతి యొక్క చింతాశోకదైన్యకృతమైన యలసహృదయవ్యాపారము సుష్ఠుగా నిర్వహింపఁబడుచున్నది.

"కురురాజుమొదలైన కొడుకులనెల్లఁ గోల్పోవుటిప్పుడు గోవింద కలిగె
నరిగితి సంధిసేయగరాకయున్న నట యప్డు నీ చెప్పుపైనదికాదె
పరమహితంబుగఁ బలికిరి గంగపట్టియు విదురుండు పాటించి పెక్కు
వెరవుల నొత్తిన విననైతి నా వివేకుల చూపేల వృథవోవనేర్చు"

స్త్రీ. II. 158.

ఇందు నలము లైదు, భగణము లాఱు, సల నగము లేడును గలవు. అనఁగా లఘ్వక్షరము లధికముగా నున్నవి. కనుక నీ పద్యముయొక్క గమనమున ద్రుతి యతిశయముగ భాసించుచున్నది. ఆ ద్రుతి "పశ్చాత్తాపదుఃఖము" వలననైన చిత్తత్వర. "చిత్తస్థాయియైన పుత్రశోకం బడరి యలఁతిగాని యలఁతఁబెట్ట" గాంధారి యీ మాటలని యూరకున్న దనుటవలన గాంధారి చిత్తత్వరదుఃఖకరమైన దీప్తిరూపమేకాని యాహ్లాదకరమైన మాధుర్యరూపము కాదని గుర్తింపవలెను.

"ఏల యమ్మౌని నాకు నిచ్చె నిమ్మంత్ర
మిమ్మంత్రశక్తి యే నెఱుగంగ వేఁడి
యేల పుత్రకుఁగోరి యెంతయు భక్తి
నిను దలంచితిఁ బ్రీతినినుఁడును నాకు

నేల సద్యోగర్భ మిచ్చెఁ గుమారుఁ
దేల యప్పుడ యుదయించె నింకెట్టు
లీ లోకపరివాద మే నుడిగింతు
నింతకు నింతయు నెఱుఁగరె జనులు"

ఆది. V. 28.

ఈ తరువోజయందు మత్తకోకిలాసంక్రమణకల్పితమైన గమనచమత్కారము గుర్తింపఁదగియున్నది. ప్రథమపాదమున "ఏలయమ్మని", ద్వితీయపాద పూర్వఖండమున "ఏలపుత్త్రకుఁగోరి యెంతయు", ద్వితీయపాదోత్తరఖండమున "నిను దలంచితిఁ బ్రీతి నినుఁదును", తృతీయపాద పూర్వఖండమున "నేల సద్యోఁగర్భ మిచ్చెఁ గు" — ఇత్యాది స్థలములందు మత్తకోకిలావృత్తముయొక్క గమనమాధుర్యము సంక్రమించియుండుట స్పష్టమగుచున్నది. వృత్తమున వృత్తాంతరానుప్రవేశముచేత వక్త్రయైన కుంతీదేవియొక్క విస్మయభావమునఁ బ్రీతి, భీతి, శోకాది భావాంతరసంక్రాంతి చమత్కారముగ వ్యంజింపఁబడుచున్నది పదవ్యవస్థావశమునఁ దరువోజ మత్తకోకిలాభ్రాంతిని మాటిమాటికిఁ గలిగించుచున్నది. విరుద్ధావిరుద్ధ నానాభావసాంకర్య చిత్రితమైన కుంతీదేవి తత్కాలచిత్తవృత్తి రమ్యముగ ధ్వనితమగుచున్నది.

## మాలిని

ఇది అతిశక్వరీచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 15 అక్షరములు. గణములు : న న మ య య. 8 అక్షరములమీఁద యతి.

భరతముని దీనిని నాందీముఖియని పేర్కొనెను. ర మ గణయుక్తమైన యొక షడక్షర పాదవృత్తమును భరతముని మాలినియనెను.

15 అక్షరములలో 8 లఘువులుగల దీనిగతి మధ్యమ మనవలసియున్నది. అయినను మొదటియెనిమిది అక్షరములలో ఆఱు లఘువులు, చివరి ఏడక్షరములలో ఐదు గురువులు నగుటచే నీవృత్తగతి ప్రారంభద్రుతి, పర్యంతవిలంబము గలదని చెప్పఁదగును. పాదగతి స్వరూపము ఆరోహి యనియు స్పష్టము. ద్రుతి, యారోహణము గల చిత్తవృత్తులకు ఈవృత్తము యోగ్యమని భావింపఁదగును.

మాలినీనిర్మాణమర్మములను క్షేమేంద్రమహాకవి సువృత్తతిలకమునందిట్లు వివరించెను.

"విసర్గహీనపర్యంతా మాలినీ న విరాజతే
చమరీ ఛిన్నపుచ్ఛేవ వల్లీ వాలూనపల్లవా"

II. 22.

"ద్వితీయార్ధే సమస్తాభ్యాం పాదాభ్యాం మాలినీ వరా
ప్రథమార్ధే సమస్తాభ్యాం పాదాభ్యా మవరా మతా"

II. 23.

"అజ్ఞో ప్యలక్ష్య మాలిన్యాం వీణాయామివ విస్వరం
శ్రుత్యైవోద్వేగ మాయాతి వాచా వక్తుం న వేత్తి తం.

II. 24.

విసర్గాంతపాదత్వముచే మాలిని ప్రకాశించునన్నమాట యాంధ్రమునఁ బాటింపవీలుకానిది. మాలిని యందలి యారోహణరూపమైన యోజస్సు విసర్గాంతమువల్ల అతిశయము కావచ్చును. అట్టి యోజోగుణము అక్కఱలేనప్పుడు విసర్గమును విసర్జించుటయే శిల్పము. విసర్గహీనాంతమైన మాలిని ఛిన్నపుచ్ఛమైన చమరివలె, ఆలూనపల్లవయైన వల్లివలె నుండుననుట యతిశయోక్తి. ఆంధ్రమున మాలినియందు ఓజోగుణాతిశయము భాసింపఁజేయుటకు వ్యంజనాంతపదబాహుళ్యము చాలునని చెప్పవచ్చును. ప్రథమ ద్వితీయపాదములు విచ్ఛిన్నములు, తృతీయ చతుర్థపాదములు సంయుక్తములు నైనచో మాలినియందు వైచిత్రి కలుగుననుట నిజమే. వీణయందువిస్వరమువలె మాలిని నడకయందు లక్షింపరాని శ్రవణోద్వేజకత యొకకారణమునఁ గలుగవచ్చును.

"త్వ దుపగత సమృద్ధేః ప్రేయసీ శ్రోత్రియస్య" 2-25

అన్నచరణమున "త్వ దుపగత" అన్న యక్షరసంపుటియందు దోషము కలదనియు, అది గురు లఘ్వాదినియమభ్రష్టము కాకున్నను శ్రవణోద్వేగ[illegible]యగుచున్నదనియు, క్షేమేంద్రుఁడు సూచించెను. మాలినిపాదముఖమున పదవశమైన యక్షరసంపుటి ద్విత్రి చతురాది సంఖ్యాకముగా నుండవలెనేకాని ఏకాక్షరపదము ఉండరాదనియు పాదప్రథమాక్షరము సంయుక్తమై యుండరాదనియు క్షేమేంద్రుని యాశయము కావచ్చును. ఉదాహృత శ్లోకపాదగతియందలి యశ్రవ్యత యిట్టి యక్షరనివేశమువల్లనే కలుగుచున్నది.

మాలినీవృత్త వినియోగమునుగుఱించి క్షేమేంద్రుని యభిప్రాయ మిది-

"కుర్యాత్ సర్గస్య పర్యంతే మాలినీం ద్రుతతాలవత్"

III. 19.

సర్గాంతమున మాలినిని ద్రుతతాలవంతమగునట్లుగా నిబంధింపవలెనని క్షేమేంద్రుని యాశయము. ద్రుతతాలవంతమగునట్లు చేయుటయనఁగా లఘువర్ణఘటిత సమాసభూయిష్ఠము చేయుటయని క్షేమేంద్రుని యాశయముగా భావింపవలసియున్నది. ఇట్లయిననే ద్రుతారంభమైన మాలిని గతి సమాసఘటిత లఘువర్ణోచ్చారణమందలి సత్వరోచ్చారణముచే సుష్ఠుగా నిర్వహింపఁబడును.

ఆంధ్రమహాభారతమున మొత్తము 54 మాలినీవృత్తములు గలవు. వానిలో —

నన్నయ్య రచించినవి - 7
ఎఱ్ఱన్న రచించినది - 1
తిక్కన్న రచించినవి -46

నన్నయ్య - 7.

1. అమృతహరణార్థము గరుడఁడు బయలుదేరఁగా స్వర్గమున నుత్పాతములు పుట్టుట.
ఆది. II 81.

2. భౌవనుఁడను ఇంద్రకింకరుఁడు గరుడని మార్కొనుట.
ఆది. II. 96.

3. శతశృంగమున నర్జునుఁడు జన్మింపఁగా దేవత లానందమున నృత్తగీతాదులు సలుపుట.
ఆది. V. 127.

4. ఆదిపర్వషష్ఠాశ్వాసాంతమున రాజరాజస్తుతి.
ఆది. VI. 309.

5. సుభద్రాపరిణయానంతరము ఇంద్రుఁ డర్జును నభినందించి స్వర్గమున కేఁగుట.
ఆది. VIII. 196.

6. ఖాండవదహనార్థియై యగ్నిదేవుఁడు బ్రాహ్మణవేషమున కృష్ణార్జునులఁ జేరవచ్చుట.
ఆది. VIII. 234.

7. రాజసూయానంతరము నానాదేశాధీశులు ధర్మజుని అభినందించుట.
సభా. II. 75.

ఎఱ్ఱన్న - 1.

1. ఆరణ్యపర్వచతుర్థాశ్వాసాంతమున రాజరాజస్తుతి.
అర. IV.

తిక్కన్న - 46.

విరాటాది స్వర్గారోహణాంతములయిన పదునైదు పర్వములందలి నలువదియాఱు ఆశ్వాసముల యంతములందు హరిహరనాథదేవతాస్తుతి.

సర్గపర్యంతములందుమాత్రమే మాలిని ప్రయోగింపఁదగ్గదని చెప్పెనేకాని రసభావాద్యౌచిత్యమును క్షేమేంద్రుఁడు చెప్పలేదు. ఎఱ్ఱన్న, తిక్కన్నయు నట్లేచేసిరి. నన్నయ్య మాలినికి అర్థరసాదివ్యంజకతా సామర్థ్యమునుగూడ భావించెను. తన యేడు మాలినీవృత్తములలో ఆఱింటిని కథాశరీరమునందే నిబంధించెను. హర్ష భయ క్రోధాది చిత్తత్వరోత్పాదక భావముల యందు మాలిని ప్రయోగింపఁదగ్గదని యాదికవి సంభావించెను.

"సురపతి సభ జూడం జూడ సంగారవృష్టుల్
గురిసె కులిశధారల్ కుంఠితంబయ్యె దిక్కుం
జరమదము లడంగెన్ సర్వదిక్పాలకాంతః
కరణములు భయోద్వేగంబునన్ సంచలించెన్"

ఆది. II. 81.

ద్రుతము. ఆరోహియైన మాలినిగతియందు సర్వదిక్పాలకాంతః కరణములయందలి భయోద్వేగము సువ్యక్తమగుచున్నది. ఉత్ + వేగము అనఁగా ఆరోహణాభిముఖమైన త్వరితగతి. హలంతాక్షరబాహుళ్యము ద్రుతికి, విసర్గాంతపదము ఆరోహణమునకు మెఱుఁగుపెట్టుచున్నవి.

భౌవనగరుడుల యుద్ధము :

"పరశు కులిశ కుంత ప్రాస బాణాసనోద్యత్
పరిఘ కణప చక్ర ప్రస్ఫురత్ బాహుసేనా
పరివృతుఁడయి తాకెన్ భౌవనుండన్ మహోకిం
కరుఁడు సమరకేళీ గర్వితున్ వైనతేయున్"

ఆది. II. 97.

శత్రంత హలంత పదములు, పాదారంభముల త్ర్యక్షర వర్గీకరణము పద్యగతిని ద్రుతతరము చేయుచున్నది. యుద్ధవీరోత్సాహమునకు యోగ్యమైన ద్రుతి, ఆరోహణగతి వృత్తమున చక్కఁగా నిర్వహింపఁబడినవి.

అర్జునజన్మసందర్భమున దేవతల నృత్తగానప్రవర్తనము, రాజసూయయాగసమాప్తి యనంతరము రాజన్యుల యభినందనము హర్షతరంగిత చిత్తవర్తనమునకుఁ జక్కఁగాఁదగి యున్నవి. ఒకానొక మహావిషయము నిర్వహింపఁబడిన యనంతరము మాలిని యుపయుక్తమై క్షేమేంద్రుఁడు సూచించిన సర్గపర్యంతోపయోగిత్వమునుగూడ ఈ రెండుఘట్టములందు నిర్వహించుకొన్నది. సుభద్రాపరిణయాంతమున నింద్రుఁ డర్జునుని అభినందించుటయందు మాలినీ వృత్తము నుపయోగించుటయు నిట్టిదే.

"మహాక్రాంతు లీలన్", "తేజం బెసఁగ" "ముదముతో" అగ్నిదేవుఁడు కృష్ణార్జునులను డాయవచ్చుట మాలినియందు నిబంధింపఁబడినది. ఆరోహి, ద్రుతారంభము, విలంబపర్యంతమునైన మాలిని యర్థానురూపముగ నుండుట అగ్ని క్రాంతుఁడయ్యు, దీప్తమైన యానందముతో వచ్చెనన్న వాక్యార్థభావనవలన విదితమగుచున్నది.

ఎఱ్ఱన్నయు, తిక్కన్నయు మాలినీవృత్తమును క్షేమేంద్రమతము ననుసరించి యాశ్వాసాంతములందే యుపయోగించిరి. కృతిపతి గుణాభినందనాత్మకములయిన యాశ్వాసాంత పద్య

ములు ముఖ్యముగ కవిప్రీతి వ్యంజకములు. అర్థనిరపేక్షమైన సౌందర్య మాపద్యములందు దీపింపఁజేయుటకు కవి ప్రయత్నించును. అవి శ్రోతయైన కృతీశ్వరుని చిత్తమును స్వరూప మాత్రముచే రంజించి మధురీకరింపవలెఁగదా!

46 ఆశ్వాసముల యంతములందు 46 మాలినీవృత్తములు వ్రాసిన తిక్కన్న వానియందు తన పరమార్థప్రతిభావిలాసముతోపాటు మధురవాగ్విలాసమునుగూడ తీరుతీరుల యందములతో శిల్పించెను. రసానందస్వరూపుఁడగు ("రసాత్మక!" – కర్ణ. I. 320) హరిహరనాథదేవుని భజనమున ఆ మహాకవిహృదయ మానందపరవశమై సుందరచ్ఛందోమయవాక్యములతో నాదేవుని గీర్తింప నుత్సహించియుండవలె. వివిధవిచ్ఛేదభంగిమలతో, చిత్రవిచిత్రానుప్రాసవిన్యాసములతో ఆయన యాశ్వాసాంతమాలినీవృత్తములు భక్తిరసము జాలువార్చుచున్నవి. వానియందలి ప్రాస భంగిమలను విభజించి ప్రదర్శింపవచ్చును.

1. సర్వపాదాంతానుప్రాసము :

"త్రిజగదవననిత్యక్రీడనోద్యత్ప్రమోదా!
రజనిచర విఘాతారంభ లీలావినోదా?
భజన నిరతసౌఖ్యప్రాప్తిజాగ్రత్ప్రసాదా!
నిజతనువిభవోన్మీలనాచ్ఛిన్ననాదా!

ఇట్టివి – విరాట – III, V; ఉద్యోగ – III; శల్య – I; శాంతి – II; అశ్వ – I, III; అను – II; మౌసల – I. ఆశ్వాసాంతములఁగలవు. మొత్తము 9.

2. ప్రతిపాద సమఖండాంతానుప్రాసము :

"సదయవిమలదృష్టీ! సంశ్రితాశీఃప్రవృష్టీ!
హృదయకమలవాసా! యిద్ధమాయావిలాసా!
విదితనిఖిలభూతీ? విశ్వరక్షాత్తహేతీ!
సదసదుపచిదాత్మా! సంభృతానందవర్త్మా!

ప్రతిపాదమును సమఖండములై యనుప్రాసయుక్తమై యున్నది. ఇట్టివి 16 కలవు.

3. ప్రతిపాద విషమఖండాంతానుప్రాసము :

"నిరతిశయమహత్వోన్మేష! నిర్ధూతదోషా!
విరతిహృదయరమ్యావేశ! నిత్యప్రకాశా!

భరితభువనతేజోభవ్య ! యోగానుభావ్యా !
స్ఫురితగుణసమశ్రీపుణ్య ! నైర్గుణ్యగణ్యా !

ప్రతిపాదమును విచ్ఛేదమునతిక్రమించి ఖండితమగుటచే ఖండములు విషమములగుచున్నవి. ఇట్టివి 5 కలవు.

4. చతుర్థపాద ఖండాంతానుప్రాసము :

"త్రియుగకమలవిధీదీప్తసంచారలీలా
నియమితపవనాత్మాగ్నిప్రభాస్నిగ్ధసంగా
స్మయవికచమహాబ్జస్వైరమాధ్వీకధారో
దయమయమధురాత్మా ! దర్శితానందవర్త్మా !

అశ్వ. IV. 287.

5 ప్రతిపాదోపాంతానుప్రాసము :

"త్వరితవిహితగాఢధ్యాయిసమ్మోద వాదా !
స్ఫురదరిధృఢశూలస్ఫూర్తిసంశ స్త హస్తా !
తరణిశశిమయోదారతాచిత్ర నేత్రా !
పరమనియతినిస్థాభవ్యహృత్పద్మ పద్మా !

అను. IV. 451.

6. ముక్తపదగ్రస్తము :

"ప్రణమదవనవిద్యాప్రౌఢసంరూఢకాంతి
ప్రణుతచరణపద్మా ! పద్మజాతిత్వసత్పో
షణచతురదయావిస్ఫారితాలోక ! లోకా
పణనిపుణజనాంచద్భక్తి విక్రీతమూర్తీ !"

విరా. IV. 277

7. పాదద్వయాంతానుప్రాసము .

"అకృతకమధురోక్తివ్యాప్త సందీప్తసారా !
సకలభువనరక్షాశాలి శుంభద్విహారా !
శుకజనకమనీషాశుద్ధబుద్ధానుభావా !
సకృపకృతవిలాసా ! సంభృతానందభావా !

సర్గ. 97

శ్రీపర్వద్వితీయాశ్వాసాంతమునం దిట్టిదే కలదు. శ్రీ - II. 187.

# అక్కరలు

అక్కరలు ఐదు విధములు :

1. మహాక్కర, 2. మధ్యాక్కర, 3. మధురాక్కర, 4. అంతరాక్కర, 5. అల్పాక్కర.

కన్నడమున వీనికి వరుసగా :

1. పిరియక్కర, 2. దొరెయక్కర, 3. నడవణక్కర, 4. ఎడెయక్కర 5. కిరియక్కర.

యనిపేళ్ళు. దొరెయక్కర యనఁగా పాదమందలి ఖండద్వయము సమానముగ నుండునదని యర్థము. అదియే తెలుఁగున మధ్యాక్కర యనఁబడినది. జయకీర్తి దీనిని ''సమానాక్షరం'' అని పేర్కొనెను.

> "రతిపతిగణయుగ్మా ద్రతితః స్మరయుగ్మం రతిరపి చ పునః
> ప్రతిపాదం వర్తతే యస్మిన్ తత్సమానాక్షరం నామ
> శ్రుతికాంత మక్షర దక్షై రాదృత మసగాఖ్యకవినా
> ప్రతిపాదితం నను కర్ణాట కుమారసంభవకావ్యే. 7—9

కన్నడమున దొరెయక్కర లక్షణమిదియే. జయకీర్తి రతి – మదనగణములు కన్నడమున బ్రహ్మవిష్ణుగణములు. తెలుఁగున నవి సూర్యేంద్రగణములకు సమానములు. కన్నడమున గగ, సగణములుకూడ బ్రహ్మగణములే. తెలుఁగున గల నగణములు రెండే సూర్యగణములు. కన్నడమున మ సగములుగూడ విష్ణుగణములే. తెలుఁగున నివి యింద్రగణములలో గ్రహింపఁ బడలేదు. కనుక కన్నడమందలి యక్కరలకు తెలుఁగునందలి యక్కరలకుఁ గొంతభేదము ఏర్పడినది.

మధ్యాక్కరలను నన్నయ విరివిగనే ఉపయోగించెను. ఆయన యే లక్షణము ననుసరించెనో తెలియదు. మల్లియ రేచన మాత్రము—

> "సురరాజు సురరాజుఁ గూడి । సూర్యుతో నొడఁబడి మఱియుఁ
> గరమొప్ప నిప్పాట నాఱు । గణముల మధ్యాక్కరంబు
> విరచింపఁ బంపెఁ బ్రావళ్ళు । వెలయఁ గవిజనాశ్రయుండు
> సురుచిరంబుగను సుశబ్ద । శోభితం బగునట్లుగాను"

జాత్యధికారము

అని మధ్యాక్కరకు లక్షణముచెప్పెను. ''విరచింపఁబంపె" నని తానే యీ అక్కరలక్షణమును మున్మొదటిసారిగా శాసించుచున్నట్లు రేచన సూచించినాఁడు.

మధ్యాక్కరయందు :

2 ఇంద్ర - 1 సూర్య : 2 ఇంద్ర - 1 సూర్య

అనుతీరున గణము లుండును. ప్రాసములు, వడులు నుండును. వడి యెచ్చటనుండునో రేచన చెప్పలేదు. ఉత్తరఖండారంభమం దుండునని మధ్యాక్కరయను నామమునుబట్టి యూహింప వలెను. రేచన లక్ష్యమునం దట్లే యున్నది.

నన్నయ మధ్యాక్కర లీలక్షణమునకుఁ బూర్తిగా లోఁబడినట్లు కనిపించదు. ఆయన రచించిన 39 మధ్యాక్కరలలోఁ గొన్నింటఁ గొన్నిపాదములు రేచన లక్షణములకు లొంగుటలేదు. కన్నడ మధ్యాక్కరలక్షణములను నన్నయ యనువర్తించెనని తలంతమన్న ఆ లక్షణములకును గొన్నిపాదములు లొంగుటలేదు. నన్నయకుఁ బూర్వము శాసనములందు మధ్యాక్కర లున్నవి. అవి యేలక్షణము ననుసరించినవో స్పష్టముగఁ దెలియవచ్చుటలేదు.

కీ. శే. ఉకుమళ్ళ రాజగోపాలరావుగారు, బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రుల వారు, శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, డాక్టరు గిడుగు వేంకట సీతాపతిగారు శాసనములందును, నన్నయ రచనయందునుగల మధ్యాక్కరలకు లక్షణ సమన్వయముచేయుటకు చాల శ్రమపడిరి.[37]

కన్నడ తమిళ సంప్రదాయపద్ధతుల నవలంబించి నన్నయయక్కరలకు లక్షణము సమన్వయించుటకు వీరందఱుచేసిన ప్రయత్నములు పూర్తిగా ఫలింపలేదు. ఏవిధముగాఁ జూచినను గొన్నిచరణములు లక్షణమును తిరస్కరించుచునేయున్నవి. కొన్నింటికిఁ బాఠాంతరములు స్వీకరించినచో లక్షణము సరిపోవుచున్నది. ఈ మార్గములన్నియుఁ బరిశీలించి ఎట్లును లక్షణ సమన్వయముగాని పాదములలో నన్నయభాషాప్రయోగమైఖరికి, అర్థపుష్టికి భంగములేనితీరున స్వల్పములయిన సవరణలుచేసి డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు పెక్కు మధ్యాక్కరలకు సాధుత్వము సాధించినారు.[38] లక్షణముకుదురని పదునాఱు చరణములలో పదింటికిమాత్రమే సవరణలు సూచించి డా॥ అవధానిగారు ఆఱింటినిమాత్ర మట్లే విడిచిపెట్టినారు. ఆయాఱింటినిఁ గూడ నీ క్రిందితీరున సవరింపవచ్చును.

1. భూపాల నీకు నిక్కోమలియందుఁ బుట్టిన సుతుఁడు

ఆది. IV. 177

సవరణ : భూపాల । నీకుని । క్కోమ । లివలనఁ । బుట్టిన । సుతుఁడు

2. ఏమేమ మున్ను పూజింతుము రుద్రు నిందని వేడ్క

అర. II. 256

సవరణ : ఏమేమ । మున్నుపూ । జింతు । ముగ్రుని । నిందని । వేడ్క

3. అరుణసరోరుహ దళమృదులంబులై న యిత్తరుణి
ఆర. III. 299.

సవరణ : అరుణస । రోరుహ । దళమృ । దులములై । నట్టియి । త్తరుణి

4. నీ పరోక్షంబున రాజు గావలయు నెమ్మి నిట్లీగ
ఆది. IV. 177.

సవరణ : నీపరో । క్షంబునఁ । గావ । లయురాజు । నెమ్మిని । ట్లీగ

5. అరిగె నీశానుదిక్కునకు నీయనుజుఁ డనిలవేగమున
ఆర. III. 373

సవరణ : అరిగెనీ । శానుది । క్కునకు । నీతమ్ముఁ । డనిలవే । గమున

6. అమరంగ ధర్మవు రక్షించుఁ బ్రీతి నని శత్రులందు
ఆర. I. 225

సవరణ : అమరంగ । ధర్మవు । బ్రీతి । రక్షించు । ననిశత్రు । లందు.

వడివిషయమునఁగూడ నన్నయ మధ్యాక్కరలు రేచన లక్ష్యమునకు విరుద్ధముగ నున్నవి. రేచన నాల్గవచరణము మొదట వడి సూచించెను. నన్నయ యైదవగణముమొదట వడి పాటించెను. నాల్గవగణముమొదటఁ బాటించుటయే సమంజసము. రెండింద్రగణములపై నొకసూర్య గణము చొప్పున రెండు ఖండములుకలిసి మధ్యాక్కర యగును గనుక రెండవఖండము మొదటి యక్షరమున వడిమైత్రి యుండుటయే న్యాయము. ఎఱ్ఱన తానువ్రాసిన ఒక్కమధ్యాక్కరయందు నాల్గవగణము మొదటనే వడి నిల్పెను. పంచమగణాదియందు వడిమైత్రి పాటించి మధ్యాక్కర పాదమున నఖండత భాసింపఁజేయుట నన్నయ యాశయము కావచ్చును. నాల్గవగణము మొదట వడియున్నచో విచ్ఛేదములేకున్నను సరూపవర్ణావృత్తివలననే, ఖండద్వయము వేఱువేఱుగా భాసించియుండెడివి. చంపకమాలాదుల కోవలో దీనినిగూడ చేర్చవలెనన్న యభిప్రాయముతో నన్నయ వడినియతి యిట్లు చేసికొనియుండును.

తరువోజయందలి పూర్వోత్తరఖండములలో నొక్కొక్కఖండమునుండి యొక్కొక్క యింద్రగణమును విడిచినచో మధ్యాక్కరయగును. పూర్వఖండమందలి యతి విడిచి యుత్తర ఖండమందలిదానిని మాత్రమే నిలిపినచో నన్నయ్య మధ్యాక్కర యగును నడుమ నొకటిరెండు గణములను విడిచి యన్యవృత్తముగా రూపించుట పద్మకము, నర్కుటము, మేదిని, మణిభూష ణము మున్నగువానియందుఁ జూడవచ్చును

"మందాక్రాంతా భవేన్మధ్యే శాలినీ పూరితాక్షరా"
సువృత్త III. 44.

ఇత్యాదిభావన సంస్కృతవృత్తనిర్మాణమునను గలదు.

మధురాక్కరలు భారతమున మూఁడే యున్నవి. అందు నన్నయ దొక్కటి, ఎఱ్ఱనవి రెండు.

1 సూర్యగణము - 3 ఇంద్రగణములు - 1 చంద్రగణము.

నన్నయ, ఎఱ్ఱన నాల్గవగణము మొదటనే వడి పాటించినారు.

అక్కరలు తరువోజకంటెఁ గొంచెము చిన్నవి. తేటగీతికంటెఁ గొంచెము పెద్దవి. ఉత్పలశార్దూలముల ప్రమాణముగలవి. తేటగీత్యాదులందువలెనే వీనియందును ద్రుతవిలంబాది వృత్తులు లక్షింపఁదగియున్నవి. పదవ్యవస్థావశమున ఆరోహణాదులును గుర్తింపఁదగును.

తిక్కన్న అక్కరలను వాడలేదు. ఎఱ్ఱన్న యత్యల్పముగ వాడెను. 43 అక్కరలలో 40 నన్నయ్యవే. వానిలో 39 మధ్యాక్కరలు, ఒకటి మధురాక్కర. ఎఱ్ఱన్న వాడిన మూఁడింటిలో ఒకటి మధ్యాక్కర, రెండు మధురాక్కరలు.

ప్రాసనియమము గలవికనుక నివి సీసగీతాదులకంటె విలక్షణములై దేశ్యజాతు లనఁదగి యున్నవి. విషమమాత్రాగణనిర్మితములు గనుక నివి యుత్సాహాదులకంటె విలక్షణములు.

నన్నయ, ఎఱ్ఱన వీని నీక్రిందిసందర్భములం దుపయోగించిరి.

## మ ధ్యా క్క ర లు

నన్నయ్య — 39.

1. కశ్యపునకు బ్రహ్మ సంజీవనమంత్ర మిచ్చుట.
ఆది. II. 185.
2. పాండవు లరణ్యాజ్ఞాతవాసములు నిర్వర్తించి యుద్ధమునకు సిద్ధపడిరని చెప్పుట.
ఆది. III. 19.
3. దుష్యంతనిరాకృతయై శకుంతల తన దురదృష్టమును దూఱుకొనుట.
ఆది. IV. 103.
4. గంగను బెండ్లాడుమని ప్రతీపుఁడు శంతనునకుఁ జెప్పుట.
ఆది. IV. 142.
5. సత్యవతికిఁ బుట్టిన పుత్రకుఁడు యువరాజుగావలెనని దాశరాజు శంతనునిఁగోరుట.
ఆది. IV. 177.
6. వ్యాసుఁడు అంబికకుఁ బుత్రదానము చేయవచ్చుట.
ఆది. IV. 254.
7. లక్కయింటఁ గాలిపోయినవారు పాండవులేయని వారణావతపౌరులు దుఃఖించుట.
ఆది. VI. 166.
8. తనకు బదులు భీముని బకాసురునికడ కంపుటకు విప్రుఁడు నిరాకరించుట.
ఆది. VI. 273.

9. నందినియను హోమధేనువు వర్ణనము.
ఆది. VII. 99.

10. వసిష్ఠుని మరణయత్నము.
ఆది. VII. 122.

11. వసిష్ఠుని మరణయత్నము.
ఆది. VII. 123.

12. భృగుపత్ని అంధులైన క్షత్రియులకు ఔర్వుని మహిమను దెలుపుట.
ఆది. VII. 138.

13. అర్జునుఁడు కర్ణుని అధిక్షేపించుట.
ఆది. VII. 202.

14. నీ కోరికఁ దీర్పఁజాలనని యర్జునుఁ డులూచితోఁ జెప్పుట.
ఆది. VIII. 133.

15. హరిశ్చంద్రుని మహిమ యేమని ధర్మజుఁడు నారదునిఁ బ్రశ్నించుట.
సభా. I. 32.

16. విదురుఁడు దుర్యోధనుని లోభమును నిందించుట.
సభా. II. 182.

17. ద్రౌపది శ్రీకృష్ణుని స్తుతించుట.
అరణ్య. I. 134.

18. ద్వైతవనమున అప్రమత్తులై యుండవలెనని ధర్మజుఁడు తమ్ములకుఁ జెప్పుట.
అరణ్య. I. 200.

19. శత్రులందు సమబుద్ధికూడదని ద్రౌపది ధర్మజునకుఁ జెప్పుట.
అరణ్య. I. 225.

20. అనుత్సాహము కూడదని ద్రౌపది ధర్మజునకుఁ జెప్పుట.
అరణ్య. I. 234.

21. ఉత్సాహము, కృషి ఫలప్రదములని ద్రౌపది ధర్మజునిఁ బ్రబోధించుట.
అరణ్య. I. 235.

22. అర్జునుఁడు తపస్సునుండి తిరిగిరాలేదని భీముఁడు చింతించుట.
అరణ్య. I. 392.

23. దమయంతి హంసను ప్రార్థించుట.
అరణ్య. II. 22.

24. చేదిరాజమాతకు దమయంతి తనసంగతి చెప్పుట.
అరణ్య. II. 118.

25. ఋతుపర్ణుని సేవింపుమని కర్కోటకుఁడు నలునకుఁజెప్పుట.
అరణ్య. II. 129.

26. దమయంతి విదర్భరాజపుత్రియని చేదిరాజమాతకుఁ జెప్పుట.
అరణ్య. II. 149.

27. నలుని రథచోదనసైపుణ్యము.
ఆరణ్య. II. 170.

28. రుద్రపూజా సంభ్రమము.
ఆరణ్య. II. 256.

29. అగస్త్యునిమహిమ నెఱింగింపుమని ధర్మజుఁడు రోమశునడుగుట.
ఆరణ్య. II. 320.

30. నీకెందఱుపుత్రులు కావలెనని యగస్త్యుఁడు లోపాముద్ర నడుగుట.
ఆరణ్య II. 351.

31. ఋష్యశృంగుఁడు వేశ్యతోఁ బలుకుట.
ఆరణ్య. III. 97.

32. మాంధాత వర్షము కురియించుట.
ఆరణ్య. III. 206.

33. ధర్మజుఁడు ద్రౌపదికష్టములు చూచి పరితపించుట.
ఆరణ్య. III. 299.

34. హనుమ శ్రీరామునిఁ బొగడుట.
ఆరణ్య. III. 331.

35. భీముఁడు సౌగంధికము తేఁబోయెనని ద్రౌపది ధర్మజునితోఁ జెప్పుట.
ఆరణ్య. III. 373.

36. తన్నెత్తికొనిపోవుచున్న జటాసురుని ధర్మజుఁడు ధిక్కరించి పలుకుట.
ఆరణ్య. III. 386

37. అర్జునుఁడు తిరిగిరాలేదని ధర్మజుఁడు తపించుట.
ఆరణ్య. IV. 3,

38. ఫలశ్రుతి.
ఆరణ్య. IV. 49.

39. భీముఁ డజగరముచే నేలబద్ధుఁడయ్యెనని జనమేజయుఁడడుగుట.
ఆరణ్య. IV. 103.

ఎఱ్ఱన — 1.

40. కల్కిమూర్తి కలియుగమున ధర్మము ప్రతిష్ఠించుననుట.
ఆరణ్య. IV. 310.

## మధురాక్కరలు

నన్నయ్య — 1.

1. కణ్వుఁడు స్త్రీపురుషులకు ఎవరెవ్వరు గురువులో చెప్పుట.
ఆది. IV. 49

ఎఱ్ఱన — 2.

2. శ్రీరాముఁడు దిగులుతో ఆశ్రమమునకుఁ దిరిగివచ్చుట.

ఆరణ్య. VI. 352.

3. కర్ణుని జన్మరహస్యము దెలుపుమని జనమేజయుఁ డడుగుట.

ఆరణ్య. VII. 309.

కోపము, పశ్చాత్తాపము, దుఃఖము, ప్రబోధము, ప్రార్ధనము, అధిక్షేపము, విస్మయము, నింద, స్తుతి ఉత్సాహము, రతి, విభావవర్ణనము — మున్నగు పెక్కు విషయములందు అక్కర లుపయోగింపఁబడినవి. అయినను వస్తురసభావములకుఁ దగినతీరున నాయాఅక్కరలు నిర్మింపఁ బడినవని పరిశీలించి తెలిసికొనవచ్చును.

"వదలక మరణార్థియగుచు మునినాథవరుఁడు దా నొక్క
నది నుదగ్రగ్రాహవతిఁ బ్రవేశించినను ముని నంట
నది యోడి శతవిధంబులఁ బరిద్రుతయయి స్థలంబయిన
నదియాదిగాఁగ శతద్రునామయై యున్నది యొప్పె''

ఆది. VII. 122.

పుత్రశతమరణార్తుఁడై ప్రాణత్యాగదీక్షావేగమున నదియం దురికిన వసిష్ఠమహర్షిని ఆ నది శతధాద్రుతమై యంటక రక్షించిన విధము ఈ యక్కర వాక్యార్థము. మరణోద్యమమున నుత్కటవేగమయిన మహర్షి హృదయగతియుఁ దన జలముల మునింగి మహర్షి మరణించునన్న భయావేగమున శతధాద్రుతమైన నదియొక్క చలనద్రుతియు, పద్యమునఁ జక్కఁగా నిర్వహింపఁ బడినవి. ఈ యంశము ప్రతిపాదింపఁబడిన మొదటి మూఁడు పాదములందలి 61 యక్షర ములలో 14 మాత్రమే గురువులు. "ఉదగ్ర" "ప్రవేశించి" "విధంబుల" "పరిద్రుత" "స్థలం బయిన" ఈ పదములందలి యుత్ప్లుతి వసిష్ఠునియొక్కయు, నదియొక్కయు హృదయోద్వేగ మునుఁబట్టి యిచ్చుచున్నది. మూఁడుపాదముల యారంభములందు 'నది' యను శబ్దమువదలక పొదుగఁబడి వసిష్ఠుని వదలని మరణవాంఛను వ్యంజించుచున్నది.

ఈ మధ్యాక్కరవెంటనే నన్నయ మఱియొక మధ్యాక్కరవ్రాసెను. వసిష్ఠుఁడు తన యంగములు పాశములచే బంధించుకొని యింకొకనదిలో దుముకఁగా నది యా పాశములు విడ్చి మునిని తీరమునఁ జేర్చి విపాశ యను నామము నందుటనుగూడ నన్నయ మధ్యాక్కరయందే నిబంధించుట తుల్యార్థమునకు తుల్యచ్ఛందమును వినియోగించు శిల్పము.

"ఘనపాశములఁజేసి యెల్ల యంగములఁ గలయ బంధించి
కొని యొక్కనదిఁ జొచ్చిమునిఁగినను వంతఁ గూరి యన్నదియుఁ

దన దివ్యశక్తి నప్పాశములు విడిచ్చి తన్మునినాథుఁ
బనుగొనఁ దీరంబుఁ జేరఁబెట్టి విపాశనాఁ బరఁగె"

ఆది. VII. 123.

పాశబంధన విమోచన వృత్తాంత ప్రతిపాదకమైన యీ పద్యమున గుర్వక్షరములు మూఁడింట నొకవంతున్నవి. పద్యము కొంతసాగి నడచుచున్నది. విపాశ శతద్రువంత యధీరకాదు.

"ఇది మహోగ్రాటవి సింహశరభోరగేంద్రశార్దూల
మదగజాకీర్ణంబు దీనిలోన నేమఱకుండవలయు
నదియునుంగాక వరప్రయోగమాయలు గల వెఱఁగి
మది నుండునది యన్న నన్న కిట్లను మఘవనందనుఁడు"

ఆర. I. 200.

ఇది మత్తేభమో, శార్దూలమో యను భ్రాంతిఁ గొలుపుచున్నది. ఇంద్రగణములలో రగణ తగణముల నెక్కుడుగా నుపయోగించి అక్కరయందు దైర్ఘ్యము, విలంబనము భాసింపఁజేయ వచ్చును. 'ఇది మహోగ్రాటవి' 'శరభోరగేంద్రశార్దూల' 'మదగజాకీర్ణంబు' అనుపదసంపుట ములం దారోహణము స్ఫుటముగనున్నది. విలంబనమున నారోహణముగల యీ అక్కర వర్ణ్య వస్తువునందలి గాంభీర్యమును జక్కఁగా వర్ణించుచున్నది.

"మృదురోమములును శంకునిభకర్ణముల్ మెత్తని వలుద
పొదుగును నిడుదచన్నులును గుఱుచలై పొలుచు కొమ్ములును
సదమలశరదిందుశంఖనిభమైన చాయయుఁ గలుగు
మొద విది నిధి సేరినట్లు సేరె నిమ్మునికిఁ బుణ్యమున"

ఆది. VII. 99

నల నగ సల భగణముల బాహుళ్యమున అక్కర యిట్టి లఘుగమనము గలదగును. పరమ మృదువు సాధువునగు నందినీధేనువు సుకుమార సుందర రూపమును వర్ణించు నీ యక్కర సంయుక్తాక్షరవర్జనమున సరళనాదానునాసికములవల్ల సుకుమారము మధురమునై యున్నది సర్వకామప్రదయయిన ఈ ధేనువు దనకుఁ గావలెనని విశ్వామిత్రుఁడు "కుతూహలహృదయుం" డయినాఁడట. వస్తువర్ణనాత్మకమయిన వృత్తమందలి యక్షరవృత్తి దద్దర్శనవశమున ద్రష్ట యందుఁగల్గిన హృదయవృత్తినిఁ జక్కఁగా వ్యంజించుచున్నది. నందినీదర్శనమున విశ్వామిత్రుని చిత్తమునం దెట్టి ద్రుతవృత్తి జన్మించినదో అట్టివృత్తి నందినీవర్ణనాకర్ణనమున సహృదయుని హృదయమున వ్యక్తముకావలెను.

"మాయావి మా యాయుధములు మా కిచ్చి మాతో రణమ్ము
సేయు మివ్విధమునఁ బోవఁ దగదంచుఁ జిక్కనై యసుర

నాయతబాహుండు గరము భరముగా నదిమె ధర్మజుఁడు
మాయావియగు వాని గమనవేగంబు మందమై యుండ''

ఆర. III. 386.

ఆయతబాహుఁడైన ధర్మజుఁడు భరముగా నదిమి జటాసురుని వేగము మందమైయుండఁజేసినాఁడఁట. ధర్మజుని యాయతబాహత్వము, జటాసురు గమనమాంద్యము ఈ యక్కరయందు ప్రత్యక్షమగుచునే యున్నవి. రాక్షసునిఁ జిక్కఁగా నొక్కొక్కనొక్కు నొక్కుచు 'మాయావి– మాయాయుధములు – మాకిచ్చి – మాతోరణమ్ము – సేయుము' అను ధర్మజుని వాక్యోచ్చారణ ప్రక్రియ 'మా' యను నక్షరముతోడి వాక్యఖండారంభము చక్కఁగా నభినయించుచున్నది. పాద, పాదఖండ, పద, వాక్యఖండములు ప్రస్ఫుటాంతరములై ధర్మజుని ధీర ప్రసన్నచిత్తమును ప్రతిబింబించుచున్నవి.

రసమునకు, సర్గమునకు శక్తిమంతమైన వాహికగా ఛందమును మలచికొని పద్యమును శిల్పించు నిట్టి నైపుణిని సర్వత్ర ఇట్లే యనుశీలింపవలెను.

# మంగళమహాశ్రీ

ఇది ఉత్కృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 26 అక్షరములు. గణములు : భ జ స న భ జ స న గగ 8, 16 అక్షరములమీఁద యతులు.

సంస్కృతలాక్షణికు లెవ్వరును దీనినిఁ జెప్పినట్లు కనఁబడదు. భజసన భజసన భయ యను లక్షణముగల లయగ్రాహిని నృత్తలలితమనుపేర వారు చెప్పియున్నారు. దానికిని మంగళ మహాశ్రీకిని పాదాంతమునఁ గొంచెము భేదమున్నది. గతి, లయ యొక్కఁడే.

దీనికిగూడ భల భల భల భల భల భల గగ యనుతీరున లక్షణముచెప్పినచో దీనియందలి తాలలయను వ్యక్తముచేసినట్లయ్యెడిది. $3 + 2 = 5$ మాత్రల యావృత్తులతో ఆవృత్తికి ఒక్క గురువు, మూఁడులఘువులు చొప్పుననడచు దీనిగతి అవరోహణమున ద్రుతము. తాలాన్వితలయ విలంబితము. ఆర్ద్రమధురచిత్తవృత్తిని వ్యంజించుట కీవృత్తము సమర్థమగును. మంగళసందర్భములం దీవృత్తము వినియోగింపఁ దగినదని నామాశ్రితమైన యౌచిత్యము స్పష్టము.

ఆంధ్రమహాభారతమున తిక్కన్న రచించిన దొక్క మంగళమహాశ్రీ వృత్తమే కలదు. అది స్త్రీపర్వద్వితీయాశ్వాసమందలి 29 వ పద్యము. దుర్యోధనుని కళేబరమును దిలకించి శోకార్తిరేకమున మూర్ఛిల్లి తెలిసి, పలుతెఱంగుల విలపించి తనసమీపమునకు వచ్చిన శ్రీకృష్ణదేవునితో గాంధారి దుర్యోధనునిగుఱించి పలికినవాక్యమును తిక్కన్న మంగళమహాశ్రీ వృత్తమున నిబంధించెను.

ఈతఁడు రణంబునకు నెత్తిచనుచుండియును
నెంతయును భక్తిఁగని నాకుం
బ్రీతియెసగం బలికి ప్రేమమొలయం బొగడి
పెద్దయు వినీతినిరతుండై
జేతులుమొగిడ్చి జయసిద్ధియుగ దీవన వి
శిష్టదయ నిమ్మనిన "ధర్మం
బే తల ననూనమగు నిద్ధజయ మాతలకు
నెట్లయిన సిద్ధమగు" నంటిఁ.

రణసన్నద్ధుఁడై విజయాశీర్వాదము నర్థింప ప్రియమధుర వినయవచనపరుఁడగుచుఁ దనకు మ్రొక్కిన దుర్యోధనుని స్మరించి గాంధారిహృదయము ఆర్ద్రమధురమైనది. అట్టి చిత్తవృత్తి యందు ద్రుతావరోహణమున విలంబితవృత్తియైన వాక్యము వెడలుట యతిసహజము. శోకస్థాయి యందు తాత్కాలికహర్షము వ్యభిచారి. విలంబితమైన యావృత్తియందు ద్రుతము, అవరోహియనగు అక్షరగతి శోకాలసమైన చిత్తమందలి తాత్కాలిక హర్షావేగమును చక్కఁగా నిరూపించుచున్నది.

తాలలయాన్వితమైన యీ పద్యము సంస్కృతలాక్షణికులచేఁ జెప్పబడనికారణమున శుద్ధ దేశియమని భావింపఁదగియున్నది. మార్గచ్ఛందమన్న గౌరవము గలిగించుటకుగా దీనిని దేశియ లాక్షణికులు అక్షరచ్ఛందముగా నిబంధించియుందురు. మంగళమహాశ్రీ వృత్తమును మొదట కావ్యమున వాడినవాఁడు నన్నెచోడమహాకవి. కావ్యాంతమున మంగళాచరణమును మంగళ మహాశ్రీ వృత్తముననే నిబంధించు సంప్రదాయమున కాతఁడే మూలపురుషుఁ డనవచ్చును. కాని యీ వృత్తసృష్టికూడ తదుపజ్ఞమే యనుట సమంజసముకాదు. ఆంధ్రఛ్చందోలాక్షణికులలో ప్రాచీనతముఁడైన కవిజనాశ్రయ మల్లియరేచనయే మంగళమహాశ్రీని లక్షించియుండెను.

## సూచికలు :

1. జయకీర్తి – ఛందోనుశాసనము : 6 – 34
2. భావప్రకాశనము : పుట 34
3. సువృత్తతిలకము : 3 – 20
4. Ibid : 2 – 32
5. Ibid : 3 – 21
6. Ibid : 2 – 40

7. కావ్యప్రకాశము : vii — 219
8. సువృత్తతిలకము : 3 — 23
9. Ibid : 3 — 23
10. Expression of Emotions : P. 83 — 86.
11. సువృత్తతిలకము : 2 — 18
12. జయకీర్తి : 2 — 258
13. వృత్తరత్నాకరము : 3 — 104
14. భావప్రకాశనము : 2 వ అధికారము
15. నాట్యశాస్త్రము : xiv — పుట 246
16. Ibid : xv — 88
17. శృంగారప్రకాశము : (కావ్యానుశాసనమునం దుద్ధరింపఁబడినది — పుట. 336)
18. సువృత్తతిలకము : 3 — 19
19. అమరకోశము :
20. సాహిత్యదర్పణము : 3 — 97
21. నాట్యశాస్త్రము : xiv - పుట 246
22. సువృత్తతిలకము : 3 - 22
23. కావ్యప్రకాశము : vii పుట 339 (Published by BORI)
24. శృంగారప్రకాశము : (కావ్యానుశాసనమున పుట 336)
25. నాట్యశాస్త్రము : xvi — 115
26. శృంగారప్రకాశము : (కావ్యానుశాసనమున — పుట. 336)
27. సాహిత్యదర్పణము : 3 — 154
28. దశరూపకము : 4 — 19
29. దశరూపకము : 2 — 4
30. ఆంధ్రశబ్దచింతామణి (అప్పకవి యుద్ధరించినది. 4 వ ఆశ్వాసము)
31. పాతంజలయోగసూత్రములు : విభూతి. 34 సూ.
32. ఛందోమంజరి : 2 — 4
33. అప్పకవీయము : 4 — 483
34. Ibid : 4 — 485
35. సాహిత్యదర్పణము : 3 — 155
35. Ibid : 3 — 146
37. తెలుగులో ఛందోరీతులు : పుటలు. 204 — 206
38. నన్నయభారతము : పుటలు. 909 — 921.

# సామాన్యచ్ఛందములు

## శార్దూల విక్రీడితము

ఇది అతిధృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 19 అక్షరములు. గణములు : మ స జ స త త గ. 12 అక్షరములమీఁద యతి.

"శార్దూలవిక్రీడితం మ్సౌ జ్సౌ తౌ గా దిత్యఋషయః"

పిం. ఛం. 8-22

సంస్కృతాంధ్ర చ్ఛాందసికులందఱు నీ నామమును, ఈ లక్షణమును అనువర్తించిరి. సంస్కృతమున నీ వృత్తమునకు విపులప్రచారముగలదు. రాజశేఖరాది మహాకవులు గొందఱు దీనినత్యంతము అభిమానించిరి. మత్తేభము నణఁగద్రొక్కి యిది సంస్కృతకావ్యములందు స్వేచ్ఛావిహారము గావించినది. విశేషించి ప్రాచ్యులైన గౌడీయుల కిది పరమప్రీతిపాత్రము.

"శార్దూలలీలా ప్రాచ్యేషు" అని కాత్యాయన వచనము.

నాట్యశాస్త్రము. XIV.

19 అక్షరములలో 11 గురువులుగల శార్దూలపాదగతి విలంబితము. సర్వాంతమధ్యారోహణములైన మ స జ గణములు పూర్వఖండమున సన్నివిష్టములగుటచే ఆరోహణము, అంతావరోహణములగు తగణద్వయముయొక్క సన్నివేశముచే పర్యంతమున నించుక అవరోహణము భాసించును. ఆరోహణాత్మకవిలంబనము శార్దూలవృత్తలయలక్షణమని సారాంశము.

"శౌర్యస్తవే నృపాదీనాం శార్దూలక్రీడితం మతం" అని క్షేమేంద్రుఁడు నృప, సచివ, సామంతాదుల నానారూపములయిన శౌర్యములవర్ణనమున కవి శార్దూలవృత్తము నుపయోగింపవలెననెను. శౌర్యము వీరరౌద్రాదుల కుపలక్షకముగా గ్రహించి ఆ రసములందలి నానావిధ భావములయు, అనుభావములయు వర్ణనమున శార్దూలవృత్తముయొక్క యౌచిత్యమును భావింపవలసియున్నది.

19 అక్షరముల పాదమున 12 అక్షరములవఱకు అవిచ్ఛిన్నోచ్చారణము విధింపఁబడుటచే శార్దూలవృత్తము వక్తృప్రాణశ్రాంతికరము, దుఃఖావహము, ఓజోనిర్వర్త్యము. అట్లే శ్రోతృశ్రవణోద్వేజకము. ఓజోజనకము. దీర్ఘసమాసఘటనాత్మక నిర్విరామవాక్యనిర్మాణప్రవణులైన

గౌడీయులకు శార్దూలవృత్తము ప్రేమపాత్రమగుట సహజము. గుర్వక్షరబాహుళ్యమున, పాదం బరమైయుండుటవలనఁగూడ గౌడీయాదరపాత్రమగుట యుచితమ. "గౌడేష్వక్షరడంబరః" అని అభియుక్తోక్తి.

ఆంధ్రమున శార్దూలవృత్తప్రయోగవైరళ్యమునకుఁ గారణము దాని గుర్వక్షరబాహుళ్యము ఓజోమయత్వమును అని భావింపఁదగియున్నది. ఆంధ్రులు చతురలలితమధురమైన వైదర్భ మార్గప్రియులు. ద్వి త్రి గురుకములయిన పదములు ఆంధ్రమున దుర్లభములు. దుష్కర ప్రాసమువలె శార్దూలవృత్తమును విశిష్టప్రయోజనాపేక్ష యున్నచోటనే అవశ్యంభావియై యుప యుక్తమగుచున్నదని చెప్పవచ్చును. సంస్కృతసాహిత్యమునందు అనాదృతమైన మత్తేభము ఆంధ్రులచే నత్యంతము ఆదృతమైయుండుటకు దానియందలి నాతిదీప్తమైన యోజస్సుకారణమని తలఁపఁదగియున్నది.

చిత్తస్పందము లత్యంతము దీప్తములైనప్పుడు, అత్యంతము మందములయినప్పుడు శార్దూలవృత్తవినియోగము కనఁబడుచున్నది. చిత్తస్పందము మసృణవాహియైనపట్ల గుర్వక్షర ప్రాయములైన శార్దూలవిక్రీడితాదులు ప్రయోగార్హములని భరతమునియు ఆయన ననుసరించి యభినవగుప్తులును ఉపదేశించిరి. అట్టి చిత్తస్పందము సాధారణముగ కరుణాదులం దుండు ననియు వీరరౌద్రాదులందుఁగూడ పరఖలీకారస్మరణసమయమున నట్టి చిత్తస్పంద ముండవచ్చు ననియు వారే యుపదేశించిరి.

శార్దూలవిక్రీడితప్రయోగము సర్వత్ర చేయవచ్చునని భోజమహారాజనెను. ఓజోజనక భావములందును ఓజోఽతివ్యయానంతరావస్థలయందును శార్దూలవిక్రీడితము ప్రయోగార్హము.

శార్దూలవిక్రీడిత నిర్మాణమర్మములనుగుఱించి క్షేమేంద్రమహాకవి సువృత్తతిలకమునఁ జెప్పినమాటలు గుర్తింపఁదగియున్నవి.

"సాకారాద్యక్షరైః పాదపర్యంతైః స్వవిసర్గకైః
శార్దూలక్రీడితం ధత్తే తేజోజీవిత మూర్జితం"

II. 35.

పాదాదులయందలి గుర్వక్షరములు 'ఆ'కారరూపములయినచో, పాదాంతములందు విస ర్గములున్నచో శార్దూలము ఊర్జితమైన తేజోజీవితమును ప్రాపించును. ఇట్టి శార్దూలవృత్తమే నృపాదులశౌర్యస్తవములందు ప్రయోగింప నర్హమైయుండునని క్షేమేంద్రుని యాశయము గావల యును.

"విసర్జనీయసోత్సేన పాదైర్నిమ్నోన్నతైరివ
శార్దూలక్రీడితం యాతి పాఠే సాయాసతామివ"

III. 36

పాదాంతములందలి విసర్గములు 'ఓ'భావమును పొందినచో శార్దూలము కుంటినడక నడచును. తత్పఠనము ఆయాసకరమగును. ఆదియందువలె అంతములందును గురువులకుబదులు దీర్ఘములున్నచో శార్దూలమున విలంబనమే భాసించునుగాని యోజస్సు భాసింపఁదని క్షేమేంద్రుని భావము. ఇట్టి శార్దూలవృత్తములు అనోజోరూప చిత్తస్పందవిలంబనాత్మకములైన కరుణాదు లందు వినియోగింపఁదగినవని యూహింపఁదగును.

"విచ్ఛిన్నపాదం పూర్వార్ధే ద్వితీయార్ధే సమాసవత్
శార్దూలక్రీడితం భాతి విపరీత మతోఽధమం"

II. 37.

పూర్వపాదద్వయమున వ్యస్తపదములు, పాదాంతవిరామము నుండవలెను. ఉత్తరపాద ద్వయమున క్రమవర్ధమాన సమాసఘటనముచే క్రమవర్ధమానవిరామవిలంబనము సిద్ధింపవలెను. తృతీయచతుర్థపాదములు సుశ్లిష్టములై యుండవలెను. ఇట్లున్నచో శార్దూలము స్వరూపముచే శోభించును. దీనికి విపరీతముగ నున్నచో అధమముగా నుండును. అనఁగా వీరరౌద్రాదులందు క్రమవర్ధమానమైన యోజస్సును వ్యంజించుటకు క్రమవర్ధమాన గాఢబంధమైన శార్దూలవృత్తము యుక్తముగానుండునని గ్రహింపవలెను. అధమమని నిరసింపఁబడిన శిథిలశార్దూలమునకుఁ గూడ రసాంతరములందును, వాని యవస్థాంతరములందును ప్రయోజన మున్నదనియే భావింప వలసియున్నది.

భరతాభినవక్షేమేంద్రాదుల యుపదేశసారము నిట్లుగా గ్రహింపవచ్చును.

1. విసర్జనీయోపధ్మానీయ శషరేఫాదిపరక హ్రస్వగుర్వక్షరబాహుళ్యముచే ఓజోమయ విలంభనమును ధరించి వీరరౌద్రబీభత్సాది రసములను—

2. అనుస్వారానునాసిక తవర్గాదిపరక దీర్ఘగుర్వక్షరప్రాచుర్యముచే మాధుర్యమయవిలం బనమును ధరించి కరుణాద్భుతాది రసములను—

3. అసంయుక్త దీర్ఘాక్షరప్రాచుర్యముచే ప్రసాదమయవిలంబనము వహించి నాతిమధుర నాత్యోజోభావములను— వ్యంజించుటకు శార్దూలవృత్తము సమర్థమైయుండును.

నానావిధములయిన యిట్టి శార్దూలవృత్తములు స్వరూపానురూపములయిన యలంకార ములు ధరించి యత్యంతము శోభిల్లుచు స్వధర్మనిర్వహణదక్షములయి యుండును. ప్రాసాను ప్రాస, యతి, విరామ, పరుషసుకుమారవర్ణఘటనావైశేష్యములచే శార్దూలవృత్తమును మహా కవులు రసవిశేషనిర్వాహకముగ నిర్మించుకొనవచ్చును. శార్దూలము ధీరోద్ధతగతిగల వృత్తమే యైనను క్షేమేంద్రుఁడు చెప్పినట్లు వాక్పాకముచేత కవి దానిని అధీరము, అనుద్ధతము చేయఁ గలఁడు. ఆ చేయుటయే శిల్పము.

ఆంధ్రమహాభారతమునందలి శార్దూలవృత్తములు—$158 + 1 = 159$.

| | | |
|---|---|---|
| నన్నయ్యవి | — | 18 + 1 శ్లోకము |
| ఎఱ్ఱనవి | — | 18 |
| తిక్కనవి | — | 122 |

నన్నయ, ఎఱ్ఱన, తిక్కనల శార్దూలవృత్తప్రయోగప్రవణత 4 : 10 : 7 అను నిష్పత్తి యందున్నట్లు వారువారు రచించిన గద్య పద్య సంఖ్యలయందలి శార్దూలవృత్తసంఖ్యలనుబట్టి నిర్ణయింపవచ్చును.

ముగ్వురు కవులయొక్కయు శార్దూలవృత్తవినియోగము ఇట్లున్నది—

| | వీరరౌద్రములందు | అన్యములందు | | |
|---|---|---|---|---|
| నన్నయ | 7 | 11 | = | 18 |
| ఎఱ్ఱన | 4 | 14 | = | 18 |
| తిక్కన | 72 | 50 | = | 122 |

నన్నయ, ఎఱ్ఱన తమ శార్దూలములలో సగమునకు తక్కువగా వీరాదులందుపయోగించిరి. తిక్కన సగమునకు మిక్కిలిగా వీరాదులందుపయోగించెను. ఐదు యుద్ధపర్వములను ఆయన రచింపవలసివచ్చుటయే ఇందుకుఁ గారణమని భావింపవచ్చును.

నన్నయ్య కావ్యారంభశ్లోకము శార్దూలము. ఆది. II. 228 వ పద్యము వ్యాస స్తుత్యాత్మక మైన శార్దూలము. ఎఱ్ఱన అర. VII. 142 వ్యాసవర్ణనాత్మకము. తిక్కన్న విరా. I. 3; శాంతి. VI. 476; వ్యాస స్తుత్యాత్మకములు. శాంతి. I. 398; V. 630; అను. II. 476; IV. 285; ఆశ్రమ. I, II. ఆశ్వాసాంతములు. మౌసల, మహాప్రస్థానపర్వాంతములు హరిహరనాథ స్తుత్యాత్మకములు. ఇవియన్నియు శార్దూలవృత్తమునకు స్వాభావిక మైన యోజోగుణము కలవియే. వాక్పాకమాధుర్యముచే నోజోదీప్తియు చిత్తసుఖావహమగునట్లే పద్యములు నిర్మింపఁబడి యున్నవి.

పారాశర్యవచఃపయోనిధిసుధాభంగీ ! దయాసంగి ! దు
ర్వారాశేషవిపద్విదారణవిహారా ! చిన్మయాకార ! వి
స్తారోదారగుణత్రయస్ఫుటవిశేషా ! నిర్గుణాశ్లేష ! మా
గారీత్వోజ్వలతత్వభాస్వర ! నిజాగారాత్మకత్రీశ్వరా !

మహా. 77.

ధర్మాధర్మవిదూరనీతిపరవిద్వచ్చిత్తయోగీ ! జగ
న్నిర్మాణస్థితితంత్రసంహరణధూర్నిర్వాహరాగీ ! మహా
శర్మాపాదనపాదపద్మ ! సుతపఃస్వాధ్యాయసద్మా ! మనో
తర్మ్యద్రాలతికాఫలత్వలసితా ! దాంతిస్ఫుటోద్భాసితా !

అను. II. 476.

కాలస్వైరవిహారభంజనకళాకౌతూహలస్తవ్య ! దు
శ్శీలాంతఃకరణావిభావ్య ! కరుణాశ్రీమందిరాపాంగ ! మం
త్రాళీవాచ్యసుధామయాంగ ! పవనవ్యాపారరోధక్రియా
శాలిస్వాంతసముల్లసద్విహరణా ! సంసారనిస్తారణా !

మౌసల. 224.

భావనారమణీయమైన ఈ పద్యము ఛందస్తత్త్వోపనిషత్తు. కాలముయొక్క స్వైరవిహార రూపమైన వాక్యమును భంజించుట యొకకళ. అందలి కౌతూహలము ఛందశ్శిల్పి లక్షణము. వివిధభంగుల కాలవిహారము విభజించి సౌందర్యవిశేషములు భాసింపఁజేయవలెను. వానిచే పరమేశ్వరుని స్తుతింపవలెను. కాలస్వైరవిహారభంజనాత్మకమే పవనవ్యాపారరూపమైన వాక్ప్రసార నిరోధక్రియ. అట్టి క్రియయందు కుశలమైన స్వాంతమునందే రసమూర్తియైన స్వామియొక్క విహారములు సముల్లసించును. ఆస్వామి విహారవిలాసములు దుశ్శీలాంతఃకరణములకు భావింప శక్యముగానివి. శీలమే శిల్పమనఁబడినది. అశిల్పి లయాత్మకమైన పరమేశ్వరవిహారసౌందర్యమును భావింపఁజాలఁడఁట. అట్లు భావింపఁగలవాఁడే సంసారమును నిస్తరింపఁగలడఁట. ఛందోరసజ్ఞుఁడే ముక్తుఁడు.

'పారాశర్య వచఃపయోనిధి సుధాభంగీ' :- ఇత్యాదిసంబోధనలన్నియు సువిభక్త, నియత సమాహితవాక్ప్రసార పరిణతఫలరూపమైన పరమేశ్వరుని యానందాంశనే వ్యక్తముచేయుచున్నవి.

అనియతస్థానములయ్యు నసాధారణస్థానములై యనంతప్రకారములయిన ఈ వృత్తము లందలి యనుప్రాసములు ఆనందమయుఁడైన పరమేశ్వరుని యనంత విలాససౌందర్యమును వెలార్చుచు శ్రోత్రరసాయనములగుచున్నది. తిక్కన్న శాంతిపర్వాదిగా హరిహరనాథుని తఱచు శార్దూలవృత్తముల స్తుతింపనారంభించెను. ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానములందు స్వామి స్తుతి శార్దూలవిక్రీడితములందే నిబంధింపఁబడియున్నది.

"పారాశర్యుని కృతియయి
భారతమనుపేరఁ బరగు పంచమవేదం

బారాధ్యము జనులకు త
ద్గౌరవ మూహించి నీవఖండితభక్తిన్"

విరా. I.

"తెనుఁగుబాస వినిర్మింపఁ దివురు టరయ
భవ్యపురుషార్థతరు పక్వఫలముగాదె ;
దీని కెడ నియ్యకొని వేడ్కనూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ !"

విరా. I.

మహాభారతాంధ్రీకరణము తిక్కన్నకు స్వామికార్యమై ఏర్పడినది. ఆంధ్రావళితోపాటు హరిహరనాథదేవుఁడును మోదముం బొరయవలసియున్నది. ప్రారబ్ధమైన మహాకార్యము ఫలోన్ముఖమగుచున్నది. మహాప్రస్థాన, స్వర్గారోహణములు తిక్కన్నకు దర్శనగోచరములగుచున్నవి, ఆయన చిత్తముయొక్క విస్ఫూర్తి, ఉన్నతి, దీప్తమధురోత్సాహరూపమున చరమపర్యాంతములందు శార్దూలవిక్రీడితములు గావించినది.

"సాత్యవతేయ సంస్మృతిశ్రీ విభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వ దీక్షావిధి నొంది" మహాభారతార్థమును సంగతముగావింతునని తిక్కన్న ప్రతిజ్ఞచేసెను. వ్యాసభగవానుని స్మరణమున ఆయన చిత్తమున మాధుర్యము దీప్తివహించును.

"విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్"

"విద్వన్మోదవిధాయి నిర్మలవచో విస్ఫూర్తివిఖ్యాతుఁ గృ
ష్ణద్వైపాయను నీవెఱుంగుము విభున్ నారాయణుం గా; విప
శ్చిద్వంద్యంబగు భారతాధ్యయనముం జేయంగ శక్తుండు; ధ
ర్మాద్వైతుండు సరోజలోచనుఁడ కాకన్యుండు తద్వాచ్యుఁడే !"

శాం. VI. 476.

వ్యాసస్మరణమునఁ దిక్కన్నచిత్తమున నుత్పన్నమగు వృత్తిసాదృశ్యము వృత్త, ప్రాసముల యైక్యమువల్ల స్ఫుటగా వ్యక్తమగుచున్నది. వ్యాసస్మరణమున నన్నయ తిక్కనల హృదయస్పందములు సంవాదసుందరములగుటయు నన్నయ్యగారి 'ద్వ' ప్రాసయుక్త శార్దూలవృత్తనిబద్ధమైన వ్యాసస్తుతి నిరూపించుచున్నది.

"విద్వన్ముఖ్యుఁడు ధర్మమూర్తి త్రిజగద్విఖ్యాతతేజుండు కృ
ష్ణద్వైపాయనుఁ డేగుదెంచె సుతశిష్యబ్రహ్మసంఘంబుతో
సద్వంద్యుండు సదస్యుఁడయ్యె......

ఆది. II. 228.

తిక్కన్న తన యవతారికయందు—

"ఆదరణీయ సారవివిధార్థగతిస్ఫురణంబు"......ఇత్యాదిపద్యమున నన్నయ్యను వర్ణించి.

"వైదికమార్గనిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించుచున్"

ఇత్యాది పద్యమునఁ దన్ను వర్ణించుకొని వృత్తైక్యముచేత, ప్రాసైక్యముచేత తమ పరస్పర సాదృశ్యమును వ్యక్తముచేసెను.

ఈ పద్యములు రెండును వ్యాసవర్ణనాత్మకశార్దూలవృత్తముల సన్నిధిని నిల్చినపుడు ఆ మహర్షి సన్నిధానమున నీమహాకవుల వినీతత్వము తదంశైకదేశత్వము ప్రస్ఫుటములగుచున్నవి. 'ద్వ'ప్రాసమున 'ద'ప్రాస మంశమాత్రమకదా.

ఛందోంగ చ్ఛందోలంకారాదినిష్ఠమైన వ్యంజకతాసామర్థ్యము బహుధా గవేషింపఁదగియున్నది.

నానారసార్థవ్యంజనమున నానావిధముల శార్దూలవృత్తనిర్మాణమును ఆమహాకవులు కావించుట గుర్తింపవలెను.

"ఆ నారాయణపాండవేయ గుణమాహాత్మ్యామలజ్యోత్స్న చి
త్తానందం బొనరింపఁగా జనుల కర్థాంశుప్రకాశంబుతో
మానై సాత్యవతేయ ధీవనధిజన్మ శ్రీమహాభారతా
ఖ్యానాఖ్యామృతసూతి యొప్పు నిఖిలాఘధ్వాంతవిధ్వంసియై"

ఆది. III. 21.

"క్షోణీచక్రభరంబు గ్రక్కదల దిక్కుల్ మ్రోయఁగా నార్చి య
క్షీణోత్సాహసమేతులై రయమునన్ గీర్వాణులుం బూర్వగీ
ర్వాణవ్రాతము నబ్ధిఁ ద్రచ్చునెడఁ దద్వ్యాకృష్టనాగానన
శ్రేణీప్రోద్ధ విషాగ్నిధూమవితతుల్ సేసెన్ బయోదావళిన్"

ఆది. II. 12.

"ప్రీతుండై చనుదెంచె నాశ్రితజనాభీష్టక్రియాశీలుఁ డు
ద్గీతామ్నాయుఁడు, నిర్విధూతదురితక్లేశుండు, యోగామృత
స్ఫీతస్వాంతుఁ డనంతసంతతసమావిఖ్యాత కారుణ్యధా
రాతోయప్లవనైకశీలుఁడగు పారాశర్యుఁ డచ్చోటికిన్"

ఆర. VI. 103.

"సింగం బాకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చు నో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరశ్రేమాభిరామాకృతిన్"

విరా. IV. 95.

"దుర్వారోద్యమ బాహువిక్రమరసాస్తోక ప్రతాపస్ఫురత్
గర్వాంధప్రతివీర నిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసన్ గిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిన్ గీచకా!"

విరా. II. 172.

"ఆరూపం బవికార మాధుటబలం బత్యంతనిర్గర్వ మా
కారత్వంబు దయారసానుగత మాశుంభత్క్రియాజ్ఞాన మా
ర్వారంభప్రతికూలవాదరహితం బాయాగి సమ్మానవి
స్తారోదాత్తము మాద్రిపిన్నకొడు కేతన్మాత్రుఁడే చూడఁగన్"

విరా. II 209.

"భీష్మద్రోణకృపాది ధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రిం బుదగ్రధ్వజా
ర్చిష్మత్వాకలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే?"

విరా. IV. 52.

"పుష్టోదంచిత సారవీరరససంపూర్ణాంగమున్ సంగరా
వష్టంభోజ్వలవీరరేఖయును భాస్వద్బాహుసంవల్గనో

త్కృష్టస్యందనమున్ గనద్ధనువు నుద్దీప్తధ్వజంబున్ దగన్
ధృష్టద్యుమ్నుఁడు వార్చె నైజవిలసత్తేజోవిరాజద్గతిన్"

భీష్మ. I. 117.

శ్రేణీబద్ధమై ప్రదర్శింపఁబడిన యీ శార్దూలాష్టకము జాతితః ఏకమయ్యు వ్యక్తితః భిన్నమగుట ప్రత్యక్షమైన యనుభవము.* ఛాందసికులు జ్ఞానమాత్రప్రతిపత్తికొఱకై లక్షణనిరూపణము గావించిన జాతిమాత్రములుకాక ఇవి తజ్జాతిలక్షణసంపన్నములయ్యు, విశేషలక్షణాన్వితములయిన వ్యక్తులగుటయు, తత్ప్రత్యక్షమునఁ గల్గు ననుభవములు భిన్నములగుటయు శ్రోతసులభముగ గ్రహింపఁగలుగుచున్నాఁడు.

నన్నయ భారతప్రశంసాత్మకమైన శార్దూలవృత్తము సంయుక్తాక్షరవైరల్యముచే సుఖోచ్చార్యము. అందు విరళముగనున్న సంయోగములుకూడ క్షైప్రము లనఁబడు యణ్‌సంయోగములు – విశేషించి యకారవకార పరసంయోగములు. అనఁగా పద్యమున గుర్వక్షరము లనఁదగినవానిలో పెక్కు దీర్ఘములు – ఆ దీర్ఘములుకూడ అయత్నముగ నుచ్చరింపఁదగిన కంఠ్యస్వరకృతములు. కంఠ్యేతరస్వరములు మిక్కిలి తక్కువ. అక్షరఘటనము ఎడనెడ నిర్విరామము, ఎడనెడ విచ్ఛిన్నము. అక్షరములయందు ఘోషములు, అఘోషములు సమములై బంధమున గాఢత్వశైథిల్యసంప్లవరూపమైన ప్రసాదము అనుభావ్యమగుచున్నది.

ధీరమంథరగమనమున చంద్రికావిహారము గావించు ప్రసన్నశార్దూలమిది. మహాభారతమనెడు లోకోత్తర వస్తుభావనమున ధీరము శాంతమునైన వక్తయొక్క చిత్తవృత్తిని రూపించుచున్నది. "చిత్తానందం బొనరించు" లక్షణము వృత్తమున నిండారియున్నది.

సముద్రమథనవర్ణనాత్మకమైన శార్దూలమునందలి యక్షరములు నానావిధస్వరవ్యంజనములచే నిర్మింపబడియున్నవి. పెక్కు అక్షరములు రేఫపూర్వపరసంయోగముచే అత్యంతము పరుషములైయున్నవి. ఇట్టి యక్షరముల అసకృదావృత్తిచేత పద్యగమనము కంటకశిలామయప్రదేశసంచారమువలె దుఃఖావహమగుచున్నది. 'భరంబు' 'సమేతు' 'విషాగ్ని' యనుపట్టుల జగణముభాసించి దేవదానవవీరుల యక్షీణోత్సాహము వ్యంజించుచున్నది. స్థానకరణప్రయత్నాదిభేదమున బహుధా భిన్నములయిన వ్యంజనద్రవ్యములు నానావిధస్వరముల వికీర్ణవిన్యాసముచే వృత్తమున గమనవిక్షేపమును సాధించుచున్నవి. సాగర మథనోత్సాహులయిన గీర్వాణపూర్వగీర్వాణుల తత్కాలవిక్షిప్తచిత్తవృత్తిని మధ్యమానమహాసముద్రభావనవల్ల ఘూర్ణితమగుచున్న కవిచిత్తస్పందవృత్తిని పద్యము సుష్ఠుగా వ్యక్తముచేయుచున్నది. మహాసాగరముని మంథరా

* లక్షణముచే నిర్దిష్టమైన పద్యము జాతిమాత్రము. ఆ లక్షణము ననుసరించి కవిచేత నిబంధింపఁబడిన పద్యము వ్యక్తి. పద్యములందు జాతి, వ్యక్తిభేదము పింగళచ్ఛందశ్శాస్త్ర వ్యాఖ్యయందు హలాయుధుఁడు సూచించెను. కావ్యము ననుశీలించువట్ల ఈ విభాగము ప్రయోజనకారి.

చలముయొక్క గురువిలంబితమైన వర్తనము వృత్తముచే భావుకచిత్తములందు రూపుకట్టుచున్నది.

కృష్ణద్వైపాయనవర్ణనాత్మకమైన ఎఱ్ఱన శార్దూలము నాతిదీర్ఘసమాసఘటితమై, క్రమవర్ధమానసమాసమై, నాతిమధురము, నాత్యోజస్వియునై 'ప్రీతుండై' చనుదెంచిన యా తేజస్వి సమున్నతమూర్తికిఁ దగినట్లున్నది. వ్యాసభగవానుని స్మరణమున కవిత్రయముయొక్క హృదయము ధీరమంథరగతిగలదై మాధుర్యదీప్తమగుట వారి శార్దూలములు నిరూపించుచున్నవి.

హిమవన్నగముపై విడిసియున్న పాండవులకు దర్శనమిచ్చిన వ్యాసభగవానుని మూర్తి విశేషమును తిక్కన శార్దూలమున వర్ణించెను.

"బాలార్కద్యుతిపుంజ పింజరజటాభారంబు ప్రావృడ్ఘన
శ్రీలీలం బ్రహసించు నంగమును రోచిఃస్ఫారదండంబు ను
న్మీలన్నీలమృగాజినాంబరమునై నిర్వాణదానక్రియా
శీలుండైన పరాశరాత్మజుఁడు విచ్చేసెన్ గృపాలోలుఁడై"

అశ్వ. III. 147

వ్యాసమహర్షివలెనే ఈ వృత్తముగూడ నిర్వాణదానక్రియాశీలమై శ్రవ్యము మధురమునై యున్నది. కృపాలోలుడైన వ్యాసుని మధురచిత్తవృత్తికిఁ దగినవిధమున నీ శార్దూలవృత్తము యొక్క ఔద్ధత్యము వాక్పాకముచే గళితమై సౌకుమార్యమాధుర్యములు భాసించుచున్నవి.

నృపాదుల శౌర్యస్తవమునందే కాక మహిమాన్విత ద్రవ్యగుణక్రియల స్తవమునందుఁ గూడ శార్దూలవృత్తము వినియోగింపఁదగినదేయని కవిత్రయము నుపదేశము. భారతమహిమ, వ్యాసమహిమ ఇత్యాదులు గమనింపవలెను. చంద్రరూపకాత్మక భారతస్తుతియందు ప్రసన్నమాధుర్యము, సూర్యరూపకాత్మక వ్యాసస్తుతియందు దీప్తమాధుర్యము.

ప్రశంసారూపమైన స్తుతి వర్ణ్యవస్తుగత లోకోత్తరలక్షణప్రతిపాదకము. అది వక్తృచిత్తమందలి వికాసరూప విస్మయవ్యంజకము. విస్మయము సుకుమారభయగర్భితమని మన తత్త్వవేత్తల యభిప్రాయము. గురుదేవాదుల సమక్షమున నృపులు కృతకభయమును సుకుమారముగ నభినయింపవలెనని భరతముని చెప్పెను. మృదుభయసదృశమైన విస్మయమునందలి వృత్తి సుకుమారమధురవిలంబనరూపమై యుండునని భావింపఁదగును.

ఉత్తరగోగ్రహణసందర్భమునఁ గురుసేనలపైకి దుమికివచ్చుచున్న యర్జునుని లోకోత్తర వీరకర్మవర్ణనము ద్రోణాచార్యుని నోట శార్దూలవృత్తరూపము ధరించినది. శౌర్యస్తవమున వినియోగింపఁదగిన శార్దూలము విసర్జనీయోపధ్మానీయ శషరేఫాది పరకహ్రస్వగుర్వక్షరబహుళమై నిర్విరామదీర్ఘసమాసమై యోజోమయవిలంబితవృత్తియై యుండవలెను. ద్రోణవాక్యమున

నీ లక్షణములు లేవు. అనుస్వారాదిపరక దీర్ఘ గుర్వక్షరములు తటచై యున్న ద్రోణవాక్యము అద్భుతరసవ్యక్తికిఁ దగియున్నది.

అజ్ఞాతవాసమున నవసియుండి కురుసేనావీరులకుఁ దన నానాస్త్రశస్త్రముల పటిమ రుచి చూపి బుద్ధిచెప్పఁదలచి యుత్సాహముమై నుఱికివచ్చు నర్జుననకు ఆకటితో గుహాంతరమునఁ జేడ్పడియుండి మదమాతంగయూథదర్శనమున సముద్యత్క్రోధమై వచ్చు సింగముతోడి సాదృశ్యము నిబంధించు వాక్యము శార్దూలవృత్తమగుటయే ఒక యౌచిత్యము. ఆ యర్జునున కుదయించిన క్రోధము వధాంతముగాక విద్రావణాంతమే యగుటచే శార్దూలముయొక్క సహజమైన యోజస్సు సంపూర్ణముగ పద్యమున భాసింపక సింగముయొక్క ఉదాత్తగాంభీర్యము మాత్రమే భాసించుటయు నొక యౌచిత్యవిశేషము. "వచ్చునోజన్" అన్నచోట 'ఓజ' శబ్దము ఉపమావాచకమాత్రమ కాదు. ఓజోరూప సమానధర్మవిశేష వాచకమని గ్రహింపవలెను. సింగముయొక్క ఓజస్సు శార్దూలముయొక్క ఓజస్సుకంటె భిన్నము. మొదటిది ఉదాత్తము, రెండవది ఉద్ధతము. అర్జునుఁడు వచ్చునోజ సమరస్థేమాభిరామముగ నున్నది. ఆ భీలము, నభిరామమునైన యర్జునుని శౌర్యస్తవము ఓజోమాధుర్యసమప్రధానమైన వాక్యమున బద్ధమగుట యుచితము. విశేషించి భీష్మద్రోణులనోట అట్టివాక్యమే ఆ సన్నివేశమున శోభిల్లును.

చిరకాలమునకుఁ గన్నులపండువుగా నగపడిన ప్రియశిష్యునిఁ గాంచి ద్రోణునిచిత్తము ఆర్ద్రము, దీప్తమునైనది. అజ్ఞాతవాసస్మృతిచేఁ గరుణము, ప్రకృతవిజృంభణముచే విస్మయము, వాత్సల్యముచే రతి, ప్రతిపక్షవీరుఁడగుటచే ఉత్సాహము — ఇట్లు పెక్కుభావములు ద్రోణునిచిత్తమునఁ బెనఁగొనుచున్నవి. వానివ్యక్తి మాధుర్యగుణమిశ్రితమైన శార్దూలవృత్తము.

ప్రథమపాదము సంయుక్తాక్షరరహితము, విరామబహుళమునై ప్రసాదమాధుర్యములను, ద్వితీయపాదము సంయుక్తాక్షరబహుళమై యోజోగుణమును, తృతీయచతుర్థపాదములు సమగురుదీర్ఘాక్షరములు నాతిదీర్ఘసమాసఘటితములునై దీప్తమాధుర్యమును వ్యంజించుచు తత్తదవాంతరవాక్యసమర్పితములయిన భావములను సుష్ఠుగా సమర్థించుచున్నవి, తిక్కన్న ఈ పద్యనిర్మాణమున చూపిన శిల్పము వర్ణ్యుఁడైన యర్జునుని క్రీడాకల్పమైన పరాక్రమమునకు, వక్తయైన ద్రోణుని చిరప్రాప్తప్రియశిష్యదర్శనజన్యమైన మధురదీప్తచిత్తవృత్తికిని ప్రాణప్రతిష్ఠ చేయుచున్నది. తృతీయచతుర్థపాదములందలి సంధిగతప్రాసము అర్థసమర్పణప్రౌఢమై యున్నది. తృతీయపాదాదియందు 'ఓజన్' అని పదము విఱిగి ఉపమానమైన సింగముమీఁదినుండి యుపమేయమైన యర్జునునిమీఁదికి శ్రోతచిత్తమును చమత్కారముగ దుమికించుచున్నది. ఇంక శ్రోతదృష్టియందు నిలుచువాఁ డర్జునుఁడే. చతుర్థపాదము నారంభమున 'వచ్చెన్' అని పదమువిఱిగి సమరస్థేమాభిరామాకృతియైన యర్జునుని చెంగునదుమికివచ్చు నోజను రూపించుచున్నది. ఈ పద్యము ఆంధ్రకావ్యరసజ్ఞుల రసనాగ్రముల నిరంతరము నర్తించుచుండుటకీ శిల్పమే కారణము.

కీచకభర్త్సనమున ద్రౌపది ప్రయోగించిన "దుర్వారోద్యమ" ఇత్యాది శార్దూలవృత్తము యొక్క నిర్మాణమునందు తిక్కన యద్భుతమైన శిల్పము ప్రదర్శించెను.

"విచ్ఛిన్నపాదం పూర్వార్ధే ద్వితీయార్ధే సమాసవత్
శార్దూలవిక్రీడితం భాతి విపరీతమతో ఽధమమ్"

II. 37.

అని క్షేమేంద్రుని యుపదేశము. తిక్కనదర్శన మందుకు భిన్నముగా నున్నది. క్షేమేంద్రుఁడు అధమమని తెగడిన నిర్మాణమునే తిక్కన్న మహాశిల్పముగా నిచ్చట ప్రదర్శించెను. ద్రౌపదీవాక్యము పూర్వార్ధమున అవిచ్ఛిన్నసమాసవంతము, ఉత్తరార్ధమున అసమస్తపదము, విచ్ఛేదబహుళమునై యున్నది. కీచకుని నీచప్రసంగము వినివిని యెట్లును వాఁడాప్రసంగమును మానఁడని నిశ్చయించుకొని చిరము నిరోధించుకొన్న క్రోధమును ద్రౌపది యొక్కసారిగా వాగ్రూపమున బహిర్గతముచేసినది. చిరనిరుద్ధక్రోధప్రవాహముయొక్క యుద్గతి ఆరంభమున అత్యంత మోజోమయమగుట సహజము. ఆ యోజోలక్షణము అవిచ్ఛిన్నకల్లోలాయమాన ధారాపాతము. ఓజోవ్యయమునఁ గ్రమముగ వాగ్విచ్ఛేదము. క్రమవర్ధమాన క్రోధాద్యుద్వేగ నిర్వహణమున క్షేమేంద్రుని యుపదేశము గ్రాహ్యము. చిరనిరుద్ధ క్రోధావేశముయొక్క హఠాదుత్క్రాంతియందు అది త్యాజ్యమే. తిక్కన్న నిర్మాణమే యిచ్చట ఉపాదేయమగుచున్నది. పద్యమందలి స్థాయ్యక్షరము రేఫము. మూర్ధన్యమైన రేఫము ఆగ్నేయము. అది శ్రుతికర్తన చిత్తసంతాపనశీలమని యభినవులు. అట్టి రేఫము బహువారావృత్తిచే స్థాయిత్వమును, ప్రాసాక్షర యోగముచే పుష్టిని బొంది పద్యమున దీప్తిని చక్కగా వ్యాపింపఁజేయుచున్నది. దంత్యత్వముచే కాఠిన్యలక్షణములయిన తవర్గాక్షరములు అనువాదిభావమున రేఫకృతదీప్తిని పోషించుచున్నవి. ప్రథమ ద్వితీయ తృతీయపాదములందు వడి ఉకార అకార ఈకారయుక్తమై ద్రౌపది వాక్యోచ్చరణము అనుదాత్తస్వరమున నారంభించి క్రమముగ ఉచ్చస్వరత్వమును దాల్చుచున్నదని సూచించుచున్నది. ప్రాసాక్షరము రేఫపరసంయోగముచే పరుషతరమై దారుపిండధర్మమును వ్యంజించుచున్నది. "దుర్" అన్న యుపసర్గము వాక్యారంభమునందుండి కీచకదూషణరూప వాక్యోత్పత్తికి బీజత్వము ధరించుచున్నది. పూర్వపాదద్వయము హలంతత్వముచే తీక్ష్ణమై యున్నది. పద్యపూర్వభాగమున సుదీర్ఘసమాసము పాండవుల ప్రతివీరనిర్మథనవిద్యాపారగత్వమును వ్యంజింపగా ఉత్తరార్ధము ఛిన్నాంగమై భీమకృత కీచకమానప్రాణాంగ భంగక్రమమును ప్రత్యక్షము చేయుచున్నది. ఘోషాక్షరబాహుళ్యముచే పద్యమున గాఢత్వరూపమైన ఓజస్సు మూర్తీభవించుచున్నది.

ఈ పద్యమునఁ దాను గావించిన శిల్పము తిక్కనకే మెచ్చుకొల్పియుండవలయును. తాను కీచకుని భంగించినతెఱంగును భీమసేనునకుఁ జెప్పు సందర్భమునఁ దిక్కన ఈ పద్యమును యథారూపముగ ద్రౌపదిముఖమున బునరుక్తముచేసెను. భర్త్సనమాత్రప్రయోజనమైన స్త్రైణ

క్రోధమును - అమర్షను వ్యంజించుటకు శార్దూలవృత్తనిర్మాణ మెట్లుండవలెనో ఇక్కడ శిల్పించి చూపెను.

విరటునిపాల గోపాలవృత్తి నవలంబించి నవయుచున్న పరమసుకుమారుఁడైన సహదేవుని దయనీయదశను స్మరించి ద్రౌపది శోకించువాక్యమును దిక్కన శార్దూలవృత్తమునఁ దీర్చెను. "ఆరూపం బవికారము" - ఇత్యాదిపద్యమున స్థాయిస్వరము ఆకారము. ఆకారము స్వరితమని శబ్దతత్త్వవేత్తల మతము. కంఠబిలవివారమాత్రోత్పాద్యమైన దాని యుచ్చారణము సుఖనిర్వర్త్యము. గుర్వక్షరమైన రళ్యమున పద్యగతి సరళముగానుండుట, యథోచితవిరామములచే నిఃశ్వాస ప్రసారము సుకరమగుట, దీర్ఘాక్షరబాహుళ్యముచే అక్షరవృత్తి విలంబమగుట - ఈ సర్వమును స్వీయదీనదశాకథనమునకు అంగముగా భూతపూర్వవైభవ స్మరణపూర్వక సహదేవప్రకృత దీన దశావర్ణనముచేయు ద్రౌపదివాక్యమున అనోజోరూపమైన ఆలస్య, దైన్య, చింతాది వ్యభిచారి భావసంక్రాంతమైన శోకమును చక్కగా నిర్వహించుచున్నది.

కౌరవసేనలు ఉత్తరమున గోగ్రహణము గావించెనని యంతఃపురమునఁ గాంతాజనముతో సల్లాపవినోదములఁగాలముగడపుచున్న యుత్తరకుమారునకుగోపాలురు విన్నవింపఁగా సహజభీరు వయ్యు నబలాజనములయెదుటఁ దెచ్చికోలుబీరమున బీరాలాపములాడి బృహన్నలాసారథికమైన రథమెక్కి పురమువెడలి ఫల్గును నైపుణంబున వల్గదశ్వంబగు రథంబురయంబునకు మెచ్చుచు పరేతవిలయప్రాంతప్రదేశంబు సేరంజని——

సీ॥ అభినవజలధర శ్యామంబులగు నెడ లాకుఁజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమచ్ఛాయంబులగుపట్లు కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రాజమరాళ గౌరములగు చోటులు దఱచుఁబూఁబొదల చందంబునొంద
హారిద్రరుచి సమానాకృతులగు తావు లడరెడు పుష్పొడులట్లు మెఱయ

గీ॥ గలయనెగసి ధరాధూళి లలితవనము
దివికి నలిఁ గాపుపోయెడుతెఱఁగు దాల్ప
గోగణము ముంగలిగ నేల గోడివడఁగ
నడచు కౌరవరాజసైన్యంబుఁ గనియె

విరా. IV. 50.

కం॥ కని యుత్తరుండు గరుపా
ఱిన మేనును దలఁకు మనము ఱిచ్చవడిన చూ
పునునై తొట్రుపడచు ని
ట్లనియె దిగులునొచ్చి యా బృహన్నలతోడన్॥ 51

శా॥ భీష్మ ద్రోణకృపాది ధన్వినికరాఖీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్వాకలితంబు సైన్య మిది; యేఁజేరంగ శక్తుండనే? 52

ఈ ఘట్టము తిక్కన్నగారి నాటకీయరచనాశిల్పమునకు చక్కని లక్ష్యము. ఫల్గునుని నైపుణమున వల్గదశ్వమగు రథగమనమును మెచ్చుచున్న యుత్తరునకు అల్లంతదవ్వుల నెదుట చిక్కగా నెగయుచున్న ధరాధూళి యగపడెను. అది గోగణముఁదోలికొని రయమున నరుగుచున్న కురుసేనలు రేచిన ధూళియని వానికిఁ దోఁచలేదు. నానావర్ణచిత్రితమైన యాధూళి యాకసమున కెగయుట లలితవనము దివికి గాపువోవుటగా అతఁడుత్ప్రేక్షించుకొనెను. తాను సమరాంగణమునం దుంటినన్న జ్ఞానము వానికి లేదు. ఉద్యానవనమున విహరించుంటినన్న భ్రాంతి వానినావరించియుండెను. ఆ ధూళి యాకసమున కెగసినంతనే ఆకస్మికముగఁ గౌరవసేన వానికి అక్షిగోచరమయ్యెను. వాని భ్రాంతి వదలెను. మేను గరుపాఱెను. మనము తలఁకెను. చూపు బిచ్చవడెను. హృదయము తొట్రుపడెను. చిత్తమున దిగులునొచ్చెను. ఇట్టి సాత్త్వికభావ పరంపరాపూర్వకముగ భీత్యంగమైన విషాదవ్యభిచారిని వ్యంజించు ఉత్తరుని వాగనుభావాభినయమున తిక్కన 'భీష్మద్రోణ' — ఇత్యాది శార్దూలవృత్తమును నిబంధించెను.

రూపకదిదృక్షువై ప్రేక్షాగృహమునం దాసీనుఁడై చిత్రవర్ణరమణీయమైన యవనికను దిలకించుచు తద్రామణీయకతాపరవశుఁడై యానందించుచున్న సామాజికుఁడు ఆకస్మికయవనికా తిరస్కరణమునఁ బ్రత్యక్షమైన భయంకరదృశ్యమును దిలకించి యెట్టి యనుభావములు పొందునో ఈ సన్నివేశము నిరూపించుచున్నది. లలితవనరూపమైన యవనిక రూపకము శృంగారరసాశ్రయమన్న సూచన చేయును. తద్రసాస్వాదనానుకూల సుకుమారచిత్తవృత్తిని సామాజికుని యందు ఉత్పన్నముచేయును యవనికాపసర్పణమున శృంగారవ్యంజకదృశ్యము సామాజికున కిష్టము. భయానకదృశ్యప్రత్యక్షమున రసభంగమై సామాజికుని చిత్తము విషాదోద్విగ్నమగును.

ఈ ఘట్టమున ఉత్తరుఁడు తనకుఁ దాను సామాజికస్థానీయుఁడు. సామాజికునకు నటస్థానీయుఁడు. ప్రకృతిభీరువయ్యు కృతకధీరతతో బయలుదేరిన యుత్తరునకుఁ దానేదో చూడఁ బోవుచున్నట్లుండెనే కాని ఏదో చేయఁబోవుచున్నట్లు లేదు. ఆ చూడఁబోవునదియు వినోదప్రాయమనియే అతని భావన. ధూళితెఱ తొలఁగునప్పటికి అతని భ్రాంతితొలఁగినది. అచింతితోపనతమైన భయంకరదృశ్య మాతని చిత్తమందలి వికాసమును భంజించినది. మధురసుకుమారవికాసము దీప్తపరుషవిస్తారరూపముగఁ బరిణమించినది. ఆకస్మికభయావిష్టుఁడైన యాతఁడు ఆత్మరక్షార్థము ఉపాయాన్వేషణపరుఁడయ్యెను. ఉపాయాభావమున చింతాలసుఁడయ్యెను. తనచిత్తవికారమును వాగ్రూపమున బృహన్నలకు వ్యక్తముచేసెను. ఉత్తరునిచిత్తము చతుర్విధబలాత్యుగ్రమైన కౌరవరాజసైన్యదర్శనమున తదాకారాకారితమైయుండుట యాతని చిత్తమునకు ప్రతిబింబమైన వాగనుభావమున స్పష్టమగుచున్నది.

ధూళీపటలమున చిత్రవర్ణ కిసలయకుసుమాది సుందరవస్తూత్ప్రేక్షచే వసంతర్తుభావన చేయుచున్న యుత్తరునకు తదపసర్పణమున నాకస్మిక గ్రీష్మర్తుదర్శనమగుట పద్యార్ధమున సులక్ష్యమగుచున్నది. దుర్యోధనుఁడు గ్రీష్మాదిత్యుఁడుగా, శస్త్రాస్త్రజాలములు ఊష్మస్ఫూర్తిగా, ఉదగ్రధ్వజములు అర్చిష్మంతులుగా రూపముదాల్చి యుత్తరునకు కురుసేన దావాగ్నివిజృంభణ ముగా భాసించెను. ఆతని భావనయందలి లలితవన మాదావాగ్నియందు దగ్ధమైపోయెను. "భీష్మ" "గ్రీష్మ" "ఊష్మ" "అర్చిష్మత్" శబ్దములు భయంకరమైన గ్రీష్మమున ఊష్మలమైన యర్చిష్మ ద్విజృంభణమును సువ్యక్తముచేయుచున్నవి. పద్యమందంతటను నిండారి, ప్రాసస్థానమున ప్రతిష్ఠపొందిన యూష్మాక్షరములు కురుసేనయందు రూపింపఁబడిన యర్చిష్మదూష్మలతను సుష్ఠుగా సమర్థించుచున్నవి.

ఉత్తరుని చిత్తస్థాయియైన భీతి పద్యారంభాక్షరమైన 'భీ'చేత, వడియందావృత్తమైన "భీ" చేత చమత్కారముగ వ్యంజింపఁబడుచున్నది. ఇది యొకవిధముగా భావముద్రాలంకార మనఁ దగియున్నది.

భయానకరసమును, భయభావమును గుఱించి భరతాదులు వివరించిన లక్షణములను ఇచ్చట ననుసంధింపవలెను.

"అథ భయానకోనామ భయస్థాయిభావాత్మకః । స చ వికృతరవ సత్వ దర్శన, శివోలూక త్రాసోద్వేగ శూన్యాగారారణ్యగమన స్వజనవధ బంధ దర్శన శ్రుతికథాదిభి ర్విభావైః ఉత్పద్యతే । తస్య ప్రవేపిత కర చరణ నయన చపల పులక ముఖవైవర్ణ్య స్వరభేదాదిభి రనుభావై రభి నయః ప్రయోక్తవ్యః। భావాశ్చాస్య స్తంభ స్వేద గద్గద రోమాంచ వేపథు స్వరభేద వైవర్ణ్య శంకా మోహ దైన్య వేగ చాపల జడతా త్రాసాపస్మార మరణాదయః" ॥

నా. శా. VI. P. 326.

"రౌద్రశక్త్యా తు జనితం చిత్తవైక్లబ్యం భయం"

సాహిత్యదర్పణము. 3-179

"రౌద్రదర్శనాదిభి రనర్థాశంకనం భయం

ప్రతాపరుద్రీయము - రసప్రక. 14.

ఆత్మవినాశహేతువగు రౌద్రవస్తుసాక్షాత్కారమున జీవుఁడాత్మరక్షాతాత్పర్యముచే నుపా యాన్వేషణచేయును. భయము నీచప్రకృతి. భీరువులం దది త్రాసమనఁబడును.

"ఆకస్మికభయా చ్చిత్తక్షోభః త్రాసః"

ప్రతాపరుద్రీయము - రసప్రక. 62.

"త్రాసస్తు చిత్తవిక్షోభో భీరోః ఘోరేక్షణాదినా"

సాహిత్యసారము. 4-170.

ఘోరవస్తుదర్శనమున భీరువుచిత్తమునఁ గల్గు వికారము త్రాసము. అది క్షోభాత్మకము. ఆత్మరక్షణార్థ ముపాయాన్వేషణముచేసి యుపాయ మెద్దియు లభింపనప్పుడు గల్గు భావము విషాదమనఁబడుచున్నది.

"ఉపాయాభావజన్మా తు విషాద స్సత్వసంక్షయః
నిశ్వాసోచ్ఛ్వాస హృత్తాప సహాయాన్వేషణాదికృత్"

సాహిత్యదర్పణము. 3-167

"మానసో వివిధ స్సాదః విషాదః" అని శారదాతనయుఁడు విషాదమునందలి చిత్తవృత్తి స్వరూపమును వివరించెను. (భావప్రకాశనము-ద్వితీయాధికారము). సత్త్వసంక్షయము వలన మనస్సు దృఢత్వములేక వివిధముగ ప్రకంపితమగును. శరీరమునకు గ్రమముగఁ బటుత్వము తప్పిపోవును. 'సాదో గాత్రాణాం స్రస్తతా" అని యభినవులు సర్వాంగములు శ్లథములగుట సాదమనిరి

నాట్యశాస్త్రము. VI పుట. 327.

రౌద్రదర్శనజమైన భీతి భీరుత్వవిశిష్టమై త్రాసమైనది. ఉపాయాన్వేషణమున ఆలస్యాత్మకమైన చింత, ఉపాయాభావమున క్షోభాత్మకమైన విషాదమైనది. స్థాయియైన భయమున, త్రాస, చింతా, విషాదములు సంచరించుచున్నవి. ఇది యుత్తరుని చిత్తవృత్తి. అతని వాగ్వృత్తియం దిది ప్రవర్తించుట సులభముగ గుర్తింపఁదగియున్నది.

భయభావావేశమున హృదయస్పందనము అతివేగముగా నుండునని యభినవులు. "సన్నముఖశోష హృదయస్పందన రోమోద్గమైశ్చ భయం"[1] అను భరతోదాహృతమైన అనువంశ్యార్యయందలి 'హృదయస్పందన' మును ఆయన "హృదయస్పందన మతివేగేన"[2] అని వ్యాఖ్యానించెను. భరతమునియు అతనువాహిచిత్తస్పందాత్మకములయిన రౌద్రబీభత్సభయానకములందు లఘ్వక్షరప్రాయకృతమైనవృత్తము ప్రయోగింపఁదగినదని చెప్పెను. భయావిష్టమైన హృదయముయొక్క వృత్తి ప్రారంభమున ద్రుతముగానుండి క్రమముగ సత్వక్షయమువల్ల విలంబితమగునని డార్విన్ ప్రభృతులు నుడివిరి.

భయము తమోగుణప్రధానము. తమోవిజృంభణమున చిత్తమునందలి రజస్సుయొక్క వర్తనము క్రమముగ భారము, అలసము నగును. తమస్సు గురువు, వరణకము ననుట స్మరింపవలెను. తనభారముచే అది రజస్సుయొక్క గతిని నిరోధించును.

ఆకస్మికభయావేశమున ఉత్తరునకు వాక్స్తంభన మయ్యెను. ఆ దశయందుఁ గలిగిన పులక, హృదయస్పందన, స్తిమితాలోకన, సంభ్రమాది చిత్తగాత్రారంభానుభావములను తిక్కన

"కని యుత్తరుండు" అను పద్యమున వర్ణించెను. తమోభారము నెదిరించి రజస్సు కొంత విజృంభించి సత్త్వము క్షీణించుటచే అలసమగును. తమోభారమున మందముగ వర్తించును. అట్టి యవస్థయందు ఉత్తరుని వాగనుభావము ప్రవృత్తమైనది. ఆత్మరక్షణోపాయాభావజనితమైన విషాదము భయస్థాయియందు సంచరించు దశయందలి యుత్తరుని వాగ్వృత్తియందు విషాదలక్షణము లన్వేషింపఁదగియున్నవి.

"నిశ్వాసోచ్ఛ్వాసతాపకృత్" "సత్త్వసంక్షయః" అని విశ్వనాథుఁడు విషాదలక్షణము నిర్వచించెను.

సాహిత్యదర్పణము. 3-167.

సాహిత్యసారకర్త భయము రాజసతామసమని పేర్కొనెను. కాని నిష్క్రియమైన భయము ఉత్కటావస్థయందు తామసతామసమనుట యుచితము ఉష్ణము, భారము, అలసమునైన ప్రాణప్రసారము దాని లక్షణము. ఉత్తరుని వాక్యమందలి ఊష్మమూర్ధన్యాక్షరములు, మహాప్రాణాక్షరములు, స్వరముల గమనమునకు నిరోధము, భారము కల్పించి, యుష్ణతను, విలంబనమును ఉత్పాదించుచున్నవి, మహాప్రాణాక్షరములు ప్రాణవ్యయాతిశయహేతువులగుటచే ఉత్తరుని నిశ్వాసము పాదోపాంతముననే విచ్ఛిన్నమగుచున్నది. నిర్విరామ వాక్యోచ్చారణమునందలి యాతని యత్నము కడముట్టఁజాలకున్నది.

పాదత్రయమున ప్రారంభములందును యతిస్థానములందును ఇ ఈ ఏలు నివిష్టములై యుత్తరునివాక్కు ఉదాత్తస్వరమున నుచ్చరింపఁబడుటను సూచించుచున్నవి. "భీష్మ" "గ్రీష్మ" "ఊష్మ" "అర్చిష్మత్" శబ్దములు కంఠోష్ఠతాల్వాది ముఖాంగముల శోషణమును వ్యంజించుచు భయాభినయమునకు సహకరించుచున్నవి. పద్యారంభావసానములు ఈ ఏ అను ఉదాత్తస్వరములగుటయు గుర్తింపఁదగియున్నది. ఉత్తరుని యీ వాక్యము వర్ణ్యవస్తు స్వరూపస్వభావవ్యంజకమై యర్థానురూపముగను, వక్తృచిత్తవృత్తివ్యంజకమై రసానుసారముగను నిర్మింపఁబడి పరమోత్తమమైన ఛందశ్శిల్ప మనిపించుకొనుచున్నది.

భయానకస్థాయియైన భయము జన్మించుటకు "వికృతరవసత్త్వాదిదర్శనము" ఒకకారణముగా భరతముని పేర్కొనెను. ఆ యభిప్రాయమునే జగన్నాథపండితుడు[3] "వ్యాఘ్రదర్శనాదిజన్మా" అని మఱింత స్పష్టముగఁ బేర్కొనెను. శత్రుసేనాదర్శనజన్మమైన యుత్తరుని భయము శార్దూలవృత్తరూపము దాల్చి సహృదయుల హృదయమున భయభావముయొక్క యుగిత్యుద్బోధకుఁ గారణమగుచున్నది.

సమరప్రస్థానారంభమునఁ జతురంగబలసమేతుఁడై యున్న ధర్మజున కభిముఖముగఁ జనుదెంచు సర్వసేనాపతి ధృష్టద్యుమ్నునిఁ దిక్కన—

కం॥ సాష్టాంగమెఱఁగి సమరా
వష్టంభంబొప్ప దివ్యవాహనలీలో
త్కృష్టగతిన్ ముంగలిగా
ధృష్టద్యుమ్నుండు వొలిచెఁ దేజోమహిమన్॥

ఉద్యో IV. 129.

అని కందపద్యమున వర్ణించెను. ఆ ధృష్టద్యుమ్నుఁడే రణారంభమునఁ గురుక్షేత్రమునఁ గౌరవసేనకభిముఖుఁడై చనునప్పుడు తిక్కన—

శా॥ పుష్టోదంచిత సారవీరరససంపూర్ణాంగమున్ సంగరా
వష్టంబోజ్జ్వల వీరరేఖయును ఖాస్వద్వాహసంవల్గనో
త్కృష్టస్యందనముఁ గనద్ధనువు నుద్దీప్తధ్వజంబుందగఁ
ధృష్టద్యుమ్నుఁడు వొల్చె నైజవిలసత్తేజోవిరాజద్గతిఁ

భీష్మ. I. 117.

అని శార్దూలవృత్తమున వర్ణించెను. సప్తాక్షోహిణులకు అధిపతియైన మహాప్రభువు నెదుట వినీతుఁడై సాష్టాంగమెఱఁగు ధృష్టద్యుమ్నుని యాకృతి కందము. అది యాతని వినయ సంకుచితమైన మూర్తి. వైరిసేనాభిముఖుఁడైన యాతని వీరాకృతి శార్దూలవృత్తము. వీరరస సంపూర్ణమై విజృంభించిన ఆతని నైజవిలసత్తేజోమయమూర్తి యది. ఒక్కఁడే ధృష్టద్యుమ్నుఁడు. అవస్థాభేదమున ఆకృతిభేదము. మూర్ధన్యోష్మసంయుక్తాక్షరప్రాసము ధృష్టద్యుమ్నుని యజ్ఞవేదికాసంభవత్వలబ్ధమైన సహజతేజోవ్యంజకము. మహాప్రభువైన ధర్మజుని యెదుట ఆ తేజము వినయసంక్షిప్తము. వైరిసేనయెదుట వీరావేశమున విస్తారవిజృంభితము. వీరరసవిభావవర్ణనాత్మకమైన ఈ శార్దూలమున దీర్ఘరూపగురువులకంటె సంయోగపరహ్రస్వ రూపగురువులు అధికముగనుండి ధృష్టద్యుమ్నునిమూర్తి ఔన్నత్యాతిశాయి పీనత్వలక్షణమని స్ఫురింపఁజేయుచున్నవి.

"సాకారాద్యక్షరైః పాదపర్యంతైః స్వవిసర్గకైః
శార్దూలక్రీడితం ధత్తే తేజోజీవిత మూర్జితం" 2–35

అని క్షేమేంద్రుఁడు సహజతేజోవైభవముతోఁ బ్రకాశించుతీరున శార్దూలము నిర్మించు మర్మము నుపదేశించెను. సంయోగపరములు, వ్యంజనాంతములునైన యక్షరముల బాహుళ్యము చేతకూడ శార్దూలము నైజవిలసత్తేజోవిరాజద్గతి గలదియగునని తిక్కన నిరూపించెను.

శల్యపర్వద్వితీయాశ్వాసమున గదాయుద్ధారంభమున దుర్యోధనవాక్యము—

శా॥ వ్యూహాభావము చూచి నన్నసదుగా నూహించెదో భీమ! మ
ద్బాహాచండిమసార దుర్దమగదాదండంబు దృప్యద్భవ

ద్దేహోల్లాసము నెట్టు దీనదశకుం దేనోపునో చూడుమీ!
యాహా పుట్టెడు లాతిచూపఱకు హాహా పుట్టు మీ వారికి౯

శల్య. II 248

సంయోగపరహ్రస్వాక్షరవై రళ్యముచే ఓజోలబ్ధి నందఁజాలని యీ శార్దూలము అసంయుక్తదీర్ఘాక్షరబాహుళ్యమునను, అందందు - విశేషించి ప్రాసస్థానములందు మహాప్రాణమైన హకారవిన్యాసముచేతను శైథిల్య రూపమయిన ప్రసాదమును అతిశయముగ భాసింపఁజేయుచున్నది. హకారము నిశ్శ్వాసరూపప్రాణవ్యయద్యోతకమనియు, విస్మయ భయ శోక క్రోధ వ్యంజకమనియుఁ జెప్పఁబడినది.

శత్రుభీతుఁడై, రణరంగమునుండి పలాయితుఁడై, హ్రదమున దాగియుండి ధర్మజుని శూలములవంటి యధిక్షేపవాక్యములు విని యభిమానము రేగి మడువు వెడలివచ్చి దురహంకార వశమున భీమునితో గదాయుద్ధమునకుఁ బూని నిల్చి భీముని వీరాలాపములకు దుర్యోధనుఁడు పలికిన ప్రతివీరాలాపమిది.

"పలుకుల వెఱపించెద వా
కొలఁదియె దుర్యోధనుండు?"

అన్న దుర్యోధనుని పలుకులందలి వీరము కృతకము. అక్షతగాత్రుఁడు, విజయోత్సాహియైన భీమునిఁజూచి క్షతగాత్రుండు పరాజయఖిన్నుఁడైన దుర్యోధనుని యంతరంగమున భీతి కలుగుచునే యున్నది. దానిని కప్పిపుచ్చి—

"వ్యూహాభావము చూచి నన్నసదుగా నూహించెదో భీమ!"

నిన్నెట్లు దీనదశకుఁదెత్తునో చూడుము అని తెచ్చికోలుగాంభీర్యముతోఁ బలుకుచున్నాఁడు. 'భీమ' యన్న సంబోధనమే దుర్యోధనుని నిగూఢమైన భయమును వ్యంజించుచున్నది. "భవద్దేహోల్లాసము" అన్నమాట యా భయమునకుఁ గారణమును దెలుపుచున్నది.

అసంయుత 'హ'కారము కంఠ్యము. కంఠబిలవివారమాత్రమున బహిర్గమించునది. ఈ పద్యమందలి —

"ఆహా పుట్టెడు లాతిచూపఱకు హాహా పుట్టు మీవారికిన్"

అన్న వాక్యమందలి 'ఆహా' 'హాహా' శబ్దములు ఆశ్చర్యభయశోకములకు ఉపలక్షకములు.

"సంవృతే కంఠే నాదః క్రియతే; వివృతే శ్వాసః"[4] అను న్యాయమున కంఠ్యములయిన ఆ-హాలయందు 'ఆ' నాదము, 'హా' శ్వాసము. 'ఆహా' నాదశ్వాసాక్షరసంపుటి ఆశ్చర్యము. 'హాహా' కేవలశ్వాసాక్షరసంపుటి భయము శోకము. అసంయుతకంఠ్యహకారము దుర్యోధన

వాక్యమున ప్రాస, యతిస్థానములందు రూపొంది నిగూఢభయాత్మక సనిశ్వసిత వాక్ప్రకారమును సూచించుచున్నది.

"హకారం పంచమై ర్యుక్తం
అంతస్థాభిశ్చ సంయుతం
ఉరస్యం తం విజానీయాత్
కంఠ్య మాహు రసంయుతం"

పాణినీయ శిక్ష – 16.

అను శిక్షావాక్యమననుసరించి వర్గపంచమాక్షరసంయుక్తమైన హకారము ఉరస్యము. ఔరస్యమునకుఁ గారణము హృదయోద్ధమైన రంగనామకానుస్వారసంయోగము. ఉరస్యమైన హకారము మాధుర్యయుక్త వీరరసవ్యంజకమని తిక్కన్నగారి ఈ క్రిందిపద్యమువల్ల గ్రహింపఁ దగును.

"అంహోమర్దనుఁ డాజనార్దనుఁడు మాద్యద్భీష్మకుంభీంద్రుపై
సింహోల్లాసవిభాసియై కవియు నుత్సేకంబు నాటోపమున్
రంహస్స్ఫూర్తియు దీప్తమూర్తియును సంరంభంబుఁ జూడన్ జగ
త్సంహారోన్ముఖుఁడైన రుద్రుక్రియ రౌద్రప్రక్రియన్ బొల్చినన్"

భీష్మ. II. 156.

శ్రీకృష్ణదేవుని భీష్మాలంభనసంరంభము అహార్యరౌద్రమేకాని సహజముకాదు. కనుకనే కౌరవసేనలకు రౌద్రప్రక్రియం బొల్చినను ప్రతివీరుఁడైన భీష్మునకు అందు మాధుర్యమే గోచరించినది. సింహోల్లాసవిభాసియై కవియు శ్రీకృష్ణుని యుత్సేకసంరంభములు శార్దూలవృత్తమున నిబంధింపఁ బడుటయందలి చమత్కార మిల్లు భావింపఁదగియున్నది. శ్రీకృష్ణుని విజృంభణమున మాద్యత్కుంభీంద్రుఁడైన భీష్మునకు సింహోల్లాసమే గోచరించి ఆయన "ప్రియంబున సంభ్రమంబులేక" యుండెనఁట. "లేళ్ళగమివంటి" సుయోధను నగ్రసైనికులు పులిఁబొడఁగన్నట్లు తలంకి కలంగిరఁట. అనుస్వారయుక్తమైన హకారము ప్రాసమునందుండి 'సింహ' నాదమును వినిపించుచున్నది. పద్యమందంతటను నిండియున్న యనుస్వారములు మాధుర్యమును వెల్లివిరియఁజేయుచున్నవి. గుర్వక్షరములందు సగపాలు దీర్ఘాక్షరములే యగుటవల్లను విరామబాహుళ్యమువల్లను వికాసరూపమైన ప్రసాదము స్ఫుటమగుచున్నది. ఇట్లు గుణత్రయాన్వితమైన ఈ పద్యమున చతుర్థపాదమునందలి రేఫసంయోగపరహ్రస్వాక్షరవ్యంజితమైన దీప్తి పరమేశ్వరుఁడైన శ్రీకృష్ణదేవుని తాత్కాలికమైన యహార్యక్రోధమును రూపించుచున్నది.

# మత్తేభ విక్రీడితము

ఇది కృతిచ్ఛందమునఁ బట్టినది. పాదమునకు 20 అక్షరములు. గణములు : స భ ర న మ య వ. 13 అక్షరములమీఁద యతి.

ఈ వృత్తమునకు సంస్కృతవాఙ్మయమునఁ బ్రచారములేదు. సంస్కృతకవు లీవృత్తము నిర్వహింపఁదగిన కర్తవ్యమునుగూడ శార్దూలవిక్రీడితముమీఁదనే యుంచిరి. ఆంధ్రమున శార్దూలవిక్రీడితముకంటె దీనికే ప్రచారమెక్కుడనిపించును.

ఆంధ్రమహాభారతమున మొత్తము 398 మత్తేభవృత్తములు గలవు.

నన్నయవి – 61
ఎఱ్ఱనని – 69
తిక్కనవి – 268

ఇరువదియక్షరములందు పదిగురువులుగల దీనియందలి యక్షరవృత్తి విలంబితమనఁదగి యున్నది. స మ య వ గణముల యునికివల్ల గణాశ్రితమైనగతి యారోహి. అతిక్రాంత మధ్యమైన యతియు ప్రాణప్రసారభారకరము. హృదయస్పందములయు నిశ్వాసములయు విలంబితమందప్రచారములను వ్యజించుట కీవృత్తము యోగ్యమని భావింపవచ్చును. భయ, శోక, క్రోధ, విస్మయ, జుగుప్సాది భావములందు చిత్తస్పందవిలంబనము వ్యంజించుటకు మత్తేభము ఉచితమనఁదగును.

పరఖలీకరణస్మరణపూర్వకమైన వీరరౌద్రవాగ్వ్యాపారమునందును విలంబితవృత్తియైన మత్తేభము తగియుండునని మునివచనప్రమాణమున భావింపఁదగియున్నది.

"శిష్యాణాం ఉపదేశార్థే వృత్తి రిష్టా విలంబితా" అను శిక్షావచనానుసరణమున ఉపదేశ వాక్యమున మత్తేభవిక్రీడితము ఉచితమనఁదగియున్నది.

ఉత్తమ, మధ్యమ, నీచప్రకృతులకు సహజములయిన గతులు విలంబిత, మధ్య, ద్రుత ములని మహర్షిచేసిన నియమమునుబట్టి చూచినచో ఉదాత్తప్రకృతుల స్వపదవాక్యములందును మత్తేభవిక్రీడితప్రయోగము ఉచితమనఁదగియున్నది. అట్లే గంభీరద్రవ్యగుణక్రియా వర్ణనము నందుఁగూడ మత్తేభవిక్రీడితముయొక్క ఔచిత్యము సంభావింపవలసియున్నది.

వీరరౌద్రాదులందే మత్తేభశార్దూలములు ఉచితములన్న యభిప్రాయము పరిశీలనక్షమము కాదు. కవిత్రయము మత్తేభవృత్తవినియోగమును వీరరౌద్రములకే పరిమితముచేసియుండలేదు.

నన్నయరచించిన 61 మత్తేభములలో 21 మాత్రమే వీరరౌద్రాదులం దుపయుక్తము నయినవి. మిగిలిన 40 అన్యరసభావవస్తువులందే వినియుక్తములయినవి. ఎఱ్ఱన రచించిన 69

మత్తేభములలో 26 మాత్రమే వీరరౌద్రములందును, తక్కిన 43 అన్యరసాద్యర్థములందును వినియోగింపఁబడినవి. తిక్కనరచించిన 268 మత్తేభములలో 145 వీరరౌద్రములందును, 44 తదనుబంధిభావములందును 80 అన్యరసభావములందును వినియుక్తములయినవి. యుద్ధపంచక మందలి 143 మత్తేభములలో 16 మాత్రమే వీరరౌద్రేతరములందు వినియుక్తములుకాగా శాంతి త్రయమునందలి 46లో 36 వీరరౌద్రేతరములందే వినియుక్తములయినవి. ఈ 36 లో పెక్కు నీతిధర్మోపదేశములకు వినియోగింపఁబడినవి.

అర్థవిశేషసమర్పణాపేక్షచే కవిత్రయము యథోచితముగ నలంకరించిన మత్తేభములు పెక్కుగలవు. వృత్తి, రీతి, యతి, విరామము, ప్రాసానుప్రాసములు – వీనిలో కొన్నింటినో అన్నింటినో ఆశ్రయించి మత్తేభమునందు నానారసాద్యర్థ సమర్పణ సామర్థ్యము నాధానము చేయుటయందు కవిత్రయముచేసిన శిల్పము పరిశీలింపఁదగియున్నది.

## అలంకృత మత్తేభములు

1. పాదచతుష్టయ ద్విప్రాసము :

"అమలాచారపవిత్ర భూసురవరేణ్యాగారపుణ్యప్రదే
శములం దధ్యయనారవంబు విధివత్స్వాహాస్వధాస్వస్తిశ
బ్దములున్ మంగళతూర్యఘోషములు నుద్యత్కౌతుకాశీర్నినా
దములున్ రమ్యతరంబులయ్యె ధరణిన్ దద్రాజ్యసంవృద్ధితోన్"

ఆది. V. 4.

విచ్ఛిన్నము గావచ్చిన కురువంశము నుద్ధరించుటకై జన్మించిన ధృతరాష్ట్రపాండురాజులు దినదినప్రవర్ధమానులై సకలరాజవిద్యల నభ్యసించుచుండఁగా వంశవర్ధనులైన యాకుమారుల వృద్ధి జగదానందవర్ధనమై ధరణి వేదమంగళాశీరా దములతో రమణీయతరమయ్యెనను నంశ మునువర్ణించు నీపద్యముయొక్క ధీరమంథరగమనము చతుష్పాదసంవేశిత ద్విప్రాసముచే శ్రవ్యతరమై యర్థసమర్పకముగనున్నది.

2. పూర్వోత్తరపాదద్వయముల భిన్నము :

"వితతానేకమృగాకులంబును సదావిఖ్యాతనానాతరు
వ్రతతీపుష్పసుగంధబంధురశుభావాసంబు బ్రహ్మర్షిసం
శ్రితపుణ్యాశ్రమమండలంబు నగుచుం జెల్వొందు నక్కాననలో
ధృతపుణ్యుల్ విహరించి రేవురును గుంతీపుత్రు లిచ్ఛాగతిన్"

ఆర. VI. 142.

అరణ్యముయొక్క చెల్వును అందు పుణ్యులైన కుంతీపుత్రుల స్వేచ్ఛావిహారమును వర్ణించు ఈ పద్యమున మృగములను వృక్షములను వర్ణించు పూర్వపాదద్వయమునను, బ్రహ్మర్షులను, పాండవులను వర్ణించు ఉత్తరపాదద్వయమునను, ద్విప్రాసము ఇంచుక భేదిల్లియుండుట అర్థోచితముగనున్నది. సర్వపాదములు నలంకృతములైన ఈ మత్తేభము అరణ్యసౌందర్యమును, అందు పాండవుల ఆనందమందవిహారములను చక్కగా వ్యంజించుచున్నది.

3. యుగయుక్పాదముల భిన్నము.

"గదనేర్పెక్కుడు గల్గు దర్పఘనుఁ డీకౌరవ్యరాజన్యుఁ డు
న్మదలీలన్ బయి నట్లు బిట్టుఱికినన్ వంచించి పో కిట్లు నే
యుదె! నీవాటునఁబెన్దొడల్ విఱిగి పీఁ డుర్విం బడెన్; మాకు నొ
ప్పుదలిర్పన్ బులకాంకురంబు లెసగం బో విప్పుడుం జూడుమా !"
శల్య. II. 317.

భీమగదాహతిచేఁ దొడలువిఱిగి దుర్యోధనుఁడు నేలఁగూలఁగా పరమానందాశ్చర్యములతో భీముని అభినందించు రాజన్యుల వాక్యమిది. మత్తమాతంగసదృశులైన భీమదుర్యోధనుల గదాయుద్ధక్రీడ మత్తేభవిక్రీడితమున వర్ణించుట యొక చమత్కృతి. ఆ యిరువురును ప్రభుపుత్రులగుటచే ఆ మత్తేభము అలంకృతమగుట యుచితము. ఆ యలంకరణము పాదద్వయములందీషద్భిన్నమగుటయు ప్రతిద్వంద్వితావ్యంజకము. భీమవిజయానందితులయిన రాజన్యుల యభినందనవాక్యము అలంకృతమై వక్తల యానందాశ్చర్యముల సమ్యగర్పణమున సామర్థ్యవిశేషమును సంపాదించుకొనుచున్నది.

4. ఆద్యంత మధ్యపాదద్వయభిన్నము :

"వివిధోత్తుంగతరంగఘట్టన చలద్వేలావనైలావలీ
లవలీలుంగలవంగ సంతతలతాలాస్యంబు లీక్షించుచున్
ధవళాక్షుల్ చని కాంచిరంత నెదురం దత్తీరదేశంబునం
దవదాతాంబుజఫేనపుంజనిభు నయ్యశ్వోత్తమున్ దవ్వులన్"
ఆది. II. 30.

సాగరతీరమున లతాలాస్యము లీక్షించుచు విహరించుచున్న వినతాకద్రువలు ఆకస్మికముగ నుచ్చైశ్శ్రవమును దిలకించుట యీ పద్యమున వర్ణింపఁబడినది. అమృతసోదరమైన యుచ్చైః శ్రవోదర్శనము అమృతహరణపర్యవసాయి యగుటచే నీ పద్యము సన్నివేశవిశిష్టతావ్యంజకముగ నిర్మాణవైశిష్ట్యము నార్జించినది. లతాలాస్యములను ధవళాక్షులయిన వినతాకద్రువలు తిలకించిరన్న యర్థము. ఒకతీరు ద్విప్రాసముచేతను, వివిధోత్తుంగతరంగములు, తచ్ఛిరోగత

డిండీరఖండసదృశమగు తురంగము ప్రతిపాదింపఁబడిన భాగములు ఒకతీరు ద్విప్రాసముచేతను అలంకృతములై వర్ణ్యవస్తుగతసాదృశ్యము సువ్యక్తము చేయఁబడుచున్నది. సాగరతరంగము లయు, ఐంద్ర తురంగముయొక్కయు గమనభంగులు దీర్ఘాక్షర, అనుస్వారపరకగుర్వక్షర ములచేఁ జక్కగా వ్యంజింపఁబడుచున్నవి. ఈ యక్షరములచే పద్యమందంతటను సుష్ఠుగా నిర్వహింపఁబడిన యనిరుద్ధ ధారామయమంథరమధురగతి ఏలాలవలీలతల సుకుమారవిలంబిత లయాన్వితలాస్యమును, తద్దర్శనజనితానందపారవశ్యధీరములైన వినతాకద్రువల సవిలాససంచార ములను సమగ్రముగ రూపింపఁబడుచున్నవి.

"వివిధోత్తుంగ తరంగ ఘట్టన చలద్వేలావనైలావలీ" అను పాదమున అకారాద్యౌకార పర్యంతములయిన వివిధస్వరములు విచిత్రముగఁ బ్రయిక్తములై తంరగవైవిధ్యము చమ త్కారముగ భాసించుచున్నవి.

5. పాదత్రయ త్రిప్రాసము :

"జననీ నీవమృతంబు దెమ్మనిన యా సత్యోక్తి వాటించి యేఁ,
జని నానావిధకర్మకర్మఠుఁడనై సాధించి వే తెచ్చితిన్
విను నానీ యొడబాటు సెల్లె జనులన్ విన్పించితిం దెల్లగా
వినతం దోడ్కొనిపోయెదన్ మనమునన్ విభ్రాంతి లేకుండుమీ"

అను. I. 263.

ఈ పద్యమున రమణీయమైన త్రిప్రాసము పాదత్రయమున మిక్కిలి చమత్కారముగ నిర్వహింపఁబడి చతుర్థపాదమున నిపుణముగ త్యజింపఁబడినది. "తెమ్మమృతమున్" (అను. I. 212) అన్న కద్రువకోరిక యక్షరశః తీర్చి "మాటవెర వేపార" వంచకురాలయిన యామెను వంచించి మాతృదాస్యవిముక్తి సాధించిన గరుడుని వాక్యమిది. కద్రువను మాటమై నొడిచిన గరు డుని వాక్చమత్కృతిని కవిబ్రహ్మ రమణీయ శిల్పముగఁ దీర్చెను. "ఒడఁబాటు చెల్లె" నని చెప్పివేయుటతో మాటమై నొడుచుట పూర్తియయ్యెను. వాక్చమత్కృతి యాపై నవసరములేదు గనుక ప్రక్రాంతమైన త్రిప్రాస ముపసంహరింపఁబడెను. ఆ యుపసంహారముకూడ "విను" అన్నమాటతో ఆద్యక్షరసంవాదముగల "వినతన్" అన్నపదముతో నాతిశ్రుత్యాశాభంగకరముగ నిపుణముగఁ జేయఁబడినది.

నిర్వహింపఁబడిన మూఁడుపాదములందును అత్యంతచమత్కారముగ నిర్వహింపఁబడిన దనియు గుర్తింపవచ్చును. పాదత్రయమున త్రిప్రాసమును నిర్వహించిన యక్షరముల సంపుటీ కరణ చమత్కృతి—

జ న నీనీ

జ ని నానా

వి ను నానీ

పాదద్వితీయాక్షరములందు స్వరక్రమము ఒక చమత్కృతి. పాదతృతీయ చతుర్థాక్షర సంపుటి ప్రథమపాదమున "నీనీ" ద్వితీయపాదమున "నానా" యన్న యొడంబడిక, తృతీయ పాదమునం దాయొడంబడిక చెల్లుట. ప్రథమపాదమందలి 'నీ'ని గెల్చి ద్వితీయపాదమందలి 'నా' తృతీయపాదమున ప్రథమస్థాన మాక్రమించుట – ఈ సర్వమును విచారరమణీయమైన యక్షరవిన్యాసచమత్కారము. వినుచున్న కద్రువ ఈ యక్షరవ్యూహమునఁ దగుల్కొని విభ్రాంతయైయుండఁగాఁ దన మాటనేర్పుయొక్క సామర్థ్యము నెఱింగిన గరుడఁడు ఆ నేర్పు నుప సంహరించి "విభ్రాంతిలేకుండుమీ" యని కద్రువను హెచ్చరించుట స్వయంకృతచమత్కార పరిజ్ఞానలక్షణము. ఈ "మాటనేర్పునకున్ లోకము మెచ్చు" నని కవిబ్రహ్మ తరువాతిపద్యమునం దనుటయు నిట్టి గడుసుదనమే. నానావిధకర్మకర్మరత్వమనఁగా శిల్పపారగత్వమని గ్రహింప వలెను ఎల్లరకుఁ దెల్లమగునట్లు పలుకఁబడిన యీ పద్యమునందలి యక్షరవృత్తి, అవాంతర వాక్యవిరామవృత్తియు, విలంబితమై యర్థానురూపమై యున్నవి.

6 ప్రథమతృతీయపాదములందు :

"పటుబాణాహతి ద్రౌణియంగము చలింపంజేసి తచ్చాపము
త్కటవేగంబునఁ ద్రుంచినన్ గినిసి యాతం డొండువిల్లెత్తి యు
ద్భటబాహాబలశౌర్యముల్ నెఱపె నాదైత్యుండు సైన్యంబు నో
చ్చుటయుం జచ్చుటయున్ మహీపతికి మెచ్చుంబ్రీతియుం జేయఁగా.
ద్రో. V. 79.

ఇది యశ్వత్థామయు ఘటోత్కచుండును బోరుట వర్ణించుచున్నది. ప్రథమపాదమున ఘటోత్కచుని ప్రతాపము, తృతీయపాదమున దానిని నిలువరించిన యశ్వత్థామశౌర్యమును ప్రతి పాదింపఁబడినవి. ఆ రెండుపాదములందే ద్విప్రాసములు నివిష్టములై ప్రతిభటుల ప్రతాప తౌల్యమును వ్యంజించుచున్నవి.

అంత్యప్రాసాలంకృతమత్తేభములు కవిత్రయము రచించినట్లు కనఁబడదు. అంత్యాను ప్రాసరమణీయమైన మత్తేభమొకఁడు తిక్కన రచించినది శాంతిపర్వమునఁ గలదు.

"అటవీదేశములందు బాధబహులాయాసంబులం *గంది* దు
ర్ఘటమత్స్యేశ్వరసేవఁ *గుంది* బహుసంగ్రామంబులన్ విద్విష

త్పటునానాస్త్రిమహోగ్రశస్త్రిచయనిర్భగ్నాంగతం బొంది యు
త్కటదుఃఖంబుల మీరలొందితి రభేద్యస్థైర్యులై నాకుఁగాన్.

శాం I. 394

బహుబంధుహననప్రాప్తమైన సామ్రాజ్యమును పాలింపనొల్లక నిర్విణ్ణుఁడై యుండి వ్యాస శ్రీకృష్ణాదుల నానావిధోపదేశములచే నంకిలిదేరి యెట్టకేలకుఁ బట్టాభిషిక్తుఁడైన ధర్మజుఁడు ప్రసన్నమధురచిత్తుఁడై శ్రీకృష్ణదేవుని స్తుతించి, యనంతరము తనతమ్ములతో నభినందన పూర్వకముగఁ బలికిన దీవాక్యము. తనకునై తనతమ్ములు పడినపాట్ల నుగ్గడించువాక్యములను ధర్మజుఁడు అనుప్రాసాలంకృతములను గావించుట మిక్కిలియుచితముగ నున్నది. పాండవులు పొందిన వనవాసాజ్ఞాతవాస, యుద్ధరూపములయిన కష్టములన్నియు స్వరూపమున భిన్నములయ్యు గుణమునం దొక్కవిధమైనవే. వానిని "కంది, కుంది, పొంది, ఒంది," యను బిందు పూర్వక దకారావృత్తిచే నలంకరింపఁబడిన వాక్యఖండములచే ధర్మజుఁడు ప్రతిపాదించెను. ఈ యనుప్రాసముచే వాని పరస్పరసాదృశ్యమును, అనన్యసాదృశ్యమును చక్కగా వ్యంజింపఁబడు చున్నది. అనుభవసమయమున నవి యెంతదుఃఖసహములయినను సామ్రాజ్యలాభమొంది ఆనంద ముగ నున్నవేళ స్మరింపఁబడి యవి మాధుర్యోపేతములే యగుచున్నవి. ఆ మాధుర్యము బిందు పూర్వక దకారావృత్తియందున్నది.

శాంతి II-433 వ పద్యమునందలి ఛేకానుప్రాసముయొక్క సామర్థ్యము గుర్తింపఁదగినది.

"పసగన్ వేచని దోర్బలంబున రణప్రావీణ్యముంజూపి నీ
వసురానీకము ద్రుంచి భూప్రజలకున్ హర్షంబుగావించి రా
కసుమీ రాక జయంబు లేక ప్రజదుఃఖంబొందఁగా రాక నీ
యసువర్గంబుల పోకగా నెఱుఁగు పెక్కాడంగ నింకేటికిన్"

తనపై నెత్తివచ్చిన దనుజులను సంహరించిరమ్మని యంబరీషుఁడు తనసేనాపతియగు సుదేవునితో నన్న వాక్యమిది. ఛేక యమకాలంకృతమైన యొక్కవాక్యము. వేయివాక్యముల పెట్టు. ఈ వాక్యముయొక్క శక్తియెట్టిదో అనంతరవృత్తాంతమువల్ల తెల్లమగుచున్నది. అంబ రీషుఁడు తన యీ యొక్కవాక్యముయొక్క సామర్థ్యము నెఱుంగును. కనుకనే "పెక్కాడంగ నింకేటికిన్" అని యుపసంహరించెను.

నానావిధముల నలంకృతములయిన పద్యములయొక్క యర్థప్రతిపాదనసామర్థ్యము సర్వత్ర ఇట్లే నిరూపింపఁదగియున్నది.

మత్తేభవృత్తప్రయోగమున నామాశ్రితమైన యౌచిత్యముకూడ పెక్కుపట్టుల గుర్తింప నగుచున్నది.

"గద నేతంగొని యాంత్యకాలయమరేఖం బేర్చి ర క్తంబు చా
య దలిర్పన్ దను వు గ్రసుందరముగా నవ్వీరుఁడేతెంచి యు
న్మదమాతంగములీల దోఁప మనసేనం బొల్పుఱందోలి పే
ర్చె దివెం గ్రమ్మర దుస్ససేను వికటస్ఫూర్తిస్ఫురన్మూర్తియై"

కర్ణ III. 219

దుశ్శాసనుని తొమ్ముఁ వచ్చి, రుధిరపానమొనర్చి యానందించు తనపైఁ గవియవచ్చు కురు సేనలను భీమసేనుఁడు వెరపించి పాఱదోలు సన్నివేశమిది. "ఉన్మదమాతంగములీల" అని భీమ సేనునియందు మత్తేభత్వమును రూపించు నీ వాక్యమును మత్తేభవృత్తమున నిబంధించుట ఛంద శ్చమత్కారము. ప్రథమ తృతీయపాదములందు యత్యతిక్రమణము, ద్వితీయపాదమున ప్రాసా క్షరపదాదిగతత్వకృత గమనభంగము, సర్వపాదములందును పదనివేశాశ్రితమైన గతివికటత్వము, రూక్షాక్షరవైరళ్యము సానుస్వారాక్షరబాహుళ్యము పద్యమునందు ఓజస్సును భంజించి మాధుర్య మును భాసింపఁజేయుట – ఈ సర్వమును పరమరమణీయశిల్పము. తత్కాలమందలి భీమ విజృంభణము నటనమాత్రమే. తిక్కన్నయభిప్రాయమున నిది కేవలము మత్తేభముకాదు; ఉన్మత్తేభము, వికృతము ఉగ్రము సుందరమునైన ఉన్మత్తేభవర్తన మీ వృత్తమున ప్రస్ఫుట మగుచున్నది. ద్వి, త్రి, చతురాద్యక్షరఘటిత పదములబంధము పిండీబంధాది నృత్తసదృశమై నృత్యత్ప్రాయత్వరూపమగు ఉదారతాగుణమును ఛందమున రూపించును. ఉదారతయే వికట త్వము. ఈ యున్మత్తేభము "వికటస్ఫూర్తి స్ఫురన్మూర్తి" యని తిక్కన్న తీర్పు.

"బలమత్తాకృతియైన భీముఁడను కుంభత్కుంభిసంరంభమున్
నిలిపెన్ నాఁడును నంకుశంబయి తుదిన్ నేఁడుం దదుద్రేకమున్
మలుగంజేయ నజాతశత్రుని కృపామౌగ్ధ్యంబుగల్గంగ వా
రలకేలా నయవిక్రమోచితవిచారక్లేశముల్ సంజయా"

ఉద్యో. I. 319.

"రభసక్షోభితమేదినీతలముపై రథ్యప్రచారంబు లో
ప్ప భుజాగర్వము నెమ్మొగమ్ములఁ దిలిర్పన్ గన్నెకయ్యంబున
ర్థి భవత్పుత్రులమీఁది కోపమున నుద్దీపింప నేతెంచి ర
య్యభిమన్యుండును ద్రౌపదేయులును మాద్యద్దంతి యూథాకృతిన్"

భీష్మ. I. 110.

ఈ పద్యములందలి యర్థములు ఎట్లు పద్యనామముచేత, తన్నామమున కుచితమైన ధీర గంభీరగమనముచేత సుష్ఠుగా సమర్థింపఁబడుచున్నవో గుర్తింపవచ్చును. వీనియందలి ముద్రాలం కారములు సులక్ష్యముల.

"వలుం దెక్కఁడచూచె నొండెడ ననేవ్యక్షోజముల్ పుట్టవే
ఫలితంబై వరశాఖలొప్పఁగ ననల్పప్రీతి సంధించుచుఁ
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ విశ్రాంతిగావింపఁగాఁ
గల యీభూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిఁ"

విరా. II. 136

విరాటుని వధించుటకు వృక్షోన్మూలనోద్యుక్తుఁడగుచున్న భీముని వారించుచు ధర్మజుఁడన్న వాక్య మీ పద్యము. ఆశ్రయధ్వంసనరూపమైన యధర్మమునకుఁ బూనిన భీముని యుత్సాహత్వరను భంజించు విలంబితవృత్తిచేత, ఆతని తత్కాలాకృతియందలి మదమాతంగత్వమును వ్యంజించు నామౌచిత్యముచేత ఈ పద్యము ధర్మజునినోట మిక్కిలి శోభిల్లుచున్నది. అప్రస్తుత ప్రశంసారూపమైన యిందలి ఉక్తివైచిత్రి యెంత రమణీయమో, భీమునియందు మత్తేభత్వము నారోపించు రూపకాలంకారధ్వనియు, తన్మూలకమైన వృత్తనామముద్రాలంకారధ్వనియు నంత రమణీయములు.

చింత, దైన్యము, నిర్వేదము, సాంత్వనము, శోకము, భయము, శృంగారము, ధ్యానము, తత్త్వబోధ, అభ్యర్థనము, మున్నగు పెక్కు అనోజఃస్వరూపములగు భావములందు విభావవర్ణనమున కవిచేత, అనుభావమున పాత్రలచేత మత్తేభవృత్తము ఉపయోగింపఁబడినది. ఇట్టిపట్ల ధీరోదాత్తవ్యక్తులయందు అనౌజస్యము చిత్తస్పందమందవర్తనమాత్రముననే వ్యక్తమగుననియు అనుదాత్తవ్యక్తులందువలె అవరోహణగతిరూపము ధరింపదనియు గుర్తింపవలెను. కనుక ధీర వ్యక్తుల చింతాశోకాదిభావముల వ్యక్తియందు మత్తేభవృత్తము తన గమన మంధరతచే సమర్థమే యగుచున్నది. అట్టి మత్తేభముల గతియందు ఆరోహణము తిరస్కృతమై మాంద్యముమాత్రమే ప్రస్ఫుటమగును.

శృంగారవిభావవర్ణనమున :

"వనజాతాయతనేత్రు నున్నతబృహద్వక్షఃస్థలుఁ సింహసం
హననుఁ బాండవసింహముఁ హృదయజన్మాకారు నుద్యన్మహా
శనికల్పస్థిరబాహుఁ జూచుచు మనోజాతాగ్నిసంజాతవే
దనయై రాక్షసి కామరూపధర మర్త్యస్త్రీస్వరూపంబుతోన్"

ఆది. VI. 189

ధీరోద్ధతుఁడైన భీమసేనుఁ డిచ్చట శృంగారనాయకుఁడై ధీరగంభీరగతియైన మత్తేభ వృత్తమున వర్ణింపఁబడినాఁడు. ఉత్తరాకల్యాణ సందర్భమునఁ గవిబ్రహ్మకూడ అభిమన్యుని వర్ణనము మత్తేభమునందే తీర్చెను.

"హరిమేనల్లుఁడు బాహువీర్యపటుశౌర్యస్ఫూర్తి త్రైలోక్యసుం
దరుఁడాచారపవిత్రుఁ డచింతకళాదక్షుం డుదారుండు కా
తరసంరక్షకుఁ డార్యసమ్మతుఁడు విద్యావైభవోల్లాసి య
త్యురుతేజుండు వరించుఁగాక యభిమన్యుం డీసరోజాననన్"

విరా. V. 363.

"తీఁగబోఁడి మృదులపాణిఁ గుమారుండు మెలపుమై గ్రహించెఁ బల్లవాలంబిమత్తేభలీల"[5] అని తిక్కన్న యభిమన్యుఁ డుత్తరపాణిని గ్రహించిన దృశ్యమును వర్ణించెను. అభిమన్యుని మూర్తియందు మత్తేభవిలాసము తిక్కన్న దర్శనమున రూఢమైయున్నదని భావింపఁదగును.

ధీరపురుషుల శౌర్యస్తవమందేకాక సౌందర్యవిలాసాదిస్తవమునందును శార్దూలమువలె మత్తేభముకూడ సమర్థమగునని భావింపవలెను.

"మనువంశంబునఁ బుట్టి సర్వజనతామందారమై నేలయె
ల్లను బాలించి జగత్త్రయీపరిణుతలీలం బొల్చె దుర్యోధనుం
డను రా జవ్విభునొప్పు నర్మదకుఁ గామావేశముం జేసినన్
వనితారూపముదాల్చి పొందె నతనిన్ వైదగ్ధ్యహృద్యంబుగన్"

అను. I. 44.

శృంగారప్రసంగమునం దుపయుక్తములయిన యీ మత్తేభములు వాక్పాకవశమునఁ మాధుర్యగుణము సంక్రమించి యోజోదీప్తి మందగించి సుందమందగతులై యుంట ప్రత్యక్షమ. భీమాభిమన్యు దుర్యోధనులను వర్ణించు నివి క్రమముగ మార్దవాతిశయముగలవై ధీరోద్ధత, ధీరోదాత్త, ధీరలలిత శృంగారనాయక వర్ణనములకుఁ దగిన స్వరూపములను ధరించుయుటయు గుర్తింపవచ్చును.

నిర్వేదమున :

"కలదే యిమ్మెయి పౌరుషంబు జగతిం గారుణ్యమేపార ని
ప్పులు గిట్లిచ్చునె మేను? నాదుచరితంబుల్ నిందకుం బట్టులై
తలఁపన్ వచ్చిన నింతకీడగునె యేతత్క్రూరతాఘోరచే
ష్టలు మానంగలవాఁడఁ బక్షి గురువై సంధించె సద్బోధముల్"

శాంతి. III. 325.

వ. అని యంతరంగంబున వైరాగ్యంబు నిరంతరంబగుటయు నంత
నిలువక 326

"ఇది యిట్లాలిని బంధులం దొఱఁగి తానీ యగ్నిలోఁ గూలె నా
ప్పిదమైయుండఁగ నిట్టితెంప యొలయం బెంపారు వైరాగ్యసం
పద పాపంబులనెల్లఁ ద్రుంపఁగ మహాప్రస్థానపుణ్యాత్వ మొం
దెద నేనిప్పుడ యంచు మానసము శాంతింబొంద నిర్మోహుఁడై" 327

తనయాకలిం దీర్ప మేని నగ్నికర్పించిన కపోతముయొక్క త్యాగవీరమునుగాంచి బోయ "విస్మయంబున మనమూనఁగఁ గొంతసేపు మ్రాన్పడియుండి" పలికిన వాక్యములివి. విస్మయముచే స్తబ్ధుఁడైన బోయ హృదయస్పందమాంద్య మీ మత్తేభముల గమనమున స్ఫుటమ. కపోతి త్యాగమునకు విస్మయము, ఆత్మక్రౌర్యమునకు జుగుప్స గలిగి తదుభయఫలముగా జన్మించిన వైరాగ్యమునఁ జిత్తశాంతి యుదయింపఁ బ్రసన్నమధురహృదయుఁడైన బోయ వాక్యద్వయమున ననుస్వారాంతాక్షరములు క్రమవర్ధమానములగుట గుర్తింపవచ్చును. సంయుక్తాక్షరవైరళ్యమున రెండవవాక్యము ప్రసన్నతరమై చిత్తశాంతివ్యంజకమగుచున్నది. 'తెంప' 'పెంపారు' 'సంపద' 'త్రుంపఁగ' అన్నపదములందు బిందుపూర్వకపకారము పునరావృత్తమై కిరాతునిచిత్తమున శాంతమాధుర్యము స్థాయిత్వముబొందుటను సూచించుచున్నది. పద్యమునఁ దామసవ్యంజనములు పరిత్యక్తములగుట నిర్మోహత్వలక్షణము.

శోకమున :

ధీరోదాత్తపురుషుల శోకమునందును మత్తేభవిక్రీడితము తన ధీరోదాత్తగతిచే సమంజసమే యగుచున్నది.

"గురుశారద్వతముఖ్య యోధవరసంగుప్తంబు నిర్భేద్య ము
ద్ధుర మాసైన్యము దానిఁజొచ్చి ననుఁ బ్రీతుంజేయఁగాఁ బూని యొ
క్కరుఁడుఁ గోవులలోను జొచ్చు బలుసింగంబొక్కొనా నట్లుసొ
చ్చి రయంబార ననేకవీరశిరముల్ చెండాడె నుద్దండుఁడై"

ద్రోణ. II. 138.

అభిమన్యుమరణానంతరము శిబిరమునకుఁ దిరిగివచ్చి "తమ్మునిదెస కూరిమి నారంగూరిన వగపెంపున ధైర్యంబుసొంపఱి వివర్ణవదనుండై" ధర్మరాజు విలపించిన వాక్యమిది. అతిలోకమైన యభిమన్యుని పరాక్రమస్మరణపూర్వకముగ ధర్మజుఁడు విలపించుచున్నాఁడు. "గోవులలోను జొచ్చుబలుసింగంబొక్కొ" యని యుత్ప్రేక్షితమైన యభిమన్యుని యుద్ధక్రీడాస్మృతిచే ధర్మజునిశోకము దీప్తమైయున్నది. ప్రథమపాదమందలి యోజస్వినియైన గాఢబంధము పద్మవ్యూహముయొక్క యభేద్యతను, అనంతరపాదములందలి వ్యస్తపదములు పద్మవ్యూహము నవలీలంజొచ్చి చీల్చిచెండాడిన యభిమన్యుని పరాక్రమవిలాసమును వ్యంజించుచున్నవి. వైవర్ణ్య

రూప సాత్త్వికభావావిష్టుఁడైన ధర్మజుని వదనమునుండి యీ వాక్యము భావనాదృష్టమైన యర్థము ననుసరించి ప్రసరించినది. అభిమన్యుని మరణముకంటె తత్కార్యమైన యర్జునునిదుఃఖము ధర్మజుని సత్త్వావిష్టుని గావించినది. ఆ సత్త్వావేశమున నాయన స్మృతిరూపభావనాగోచరమైన యర్థమును యథాదృష్టముగ వ్యాహరించెను. ఇట్టివి అర్థానురూపచ్ఛందోమయ వాక్యములు.

ఉదాత్తపురుషుల దీప్తశోకవ్యక్తిస్వరూపమును (ద్రో. IV. 20) ధృతరాష్ట్రవాక్యమునందును జూడవచ్చును. పశ్చాత్తాపరూపశోకదీప్తిని ధర్మజునివాక్యమున (శాంతి. I. 198) ననుశీలింపవచ్చును.

హర్షమున :

"అనినన్ మెచ్చి వృకోదరుం డితఁడు కార్యం బింత దెల్లంబుగాఁ
బొనరంబల్కెనె యంచుఁ బేరెలుఁగు సొంపుంబొంద వక్త్రింబుపో
ల్పున దర్పంబొలయంగ నంగములకుం బొంగార నుద్బృంహిత
ధ్వనియై పొల్చు మహోగ్రసింధురముచందం బొంది
యొప్పెన్ గడున్"

ఉద్యో. III. 149.

"ప్రసత్తి రుత్సవాదిభ్యో హర్షః"[6] అను న్యాయమున హర్షము చిత్తప్రసాదరూపము. ఉత్సవాదిజన్యమగుటచే నట్టి ప్రసాదమున మాధుర్యము సహజముగనుండును. సంధికిఁ గౌరవులియ్యకొననిచో సమరమున వారినందఱను సంహరింతునని పలికిన యర్జునునివాక్యము విని హర్షావేశము నందిన భీముని వర్ణించు నీ పద్యమును దిక్కన్న ప్రసన్నమధురముగా నిర్మించెను. ఇందు పూర్వకాక్షరములు తఱచై, వ్యస్తపదములచే దీర్ఘతరమై పద్యము విలంబితవృత్తియందు మిశ్రగతియై హర్షవికాసమునఁబొంగి యుగ్రసుందరమైన మదగజము ననుకరించుచున్నది.

రౌద్రవిభావమున :

"వికటభ్రూకుటిఘోరఫాలకలితస్వేదోద్భటుండుం జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం బ్రిమర్దనదశావిర్భావసంభావితాం
గకుఁడుఁ జిత్తవిదాహదోహలసమగ్రక్రోధవేగుండునై
బకవిధ్వంసకుఁ డయ్యెడన్నిలిచె శుంభస్ఫూర్తివిస్ఫూర్తితోఁ"

విరా. III. 25.

ఉపకీచకులు కీచకునిశవముతోఁ దన్నును గట్టివైచి శ్మశానమునకుఁ గొనిపోవుచుండ ద్రౌపది యాక్రోశించుట విని భీముఁడు శ్మశానమునకుఁ బరువిడి యుపకీచకవిధ్వంసమున కుద్యు

క్షుద్రైనస్థితి నీ మత్తేభము వర్ణించుచున్నది. గాఢబంధత్వరూపమైన యోజస్సు నిండారి, యందందు "ప్రమర్దన" "విదాహ" "సమగ్ర" మున్నగుపదములందు జగణమురూపుగొని మహా ప్రాణాక్షరములు మెండై క్రోధావేశమున నోష్ణనిశ్వాసముగ, గురువుగఁ బదప్రక్షేపముగావించు మదగజస్వరూపము పద్యమున సమగ్రముగఁ జిత్రితమైయున్నది.

భయానకవిభావము :

"ఇదె గంధర్వులువచ్చి ముట్టికొని రింకెట్లొక్కొ-యంచుఁ భయం
బొదవం బల్లములందు డాగియు సమీపోర్వీజముల్ ప్రాకియుం
జెదరం బాఱియు నీరుసొచ్చియును నిశ్చేష్టం బదద్వంద్వముల్
గుదివడ్డం బెగడొందియుఁ భరితసంక్షోభాత్ములై రచ్చటఁ"

విరా. III. 28.

భీమసేనుని రౌద్రాకారమును గాంచి భీతిచే సంక్షుభితచిత్తులై పలుదెఱంగులఁ బలాయితులైన యుపకీచకుల నీ పద్యము వర్ణించుచున్నది. సర్వపదము లేకపదముగా ముద్దగట్టి దృఢబంధమైయున్న భీమరౌద్రరూపవర్ణనాత్మకమైన పద్యముతోఁ బోల్చిచూచినచో ఒకత్రోవయుఁ దెన్నును లేక చెదరి పాఱిన యుపకీచకులను వర్ణించు పద్యమునందలి విక్షిప్తపదసంతాన శిథిలమైన బంధముయొక్క యౌచిత్యము సువ్యక్తమగును.

నీతి, ధర్మప్రబోధములం దుపయుక్తములయిన మత్తేభములు తత్తదర్థములను ఛందోబంధముచే సంవరణముచేయుటయే ప్రయోజనముగాఁ గలవి. అట్టిపట్ల వక్త యథారుచి వృత్త ప్రయోగముచేయును. ఉపదేశమున విలంబితవృత్తి సంప్రదాయానురోధినియే కదా !

భీష్మ. I. 205, 214 : అను. V. 254 : శాంతి. I. 138 : II. 230, 231; V. 121 : ఉద్యో. I. 358 – ఇత్యాదులు నీతిధర్మబోధాత్మకములు.

# చంపకమాల

ఇది ప్రకృతిచ్ఛందమునఁ బుట్టినది. పాదమునకు 21 అక్షరములు. గణములు : న జ భ జ జ జ ర. 10 అక్షరములమీఁద యతి.

సంస్కృతసాహిత్యమునం దప్రసిద్ధమైన చంపకమాల యాంధ్రసాహిత్యమునం దత్యంత ప్రసిద్ధి వహించినది.

విచ్ఛేదవశమున పాదఖండములు తుల్యప్రమాణములగుటచేతను, పాదమునందలి గురు లఘువుల విన్యాససామంజస్యమువల్లను చంపకమాలావృత్తపాదము మిక్కిలి సుఖముగఁ బ్రయోగింపఁదగియున్నది. 21 అక్షరములలో 14 లఘువులయిన దీనిగతి మిగుల ద్రుతము లఘ్వక్షరప్రాయమైన ఈవృత్తము చిత్తవృత్తి యతను వాహియైనపట్టులందు - అనఁగా వీరరౌద్రాదులందు ప్రయోగింపఁదగినది. సమాంతరవినివిష్టములయిన గుర్వక్షరములు చంపకమాలాద్రుతగతియందు విలంబనము ఆధానముచేసి కొంతవరకు సామ్యము భాసింపఁజేయుటచేత ద్రుత్యభిముఖమైన సమగతిగల రత్యాదిభావములందును ఈవృత్తము బ్రయోగింపఁదగియున్నది. లక్షణమునుబట్టి చంపకమాల జగణమయము. అనగా ద్రుతోత్ప్లుతగతి గలది. కాని పదఘటనావశమున జగణములు స్థగితములై భగణములు రూపుకట్టవచ్చును. అట్టిచంపకమాల ద్రుతావరోహణగతి గలది యగును. ద్రుతియందు ఉత్ప్లుతి భాసించినచో వీరాదులు, అవరోహణము భాసించినచో శృంగారాదులు చంపకమాల నిర్వహింపఁగలదని భావింపవలెను.

శృంగారహాస్యాదులందే కవిత్రయము చంపకోత్పలములను విశేషముగఁ బ్రయోగించి యుండిరని కొందఱనుట యంగీకార్యముకాదు. భారతమున శృంగారహాస్యములకు స్థానమే అత్యల్పముగ నున్నది. చంపకోత్పలముల ప్రయోగము చూడ అత్యధికముగనున్నది. ఆంధ్ర మహాభారతమునఁ గవిత్రయమురచించిన చంపకోత్పలములు మొత్తము 2388. మొత్తముపద్యములలో సుమారు ఐదవవంతుగా నున్నవి. ఇన్నిపద్యములు నిర్వహింపదగినంత హాస్యశృంగారములు భారతకథయందు లేమి యెల్లరకుఁ దెల్లమ. ప్రధానముగా భారతమునందున్నవి వీరరౌద్రములనియు నెల్ల రెఱింగిన విషయమ. ఈ రసముల నిర్వహణమునందే కవిత్రయము చంపకోత్పలములను బహుధా ప్రయోగించిరని ఆవృత్తముల సంఖ్యాబాహుళ్యమువల్ల ఊహింపవలసియున్నది. యుద్ధపర్వములందే 700 చంపకోత్పలము లున్నవి. అనఁగా భారతమందలి చంపకోత్పలములలో సుమారు మూఁడవవంతు యుద్ధపర్వములందే యున్నవి. ఇది భరతముని యాదేశము ననువర్తించు ప్రయోగపద్ధతి.

వీరరసప్రధానమైన పద్మవ్యూహవృత్తాంతమున మత్తేభశార్దూలములు అసలులేవు. చంపకములు 21, ఉత్పలములు 10 ఉన్నవి.

అభిమన్యువధ : మొత్తము 130 గద్యపద్యములు ——

| | | | |
|---|---|---|---|
| గద్యములు | - 47 | సీసము | - 9 |
| కందములు | - 28 | గీత | - 8 |
| చంపకములు | - 21 | ఆ. వె. | - 7 |
| ఉత్పలములు | - 10 | | |

గద్యములుపోఁగా మిగిలిన 83 పద్యములలో 21 చంపకములు, 28 కందములు, అత్యంత త్వరాన్వితమైన యావృత్తాంతమునందలి క్రియాపరంపరాత్వరను, అందలి నాయకప్రతినాయకుల

చిత్తస్పందత్వరను వ్యజించుటకు లఘువైన కందము లఘ్వక్షరబహుళమైన చంపకము తగియున్నవి.

నన్నయ్య గరుడోపాఖ్యానముకూడ వీరరసప్రధానము. అందును శార్దూలములు లేవు. మత్తేభమొక్కఁడే కలదు. మొత్తము గద్యపద్యములసంఖ్య 87. వీనిలో 35 గద్యములుపోఁగా

| | | | |
|---|---|---|---|
| కందములు | - 33 | సీసములు | - 3 |
| చంపకములు | - 5 | గీతము | - 1 |
| ఉత్పలములు | - 6 | ఆటవెలఁది | - 1 |
| మాలినులు | - 2 | మత్తేభము | - 1 |

గద్యములుపోగా మిగిలిన 52 పద్యములలో కందములు, చంపకోత్పలములు, మాలినులు గలసి 46 కలవు. మత్తేభమొక్కఁడే యున్నది.

## - పర్వక్రమమునఁ జంపకమాలాప్రయోగము -

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆది : | 141 - | సభా : | 42 - | అరణ్య : | 194 |
| విరాట : | 133 - | ఉద్యోగ : | 97 - | భీష్మ : | 62 |
| ద్రోణ : | 137 - | కర్ణ : | 119 - | శల్య : | 97 |
| సౌప్తిక : | 34 - | స్త్రీ : | —— - | శాంతి : | 121 |
| అనుశా : | 78 - | అశ్వ : | 66 - | ఆశ్రమ : | 16 |
| మౌసల : | 23 - | మహాప్రస్థాన : | 12 - | స్వర్గా : | 9 |

ఎఱ్ఱన్న - 135
నన్నయ - 242
తిక్కన్న - 1004

రతి, ఉత్సాహము, క్రోధము, శోకము, హర్షము, ఆవేగము, సంభ్రమము, ఔత్సుక్యము, భయము, ఉగ్రత, మున్నగుభావములు ఉత్కటావస్థయందు చిత్తద్రుతిహేతువులగును. కవిత్రయ మిట్టిభావముతోడనే చిత్తస్పందత్వరను వ్యంజింపవలసినపట్ల తరుచు చంపకమాలా వృత్తమును ప్రయోగించిరి.

"ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయత నేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చె నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖమై
భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁ ద్రిహాటతటి త్రిమార్గగా
నుకృతిఁ *ప్రభంజనప్రియతనూజున* కంతకమూర్తి కయ్యెడన్"

శిశుపాలునిపైఁ గోపముపుట్టి భీముఁడు ధరించినభయంకరమూర్తి యిందు వర్ణింపఁబడినది. లక్షణమననుసరించి పాదమునకు నాల్గుచొప్పున పదునాఱుజగణములు చంపకమాలయందు రూపుగొనవలయును. కాని వానిలో సగము భంజింపఁబడినవి. భీముని క్రోధమంతయు సాత్త్వికాభినయరూపముననే వ్యక్తమగుచున్నది. ఆంగికమైన యభినయములేదు. అంత మహా క్రోధమును నిష్క్రియమై నిర్వీర్యమైనది. అచరితార్థమై సత్త్వస్థితియందే యున్న క్రోధవేగమును నన్నయ జగణస్థగనముచేసి వేగముమాత్రమే భాసించునట్టి చంపకమాలయందు వర్ణించెను.

కీచకుఁడు రాజమార్గమున ద్రౌపదిని బరాభవించుటఁ దిలకించిన భీముని క్రోధమును దిక్కన్నకూడ చంపకముననందే వర్ణించెను.

"కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులురాల నంగముల్
గనలఁగ సాంద్రఘర్మసలిలమ్ములు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటదాస్యరంగవికట భ్రుకుటీ చటుల ప్రవృత్త న
ర్తన ఘటనా ప్రకార భయద స్ఫురణా పరిణద్ధ మూర్తియై"

విరా. II.

ఇదియు క్రోధవేగముయొక్క సాత్త్వికాభినయమే. అజ్ఞాతవాసమున భీముఁడు తన క్రోధోద్రేకమును సంయమించుకొనక తప్పదు. ఎంతసంయమించుకొన్నను అది శరీరమునం దగపడకమానదు. నన్నయతిక్కనలు వర్ణించిన భీమకోపమునకు ఆలంబనభేదకృతమైన భేదమున్నది. శిశుపాలాలంబనకమైనదానికంటె సతీపరాభవకారియైన కీచకాలంబనకము తీవ్రతరము. అయినను రాజసూయసభయం దది ప్రకటితము కావచ్చును. ప్రకటితమైన ఆకోపవేగమును నన్నయవర్ణించెను. అజ్ఞాతవాసమున ప్రకటము కారానికోపముయొక్క అని వార్యవ్యక్తిని తిక్కనవర్ణించెను.

తిక్కన్న చంపకమున జగణములు ఇంచుమించుగా నన్నియు స్థగితములైనవి. శకలితము లైన ఆ జగణముల యంగములు పూర్వోత్తరగణములకుఁ దగుల్కొని భగణ సగణములు రూపొందినవి.

"కోపవేగమునఁ గన్నుల నిప్పులురాల"
"సాంద్రఘర్మ సలిలమ్ములు గ్రమ్మ"

అనుతీరున పద్యపూర్వార్ధమున గల భగణ రూపమున నవరోహణము స్ఫుటమై యుత్ప్లుతమగు చున్న హృదయగతిని అణఁచి శాంతముచేయు భీముని యత్నమును సూచించుచున్నది. అణఁచరాని యుత్ప్లుతి 'నితాంత' 'ప్రవృత్త' 'ప్రకార' పదములందు తలయెత్తుచున్నది. అణఁచబడిన యుత్ప్లుతియంతయు ఆరోహణరూపము ధరించి పద్యము నుత్తరార్ధమందలి సగణావభాసమునకుఁ గారణమైనది.

"వికట భ్రుకుటీ చటుల ప్రవృత్త న
ర్తన ఘటనా ప్రకార భయద స్ఫురణా పరిణద్ధ మూర్తియై"

అన్నవాక్యమునందలి పదములు పెక్కు సగణరూపమున నున్నవి. అణఁచరాని కోపముయొక్క వేగము భీముని క్రమవర్ధమాన భయంకరాకారమున పర్యవసించుట పద్యమందలి క్రమవర్ధమాన వాక్యప్రమాణమునను గుర్తింపవచ్చును.

ద్వితీయచరణోపాంతమందలి 'నితాంత' పదమున నారంభమైన భీముని మూర్తివిజృంభణము పద్యాంతమున ఆకసమంత యెత్తయినది. జగణములం దుప్పొంగుచు సగణములం దారోహణముపొందిన భీముని మూర్తిపరిణాహమును తిక్కన్న యొకసీసమున వర్ణించెను. తెలుఁగుఛందములందు అత్యంతమైన యాకారపరిణాహముగలది సీసమేకదా.

'నితాంత దంత పీడన రటదాస్యరంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృత్త నర్తన ఘటనా ప్రకారము' అక్షరఘటనాప్రకారమున ప్రస్ఫుటమగుచున్నది "నితాంత దంత పీడనమున" బిందుపూర్వక దంత్యాక్షరములు మర్దళదణంధణలు మొఅయించుట – వికట భ్రుకుటీ చటుల ప్రవృత్తనర్తనమున మూర్ధన్యపరుషటకారవృత్తి శ్రుతికటువులైన పదఘట్టనములను దలపించుట యక్షరములచే వర్ణ్యవస్తుసాక్షాత్కారము చేయించు మహాశిల్పము.

భీమునిక్రోధము నర్తనశాలయందు కీచకుని వధించుటయందు పర్యవసించునన్న యుత్తర కథార్థధ్వని యర్థగతమైన రూపకముచే సాధింపఁబడుచున్నది. నృత్యలీలాయమానమైన యక్షర ఘటన యాధ్వని స్ఫుటీకరణమునకుఁ జక్కగా సహకరించుచున్నది. చటులనటనస్ఫోరకమైన యక్షరఘటనకు చంపకమాలయే తగియున్నది. దానినెన్నికచేయుటయు కవిశిల్పమే.

కాంతి, ఔదార్యము అను గుణములు, ద్రుతవృత్తి – కోపమును వ్యంజించును. చిత్త వికారము ఉత్కటమైనప్పుడు చిత్తవృత్తి వేగయుక్తమగునని తిక్కన యభిప్రాయము —

"ఘనతర కోపవేగమునఁ గన్నుల నిప్పులురాల"

ద్రోణ. I. 287

"ఘనతర శోకవేగమునఁ గన్నుల నీళులునించి"

భీష్మ. III. 156.

అన్నసందర్భముల గుర్తింపదగియున్నది. చిత్తద్రవ్యము శోకసాగరమగ్నమై కరగును, శోకానలతప్తమై దీప్తమగును. దీప్తమైన హృదయముయొక్కగతి ద్రుతము, ఉత్ప్లుతమునగును. అనఁగా త్వరితము చపలమునగును.

వ॥ దనుజఖండితుండయి పడియున్న యయ్యైరావంతు *శరీరంబు గనుంగొని యా ధనంజయుండు.*

చం॥ ఘనతర శోకవేగమునఁ గన్నుల నీళులునించి యా సుయో
ధను నవినీతియున్ బిదప ధర్మతనూజుఁడు సంధిగోరి ప
ల్కిన తగవున్ గడంగి యనికిన్ దలకొన్న నిజోద్యమంబుఁ దోఁ
చిన మదిఁ దిట్టుచున్ వినుతిసేయుచు రోయుచు నుండె నయ్యెడన్"

వ॥ ఇట్లు పుత్రశోకానలసంతప్తచిత్తుండగు సవ్యసాచిం జూచి...

తనపుత్రుఁడైన యిరావంతుఁడు అలంబసుఁడను రక్కసునిచే నిహతుఁడై పడియుండగా దిలకించిన యర్జునుని చిత్తవృత్తి యీపద్యమున వర్ణింపఁబడినది. శోకానలతాపమున సత్వరమైన చిత్తవృత్తి చంపకమాలావృత్తమునందలి యక్షరముల సత్వరవృత్తిచేతనే నిర్వహింపఁబడుచున్నది. అర్జునుని శోకమునఁ దత్కాలమున, చింత, స్మృతి, అమర్ష, హర్షము, పశ్చాత్తాపమునను భావాంతరములు సంచరించుచున్నట్లు వాక్యార్థమువల్ల గ్రహింపవచ్చును. "కన్నుల నీళులునించి" యన్న యక్షరముల ద్రుతావరోహణమున శోకము, "ఆ సుయోధను నవినీతియున్" అన్న యక్షరములందు శత్రుస్మృతికల్పితమైన యారోహణము. "పిదప అన్న నగణమున విశ్రాంతియు "ధర్మతనూజుఁడు సంధిఁగోరిపల్కి నతగవున్" అన్న యక్షరములందు అవరోహణారోహణ సమాధానరూపమైన సమాధియు."కడంగి యనికిన్ దలకొన్న నిజోద్యమంబు" అన్నయక్షరములందు ఉత్ప్లుతిసహితమైన యారోహణమును. స్ఫుటముగగుర్తింపఁదగియున్నవి. మృతపుత్రదర్శనము. శత్రుకృతావమానస్మరణము. ధర్మజుని శాంతిస్మరణము. తనయుద్యోన్మాదస్మరణము, దాని పరిణామానుభవము — ఇవియన్నియు క్రమముగా అర్జునునిచిత్తమున సంచరించుచు తచ్చిత్తవృత్తివర్ణనాత్మకమైన వృత్తమునందలి యక్షరముల నిరంతరపరిణామశీలియైన వర్తనమున గుర్తింపనగుచున్నవి.

నియతగురులఘుక్రమమైన వృత్తమునందా యక్షరముల వర్గీకరణవైచిత్రిచేత చిత్రగతులు భాసింపఁజేసి క్షణక్షణవివర్తమానమైన చిత్తవృత్తిని వ్యంజింపఁజేయవచ్చును. అక్షరఘటనాశ్రయమైన యీనైపుణ్యము శిల్పము.

"నలదమయంతు లిద్దరు మనఃప్రభవానల బాధ్యమానలై
సలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నవనందనంబులన్
నళినదళంబులన్ మృదుమృణాళములన్ ఘనసారపాంశులన్
దలిరులశయ్యలన్ సలిలధారలఁ జందనచారుచర్చలన్"

ఆర. II. 24.

ఈ పద్యమునందలి 28 గురువులలో 11 మాత్రమే దీర్ఘములు తక్కినవి వ్యంజనాంత హ్రస్వములు. కాఁగా పద్యగతి మిక్కిలి ద్రుతమైనది. క్షణవిలంబనమును సహింపని రతిత్వర

యక్షరవృత్తియందు చక్కగా నిర్వహింపఁబడినది. నలదమయంతుల మదనానలతాపమును ఏక వృత్తమున వర్ణించి నన్నయ వారి పరస్పరానురాగసాదృశ్యమును, విరహతాపసాదృశ్యమును జక్కగా వ్యంజించెను. "మనఃప్రభవానల" మన్న యక్షరసంపుటియందలి విసర్గపరకగురుత్వమున జగణము అత్యంతము ఉచ్చము, దీప్తమునై విరహానలోద్రేకమును రూపుకట్టించుచున్నది. అయినను ఈ సంతాపము మధురమైనది కనుక పద్యమందంతటను సరళానునాసికాక్షరములు, నళినదళములవలె, కర్పూరపుఁబలుకులవలె, చివురుగుత్తులవలె, శీతలజలకణములవలె వెదచల్లఁబడి సౌకుమార్యమాధుర్యములు వెలార్చుచున్నవి.

"రయవిచలత్తురంగమ తరంగములన్ మదనాగనక్రసం
చయముల సంచరచ్చటుల నైనికమత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణిభోజ కుకురాంధకవాహినియుం గలంగె ని
ర్దయతరరోషమారుత నితాంతసమీరితమై క్షణంబునన్"

సభా. II. 33.

శ్రీకృష్ణునకు అర్ఘ్యప్రదానము చేసినందులకుఁ గోపించి శిశుపాలాదులు యుద్ధసన్నద్ధులు కాఁగా యదువృష్ణిభోజకుకురాంధక సేనావాహినియు నిర్దయతరరోషమారుతసమీరితమై కలంగిన తెఱంగు నీ పద్యము వర్ణించుచున్నది. సర్వసేనాంగములయొక్క యుద్ధవీరోత్సాహము వర్ణించు నీ పద్యము వర్ణనానురూపముగ నున్నది. "తురంగమ తరంగము"లను పట్ల జగణద్వయము అశ్వప్లుతిని, "నితాంత సమీరితమై క్షణంబునన్" అనుపట్ల జగణత్రయము ఆ ప్లుతికిఁ గారణరూపమైన రోషహతాదుద్ధతిని వ్యక్తముచేయుచున్నవి. యదువీరుల విజృంభణము రోషప్రేరితము, శత్రుభయంకరణమాత్ర పర్యవసాయి. రౌద్రకర్మాంతము కాదు గనుక యీ విజృంభణమున దీప్తి యరికట్టఁబడి మాధుర్యము ఆధానము చేయఁబడినది. యకారప్రాసము, బిందుపూర్వాక్షరబాహుళ్యము, పద్యమున సౌకుమార్యమాధుర్యములను వ్యంజించుచుండ స్వల్పములయిన మహాప్రాణోష్మములు వానియందు అల్పీయమైన యోజఃకాంతులను సంక్రమింపఁజేయుచున్నవి. జగణముచేత నృత్తలీలాస్ఫూర్తిగలిగి యదుసేనావిజృంభణమున ఉత్సాహమాధుర్యమే అతిశయముగ భాసించుచున్నది.

"అతిరుచిరాగతుండయిన యాతనికిన్ హృదయప్రమోద మా
తతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలావన
ర్జితకుసుమాక్షతావళులు సేసలు పెట్టినయట్టిరై రి సం
పతదళినీనినాద మృదుభాషల దీవనలొప్పనిచ్చుచున్"

ఆది IV. 17.

ఈ పద్యమున దుష్యంతమహారాజునకు మాలినీతీరమందలి నందనచైత్రరథసదృశమైన వనము సాదరమధురముగ నెఱపిన స్వాగతి వర్ణింపఁబడినది. పదునాలుజగణములు పిహితము

లైన చంపకమున దూరదూరములం దే రెండుమూఁడో మందముగఁ బ్రకాశించుచున్నవి. వనంబున లతాలలనలు సుకుమారక్రియోన్ముఖలై సేసలువెట్టి దీవనలిచ్చుటకుఁ గావలసినంతమాత్రము యుత్ప్లుతి యాధానము చేయఁబడినది. సేసలువెట్టుట, దీవనలిచ్చుట యవరోహణమ్మృదుమధురముగ జరిగినవి. గల భగణస్వరూపమున విడివడుచున్న పదములు పృథక్పదత్వరూపమాధుర్యమును వ్యంజించుచున్నవి. 'లతాలలన' లందు 'అలినీనినాద'ములందు సౌకుమార్యమాధుర్యములు గోచరించుచునేయున్నవి. అచేతనద్రవ్య చేతనీకరణమాత్రమునకు జగణములు నిలుపఁబడినవి.

> "బహువనపాదపాబ్ధి కులపర్వత పూర్ణసరస్సరస్వతీ
> సహిత మహామహీభర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి దు
> స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
> య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ
> డయ్యెడున్"
>
> ఆది. I. 105.

పూర్వార్ధమున సంయుక్త, మహాప్రాణోష్మాక్షరముల బాహుళ్యముచే పద్యమున అత్యంతమైన భారము ప్రస్ఫుటముగ గోచరించుచున్నది. సమాసఘటితములయిన పదములు పర్వతారణ్యాది ద్రవ్యములచే నిబిడమైన మహీస్వరూపమును వ్యంజించుచున్నవి. సహింపరాని భూభారమునకుఁ దోడు దుస్సహతరమూర్తియైన విష్ణువునుగూడ ఆదిశేషుఁడు మోయవలసివచ్చినది. క్లేశసహిష్ణుతారూపమైన ఆయన యుత్సాహము తఱుచైన లగ జగణ స్వరూపములందు స్ఫుటమగుచునే యున్నది. గురుకార్యభారనిర్వహణమునందలి యుదంకుని యుత్సాహము శేషుని యుత్సాహమువంటిదే. భారవశమునఁ గ్రుంగుచున్న యజస్రసహస్రఫణాళిని శేషుఁడు ఫూత్కారసహితముగ విస్తరించి యెత్తిపట్టుకొనుచున్న యనుభవము అక్షరదర్శనమునందు శ్రోతకుఁ గలుగుచున్నది. తక్షకునివెంటఁ దగిలి పరువిడివచ్చిన యుదంకుని వాక్యమందును శ్వాసాతిశయము - వగర్పు ఊష్మసహితజగణములందు స్ఫురించుచున్నది.

"జలధిశాయికిఁబాయక శయ్యయైన" అనుపట్టున శేషుఁడు క్లేశమంతయుఁ దాను సహించి విష్ణుదేవునకు మృదువైన శయ్యయైనతెఱఁగు లఘుయకారసహిత భగణములం దనుభవగోచరమగుచున్నది. అట్టి దుష్కృతాంతకుఁడైన యనంతుఁడు మాకు ప్రసన్నుఁడు గావలెనన్న యుదంకుని ప్రార్థనమున లోకభరణమందలి శేషునియుత్సాహము ధర్మోద్ధారణమునందును బ్రవర్తించుఁగాక యన్నభావము కలదు. పూర్వార్ధమున ఓజస్సహితమైన యుత్ప్లుతి చరమపాదమున మాధుర్యసహితమైనది.

అర్థప్రసారమునంటి యక్షరములు ప్రసరించి ఛందముయొక్క రసనిర్వహణసామర్థ్యము వేనోళ్ళఁజాటఁబడుచున్నది. ఆదికవి యనల్పమైన యీ ఛందశ్శిల్పము ఆలోచనామృతము.

"అరిది తపోవిభూతి నమరారుల బాధలు పొందకుండఁగా
సురగులనెల్లఁ గాచిన మహోరగనాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్ర రత్నరుచిశోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణంబయిన వాసుకి మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్

ఆది. I. 106.

అరిది తపోవిభూతిచే సురగులనెల్లఁ గాచిన మహోరగనాయకుని లోకోత్తరతపశ్చర్యాజనితమైన యద్భుతమును వ్యంజించు జగణములుతప్ప ఈ పద్యమున ఉత్ప్లుతియంతయుఁ దిరోహితమైనది. ఆదిశేషుని క్లేశము వాసుకికి లేదు. ఈశ్వరశిరోభూషణమై ఆయన సుఖముగా నుండెను. ఉత్తరార్ధమంతయు నవరోహణబహుళమై యున్నది. వర్ణ్యులయిన అన్నదమ్ముల స్థితిభేదము వాక్యములందలి గతిభేదముచే సుష్ఠుగాఁ బ్రకటింపఁబడుచున్నది. పై పద్యమందలి మహాప్రాణాక్షరబాహుళ్య మీ పద్యమునఁ జాలవఱకు త్యజింపఁబడి యుదంకుని నిశ్శ్వాసాయాస క్రమప్రశమనము వ్యక్తమగుచున్నది.

"అవిరళసూర్యమండల సహస్రసమప్రభమై ధనంజయ
ప్రవరు కరమ్మునన్ వెలుఁగు పాశుపతాస్త్రముఁజూచి దైత్యదా
నవసుర యక్షరాక్షసగణమ్ము కరమ్ము భయమ్ముఁబొందె నం
దవనియు దిర్దిరందిరిగె నద్రిశిలోచ్చయసంచయంబుతోన్"

అర. I. 332.

ప్రథమపాదమందలి మూఁడుజగణములు ధనంజయుని చేతియందలి పాశుపతాస్త్రప్రతాప దీప్తిరూపములు. అవి యాలంబనముగ దైత్యదానవులందుఁ గలిగిన భయోద్వేగరూపములు మూఁడవపాదమందలి మూఁడుజగణములు. బాహ్యార్థవృత్తియు తత్సన్నికర్షమున జనించిన చిత్తవృత్తియు సదృశములగుట చక్కఁగా నిరూపింపఁబడినది.

"అరదము చిత్రసంచరణ మక్కజమై విలసిల్లఁ దేరులుం
గరులును ఘోటకంబులును గాల్బలముం దనచేత గూలఁగాఁ
బొరలగఁ మేదినిం దునియ ప్రోవులుగా రుధిరంపురొంపి బ్రుం
గ రణవిహారముం జలిపెఁ గౌరవనాథ యనేకభంగులన్"

శల్య. I. 245.

పద్యమందలి పదములకూర్పులందు చిత్రవిచిత్రములైన గతులు యుధిష్ఠిరుని రథచిత్ర గతులను సూచించుచున్నవి. పద్యగమనమందలి యనేకభంగులు అక్షరసన్నివేశములందలి ప్రాణస్పందముల వైచిత్రినిబట్టి యనుశీలింపఁదగును. సంయోగవర్జనమున లఘువులయిన

యక్షరములు పద్యగమనమును మిక్కిలి లఘువు, ద్రుతము గావించుచు ధర్మజుని రణవిహార లాఘవ త్వరలను బట్టి చూపుచున్నవి.

"అనిమిషసంఘమెల్లను భయంబునఁ జేష్టలుదక్కి యధ్వరం
బు నడప నేర్పులేది కురుభూవర చిత్రగతప్రకారమ
య్యెః నదరి యేసె నా క్రతువు నీశుఁడు డెందముగాడఁ బాఱిపో
యె నది మృగంబు చందము వహించి హుతాశనసంయుతంబుగన్"

సౌప్తిక. II. 123.

'అధ్వరంబు నడప' ననుచోట పాదద్వితీయాక్షరము పదాదియై చంపకసహజగతిని భంజించుచు నడపునేర్పు లేదుటను సూచించుచున్నది. 'చిత్రగతప్రకార మయ్యె'నని పాదప్రథమాక్షరమున వాక్యము విరతమై యస్థానవిచ్ఛేదమున అశ్రవ్యమైన పద్యము ఆకస్మికాధ్వరవిరామకృతమైన యాశాభంగమును సూచించుచున్నది. ఓజోరహితమై యలసమై స్తబ్ధమైన క్రతువును ఈశుఁడు డెందము గాడనేసినాఁడఁట. అనఁగా చైతన్యస్థానము ఉజ్జ్వలమై దీప్తమగునట్లు కొట్టినాఁడఁట. అది మృగంబు చందంబు వహించి హుతాశనసంయుతంబుగఁ బారిపోయెనఁట. 'మృగంబు' 'వహించి' 'హుతాశన' పదములందలి హృదయస్థానమైన ప్రాణములు దీప్తములై జగణములు రూపుదాల్చి హరిణముయొక్క గతియందలి యుత్ప్లుతిని రూపించుచున్నవి. అక్షరములందు పద్యార్థము గణ, విరామముల నాశ్రయించి రమ్యముగ వ్యంజింపఁబడినది.

"అలసవిలాసలాలసరసాన్వితలైన నితంబినీజనుల్
వలసిన భూరివిస్ఫురిత వస్తుసమగ్రములైన గ్రామముల్
వలసిన నుల్లసన్మణిసువర్ణ విభూషణగోధనావళుల్
వలసినఁ గోరు మిచ్చెద ధ్రువంబుగ నావుడు నాతఁ డిట్లనున్"

అర. VII. 359.

అలవోకగా ద్విత్రిప్రాసమును నిర్వహించి ఎఱ్ఱన యీ చంపకమును పరమరమణీయము గావించెను. బ్రాహ్మణరూపధారియై వచ్చిన యింద్రునితో దానవీరుఁడైన కర్ణుఁడనిన వాక్యమిది. ఎఱ్ఱన్న ఈ పద్యము నిట్లలంకరించి బహుప్రయోజనములు సాధించెను. ఏది వలసినను ఇత్తునన్న వాక్యమున నవాంతరఖండములన్నియు సదృశావసానములగుట, అవియు పాదాంతముల వచ్చినిలుచుట, లఘుసుకుమారవర్ణమయము లగుట — ఈ సర్వము కర్ణుని దానవీరస్థాయి మాధుర్యవ్యంజకములు. శ్రోతృచిత్తమును వాక్యమాధుర్యముచే హరించి, ప్రతిశ్రుతవస్తు సంవరణమునఁ బ్రరోచనకరణ మీ వాక్యవిన్యాసతాత్పర్యము. మూఁడుపాదములందును ప్రతిపాదింపఁబడిన వస్తువులయొక్క గుణభేదము. అక్షరగుణభేదముచే సమర్థింపఁబడుచున్నది. దానోత్సాహము ప్రతిపాదమునను జగణములందు భాసించి చతుర్థపాదమున "ధ్రువంబుగ" పదమున

దృఢమగుచున్నది. 'వలసిన' యన్నపదము పునఃపునరావృత్తమై కర్ణుని యర్థివాంఛాపూరణ దీక్షను బలపఱచుచున్నది. ఇంత యలంకృతమై ప్రలోభపెట్టుచున్న యీ వాక్యమునకు ఇంద్రుడు లొంగకుండుట ఆయన కుండలాహరణదీక్షకుఁ బోషకమగుచున్నది.

"నరసురసిద్ధకింపురుష నాగనభశ్చరముఖ్యులెల్ల నీ
కరుణయ వేచి మంద్రు; త్రిజగంబులు నీ కులిశాభిరక్షణ
స్ఫురణనచేసి సుస్థిరతఁ బొందుఁ బురందర! సర్వలోకసుం
దర! శరణంబు నాకగుము దానవసూదన! పాకశాసనా!"

ఆది. II. 47.

సూర్యతాపతప్తులై గరుడుని వీఁపునుండి యవనిపైఁ దొఱఁగి మూర్ఛితులైయున్న కొడుకులంజూచి "కద్రువ కడునలిగి గరుడునింబదరి యతిభక్తి నింద్రు నారాధించుచుఁ" బలికిన వాక్యమిది. పుత్రులపట్ల శోకముచే, గరుడునిపట్ల కోపముచే, నింద్రుని పట్లభక్తిచేఁ దత్కాలమునఁ గద్రువహృదయగతి యతిత్వరాన్వితమై యుండుట సహజము. పద్యమం దాత్వర ప్రస్ఫుటమగుచున్నది. రేఫానుప్రాసము దీప్తిసహితమైన క్షిప్రగతిని, బిందుపూర్వకదకారములు భక్తిమాధుర్యమును, బద్యగతియందు యథావసరము సంక్రమింపఁ జేయుచున్నవి.

## ఉత్పలమాల

ఇది కృతిచ్ఛందమునఁ బుట్టినది పాదమునకు 20 అక్షరములు. గణములు : భ ర న భ భ ర ల గ. 9 అక్షరములమీఁద యతి.

పలువురు సంస్కృతలాక్షణికు లీవృత్తమునకు లక్షణముచెప్పిరి. అయినను సంస్కృతమున దీనికిఁ బ్రయోగము మిక్కిలివిరళము. తెలుఁగున చంపకమాలవలె నిదియు విస్తారముగ నుపయోగింపఁబడియున్నది.

ఇరువదియక్షరములలో నెనిమిదిగురువులు పండ్రెండు లఘువులుగల యుత్పలమాల పాదము మధ్యగతి గలదని చెప్పవచ్చును. లక్షణమునుబట్టి భగణబహుళముగనుక అవరోహణముగలది. అనఁగా ప్రసాదమాధుర్యవ్యంజకమైన గమనముగలది.

భగణమును స్థగితముగావించి యుత్పలమున జగణమును భాసింపఁజేసినచో ఉత్ప్లుతి యుత్పన్నమై వీరరౌద్రరసముల నిర్వహణముకూడ సాధ్యమగును.

ఉత్పలమాలయను నామము ఈ వృత్తము సుకుమారార్థములయందే వినియోగింపఁదగిన దన్న భావము గలిగించుచున్నది. భారతమునందలి యుత్పలమాలావృత్తములు ప్రాయికముగ శృంగారాదిరసములందే వినియుక్తములయియున్నవను నభిప్రాయమునకు ఇదియే కారణముగాఁ దోఁచుచున్నది. ఇది పరిశీలనక్షమమైన యభిప్రాయము కాదనవలసియున్నది. కవిత్రయము ఉత్పలమాలను నానారసములందు ప్రయోగించియున్నారు. భిన్నరసములందు ప్రయుక్తములయిన యుత్పలములందు పదవ్యవస్థావశమున భిన్నగతులను వారు భాసింపఁజేసిరని పరిశీలించి గుర్తింపవచ్చును. శాస్త్రవిహితమైన యక్షరపరంపరాక్రమము ననువర్తించుచు కవులు ఆ యక్షరసమూహనము భిన్నవిధముల గావించి యొకేవృత్తమున భిన్నగతులు భాసింపఁజేసి భిన్నరసముల నిర్వహణమునఁ దగినసామర్థ్యమును ఆధానముచేయుట ఇతరవృత్తములందువలె ఉత్పలమునందును గుర్తింపఁదగియున్నది,

"రాజ । కులైక । భూషణుఁడు । రాజ । మనోహరు । డన్య । రాజ । తే
జోజయశాలిశౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందు చంద్రికా
రాజితసర్వలోకుఁ డపరాజితభూరిభుజాకృపాణధా
రాజలశాంత శాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్"

ఈ పద్యమందలి పదవ్యవస్థ లాక్షణికోక్తమైన గణవ్యవస్థతో వివదించుచు తదుపదిష్టగణవ్యవస్థాఫలమైన గతివిశేషమును రూపింపఁజాలకున్నది.

"పాములు । తేళ్లనుం । బసులు । పందులు । గుక్కలు । మీలు।గోళ్లనున్
జీమలు । కాకులుం । గ్రిములు।జింకలు । నక్కలు।గొంక । నక్కలున్"
అశ్వ. II. 117.

ఈ పద్యమునందలి పదవ్యవస్థ లాక్షణికుని గణవ్యవస్థ ననువర్తించుచు తాదృశానువర్తన లభ్యమైన గతిని సాధింపఁగలుగుచున్నది. అయినను ఉత్పలమున అవరోహణాత్మకమైన మధ్యగతిని ఈ రెండును సాధించుట లేదనియే చెప్పవలెను.

"ఏనును । బాండు । నందనులు । నిమ్మని।ముఖ్యులు । నిష్ఠ । లోక । సం"

ఈ పాదమున పదస్వరూపమైన యక్షరసమూహనమున సాదృశ్యము విశేషముగ నున్నది. అట్టి సాదృశ్యము గతియందు సామ్యమును రూపించుచు శ్రుతిసుఖావహమగుచున్నది. సుకుమారమైన యవరోహణము స్పష్టగా భాసించు నిట్టి యక్షరములకూర్పు గల యుత్పలము శృంగారాది మధురరసములందు యోగ్యమైయుండును. జగణ సగణములు భాసించు ఉత్పలగతియందు కాంత్యౌదార్యగుణములు వ్యక్తములై యట్టికూర్పు ఉత్సాహ హర్షక్రోధావేగాదులగు దీప్తభావములందు యోగ్యమైయుండును. నానారసవ్యంజకములగునట్లు ఉత్పలములను నిర్మించుటయందు కవిత్రయమీ శిల్పమార్గమునే యనుసరించిరి.

## పర్వక్రమమున ఉత్పలమాలాప్రయోగము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆది : | 104 | సభా : | 42 | ఆరణ్య : | 165 |
| విరాట : | 150 | ఉద్యోగ : | 114 | భీష్మ : | 54 |
| ద్రోణ : | 82 | కర్ణ : | 69 | శల్య : | 43 |
| సౌప్తిక : | 22 | స్త్రీ : | — | శాంతి : | 59 |
| అను : | 39 | అశ్వ : | 29 | ఆశ్రమ : | 10 |
| మౌసల : | 12 | మహాప్ర : | 6 | స్వర్గా : | 5 |

నన్నయ్య — 185. — తిక్కన్న — 696.
ఎఱ్ఱయ — 126. — మొత్తము 1007.

కవిత్రయము ఉత్సాహ క్రోధ హర్ష గర్వ మదోగ్రతాది భావములను వర్ణించుపట్ల ఉత్పలమున జగణ సగణ స్వరూపములను భాసింపఁజేయుట యీ క్రిందిసందర్భములందు గుర్తింపవచ్చును.

"ఆ నహుషాత్మజుండగు యయాతి యధిజ్యా ధనుస్సహాయుఁడై
యానత శాత్రవుండు మృగయారసలోలనిబద్ధ బుద్ధి న
క్కాననమెల్లఁ గ్రుమ్మఱి నికామ పథిశ్రముఁ దేగుదెంచె నం
దానలినాక్షియున్న విపినాంతరకూప తటంబునొద్దకున్"

ఆది. III. 189.

మృగయారసలోలుఁడైన యయాతియొక్క యుత్సాహము ప్రథమపాదమందలి జగణత్రయమునందు సువ్యక్తమగుచున్నది. కాననమెల్లఁ గ్రుమ్మఱి నికామపథిశ్రమచే అలసిన యయాతియొక్క గ్లాని చతుర్థపాదమునందలి జగణాభావమున గుర్తింపఁదగును. 'తటంబు' నందలి జగణము జలస్థానదర్శనజన్యమైన హర్షలక్షణము.

"దాని శరీర సౌరభము దాని విలోల విలోకనంబులున్
దాని మనోహరాకృతియు దాని శుచిస్మిత వక్త్రకాంతియున్
దాని విలాసముం గడు ముదంబునఁ జూచి మనోజబాణసం
తాన హతాత్ముఁడై నృపతి దానికి నిట్లనియెన్ ప్రియంబునన్"

సత్యవతీసౌందర్యదర్శనమున శంతనుని చిత్తమున నుత్పన్నమైన రత్యుత్సాహము ఈ వృత్తమందలి జగణములచే సువ్యక్తమగుచున్నది. సత్యవతీ సౌందర్యలక్షణము లొక్కొక్కటి కంటఁబడుచుండ దానితోపాటు మదనబాణములు నొక్కొక్కటి శంతనుహృదయమున నాఁటుచుండెను. ఆ బాణపాతమువల్ల అతని చిత్తవృత్తియందుఁ గలిగిన యుత్ప్లుతి జగణము. ఉద్బుద్ధరతియందు సంచరించు హర్షావేగములు ఈ యుత్ప్లుతిచేఁ జక్కగా నిర్వహింపఁబడినవి. మొదటి మూఁడుచరణములందలి ఐదుఖండములు 'దాని' యను పదముతో ఆరబ్ధములగుట, వానియందు సదృశస్థానముల జగణము రూపితమగుట – సత్యవతీసౌందర్యలక్షణముల తౌల్యమును, వానివల్ల శంతనుచిత్తమునఁ గల్గిన వృత్తితౌల్యమును వ్యక్తముచేయుచున్నవి. సత్యవతిసౌందర్యలక్షణము లైదు వరుసగా శంతనుని కన్నులఁబడుచుండ మన్మథునిబాణములైదు వరుసగా ఆయన హృదయమునఁబడెను. పద్యమున విచ్ఛేదవిరామములు, పాదఖండద్వయ ప్రారంభాక్షరములు, సమానములై పద్యమున సమతాగుణమును ప్రతిష్ఠించుచున్నవి. ఇట్టి సమతాగుణము పద్యప్రయోగమును సుఖవంతముచేయును.

ఉత్పలమున ప్రతిఖండము 'భ'గణముతో నారంభించునని లక్షణము చెప్పుచున్నది. నన్నయ ఆ భగణములను 'గల'ములుగా గత్తిరించి శేషించిన లఘువును అనంతర 'ర'గణముతో నతికించి దానిని 'జ'గణముగా రూపించెను. అవరోహణముచే సుకుమారము కావలసిన పాదగమనమున ఉత్ప్లుతిచే చాపల్యమును, ఈషత్పారుష్యమును గల్పించెను. రూపింపఁబడిన జగణములందలి గురువులు మృదువ్యంజనసహిత దీర్ఘస్వరకల్పితములో, అనుస్వారాంతత్వకల్పితములో యగుటచే వానిచే వ్యంజింపఁబడిన శంతనుని హృదయోత్ప్లుతి సుకుమారమధుర వికాసరూపమని సూచింపఁబడుచున్నది.

క్రోధోత్ప్లుతియందలి జగణనిర్మాణముకూడ పరిశీలింపఁదగియున్నది.

"ధారుణిరాజ్యసంపద మదంబునఁ గోమలి కృష్ణఁ జూచి రం
భోరు నిజోరు దేశమున నుండఁగ బిల్చిన యద్దురాత్ము దు
ర్వార మదీయ బాహుపరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్–"

ద్రౌపదిని దనతొడపైఁ గూర్చుండరమ్మని సంజ్ఞచేసిన దుర్యోధనుని బావిరణమునఁ దొడలువిఱుగఁగొట్టి చంపుదునని భీముఁడు సర్వజనభయానక క్రోధవివశుండై పలికిన ప్రతిజ్ఞావాక్యమిది. ప్రతిజ్ఞాకరణమాత్ర పర్యవసాయియైన భీముని క్రోధము తత్కాలమునం దకృతార్థమగుటచే సభాజనులందు భయము నుద్బోధించుటకు హేతుత్వమును ప్రాపించి విశ్రమించుచున్నది. సభాజనులభయము పుష్టినందక అల్పాయువై నది. ఇట్లు ఈషత్పుష్టమైన క్రోధము అపుష్టమైన భయమున కంగమై యుభయమును రసస్థితిని జేరజాలక యణఁగిపోయినవి. నిష్క్రియమైన

క్రోధము పద్యమందలి గుర్వక్షరాల్పత్వముచేత పుష్టినంద(జాలకున్నది. అన(గా జగణావభాసన కృతమైన యుత్ప్లుతి పరుషగుర్వక్షరలభ్యమైన యోజస్సును ప్రాపించుటలేదు.

"ఘోరపరాక్రముల్ ప్రబలకోపపరుల్ పృథుసారభూరి భూ
మీరుహపాణు లుద్ధతు లమిత్రవిఘాతులు వీరబృంద బృం
దారకు లార్చుచొండొరుల( దాకిరి దారుణభంగి( బొంగి కి
మ్మీరసమీరసూనులు సమీరవిధూతపయోధులట్లయై"

అర. I. 117.

"ఘోరపరాక్రములు" "ప్రబలకోపులు" రౌద్రవిభావములు. దారుణభంగియైన వారిపొంగు. రౌద్రవిజృంభణము. పొంగు అన(గా విప్లుతి. రౌద్రవిప్లుతి జగణోత్ప్లుతియందు రూపింప(బడినది.

"భూరి బలుండు పాండవు( డపూర్వతపంబొనరించుటం దదీ
యోరుతపఃప్రభావ దహనోత్థితధూమ చయంబు లంబు దా
కారములై వనాంతరముగప్పె జగత్త్రయనాథ! తత్తపో
భారము సర్వజీవుల కపార భయావహ మద్భుతంబునన్"

అర. I. 298.

భయము రౌద్రోద్భూతము, అద్భుతము, వీరోద్భుతము అద్భూతము అపాయశంకాన్విత మైనచో భయమగును. అర్జునుని యుగ్రతపస్సువలన( బుట్టిన దహనధూమములు సర్వజీవులకు( దొలుత భయమును, పిదప ఆశ్చర్యమును గలిగించెను తొలుత(గలిగిన భయము అపాయ శంకామాత్రము, పిదప అర్జునుని తపోవీరకృత్య మాలంబనముగ నెలకొన్నభావ మద్భుతము. ఆ యద్భుతహేతువు "అపూర్వతపంబు" అని చెప్ప(బడినది. భయసమ్మిశ్రితమైన యద్భుత మిచ్చట రజోవిజృంభణాత్మకమైన జగణములందు ప్రదర్శింపబడినది.

"దంతిఘటల్ మహోగ్రసముదగ్రతతో నడతేర దర్పదు
ర్దాంతగజాధిరోహణ నితాంతసముజ్జ్వలభంగి( గ్రౌథవి
క్రాంతివిలాసమొప్ప(గ నఖండితపౌరుషు(డైన భీము(డ
త్యంతసముద్ధతిం గవిసె నస్మదనీకము సంచలింప(గన్"

కర్ణ. I. 75.

కులూతదేశాధీశుండైన క్షేమధూర్తిని సంహరింప(బోవు భీమసేనుని వీరమూర్తి యీ పద్యమున వర్ణింప(బడినది. ఆలంబనవిభావమాత్ర వర్ణనముచేయు నీ పద్యము స్వీయగమన మందలి పునఃపునరుత్ప్లుతిచేత వర్ణ్యవస్తు చిత్తస్పందమును ప్రస్ఫుటముగ వ్యంజించుచువాక్యార్థ మును ఊర్జితముచేయుచున్నది.

శౌర్య స్వరూపమైన వాగ్వ్యాపారమునందును ఇట్టి జగణావభాసనము గుర్తింపవచ్చును

"గోత్రమహా మహీధర నికుంజములన్ విపినంబులన్ గురు
క్షేత్రమునం బ్రకామ గతిఖేలనవొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించు బలదర్ప పరాక్రమదక్షుఁ డీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్"

శ్లోకమునం దుత్పలమున భగణము స్వస్వరూపమున నిల్చి యా వృత్తమునకు నిసర్గమైన యవరోహణమును భాసింపఁజేయును. శోకవిభావ నానాత్వమునుగుఱించి భరతవచనము :

"అథ కరుణోనామ శోకస్థాయిభావప్రభవః । స చ శాప క్లేశ వినిపతితేష్టజనవిప్రయోగ విభవనాశ వధ బంధ విద్రవోపఘాత వ్యసనసంయోగాదిభి ర్విభావైః సముపజాయతే."

N. S VI. P. 317.

నానారూపములైన విభావములు కారణములుగా నుత్పన్నమైన శోకము నానావిధములుగా నుండును. పుత్రాదుల మరణమువల్ల జన్మించిన శోకమునకు, పుత్రాదులవధవల్ల జన్మించిన శోకమునకు భేదమున్నది. మరణజనితశోకము కేవలము ఆర్ద్రవృత్తియైయుండును. వధజనిత శోకమున వధకర్తపట్లఁగల క్రోధము కలిసియుండుటచే ద్రుతియందు దీప్తియు సంక్రమించియుండును. పుత్రశోకము వీరపురుషాశ్రయమైనది దీప్తము, వనితాశ్రయమైనది కేవలము ఆర్ద్రమునై యుండును.

అభిమన్యునిమృతికి శోకించు సుభద్రార్జునుల విలాపవాక్యములం దిట్టిభేదము గుర్తింప వచ్చును. అర్జునశోకమునకు విభావము అభిమన్యువధ. సుభద్రశోకమునకు విభావము అభిమన్యు మరణము.

"హాయను ధర్మరాజతనయా యను నన్నెడఁబాయ నీకుఁ జ
న్నే యనుఁ దల్లి నేపఁజనునే యనుఁ గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను నొంటిపోక దగవే యను నేగతిఁ బోవువాఁడ నే
నో యభిమన్యుఁడా యనుఁ బ్రియోక్తుల నుత్తరఁ దేల్పవే యనున్"

ద్రోణ. II 242.

యతిచ్ఛేదస్థానమున 'తనయా' 'చనునే' 'తగవే' అను పదములందు సగణము రూపు కట్టి యర్జునశోకమునఁ గొంతదీప్తి గోచరించుచున్నది. సుభద్రావిలాపవాక్యమున భగణము లన్నియు స్వస్థానములందు రూపుకట్టి పద్యమును సర్వథా అవరోహమయము చేయుచున్నవి.

"అక్కట పుత్ర నిన్ను గనినంతియ పుణ్యము కాని నాకు నీ
వెక్కడు భక్తి సేసి నను నెప్పుడు నారయ నీ కుమారకుల్

మక్కువ నాకడం దిరుగ లాలన సేయుచు నుండునట్టి యా
మిక్కిలి నోము లేద యిటమీఁదికి నెవ్వరు దిక్కు చెప్పుమా?
ద్రోణ. II. 332.

ఉత్పలమాలయందు శాస్త్ర మెన్నిభగణములను విధించినదో అన్నియు స్వస్థానములందు రూపము ధరించియున్నవి. పృథగ్గణస్వరూప విరామబాహుళ్యలక్షణమున సోలుచు సొక్కుచు సుభద్ర వాక్యఖండముల నుచ్చరించుట వ్యక్తమగుచున్నది.

అద్భుతహర్షలక్షణముగా జగణావభాసనమునకు బృహన్నల యర్జునుండనియెఱింగి యుత్తరుఁడు అద్భుతహర్షము లుప్పొంగఁ బలికిన వాక్యమును పరిశీలింపవచ్చును.

"బాహు సమగ్ర శత్రుమదభంజనశౌర్య సమస్త లోకచే
తోహరమూర్తి నీవిటులు దోఁచుట నాకు ప్రసన్న విస్ఫురత్
దేహముతోడ భాగ్యమయదేవత సన్నిధిసేతగాదె? స
మ్మోహమువాసెఁ జిత్తము ప్రమోద రసత్వముఁబొంది పొంగెడున్
విరా. IV. 150.

కురుక్షేత్రమున శ్రీకృష్ణునివిశ్వరూపము దర్శించి యద్భుతహర్షావిష్టుఁడైన యర్జునుఁడు పలికిన వాక్యము.

"మోహతమంబు వాసెఁ దుదిముట్టిన నీదు ప్రపత్తి వీతసం
దేహుఁడనైతి గాఢపరిదీప్త మహాకృతి గాంచి బోధస
న్నాహ నిరామయ స్థిర మనస్థ్సితిఁ బొందితి సర్వలోకని
ర్వాహ వినోద నీవిమలవాక్యముచొప్పున నెల్లఁజేసెదన్"
భీష్మ. I. 228.

సన్నివేశసంవాదమున వృత్తసంవాదము – ఆ వృత్తమున అవిద్యమానములైన జగణముల యతిశయావభాసనము, ప్రాసమున హకారనివేశనము చక్కనిశిల్పము.

వాలిసుగ్రీవులు బాహుయుద్ధకౌతుకమతులై యుండొరుండాకిపోరినతెఱంగు ఎఱ్ఱన యుత్పలమాలావృత్తమందలి పదవర్తనమున స్ఫుటముగ దర్శింపవచ్చును.

"ఒండొరుఁ బట్టుచుం దిగుచు చొండొరుఁ బాయు చు ద్రేయుచున్ మహో
ద్దండత నొండొరుం దొలఁగఁ దాకుచు నీగుచు లోగుచున్ జలం
బొండొరు మీరు చొండొరుల యుద్ధతి సైపక పీఁకఁబోరి రా
ఖండలభానుసూను లవిఖండిత చండభుజాప్రకాండతన్"
అరణ్య. VI 333.

పద్యపూర్వార్ధమున లాక్షణికోక్తగణములు పదములయందు స్పష్టముగ రూపుకట్టియున్నవి. మల్లయుద్ధారంభమున వీరు లొకరినొకరు కదియుచు పాయుచు శాస్త్రచోదితవిధానమున బరస్పర మాక్రమింపయత్నింతురు క్రమముగ నుద్ధతులై పరస్పరాక్రమణప్రవణులై శాస్త్రనియమములు భంజించి విద్యాప్రదర్శనముకొఱకు కాక స్వీయబలప్రదర్శనమునకై పెనంగుదురు. పద్యము నుత్తరార్ధమున గణము లొకదానితోనొకటి పెనవైచుకొనిపోయి వాలిసుగ్రీవుల ఎడతెగనిపెనకు వను సూచించుచున్నవి.

నానావిధములయిన యర్థములను సమర్పించుటకుఁదగిన సామర్థ్యవిశేషమును స్వీయశిల్పముచేఁ గల్పించి యుత్పలముచేతనే భారతకవులు నానారసార్థములను నిర్వహింపఁజేసిరి.

"పంబిన శోకభారమునఁ బ్రాణవిమోక్షముగోరి కంఠదే
శంబున రాయిగట్టుకొని సన్మునినాథుఁడు నిశ్చితాత్ముఁడై
యంబుధిఁ జొచ్చినం గడు భయంపడి వార్ధి లసత్తరంగహ
స్తంబుల నెత్తి పెట్టెఁ దన సైకతతీరముఁజేర నమ్మునిన్"

ఆది. VII. 120.

వసిష్ఠుఁడు సముద్రముఁ జొచ్చువఱకుఁ బద్యమునఁ బదములు అవరోహణముచేయుచున్నవి. 'భయంపడి' యను పదమున సాగరుని భీతియు 'వార్ధి' యను పదమున సాగరుని భయస్తంభపిండితాంగతయు గోచరించుచున్నవి. "లసత్ తరంగ హస్తమ్ముల"నన్న పదములందలి యారోహణము "ఎత్తి పెట్టె"ననుచోట అవరోహణము సాగరుఁడు వసిష్ఠునిఁ జేతులతో నెత్తి తీరమునఁ బెట్టినతీరు స్ఫుటముగ నభినీతమగుచున్నది. వాక్యము నాశ్రయించిన రూపకము వాచకముచేఁ జక్కగా నభినీతమగుచున్నది.

"పైఁబ్రివడిపోయెఁగాక ధృతరాష్ట్రుఁడు గన్నదియేమి? యా సభం
దావలదన్నఁ గీడుడుగదా! పతి లేఁడనఁబడ్డ కాంత నేఁ
డీవు కనుంగొనంగఁ బతియేడ్తెఱ నొప్పెఁ; బతుల్ విజృంభిత
శ్రీ విలసిల్లు కామినులు చేడ్పడి రిట్లపతిత్వదీనతన్"

కర్ణ. III. 224.

తనచేఁ జచ్చిపడియున్న దుశ్శాసనుని జూచి "కనలడఁగక" భీమసేనుఁడు పలికినపలుకులివి. 'పైఁబ్రివడి' "ధృతరాష్ట్రుఁడు" అను పలుకులందలి రేఫసంయోగము భీముని దంతపీడనపూర్వకమైన యుచ్చారణమును సూచించుచున్నవి. "పతుల్ విజృంభిత శ్రీ" యనుపట్ల కౌరవుల యైశ్వర్యమదోద్రేకము అతిచమత్కారముగ భాసించుచున్నది. తత్స్మరణమున భీమసేనుని చిత్తమునఁ గలిగినదీప్తి యలక్ష్యక్రమమున సుష్ఠుగా వ్యక్తమగుచున్నది. పద్యమందలి పైఁబ్రి, ఆ సభన్, తా వలదన్న, ఉడుగదా, - అను పదములందలి దీర్ఘములు అభినయవశమున ప్లుతకల్పములై భీముఁడా యక్షరములను సాచి పల్కినజాడ గోచరించుచున్నది. క్రోధము కృతా

ర్ధమై యుపరతమగుచున్నదశ పద్యమందలి అవధారణ, ప్రశ్న, సందేహ, కాకువులందలి ప్లుతములచేత, తదనంతర విలంబితవిరామములచేత వ్యంజింపఁబడుచున్నది.

"ఎవ్వరిదాన వంబుజదళేక్షణ! యేకత మిట్టులేల నీ
వివ్వనభూమియందు జరియించెదుఁ నావుడుఁ దంద్రిపంపునం
దివ్వనభూమియందు జరియించెదఁ సద్వరుఁగోరి కన్య నే
నెవ్వరిదానఁ గావలయు నేర్పడఁ జెప్పుము రాజనందనా!

అర. IV. 324.

ఉక్తిప్రత్యుక్తిరూపమైన యీ పద్యమున ఉక్తిప్రత్యుక్తులు, ధ్వనిప్రతిధ్వనులవలె నిల్చి నాయికానాయకుల చిత్తములు సదృశవృత్తులగుటను రూపించుచున్నవి. నాయకుని వాక్యఖండములను యథాతథముగ నావృత్తములుగావించి నాయిక నాయకచిత్తముతోడి స్వచిత్తసమ్యక్సంవాదమును చమత్కారముగ వ్యక్తముచేయుచున్నది. నాయకవచనమునకుఁ దనప్రతివచనమును ప్రతిబింబసదృశముగ నిబంధించి నాయిక తన "ప్రగల్భతను" సుకుమారముగఁ జాటుకొన్నది. "దాని ప్రగల్భవచనంబులకు నధికవిలోలుండై "నాఁడట నాయకుఁడు.

"సారథి యెవ్వఁ డాతనికి? శల్యుఁడు ద్రోణతనూభవుండు గాం
ధారవిభుండునుం గృపుడు"

కర్ణ. I. 44.

తిక్కన యిచ్చట చక్కనిప్రహేళికను బ్రదర్శించెను, "సారథి యెవ్వఁడాతనికి" ? అను ప్రశ్నమువెంట "శల్యుఁడు" అను పదమునుంచి ధృతరాష్ట్రుని ప్రశ్నమునకు సమాధానము నాతనివాక్యమందే చమత్కారముగ నిక్షేపించెను.

"కొందఱు సూతు నశ్వముల గొందఱు కొందఱు చాపదండముం
గొందఱు చక్రయుగ్మకము గొందఱు విస్ఫురితాతపత్రముం
గొందఱు కూబరంబు మఱికొందఱు కేతువు గొంద ఱక్షముం
దందడిఁ దున్మివైచి విరథత్వమొనర్చిరి సూతసూతికిన్"

అర. V. 400.

అయత్నసిద్ధములయిన ద్విప్రాసము, నను ప్రాసము పద్యమును అలంకరించి గంధర్వుల ఏకార్థప్రవణతను ఊర్జితము చేయుచున్నవి.

## సూచికలు :

1. నాట్యశాస్త్రము : vi — 70
2. Ibid : vi — పుట 327
3. రసగంగాధరము : ప్రథమాననము
4. తైత్తిరీయప్రాతిశాఖ్యము : ii : 4—5
5. భారతము ; ఉద్యోగ. v — 399
6. దశరూపకము : 4 — 14.

# కందము

కందము జాతి యనఁబడు మాత్రాచ్ఛందోవిభాగమునకుఁ జెందినది. చతుర్మాత్రాగణనిర్మిత మైన యార్యాకుటుంబమునందలి యార్యాగీతియే ఆంధ్రమునఁ గందమైనది.

పింగళచ్ఛందశ్శాస్త్ర చతుర్థాధ్యాయమందలి—

లస్సముద్రాః గణాః; గౌగంతమధ్యాదిః స్లశ్చ; స్వరా అర్ధంచార్యార్ధం;
అత్రాయుక్ నజ్; షష్ఠో జ్; న్లౌ వా, అర్ధే వసుగణ ఆర్యాగీతిః

అను 12, 13, 14, 15, 16, 17, 31 సూత్రములచేత ఆర్యాగీతిస్వరూపము సిద్ధించును.

ఆర్యకుఁ బ్రాకృతమున గాథ యనిపేరు.

"సత్తగణా, దీహంతా,
జో ణలహూ ఛట్ఠ, ణేహ జో విసమే
తహ గాహే బిఅ అద్ధే
ఛట్ఠం లహుఅం విఆణేహు"

ప్రా. పైం. 1-56.

ఇది గాథాలక్షణము. ఆర్యాలక్షణము నిదియే. "స్వరా అర్ధం చ" అను పింగళసూత్రమునందలి 'అర్ధం చ' అనుమాటకు 'దీర్ఘము' అని ప్రాకృతపైంగళమునఁ జెప్పఁబడినది. గాథార్ధములు దీర్ఘాంతములుగా నుండవలెను. ఆర్యార్ధములు దీర్ఘాంతములై యుండవలెనన్న నియమము పింగళుని సూత్రములందు స్పష్టముగాలేదు.

ఆర్యాపూర్వోత్తరార్ధములు పూర్వార్ధలక్షణములే యైనచో ఆర్యాగీతి యేర్పడును. అట్లే గాథయు పూర్వోత్తరదళములు పూర్వదళలక్షణములే యైనచో స్కంధక యేర్పడును.

"చఉ మత్తా, అట్ఠ గణా
పువ్వద్ధే ఉత్తరాద్ధ హోఇ సమరూఅ
సా ఖందఅ విహాణహు
పింగళపభణేఇ ముద్ధి బహుసంభేఅ"

ప్రా. పైం. 1-73

ఇది స్కంధకాలక్షణము. పాదాంతగురుత్వము, విషమస్థానజగణనిషేధము, షష్ఠస్థాననియత నల జగణాన్యతరత్వము నిందుఁ జెప్పఁబడకున్నను గాథాలక్షణమునుండి వాని నాకర్షించికొన వలయును. ఇట్టి లక్షణములుగల ప్రాకృతస్కంధకమే ఆంధ్రమునఁ గందము అను పేర వ్యవహరింపఁబడినది.

ఆర్యలకు, గాథలకు లక్షణము 'అర్ధము'నకుఁ జెప్పఁబడినది. అవాంతరపాదవ్యవస్థా నియమము చేయఁబడలేదు. ఆర్యాభేదమైన పథ్యార్యకే అవాంతరపాదవ్యవస్థ నియమింపఁబడి నది. తక్కిన యార్యాభేదములకు లేదు.

"త్రిషు గణేషు పాదః పథ్యా ద్యేచ" 4-22.

ఉభయార్ధములందును మూఁడుగణములకుఁ బాద మేర్పడినచో ఆర్య పథ్యార్యయగును. "పాద గ్రహణం యత్యుపలక్షణార్థం" అని హలాయుధుఁడు 'పాద' శబ్దమును వ్యాఖ్యానించెను. అనఁగా మూఁడుగణములకుఁ బదము విఱిగినచో ఆర్య పథ్యయగునని భావము. ఇట్లు పదచ్ఛే దమువలన పాదమురూపొందుట యుభయార్ధములందు సంభవించినప్పుడే పథ్య యేర్పడును. ఏ యర్ధమున నీస్థితి లేకున్నను పథ్యాత్వము భంగపడును. పథ్య కాని ఆర్య విపుల. విపులాత్వము పూర్వార్ధమందున్నది ఆదివిపుల; ఉత్తరార్ధమందున్నది అంత్యవిపుల; ఉభయార్ధములందు నున్నది ఉభయవిపుల.

విపులయైన యార్య యపథ్యయని పింగళుఁడు నిశ్చయించుట మిగుల సరసముగనున్నది. మూఁడేసిగణముల యనంతరము పదచ్ఛేదవశమున విశ్రమించుట కవకాశమిచ్చు ఆర్యవాగింద్రి యమునకు, శ్రోత్రేంద్రియమునకుఁ బథ్యగా నుండును. అట్టిలక్షణము లేని యార్య విపులయై పరశ్రవణములందు అపథ్యగానుండును, 'త్రిషు గణేషు' అనఁగా 'మూఁడేసి' గణములకు అని భావించినచో ఆర్యా, గాథలయందలి యర్ధభాగముల గణవిభాగము 3 + 3 + 2 అనుతీరున నేర్పడును. ఆంధ్రలాక్షణికు లిట్టియర్థమునే గ్రహించినట్లు తోఁచును.

సంస్కృతమున ఆర్యలకుఁగాని, ప్రాకృతమున గాథలకుఁగాని యతినియమ మున్నట్లు కనఁబడదు.

జనాశ్రయుఁడు ఉభయార్ధములందును మూఁడుగణములపై యతియుండినచో ఆర్య పథ్యార్యయగునని చెప్పెను. ("పథ్యోభయో స్త్రిః 5-28"). "త్రిషు గణేషు పాదః" అను పింగళసూత్రమున కిది యనువాదమాత్రమే. జనాశ్రయుని సూత్రము నందలి యతి పాద నిరూపకమేకాని పాదమధ్యపదచ్ఛేదరూపము కాదు. సంస్కృతమునఁ బ్రాసనియమ మేపద్యము నకును లేదు. ఐనను జయకీర్తి యొక్కఁడు స్కంధకాలక్షణము చెప్పుపద్యమునఁ బ్రాసమును కూడ పాటించెను. ఆతని లక్షణపద్యమిది—

"సర్వచతుర్మాత్రగణో
గుర్వంతాష్టమగణోభయార్ధః స్కంధః
పూర్వత్రిగణౌజాంఘ్రిః
సర్వత్రాయుజి న జో న్లజౌ వా షష్ఠః" 5-13

ప్రాసవిధానముతోపాటు జయకీర్తి మఱియొకయంశమునుగూడ స్ఫుటముచేసినాఁడు. అష్టమ గణము గుర్వంతమై యుండవలెను—అనఁగా గగమో, సగణమో యైయుండవలెను - అని సందిగ్ధమైయున్న విషయమును స్ఫుటముచేసెను.

"ఆర్యాపూర్వార్ధం యది
గురుణైకే నాధికేన నిధనే యుక్తం
ఇతర త్తద్వ న్నిఖిలం
దలం యదీయ ముదితేయ మార్యాగీతిః"

వృ. ర. 2-11

అను వృత్తరత్నాకరలక్షణము, లక్ష్యముకూడ అష్టమగణము గగమన్న భ్రాంతికిఁ గారణ మగుచున్నవి. జయకీర్తి యా భ్రాంతినిఁ దొలఁగించెను.

ఈ లక్షణములన్నియుఁ గలిసివచ్చునట్లుగా నాంధ్రుల యాదిచ్ఛాందసికుఁడు రేచన కంద పద్యమునకు లక్షణముచెప్పెను.

"కందము త్రి శర గణంబుల
నందును; గా భ జ స నలము లైదునె గణముల్;
పొందును నాఱిట నల జము;
లొందుం దుద గురువు; జగణ మొప్పదు బేసిన్."

"నెలవెఱిఁగి నిడుదపాదం
బుల నాలవగణము మొదలఁ బొదలఁగ నిడఁగా
వలయును వళ్ళాపాదం
బులతుద గురువమరఁ గందమున కిడవలయున్."

జాత్యధికారము

ఆదికవి నన్నయ నిర్మించిన యాది కందపద్యలక్ష్యము—

విమలాదిత్యతనూజుఁడు
విమలవిచారుఁడు గుమారవిద్యాధరుఁ డు

త్తమచాళుక్యుఁడు వివిధా
గమవిహితక్రముఁడు తుహినకరుఁ డురుకాంతిన్.

ఆది. I. 4.

'త్రి శర గణంబుల' ననిచెప్పుటచే రేచన పథ్యాకందమునకే లక్షణము చెప్పినట్లు ఁతోచుచున్నది. మూఁడుగణముల కొకపాదము ఐదుగణముల కొకపాదము చొప్పున కందార్ధము రెండుపాదము లగును. రెండవపాదమున మూఁడుగణములపై వడి యుండవలెను. నన్నయ యాదికందము పథ్యాలక్షణముల ననువర్తించు చున్నదనియే చెప్పవచ్చును. పూర్వార్ధమున పదచ్ఛేదము స్పష్టమే. ఉత్తరార్ధమున "పూర్వాంతవత్ స్వర స్సంధౌ"[1] అను యతిరహస్యము ననుసరించి వివిధా + గమ అని విచ్ఛేదము చేయవచ్చును. ఉభయార్ధములనడుమ "ఉపసర్గాంతతఃచేదః"[2] అను వికల్పనమువలన ఉత్ + తమ అని విచ్ఛేదము చేయవచ్చును. నన్నయగాని, ఇతరాంధ్రకవులుగాని సర్వథా పథ్యాకందములనే వ్రాయలేదు. విపులాకందములే సార్వత్రికములైనట్లు కనిపించును. ఇతరపద్యములందువలెనే కందపద్యమునందును కవులు పదచ్ఛేదరూపయతిని పాదాంతములందును బాటించియుండలేదు.

పింగళముని యార్యయందు పథ్యా విపులా భేదములనేకాక జగణవిన్యాసము నాశ్రయించి మరల నొకభేదకల్పనము గావించెను. అర్ధమున ద్వితీయ చతుర్థగణములు గురుమధ్యగత జగణములైనచో నట్టియార్య చపలార్య యనఁబడును. (4-24) ఈ లక్షణము పూర్వార్ధమందున్నది ముఖచపల; ఉత్తరార్ధమందున్నది జఘనచపల; ఉభయార్ధములందు నున్నది మహాచపల.

ఛందముయొక్క యాహ్లాదనోజ్జ్వలనోద్దీపనాది ధర్మములను బురస్కరించుకొని ముని చేసిన యీ పథ్యా విపులా చపలావిభాగము రమణీయముగా నున్నది.

భేదత్రయసాంకర్యమువలన ఆర్యాభేదములు పదునాఱు భావింపఁబడినవి—

1. పథ్య 2. ఆదివిపుల 3. అంత్యవిపుల 4. ఉభయవిపుల 5. ముఖచపలాపథ్య 6. జఘనచపలాపథ్య 7. మహాచపలాపథ్య 8. ముఖచపలాదివిపుల 9. జఘనచపలాదిపుల 10. మహాచపలాదివిపుల 11. ముఖచపలాంత్యవిపుల 12. జఘనచపలాంత్యవిపుల 13. మహాచపలాంత్యవిపుల 14. ముఖచపలోభయవిపుల 15. జఘనచపలోభయవిపుల 16. మహాచపలోభయవిపుల.

కందమునందును ఈ భేదములు భావింపఁదగియేయున్నవి. ఈ భేదములవల్లఁ గందమున గణపాదవ్యవస్థాభేద మేర్పడి, యందువలన గతిభేదములు భాసించి భిన్నరసభావాద్యర్థవ్యంజన సామర్థ్యము గలుగును.

యథోచితవిరామములచేఁ బథ్యాకందము మాధుర్యగుణవ్యంజకము కాఁగలదు. నిర్విరామత్వముచే విపులాకందము ఓజోగుణవ్యంజకము కాఁగలదు. జగణావృత్తిచే నుత్ప్లుతగతియగు

చపలాకందము నానారసములందు విక్షిప్తచిత్తావస్థను వ్యంజింపఁగలదు. విషమస్థానజగణము కందపద్యగమనమునకు ఎంతభంజకమగునో సమస్థానజగణ మంతరంజకమగును. రసప్రసంగము లేని పట్టులందును జగణకల్పితమైన కందగమనచాపల్యము చమత్కారకరమే యగుచున్నది.

ద్వితీయ చతుర్థస్థానముల జగణము గురుమధ్యగతమై యుండినచోఁ జపలాత్వము సిద్ధించునని పింగళముని చెప్పెను. దీనివలన నితరగణములు - జగణములకుఁ బూర్వాపరములం దుండవలసినవి - కొన్నికూడ నియతములగుచున్నవి.

ప్రథమగణము గగమో సగణమో కావలెను.
తృతీయగణము గగమే కావలెను.
పంచమగణము గగమో భగణమో కావలెను.

కాని చపలాత్వము జగణాశ్రితముగనుక గురుమధ్యగతము కాని జగణమువలనఁగూడ చపలాత్వము సిద్ధించుననియే భావింపపచ్చును.

1. పథ్య :

వీరైలులుఁ బౌరవులును భారతులును గౌరవులును బాండవులుననన్
వీరులయి పరఁగిరిది నయపారగ భవదీయవంశపరిపాటి మెయిన్.

ఆది. IV. 119.

2. ఆదివిపుల :

ద్రోణ ద్రోణజ కృప గీర్వాణనదీజాంగపతు లవశ్యమును భవ
ద్బాణహతిఁజేసి సమరక్షోణిఁ బరిక్షీణబలు లగుదు రపజితులై.

అరణ్య. IV. 89.

3. అంత్యవిపుల :

ఆశౌర్యం బాసత్త్వం బాశీలం బాపరాక్రమాభీలత్వం
బాశుద్ధవ్రత మెందు ననాశములని భీష్ముఁ బెద్ద నమ్మితిమిగదే.

భీష్మ. I. 56.

4. ఉభయవిపుల :

నా దివ్యాస్త్రంబులు బాహాదర్పము నింకఁ గాల్పనా గురుఁడాజిన్
దా దిక్కుమాలి పగతునిచే దైన్యముఁబొందెనటె యిసీ యేమందున్.

ద్రోణ. V. 336.

5. ముఖచపలాపథ్య :

హరిమేని కాంతియును నరు కిరీటరత్నాంశువులును గిఱిగొన రథర
థ్యరుచులు బెరసి విచిత్రస్ఫురణంబునఁ దేజరిల్లెఁ జూడు కుమారా !

కర్ణ. III. 147.

6. జఘనచపలాపథ్య :

మహిషుఁడు బలమేర్పడ నమ్మహిధరమున్ వైచె నయ్యమరసైన్యముపై
మహి సంచలింపఁగా దశసహస్రయోధవరు లపుడు సమసిరి దానన్.

అర. V. 278.

7. మహాచపలాపథ్య :

బృహదబ్ధిమేఖలాఖిలమహీతలక్షత్రవర సమక్షమున మహా
మహిమాన్వితుఁగా నన్నునుమహీశుఁగాఁ జేసి తతిసమర్థత వెలయన్.

ఆది. VI. 50.

8. ముఖచపలాదివిపుల :

మనుజేంద్ర సర్వమాయాపనోదనంబయిన యగ్నిబాణంబున న
ద్దనుజవినిర్మిత మాయావినివర్తనఁ జేసితిని సవిస్మయమతినై.

అర. I. 189.

9. జఘనచపలాదివిపుల :

ఇనరుచిఁ బాషాణము రశ్మినిరూఢంబై నయట్లు చిత్తము సద్భా
వనమున సదాత్మకంబగు ననామయస్థితికి మూలమది మనుజేంద్రా !

శాంతి. V. 529.

10. మహాచపలాదివిపుల :

అనిచెప్పి చూపి యభిమన్యునిఁ జూచితె చంద్రుభంగి నుజ్జ్వలకాంతిన్
దనరెడుఁ దదంశజాతుండనూనధృతిశాలి వీఁడెయంచుం జూపెన్.

స్వర్గా. 60.

11. ముఖచపలాంత్యవిపుల :

కరుణించి యిందు నాకుంబురోహితినిఁగాఁగ మీ సుపుత్రుఁ బవిత్రున్
బరమతపోనైష్ఠికు భాసురయమనియమాభిరాము సోమశ్రవసుఁగా.

ఆది. I. 88.

12. జఘనచపలాంత్యవిపుల :

అది పాపము దానికి నామది నెప్పుడు వగతు విమలమానస యక్కీ-
డు దొలంగునట్లుగా సత్పధార్థ దానములు చేయు తాత్పర్యమునన్.

ఆశ్రమ. I. 153.

13. మహాచపలాంత్యవిపుల :

నృపధర్మ వైశ్యధర్మములపాపకర్మములు జీవనాభావము పా
లుపడిన బ్రాహ్మణునకు నరకపాతమగు శూద్రకర్మకర్తృత్వమునన్.

శాంతి. V. 493

14. ముఖచపలోభయవిపుల :

ధరణీతలంబు నిర్ధార్తరాష్ట్రముగఁజేసి యనఘ ధర్మైకధురం
ధరు ధర్మతనూజువసుంధర కధిపతిఁజేయకుండఁ దగునే మనకున్.

అర. III. 163.

15. జఘనచపలోభయవిపుల :

భువనోపప్లవ సమయోద్భవభానునిభప్రభా విభాసితుఁడయి భా
ర్గవుఁ డూరుదేశమున నుద్భవించె మహివెలుఁగుచుండఁ బ్రభుఁ
డౌర్వుఁడనన్.

ఆది. VII. 135.

16. మహాచపలోభయవిపుల :

నరనాథ యమృతమగు నున్నరూపు గనుదీవు మరగు నాచెప్పిన యి
ప్పరమేతిహాసవాక్యోత్కరంబు నర్థంబు చిత్తగతమగుచుండన్.

శాంతి. V. 389.

గమనిక : పింగళముని చెప్పిన చపలాలక్షణమునుఁ బూర్తిగా ననువర్తించు లక్ష్యములు కవిత్రయరచనయం దగపడుటలేదు. పైన చూపఁబడిన లక్ష్యములు పింగళలక్షణమును కొన్ని కొంతవఱకును, గొన్ని చాల వఱకును ననువర్తించుచున్నవి. జగణముయొక్కయుఁ, బాదాంత విచ్ఛేదముయొక్కయు నునికిపైనాధారపడిన యీ భేదముల రసాద్యర్థానుకూలవినియోగము యథావసరము అందందు నిరూపింపఁబడును.

పింగళముని యార్యయందు జగణకృత చాపల్యమునుమాత్రమే లక్షించెను. ద్వితీయ చతుర్థస్థానములందు నలాదిగణము లుండినచోఁ గలుగు భేదముల నాయన ప్రపంచింపలేదు. ఆంధ్రలాక్షణికులలోఁ జిత్రకవి పెద్దన యొకఁడు నల చతుష్కందము, జగణ చతుష్కందము నని రెండు కందభేదములను జెప్పినాఁడు—

"నలమది రెండవగణమై
తొలఁగక యఱనున్న నలచతుష్కంద మగున్
వెలయఁగ నటువలె జగణము
తొలఁగక యుండిన జగణచతుష్కందమగున్"

లక్షణ. సార. 3-91.

పెద్దన చెప్పిన యీ లక్షణము చిత్రకవిత్వజాతికిఁ జెందిన చతుష్కందసంబంధి. అయినను నల జగణములు ఆఱవస్థానమునందేకాక స్థానాంతరములందుఁగూడ నివేశింపఁబడినచోఁ గందమున గతివిశేషములు భాసించునని దీనివలన గ్రహింపవచ్చును. ఒక్క నల జగణములనేకాక భ జ స నలములం దేగణమునైనను నియతస్థానములందుఁగాని, అనియతస్థానములందుఁగాని బహువారము లావృత్తములుచేసి కందపద్యమును తద్గణమయముగాఁ జేయవచ్చును. విశిష్టగణమయమైన కందపద్యము విశిష్టప్రయోజనసాధకము కాఁగలదనియు భావింపవచ్చును.

విషమస్థానములందు జగణనిషేధమును, పాదాంతగురుత్వవిధిని దృష్టియందుంచుకొని కందపద్యమున నొక్కొక్కగణమును బెక్కుపర్యాయము లావృత్తముగావింపవచ్చును. ఆ కందమును ఆ గణనామముతోఁ గలిపి వ్యవహరింపవచ్చును. ఇట్లు గగ కందము, నల కందము, భ కందము, జ కందము, స కందము సాధ్యములగుచున్నవి.

కుఱుచకందము, నిడుదకందమునని మఱిరెండు కందభేదములను జెప్పిన చిత్రకవి పెద్దన యిట్టి భావనకలవాఁడే యనిపించును.

హరివర ముప్పదినాల్గ
క్షరముల కందంబు కుఱుచకందంబన ని
ద్ధరఁ దగు, నఱువదిరెండ
క్షరముల కందంబు నిడుదకందంబయ్యెన్.

లక్షణసార. 2-86.

నిడుదకందమనఁగా నల కందమనియుఁ, గుఱుచకందమనఁగా గగ కందమనియు గ్రహింపఁదగును.

ప్రాకృతపైంగలమున స్కంధక 'బహు సంభేఆ' అని చెప్పఁబడినది. ఆ సంభేదములన్నియు అక్షరసంఖ్యాభేదకల్పితములు. అట్టిభేదము లిరువదియెనిమిది చూపఁబడినవి. ఉభయార్ధములందునుఁ గలిసి ముప్పదిగురువులు. నాలుగులఘువులు గలది నందస్కంధక. ఇంతకంటె నొక్కొక్కగురువు తగ్గినచో భద్ర, శేష, సారంగ మున్నగు స్కంధకాభేదము లేర్పడును. రెండుగురువులు, అఱువదిలఘువులు గలది శశిస్కంధక.

ప్రా. పై. 1-75.

ఈ భేదము లన్నింటికిని స్ఫుటమైన సామర్థ్యభేదము గుర్తింపసాధ్యముగాకున్నను కందము యొక్క నిడుదతనము, కుఱుచదనము – అనఁగా లఘ్వక్షరప్రాచుర్యము, గుర్వక్షరప్రాచుర్యము రసాదివ్యంజన సామర్థ్యవిశేషము కలవనియే గుర్తింపవచ్చును.

సర్వలఘు, సర్వగురు కందము లసంభవములు. పాదాంతగురుత్వవిధివలన సర్వలఘు కందము, షష్ఠస్థాన నలజగణాన్యతరత్వవిధివలన సర్వగురుకందము అసంభవము లగుచున్నవి. జయకీర్తి యీ యంశమును ఘంటాపథముగ వక్కాణించెను.

సర్వలఘుస్కంధో ఽసౌ
గుర్వంతాష్టమగణత్వతో నాస్తి భృశం
సర్వగురు ర్నాస్తి తధా
పూర్వమతా న్నియత షష్ఠజన్లగణత్వాత్. 5-14

కందమున గగాదిగణముల యావృత్తి యీ విధముగ సాధ్యమగును :–

| | | |
|---|---|---|
| గగము | — | 14 పర్యాయములు (షష్ఠస్థానమున నిషిద్ధము) |
| భగణము | — | 12 పర్యాయములు (షష్ఠాష్టమస్థానముల నిషిద్ధము) |
| సగణము | — | 14 పర్యాయములు (షష్ఠస్థానమున నిషిద్ధము) |
| జగణము | — | 6 పర్యాయములు (విషమస్థానములందును బాదాంతమునను నిషిద్ధము) |
| నలము | — | 14 పర్యాయములు (పాదాంతమున నిషిద్ధము) |

ఈ గణము లిన్నిపర్యాయములు ఆవృత్తములయిన పద్యములు శాస్త్రములందు లక్ష్య రూపమున నుండవచ్చునుగాని కావ్యములందిట్టివి దుర్లభములు. బాహుళ్యమును బురస్కరించు కొని యీ క్రిందివానిని గగాదికందముల కుదాహరణములుగా గ్రహింపవచ్చును.

గగ కందము :

అంతం గుంతీ నందనకాంతా చింతా మహాంధకారముతో న
త్యంతంబు మచ్చరించెనొ సంతమసంబనఁ బ్రభాతసమయం బయ్యెన్.
విరా. III. 35.

ఇందు ఏడు గగములు గలవు.

భ కందము :

పాయక యుండుదు రాక్షస
మాయల సమరంబునేసి మనుజుల విగతో

పాయులc జంపుదు భక్షణ
సేయుదు నమరాదులకు నజేయుcడ నెందున్.

ఆర. I. 113.

ఇందు తొమ్మిది భగణములు గలవు.

స కందము :

శరమోక్షణవేగనిరంతరమండలితోరుచాపదండుc డకాండో
ద్ధురదండధరుcడవోలెనుహరినందనుc దాcకె ద్రుపదుc డత్యుద్ధతుcడై.

ఆది. VI. 85.

ఇందు సగణము లెనిమిది గలవు.

జ కందము :

కావునc బ్రభుత్వ సంపదనీవిభుc డాడినదియెల్ల నెగ్గుగొనక నా
చేవినుము నీదుప్రతినకునేయది సేయనగు దాని నేర్పడ ననఘా!

కర్ణ. III. 83.

ఇందు జగణములు నాలుగు గలవు.

నల కందము :

హరుశరమును నరుశరమునుసరినిరుపక్రియలు దాcకి జవమఱి శరసం
భరమునc దిరిగె వరాహముశరనిధిమథనమునc దిరుగ శైలమపోలెన్.

ఆర. I. 306.

ఇందు పది నలములు గలవు.

గగకందము శార్దూలమునకు, సకందము మత్తేభమునకు, నలకందము చంపకమునకు, భకంద ముత్పలమునకు, జకందము పృథ్వికి సంక్షిప్తరూపములుగా భావింపవచ్చును. అనcగా నా వృత్తము లెట్టిసందర్భములందుc బ్రయోగార్హములో యట్టిసందర్భములందు గగాదికందము లును బ్రయోగార్హములగునని తాత్పర్యము.

ఆర్యానిర్మాణమునc బింగళముని మఱికొన్ని నియమములనుగూడ విధించెను.

1. పూర్వార్ధమున ఆఱవగణము నలమైనచో ఆ గణమందలి రెండవలఘువుతో పదము ప్రారంభింపcబడవలెను.

2. ఏడవగణము నలమైనచో దానియందలి మొదటిలఘువుతోడనే పదము ప్రారంభింపcబడవలెను.

3. ఉత్తరార్ధమున ఐదవగణము నలమైనచో దానియందలి మొదటిలఘువుతోడనే పదము ప్రారంభింపఁబడవలెను.

పిం. ఛ. 4-18, 19, 20.

పదనివేశవశమునఁ బద్యమునందు గతిభంగముగలుగకుండ నివారించుటకే పింగళముని యీ పదారంభనియతి చేసెనని యూహింపవచ్చును. ఈ నియమముల నతిక్రమించిన పద్యము లందు గతిభంగము గోచరించుచునేయున్నది. పింగళముని కొన్ని స్థానములందే - విశేషించి నలమునకుమాత్రమే ఈ పదారంభనియమము చేసెను. తక్కినగణము లాయాస్థానములందుఁ బ్రయుక్తములయినప్పుడు పదారంభ మెట్లుచేయవలెనో ఆయన చెప్పలేదు.

పింగళముని చేసిన యీ పదారంభనియతిని భరతమునియు (నా. శా. XV - 201, 202), జనాశ్రయుఁడును (జనా, V - 25) యతినియతిగా భావించినారు. అది సమంజసముగాఁ గను పట్టదు. పింగళుఁడు ఏ లఘువునఁ బదారంభముండవలెనని చెప్పెనో దానివెనుక యతి యుండు నని జనాశ్రయుఁడనెను. అనంతాదులు కొందఱు తెలుఁగులాక్షణికులు నిట్లేయనిరి. (ఛం. దర్ప. III· 3.) ఒకేపద్యమున యతినియతి వికల్పితమగుటయు, నా నియతియు నొక్క నలమునే యాశ్రయించియుండుటయు నంగీకరింపవీలుగాని యంశములు. పింగళమునిచేసిన పదారంభ నియతి గతిభంగనివారకయేకాని యతిచ్ఛేదనియామకము కాదు. సర్వలఘువైన నలమునందే గతి భంగమున కవకాశమెక్కుడగుటచేతఁ బింగళముని దానినే ప్రధానముగఁ బేర్కొనియుండును.

పింగళముని దిఙ్మాత్రముగఁ గావించిన యీ పదారంభనియమమును డాక్టర్ గిడుగు వేంకట సీతాపతిగారు విపులీకరించి కందపద్యమున శ్రవ్యతాసిద్ధికిఁ బదవ్యవస్థ యెట్లుండవలయునో నిరూపించిరి. నిశితపరిశీలనాఫలమైన వారి నిరూపణము మిక్కిలి ప్రతిభావంతముగనున్నది. "తెలుఁగు ఛందోరీతులు" అను గ్రంథమున (131 నుండి 155 పుటలవఱకు) వారు ప్రతిపాదించి నిరూపించిన సిద్ధాంతముయొక్క సారాంశమిది :

సర్వభాషలందును ఉచ్చారణవశమునఁ బదగతములగు కొన్నియక్షరములమీఁద ఊనిక (Accent) యుండును. ఈ యూనికలు సాధారణముగాఁ బదములయొక్కయుఁ, బదఖండ ములయొక్కయు ప్రారంభములను సూచించును. ఊనికలతోడి యుచ్చారణము భాషావ్యవహా రమున కొకయందమును, నర్థవిశేషమును గలిగించును.

1. పదాద్యక్షరముమీఁద సాధారణముగ ఊఁత యుండును.
2. గుర్వక్షరములమీఁదకూడ ఊఁత యుండును.
3. పదాద్యక్షరము లఘువై, ద్వితీయాక్షరము గురువైనచో ద్వితీయాక్షరముమీఁదనే ఊఁత యుండును.
4. గుర్వక్షరములమీఁది యూఁత దానియందలి ప్రథమమాత్రమీఁదనే యుండును.

భాషకు నిసర్గములయిన యూఁతలకు పద్యగతిని నియమించు సామర్థ్యముకలదని పింగళ మునిచేసిన సూచనను డాక్టర్ సీతాపతిగారు సోపపత్తికముగ వివరించి నిరూపించినారు.

సర్వచతుర్మాత్రాగణనిర్మితమైన కందము చతురస్రగతిగలది. పదవ్యవస్థావశమునఁ జతురస్రగతి మఱుగుపడి త్ర్యస్రాదిగతిభేదములు కందమునఁ గలుగుచుండును. ఒక్కొక్కప్పుడు గతిభంగమై యశ్రవ్యముగావచ్చును. కందము శ్రవ్యగతిమంతయు కావలెనన్నచో దళమందలి ముప్పదిరెండు మాత్రలలో వేనిమీఁద ఊఁతయుండవలెనో, వేనిమీఁద ఉండరాదో, వేనిమీఁద వికల్పముగ నుండవచ్చునో డాక్టర్ సీతాపతిగారి ప్రణాళిక తెలుపుచున్నది.

* ఊఁతయొక్క విధికి గుర్తు

• ఊఁతయొక్క నిషేధమునకు గుర్తు

? ఊఁతయొక్క వికల్పమునకు గుర్తు

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| * | • | ? | • | ? | ? | ? | • | * | • | ? | • | * | • | ? | • |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| ? | • | * | • | • | * | • | • | * | • | ? | • | * | • | * | |
| 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31, 32 | |

ఈ ప్రణాళిక పిండితార్థమిది :—

1, 9, 13, 19, 22, 25, 29, 31 + 32 మాత్రలమీఁద ఊఁతలు విధిగా ఉండవలయును.

2, 4, 8, 10, 12, 14, 16, 18, 20, 21, 23, 24, 26, 28, 30 మాత్రలమీఁద ఊఁతలు ఎంతమాత్రము నుండరాదు.

తక్కినమాత్రలమీఁద ఊఁత లుండవచ్చును, లేకుండవచ్చును.

పింగళముని 22, 25 మాత్రలయందు పదారంభము కావలెననుట యచ్చట ఊఁతయుండవలెననుటయే. 17వ మాత్రయందును ఊఁతయుండవలెననియే పింగళుని యాశయముగా గ్రహింపవచ్చును. 1, 13 మాత్రలు పథ్యయందు పాదారంభములేకనుక పదారంభములే యగుచున్నవి. వానిమీఁదకూడ ఊతలుండవలెనని పింగళుఁడు సూచించినట్లే యగుచున్నది. 9, 19, 29, 31 మాత్రలవిషయము పింగళుఁ డేమియుఁ జెప్పలేదు. డాక్టర్ సీతాపతిగారి పరిశీలనవలన ఆ లోపము పూర్తియైనది.

“త్రిషు గణేషు పాదః” “సప్తమః ప్రథమాది” అను పింగళసూత్రములే ఆంధ్రకంద మందలి పాదవ్యవస్థకు, యతివ్యవస్థకు మార్గము చూపినవని భావింపవలసియున్నది.

డాక్టర్ సీతాపతిగారి ఊఁతలప్రణాళికను అనువర్తించిన కందములందు నడక అందముగా నుండుటయు, ననువర్తింపనివానియందు నడక చెడుటయు వారుచూపిన లక్ష్యములవలన స్పష్టమగుచునేయున్నది. అయినను అందముగాఁ గనిపించు ఆ నడకలన్నియుఁ గందమునకు సహజములయిన చతురస్రములే యని చెప్పవలనుపడదు. కొన్ని త్ర్యస్రములు, కొన్ని మిశ్రములును కనిపించుచున్నవి.

కందమునఁ బదవ్యవస్థ యెట్లుండినను నక్షరముల కూర్పుమాత్రము నాల్గేసిమాత్రల ప్రమాణము విభాగశః గోచరించునట్లే యుండవలయును. అనఁగా —

4-5 : 8-9 : 12-13 : 16-17 : 20-21 : 24-25 : 28-29 మాత్రలుకలిసి ఏకాక్షరమునం దుండరాదు. అట్లుండినచోఁ బద్యము నడువదు. ఏ మాత్రలమీఁద ఊఁతయుండవలెనో అవియుఁ దమవెనుకనున్నమాత్రతోఁ గలిసి ఏకాక్షరము కాఁగూడదు. కందమునందన్నియుఁ జతుర్మాత్రాగణములని చెప్పఁబడుచున్నది అయినను నైదవగణము పంచమాత్రాకము, ఆఱవగణము త్రిమాత్రాకమునని భావింపవలసియున్నది. కనుకనే ఆఱవగణముయొక్క ద్వితీయ మాత్రతోఁ బదము ప్రారంభముకావలెననుట. పంచమ షష్ఠగణములు రెండునుగలిసి 5 + 3 అనుతీరున నెనిమిదిమాత్రలుగా నుండవలయును ప్రథమపాదగతికంటె ద్వితీయపాదగతి భేదిల్లి మఱికొంతదూరము సాగుటకే యీ వ్యవస్థ యవసరమగుచున్నది. ఆఱవగణము విధిగా నలమో జగణమో యయుండవలెననియు దాని రెండవమాత్రతోడనే పదమారంభముకావలె ననుటయు నీ గతిభేదసిద్ధికొఱకే. ఆఱవగణము నలమైనచో అది జగణతుల్యమైన నలమైయుండవలెనని డాక్టర్ సీతాపతిగా రనుటయు నిందులకే అన్యస్థానములందలి నలముల తొలిలఘువునందే పదమారంభించును. ఆఱవస్థానమందలి నలమునమాత్రము రెండవలఘువునందే పద మారంభము కావలెను.

చతుర్మాత్రాప్రమాణములైన పదములచే నిర్మింపఁబడిన కందమే చతురస్రముగా నడచును. లేనిచోఁ ద్ర్యస్రాదిగతిభేదములు గలుగును.

పాయక । యుండుదు । రాక్షస
మాయల । సమరంబు । సేసి । మనుజుల । విగతో

ఆర. I. 113.

చతురస్రగతి దీనియందు స్ఫుటముగా నున్నది.

ప్రమద । మొసగ । విదురు । బనిచి
సముచిత । మగునర్చ । నంబు । సంకర్షణపూ

అశ్వ. III. 164.

ప్రథమపాదమునఁ ద్ర్యస్రగతి యనివార్యమగుచున్నది.

ద్విరదంబుల । నరదంబులఁ
దురగంబులఁ । గాల్బలములఁ । దూర్యంబుల । సీ

శాంతి I. 352.

దీనియందు షణ్మాత్రాప్రమాణమైనగతి సులక్షణీయమే. ఇట్లు పదస్వరూపాశ్రితములయిన ద్రుత విలంబితాది గతిభేదములను గందమునఁ గల్పించుకొనవచ్చును. పదవ్యవస్థావశమునఁ గంద మున గతివిశేషములు సాధ్యములనియు, పఠితియందు గణముయొక్క గణత్వముకంటెఁ బదము యొక్క పదత్వమే స్ఫుటతరముగా భాసించుననియుఁ బింగళునిసూచనలు, డాక్టర్ సీతాపతిగారి పరిశీలనము నిరూపించుచున్నవి.

పద్యగతి నిరూపకములయిన పదములందే గణస్వరూపదర్శనముగలిగి లక్షణానుక్తము లయిన గణములయునికి పద్యగతియం దనుభూతమగును. పద్యముయొక్క రసాద్యర్థానుకూలత పదస్వరూపనిరూపితములైన యక్షరపిండముల గమనమునుబట్టియే నిర్ణయింపవలసియుండును గాని లక్షణోక్తములయిన గణములచేతఁ గాదనుట పరమార్థము.

సంస్కృతమునం దార్యకుఁ బ్రాకృతమున గాథకుఁగల ప్రాముఖ్య మాంధ్రమునఁ గంద మునకుఁ గలదు. కందము రచించినవాఁడే కవియని యాంధ్రజనవాదము. ఆంధ్రీకృతార్యా గీతియైన కందము చంపక శార్దూలాది వృత్తములయొక్కయు, గీతసీసాద్యుపజాతులయొక్కయు లక్షణములకు సంగమస్థానము. ఉత్తరదక్షిణభారత మధ్యస్థమైన యాంధ్రజాతియొక్క ఉభయ సంస్కృతిసమ్మేళనముకుఁ జిహ్నము కందము. నన్నయ తిక్కనల యుభయభాషా కావ్యరచ నాభిశోభితత్వమునకు, నుభయకవిమిత్రత్వమునకు నిదర్శనము కందము. అల్పాక్షరముల నన ల్పార్థరచనకుఁ గందము పరమసాధనము. నియమబాహుళ్యముచే నియామకము, నియతస్వే చ్ఛకు యోగ్యమునైన ఛందఃక్షేత్రము కందము. ఉపదేశప్రధానములైన రచనలయందు కందము సర్వసమర్థమైనదని కవిత్రయము బహుధా నిరూపించియున్నారు.

సంస్కృతమునందు అనుష్టుప్పుయొక్క యుపయోగములనుగుఱించి క్షేమేంద్రుఁడు చెప్పిన యంశములన్నియు నాంధ్రమునఁ గందమునకుఁ జక్కగావర్తించును.

(సువృత్త. III. 6, 9, 16, 29.)

"అనుష్టుప్ సతతాసక్తా సాభినందస్య నందినీ
విద్యాధరస్య వదనే గుళికేవ ప్రభావభూః"

III 29.

అని క్షేమేంద్రుఁ డనుష్టుప్పునుగుఱించి యన్నమాట కందమువిషయమునను సత్యమ. తన యందు సతతాసక్తుఁడైన కవినోట కందమత్యంతము శక్తిమంతమై ప్రసరించుట నిక్కము.

కవిత్రయము భారతమున రచించిన కందములు 7034 - మొత్తము గద్యపద్యములలో రమారమి మూఁడవవంతు. వీనిని వారెన్నియో తెఱంగుల నడిపించి ఉపదేశమునకుఁ, గథనమునకు, వర్ణనమునకు, రసపోషణమునకు, శీలచిత్రణమునకు, సంభాషణమునకు, ఉపన్యాసమునకు-ననంత విషయముల సమర్పణమునకుఁ బరమసాధనముగా నుపయోగించుకొనిరి

ఇన్ని కందములందు వారెన్నిగతివిశేషములను భాసింపఁజేసిరో తెలుఁగువారి కెఱుకయే. విశేషించి తానొక్కఁడే 5394 కందములు వ్రాసిన తిక్కన యెన్నితెఱంగులనో కందమును నడిపియుండవలెను

"ముందఱఁ జను దినములలోఁ గందమునకు సోమయాజి ఘనుఁడందురు" అని కుందవరపు కవిచౌడప్ప సోమయాజికందముల యందమును బ్రశంసించెను. నన్నయ కందములును నందమునఁ దీసిపోవునవికావు. అందమే యాయన ఛందములన్నింటికినిఁ బ్రాణము.

> అతిమానుష మత్యద్భుత మతిదుష్కరమైన కేశవార్జునకృతి గో
> పతి చూచిమెచ్చి సురపరివృతుఁడై చనుదెంచెఁ గృష్ణవిజయులకడకున్.
>
> ఆది. VII. 319.

పద్యముయొక్క యెత్తుగడ మహాతరంగము లువెత్తుగ నలకలువెట్టుచు నుఱికివచ్చుతెఱఁగును దోఁపింపఁజేయుచు వర్ణ్యాంశమును జక్కగా సమర్థించుచున్నది. షణ్మాత్రాకఖండావృత్తిచే పాదము దుమికివచ్చుచున్నట్లున్నది.

> బృహదబ్ధిమేఖలాఖిలమహీతలక్షత్రవరసమక్షమున మహా
> మహిమాన్వితుఁగా నన్నునుమహీశుఁగాఁజేసి తతిసమర్థత వెలయన్.
>
> ఆది. VI. 50.

గణవశమునఁ, బదవశమునఁ బెక్కుజగణములు రూపొంది పద్యమునఁ బునఃపునరుత్ప్లుతి గలిగి పద్యగతి చిత్తమును జమత్కృతము గావించుచున్నది. హర్షాశ్చర్యములతోఁ గర్ణునిచిత్త మెట్లు తరంగితము, దీప్తమునగుచున్నదో జగణములందుఁ సగణములందుఁ జూడవచ్చును. 'నన్నును' అన్నపదమందలి సముచ్చయమువలెనే భగణముకూడ 'అధమకులజుఁడను, నవమానగళితచిత్తుఁడనునగు నన్ను' అనునర్థమును అవరోహణముచే వ్యంజించుచున్నది. మహిమాన్వితుగా అను పదములు సగణములై కర్ణుని చిత్తస్పందముల యారోహణమును బట్టియిచ్చుచున్నవి. పద్యమునకు అందముతోఁపాటు వ్యంజకతాసామర్థ్యము నుండవలయును.

> నీయెడఁ జంచలయయ్యెనుశ్రీ; యెవ్వరి నచలవృత్తిఁ జెందెడు; విధి య
> ట్లైయున్నవారి నిట్టులు సేయఁడె? యేనింక నేమిసేయుదు నధిపా!
>
> శల్య. II. 404.

పాదాంతము నతిక్రమించి యుత్తరపాదారంభాక్షరముమీఁద మిశ్రమించుట తిక్కనకలవాటు. అట్టివిరామమువలనఁ బద్యగమనమునఁ గలుగు చమత్కారము రసితజనవేద్యము. అసాధారణతయే చమత్కారహేతువు. దుర్యోధనసార్వభౌముని సామ్రాజ్యలక్ష్మి తొలంగిపోయినదని యశ్వత్థామ దుఃఖించుచున్నాఁడు "నీయెడఁ జంచల యయ్యెను శ్రీ" - విషాదాశ్చర్య స్తబ్ధుఁడైన యశ్వత్థామకు మాటపెగులలేదు. పాదారంభమున నిలిచిన శ్రీ వెంట విలంబితవిరామము (దీర్ఘాక్షరానంతర దీర్ఘావిరామము) స్తంభమను సాత్త్వికభావమును వ్యంజించుచు రసనిష్యందియగుచున్నది. నీయెడఁ జంచల యయ్యెను - అను భగణత్రయమున నవరోహియగుచున్న యశ్వత్థామచిత్తవృత్తి యనిష్టాశ్చర్యముచే శ్రీయందు స్థంభించుట — ఆ శ్రీ వాక్యాంతము, పాదారంభము నగుట - వీనివలన దుర్యోధనుని భూతపూర్వవైభవము ఒక్కసారి ధ్వజమువలె కన్నుల యెదుట విప్పారినట్లగుచున్నది. పద్యమందలి పదములు లఘువులై పద్యమున బహువిరామము లేర్పడి యశ్వత్థామవాక్యోచ్చారణమునందలి గాద్గద్యము చక్కగా నభినీతమగుచున్నది.

గో వగ్నిమయ మమృతమయమో వసుధాధీశ వినుము హోమవిధాన
శ్రీవాహిని నిచ్చెన త్రిద శావాసంబునకుఁ బూజ్య మమరులకైనన్.

అను. II. 277.

పద్యారంభాక్షరముమీఁదివిరామము అత్యంతమునసాధారణము. ఇచ్చటదనసర్వశక్తిమత్త్వమును, సర్వమయత్వమును స్థాపించుకొనుచు గో శబ్దము పద్యారంభాక్షరముగా నిల్చి పద్యగమనమునకుఁ జమత్కృతి నాపాదించుచున్నది. 'గో' యన్న యక్షరమును విడిచియుఁ బద్యము నడచుచున్నది గాని యది లేనిదే గతికిఁ బూర్ణతలేదు.

తిక్కన యితరపద్యములందువలెనే కందమునందును బ్రాసములను తఱుచు సంధిగతములు గావించును. అందువలనఁ బద్యమునకు ఒకవిధమైన దుముకు గలుగును - ఒక్కసారి తునిసి మరలఁ గలిసినచాయ పద్యగమనమున గోచరించును.

సంజయ మురభంజనుని ధనంజయునిం జీరికింగొనఁడు కర్ణుం డిం
ద్రుం జెనకియైన గెల్తునసుం జచ్చెనె యట్టివాడునుం గయ్యమునన్.

కర్ణ. I. 20.

"గెల్తుననున్" అనుతెలుఁగున వాక్యావసానాక్షరము చతుర్థపాదారంభమున నిలుచుట, 'అనున్' అను ప్రతిజ్ఞార్థకపదము తృతీయచతుర్థపాదములనడుమ విభక్తమగుట - కర్ణుని యింద్రవిజయ కథనాత్మక ప్రతిజ్ఞాభంగమును తత్కారణమున ధృతరాష్ట్రునకుఁగలిగిన యాశాభంగమును, ననిష్టాశ్చర్యమును జక్కగా వ్యంజించుచున్నవి. 'అనున్' అనంతరము పూర్ణవిరామము (వాక్యావసాన విరామము) ఏర్పడి ధృతరాష్ట్రుని కంఠనిరోధమును బట్టియిచ్చుచున్నది.

వినుఁ డక్కనుటకు మూలంబనఘంబగు తపమ యగుట నతినిష్ఠఁ దపో
ధనసమ్యగ్విధ సముపార్జనం బవశ్యంబు వలయు సన్మతులారా!
అశ్వ. II. 202.

తృతీయచతుర్థపాదముల – విశేషించి చతుర్థపాదముయొక్క – గతి యతివిచిత్రముగనున్నది. కందమునం దిట్టి యారోహణ మసాధారణము. చతుర్థపాదాది జగణమందలి తుదిలఘువు ఉత్తరపదాదిని నిలిచి తగణమును రూపించుచున్నది. జ, గగములు పదవశమున లగ తగణములై చక్కని యారోహణము సిద్ధించినది. పరతత్త్వదర్శనమునకుఁ దపస్సముపార్జనముయొక్క యావశ్యకమును హృదయమున కెక్కుతీరునఁ జెప్పుటకై యీవిచిత్రమైన యారోహణ మిచ్చుట నవలంబింపఁబడినది.

ఇట్లే పెక్కుపద్యములందు అర్థరసాద్యనుకూలములయిన గతివిశేషములను గుర్తింప వచ్చును.

భారతమున మూఁడింట నొకవంతు కందములు, ఒకవంతు గద్యములు, తక్కినవృత్తము లన్నియుఁగలిసి యొకవంతు. శాస్త్రేతిహాసకావ్యమైన భారతమందలి శాస్త్రభాగమును గందముల చేతను, ఇతిహాసభాగమును గద్యములచేతను, కావ్యభాగమును నానావృత్తవిశేషములచేతను, కవిత్రయము నిర్వహించిరని స్థూలముగ భావింపవచ్చును. అయితే యిది కేవలము స్థూల భావనయే.

భారతమందలి యేడువేలకుఁ బైఁబడిన కందములన్నియు శాస్త్రోపదేశమునకే వినియుక్తములు కాలేదు. నానార్థములను వర్ణించుటకు, నానారసభావములను వ్యంజించుటకుఁ బెక్కుకందములు వినియోగింపఁబడినవి. సంస్కృతాంధ్రలాక్షణికులు సూచించిన రహస్యములనుబట్టి చూచినచోఁ గందము ననేకప్రకారముల నిర్మింపవచ్చునని తేలినదిగదా. గగ, నలముల ప్రయోగబాహుళ్యము వలన విలంబిత ద్రుతవృత్తులను, భ స జ గణముల ప్రయోగబాహుళ్యమువల్ల అవరోహణారోహణోత్ప్లుతగతులను గందమున భాసింపఁజేయవచ్చును. ద్వి త్రి చతురాద్యక్షర పదనివేశము వలన, విరామ, కాకువిశేషములవలన, ద్వి త్రి ప్రాసాద్యలంకారములవలన బహుభంగులయిన చమత్కృతులను గందపద్యమున వెలయింపవచ్చును. సర్వరసభావనిర్వాహముగఁ గందమును నిర్మింపవచ్చును. కందమునఁ గవిత్రయము చేయనిశిల్పము లేదు. కందముచే వారు చేయింపని పని లేదు.

కందమున వివిధగతివిశేషములను మెఱయించుటయందుఁ గవిత్రయమునకు శ్రవ్యతానిష్ఠకంటె రసాదివ్యంజకతానిష్ఠయే యెక్కుడని పరిశీలనవలన గుర్తింపనగుచున్నది. కొన్ని నిర్మాణవిశేషములు పరిశీలించిచూతము ——

కడువడి వడముడియును గవ్వడియు నతని గావఁబూని వచ్చిరయేనిన్
జెడుదురు మచ్చాపంబునవెడలు వివిధవిశిఖశిఖల వేఁడిమిచేతన్.

కర్ణ. II. 131.

ఆద్యంతపాదములు లఘుమయములైన యిది నలకంద మనవచ్చును. ప్రథమపాదమునందలి ద్రుతతమమైన యక్షరవృత్తి వాక్యార్థానుగుణముగనున్నది. తృతీయపాదమందలి యక్షరవృత్తి ద్రుతిదరిగి స్వార్థమును సమర్థించుచున్నది. ప్రథమపాదమందలి చతురస్రగతికంటె చతుర్థ పాదమందలి త్ర్యస్రగతి ద్రుతతరము. తమ బావమఱఁదియైన ధృష్టద్యుమ్నునిఁ గాపాడుకొను టకు వడిమడియుఁ, గవ్వడియు వచ్చుచున్నవడి ప్రథమపాదమందున్నది. వారివడిని భంగపఱచు అశ్వత్థామ విశిఖములవడి చతుర్థపాదమందున్నది. "వెడలు వివిధ విశిఖ శిఖల" అను పదముల కూర్పున నిరంతరశరపరంపరాద్రుతగతి ప్రస్ఫుటము. ధృష్టద్యుమ్నరక్షణమున భీమార్జునుల యొక్కయు, దత్పరాక్రమప్రతిజిఘాంసయందు అశ్వత్థామయొక్కయు ఉత్సాహసత్వరములైన చిత్తవృత్తులను బద్యమునందలి యక్షరవృత్తి సుష్ఠుగాఁ బ్రతిబింబించుచున్నది.

శ్రాంతంబయ్యెను వాహనసంతానంబెల్ల నిపుడు సంధ్యాసమయం
బింతట నేఁటికి నని సాలింతముగా కింకఁ బోర లెస్సై యున్నే ?

భీష్మ. II. 340.

దినమంతయు యుద్ధముగావించి దినాంతమున శ్రాంతుఁడైన శాంతనవుని వాగనుభావమిది. నలు బదిరెండక్షరములలో నిరువదిరెండు గురువులుగల యీ పద్యము విలంబితవృత్తి. మందీకృత దీప్తియైన చిత్తవృత్తికి వ్యంజకము. ఇందలిగురువుల గురుత్వము అనుస్వారాంతత్వకల్పిత మగుటచే అక్షరవృత్తియందు మాధుర్యము సంక్రమించుచున్నది. కౌరవసర్వసేనాపతియగు శాంతనవుఁడు స్వయముగ శ్రాంతుఁడయ్యు, ఆత్మశ్రాంతిని విస్మరించి వాహనసంతానశ్రాంతిని స్మరించుటచే ఆయనచిత్తము కరుణార్ద్రమైయున్నది. ఆయార్ద్రతయొక్క లక్షణమే మాధుర్యము. వీరరౌద్రాదులందలి విలంబితవృత్తికంటె నిది భిన్నము.

ఈ పద్యమునకు ముందు మూఁడుకందము లున్నవి. అవి యుత్తరోత్తరము ద్రుతతర గమనముగలవి.

నైరింపక యేత్తెఱఁ గురువీరాగ్రణి యిరువదేనువేల రథంబుల్
పోరికిఁ బురికొల్పిన విసారగతిం గూడి కవిసెఁ బార్థునిమీఁదన్.

భీష్మ. II. 337.

కడువెసఁ గవిసినయవి గ
వ్వడి బాణజ్వాల లడర వడి దావాగ్నిన్

మిడుతలు వాలిసినక్రియఁ బొడి
పొడియయ్యెం గురుబలంబు పొంగడఁగంగన్.

భీష్మ. II. 338.

కురుబలంబుల విస్ఫారగతియు, దానిని బొడిపొడిచేసిన పార్థుని బాణగతియు నొకదానికంటె నొకటి త్వరితతరమగుట పద్యములందు సాక్షాత్కరించుచునేయున్నది. అట్టిసమయమున సూర్యాస్తమయమను తటస్థవిభావమును వర్ణించునది మూఁడవకందము తిక్కనదృష్టిలో సూర్యుఁడు కురుపాండవయుద్ధవృత్తాంతమునఁ దటస్థవిభావముకాదు. సర్వకర్మసాక్షి, ధర్మపక్షపాతియైన యాదేవుఁడు కురుక్షేత్రసమరాంగణమందలి యుద్ధతంత్రమంతయు వీక్షించుచునే యుండును. ఆయనయే యథార్థమున రణకర్మప్రవర్తకుఁడు. ఆయన యుదయాభ్యుదయాస్తమయములు రణవ్యాపారనియామకములు ధర్మపక్షము భంగమగునన్న సూచన యగపడినచో ఆయన సమరవిరామసూచన చేయును, ఇరువదేనువేల రథములతోఁ గురుసేన పార్థుని జుట్టుముట్టినది. ఎంతమహావీరుఁడైనను బార్థున కది భారమే. సూర్యభగవానుఁడు రణవిరామసూచనఁ గావించినాఁడు. సూర్యోదయాస్తమయములనుఁ దిక్కన యుద్ధపర్వములందు చక్కగా వర్ణించెను.

"కిరణంబు లడఁగి యంతకునరుణత్వము మెఱయఁ దరణి
యపరాద్రిశిరః
స్ఫురణను నధికరణాలంకరణం బొనరించుటయును గాంగేయుఁడెడన్"

భీష్మ. II 339.

సమరమారంభమై యైదుదినములే యైనది. గెలుపోటముల స్వరూప మింకను నేర్పడుట లేదు. ఉభయపక్షములు ఆనందోత్సాహములతో యుద్ధముచేయుచున్నవి. రణ మింకను క్రీడాకల్పముగనే యున్నది. దివసావసానమున యోధులెల్లరు సంతృప్తులై రణముసాలించుచుండిరి. అట్టిసాయంసమయవర్ణనము యుద్ధవీరుల ప్రముదితచిత్తవృత్తికిఁ దగినట్లు రమణీయమైన కందమునఁ గావింపఁబడినది. పాదచతుష్టయమున నిర్మింపఁబడిన ద్విప్రాసము, నాతినిర్వ్యూఢమైన యనుప్రాసము ఛందమును జక్కగా నలంకరించి హృద్యము గావించుచున్నవి. రక్తరంజితగాత్రులై, యుద్ధక్రీడచేఁ దనిసి యింక ననిసాలింతమను తలఁపునూనిన యోధుల ప్రశాంత ప్రజ్వలనములగు హృదయములకుఁ బరమాహ్లాదకరమైన సంధ్యాసమయమును కవిబ్రహ్మ చక్కగా నలంకరింపఁబడిన కందమున వర్ణించెను. "అధికరణాలంకరణము" అన్న యర్థమును బద్యనిర్మాణము సుష్ఠుగా సమర్థించుచున్నది.

అట్టిసంధ్యాసమయము నవధరించి గాంగేయుఁడు సేనలం దివియించినాఁడు. సమరము విరమించి సైనికు లెవరివీటికి వారు పోవుటయు నొకకందమున వర్ణింపఁబడినది.

సమర క్రీడన లీలం దమక తమక తనిసి మరలి తమ తమ యావా
సములకు మరలి రుభయసైన్యముల జనంబులును దీవియలు వెలుఁ
గంగాఁ.
భీష్మ II. 342.

"తమక తమక తనిసి మరలి తమ తమ యావాసములకు" అను కూర్పు సైనికులు చిన్నచిన్న గుంపులుగట్టి శిబిరములకు మరలిపోవుతెఱఁగును కన్నులకుఁ గట్టినట్లు రూపించుచున్నది.

"అనిన విని యన్నరేంద్రుం డనుజసహితముగఁ బ్రభూతహర్షసమున్మీ
లనకలనా సంవేశితమనస్కుఁడై యాతనికి నమస్కృతిచేసెఁ.
అను. II. 129.

గంగాస్తోత్రసహితమగు నితిహాసమును భీష్ముఁడు చెప్పఁగావిని ధర్మజుఁడు పొందినహర్ష మీపద్యమున వర్ణింపఁబడినది. ద్రుతియు, నెడనెడ నుత్ప్లుతియుఁ గలిగి పద్యగతి ప్రభూత హర్షావేశితమనస్కతను వ్యంజించుచున్నది. హర్షసమున్మీలన జగణమునందలి యుత్ప్లుతియందు గుర్తింపవచ్చును. జగణచతుష్కవృత్తియైన యీకందము మహాచపలాలక్షణములు గలది.

బహుబంధు మరణశోకప్రహతవివేకమయి ధర్మరాజునకు మనో
మహిమ వికలమయ్యెం బరమ హితవచోవృత్తిఁ దేర్పు మహితవిచారా!
శాంతి. I. 223

ఇది యర్జునుఁడు శ్రీకృష్ణునితో ననినమాట. ఉత్తరార్ధము. త్ర్యస్రగత్యనుప్రవేశమువలనను, 'పరమ' పదము తృతీయచతుర్థ చరణములనడుమ ఖండితమగుటవలనను, చతుర్థపాద ద్వితీయ మాత్రమీఁది యూనికవలనను బద్యగతి వికలమై ధర్మజుని మనోధర్మవైకల్యమును బట్టియిచ్చు చున్నది. "పరమ హిత వచోవృత్తి" చేత ధర్మజుని మనోవైకల్యమును దొలఁగింపుము అన్న పలుకులు ఛందోరహస్యగర్భితములు. అది గ్రహించి శ్రీకృష్ణుఁడు "వదనంబు విరిదమ్మి చందంబు నొంద మధురాక్షర విన్యాసంబుగా" ధర్మజునితో నిట్లనినాఁడు.

"పురుషవ్యాఘ్ర! మనంబు గుంద వగలం బొందంగ నీకేల? సం
గరకేళిఁ భవదీయబంధు లతిలోకంబైన పెంపొప్పఁ బో
యిరి నాకంబున కట్లుఁగాక కల గాదే రాజవృత్తంబు దా
నరయఁ రాజుల యేల యేజనులు నిత్యాయుష్యులే చెప్పుమా!
శాంతి. I. 225.

ఈ మత్తేభమున మధురాక్షరవిన్యాసము గలదని తిక్కన యభిప్రాయము. ఉపనాగరకోచితము లయిన వర్ణములీ పద్యమునం దంతగాలేవు. "మధురాక్షర విన్యాసంబుగా" అను సమాసమున

మధురశబ్దము అక్షరములకుఁ గాక తద్విన్యాసమునకు విశేషణమగుచున్నది. అక్షరవిన్యాసమే "వచోవృత్తి" - ఛందమునందలి యక్షరములకూర్పు. అక్షరములకూర్పు లేక బంధము ఛందోవృత్తి యనఁబడినది. శ్రీకృష్ణుని వాక్యమందలి యక్షరవిన్యాసము పరమహితముగా - అనఁగా మధురముగా నుండవలెను. పృథక్పదత్వరూప మాధుర్యము ఉదాహృత మత్తేభమునందలి విశ్రాంతిబాహుళ్యమున స్ఫుటముగ భాసించుచున్నది పదవిశ్రాంతికిఁదోడు అవాంతరవాక్యవిరామములును బద్యమును మాధుర్యగుణోపేతము గావించుచున్నవి.

"పతిఁ బడసి సుతులఁ బడయఁగ
నతివలు కోరుదురు; కోరినట్టుల తనకుఁ
బతిఁ బడసి సుతులఁ బడసెను;
సతు లీ భార్గవికి భాగ్యసంపద నెనయే ?

ఆది. III. 171.

ఇందు ప్రథమతృతీయచరణములు సమతాధర్మవిశిష్టములై "కోరినట్టుల" యన్నయర్థమును సమర్థించుటయు, ద్వితీయచతుర్థచరణములు సాదృశ్యాల్పతచే "ఎనయే" యన్న యర్థమును సమర్థించుటయు స్పష్టము.

చల్లని దక్షిణ మారుత మల్లన వీతెంచె తగిలి యా లలనాథ
మ్మిల్ల కుసుమాంగరాగ సముల్లసన సుగంధియగుచు మునివరుమీఁదన్.

ఆది. IV. 40.

భగణ బాహుళ్యమున నవరోహణరూప సౌకుమార్యము, మధ్యవృత్తిచేఁ బ్రసాదమును వ్యంజించుచు పద్యము వాక్యార్థసమర్పణ సమర్థమై శిల్పమగుచున్నది. ఉగ్రతపోమగ్నుఁడై యున్న విశ్వామిత్రుని చిత్తమున సుకుమారము, ప్రసన్నమునైన వృత్తిని గలిగించుటకు మేనకచేసిన యత్నమునకు ఛందము చక్కనిదోహదము చేయుచున్నది.

ఆయుష్మంతుఁడవై లక్ష్మీయుత బాల్యంబునంద మీ యన్వయరా
జ్యాయత్త మహీభారం బాయతభుజ నీవు తాల్చి తభిషిక్తుఁడవై.

ఆది. II. 202.

దీర్ఘాక్షరబాహుళ్యమునఁ బద్యము శార్దూలశాబకసదృశమై కుమారజయమేయుని మహిమను స్తుతించుచున్నది. "శౌర్యస్తవే నృపాదీనాం శార్దూలక్రీడితం మతం" అని క్షేమేంద్రుఁడనెఁ గదా. (సువృత్తతిలకము III. 22.) ఊష్మమహాప్రాణాక్షర యోగముచే నీ పద్యమందలి విలంబనమునఁ గొంత యోజోగుణము గోచరించుచున్నది.

అంతం గుంతీనందన కాంతా చింతా మహాంధకారముతో న
త్యంతంబు మచ్చరించెనొ సంతమసం బనఁ బ్రభాతసమయం బయ్యెన్.
విరా. III. 35

కీచకవధ యైనది. ప్రభాత మగుచున్నది. కుంతీనందనకాంతా చింతామహాంధకారముతోపాటు సంతమసము తొలఁగిపోయినది. ద్రౌపదియొక్కయుఁ, బాండవులయొక్కయు చిత్తములు కలఁకదేరి ప్రసాదమాధుర్యమయములై నవి. ఈ భావనచేఁ గవిచిత్తముగూడ ప్రసన్నము, మధురమునై యున్నది. ఆ లక్షణము లీ ప్రభాతవర్ణనాత్మక పద్యముననున్నవి. ఇరువదియొక్క గురువులుగల యీ కందము గగకంద మనఁదగినది.

శరమోక్షణవేగ నిరంతరమండలితోరు చాపదండుఁ డకాండో
ద్ధుర దండధరుఁడు పోలెను హరినందనుఁ దాఁకె ద్రుపదుఁ డత్యుద్ధతుఁడై
ఆది VI. 85

పదవశమున మఱుగుపడి యీ పద్యమునఁ దొమ్మిది సగణములున్నవి. అవి పదస్వరూపము లందే గోచరించినచోఁ బద్యమునందు ద్రుతమైన యారోహణము ప్రస్ఫుటమైయుండెడిది. మఱి యొకక్షణములోఁ బార్థుని చేబద్ధుఁడుకాఁబోవు ద్రుపదుని యుద్ధక్రీడయందు దీప్తిరహితమైన త్వరను మాత్రమే స్ఫురింపఁజేయుట నన్నయ యాశముకావచ్చును.

హరు శరమును నరు శరమునుసరి నిరుపక్కియలు దాఁకి జవమఱి శరసం
భరమునఁ దిరిగె వరాహముశరనిధి మథనమునఁ దిరుగు శైలమపోలెన్
అరణ్య I. 306.

పదునొకండు నలములుగల యీ పద్యము అత్యంతము ద్రుతగమనముఁగలది. వరాహము గిర గిరఁ దిరుగుటయందలి త్వరను జక్కఁగా స్ఫురింపఁజేయుచున్నది. అర్థము దెలియకున్నను నక్షరముల గతినిబట్టియే యర్థస్వరూపము గోచరింపఁజేయు నిట్టిఛందోనిర్మాణ మొకవిధమగు నర్థవ్యక్తియను గుణముచే శోభిల్లును. చిత్రకవి పెద్దన చెప్పిన నిడుదకందములతెగలోని దీ పద్యము.

కందమున దీర్ఘపాదమందలి పదమూఁడవమాత్రపై వడి యుండును. ఆ మాత్రపై నూనిక యున్నచోఁ బద్యగతి శ్రవ్యముగనుండును. అనఁగా వడియందు పదాద్యక్షరమో, పద ఖండాద్యక్షరమో, గుర్వక్షరమో ఉండవలయును. ఊనికలేని యక్షరము వడియందున్నచో గతి యందు భంగముగోచరించును. అట్టి గతిభంగమును భారతకవులు అచ్చటచ్చటచ్చట రసభావ విశేషవ్యంజనముకొఱకు బుద్ధిపూర్వకముగఁ గల్పించినట్లు తోఁచుచున్నది.

అనఘా! యీ యజ్ఞము విధి
సనాథ ఋత్విక్ప్రయోగ సంపూర్ణంబ

యుంను గడచననేరదు నడు
మన యడుగును బ్రాహ్మణోత్తమ నిమిత్తమునన్.

ఆది II. 210.

సర్పయాగశాల నిర్మాణము జరుగుచుండఁగా నొకవాస్తువిద్యానిపుణుండైన పౌరాణికుండు జనమేజయునితోఁ బలికిన వాక్యమిది చతుర్థపాదమున వడి పదాంతలఘువుపై నిలిచినది. పదాంతలఘువు బొత్తిగా నూనికయుండని యక్షరము. కనుక గతిభంగమై పద్యమశ్రవ్యమైనది. సప్తమగణము సగణమగుటచే అశ్రవ్యత కొంతతగ్గినది. నలమైనచో అశ్రవ్యత యతిశయమగును. భావిసర్పయాగభంగమీ యతిభంగముచేతను, 'నడిమికి' అను పదము నడిమికి విఱుగుటచేతను జక్కఁగా సూచింపఁబడుచున్నది. జనమేజయునకు అపథ్యమైన యర్థము పౌరాణికునిచే నశ్రవ్యమైన ఛందమునఁ బ్రతిపాదింపఁబడినది.

తనపలుకు లోకమెల్లను గొనియాడఁగఁదగిన లోకగురుఁ డీ యమనం
దనుఁ డేమేవురమును సీతనుమధ్య వివాహమయ్యెదమని పలికెడున్.

ఆది VII. 249.

లాట్లురుణ్ణు పరంబగునపుడు ఎదగాగమంబగును. 'ఎదము'నందలి దకారము ప్రత్యయమధ్యగత లఘువు గనుక ఊనికలేనిది. అది వడియందు నిల్చి గతిభంగకారి యగుచున్నది. ద్రౌపదిని పార్థుఁడు వివాహమాడునని యాశించిన ద్రుపదునకుఁ దామేవురును నామెను బెండ్లాడఁదలఁచినట్లు ధర్మజుఁడు ప్రకటింపఁగాఁ గలిగిన యాశాభంగము ఈ యతిభంగముచేఁ జక్కఁగా సూచింపఁబడినది. పరమధర్మపరుఁడని ప్రసిద్ధికెక్కిన ధర్మజుఁడు పల్కినపల్కు లోకవిరుద్ధమై ధర్మభంగకారి యగుచున్నదన్న ద్రుపదుని యంతర్గతభావమునుగూడ ఛందమందలి గతిభంగము వ్యక్తముచేయుచున్నది. ధర్మభంగములేనిచోఁ బాండవులేవురు ద్రౌపదిని వివాహమాడుట ద్రుపదున కనిష్టముకాదు. కనుకనే యిచ్చటి యతిభంగము నాత్యశ్రవ్యమై యున్నది.

యతియందు ధాతునామభేదము నిషిద్ధమైనను గ్వాచిత్కముగ నంగీకరింపఁబడినది. "ప్రత్యయాదౌ...క్వచిత్"[4] అని క్రియాపదమునకు ప్రత్యయాదిచ్ఛేద మంగీకరింపఁబడినది. స్వరసంధియందు ఉత్తరపదాదిస్వరమునకుఁ బూర్వాంతవద్భావ మంగీకరింపఁబడియుండుటచే (పూర్వాంతవత్స్వరస్సందౌ)[5] 'అయ్యెదము'నందు 'ద' ప్రత్యయాదిగా గ్రహింపఁదగియున్నది. కనుక అల్పమైన యూఁతగలదై పద్యమందలి యశ్రవ్యతను గొంతవఱకు తగ్గించుచున్నది.

ఏనును గర్ణుఁడు దమ్ములునా నలువురు వీరులైన నటుసూడు పృథా
సూనుల నెట్లు జయించెదనో నమ్మము నాబలంబును గలితనంబున్.

శల్య. I. 22.

'బలంబును' అను పదమందలి సముచ్చయార్థకమైన 'ను' వడియందు నిల్చి గతిభంగ మాపాదించుచున్నది. పదునాల్గవమాత్రమీఁద (దీర్ఘపాదమున) ఊఁత సర్వథా నిషిద్ధము. ఈ పద్యమందది పదారంభాక్షరమై యూఁతగలదై యున్నది. కనుక అశ్రవ్యత యతిశయముగా భాసించుచున్నది. దుర్యోధనుని యూరుభంగవృత్తాంతము విని విలపించుచు ధృతరాష్ట్రుఁడు యుద్ధారంభమున దుర్యోధనుఁడు తనతోఁ బలికిన ప్రగల్భవాక్యమును స్మరించుచున్నాఁడు. తన బలమును నేర్పును నమ్ముమని తండ్రికి నచ్చఁజెప్పుచున్న దుర్యోధనుని వాక్యమున యతిభంగము గండస్థానీయమై నెలకొనియుండుట చమత్కారముగనున్నది.

''తుచాదయో న ప్రయోక్తవ్యాః విచ్ఛేదా త్పరతః''[6] ''చాదయః ప్రాక్పదాంతవత్''[7] అను యతిరహస్యముల నిటస్మరింపవలెను. సప్తమగణము నలమగుటయుఁ, దదారంభమునఁ బ్రాక్పదాంతసమమైన సముచ్చయము నిలుచుటయు నత్యంతాశ్రవ్యతాహేతువు లగుచున్నవని గుర్తింపవలెను.

> అన నప్పలుకులు వెడవెడవిని యావిభుఁ డల్లఁ గన్నువిచ్చిన వదనం
> బునఁ జూడ్కి నిలిపి కలశజతనయుం డిట్లనియె గద్గదగళుండగుచున్.
>
> సౌప్తిక. I. 216.

చతుర్థపాదమున వడి పదాంతాక్షరమున నిల్చి గతిస్ఖలనము గలిగించుచు తొడలువిఱిగి పడియున్న రాజరాజునుగాంచి శోకావిష్టుఁడైన యశ్వత్థామ గళమునఁగలిగిన గాద్గద్యరూపస్ఖలనమును జక్కగాఁ బట్టిచూపుచున్నది.

కవిత్రయమువారి కందములందలి గతిభంగములు పెక్కుపట్టుల రసాదివ్యంజనముకొఱకు బుద్ధిపూర్వకముగఁ గావింపఁబడిన శిల్పవిశేషములగుట యీ విధముగ ననుశీలించి గ్రహింపవచ్చును.

## అలంకృతకందములు

కవిత్రయము పెక్కుకందములను ఛందోఽలంకారసుందరములుగా నిర్మించి వానివి రసాద్యర్థవిశేషసమర్పణమున వినియోగించియున్నారు. ఛందోఽలంకరణసమీక్షాసందర్భమున నలంకరణప్రకారములు వివేచింపఁబడియున్నవి. కందములందు వాని ననుశీలింపవలయును. అర్థసమర్పణమున కెంతవఱకవసరమో యంతవఱకే పద్యము నలంకరించుట కవిత్రయవిధానము. అతినిర్వహణము వారికి సమ్మతము కాదని గుర్తుంచుకొనవలయును.

ద్విప్రాసములు :

మకరవ్యూహంబనియెడు మకరాలయ మపుడు దర్పమహిమోజ్జ్వలుఁడై
మకరక్రీడం జండతమకరాభీలముగఁ జొచ్చె మారుతి యధిపా !

భీష్మ II. 278.

నిర్మింపఁబడినది మకరవ్యూహము. దానియందు మకరాలయారోపణము గావింపఁబడినది. దానిం జొచ్చు భీముని గమనము మకరక్రీడతో నుపమింపఁబడినది. అతఁ డద్దానిని జండతమకరాభీలంబుగాగఁ జొచ్చినాఁడు. ఇట్లీపద్యమున సర్వము మకరమయముగానున్నది. మకరశబ్దము సర్వపాదారంభములందును నిల్చి ద్విప్రాసమును రూపించుచు పద్యమందలి మకరమయమైన యర్థమును సమర్థించుచున్నది. వాచ్యాశ్రితములయిన రూపకోపమలకు వాచకాశ్రితమైన ద్విప్రాసము తోడై పద్యమును సుందరశిల్పముగాఁ దీర్చి వర్ణ్యాంశమునకు శోభాతిశయము నాపాదించుచున్నది.

పలుకులు వృథగా నన్నుంబలికితి మున్నింకనెన్ని పలుకవలసినం
బలుకుము నీకేఁ దెగ నాయలవుఁ జలము నీవెఱింగి తంతియచాలున్.

కర్ణ I 136.

నీవు వాచాలుఁడవు. నేను కార్యశీలిని అని కర్ణునియుద్దేశము. నకులుని వాచాలత్వము పాదత్రయారంభముల నావృత్తమైన 'పలుకు' అను ద్విప్రాసముచే వ్యంజింపఁబడుచున్నది. చతుర్థపాదమునం దా ద్విప్రాసము విరమింపఁబడి కర్ణుని వాచాలతావైముఖ్యమును ధ్వనించుచున్నది. అనతినిర్వహణముకూడ సప్రయోజనమే.

నేఁడీ బ్రాహ్మణుచేతం బోఁడిమిసెడి యేను జిక్కిపోవకయుండన్
వేఁడిమి మెఱయుశరంబుల వాఁడిమి సొంపెల్లఁ జూపవలయుంజుమ్మీ !

ద్రోణ. I. 232.

బ్రాహ్మణుండైన ద్రోణునిచేఁ బరాభూతమైన ధర్మజునియందలి క్షాత్రము పలుకుచున్నది. నాపోఁడిమి సెడకుండ నీవు నీవేఁడిమి మెఱయు శరముల వాఁడిమిని చూపవలయునని ప్రభువైన ధర్మజుఁడు సర్వసేనానియైన ధృష్టద్యుమ్ను నాదేశించుచున్నాఁడు. చుమ్మీ యనుమాటయందలి యాజ్ఞాదార్ఢ్యము పాదత్రయమందలి ద్విప్రాసముచే ధృఢతరముచేయఁబడుచున్నది. పద్యార్థము అలంకారముచే నుజ్జీవితమగుచున్నది.

ధరణీసురధనహరణముదుఁరితతమము: నృపున కధికదోషము; నృగగో
హరణమువలె విప్రస్వాహరణము భూపాలవరున కాపదఁదెచ్చున్.

అను. II. 440.

వ॥ అనియె; నివ్వాక్యంబు నీకుం జెప్పవలవ; దైన నితిహాసావసానవర్తి
యగుటంజేసి వినిపించితి.

ఆను. II. 441.

ధరణీసురధనహరణము దురితతమమనియు, నట్లుచేయవలదనియు ధర్మజున కుపదేశింపవలసిన యవసరములేదు. ఉపదేశప్రధానమైన యితిహాసముయొక్క యవసానమున నాయితిహాసమునకు సారభూతమైన నీతివాక్యము వినేయశిక్షార్థము వర్తించును. ధర్మజుఁడు వినీతుఁడు. అయినను నితిహాసావసానమున నవశ్యంభావియై వర్తించు నీతివాక్యమును సంప్రదాయానురోధముగ ఆయ నకుఁగూడ చెప్పవలసియేయున్నది. ఆ నీతి యిచ్చట నిషేధరూపమై యపథ్యమైనది కనుక దానిని ''నిర్భరమధురతాతిహృద్యాక్షరంబు'' (439 పద్యము) గావించుట వాక్యనైపుణ్యలక్షణము. శ్రోతయైన ధర్మజునిచిత్తము అపథ్యమైన నీతివాక్యముయొక్క అర్థమునందుకంటె శబ్దమునందే అతిశయముగ రమింపవలెనని వక్తయైన భీష్ముని యాశయము. కనుక నీతివాక్యము నాయన 'నిర్భరమధురతాతిహృద్యాక్షరంబుగా' నిర్మించెను.

నాచే నీ ప్రాణంబులు నీచే నా జీవితంబు నిజమున్నవి; యి
న్నీచత యవకార్యము రాజోచిత కర్మకృతనిశ్చయుఁడ వగుమున్నృపా!

శల్య. II. 77.

దుర్యోధనుఁడు మడుపు వెడలివచ్చి యుద్ధమున కాయత్తుఁడగునట్లు ప్రేరేచుటకై యుద్దేశింపఁబడిన యీ వాక్యము ధర్మజునిచే బుద్ధిపూర్వకముగ నలంకృతమైనది. 'నాచే నీ' 'నీచే నా' యన్న యక్షరసంపుటులు నేనా, నీవా యన్నట్లు స్పర్థించుచు వాక్యార్థమును సమర్థించుచున్నవి. ఉత్తరార్ధమునందలి ద్విప్రాసముఁగూడ వాక్యార్థమున కుద్దీప్తిగలిగించుచు వాక్యార్థసామంజస్యము శ్రోతచిత్తమున కెక్కునట్లుచేయుచున్నది.

శ్రీనాథమూర్తి విబుధనిధాన మహాదానతర్పితద్విజవర వే
గీనాథ పార్థనిభ యభిమానమహార్ణవ మహేంద్రమహిమాతిశయా!

ఆది. V. 1.

'శ్రీనాథ' 'వేగీనాథ' పదములు రాజనరేంద్రుని యైశ్వర్యప్రాభవముల తౌల్యమును వ్యంజించు చున్నవి. 'విబుధనిధాన మహాదాన' 'అభిమానమహార్ణవ' అను పదములచేతఁ గల్పింపఁబడిన ద్విప్రాసము ఆయన యైశ్వర్యప్రాభవముల ఫలముల తౌల్యమును వ్యంజించుచున్నది. సదృశాక్షరావృత్తిచే సుందరమైన పద్యము నన్నయ ప్రభుప్రీతిని చక్కగా వ్యక్తముచేయుచున్నది.

ఇమ్మెయి వేగినఁ బాండవులెమ్మెయిఁ గార్యంబునడపి రెఱిఁగింపుము: చి
త్తమ్ము గలంగెడు సంజయ నమ్మితి నగ్గురుఁడు గాచెనా మిమ్మెల్లన్?

ద్రోణ. III. 4.

'ఇమ్మెయి'నన్న పూర్వవృత్తాంతావధారణము ననంతరము సహజముగ నుత్పన్నమైన 'ఎమ్మెయి' యను ప్రశ్నము ఉత్తరకథాశ్రవణ కౌతూహలవ్యంజకమై పాదారంభమున నిల్చి ధృతరాష్ట్రుని తదేకపరత్వమును జాటిచెప్పుచున్నది. 'చిత్తము గలంగెడు' 'కాచెనా' యను ధృతరాష్ట్రుని చిత్తక్షోభము, ఆతురత యీ ద్విప్రాసప్రతిష్ఠకు నైసర్గికహేతువులై యలంకారమును సార్థకము చేయుచున్నవి.

> పొలియించితి నే గుల్మంబులఁ దేరుల కుటికి యింక భూరిరయమునన్
> బొలియింపవలయుఁ బ్రాణంబులు డాఁచిన వళమె పాండుపుత్రుల
> గెలువన్.
>
> శల్య. I 344.

పదివేలగుల్మములతోఁ బాండవసేనపై కరిగి వందగుల్మములతోఁ దిరిగివచ్చి "పొలియించితి నే గుల్మంబుల' నని దుర్యోధనునితోఁ బలుకుచున్న శకునియొక్క వాక్యమునఁ గౌటిల్యమున్నది. తృతీయపాదమునం దావృత్తమైన పొలియింపవలయు నన్న క్రియ ద్విప్రాసమును రూపించుచుఁ దేరులనుగూడ నాశనముచేసిరాఁదలఁచినాఁడని వ్యక్తమగుచున్నది.

> గెలువుము శల్యుని నీ వనిపలికి ముకుందుండు నన్నుఁ బనిచినఁ వాడ
> ప్పలుకులకు నసత్యత్వముగలుగఁగ నేర్చునొకొ దైవఘటనబలమునన్
>
> శల్య. I. 263.

'గెలువుము శల్యుని నీవు' అనిన శ్రీకృష్ణుని పలుకు వేదము. దాని ననుష్ఠించి దాని యవితథత్వమును స్థాపించుట ధర్మనిత్యుఁడైన ధర్మజుని యాశయము. 'పలుకు' అన్న పదము పాదారంభములం దావృత్తమై విధిచోదనము ననుష్ఠించుటయందలి ధర్మజుని తాత్పర్యమును వ్యక్తము చేయుచున్నది.

> పర్వి సభాప్రభృతిగ నవపర్వములను విస్తరిల్లి పండితచేతో
> నిర్వృతిఁ జేయుచు రెండవపర్వము నా రమ్యమగు సభాపర్వ మిలన్
>
> ఆది. I. 38.

రసాద్యర్థప్రసంగములేని యిట్టిపట్టులందు వాక్యమును శ్రవ్యతరము గావించుటయే ఛందోఽలంకారమునకుఁ బరమార్థము. ఇట్టిపట్లఁ బ్రాసమువలె ద్విప్రాసముగూడ కేవలశ్రవ్యతయందే విశ్రమించును.

> క్షోణీవల్లభ వినుమేఁ బ్రాణముతో నుండ నిన్నుఁ బట్టికొనఁగ నా
> ద్రోణునకకాదు సగణస్థాణునకైనను వశంబె తలఁకేమిటికిన్
>
> ద్రోణ. I. 120.

ప్రతిజ్ఞావాక్యమునఁ బ్రధానభాగము ద్విప్రాసఘటితమై వక్తయొక్క దీక్షాదార్ఢ్యమును నిరూపించు చున్నది. ఇది లోకగోచరమైన యర్థము.

అంత్యప్రాసములు :

అంత్యప్రాసాలంకృతములైన కందములను నన్నయయు, నెన్నయయు నిర్మించియుండలేదు. తిక్కన ప్రత్యేకాభినివేశముతో హరిహరనాథస్తుత్యాత్మకములయిన యాశ్వాసాద్యంతకందము లలోఁ బెక్కింటిని చిత్రవిచిత్రముగ నలంకరించెను ఆయనకు సర్వపాదాంతగతమైన యంత్య ప్రాసమునందుకంటె పూర్వోత్తరపాదద్వయభిన్నమైనదానియందే మక్కువ యెక్కుడని తోఁచు చున్నది.

పరమప్రేమాస్పదమైన వ్యక్తిని సంబోధించునప్పుడు వాక్కు సమలంకృతమై శ్రోతృ చిత్తాపహారిణి యగునట్లుండుట లోకమున బ్రసిద్ధమైయున్నది. తిక్కన్నయుఁ దన యిష్టదైవ మైన హరిహరనాథుని సంబోధించుటయందే స్వామిచిత్తమును హరించు నాశయముతో సంబోధ నాంతముల నలంకరించెను.

కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం ?

అను తన యనలంకృతశ్లోకమునకే మెచ్చిన యాదేవుని చక్కగా సమలంకరించిన పద్యములతో మఱింత యలరింపవలెనని తిక్కన యాశయముకాఁబోలు. ఒక్కొక్క యాశ్వాస మారంభించు నప్పుడు తదాశ్వాససమ్యఙ్నిర్వహణమునకుఁ దోడుపడుననియు, సమ్యఙ్నిర్వ్యూఢమైన యాశ్వా సమునంతమునఁ దన్నిర్వహణమునకుఁ దోడ్పడెననియుఁ దిక్కన యాస్వామిని భక్త్యావేశమునఁ గీర్తించువేళ ఆయనవాక్యములు తమంతటతామేయలంకృతములై యావిర్భవించెనా యనిపించును.

తాను దలపెట్టిన వాఙ్మయమహాధ్వరము ఒక్కొక్క మెట్టు ముందునకు జరుగుచున్నకొలం దియుఁ దిక్కన సోమయాజి యానందభరితుఁడగుచుఁ బరమేశ్వరసంకీర్తనారూపములయిన పద్య ములను చిత్రచిత్రముగ నలంకరింపసాగెను. సదృశస్వరవ్యంజనసంపుటులు అంతమందుగల సంబోధనలు సంకీర్తనమున వక్త వాగింద్రియమునకును, శ్రోత శ్రోత్రేంద్రియమునకును నల్ప మైన విశ్రాంతిని గలిగించును, చిత్తమున కేకాగ్రతను బ్రసాదించును. ఛందముయొక్క యాహ్లాద కతారూపమైన ధర్మమును దిక్కన స్వామి సంబోధనలందు యథాశక్తి నిర్వహించి ఛందోమయ వాక్యమునకుఁగూడ చారితార్థ్యము గల్పించెను.

వాచ్యవాచకనిష్ఠమైన సౌందర్యము పరాకాష్ఠనందిన సోమయాజి హరిహరార్చనాచ్ఛందములు ఆంధ్రమున బుక్చ్ఛద్దివాచ్యములు. అర్థము, శబ్దము నీవా నేనా యని పందెములు చఱచికొన్నట్లు అందము లొలుకఁబోయు సోమయాజి హరిహరస్తుతులు సంకీర్తనాపరులకు గాయత్రములయిన మంత్రములు.

శబ్దాలంకారములయిన యంత్యానుప్రాసములుగల కందముల కిచ్చట ప్రసక్తి లేదు గనుక ఛందోఽలంకారములయిన యంత్యప్రాసములుగల కందములే దిఙ్మాత్ర ముదాహరింపఁబడు చున్నవి.

1. దీర్ఘ పాదముల యంతములందు :

అంతఃకరణచతుష్టయ శాంతిసముద్యద్వివేకసంపద్వోద్యా !
చింతాతంతుత్రుటనాత్యంతవిదగ్ధైకభజన తత్పరహృద్యా !

విరా. IV. 276.

2. ఉత్తరపాదద్వయాంతములందు :

హృదయసరసిరుహమధుపాస్పదవిహృతివిశేష నిహతపాపోన్మేషా !
వదనసముత్థితవేదా ! మదవదసురహరణకరణ మంత్రవివినోదా !

ద్రోణ. II. 382.

3. పూర్వపాదద్వయాంతములందు :

ఆశ్చర్యకరణకరుణా ! నిశ్చలశుచిహృదయభావనీయవిహరణా !
పశ్చిమనాడీసరణపురశ్చరణధ్యేయ ! భక్తరమణవిధేయా !

శల్య. I. 404.

4. పూర్వోత్తరపాదద్వయభిన్నము :

సురనికరానందకరా ! సురారికాంతావిలాస శోభాపహరా !
కరుణాసక్తమనస్కా ! సరిద్వరాబర్హిబర్హ చారుశిరస్కా !

సౌప్తిక. II. 135.

## సూచికలు :

1. పింగళచ్ఛందశ్శాస్త్రము : 6 — 1 (హలాయుధవ్యాఖ్య)
2. Ibid : .. (టీక)
3 బాలవ్యాకరణము : ,, క్రియా — 23
4. పింగళచ్ఛందశ్శాస్త్రము : 6 — 1 (టీక)
5. Ibid : .. (హలాయుధవ్యాఖ్య)
6. Ibid : .. (టీక)
7. Ibid : ,, (హలాయుధవ్యాఖ్య)
8. భారతము : విరాట : I — 11

# సీసము

అనియతాక్షరమాత్రాసంఖ్యాకమైన సీసము శుద్ధదేశీయచ్ఛందము. సీసము, తత్సజాతీయములగు ఆటవెలఁది, తేటగీతము ఉపజాతు లనఁబడుచున్నవి. వీని నిర్మాణమునం దుపయుక్తములగునవి ఉపగణములందలి సూర్యేంద్రగణములు. గురులఘ్వక్షర నివేశక్రమరాహిత్యమువల్ల ఈ పద్యముల నిర్మాణమునఁ గవికి అపారమైన స్వేచ్ఛకలదు.

"అనియతగణైః ప్రాసో వా యతిర్వా"[1]

యని దేశీయచ్ఛందస్సామాన్యలక్షణము. సీసము, ఆటవెలఁది, తేటగీతి యీ లక్షణము ననువర్తించును. ప్రాసనియమముగల ద్విపదయు, దానికి రెట్టింపైన తరువోజయు దేశీయజాతులనఁబడినవి.

ఆఱింద్రగణములపై రెండు సూర్యగణములు చేరి యేర్పడిన పాదములు నాల్గింటినికూర్చి యామీఁద ఒక ఆటవెలఁదినో, తేటగీతినో చేర్చినచో సీసపద్యము ఏర్పడును. స్వీయపాదములు నాల్గింటిపై గీతిపాదములు నాల్గు చేరఁగా నేర్పడిన సీసపద్యము నిజమునకు పద్యద్వయసమాహారమేకాని యేకపద్యముకాదు. విస్తృతమైన విషయమును ఏకాన్వయముగాఁ బ్రతిపాదించుటకై సీసపద్యము కల్పింపఁబడియుండును. మఱియొకతీరునఁ జూచినచో విశిష్టగణవిన్యాసముగల మూఁడు ఆటవెలఁదులు గలిసి సీసపద్యమైనదనియుఁ జెప్పవచ్చును. ఎనిమిది ద్విపదచగణములు తరువోజయైనట్లు పంద్రెండు ఆటవెలఁది పాదములు సీసపద్యమైనవని యూహింప నవకాశమున్నది. ఆంధ్రదేశ్యపద్యము లన్నింటికంటె విస్తృతమైనది సీసము.

తెలుఁగుసీసము సంస్కృత శీర్షకభవమన్న యభిప్రాయమున్నది. శీర్షకపదము నాట్యశాస్త్రమున (32 అధ్యాయము) భరతమహర్షిచే నుపయోగింపఁబడినది. ఆయన శీర్షకమును వేర్వేఱర్థములం దుపయోగించెను.

(అ) శీర్షకము పదునెనిమిది ధ్రువాంగములలో నొకటి.

(ఇ) శీర్షకము ఒక ధ్రువాభేదము.

పాదమున నాల్గుమాత్రలగణములు 7½ ఉండును. అనఁగా పాదమునకు 30 మాత్రలు. పాదమునందు 21 మొదలు 26 వఱకు అక్షరములుండును. చపలాశీర్షకము, స్ఖలితశీర్షకము అని శీర్షకములు రెండువిధములు. స్ఖలితశీర్షకము సంకృతిచ్ఛందమునందలిది. పాదమునకు 24 అక్షరములు. 1, 4, 7, 10, 11, 24 అక్షరములు గురువులు. తక్కినవి లఘువులు.

(ఉ) శీర్షకము భంగ్యంతరమునఁ జేయఁబడిన మఱియొక ధ్రువాభేదము. శిరఃస్థానమున అనఁగా తారస్వరమున గానముచేయఁబడు నొకవిధమైన ధ్రువకు శీర్షకమనిపేరు.

నానావృత్తవినిష్పన్నములగు పాదములతో శీర్షకములను నిర్మింపవచ్చునని భరతముని చెప్పెను. (32 అధ్యాయము) శీర్షకమను తాళభేదము ననుసరించి కూర్పఁబడిన గీతమును భరతముని శీర్షకనామమున వ్యవహరించియుండునని కొందఱి యూహ. ఎట్లయినను, భరతుని శీర్షకమునకు ఆంధ్రుల సీసమునకు నెట్టిసంబంధము లేదని చెప్పవలసియున్నది.

ఆంధ్రసీసమునందు పాదమున 30 మాత్రలుండుట సంభవమేయైనను 21 అక్షరములుండుట అసంభవము. సీసపాదమున 22 అక్షరములకు తక్కువ యుండుటకు వీలులేదు.

శీర్షకమను పద్యభేదమును గూర్చి మొట్టమొదటఁ బ్రసంగిన ఛాందసికుఁడు జనాశ్రయుఁడు. అతఁడు చెప్పిన శీర్షకలక్షణమునకు తెలుఁగు సీసపద్యలక్షణమునకు సంబంధము కనిపించదు.

పాదమున నాలుగు లేక ఐదు మాత్రలగణములు ఆఱు కలది అధికాక్షర. ఇందు సమస్థానముల జగణముండరాదు. తృతీయస్థానమున జగణమే ఉండవలెను. పాదాంతమున నగము గాని, రగణముగాని ఉండవలెను. నగ ర గణములు ఒకప్పుడు పాదాదియందును ఉండవచ్చును. ఇట్టి యధికాక్షరపై ఒకగీతికను చేర్చినచో శీర్షకమేర్పడును. లలిత, సుభద్ర, రవిద్రుమ, వంశపత్ర, కుంజర, వంశపుష్ప దంతమూలలు శీర్షకభేదములు. పాదమున కేడుగణములుగలది లలితశీర్షకము, ఒక్కొక్కగణము పెరుగుటచే భద్రాదిశీర్షకము లేర్పడును. శీర్షకమందలి గీతిక ఆర్యాభేదమే. శీర్షకము నిర్ధాయికామధ్యమైనచో త్రికలయమనఁబడును. అనఁగా అధికాక్షరకు గీతికకు మధ్య నిర్ధాయికయను పద్యమును చేర్చినచో మొత్తము మూఁడునుగలిసి త్రికలయమను పద్యమగును.[2]

జనాశ్రయుని శీర్షకమునకు ఆంధ్రసీసమునకు లక్షణమునం దెట్టిసామ్యమునులేదు. తెలుఁగు సీసమున జగణము నిషిద్ధము. సీసపాదాంతమున నగ రగణము లెన్నఁడును సంభవింపవు.

కర్ణాటలాక్షణికుఁడు నాగవర్మ తన ఛందోఽంబుధియందు సీసపద్యమును రఘటాభేదముగాఁ జెప్పినాఁడు. 5 మాత్రల గణములు ఆఱును, 3 మాత్రల గణములు రెండును కలిసి ఏర్పడినపాదములు నాల్గింటిమీద ఒక ఆటగీతి చేరినచో సీసపద్యమగును. ఆటగీతియనఁగా ప్రాసనియమముగల ఆటవెలఁదియే. నాగవర్మచెప్పిన సీసమునకు ప్రాసనియమము కలదు. నాగవర్మ లక్షణమునుబట్టి సీసపాదములందు నాల్గుమాత్రల గణము లుండుటకు వీలులేదు. ఐదు మాత్రలగణము లెట్టివైనను ఉండవచ్చును. సీసపాదములపై ఆటవెలఁదినే చేర్చవలెను. తేటగీతిని చేర్చరాదు, అనఁగా ఒకతీరు పాదములు నాల్గుకూర్చి ఆమీఁద ఇంచుమించు అట్టివేయైన

పాదములు మఱిరెండు చేర్చవలెనన్నమాట. ఇట్టియాచారము ఉదాహరణములందు కనఁబడు చున్నది. ఒక కళికమీఁద ఒకయుత్కళికను చేర్చుట ఉదాహరణ లక్షణము. కళిక యనఁగా రగడ, ఉత్కలిక అర్ధరగడ. ఇట్టిసంప్రదాయము ననుసరించియే తెలుఁగున సీసపాదములపై ఆటవెలఁదిని చేర్చు ఆచారము తొలుత పుట్టియుండును. ఎట్లయినను నాగవర్మ చెప్పిన సీసము నకు ఆంధ్రసీసమునకు సంబంధము చాలతక్కువ.

జనాశ్రయుని ఛందమును చూచియే తాను ఛందోఽనుశాసనము రచించితినని చెప్పికొన్న జయకీర్తి కర్ణాటజాత్యధికారమున —

"సంస్కృతవాచ్యార్యాద్యాః
ప్రాకృతవిషయే తు గళితకాద్యాః బహుధా
కర్ణాటకే ఽక్షరాద్యాః
విషయే......శీర్షకాదిజాతయ ఉదితాః"

అని శీర్షకమును జాతిగాఁ బేర్కొనెను. జయకీర్తి 11 వ శతాబ్దినాఁటి కర్ణాటజైనపండి తుఁడు. కర్ణాటాంధ్రములందు నాఁడు ప్రసిద్ధిగన్న అక్షరాచ్ఛందములను అతఁడు ప్రసంగించెను. సంస్కృతమున ఆర్యాదులు, ప్రాకృతమున గళితకాదులు, కర్ణాటకమున అక్షరాదులు జాతులఁట. లక్షణపద్యమున నాల్గవపాదమున నక్షరలోపమున్నది. "విషయేఽంధ్రే" అన్నచో అక్షరపూర్తి యగును. అప్పుడు ఆంధ్రవిషయమున శీర్షకాదులు జాతులని యర్థమువచ్చును. 11 వ శతాబ్ది నాటివాఁడే యగు రేచన సీసగీతాదులను జాత్యధికారమందే చెప్పెను.

"ఉపగణమాత్రాభి రన్వితా జాతిః"[3] అను న్యాయమున సూర్యేంద్రగణనిర్మితమైన సీస మును జాతియన్నను దోసములేదు. ప్రాసముండుట జాతిలక్షణముగా ఆంధ్రచ్ఛాందసికులు పేర్కొ నిరి. తెలుఁగున సీసగీతాదులకు ప్రాసము నియతముకాదు. కనుక ఇవి యుపజాతులనఁబడినవి. ప్రాసముండుట, లేకుండుట మాత్రమే జాతికి, ఉపజాతికి భేదమైనచో నన్నయ్యరచించిన సర్వ ప్రాస, వృత్తప్రాస సీసములు జాతులే యనవలసియుండును.

జనాశ్రయుని యభిప్రాయమునుబట్టి చూచినచో శీర్షకమను నామకరణమునకుఁ గారణము ఊహింపవీలగును ఒకవిధమైన లక్షణముగల పద్యముపై వేఱొకవిధమైన లక్షణముగల పద్య మును చేర్చినచో రెండునుగలిసి శీర్షకమను పద్యభేదమేర్పడును. రెండవపద్యము మొదటిపద్య మునకు శిరోభూషణమువలె నుండును. కనుక మొత్తముపద్యమును శీర్షకమని వ్యవహరింప వచ్చును. శీర్షకమునకు వికృతి సీసకము.

"సీసకంబులు కత్తళంబులు" (శల్య. II. 250) "వాని శీర్షకంబు" (అశ్వ. IV. 118) అని తిక్కన ప్రయోగములు కలవు.

అనంతామాత్యుఁడు సమసీసమునుగుఱించి జెప్పుచు నిట్లు చమత్కరించెను—

"ఒప్పునను చుఁ బొసఁగఁ జెప్పిన సీసంబు
పసిఁడియగు ధరిత్రిఁ బద్మనాభ"[4]

ఇట్లనుటవల్ల సీసము అను పదమునకు ఆ పేరుగల లోహమర్థమనియు, సుందరముగ నిర్మింపఁబడినచో సీసమే పసిఁడియగుననియు అనంతుని యభిప్రాయముగా గ్రహింపవలసియున్నది. లోహనామముననుసరించి సీసపద్యమునకు నామకరణము చేయఁబడినదనుట సమంజసముగాఁ గనిపింపదు.

అధికాక్షర, నిర్ధాయిక, గీతిక – ఈ మూఁడును కలిసి యేకపద్యముగానేర్పడి "త్రికలయము" అనఁబడునని జనాశ్రయుఁడు చెప్పెఁగదా! సదృశలక్షణములుగల భిన్నపద్యముల సంధానముచేత విస్తృతములయిన పద్యాంతరములను సృష్టింపవచ్చునని జనాశ్రయుని లక్షణమువల్ల గ్రహింపనగుచున్నది భిన్నచ్ఛందములందుఁ బుట్టియు లక్షణసాదృశ్యము కొంతకలిగిన వృత్తపాదములను సంధించి నానావిధములయిన యుపజాతులను నిర్మించుట సంస్కృతమున ప్రసిద్ధమైన యాచారమే. ఇట్టి పాదసాంకర్యము యథార్థమున వేదములందే యున్నది

పద్యముపై పద్యముచేర్చుట యను పద్ధతి ననుసరించి ఉత్సాహముమీఁద గీతిని చేర్చినను శీర్షకము ఏర్పడును. అట్టిది విషమసీసమని లాక్షణికులు వ్యవహరించిరి మాత్రాసమకములగు సూర్యగణములతో నిర్మింపఁబడిన యుత్సాహముమీఁద విషమమాత్రాకములయిన సూర్యేంద్ర గణములతో నిర్మింపఁబడిన గీతిని చేర్పఁగా నేర్పడిన పద్యమునందలి గతి కొంతవిషమముగ నుండును. ఉత్సాహమున త్ర్యస్రమైనగతి గీతియందు భంగమై పద్యము అశ్రవ్యమగును. మొందెము, శిరముకూడ సూర్యేంద్రగణములతోడనే నిర్మితములయినచో వాని సమ్మేళనమున నేర్పడిన శీర్షకము సమగతిగలది యగును. అట్టిదానిని లాక్షణికులు సమసీసమని వ్యవహరించిరి. సమసీసమే గతిసాదృశ్యమున శ్రవ్యముగనుక విశేషప్రచారమునందినది. విశేషించి సీసపాదములమీఁద ఆటవెలఁదిపాదములు చేరినచో పద్యమందంతట అతిశయమైన గతిసామ్యము సిద్ధించును. కన్నడమునను, తొలినాళ్ళ ఆంధ్రమునను నిదియే ఆచారమైయుండును. తరువాత అర్థప్రతిపాదనపై చిత్రికొఱకు గీతియందు కొంచెము గతిభేదము గోచరించుట చమత్కారహేతువై ఆటవెలఁది స్థానమున తేటగీతినుంచు ఆచారమేర్పడియుండును. కన్నడమున సీసపాదములమీఁద ఆటగీతియే ఉండవలెనని నియమము. ఆంధ్రమున విషమసీసవిషయమున ఉత్సాహముమీఁద ఆటవెలఁదియే ఉండవలెనని అనంతామాత్య, చిత్రకవిపెద్దనాదుల విషమసీసలక్ష్యములవలన ఊహింపఁదగియున్నది. సమసీసములందును నన్నయ్యనాఁడు ఆటవెలఁది ప్రయోగమే సర్వసాధారణమైనట్లు ఆయన సీసములే స్పష్టముచేయుచున్నవి. ఎత్తుగీతివిషయమున కవిత్రయ ప్రయోగము ఇట్లున్నది —

| | ఆటవెలఁది | తేటగీతి | మొత్తము |
|---|---|---|---|
| నన్నయ | 225 | 26 | 251 |
| ఎఱ్ఱన | 62 | 40 | 102 |
| తిక్కన | 369 | 783 | 1152 |

కవిత్రయసీసములందు ఆటవెలఁది, తేటగీతి నిష్పత్తి.

| | | | |
|---|---|---|---|
| నన్నయ | 9 | : | 1 |
| ఎఱ్ఱన | 6 | : | 4 |
| తిక్కన | 1 | : | 2 |

కవిత్రయమువారి ఆటవెలఁది యభిమాననిష్పత్తి.

| | | | | |
|---|---|---|---|---|
| నన్నయ | — | ఎఱ్ఱన | — | తిక్కన |
| 18 | : | 3 | : | 1 |

నన్నయ సీసమున గతిసామ్యము నెంతయభిమానించెనో తిక్కన్న గతివైషమ్యము నంత యభిమానించెనని గుర్తింపవచ్చును.

# సీసభేదములు

ఆంధ్రమహాభారతమునఁ బ్రయోగింపఁబడిన సీసములన్నియు సమసీసములే. సమసీసములందును సర్వలఘుసీసము, గురులఘుమిశ్రసీసము ననుభేదములు లాక్షణికులందఱును గుర్తించిరి. భారతకవులు ప్రయోగించిన సీసములన్నియు గురులఘుమిశ్రసీసములే. వీనియందును యతిప్రాసవిన్యాసభేదములచేఁ గొన్నిభేదములు ఏర్పడుట లాక్షణికులు గుర్తించి నామలక్షణములు నిర్దేశించిరి. విషమసీసము, సర్వలఘుసీసము కాక లాక్షణికులు పేర్కొన్న సీసభేదములు—

రేచన :

ప్రాససీసము, అక్కిలిప్రాససీసము, అవకలిసీసము, వడిసీసము, అక్కిలివడిసీసము.

విన్నకోట పెద్దన :

ప్రాససీసము, అక్కిలిప్రాససీసము, అవకలిసీసము, అక్కిలివడిసీసము.

అనంతుఁడు :

సమప్రాససీసము, అక్కిలిప్రాససీసము, అవకలిప్రాససీసము, వృత్తప్రాససీసము, సర్వతఃప్రాససీసము, వడిసీసము, అక్కిలివడిసీసము.

చిత్రకవి పెద్దన :

సమప్రాససీసము, అక్కిలిప్రాససీసము, వృత్తప్రాససీసము, సర్వతఃప్రాససీసము, వడి సీసము, అవకలివడిసీసము.

అప్పకవి :

అక్కిలిప్రాససీసము, వృత్తప్రాససీసము, సర్వతఃప్రాససీసము, వడిసీసము, అవకలి వడిసీసము.

కస్తూరి రంగకవి :

అవకలిప్రాససీసము, వృత్తప్రాససీసము, సర్వతఃప్రాససీసము, సర్వవడిసీసము, అవకలివడిసీసము, అర్ధసమప్రాససీసము, అవకలిసమసీసము, సమనామప్రాససీసము, ఉత్సాహ వేదండము, గీతరహిత చతుష్ప్రాససీసము.

సీసపద్యభేదములను పేర్కొనుటలో ఈ లాక్షణికులందఱును అక్కిలి, అవకలి యను రెండుమాటలను వాడియున్నారు. ఒకలాక్షణికుఁడు అక్కిలి యన్నదానిని ఇంకొకఁడు అవకలి యని యుండుటయు వారి లక్ష్యలక్షణముల పరిశీలనవల్ల గుర్తింపనగుచున్నది. ఈ పదముల యర్థమేమో ఛందోలక్షణవిమర్శకులెవ్వరు వివరింప యత్నించినట్లు కనఁబడదు. ఆదిలాక్షణికుఁడైన రేచన ప్రయోగవైఖరినిబట్టి వీని యర్థములు ఊహింపవీలగుచున్నది.

1. అవకలిసీసము.　　2. ప్రాససీసము.
3. అక్కిలిప్రాససీసము.　　4. వడిసీసము.
5. అక్కిలివడిసీసము.

అని రేచన ఐదువిధములైన సమసీసములను పేర్కొనెను. కాని లక్ష్యములు మూఁడింటికే చూపెను. ఆయన యిచ్చిన లక్ష్యములనుఁబట్టి గ్రహింపఁదగిన యంశములు —

1. అవకలి సీసము :

సర్వదళములందును భిన్నాక్షరములతోడి ప్రాసయతులు ఉండును.

2. ప్రాస సీసము :

సీసపూర్వదళములందును గీతిసర్వదళములందును ప్రాసముండును. సర్వదళములందును సాధారణయతియే యుండును.

3. అక్కిలి వడిసీసము :

సర్వదళములందును సాధారణయతిమైత్రియే ఉండును. ప్రాసముగాని ప్రాసయతిగాని ఉండవు. సీసపాదములందు ఒక్కొక్కపాదమున దళద్వయమునందు ఏకయతిమైత్రి యుండును.

గమనిక : ముద్రితప్రతియందిది అవకలివడిసీసమని యున్నది. కాని రేచనచెప్పిన భేదములలో అక్కలివడిసీసమున్నదిగాని అవకలివడిసీసము లేదు. కనుక దీనిని అక్కలివడి సీసమనుటయే యుచితము.

యతి, ప్రాస, ప్రాసయతి యను మూఁడువిశేషములకు రేచన మూఁడులక్ష్యములు చూపె నని దీనివల్ల గ్రహింపవీలగుచున్నది.

1. అవకలి సీసము — ప్రాసయతి ప్రధానము
2. ప్రాస సీసము — ప్రాస ప్రధానము
3. అక్కలివడి సీసము — యతి ప్రధానము.

అని రేచనయుద్దేశముగాఁ దోఁచుచున్నది. అక్కలివడిసీసమును అక్కలిసీసమనిగాని వడి సీసమనిగాని పేర్కొనవచ్చును. రేచన లక్ష్యములనుబట్టి చూడఁగా అక్కలి యనఁగా ప్రథమా క్షరమైత్రి యనియు, అవకలి యనఁగా ద్వితీయాక్షరమైత్రి యనియు నూహింపవీలగు చున్నది. అప్పుడు రేచనయుద్దేశమున ఐదు సీసభేదముల నామములు, లక్షణములు నిట్లుండ వచ్చును—

1. అక్కలి సీసము (వడిసీసము)

సర్వదళములందు సాధారణయతిమైత్రియే యుండును.

2. అవకలి సీసము :

సర్వదళములందు ప్రాసయతిమైత్రియే యుండును.

3. ప్రాస సీసము :

సర్వదళములందు ప్రాసముండును. యతిమైత్రిగాని ప్రాసయతిమైత్రిగాని ఉండవచ్చును. ప్రాసనియమములేనిచో నిదియే సమసీసమగును.

4. అక్కలిప్రాస సీసము :

సర్వదళములందు సాధారణయతిమైత్రి యుండును. ప్రాసనియమముకూడ ఉండును.

5. అవకలిప్రాస సీసము :

సర్వదళములందు ప్రాసయతిమైత్రి యుండును. ప్రాసనియమముకూడ ఉండును.

అక్కలియనఁగా తమిళమందలి 'మోనై' వంటిదనియు, అవకలియనఁగా "ఎదుగై" వంటిదనియు గ్రహింపఁదగును.

రేచన సీసములందు భావించిన యైదుభేదములును మిక్కిలి సమంజసములై యున్నవి. అనంతరలాక్షణికులు యతి, ప్రాసము, ప్రాసయతి విన్యసించుటయందు కొన్నియవాంతరభేద

ములు కల్పించిరి వారికల్పనలకు ఆధారములు రేచనలక్ష్యములందు కొంతవఱకు లభ్యములగుచున్నవి.

సర్వయతిసీసమున యత్యక్షరమైత్రివిషయమున సర్వదళములందుఁగాని, కొన్నింటఁగాని ఐక్యము కల్పింపవచ్చును. తరువోజ, స్రగ్ధర మున్నగు బహుయతికపద్యములం దిట్టిలక్షణము నియతమైయున్నది.

సర్వప్రాసయతిసీసమున నిట్లే ప్రాసాక్షరమునం దైక్యము భిన్నవిధములఁ గల్పింపవచ్చును లయగ్రాహియందిది నియతమైయున్నది.

ప్రాసనియమము సర్వదళములందుఁగాని, కొన్నింటఁగాని పాటింపవచ్చును. తరువోజ పూర్వార్ధములందే ప్రాసముండును. ఉత్తరార్ధములందుండదు.

ఇట్టి యవాంతరభేదకల్పనమున పూర్వలాక్షణికులు సుస్పష్టమైన యొకమార్గము ననుసరించినట్లు కనఁబడదు. నామములందు సామ్యమున్నను లక్షణములందు వైషమ్యము తఱచుగాఁ గనఁబడుచున్నది. రెండేసిదళములం దేకయతిమైత్రిగలదానిని అనంతాదులు వడిసీసమనిరి. అప్పకవి వడిసీసమున కీనియమములేదు. అనంతుఁడు అక్కిలివడిసీసమన్నదానిని అప్పకవి వడిసీసమనెను. అవకలిప్రాససీసమని అనంతుఁడన్నదానిని అప్పకవి అవకలివడిసీసమనెను. వడిసీసములందలి యవాంతరభేదములను అప్పకవి చక్కగా గుర్తింపలేదనవలసియున్నది. రేచన చూపిన మార్గమున సీసభేదములను కల్పించుటయందు అనంతామాత్యునిపద్ధతియే కొంతవఱకు స్ఫుటముగ, సమంజసముగ నున్నది. సీసములు సప్తవిధములనియు, వానినే శబ్దశాసనాదికవీంద్రులు ప్రయోగించిరనియు అప్పకవి గొప్పగాఁజెప్పికొన్నమాట సత్యమునకుఁ జాలదూరము. నన్నయ ప్రయోగించిన సీసభేదములకు అప్పకవిచెప్పినవానికి సంబంధము చాలతక్కువ.

అనంతాదుల సీసభేదకల్పనము ప్రధానముగా ప్రాసవిన్యాసభేదము నాశ్రయించియున్నది. సీసమున ప్రాసవిన్యాసము పెక్కుతెఱఁగుల చేయవచ్చును అందు ముఖ్యమైనవి—

1. సీసపాదములు నాల్గింటి పూర్వదళములందుమాత్రమే ప్రాసముగలది.
   ఇది లాక్షణికుల వృత్తప్రాససీసము.

2. సీసగీతముల పూర్వదళము లాఱింటమాత్రమే ప్రాసముగలది.
   ఇది లాక్షణికుల సమప్రాససీసము.

3. సీసపాదముల సర్వదళములందుమాత్రమే ప్రాసముగలది.
   లాక్షణికులు దీనిని చెప్పలేదు. నన్నయరచనయం దున్నది. దీనిని దేశివృత్తప్రాససీస మనవచ్చును.

4. సీసగీతముల సర్వదళములందును ప్రాసముకలది.

ఇది లాక్షణికుల అక్కిలిప్రాససీసము. దీనిని సర్వప్రాససీసమనుట తగును.

5. గీతి సర్వపాదములందుమాత్రమే ప్రాసముగలది.

లాక్షణికులు దీనిని చెప్పలేదు. నన్నయరచనయం దున్నది. దీనిని గీతిప్రాససీస మనవచ్చును.

గమనిక : 3 వ భేదమున పూర్వోత్తరదళముల భిన్నప్రాసాక్షరము లుండవచ్చును, ఇట్టిది తిక్కన రచనయందున్నది. (విరా. II. 208.) 4 వభేదమైన సర్వప్రాససీసము సర్వప్రాసయతికముకూడ అయినచో లాక్షణికులుచెప్పిన సర్వతఃప్రాససీస మగును. 3 వ భేదమే ప్రాసయతికముగూడ ఐనచో దేశిసర్వతఃప్రాససీస మనవచ్చును. నన్నయ, తిక్కనల రచనలయం దిట్టిదికలదు.

యత్యక్షరవిన్యాస భేదములవల్లఁగూడ సీసభేదములు సాధింపఁదగియున్నవి. రేచన, అనంతుఁడు చూపిన ప్రాససీసలక్ష్యములందు రెండేసిదళములకు ఏకయతిమైత్రి యున్నది. ఇట్టి మైత్రి దళచతుష్టయమున, సర్వదళములందు సీసదళములందు గీతదళములందు పాటించి సీస భేదములు కల్పింపవచ్చును. అట్టి భేదములుకొన్ని కవిత్రయరచనలయందు కలవు.

నన్నయ రచనయందుఁగల సీసభేదముల నన్నింటిని నిరూపించుటకు పూర్వలాక్షణికులు కావించిన సీసభేదకల్పనము సమర్థముకాకున్నది. ఆయన సీసభేదములను నిశితముగఁ బరిశీలించి యా భేదములు ప్రాసయతి - యతివిన్యాస భేదమునాశ్రయించి యున్నదని యూహించి ఇటీవల డాక్టర్ గిడుగు సీతాపతిగారు ఒక ప్రణాళికను రూపొందించినారు. గీతిసహితమైన సీసపద్యమునకు దళములు పంౘెండు. సీసదళము లెనిమిది, గీతిదళములు నాలుగు - వీనిలో యుగ్మళములందుఁగాని, అయుగ్మళములందుఁగాని, సర్వదళములందుఁగాని ప్రాసయతినో, సాధారణయతినో వాడవచ్చును. అట్లు వాడుటవల్ల ఏర్పడఁగల భేదములు పదునాఱు. నన్నయ ఇట్టిప్రణాళిక ననుసరించి సీసభేదములు కల్పించుకొని వానిని నియతముగా పాటించెను. ఈ దృష్టితో సీతాపతిగారు నన్నయ సీసభేదములను నిరూపించు షోడశసీసచక్రమును సిద్ధపఱిచి యప్పకవీయపీఠిక యందు ప్రదర్శించిరి. (పుట. 55)

# షోడశసీసచక్రము

| | 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|---|
| సీసము<br>గీతి | యతి<br>యతి | యతి<br>ప్రాసయతి | యతి<br>యతి_ప్రాసయతి | యతి<br>ప్రాసయతి_యతి |
| | **5** | **6** | **7** | **8** |
| సీసము<br>గీతి | ప్రాసయతి<br>యతి | ప్రాసయతి<br>ప్రాసయతి | ప్రాసయతి<br>యతి_ప్రాసయతి | ప్రాసయతి<br>ప్రాసయతి_యతి |
| | **9** | **10** | **11** | **12** |
| సీసము<br>గీతి | యతి - ప్రాసయతి<br>యతి | యతి - ప్రాసయతి<br>ప్రాసయతి | యతి - ప్రాస<br>యతి_ప్రాసయతి | యతి - ప్రాసయతి<br>ప్రాసయతి_యతి |
| | **13** | **14** | **15** | **16** |
| సీసము<br>గీతి | ప్రాసయతి - యతి<br>యతి | ప్రాసయతి - యతి<br>ప్రాసయతి | ప్రాసయతి - యతి<br>యతి_ప్రాసయతి | ప్రాసయతి - యతి<br>ప్రాసయతి_యతి |

యతి – ప్రాసయతి యన్న సూచనకు పూర్వదళములందు (అయుగ్దళములందు) సాధారణ యతి, ఉత్తరదళములందు (యుగ్దళములందు) ప్రాసయతి యుండునని యర్థము.

యతిస్థానమున పాదప్రథమాక్షరమునకు మిత్రమైన యక్షరమునుంచుట సాధారణయతి యనియు, యత్యనంతరస్థానమున పాదద్వితీయాక్షరమును ఆవృత్తముచేయుట ప్రాసయతియనియు గుర్తుంచుకొనవలెను. పాదమనఁగా నచ్చట దళమని యర్థము.

ప్రాసయతియొక్క యథార్థస్వరూపమును నిష్కర్షచేయుపద్యమును లక్షణచూడామణియం దలిదని లింగమగుంట తిమ్మన యుదాహరించెను.

తే. గీ. పాకశాసనసుతుఁడు లోకైకవీరుఁ
డనఁగఁ దగుఁ బ్రాసవిరతు లిట్లలరునేని
జారుతరహాసకీర్తిప్రచారుఁ డనఁగఁ
బ్రాసయతికాదు; వర్గువు, పంకజాక్ష.

సులక్షణ. P. 180.

ప్రాసయతియొక్క విలక్షణత యిందు చక్కగాఁ బ్రతిపాదింపఁబడినది.

"పాకశాసనసుతుఁడు లోకైకవీరుఁడు"

ఇందు యతిమైత్రిలేదు. ప్రాసమైత్రియున్నది. కనుక నిది ప్రాసయతి.

"చారుతరహాసకీర్తిప్రచారుఁ డనఁగ"

ఇందు యతిమైత్రి యున్నది. ప్రాసమైత్రి యున్నది. ప్రసక్తము యతివిషయముగనుక నిచ్చట యతిమైత్రియే ముఖ్యము. కనుక దీనిని యతిభేదములలో వర్గయతి యనవలయును. ప్రాసమైత్రి యున్నను అప్రసక్తముగనుక ఉపేక్షణీయము. శాస్త్రీయమైన యీ భేదము పాటింపవలసియే యున్నది. కాని సీతాపతిగారు దీనిని పాటింపలేదు. పాటింపవలె నన్నచో వారుచేసిన నన్నయ సీసవిభాగవివేకము కొంత దెబ్బతినిపోవును. పాటింపనక్కఱలేదన్నచో వారు సర్వయతికము లుగా పరిగణించినవానిలో కొన్ని అన్యభేదములలో చేరవలసియుండును.

నన్నయ రచించిన కొన్నిసీసములందు పైనియమము ననుసరించి సందేహాస్పదములయిన పద్యములు కొన్నియున్నవి. అనఁగా సాధారణయతిమైత్రి, ప్రాసయతిమైత్రియుగల దళములు కొన్నిపద్యములం దున్నవి.

ఉదాహరణమునకుఁ గొన్ని :

ఆది. I. 7 : గీతిచివరిదళము - అయినను ఇది ప్రా।ప్రా. యనఁబడినది.
,, ,, 32 : సీసము 1, 3 దళములు - అయినను ఇది య।య. యనఁబడినది.
,, ,, 34 : సీసము 1, 6 దళములు - అయినను ఇది ప్రా।య. యనఁబడినది.
,, ,, 119 : సీసము 2, 4, 5 దళములు - అయినను ఇది య।య యనఁబడినది.

ఇట్టివింకను పెక్కుపద్యములు కలవు. వీనియందు సీతాపతిగారు వారిపథకమునకు సరిపడు నట్లు వీలునుబట్టి యతిమైత్రిగానో, ప్రాసయతిమైత్రిగానో గ్రహించిరి.

డాక్టర్ సీతాపతిగారి పరిగణమననుసరించి ఆయాభేదములందు నన్నయరచించిన సీసపద్యముల సంఖ్య—

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| (1) | 158 | (2) | 3 | (3) | 2 | (4) | 2 |
| (5) | 3 | (6) | 33 | (7) | 1 | (8) | 4 |
| (9) | 16 | (10) | 5 | (11) | 1 | (12) | × |
| (13) | 21 | (14) | × | (15) | × | (16) | 2 |

(అప్పకవీయ పీఠిక : పుట 56)

పదునాఱుభేదములలో నన్నయ పదమూఁడుభేదములే ప్రయోగించెను. 12, 14, 15 భేదములను ప్రయోగింపలేదు. యతిగా, ప్రాసయతిగాకూడ చెల్లు సందర్భములను యథేష్టముగా గ్రహింపవీలయినచో ఒకటవ భేదమునందలి మూఁడుసీసములను 3 వ భేదమునందు చేర్పవచ్చును. (ఆది. II. 34; అర. I. 30; అర. II. 194).

ముద్రితప్రతులందలి పాఠములనుఁబట్టి చూచినచోఁ గొన్నిపద్యములు అవి చేరఁదగిన విభాగముల లక్షణములందు కొంతకొఱవడియున్నవి. పాఠాంతరములను స్వీకరించిన నట్టివానిలో కొన్ని నిర్దుష్టములగును. మఱికొన్నింటిని సవరించి శుద్ధిచేయవలసియున్నది.

డా॥ సీతాపతిగారి పథకము సాధారణయతి, ప్రాసయతి యను రెండంశములనే పరిగ్రహించి ప్రవర్తిల్లుచున్నది. ప్రాసమునకు దీనియందు స్థానములేదు. కాని నన్నయసీసములలోఁ గొన్నింట ప్రాసమునుగూడ పాటించెను. పూర్వలాక్షణికులు ప్రాసవిన్యాసముచే సీసములు భేదిల్లుననియే భావించిరి. పూర్వలాక్షణికుల సీసభేదకల్పనమువలె సీతాపతిగారి కల్పనముకూడ నన్నయ సీసభేదముల విలక్షణతను సమగ్రముగ నిరూపించుటకు సమర్థమగుటలేదనియే చెప్పవలసి యున్నది.

ఆదిపర్వము ద్వితీయాశ్వాసమందలి 21 వ పద్యము—

సీ॥ అంత దేవాహితు లమృతంబు గానక
యెంతయునలిగి బలీంద్రుఁగూడి
మంతనంబుండి యమర్త్యులతోడి వై
రింతియచాలు నింకేల యనుచు
సంతనకట్టి యుత్సాహసమేతులై
యంతంబులేని రథాశ్వములను
దంతుల నమితపదాతుల నొడఁగూర్చి
యంతకాకారులై యార్చి యమర

ఆ. వె. వరులఁ దాకి యేసి రురుతరశరపక్ష
జాతవాతరయ విధూతమగుచుఁ
జెదర జలదపంక్తి బెదర వజ్రాయుధు
హృదయ ముదిలకొనఁగఁ ద్రిదశగణము.

సీసపాదములందు యతులు, గీతపాదములందు ప్రాసయతులు నుండుటచే నిది 2 వ భేదమునఁ జేరవలయును—

ఆదిపర్వము, అష్టమాశ్వాసమునందలి 25 వ పద్యము—

సీ॥ ఆర్యవృత్తుండు రాజాధమవర్జితుం
డభిమతసంబంధుఁ డైనవాఁడు
గుణవంతులగుచున్న కొడుకులుగలవాఁడు
పాంచాలుఁ డేల యప్పాండుసుతుల
వినయసంపన్నుల విడుచువాఁడగు మఱి
పాండునందను లేకపత్నియంద
కరమనురక్తులు గావునఁ దమలోన
నేల భేదిల్లుదు రెన్నఁడయ్యు

అ. వె. నొక్కసతికిఁ బతులుపెక్కండ్రు రగుటిది
సతులకోర్కెగాన యతివ కృష్ణ
సుందరాంగి వారియందేల యపరక్త
యగు మనోముదంబు దగులుఁగాక.

సీసపాదములందు యతులు, గీతిపాదములందు ప్రాసయతులు, నుండుటచే నిదియు 2వ భేదమునందే చేరును. డా॥ సీతాపతిగారు ఈరెంటిని రెండవగడియయందే పెట్టిరి, వారిపథక మున నీరెంటియందు ఏకభావనయే కాని నన్నయపథకమునం దీరెంటికి భేదములేదనుట సాహసమ యగును. మొదటిదానియందు సీసదళము లెనిమిదింట ఆయన ప్రాసమును ప్రతిష్ఠించెను. రెండవదానియం దట్టిపనిని చేయలేదు. అట్టిచో నీరెండును ఒకతెగకే చెందుట యాయనకు సమ్మతమని యెట్లుచెప్పవచ్చును?

డా॥ సీతాపతిగారు గణింపని ప్రాసవిన్యాసవిశేషమును భేదకలక్షణముగా పూర్వలాక్షణికులు గణించిరి. గణించి మొదటిసీసమును వృత్తప్రాససీసమని నిర్దేశించిరి. అనంతాదులు సీసవిభాగములు కల్పించునప్పుడు వారిదృష్టియందు ప్రధానముగ నిల్చియున్నది ప్రాసమేయనుట సాహసముకానేరదు. ప్రాసనివేశమై చిత్రినిబట్టి సీసభేదములుచేసి ఆభేదములందు యతి, ప్రాసయతి నివేశవిశేషములనుగూడ కొంతవఱకు వారు గుర్తించిరి.

ప్రాసాక్షరనివేశము, దళద్వయయతిమైత్రి యనులక్షణములు తరువోజయందుఁగలవు. ఏకయత్యక్షరమైత్రి దళద్వయమున నేకపాదత్వభావన కల్పించును. ప్రాసనివేశము సర్వపాదములకు సాదృశ్యము నిబంధించి పద్యమున అఖండత భాసింపఁజేయును.

ఉత్సాహముపై గీతినిచేర్చినట్లే తరువోజమీఁదను గీతినిచేర్చి యొకవిధమగు సీసమును నిర్మింపవచ్చును, అప్పుడదియు వృత్తప్రాససీసమే యగును. ఆగీతి పవడగీతియైనచో ఆసీసము సర్వప్రాససీసమగును.

"యతులు ప్రాసంబు లిష్టసంగతుల నడవ
నదియె సమసీసము.........."[5]

అని రేచన సమసీస సామాన్యలక్షణము చెప్పెను.

"అనియతగణైః; యతిర్వా ప్రాసో వా"[6]

అని పాల్కురికి సోమనాథుఁడు దేశిచ్ఛందో లక్షణసూత్రముల నుదాహరించెను.

గణములు, యతిప్రాసములునను విషయమున ననియతత్వము దేశిలక్షణము, అనియతత్వమనఁగా కవీచ్ఛావశత్వము. సర్వవిషయములందును నియతత్వము మార్గలక్షణము. నియతము మార్గము, అనియతము దేశి. అనియతములై దేశీయములయిన సీసగీతాదులందుకూడ నన్నయ నియమములు పెట్టుకొనెను. "యతులు ప్రాసంబు లిష్టసంగతుల నడవ" ననఁగా క్రమనియమరహితముగా యతులను, ప్రాసలను, ప్రాసయతులను ఉపయోగించుటయని నన్నయ భావింపలేదు. యతిప్రాసలను సీసగీతాదులందు పెక్కుతెఱంగుల "సంగతములు" చేయవచ్చును. అనఁగా పెక్కుతెఱంగులయిన యతిప్రాససంగతులందు కవి తనకిష్టమైన తెఱంగులను స్వీకరించి సీసగీతాదులను నిర్మించుకొనవచ్చును నన్నయ యభిప్రాయ మిట్టిదని ఆయన సీసములను, గీతములను, అటవెలఁదులను పరిశీలించి వానియందలి యతిప్రాససాంగత్యవైచిత్ర్యములను గుర్తించినప్పుడు స్ఫురింపకమానదు. ప్రాసాదుల నివేశవైవిధ్యమున నన్నయ్య యవలంబించిన మార్గమునుబట్టి సీసము వేఱు, గీతివేఱునని ఆయన భావించినట్లు తోఁచును. రేచనాదుల ప్రాససీస విభాగమును అట్లే తోపింపఁజేయును. లేనిచో వృత్తప్రాససీసము ఎట్లు సంగతమగును? సీ. యతి. గీ. ప్రాసము ఇత్యాదులెట్లు సంగతములగును?

అనియతములయిన దేశిచ్ఛందములం దిట్టినియమములను కోరికోరి కల్పించుకొని నన్నయ యింతశ్రమపడనేల? తమిళుల మోనైత్తొడై భేదములు, కన్నడసీసముల ప్రాసనియతి ఆయనకు కొంతవఱకు ప్రోత్సాహకములయి యుండవచ్చును. అంతేకాక తననాఁటి యాంధ్రపండితలోకమున నెలకొనియున్న మార్గాభిమానముకూడ దీనికిఁ గొంతకారణమని తలంపవీలగుచున్నది. నన్నయనాఁటికి నియతమైనమార్గమునకే పండితలోకమున గౌరవము. అనియతమైన దేశి పామరలోకమునందే ప్రచారమందుచున్నది. నన్నయ పండితపామరరంజకముగ భారతము నాంధ్రీకరింపవలయును. ప్రజారంజకములయిన దేశిచ్ఛందములనుగూడ తన గ్రంథమునఁ బ్రతిష్ఠింపవలయును. వానికి పండితాదరణము సంపాదించుటకై వానియందు కొన్నినియమములు చొప్పింపవలయును పండితజనాదరణసంపాదనార్థము నన్నయ కావించిన దేశిచ్ఛందముల మార్గీకరణ ప్రయత్నఫలములే ఆయన నిర్మించిన సీసగీతభేదములు. నియతములై యవి శ్రవ్యతావిశేషలబ్ధినంది యక్షరరమ్యతానిష్ఠగల పామరులకు రమణీయతరములయ్యెను. మార్గలక్షణయుక్తములై పండితుల యాదరణమునకుఁ బాత్రములయ్యెను. అనంతరకవులవలె సీసగీతాదులందు యతి-

ప్రాసయతులను క్రమరహితముగ నన్నయ ప్రయోగింపకుండుటకు ఆయన దేశిచ్ఛందోమార్గీకరణాభిలాషయే కారణమని భావించుట యసంగతము కాఁజాలదు.

నన్నయ ప్రయోగించిన సీసభేదములకు ఉదాహృతులు :

1. యతి । యతి :

సీ॥ ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు

*　　　　*

ఆ. వె. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁజేసె భారతంబు.

ఆది. I. 32

ఇట్టివి 155 కలవు. (చూ. అనుబంధము)

2. యతి । ప్రాసయతి :

సీ॥ అర్ధరాత్రమునప్డు డందుల కేతెంచె
గజయూధములు జలకాంక్షఁజేసి
యంబుధి విమలతోయంబు లాస్వాదింపఁ
జనుదెంచు జలధరసమితియట్లు

*　　　　*

ఆ॥ అఱచి ప్రాణభీతిఁ బఱచి మహీజంబు
లెక్కి రందుగొంద ఱుక్కడంగి
చనుప యిట్టిపాట బెనుపఱి యవినీతు
సిరియుఁబోలె నడఁగి విరిసిచనియె

ఆర. II. 111.

ఇట్టివి 3 కలవు.

3. యతి । యతి – ప్రాసయతి :

సీ॥ అనఘు వేదాధ్యయనాసక్తు నారభ్య
మాణమహాధ్వరు మనుచరిత్రు

సర్వవర్ణాశ్రమ సంరక్షణక్షము
సత్యసంధాను నజాతశత్రు

*    *

ఆ॥ అన్నరేంద్రునందు నాపూర్ణ తరశర
దైందవాతపంబునందుఁ బ్రీతి
సమమకా సమస్తజనులచిత్తంబు లా
నందరసభరంబు నొందఁడాల్చె.

ఆది. VIII. 82.

ఇట్టివి 5 కలవు. పద్యమందలి దళములన్నింటను యతిమైత్రిమేయుండి గీతియందలి యుగ్గళములు రెంటమాత్రమే ప్రాసయతిమైత్రియున్న యీ భేదమున గణింపఁదగ్గ రమ్యత లేదనవలసియున్నది.

డాక్టరు సీతాపతిగారి లెక్కకు ఇవి 2 మాత్రమే.

4. యతి । ప్రాసయతి — యతి :

సీ॥ ఆయంబునందు నాలవభాగమొండె మూఁ
డవభాగమొండె నందర్ధమొండెఁ
గాని మిక్కిలిసేయఁగాదు వ్యయంబని
యవధరించితె బుద్ధి నవనినాథ

*    *

ఆ॥ గురుల వృద్ధశిల్పివర వణిగ్బాంధవ
జనుల నాశ్రితులను సాధుజనులఁ
గరుణఁ బేదటికము వొరయకుండఁగఁ బ్రోతె
సకలజనులు నిన్ను సంస్తుతింప.

సభా. I. 47.

ఇట్టివి 2 మాత్రమే కలవు.

5. ప్రాసయతి । యతి ;

సీ॥ ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు
నర్థార్థులకు విపులలార్థములును
ధర్మార్థులకు నిత్యధర్మసంప్రాప్తియు
వినయార్థులకు మహావినయమతియు

*    *

ఆ॥ భక్తియుక్తులైన భాగవతులకు శ్రీ
వల్లభుండు భక్తవత్సలుండు
భవభయంబులెల్లఁ బాపి యిష్టార్థసం
సిద్ధిఁ గరుణతోడఁ జేయునట్లు.

ఆది. I. 34.

ఇట్టివి 3 మాత్రమే కలవు.

6. ప్రాసయతి। ప్రాసయతి :

సీ॥ తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణవిజ్ఞాననిరతు

* *

ఆ॥ నిత్యసత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా
భరణుఁడిట్టులనియెఁ గరుణతోడ.

ఆది. I. 9.

ఇట్టివి 33 కలవు. సర్వదళములందును ప్రాసయతి పాటింపఁబడిన యీతెగ పద్యముల నిర్మాణమున నన్నయ అతిప్రయత్నపరుఁడై యుండెననుట స్పష్టము. ప్రయోజననిరపేక్షముగ నిట్టి యత్నము ఆయన చేసియుండడు గనుక నిర్మాణవిశేషయుక్తములయిన ఈపద్యముల యొక్క ప్రయోజనవిశేషములు పరిశీలింపవలసియున్నది.

7. ప్రాసయతి। యతి – ప్రాసయతి :

సీ॥ అనిన నారదమహాముని పల్కుచేకొని
తమలో నొడంబడి విమలబుద్ధి
నేవురయందును ద్రోవది ప్రీతితో
నొక్కొక్కయింటఁ దానొక్కయేఁడు

* *

ఆ॥ సేవసేయుచును విశేషవ్రతంబులు
ధీరవృత్తి జలుపువారు గాను
సమ్మునీంద్రునొద్ద సమయంబుసేరిరి
రాజసుతులు పాండురాజసుతులు.

ఆది. VIII. 115.

ఇట్టిది ఇదియొక్కటే కలదు. గీతియందలి ద్వితీయచరణము "ధీరవృత్తి జలుపుతీరుగాను" అని పఠించినచో నిదికూడ ప్రా। య అను ర వ భేదమునఁ జేరిపోఁగలదు.

8. ప్రాసయతి। ప్రాసయతి – యతి :

సీ॥ అంగనాజనుల యుత్తుంగసంగతకుచ
కుంకుమచందన పంకములయు
వారివ ధమ్మిల్లభారావకలితది
వ్యామోద నవపుష్పదామములయు

* *

తే॥ అనిలుఁడను దూత వోయి తోడ్కొనియుఁ దెచ్చె
దేవయానిపాలికి మృగతృష్ణఁజేసి
కాననంబునఁ గ్రుమ్మరువాని వీరు
నతిపరిశ్రాంతుఁడైన యయాతినంత.

ఆది. III. 156.

ఇట్టివి 4 కలవు.

9. యతి – ప్రాసయతి। యతి :

సీ॥ ఇంద్రసమానున కిందీవరశ్యామ
సుందరాంగున కింద్రనందనునకు
దేవిగాఁ బ్రీతితో దీని నీఁగాంచితి
ననియున్నచో విధాతృనకు నిల్లు

* *

ఆ॥ తత్పురోహితుండు దానిట్టులనియె న
ప్పాండవులగురించి బహువిధంబు
లగు నిమిత్తములు నయంబునఁ జూచితి
నెగ్గులేదు వారికెల్ల లగ్గు.

ఆది. VII. 24.

ఇట్టివి 16 గలవు.

10. యతి – ప్రాసయతి। ప్రాసయతి :

సీ॥ ద్వైపాయనుండును ధౌమ్యుండునాదిగా
భూసురుల్ సూత్రవిన్యాసమమరఁ

జేసి శాంతికవిధుల్ సేయంగ సుప్రశ
స్తంబైన రమ్యదేశంబునందు

*　　　　*

ఆ॥ పురముతోఁ గుబేరపురముతో వరుణేంద్రు
పురవరంబుతోడ నురగరాజ
పురవిభూతితోడ నురువిలాసంబుల
సరియనంగ నొప్పు ధరణిమీఁద.

ఆది. VIII. 70.

ఇట్టివి 5 కలవు.

11. యతి - ప్రాసయతి । యతి - ప్రాసయతి :

సీ॥ పుణ్యకర్మంబులు వొలిసిన నుర్వికి
నేతెంచునట్టి యయాతివోలె
భూషణదీప్తులు వొలియంగ వివృతకే
శాంబరుండయి సౌంభకంబువలన

*　　　　*

ఆ॥ శార్ఙ్ఞ ; మత్ప్రియావసన్నదేహుండనై
యుడిగి రథముమీఁదఁ బడితి నేను
దానిఁజూచి భయము దగిలి మత్త్సైన్యంబు
దల్లడిల్లి యులిసెఁ బెల్లురేఁగి.

అరణ్య. I. 191.

ఇట్టిది ఇదియొక్కటే కలదు. సమతాగుణవిశిష్టమైన ఈభేదమును నన్నయ్య విశేషముగా నుపయోగింపకుండుట శోచనీయము.

12. యతి - ప్రాసయతి । ప్రాసయతి - యతి :

ఈ భేదమును నన్నయ వాడినట్లు కనఁబడదు. ఇంతకంటె అరమ్యములయిన భేదముల నుపయోగించియు నన్నయ ఈ భేదము నుపయోగింపకుండుట శోచనీయము.

13. ప్రాసయతి - యతి । యతి ;

సీ॥ ఇమ్మహాభారతం బిమ్ములఁ బాయక
విహితావధానులై వినుచునుండు

వారికి విపులధర్మారంభసంసిద్ధి
యగుఁ బరమార్థంబ యాశ్రమమున

*            *

ఆ॥ దానములను బహువిధక్రతుహుతజప
బ్రహ్మచర్యములను బడయఁబడిన
పుణ్యఫలముఁ బడయఁబోలు నశేషపా
పక్షయంబునగు శుభంబుఁబెరుఁగు.

ఆది. I. 72.

ఇట్టివి 21 కలవు.

14. ప్రాసయతి – యతి । ప్రాసయతి :

ఈ భేదమునుగూడ నన్నయ వాడకుండుట శోచనీయము.

15. ప్రాసయతి – యతి । యతి – ప్రాసయతి :

ఈ భేదముకూడ రమ్యమైనదే. నన్నయ దీనిని వాడకుండుట శోచనీయము.

16. ప్రాసయతి – యతి । ప్రాసయతి – యతి :

సీ॥ కలహంస పలికిన పలుకులు గణియించు
వడి దాని పోయినవలను చూచుఁ
బలుకదు సఖులతో లలితాంగి మిన్నక
యలయుచునుండుఁ దా ననుదినంబు

*            *

...      ...      ధరణినాథ

ఆ॥ నంద బుద్ధినిలిపి కందర్పబాధిత
యగుచునున్నయది ధరాధినాథ
ధరణిపతుల నొరుల నురుగుణాఢ్యుల విన
నొల్ల దెంత విభవయుక్తులయిన.

అరణ్య. II. 26.

ఇట్టివి 2 మాత్రమే కలవు. రమ్యమైన ఈ భేదమును నన్నయ్య విరివిగా వాడియుండ వలసినది.

యతిప్రాధాన్యము, ప్రాసయతిప్రాధాన్యము, తదుభయసామ్యము అనుదృష్టిచే నన్నయ సీసములను మూఁడుకక్ష్యలుగా విభజింపవచ్చును. ఆయన యుఖినివేశమును గుర్తింపవచ్చును.

1. యతిప్రధానములు :

| | | | | |
|---|---|---|---|---|
| 1 వ భేదము | — | సర్వదళములందు | యతి | 155 |
| 2 వ ,, | | 8 దళములందు | యతి | 3 |
| 3 వ ,, | | 10 ,, | ,, | 5 |
| 4 వ ,, | | 10 ,, | ,, | 2 |
| 9 వ ,, | | 8 ,, | ,, | 16 |
| 13 వ ,, | | 8 ,, | ,, | 21 |
| | | | | 202 |

2. ప్రాసయతిప్రధానములు :

| | | | | |
|---|---|---|---|---|
| 5 వ భేదము | — | 8 దళములందు | ప్రాసయతి | 3 |
| 6 వ ,, | | సర్వదళములందు | ,, | 33 |
| 7 వ ,, | | 10 దళములందు | ,, | 1 |
| 8 వ ,, | | 10 ,, | ,, | 4 |
| 10 వ ,, | | 8 ,, | ,, | 5 |
| 14 వ ,, | | 8 ,, | ,, | × |
| | | | | 46 |

3. ఉభయప్రధానములు :

| | | | |
|---|---|---|---|
| 11 వ భేదము | — | 6 యతి + 6 ప్రాసయతి | 1 |
| 12 వ ,, | | 6 యతి + 6 ప్రాసయతి | × |
| 15 వ ,, | | 6 యతి + 6 ప్రాసయతి | × |
| 16 వ ,, | | 6 యతి + 6 ప్రాసయతి | 2 |
| | | | 3 |

గమనిక : ప్రాసయతి యనుప్రాసమువంటి యలంకారము. సాధారణయతివలె పాదమున నొదిగి గూఢముగనుండక పైకి కొట్టవచ్చినట్లు కనిపించును. పద్యమునందు ఆడంబరము కల్పించు ప్రాసయతిని నన్నయ ప్రయోజనవిశేషాపేక్షయున్నచోటనే ప్రయోగించెననియు, సాధారణయతినే సామాన్యలక్షణముగా పాటించెననియు భావింపఁదగియున్నది.

ముద్రితప్రతులలో కొన్నిపద్యములందు నన్నయ చేసికొన్న నియమములు కొంత భంగముపొందినట్లున్నవి. అట్టివి ఏయేభేదములం దెన్నికలవో పరిశీలింపఁదగును.

1 వ భేదము : ఇది సర్వయతిసీసము :

ఆది I – 119 పద్యమున సీసద్వితీయపాదము ఉత్తరార్ధమున ప్రాసయతి యున్నది.

"ధాతయును విధాతయు వారి యనువయించు". దీనికిఁ బాఠాంతరములేదు.

"అలవిధాతయు వారి యనువయించు" అని సవరింపవచ్చును.

ఆది II – 131 పద్యమున సీసద్వితీయపాదము నుత్తరార్ధమున ప్రాసయతి యున్నది.

"అడుగుద మ్రైకతు వుడుగుమనియు". దీనికిఁగల పాఠాంతరము స్వీకరించినచో దోషము తొలఁగిపోవును.

"అడుగుద మిష్టిసేయకుమటనియు"

6 వ భేదము : ఇది సర్వప్రాససీసము :

ఆది V – 136 పద్యమున గీతిద్వితీయపాదమున యతియున్నది.

"చీరి పుత్తెంచె నవ్విప్రుచేత భాగి...." "ప్రీతిఁ బుత్తెంచె" నన్న పాఠాంతరమును స్వీకరించినచో దోషము తొలఁగిపోవును.

ఆరణ్య I – 188 పద్యమున సీసతృతీయపాదపూర్వార్ధమున యతిమైత్రి యున్నది.

"వెఱవక సాల్వుండు వెండియు నామీఁద". దీనికిఁ బాఠాంతరములేదు.

"వెఱవక సాల్వుండు మఱియును నామీఁద" అని సవరించినచో దోషము తొలఁగిపోవును.

ఆరణ్య III – 162 పద్యమున గీతిచరమపాదమున యతిమైత్రియున్నది.

''అవర్ధనమునిట్లు సేయఁదగునెవిధికి''

''జనునెవిధికి'' యని సవరించినచో దోసము తొలఁగిపోవును.

ఆరణ్య. III–394 పద్యమున గీతిచరమపాదమున యతిమైత్రి యున్నది.

"యుద్ధ మొప్పఁజేసి రుగ్రబలులు"

దీనికిఁ బాఠాంతరములేదు ''ఇద్ధబలులు'' అని సవరించినచో దోసము తొలఁగిపోవును.

ఆరణ్య IV – 119 పద్యమున గీతిచరమపాదమున యతిమైత్రిగలదు.

''నవయుచున్నవాఁడ నాఁటఁగోలె.'' దీనికిఁ బాఠాంతరములేదు. "మునివరేణ్యుశాపమునఁ జేసి నవయు చిప్పాటనున్నవాఁడనాఁటఁగోలె" అని సవరించినచో దోసము తొలఁగిపోవును.

9 వ భేదము :

సీసపాదపూర్వఖండములందు యతి, ఉత్తరఖండములందు ప్రాసయతి, గీతియందు సర్వ పాదములందు యతియు గలభేదము.

ఆరణ్య IV – 128 పద్యమున సీసద్వితీయ తృతీయపాదముల యుత్తరార్ధములందు యతిమైత్రియున్నది.

"దుః।ఖంబునై నెడ విమోహమును బొంద"

"వేద్య।మనిన నీచెప్పిన యగ్గుణములు"

పాఠాంతరములు స్వీకరించినచో నీదోషములు తొలఁగిపోవును.

"దుః।ఖమునై నయెడ విమోహమును బొంద"

"వేద్య।మనిన నీచెప్పిన గొనము లివియు"

10 వ భేదము :

ఇది సీసపాదపూర్వఖండములందు యతి, ఉత్తరఖండములందు ప్రాసయతి, గీతిసర్వ పాదములందు ప్రాసయతిగల సీసము.

ఆరణ్య I – 102 పద్యమున గీతి ద్వితీయచరణమున యతిమైత్రియున్నది.

"సు।రారి నిశ్చలఘన భీకరాంగుఁ బట్టి". పాఠాంతరమును స్వీకరించినచో దోసము తొలఁగిపోవును.

"సు।రారి నిశ్చలభీకరాకారుఁ బట్టి"

నియమభంగము గోచరించు 9 పద్యములలో 4 పద్యములు పాఠాంతరములచే శుద్ధము లగును. 5 పద్యములకు శుద్ధపాఠములు లభించునంతవఱకు సవరణలచే శుద్ధి సాధింపవలసి యున్నది.

నిరూపితములయిన పదమూఁడు సీసభేదములలోఁ గొన్నింట ప్రాసవిన్యాసవిశేషకృతము లైన యవాంతరభేదములు గుర్తింపవీలగుచున్నది.

1 వ భేదమున :

ఆరణ్య II – 151 పద్యమున సీసపాదములు నాల్గింట ప్రాసముగలదు.

సీ॥ ఆనందభరితాత్మయై రాజమాత య
క్కమలాక్షిఁ బ్రీతితోఁ గౌఁగిలించి
కొని తల్లి నీవు నాకూఁతుర వేను నీ
జననియుఁ బేర్మి దశార్ణరాజ

తనయల మదియు విదర్భేశు సతియయ్యె
నే వీరబాహున కింతినైతి
ననిన నయ్యవ్వకు నతివినయంబుతో
నలుదేవి మ్రొక్కి సునందనెత్తి

ఆ॥ కొని కరంబునెమ్మిఁ గొన్నిదినంబులం
దుండి యిట్టులనియె నొక్కనాఁడు
దేవి యిదియు నదియు ధృతి నాకుఁ బుట్టిన
యిండ్ల కడుసుఖంబ యిందునందు.

గీతితృతీయపాదమును – "జనని యిదియు నదియుఁ జన నాకుఁ బుట్టిన" అని సవరించినచో నిది సమప్రాససీస మగును.

ఆరణ్య II – 279 పద్యమున సీసమున 1, 2 పాదములకు 3, 4 పాదములకు ప్రాసములు భిన్నముగా నున్నది.

సీ॥ అసురులభయమున నడఁగిన వేదంబు
లోంకారపూర్వమైయుండ నాంగి
రసుఁ డుద్ధరించి సారస్వతప్రముఖులఁ
జదివించె నెందేని శాశ్వతముగ
నమరనియుక్తుఁడై యజియించె నెందేని
భృగుఁ డెల్లవారికిఁ బేర్మి నట్టి
రమణీయతుంగకారణ్యంబు సూచిన
మాత్రన దురితకర్మంబులెల్లఁ

2 వ భేదమున :

ఆది II – 21 పద్యమున సీసపాదఖండము లెనిమిదింట నొకేప్రాసము ; గీతి 3, 4 పాదములకు ప్రాసము.

సీ॥ అంత దేవాహితు లమృతంబుగానక
యెంతయు నలిగి బలీంద్రుఁగూడి
మంతనంబుండి యమర్త్యులతోడి పొ
త్తింతియచాలు నింకేల యనుచు
... అమర

ఆ॥ వరుల(దాకి యేసి రురుతరశరపక్ష
జాతవాతరయవిధూత మగుచు(
జెదర జలదపంక్తి బెదర వజ్రాయుధు
హృదయ ముదిలకొన(గ( ద్రిదశగణము.

6 వ భేదమున :

ఆది III – 27 పద్యమున సీసపాదఖండములన్నింటను ప్రాసముగలదు.

సీ పలుకుల ముద్దును కలికిక్రాల్గన్నుల
తెలివును వలుదచన్నుల బెడంగు
నలఘుకాంచీపదస్థలముల యొప్పును
లలితాననేందుమండలము రుచియు
నళినీలకుటిలకుంతలముల కాంతియు
నెలజవ్వనంబున విలసనమును
నలసభావంబున పొలపును మెలపును
గలుగు నగ్గిరికన తల(చి తల(చి.

ఇదియు ప్రాసనియమమున "అంతదేవాహితులు" అను పద్యమువంటిదే. ఇది ప్రాస యతినియమముగలది. అది పడినియమముగలది. భేదమింతే.

ఆది V – 124 వ పద్యమున సీసము 2, 3, 4 పాదముల యారంభములందు "ఈతండ" అను పదము ఆవృత్తమై పాదత్రయమున ద్విప్రాసము సిద్ధించుచున్నది. ఆది III – 156 పద్యము నిట్టిద (8 వ భేదము)

ఆది VI – 149 పద్యమున సీసపాదములు 1, 2 ఒకప్రాసము, 3, 4 ఒకప్రాసము, గీతము 1, 2 పాదముల లొకప్రాసము గలవు.

సీ॥ వారణావతమునవారెల్ల ... ...
కరమొప్ప( గరిరథతురగబలాఢ్యులై ... ...
కలయంగ గృహముల( గలువడములు... ...
మలయజమృగమదావిలసలిలంబుల ... ...

తే॥ అంగణలనొప్పె( గర్పూరరంగవల్లు
లంగనలు గయిసేసి యుత్తుంగహర్మ్య

ఆది VI – 161 పద్యమున గీతిపూర్వపాదద్వయమున నొకప్రాసము, ఉత్తరపాదద్వయమున నొకప్రాసముగలవు.

ఆ॥ సుఖముగాగ నిట్లు నెఱయంగ సత్వంబు
మెఱసి రాతిరెల్ల సుఖకపవన
తనయుఁ డరిగెఁ బవలు సనినట్లు చీఁకటి
యనక ముండ్లుగండ్లుననక తెరలి.

ఆది VII - 276 పద్యమున సీసము ప్రథమపాదఖండద్వయమును, ద్వితీయపాదఖండ ద్వయమును ప్రాసఘటితములై యున్నవి.

సీ॥ హరువచనమున నా గిరిరాజవివరంబు
గరములఁ బట్టి చెచ్చెర దినేశ
చండమయూఖముల్ రెండువిధంబులై
యుండంగఁ దెచ్చి యాఖండలుండు

ఆది VIII - 251 పద్యమున సీసపూర్వపాదద్వయ మేకప్రాసఘటితము.

సీ॥ వారణహస్తానుకారంబులగు వారి
ధారలు గురియ దుర్వారఘోర
తరవారివాహప్రకరములు వారింప
సురనివహంబుతో సురగణేశు

10 వ భేదమున :

ఆది VIII - 70 పద్యమున గీతి నాల్గుపాదములును ఏకప్రాసఘటితములు.

ఆ॥ పురముతోఁ గుబేరుపురముతో వరుణేంద్రు
పురవరంబుతోడ సురగరాజ
పురవిభూతితోడ నురువిలాసంబుల
సరియనంగ నొప్పు ధరణిమీద

ఆరణ్య I - 102 పద్యమున గీతి నాల్గుపాదములు నేకప్రాసఘటితములు

తే॥ ఘోరవనమున వీరుఁ గిమ్మీరుఁడను సు
రారి నిశ్చలభీకరాకారుఁ బట్టి
పోర వధియించినట్టి సమీరజునకు
భూరిభుజునకు మార్కొనువారు గలరె?

# ఎఱ్ఱన సీసభేదములు

"..........నన్నయభట్ట మహాకవీంద్రు
సరససారస్వతాంశప్రశస్తి తన్నుఁ
జెందుటయు సాధుజనహర్షసిద్ధిఁ గోరి.

ఆరణ్య. VII. 469.

కం॥ ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంతదోఁపఁ దద్రచనయకా
నారణ్యపర్వశేషము
పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్.

ఆరణ్య. VII. 470.

నన్నయభట్టమహాకవీంద్రు సరససారస్వతాంశప్రశస్తి తన్ను జెందఁగా, తత్కవితారీతియు కొంతతోఁచునట్లు ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషము పూర్తిచేసెను. ఈ యంశము అన్యకావ్యాంగములందువలె ఛందమునందును సత్యము. విశేషించి సీసగీతముల నిర్మితియందిది ప్రస్ఫుటముగ గోచరించుచున్నది.

నన్నయ రచించిన 13 సీసభేదములలో ఎఱ్ఱన ఏడుభేదములనుమాత్రమే రచించెను. ఆయాభేదములం దాయన రచించిన పద్యసంఖ్య యిట్లున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| 1 వ | భేదమున | — | 71 | పద్యములు |
| 3 వ | ,, | — | 1 | ,, |
| 6 వ | ,, | — | 9 | ,, |
| 9 వ | ,, | — | 3 | ,, |
| 11 వ | ,, | — | 10 | ,, |
| 13 వ | ,, | — | 5 | ,, |
| 16 వ | ,, | — | 3 | ,, |
| | | మొత్తము | 102 | |

ఈ భేదములందు ఎఱ్ఱన రచించినపద్యములలో కొన్నింట ముద్రితప్రతులందు నియమభంగములు కానవచ్చుచున్నవి.

1 వ భేదమున :

ఇందు సర్వదళములందు యతియే ఉండవలెను. ఆరణ్య. VII. 323 వ పద్యమున ప్రథమ పాదో త్తరఖండమున ప్రాసయతిగలదు. "రూపించి యిట పోయి రేపవత్తు" దీనికి పాఠాంతరము ఉన్నను ప్రకృతోపయోగికాదు. "రేయి నేనట పోయి రేపవత్తు" నని సవరించినచో దోసము తొలఁగును.

6 వ భేదమున :

ఇందు సర్వదళములందు ప్రాసయతియే ఉండవలెను.

ఆరణ్య. IV. 212 వ పద్యమున గీతి తృతీయపాదమున యతిమైత్రికలదు.

"చంద్రలోకమునకు సంప్రీతుఁడై చను." దీనికిఁ బాఠాంతరములేదు.

"చంద్రలోకమున కతంద్రుడై చను మఱి" యని సవరింపవచ్చును.

ఆరణ్య. IV–241 వ పద్యమున తృతీయపాదప్రథమఖండమున యతియున్నది.

"గురుఁడు నీకిష్టసఖుఁడును బ్రెగ్గడయునై". దీనికిఁ బాఠాంతరమున్నను బ్రకృతోప యోగికాదు.

"గురుఁడుఁ బ్రెగ్గడయును బరమమిత్రుండునై" యని సవరించిన సరిపోవును.

ఆరణ్య. VII–49 వ పద్యమున ద్వితీయచరణము ఉత్తరఖండమున యతిమైత్రికలదు.

"ఇత్తఱిఁ దెరువిత్తునేని యింక." దీనికి "ఇత్తఱి నేఁ దెరువిత్తునేని" యను పాఠాంతరము స్వీకరించినచో సరిపోవును.

11 వ భేదమున :

ఇందు సీసగీతములందలి అయుగ్మళముల యతియు, యుగ్మళములఁ బ్రాసయతియు నుండవలెను.

ఆరణ్య V – 5 వ పద్యమున సీసద్వితీయపాదము నుత్తరఖండమున ప్రాసయతి యుండవలసినది. "నొంది పుత్రునిఁ గాంచు నొనరఁ దల్లి" అని యతిమైత్రియున్నది. దీనిని "నెనసి పుత్రునిఁగాంచు నొనరఁ దల్లి" అని సవరించిన దోసము తొలఁగును.

ఆరణ్య V – 221 వ పద్యమున సీసతృతీయపాదము నుత్తరఖండమున "కని యను రాగిల్లి కమలనిలయ" అని యతిమైత్రి యున్నది. దీనికిఁ బాఠాంతరములేదు, "కని యను రాగిల్లి వనజనిలయ" యని సవరించిన సరిపోవును.

ఎఱ్ఱనయు ఈభేదములు కొన్నింట ప్రాసకృతవైచిత్రి ప్రదర్శించెను.

1 వ భేదమున : ఇది సర్వప్రాససీసము

ఆరణ్య VI – 369 వ పద్యమున సీసపాదములందలి దళద్వయములు ప్రాసఘటితములు. విశేషించి తృతీయచతుర్థపాదములందలి నాల్గుదళములు ఏకప్రాసఘటితములు.

సీ॥ ఆరాజపుత్రుల నారూఢతేజుల
వీరుల నున్నతోదారభుజులఁ
గనుఁగొని సుగ్రీవుఁ డనఘుఁ డగ్గిరిశృంగ
మునునుండి తాను దనసచివులుఁ
జింతించి వారివృత్తాంతము నెఱుఁగంగ
సంతతోత్సాహు ధీమంతు శౌర్య
వంతు నుత్తము హిమవంతుఁడుబోని య
త్యంతసుస్థిరు హనుమంతుఁ బనిచె.

ఆరణ్య VII – 351 వ పద్యమున సీసపాదములు నాల్గింటను దళద్వయములు ఏకప్రాస ఘటితములు. గీతపాదములు నాల్గును ఏకప్రాసఘటితములు.

సీ॥ ధృతరాష్ట్రసఖుడైన యతిరథుండనుసూతుఁ
డతివలుఁ దానును నతివిభూతి
గంగలో జలకేళిసంగతుండై యుండి
తుంగతరంగానుషంగ వశతఁ
జనుదెంచు మంజూషఁగని కడువేడుకఁ
దన పరిజనములఁ బనిచి పట్టి
తెప్పించి ధీయుక్తియొప్ప నేకతమున
నప్పెట్టెఁ దెఱచి తానప్పుడందు

ఆ॥ వినుతహేమకవచుఁ గనకకుండలధరు
ననుపమానతేజు ఘనుఁ గుమారుఁ
గని మనంబులోన ననయంబు విస్మయం
బొనరఁ గ్రుచ్చియెత్తికొని ముదమున.

ఎఱ్ఱనరచనయందును యతిప్రధాన, ప్రాసయతిప్రధాన, ఉభయప్రధాన సీసములసంఖ్య గణింపఁదగియున్నది.

1. యతిప్రధానములు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 వ భేదము | — | 12 | దళములందు | యతి | 71 |
| 3 వ ,, | — | 10 | ,, | ,, | 1 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 9 వ | ,, | — | 8 దళములందు | యతి | 3 |
| 13 వ | ,, | — | 8 ,, | ,, | 5 = 80 |

2. ప్రాసయతిప్రధానములు :

| | | | | |
|---|---|---|---|---|
| 6 వ భేదము | — | 12 దళములందు | ప్రాసయతి | 9 = 9 |

3. ఉభయప్రధానములు :

| | | | |
|---|---|---|---|
| 11 వ భేదము | — | 6 యతి + 6 ప్రాసయతి | 10 |
| 16 వ ,, | — | 6 యతి + 6 ప్రాసయతి | 3 = 13 |
| | | మొత్తము = | 102 |

# సీసభేదముల వినియోగము

యతి - ప్రాసముల విన్యాసములు వివిధభంగులఁ గావించి నన్నయయు, నాయన యడుగు జాడల నడచి యెఱ్ఱనయు సాధించిన రసాద్యర్థపుష్టి యెట్టిదో పరిశీలింపఁదగియున్నది. పద్యమును రమ్యతరముచేయు వారియత్నము తావన్మాత్రవిశ్రాంతమనుట యుచితముకాదు. స్వరప్రధానమైన యతి, వ్యంజనప్రధానమైన ప్రాసము పద్యమునకు రంజనాతిశయము గలిగించు లక్షణములు. పాదగతి స్వరాధీనముగనుక స్వరసాదృశ్యము పాదగమనమున సామ్యము ప్రతిష్ఠించి శ్రుతికి సుఖము గలిగించును. భిన్నపాదముల గతులను సంగతముచేయునది ప్రాసము. వివిధ పాదవిన్యాసములతో పద్యము నడచుచుండ పద్యగతికి మంజీరాదిశింజితముల రూపమున రంజనాతిశయము నాపాదించి పద్యహృదయమును వ్యంజించునది ప్రాసము. పద్యమున నియతస్థానగతములై యతిప్రాసములు పద్యమునకు అపూర్వశోభ నాపాదించును. ఆంధ్రభాషయందుఁగల ఈ యతిప్రాసనియమమునుగూర్చి కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశకయందు ఇట్లు ప్రశంసించినాఁడు

విక్రమార్కుని పురోహితునిపుత్రుఁడు దేశాంతరములసంచరించివచ్చి ప్రభువుతో నన్న మాటలు—

వ॥'......ఆంధ్రమండలంబునం గోణదేశంబునం దెలుఁగుఁగవితకుఁ బ్రాలు వళ్లునను నియమంబులు చూచినాఁడ నవి యియ్యెడ దఱుచుగాకుంట సపూర్వం బవధరింపుము.

శా॥ పుణ్యస్త్రీకి గుణంబు మంగళగుణంబున్ సొమ్ములై యొప్పఁగాఁ,
బణ్యస్త్రీకి సువర్ణమౌక్తికసురూపవ్యక్తిభూషాకృతుల్
గణ్యంబౌ గతి, సంస్కృతంబునకు వాగ్భావంబు శబ్దంబు లా
వణ్యాకారములౌఁ దెనుంగునకుఁ బ్రాల్వళ్లుం గడున్ వన్నియల్.
IV. 190.

గీ॥ పలుదెఱంగులైన పలుకులు గలిగియుఁ
బ్రాలువళ్లులేని బేలుకవిత
వన్నెలెల్లఁగూర్చి వ్రాయుచోఁ గాటుక
వన్నెలేని ప్రతిమవ్రాతఁబోలు. 191

కం॥ తప్పక వళ్లను బ్రాలును
ముప్పిరిగొనఁ దగిన శబ్దములు మెఱుఁగెక్కన్
జెప్పిన కవితాచాతురి
యొప్పముపెట్టిన పసిండియెఱపున మెఱయున్. 192

పుణ్యస్త్రీకి గుణము, మంగళగుణము అలంకారములుకాఁగా పణ్యస్త్రీకి సువర్ణమౌక్తికసురూపవ్యక్తిభూషాకృతులు గణ్యములయినట్లు సంస్కృతమునకు వాగ్భావము, శబ్దము లావణ్యాకారములగుననియు, తెలుంగునకు ప్రాలు, వళ్లను కడున్ వన్నియలగుననియు గోపరాజు చెప్పినమాట ఆంధ్రసరస్వతికి అవమానకరమైనదేకాని గౌరవకరము ఎంతమాత్రమును కాదు. సంస్కృతము పుణ్యస్త్రీయనియు, తెలుఁగు పణ్యస్త్రీయనియు భావించుటయే అనుచితము. విచ్ఛేదరూపయతినియతియు, ఛేకవృత్త్యాద్యనుప్రాసములును సంస్కృతమునందును గలవు. అయితే అనుప్రాసాదికము సంస్కృతమునకు నియతమైన యలంకారముకాదు. విలాసముకొఱకైన యలంకారము. ఆంధ్రసరస్వతికి అనుప్రాసభేదమైన ప్రాసము నియతాలంకారము. అలంకారమాత్రమ కాదు అంగమే. విచ్ఛేదానంతరము పాదాద్యక్షరసరూపాక్షరము ఆవృత్తము కావలెనన్న వడినియమముకూడ తెలుఁగున ఛందోఽంగమే. వళిప్రాసములు సౌందర్యహేతువులగు అలంకారములని చెప్పఁదలఁచినను వానిని విలేపనకేశసంస్కారణాదులతోఁ బోల్చి చెప్పఁదగునేకాని సువర్ణమౌక్తికకల్పితములయిన ప్రక్షేపార్హభూషణములతోఁ బోల్చి చెప్పరాదు. యతిప్రాసములు ఆంధ్రసరస్వతికి గుణవిశేషములనిగాని గుణోద్దీపకములయిన సంస్కారవిశేషములనిగాని చెప్పవలెను. ఆంధ్రసరస్వతి కివి మంగళగుణములేకాని కృత్రిమాలంకారములు కావు. గుణము, మంగళగుణము లేక కృత్రిమాలంకారములచే లభించిన కృతకశోభచేతమాత్రమే శ్రోతల నాకర్షించుట యాంధ్రకవిత లక్షణముకాదు.

గోపరాజుచేసిన యౌపమ్యము అతనినాఁటి క్షుద్రప్రబంధములవిషయమున సత్యమే కావచ్చును. కవిత్రయమువారి కవితవిషయమునందది వర్తింపదు.

వళిప్రాసములు కేవలము ఆంధ్రకవిత స్వత్వములునుకావు, తమిళమందును అడి మోనై త్తొడై, అడియెదుగై త్తొడై భేదములుగలవు. దాక్షిణాత్యభాషలకు యతిప్రాసములు పెట్టనితొడవులు. వీడరాని నియమములు.

విలాసముకొఱకుఁగాని, విశేషప్రయోజనాపేక్షచేఁగాని యథావసరము ధరించి, యథావసరము త్యజింపఁదగిన ఛందోఽలంకారములు ద్విత్రిప్రాసములు, అంత్య, అనుప్రాసములు, ప్రాసములు, ప్రాసయతులు సౌందర్యహేతుకములయిన గుణములు. నియతములుగనుక మంగళగుణసదృశములు. ఆ మంగళగుణమునందు సౌందర్యాతిశయమును దీపింపఁజేయుటకు నన్నయ్య దురతిక్రమములయిన కొన్ని నియమవిశేషములను పెట్టుకొనెను. వాసకసజ్జికాది నాయికలవలె, ధీరలలితాది నాయకులవలె యథావస్థమైన యలంకరణముచే ఛందము శోభాన్వితమై యుండవలెనన్న భావనయే నన్నయ్య యీ నియమములకుఁ గారణమని భావింపఁదగి యున్నది.

"పలుకుల ముద్దును గలికిక్రాల్గన్నుల
తెలివును వలుదచన్నుల బెడంగు
నలఘుకాంచీపదస్థలముల యొప్పును
లలితాననేందుమండలము రుచియు
నళినీలకుటిలకుంతలముల కాంతియు
నెలజవ్వనంబున విలసనమును
నలసభావంబున వొలుపును మెలపును
గలుగు నగ్గిరికన తలఁచి తలఁచి"

ప్రాసము, ప్రాసయతి సర్వదళములందును నియతములై యున్న ఈసీసము ముగ్ధమోహనమూర్తియైన గిరికాదేవి ప్రతిరూపము. వసురాజుచిత్తమున హత్తియుండి మృగయార్థము వనమున కేగియున్నసమయమునందును ఆయనహృదయమును వదలక లలితసుకుమారరతిభావపరవశునిఁ గావించిన గిరికాయౌవనలక్షణములయిన సహజశోభావిశేషము లీపద్యమున చిత్రింపఁబడినవి. గిరికయౌవనవిలసనములను "తలఁచి తలఁచి" వసురాజు పరవశుఁడైనట్లు ఈపద్యమందలి "పలుకుల ముద్దును" తలఁచి తలఁచి సహృదయుఁడు రసపరవశుఁడగును. ప్రతిదళమునందును ప్రాస, ప్రాసయతిరూపమున ప్రతిష్ఠింపబడిన 'ల'కారము సహృదయునకు భావనావిషయమై చిత్తమునందు లఘ్వక్షరబాహుళ్యకల్పితమైన ద్రుతవృత్తియందు సౌకుమార్యమును, మాధుర్యమును నెలకొల్పి శృంగారరసము నాస్వాదించుట కనువైన చిత్తభూమికను ఉత్పాదించుచున్నది. ఆదికవి యీ పద్యనిర్మాణమునఁ గావించిన శిల్పమంతయు శృంగారరసవ్యంజన తత్పరమై సార్థకమగుచున్నది.

సీ॥ అంత దేవాహితు లమృతంబు గానక
యెంతయు నలిగి బలీంద్రుఁ గూడి
మంతనంబుండి యమర్త్యులతోడి పొ
త్తింతియచాలు నింకేల యనుచు
సంతనకట్టి యుత్సాహసమేతులై
యంతంబులేని రథాశ్వములను
దంతుల నమితపదాతుల నొడఁగూర్చి
యంతకాకారులై యార్చి యమర
వరులఁదాకి యేసి దురుతరశరపక్ష
జాతవాతరయవిధూత మగుచుఁ
జెదర జలదపంక్తి బెదర వజ్రాయుధు
హృదయ ముదిలకొనఁగఁ ద్రిదశగణము

దళముదళమునను దఱుముకొనివచ్చుచున్న బిందుపూర్వకతకారప్రాసము అసురవరుల విడుపెఱుఁగని సన్నాహముయొక్క స్వరూపమును వ్యంజించుచున్నది. సీసపద్యలక్షణమునం దనుక్తమైన జగణము పెక్కుదళములందు "బలీంద్రు" "అమర్త్యుల" "సమేతు" "రథాశ్వ" "పదాతి" అన్న పదములందు రూపుగొని యసురుల యుత్సాహమును జక్కగాఁబట్టియిచ్చు చున్నది. బిందుపూర్వకతకారప్రాసము మాధుర్యలక్షణమై యసురుల కోపోద్దీప్తిని సుప్రతిష్ఠ నందనీయక భంజించుచున్నది. శరపక్షజాతవాతరయవిధూతమై జలదపంక్తిమాత్రము చెదరు నట్లు చేయఁగల యసురుల యుత్సాహమందలి దీప్తిని అతిశయముగఁ బోషింపకుండుటయే యిచ్చట శిల్పము. వజ్రాయుధు హృదయమును బెదరించి, త్రిదశగణము నుదిలకొనఁజేయు ఆదీప్తియొక్కసారము—

"చెదర జలదపంక్తి బెదర వజ్రాయుధు
హృదయ ముదిలకొనఁగఁ ద్రిదశగణము"

అను చరమపాదద్వయఘటితమైన ప్రాస, అనుప్రాస, ప్రాసయతిరూప దకారపునఃపునరుద్దీప్తి యందు స్ఫుటమగుచున్నది. త్ర్యస్రగతియొక్క స్ఫుటావభాసనమునకుఁ దగినతీరునఁ బదములు నివిష్టములై యీచరమపాదద్వయము దనుజుల యుత్సాహత్వరతను సుష్ఠుగా రూపించుచున్నది.

సీ॥ వారణావతమునవారెల్లఁ బాండవా
గమనంబు విని సంతసమునఁ బెరిగి
కరమొప్పఁ గరిరథతురగబలాఢ్యులై
యెదురువచ్చిరి మహోముదముతోడఁ

గలయంగ గృహములఁ గలువడములు గడు
విలసిల్లె నంబరతలముగప్పి
మలయజమ్మృగమదావిలసలిలంబుల
నిమ్ముగా నార్ద్రీకృతమ్ముల యిన

గీ॥ యంగణుల నొప్పెఁ గర్పూరరంగవల్లు
లంగనలు గయిసేసి యుత్తుంగహర్మ్య
తలములెక్కిరి తత్పురీవిలసనంబుఁ
జూచు పాండుకుమారులఁ జూచువేడ్క.

పాండవాగమనము విని వారణావతమునవారెల్లఁ దమ నగరమును, శరీరమును నలంకరించుకొన్న తెఱంగు వర్ణించు ఈసీసమును నన్నయ్య సర్వప్రాసయతికముగ నిర్మించుటేకాక ప్రాసముచేతకూడ అలంకరించెను. గృహములను, అంగణములను, తమయంగములను వారణావతనరనారీజనము వివిధముల నలంకరించుకొన్న తెఱంగున నన్నయ్య ఈసీసమున పాద ద్వయమున కొక్కొక తీరు ప్రాసమునుంచి యలంకరణవైచిత్రిని చక్కఁగాఁ బ్రదర్శించెను. భిన్న పాదములందు భిన్నప్రాసములను నెలకొల్పుటయు శిల్పమునందలి యొకవిశేషమే యని గ్రహింపవలెను.

ఎఱ్ఱన కావించిన వివిధసీసశిల్పములందును ఇట్టి ప్రయోజవిశేషాపేక్ష గుర్తింపవచ్చును.

సీ॥ ఆరాజపుత్రుల నారూఢతేజుల
వీరుల నున్నతోదారభుజులఁ
గనుఁగొని సుగ్రీవుఁ డనఘుఁ డగ్గిరిశృంగ
ముననుండి తానును దనసచివులుఁ
జింతించి వారివృత్తాంతము నెఱుఁగంగ
సంతతోత్సాహు ధీమంతు శౌర్య
వంతు నుత్తము హిమవంతుఁడుఁబోని య
త్యంత సుస్థిరు హనుమంతుఁ బనిచె

ఆ॥ నతఁడు నరిగి నృపతిసుతుల తెఱంగెల్ల
నెఱిఁగి వనచరేంద్రు నెఱుఁగఁజెప్పి
యుగ్రతేజుఁడైన సుగ్రీవుతోఁ జెల్మి
యొనర సంఘటించె మనుజపతికి.

ఇది సర్వప్రాసయతికమైన సీసము. లోకోత్తరమైత్రీలక్షణమునకు లక్ష్యభూతమైన శ్రీరామసుగ్రీవుల ప్రథమసమాగమమును వర్ణించు ఈసీసమును శిల్పించుటయందు ఎఱ్ఱన యెంతయో అనురక్తిని, ఆసక్తిని ప్రదర్శించియున్నాఁడు. ప్రాసయతులతోపాటు సీసపాదములందు ప్రాసములనుగూడ నెలకొల్పినాఁడు. సర్వపాదములం దేకప్రాసాక్షరమును నిలుపక ప్రథమపాద దళద్వయమున నొకయక్షరము, ద్వితీయపాదదళద్వయమున నొకయక్షరము, తృతీయచతుర్థపాద దళచతుష్టయమున నొకయక్షరమును — ఇట్లు ప్రాసాక్షరములందు వైవిధ్యము చూపినాఁడు. ఆయాపాదములందలి యర్థములు అవాంతరవాక్యరూపముల సమాప్తములగుటచే ప్రాసాక్షరములు భేదిల్లుట, భేదిల్లిన ప్రాసాక్షరములు ఆయావాక్యార్థవ్యంజకములుగా నుండుట శిల్పము.

సూర్యవంశ్యులై యారూఢతేజులైన శ్రీరామలక్ష్మణుల రూపములను వర్ణించుదళము లందు మూర్ధన్యమైన ఆగ్నేయరకారము, సూర్యపుత్రుఁడైన సుగ్రీవుఁడు వారినిఁ దిలకించి ప్రీతుఁడగుటను వర్ణించుదళద్వయమున రక్తసంజ్ఞమైన యనునాసిక నకారము, అతఁడు సచివులతోఁ జింతించి శ్రీరామలక్ష్మణులను దెలిసిరమ్మని హనుమంతునిఁ బుత్తెంచుటను వర్ణించుదళ చతుష్టయమున మాధుర్యవ్యంజకమైన బిందుపూర్వకతకారమును ప్రాసాక్షరముగా నెలకొల్పుట పరమోచితమైన ఛందఃకర్మ, స్వరోదయమైన యనునాసికముకంటె స్వరోపధమైన నకారము అనుస్వారత్వము ప్రాపించి యానునాసిక్యలక్షణమైన రంజనశక్తిని అతిశయముగ భాసింపఁ జేయఁగలదు. తృతీయ చతుర్థచరణములందలి యనుస్వారము క్రమప్రవృద్ధమైన సుగ్రీవుని యనురక్తికి ఉపలక్షకము. కేవలసంక్షేపకథనాత్మకమైన గీతియందు ఈ ప్రాసాసక్తి త్యక్తమగుటయు శిల్పలక్షణమే.

సీ॥ ధృతరాష్ట్రిసఖుఁడైన యతిరథుండను సూతుఁ
డతివలుఁ దానును నతివిభూతి
గంగలో జలకేళిసంగతుండై యుండి
తుంగతరంగానుషంగవశతఁ
జనుదెంచు మంజూషఁగని కడువేడుకఁ
దనపరిజనములఁ బనిచి పట్టి
తెప్పించి ధీయుక్తియొప్ప నేకతమున
నప్పెట్టెఁదెఱచి తానప్పుడందు

ఆ॥ వినుతహేమకవచుఁ గనకకుండలధరు
ననుపమానతేజు ఘనుఁ గుమారుఁ
గని మనంబులోన ననయంబు విస్మయం
బొనరఁ గ్రుచ్చియెత్తికొని ముదమున.

గంగాగర్భమునఁ గలిసిపోవలసిన కర్ణుఁడు అపుత్రకుఁడైన సూతునకు లభించిన యీ ఘట్టముయొక్క ప్రాధాన్యము వేఱుగా వివరింపనక్కఱలేదు. ఆకస్మికపుత్రప్రాప్తిచే సూతుఁ డెంత విస్మయహర్షములను పొందియుండునో సులభముగ నూహింపవచ్చును. సన్నివేశప్రాధాన్య మునుఁబట్టి పద్యమలంకృతమగుట యుచితము. ఆ సన్నివేశమందలి భిన్నాంశములు భిన్నవిధ ములనలంకృతములగుట శిల్పము. గీతియందు ఆసన్నివేశసారమును ఏకప్రాసాలంకృతములైన ప్రాసయతికపాదములలో ప్రతిపాదించుట రమ్యమైనశిల్పము. మంజూషాగతుఁడైన కుమారుని వర్ణనము, తదాప్తిహేతుకమైన సూతుని విస్మయహర్షములు హేతుహేతుమద్భావమున భజించు నైక్యము గీతయందలి ప్రాసైక్యముచే వ్యంజితమగుచున్నది. సీసపాదములం దవ్యవస్థితమైన ప్రాసము గీతియందు స్థాయిత్వముపొంది రసవంతమగుచున్నది.

గీతియందు సూతుని యానంద మాధుర్యమును వ్యంజించు 'న'కారప్రాసము అనంతరము లయిన గద్య కందములందును వ్యాపించియుండుట గమనింపఁదగును.

వ॥ తన జీవితేశ్వరియైన రాధకుంజూపి యిట్లనియె

ఆర. VII. 351.

కం అనపత్యులమైన మనకు
మనపాలిటివేలు పిక్కుమారుని నిచ్చెన్
వనజాక్షి యితఁడు మానుష
జనితుఁడుగాఁ డరయ దేవసంభవుఁడుసుమా.

ఆర. VII. 352.

కం అని దానిచేతి కిచ్చినఁ
గొని యురమునఁగదియ నదిమికొనియెఁ గొడుకు న
వ్వనితకు బాలెంతతెఱం
గునఁ జన్నులుసేపె నపుడు గూరిమిపేర్మిన్.

ఆర. VIII. 353.

నన్నయ, ఎట్టిన పలుతెఱంగుల నలంకరించిన సీసములయొక్క వస్తురసాదివ్యంజన సామర్థ్యమును ఇట్లే సర్వత్ర అనుసంధించుకొనఁదగును.

సీసపద్యనిర్మాణమున నన్నయచేసికొన్న నియమములను తిక్కన పాటించలేదు. యతి ప్రాసనివేశాత్మకమైన నన్నయ్యశిల్పమార్గమును వీడి తిక్కన్న వస్తుప్రతిపాదనవైచిత్ర్యాత్మక మైన మార్గాంతరమును అవలంబించెను.

మన సీసమువంటిదే పాశ్చాత్యుల Sonnet. Sonnet నిర్మాణమునందును స్ఫుటములైన రెండు ఖండములు గలవు. పదునాల్గుచరణముల పరిమితిగల Sonnet లో మొదటి ఎనిమిది చరణములు ఒకఖండము. దీనికి Octave — అష్టపది యనిపేరు. చివరి ఆఱుచరణములకు Sestet - షట్పది యని పేరు. ప్రాసనియమ భేదమువల్ల Sonnet లో భేదములు కల్పింపఁబడినవి. Sonnet నందు ప్రతిచరణమునను అయిదు లగము లుండును. అట్టి చరణములు పదునాల్గు కలిసి Sonnet అగును. Sonnet యొక్క జన్మస్థానము ఇటలీ. ఇటలీయందు పెట్రార్కు మహాకవి Sonnet స్వరూపమును సుందరముగ తీర్చిదిద్దుటచే Petrarchan Sonnet ప్రసిద్ధివహించెను. దీని ప్రాసనియమము —

| | | |
|---|---|---|
| అష్టపదియందు | a b b a a b b a | |
| షట్పదియంధు | c d c d c d | లేక |
| | c d e c d e | లేక |
| | c d e d c e | |

అష్టపదియందలి ప్రథమార్ధమున వర్ణ్యాంశము ప్రతిపాదింపఁబడును. ద్వితీయార్ధమందు అది ప్రపంచింపఁబడును. షట్పదియందలి పూర్వార్ధమున నాయంశము నిరూపింపఁబడును. ఉత్తరార్ధమున ఉపసంహరింపఁబడును.

Shakespeare మహాకవి Sonnet పద్ధతియందు కొంతమార్పుచేసెను. ఆయన Sonnet మూఁడు చతుష్పదులపై నొకద్విపది రూపమున నుండును. ఆయన ప్రాసనియమమిది–

ab ab
cd cd
ef ef
gg

Spencer కవి తన Sonnet నందు వేఱొక ప్రాసక్రమము ననుసరించెను. ఆయన పద్ధతియందు అష్టపది, షట్పదియుఁ గలిసిపోవును. స్ఫుటవిభాగము లేదు. ఆయన ప్రాసక్రమము —

ab ab
bc bc
ed ed
ee

అనఁగా మొదటి పండ్రెండుచరణములందు ఉపక్రాంతమై యుపబృంహితమైన యంశము తుది ద్విపదియందు ఉపసంహృతమగును. Milton మహాకవి మరల Petrarchan Sonnet పద్ధతినే అవలంబించెను. కాని అష్టపదిని, షట్పదిని స్ఫుటముగా వేఱుచేయుపద్ధతిని విడనాడెను.

వైచిత్రీమాత్రప్రయోజనములయిన యీ పాద, ప్రాస వ్యవస్థకంటె Sonnet నందు గుర్తింపవలసిన ముఖ్యలక్షణములను గుఱించి Watts Dunton ఇట్లు వర్ణించెను.

"A Sonnet is a wave of melody ;
From heaving waters of the impassioned soul
A billow of tidal music, one and whole
Flows in the octave : then returning free,
Its ebbing surges in the sestet roll
Back to the deep's of life's tumultuous sea"

సానెట్ ఒకసంగీతతరంగము ; భావావిష్టమైన యంతరంగమునుండి యొక యుత్తుంగ సంగీతతరంగము అష్టపదియందు పొంగివచ్చును. ఆ తరంగము మరల షట్పదియందు తిరుగు ముఖముపట్టి జీవనసాగరగర్భములోనికి దొరలిపోవును.

"The sonnet takes us out on one wave of rhythm and of thought to bring us back on another to the same point"

E. D. Puffer.

ప్రత్యేకమైన యొకయంశము అష్టపదియందు వర్ణింపఁబడి అదియే షట్పదియందు సాధారణరూపమున ఉపసంహరింపఁబడును. ఇది సానెట్ యొక్క ముఖ్యలక్షణము. పాదవర్గీకరణము, ప్రాసవర్గీకరణము ఈ లక్షణమునకు లోఁబడినవే. గణవిన్యాసభేదముగల రెండు తీరుల పద్యములను ఒకపద్యముగా సంఘటించుటయందలి ఆశయము విషయప్రతిపాదనవైఖరియందు వైచిత్రి సాధించుటయే యని భావింపవచ్చును. యతిప్రాసవ్యవస్థా వైచిత్రికి నన్నయ్య ఎక్కుడు ప్రాధాన్యమిచ్చి సులక్షణీయములయిన పదమూఁడుతీరుల సీసములను వ్రాసెను. తిక్కన్న యట్టి నియమములను పెట్టుకొనలేదు.

ఐనను ఎడనెడ తిక్కన రచనయందుఁగూడ నన్నయ్య పథకమునఁ జేర్పఁదగిన పద్యములు కొన్నిగలవు.

6 వ భేదము : ప్రాస । ప్రాస

"చెట్టును తాయును మిట్టయుఁ బల్లంబు"

శాంతి. III. 5.

(సీసము 5 వ దళమున, గీతి 1 వ దళమున సాధారణయతియే కలదు)

12 వ భేదము : య – ప్రా । ప్రా – య

నవ్వెడుతలలును గ్రొవ్వారుచేతులు
బిరుదులువెట్టిన చరణములును

కర్ణ. III. 176

(ప్రథమదళమున యతి యుండవలసినది; ప్రాసమున్నది)

13 వ భేదము : య - ప్రా । య

వితతవీరాగ్రహావేశాదిదర్పిత
చిత్తులై యొండొరు నొత్తరించు

శల్య. II. 262.

16 వ భేదము : ప్రా - య । ప్రా - య

పాండవుచాపంబు ఖండించె నీకొడు
కొండొక ధనువెత్తి యుఱక మాత

కర్ణ. I. 192.

(సీసము 6 వ దళమున ప్రాసయతి యుండవలసినది; యతియే యున్నది.)

సీసపాదములందు ప్రపంచింపఁబడిన విషయమును ఎత్తుగీతియందు ఉపసంహరించుట యను పద్ధతిని తిక్కన్న పెక్కుసీసములందు పాటించెను. సీసపాదములందు ఉల్లేఖింపఁబడిన విషయముయొక్క సారమును గీతమునందు నిబంధించెను.

సీ॥ తొడరిన హరునైన దోర్బలంబునఁ దన్ను
మిగులంగనీఁడను మేటిమాట
యమరేంద్రు నర్ధాసనమునకునైన న
ర్హుండెంతయును నను రూఢిమాట
జమునిల్లునొచ్చిన జంతువునైనను
గాచు నెమ్మెయి నను రాచమాట
దనుఁగోరి యూర్వశి దాన వచ్చిననైన
లోలుండుగాఁడను మేలిమాట

గీ॥ శౌర్యవైభవప్రాభవశౌచములకు
నొరులకైనఁ గైవారమై యుల్లసిల్లు;
నొక్కరుని కివియెల్లను నిక్కమట్టె!
యెందుఁ గల్గునె యర్జునునీడువాఁడు?

విరా. II. 204.

సీసపాదములందు ఉల్లేఖింపఁబడిన మహాకార్యములు గీతిపూర్వార్ధమున మహాగుణములుగా నిరూపింపఁబడి గీతి యుత్తరార్ధమున తాదృగ్గుణసమాహారమైన యర్జునుని నిరుపమానమహిమ యం దుపసంహరింపఁబడి పద్యము పరమాద్భుత రసనిర్వహణసమర్థముగ నిర్మింపఁబడినది. గీతి యుత్తరార్ధమున తళుక్కుమనిమెఱయు అద్భుతరసమునకు అవసరమైన సామగ్రియంతయు సీస

పాదములందు ప్రపంచింపఁబడినది. సీసపాదములందు నిర్వహింపఁబడిన మార్గము గీతి పూర్వార్ధమున విచిత్రమైన మలుపుతిరిగి అంతపఱకు గూఢముగ నున్న యద్భుతమునకు తెఱతొలఁగించి నట్లయినది.

సీసపద్యనిర్మాణమున అతివిచిత్రములైన మర్మములు తిక్కనకు కరతలామలకములు. సోమన, శ్రీనాథుఁడు మున్నగు అనంతర మహాకవులెల్లరును తిక్కన్న సీసనిర్మాణచమత్కృతులను ఉపజీవించినవారే.

సీ॥ తన యొప్పెదురఁగన్నఁ దగిలి యెవ్వరికైన
మలఁగి క్రమ్మఱఁ జూడవలయువాఁడు
తన వర్తనము విన్న మునిజనంబులకైన
నలవరించికొనంగ వలయువాఁడు
తన బంటుతన మాజిఁ గనిన మార్తురకైనఁ
బలుమారు నగ్గింపవలయువాఁడు
తన వితరణకేళి వినినఁ గల్పకతరు
వులకైనఁ దలయూపవలయువాఁడు

గీ॥ నకులుఁ డొరులకు నశ్వశిక్షకుఁడుగాఁగ
నగునె? యాతని దుఃస్థితి యనుదినంబుఁ
గాంచి కన్నీరు డించుచుఁ గడవరాని
దైవఘటనకు నొత్తుఁ జిత్తంబులోన.

విరా. II. 208.

ఇది దేశివృత్తప్రాససీస మనవచ్చును. ప్రథమపాదపూర్వార్ధమునఁ ''దనియకెవ్వరికైన'' యని యుండినచో నియమము పూర్తియయ్యెడిది.

సీసపాదచతుష్టయమునఁ బ్రక్రాంతమార్గము సుష్ఠుగా నిర్వహింపఁబడినది. గీతి యారంభమున మార్గము భేదిల్లినది. గీతి ప్రారంభమందు నివేశింపఁబడిన ''నకులుఁడు'' అను పదమునకు పూర్వాపరభాగములం దాతని భూతవర్తమానస్థితులు కూర్పఁబడి ప్రతియోగమున నాతని దుఃస్థితి యుత్కటముగ భాసించి కన్నులనీరు దెప్పించి దైవదుర్ఘటనమున పర్యవసించుచున్నది. గీతి మొదట ''నకులుఁడు'' అను పదము వచ్చువఱకును పద్య మెచ్చటికిఁబోవుచున్నదో తెలియదు. సీసమును గీతమును అతుకుపెట్టుచు ఆ పదము అచ్చటనుండి చిత్తమును చమత్కృతము చేయుచున్నది. సీసపాదముల యారంభములందును, అంతములందును అకృత్రిమసిద్ధములయిన ప్రాసములు, నను ప్రాసములును, సీసపాదఖండములం దేడింట నేర్పడిన ప్రాసయతులును పద్య

మునకు సహజమైన శోభను చేకూర్చుచున్నవి. ఇందలి ప్రాసానుప్రాసవిశేషములు తిక్కన్న చేసికొన్న నియమములుకావు. నకులుని రూప, శీల, శౌర్య, ఔదార్యములు స్మరించి యార్ద్రచిత్తయైన ద్రౌపది వదనమునుండి వెలువడిన వాక్యములందు అయత్నముగ నేర్పడిన సహజాలంకారములు పద్యమును ఒక రమణీయశిల్పముగఁ దీర్చిదిద్దినవి.

సీ॥ బ్రాహ్మణభక్తియుఁ బరహితశక్తియు
నిర్మలమతియును నీతిరతియు
సత్యభాషణమును సాధుపోషణమును
జిరవితరణమును సేవ్యగుణము
సన్మార్గరక్షయు సున్మత్తశిక్షయు
నంచితోదయముఁ గృపాతిశయము
బంధుసంప్రీతియు భవ్యవిభూతియు
శాస్త్రోపగమము నస్ఖలితదమము

గీ॥ సజ్జనస్తవనీయసౌజన్యములును
ధర్మసంచితబహుధనధాన్యములును
గలుగు నక్షీణపుణ్యదోహలుఁడు ధర్మ
సూనుఁడున్న దేశంబున మానవులకు.

ఇందు ప్రతిపాదఖండాంత్యప్రాసము గుర్తింపనగుచున్నది.

ఈ పద్యముయొక్క యుపక్రమము, నిర్వహణమార్గము ధర్మజుని గుణగణములు వర్ణింపఁబడుచున్నవను భ్రాంతినిఁ గల్గించును. గీతియుత్తరార్ధప్రారంభమున "కలుగు" నను పదము పద్యపర్యవసానస్వరూపమును పూర్తిగా మార్చివేయును. ఉల్లిఖితములైన సర్వలక్షణములు ధర్మజుఁడున్న దేశమునందలి మానవులకు సంక్రమించి ధర్మజుని యక్షీణపుణ్యదోహలత్వము పద్యమునకు సారభూతమైన యంశముగా రూపొందును.

ధర్మజప్రశంస వస్తువైనపట్ల తిక్కన్న తఱచు సీసపద్యములనే యుపయోగించును. ఆ పద్యములనుగూడ ఆ చక్రవర్తి యుదాత్తతకుఁ దగిన యుజ్జ్వలస్వరూపవిశేషములతో మూర్తీభవింపఁజేయును. పై పద్యనిర్మాణమున తిక్కన విశేషముగా యత్నవంతుఁడైనట్లు స్ఫుటమగుచున్నది. ఇది భీష్ముఁడు ధర్మజుని యునికిని నిర్దేశించు పద్యము. ధర్మజుని మహిమ మెట్టిదనఁగా ఆయన యజ్ఞాతముగ నడఁగియున్న నెలవునుగూడ అది యిట్టె పట్టియీఁగలదు. ఎంత దాచినను దాగని ధర్మజుని లోకోత్తరమహిమను భీష్ముఁడత్యంతప్రీతితోఁ గొనియాడుచున్నాఁడు. ధర్మజుని ప్రభావము ఆయన యున్నదేశమందలి సర్వమానవులందును ప్రకటితమగుచుండును.

అనుపదాంత్యానుప్రాసయుతమై సువిభక్తవిరామ, పాదమైన యీ పద్యము ధర్మజుని మహిమ కెత్తిన నీరాజనము. మత్స్యరాజ్యప్రజలవర్ణనచే ధర్మజునిమహిమ పర్యాయోక్తమై పద్యనిర్మాణ సౌభాగ్యమును ప్రయోజనవంతము చేయుచున్నది. ప్రతిపాద్యాంశము మత్స్యదేశమానవులయి నచో పద్యమిట్లుండదు. ప్రయత్ననిర్వర్తితమైన పద్యశిల్పమంతయు ధర్మజుని కీర్తికి ధ్వజమెత్తు చున్నది. గీతి చరమపాదము ముగియువఱకును భీష్ముని ప్రతిపాద్యాంశమేమో శ్రోతలకుఁదెలి యదు. పద్యాంతమున నాయన భావము గుప్పున పరిమళించి చమత్కారాతిశయమును ఆవహిం చును. ఇట్టి యంత్యానుప్రాససీసములు నన్నయ్య, ఎఱ్ఱన వ్రాయలేదు.

సీ॥ చనునె వేఱొకని కజాతశత్రుండను
పేర దిగ్విజయంబు పెంపుఁదాల్ప ?
రాజసూయమహాధ్వరము గోరి చేయంగఁ
దీఱునే పెఱ ధరిత్రీపతులకు ?
ధర్మైకనిరతుఁ డాతం డొక్కరుఁడచూవె
యనఁ జన నొరులకు నలవియగునె ?
నిత్యవ్రతంబుగా సత్యంబు పాటింప
వచ్చునె యొరల కెవ్వరికినైన ?

గీ॥ అయ్యుధిష్ఠిరు గాంభీర్య మతని ధైర్య
మరయ నొండెడఁ గల్గునె? యతఁడు కీర్తి
ధరుఁడు గరుణోత్తరుఁడు మహీసురసమృద్ధి
కరుఁడు నిజవంశకరుఁ డుపకారపరుఁడు.

విరాట. II. 184.

సీసపాదములందు సామాన్యముగా నభివర్ణితములైన యంశములు గీతిపూర్వార్థమున యుధిష్ఠిరపరముగా నన్వితములైన గీతియుత్తరార్ధమున నంత్యానుప్రాససుందరములయిన విశేష ణములం దుపసంహృతములయినవి. అనుప్రాసరంజితమైన గీతియుత్తరార్ధము మణిగణఖచిత మైన కిరీటకోటివలె మిలమిలమెఱయుచు శీర్షకనామమును అన్వర్థముచేయుచున్నది.

తిక్కన్న సీసపద్యములందు ప్రఖ్యాతమైన ఈ పద్యము చూడుడు.

సీ॥ ఎవ్వని వాకిట నిభమదపంకంబు
రాజభూషణరజోరాజి నడఁగు
నెవ్వని చారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపు గఱపు

నెవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి
మానితసంపద లీనుచుండు
నెవ్వని గుణలత లేడువారాసుల
కడపటికొండపైఁ గలయఁ బ్రాకు

గీ॥ నతఁడు భూరిప్రతాపమహాప్రదీప
దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి
తలఁడు కేవలమర్త్యుఁడే ధర్మసుతుఁడు?

ఇది వృత్త్యప్రాససీసము - ద్విప్రాసముగూడ గుర్తింపవగుచున్నది.

సీసగీతములు యత్తత్ళబ్దములచే చిక్కగా బంధింపఁబడి యవినాభూతత్వభాజనము లగుచున్నవి. గీతియంతమున నిబద్ధమైన 'ధర్మసుతుఁడు' అన్న పదము కిరీటకోటిఘటిత మాణిక్యసాదృశ్యమును భజించుచున్నది. పద్యాంతమువఱకు గుప్తమైన ధర్మసుతపదము పద్యాంతమున ఆకస్మికముగ భాసించి యద్భుతపోషకమగుచున్నది. ఇట్లు రసపోషకముగా సీసము నిర్మించుట తిక్కన యుపజ్ఞ. ఈ పద్యనిర్మాణశిల్పము ఆంధ్రుల హృదయముల కెక్కినది. సర్వాంధ్రకవులను మరులుకొల్పినది. ఆదికవి సీసనిర్మితికంటె కవిబ్రహ్మ నిర్మితియే విశ్వజనీన మైనది.

నిరతిశయచమత్కారకారి యగునట్లు పద్యమును నిర్మించి యలవోకగా ఆద్భుతరసము పోషించుటయందు కవిబ్రహ్మకు ఆయనయే సాటి. చూడుఁడు :

సీ॥ నడదివియలుచేసె నగరికి మాణిక్య
మకుటముల్ పూనిన మనుజపతులఁ
దగునాజ్ఞ సూయాణముగ నొనరించె మం
చిగ నేల నాలుగుచెఱగులకునుఁ
బ్రీతార్థిజనుల సచేతనత్యాగధ్వ
జములుగా నన్నిదేశములఁ బఱపె
దిక్కులన్నింటను దెలుపాఱు పూతఁగా
వించె నిర్మలయశోవిభ్రమంబు

గీ॥ రాజసూయాధ్వరప్రవర్తకుఁడు, నిత్య
సత్యభాషామహావ్రతశాలి, పాండు

రాజదుగ్ధపయోనిధిరాజు, ధర్మ
రాజుసుమ్ము! మాత్స్యవసీరమణ! యితఁడు!

రచనాశిల్పము పరకోటినందిన పద్యమిది. ''మనుజపతుల'' ''నడదివియలు'' చేసెననుట యందలి యక్షరరూపకము లోకోత్తరచమత్కారి. గీతియందలి విరామము శ్రోతయందు ఔత్సు క్యమును జక్కఁగా పోషించుచున్నది. గీతిచరణములందు అన్నింటను రెండక్షరములు ఖండింపఁ బడి యనంతరచరణముతో నతుకఁబడి పద్యగమనమునకు విచిత్రమైన సౌందర్యము నాపాదించు చున్నవి. పాదోపాంతవిరామముచే పద్యము ఎదురునడక నడచినట్లున్నది. వాక్యస్థానీయము లైన పాదములు పర్యంతమున విరమించుచు పద్యార్థసారగ్రహణోత్సుకుఁడైన విరాటుని యౌత్సుక్యమును పరకోటికిఁ గొనిపోవుచున్నవి. పాండవులు విరాటునకుఁ దమ్మెఱింగించు కొను సందర్భమున అర్జునుఁడు ధర్మజుని విరాటున కెఱింగించు పద్యమిది.

''నడదివియలు చేసె నగరికి మాణిక్య
మకుటముల్ పూనిన మనుజపతుల''

అర్జునుఁ డెవ్వనినిగుఱించి చెప్పుచున్నాఁడు? ఎవఁడో ఒకమహాపురుషుఁడు. అతనికీర్తి యంతఃపురమునం దారంభమై పాదపాదమున పరిబృంహితమై నాల్గవపాదమున దశదిశల నావ రించినది. అతఁడు – ''రాజసూయాధ్వరప్రవర్తకుఁడు'' – షోడశమహారాజులలో నొక్కఁడా? ''నిత్యసత్యభాషామహావ్రతశాలి'' – హరిశ్చంద్రాది షట్చక్రవర్తులలో నొక్కఁడా? ''పాండు రాజదుగ్ధపయోనిధి రాజు'' – పాండవు లైదుగురలో నొక్కఁడా? ''ధర్మరాజుసుమ్ము మత్స్యావనీ రమణ!'' – అటనున్న అయిదుగురిలో ఎవ్వఁ డా ధర్మరాజు? ఇంతవఱకు విరటుని యౌత్సు క్యము క్రమముగ నెక్కి శిఖరము ముట్టినది. పద్యాంతమున ''ఇతఁడు'' అనుటతో ఆ యౌత్సుక్య మొక్కసారిగా పరమాద్భుతరసమైనది. ప్రతిచరణోపాంతవిరతిచే గీతము ఎదురునడక నడచి యాశ్చర్యమును పోషించుచున్నది. యతిప్రాసలయందు వైచిత్రి లవమేని లేని యీ పద్యము నిరలంకృతమయ్యును నిర్మాణసౌష్ఠవముచే పద్యమెట్టిఫలము నిర్వహింపఁగలదో నిరూపించు చున్నది. ''మనుజపతుల'' యందు ''నడదివియలు'' ఆరోపింపఁబడి యర్థగతమైన రూపకము అక్షరములచే సమర్థింపఁబడుచున్నది. తిక్కన్నయొక్క నాటకీయమైన కావ్యరచనాప్రక్రియకు ఇట్టి పద్యరచన ప్రాణము.

ఛందోగతమైన నాటకీయత యనఁగా అభినయనిరపేక్షముగ రసాద్యర్థవ్యంజన సామ ర్థ్యము గలిగియుండుట లేదా అభినయమునకు సహకరించుతీరున అక్షర, పద, విరామ, పాదా దికము గలిగియుండుట.

పాండవులు వేషువవలేచి రాజతనయోచిత మాననీయవేషములు ధరించి విరటుని సభమ ప్రవేశింతురు. ధర్మజుఁడు విరటుని సింహాసము నధిష్ఠించును. భీమాదు లుచితాసనము లలంక రింతురు. ఇంతలో ——

వేడ్కఁ దొడి పూసి కట్టి యవ్విరటుఁ డుత్త
రుండు దోఁజనుదేరఁ గొల్వుండుబుద్ధి
నచటి కేతెంచి, కని, విస్మయంబునొంది
యెల్లిదంబుగఁ దలఁచుచు నిట్లులనియె —

కం॥ ఇదియేమి కంక! నీ వు
న్మదవృత్తిని శంకదక్కి నా గద్దియపైఁ
బదిలంబుగఁ గూర్చుండితి?
వదియునుగా కిపుడు డిగ వహంకారమునన్?

భావోచితవిరామవంతమై లఘుచ్ఛందమైన యీ కందము వాక్యార్థమును ప్రత్యక్షకల్పము చేయుచు రచనయందలి నాటకీయతను రూపించుచున్నది. విరటుఁడు ప్రవేశించుట, సభ నాక్రమించియున్నవారిని చూచుట, గుర్తించుట, ఆశ్చర్యపడుట, ఎల్లిదమని తలఁచుట – అంతయు కన్నులయెదుట జరిగినట్లున్నది. విరటుని తత్కాలచిత్తవృత్తియంతయు ''ఇది యేమి కంక!'' అన్నమాటలలో నిమిడియున్నది. విరటుని మాటలకు అర్జునుఁడు మందహాసముతో సమాధానము చెప్పును – "నడదివియలుచేసె నగరికి" – ఇత్యాది.

ఈ పద్యమందలి చమత్కృతియంతయు అర్థరచనాగతమేయని తలఁపరాదు. ఆ యర్థ రచన సీసపద్యమున నిబద్ధమగుటచేతను, ఆ సీసపద్యము ఇట్టి వింతవిఱుపులు కలదగుటచేతను శోభావహము కాఁగలిగినది. వచనమునందో, మఱియొక వృత్తమునందో నిబద్ధమైనచో ఆ యర్థము ఇంత చమత్కారకారి కాఁగలిగియుండదు. ''ధర్మరాజాసుమ్ము మత్స్యావనీరమణ! యితఁడు" అని యంతతో నాగక అర్జునుఁడు —

''ఈతఁ డజాతశత్రుఁడు మహిం దగ దిగ్విజయంబుచేసె''

ఇత్యాదిగా పలుకును. ''ఇతఁడు" అని పూర్వపద్యాంతమున నిలిచిన పదమును ''ఈతఁడు" అని ఉత్తరపద్యారంభమున పునర్గ్రహించి సాగఁదీయుటయు నొక చమత్కారవిశేషమే.

''నడదివియలు చేసె నగరికి" ఇత్యాదిగా లఘ్వక్షరములతో నారంభమైన పద్యము క్రమముగ దీర్ఘాక్షరములను గలుపుకొనుచు పద్యాంతమునకు మధ్యవిలంబగతుల నడచి ''రమణ యితఁడు'' అను లఘ్వక్షరసంపుటితో ముగియుచున్నది. విరటుని పరీక్షించుటకు పాండవులాతనిసభ నాక్రమించికూర్చుండిరి. పరీక్షఫలిత మెట్లగునో! తమ్మెఱింగియు అవమానించినచో శిక్షింతమని ధర్మజుఁడు తమ్ముల యుద్రేకమును అణఁచియుంచెను. ''ఇదియేమి కంక" అన్న పద్యమున విరటుని యుద్ధతి ప్రకటితమైనది. అర్జునుని హృదయము సత్వరగతియైనది. దానిని క్రమముగ ప్రకృతికిఁదెచ్చిన యర్జునుని యత్నము సీసపద్యమందలి యక్షరవిన్యాసమున గుర్తింపవచ్చును.

మార్గాభేదరూపమైన సమతాగుణము స్ఫుటముగా భాసించు సీసపద్యములు తిక్కన రచన యందు తండోపతండములుగాఁ గలవు. కీచకవధ వృత్తాంతమునందలి సీసములన్నియు నించు మించుగ నిట్టివే.

పద్య మెటుపోవుచున్నదో సీసపాదములు నడచుచున్నంతకాలము తెలియరాదు. గీతారంభ మున గతిమాఱి వర్ణ్యాంశము ప్రత్యక్షమగును. తిక్కన రచనామార్గము ననుసరించి చూచినచో సీసపద్యము ఏకాన్వయముగల రెండుపద్యములచే నిర్మింపఁబడిన స్వయంసంపూర్ణమైన ఖండ కావ్యము అని చెప్పవచ్చును.

సీ॥ కాంతి దళ్కొత్తు నీ కడకంటిచూడ్కితోఁ
బొందఁగానని మేను పొగులుటయును
దీపారు నీపల్కు దెల్లంబుగా వినఁ
గానని వీనులు గందుటయును
నింపగు నీ చెయ్వు లెలమిమైఁ గొనియాడఁ
గానని కోర్కులు గలఁగుటయును
సొగయించు నీ కేళిఁదగిలి యానందంబుఁ
బొందఁగానని మది గుందుటయును

గీ॥ బాయ; నాదగు జన్మంబు ఫలమునొంద
భావజన్మునిపూనిక పారమెయ్య
నన్ను బంటుగా నేలుము నలినవదన!
యింక నీ సిగ్గుదెర యోల మేల నీకు?

విరాట. II. 118

సీసపాదములందు వర్ణితములయిన యంశములన్నియు గీతి ప్రథమపాదారంభమందలి 'పాయ' నను క్రియయం దన్వితములై గీతియం దుపసంహృతము లగుచున్నవి. 'ఇంక నీ సిగ్గు తెరయోల మేల నీకు?' నన్నవాక్యము ప్రతిపాద్యాంశసారముగాఁ బద్యావసానమునఁ దేలు చున్నది.

సీ॥ నేలయు నింగియుఁ దాళముల్గాఁ జేసి
యేపున రేఁగి వాయించియాడఁ
గులపర్వతంబులఁ గూర్చి యొండొంటితోఁ
దాఁకంగ వ్రేఁకమైఁ దన్నియాడ

నేడుసాగరములు నిక్కడక్కడఁ బెట్టి
పలుచనిరొంపి మైనలఁది కొనఁగ
దిక్కులునాలుగు నొక్కచోటికిఁ దెచ్చి
పిసికి పిండలినేసి పిడుచగొనఁగ

గీ॥ మిగిలి బ్రహ్మాండభాండంబు పగులవ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గండరించిన రూపంబుకరణి భీముఁ
డతియభంకరాకారత నతిశయిల్లె.

విరాట. II. 134.

సీసపాదచతుష్టయమున వర్ణింపఁబడిన భీముని క్రోధవిజృంభితమూర్తియొక్క క్రమవర్ధనము "మిగిలి" యను క్రియయందు అన్వితమై 'అతిభయంకరాకారత 'నతిశయిల్లె' నన్న గీతిచరమపాదమునఁ ఖండితమగుచున్నది. 'అతిశయిల్లె' నను పదమువలనఁ బద్యమందలి యతిశయోక్తిముద్ర ధ్వనించుట యిందొక చమత్కృతి.

సీసపాదములందలి యర్థములను గీతియందుఁ దీర్మానముచేయుటకుఁ దిక్కన తఱచుగాఁ గ్రమాలంకారము నవలంబించును. సీసపాదార్థములు గీతిపాదార్థములతో సంగతములగుపట్టులఁ జిత్తము చమత్కృతమగుచుండును.

సీ॥ నెత్తమ్మిరేకుల మెత్తందనము దెచ్చి
యచ్చున చెట్టిన ట్లందమొంది
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి
కుప్పలునేసిన ట్లొప్పుమెఱసి
చందురు నునుఁగాంతి కందేర్చి కూర్చి బా
గునకుఁదెచ్చినయట్లు గొమరుమిగిలి
యళికులంబుల కప్పు గలయంతయును దెచ్చి
నారువోసినభంగి నవకమెక్కి

గీ॥ యంఘ్రితలములు, గుచములు, నాననంబు,
గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి
యనుపమానభోగములకు నాస్పదంబు
కాదె యీ త్రిప్పులేటికిఁ గమలవదన?

విరాట. II. 52.

సీసపాదములందలి యుపమానములు గీతియందలి యుపమేయములతో నన్వయించి యనుపమానభోగములకు నాస్పదమైన ద్రౌపదీదేవి రుచిరమూర్తి పాదాదిమస్తకాంతము క్రమముగ వికసించి శ్రోతకుఁ బ్రత్యక్షమగుచున్నది.

సీ॥ శ్రవణపుటంబులు బ్రయ్యంగఁ దాఁకి సం
క్షోభంబుగావించె గుణము మ్రోఁత
బ్రహ్మాండభాండంబు వగిలించి భూతని
శ్చైతన్యమొనరించె శంఖరవము
గగనభాగంబెల్లఁ గప్పి క్రాలుచు బెగ
డడరించె నుగ్రంపుఁ బడగపఱపు
మిఱుమిట్లుగొని చూడ్కి పటివోవ వెలిఁగి ప
రిభ్రాంతి సేసె గిరీటకాంతి

గీ॥ తెల్ల మిది గాండివంబును దేవదత్త
మును గపిధ్వజమును వాసవునివరముఁ
గన్న మకుటంబునగు వేఱకొన్నియైన
నుజ్జ్వలాద్భుతభంగునై యున్నె యిట్లు?

విరాట. IV. 180.

సీసపాదముల వర్ణితములయిన క్షోభ స్తంభ భయ భ్రాంతి జనకములయిన వస్తువులు క్షణవిలంబనానంతరము ద్రోణునకు గాండివాదులుగాఁ దెల్లమైనవి. అవి యుజ్జ్వలాద్భుతభంగులగుటచేతనే యట్లు దెల్లమైనవి. సీసపాదములందలి యతిశయోక్తులసారము గీతిచరమపాదమందలి యద్భుతరసమునఁ బర్యవసించినది.

వర్ణ్యాంశముయొక్క లోకోత్తరత్వమును వ్యంజించుటకై సీసపాదములందు దానిని పునః పునరుద్దీప్తముగావించుట తిక్కన సీసపద్యనిర్మాణమునఁ దఱచు గుర్తింపనగుచుండును.

సీ॥ రాత్రిమై దాఁకి క్రూరతఁబోరి మగఁటిమి
వాసిన యంగారపర్ణుకంటె
ఘోషయాత్రావిధిఁ గురురాజుఁ జెఱపట్టి
మానమేదిన చిత్రసేనుకంటె
ఖాండవోద్యానంబుఁ గావనేఱక సిగ్గు
వడిచన్న నిర్జరప్రభునికంటెఁ

గ్రీడాకిరాతుఁడై క్రోడంబునకుఁ గాఁగఁ
బెనఁగిచిక్కిన త్రిలోచనునికంటె

ఆ॥ నెక్కుఁడైన వీరుఁ డే నర్జునునితోడఁ
బోడుతు నోడుతు ననినఁ బోలుఁ గాక
వినుము సూతతనయ మనబోఁటు లాతనిఁ
జెఱుతుమనుట నోరిచేటు గాదె?

కర్ణ. II. 24.

భావనారమణీయములయిన తిక్కనసోమయాజి సీసపద్యనిర్మాణభంగుల యందములు విశ్లేషించి నిరూపించుట యాసాధ్యమైనపని. పఠించి యనుభవమువల్లనే వాని వైభవము శ్రోత గ్రహింపవలయును. బహుప్రకారమైన యాయన సీసనిర్మాణము నీక్రిందిపద్యములందు దర్శింప వచ్చును —

విరాట. II – 67, 315, 360, IV – 210, V – 4, 56,

భీష్మ. I – 106, ద్రోణ. III – 62, కర్ణ. I – 62, 73, 115,

శల్య. I – 102, 116, 255, II – 233, 255, 399.

అను. I – 182, 27. (ఇది దిఙ్మాత్రోదాహరణము)

కవిత్రయమువారి సీసములు కథనాత్మకములు, వర్ణనాత్మకములునని రెండుతెఱఁగులు.

కథనాత్మకములందు – నామకథనము, వృత్తాంతకథనము, ఇతిహాసకథనము. ఇతిహాసపరంపరాకథనము, నీతికథనము, మహాత్మ్యకథనము – ఇత్యాదివిషయభేదము గమనింపఁదగియున్నది.

వర్ణనాత్మకములందు – ఆలంబన రూప గుణ వర్ణనాత్మకములు, అను భావ వర్ణనాత్మకములు, సాత్త్వికభావ వర్ణనాత్మకములును గలవు. వర్ణనాదికము కవికృతము, కవినిబద్ధవక్తృకృతము గలదు. వర్ణనాత్మకసీసములను కవిత్రయము తఱచు సమతాగుణవిశిష్టములుగా నిర్మించిరి. ధర్మజ, పార్థ, కర్ణ, దుర్యోధనాదులగు నాయక ప్రతినాయక వర్ణనములందు, ద్రౌపది, ఉత్తరమున్నగు నాయికల వర్ణనమునందు వినియుక్తములయిన పద్యములు నిర్మాణ సౌష్ఠవముచే నత్యంతశోభాన్వితములై యున్నవి.

గంభీరవస్తువర్ణనమునందు, విస్తృత విషయప్రతిపాదనమునందు, నాయక ప్రతినాయకుల గుణకీర్తనమునందు వినియుక్తములయిన సీసములు పెక్కుతీరుల నలంకృతములై వర్ణితమైన యర్థముయొక్క యుదాత్తతకుఁ దగియున్నవి.

విరాటపర్వమున – విశేషించి కీచకవృత్తాంతమున, ఆలంబనోద్దీపనవిభావములను, అనుభావసాత్త్వికభావములను వర్ణించుటకుఁ దిక్కన యుపయోగించిన సీసముల నిర్మాణసౌష్ఠవము అత్యంతశోభాన్వితమయియున్నది. అట్లే యుద్ధపర్వములందు సేనాంగములను, సేనావిజృంభణములను, నాయకప్రతినాయకుల రూపగుణకర్మలను, వీరాలాపములను, యుద్ధరంగములను వర్ణించుపట్ల కవిబ్రహ్మ సీసములు వర్ణ్యాంశ సాక్షాత్కారణసమర్థములై పరమరమణీయశిల్పములై యున్నవి.

వర్ణనాత్మకసీసముల నిర్మాణమునందే కవిత్రయము మిక్కిలి యత్నవంతులై యుండిరని గుర్తింపవచ్చును. ద్విత్రిప్రాసములు, అంత్యప్రాసములు అట్టి సీసములందే నివేశింపఁబడియున్నవి. నన్నయ, ఎఱ్ఱన నిర్మించిన ప్రాస, ప్రాసయతి ప్రధానములగు సీసములు తఱచు రసభావాదిప్రాధాన్యముగల పట్టులందే గోచరించును.

ఉపమా, రూపక, సందేహ, ఉత్ప్రేక్షాద్యలంకారపరంపరాప్రతిపాదనమునఁ గవిత్రయము విశేషించి తిక్కన – సీసపద్యములను ప్రయోగించియుండిరి. వీరాలాప విలాపబాహుళ్యము నందును వారు సీసముల నుపయోగించిరి.

వర్ణితములయిన వస్తువుల, గుణముల, క్రియల సామ్యమును వ్యంజించుటకు ఆ సందర్భములందలి సీసములు నియతపాదాంతవిరామములు, తుల్యారంభావసానములునై సమతాగుణబంధురములై యుండుట గుర్తింపవచ్చును.

కథనసీసములం దీలక్షణము పాటింపఁబడక అవి గద్యకల్పములై యుండుటయు గుర్తింపవచ్చును. ఆయా ప్రకరణములం దుదాహృతములయిన సీసములు కవిత్రయమువారి సీసనిర్మాణశిల్పమును, అందలి వైచిత్రిని, వాని రసాద్యర్థానురూపత్వమును నిరూపించుచున్నవి కనుక విస్తరభీతిచే నీయంశ మింతట నుపసంహరింపఁబడుచున్నది.

# తేటగీతి

"మిత్రుఁడొక్కఁడు వీణియ మీటుచుండ
విబుధవరు లిద్ద ఱర్థంబు విప్పిచెప్ప
నినులు నిద్దఱు వినుచుండ నేకగతిని
దేటగీతంబు మూఁటను వాటమయ్యె."

అప్ప IV. 534.

ఒకసూర్యగణము, రెండింద్రగణములు, రెండుసూర్యగణములు – వెరసి యైదుగణములు క్రమముగాఁగల నాల్గుపాదములు కలిసి తేటగీతి యేర్పడును. నవవిధగీతులలోఁ దేట

గీతి సమగీతిభేదముగాఁ జెప్పఁబడినది. "ఏకగతి" యగుటచే సమగీతియనుట యుచితము. "అర్థంబు విప్పిచెప్ప" ననుటవలనఁ దేటగీతి యనుటయు సార్థకమే యని భావింపఁదగును.

ఉపజాతియగుటచేఁ దేటగీతికిఁ బ్రాసనియమము లేదు. యతినికాని, ప్రాసయతినికాని యథేష్టముగ నుపయోగింపవచ్చును. తేటగీతిపాదము ఆటవెలఁదిపాదము ప్రమాణము నందొక్కటియే – మూఁడు సూర్యగణములు, రెండింద్రగణములు, గణముల విన్యాసమున భేదముగలుగుటచే గతియందుఁ గొంత భేదము గలిగినది. సూర్యగణములనడుమ నింద్ర గణములువచ్చి గతియందు భేదమేర్పడి చమత్కృతి గలుగుచున్నది. 17–19 మాత్రలు, 12 – 17 అక్షరములు నుండవీలయిన తేటగీతి పాదప్రమాణము చాలవఱకు సుఖముగ నుచ్చ రింపఁదగినదే. మూఁడుగణములమీఁద (మూఁటను) యతిచెప్పుట పాదప్రయోగమును సుఖతర నిర్వర్త్యము గావించుటకు. సమగతియైన యిది విషమగతియైన యాటవెలఁది యతికినంత స్నిగ్ధముగా సీసముతో నతుకదు. సంస్కృతమునందలి శ్లోకమువలెఁ బ్రసన్నార్థములను బ్రతి పాదించుటకు తేటగీతి సమర్థమై ఛందమని భావింపవచ్చును. కందమువలె మితహితవాక్యములందు తేటగీతిప్రయోగము భారతమునఁ దఱచుగాఁ గనఁబడుచున్నది

ఆంధ్రమహాభారతమునందలి తేటగీతులు మొత్తము 1876 :

| | | |
|---|---|---|
| నన్నయవి | — | 183 |
| ఎఱ్ఱనవి | — | 109 |
| తిక్కనవి | — | 1584 |

నన్నయకుఁ దేటగీతియందుకంటె నాటవెలఁదియందు ప్రీతియెక్కుడుగాఁగనిపించుచున్నది. ఆయన 183 తేటగీతులకు 195 ఆటవెలఁదులు వ్రాసెను. సీసములమీఁదఁగూడ 26 తేటగీతులకు 225 ఆటవెలఁదులు వ్రాసెను. ఎఱ్ఱన 109 తేటగీతులకు 91 ఆటవెలఁదులే వ్రాసెను. తిక్కనయు 1584 తేటగీతులకు 1022 ఆటవెలఁదులనే వ్రాసెను. సీసములమీఁదగూఁడఁ దిక్కన 783 తేట గీతులకు 369 యాటవెలఁదులే వ్రాసెను.

సూర్యేంద్రగణనిర్మితమైన తేటగీతియందు లఘుబాహుళ్య,గురుబాహుళ్య లఘుగురుసామ్య ములచే ద్రుతవిలంబితమధ్యవృత్తులను భాసింపఁజేయవచ్చును. పదవిన్యాసవైచిత్రిచేత నవిద్య మాన (లాక్షణికానుక్త)గణములను రూపింపవచ్చును. నానారసాద్యర్థములందు యథోచితనిర్మాణ విశేషముచేఁ దేటగీతిని ప్రయోగింపవచ్చును.

సీసపద్యమునందువలెనే తేటగీతియందును నన్నయ యతి, ప్రాసయతి భిన్నభంగుల నివేశించి కొన్నిభేదములను సాధించెను. ఆ భేదములను నియతములుగాఁ బాటించెను. ఆయన మార్గము ననుసరించి యెఱ్ఱనకూడ ఆనియమములను బాటించెను. తిక్కన సీసములందు వలెనే గీతములందును యతి – ప్రాసయతులను యథేష్టముగఁ బ్రయోగించెను. అయినను

నన్నయ నియతములుగా నిర్మించినభేదములు తిక్కన రచనయం దెడనెడ గోచరించుచునే యున్నవి. ఆయన వానిని బ్రయత్నించి నిర్మింపలేదుగనుక వానిని బ్రత్యేకముగా బరిగణనము చేయ నవసరములేదు.

యతి – ప్రాసయతి నివేశభేదముచే దేటగీతియందు సాధింపఁదగిన భేదములు —

1. సర్వపాదములందును సాధారణయతి
2. సర్వపాదములందును ప్రాసయతి
3. విషమపాదములందుఁ బ్రాసయతి
4. సమపాదములందుఁ బ్రాసయతి
5. పూర్వార్ధమునఁ బ్రాసయతి
6. ఉత్తరార్ధమునఁ బ్రాసయతి

నన్నయ, ఎఱ్ఱన వీనిలో మొదటి నాలుగుభేదములే వాడిరి.

1 వ భేదము :

అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు
వల్లగలిగిన నీవిప్డు నాకు దాసి
వగుము, మఱి యందు నల్ల లేదయ్యెనేని
నీకు నే దాసినగుదుఁ బన్నిదము సఱను.

ఆది. III. 32.

2 వ భేదము :

ఏను గుర్వర్థ మర్థినై మానవేశ
కడఁగి వచ్చితి నిపుడు నీకడకు వేడ్క
దండితారాతి నీదేవి కుండలమ్ము
లిమ్ము నాకోర్కి యిది సఫలమ్ముగాఁగ.

ఆది I. 95.

3 వ భేదము :

కన్నియలతోడ నాడుచునున్నదానిఁ
బాదమర్దితమై యొక్క పన్నగంబు
గఱచెఁ గన్నియలందఱు వెఱచి పఱచి
యఱచుచుండఁ బ్రమద్వర యవనిఁద్రెళ్లె.

ఆది. I. 147.

4 వ భేదము :

సుతుల విద్యాప్రవీణతఁ జూచువేడ్క-
నెంతయును సంతసంబునఁ గుంతిదేవి
రాజసన్నిధి గాంధారరాజపుత్రి
కెలన నుండె నున్మీలతనలినసేత్ర.

ఆది. VI. 6.

5, 6 భేదములను నన్నయగాని యెఱ్ఱనగాని వ్రాయలేదు. ముద్రితప్రతులనుబట్టి కొన్ని పద్యములం దీ నియమములకు భంగము వాటిల్లినట్లగపడుచున్నది.

ఆది. VI. 53 వ పద్యము రెండవపాదమును "యొగిఁదదీయమూర్ధాఘ్రాణ మొనరఁజేసి" యని సవరించినచో నియమభంగదోషముండదు.

ఆది. III. 224 వ పద్యము మొదటిపాదము "సకలధర్మవిదుండవు సకలలోక" అని యుండిన సరిపోవును.

ఆరణ్య. III. 275 వ పద్యమున మూఁడవపాదమున ''నడప నోపుదు" అను మాటను "చేత కోపుదు" అని సవరించిన భంగము తొలఁగును.

ఆది VI. 119 వ పద్యము మొదటిపాదము "అరిదివీరుండు రక్కసుఁ డరుగుదెంచు" నని యుండఁదగును.

ఎఱ్ఱనగీతములందునుఁ గొన్ని నియమభంగము లగపడుచున్నవి.

ఆరణ్య. IV. 281 వ పద్యము నాల్గవపాదము "పురుషుఁ బ్రభవిష్ణుఁ గృష్ణునిఁ బొందు శరణు" అని యుండఁదగును.

ఆరణ్య. V. 23 వ పద్యము మూఁడవపాదము ''అంతరంగ మయ్యుభయంబును నడఁగ కున్న''నని యుండినచో భంగముకలుగదు.

ఆరణ్య. VI. 158 వ పద్యము రెండవపాదము "పార్థుఁడుం బడమర కవ లర్థి నుత్త...'' అను తీరున నుండిన దోసముతొలంగును.

ఆయా భేదములందు నన్నయ ఎఱ్ఱన రచించిన తేటగీతులు.

| భేదము | నన్నయ | ఎఱ్ఱన |
|---|---|---|
| I | 136 | 79 |
| II | 16 | 2 |
| III | 18 | 14 |
| IV | 13 | 14 |
| మొత్తము | 183 | 109 |

ఈ భేదములందు యతిప్రాసముల విన్యాసభేదములచేఁ గొన్ని భేదాంతరములు గుర్తింప నగుచున్నవి.

వీఁడె కృతహస్తుఁ డఖిలాస్త్రవిద్యలందు
వీఁడె యగ్రగణ్యుఁడు ధర్మవిదులలోన
వీఁడె భరతవంశంబెల్ల వెలుఁగఁ గుంతి
కడుపు చల్లగాఁ బుట్టిన ఘనభుజుండు.

ఆది. VI. 19.

ఈ పద్యమున నాల్గుపాదములందునుఁ బ్రాసమున్నది.

"అనలునకు గాడ్పు తోడైనయట్టు లింద్ర
తనయునకు నీవు దోడైనఁ దడయ కాజిఁ
బోరు రిపులకు బ్రదుకంగఁబోల దైన
నరయ నిది కోపమునకు నవసరంబు."

అర. I. 396.

ఈ గీతమునఁ బూర్వార్ధమునం దొకప్రాసము, ఉత్తరార్ధమునం దొకప్రాసమును గలవు. ఎఱ్ఱన రచించిన అరణ్య. VI. 375 వ పద్యము నిట్టిదే.

"అతని యుద్ధతి సైఁపక యనిలసూనుఁ
డనిలవేగుఁడై పఱతెంచి యార్చి తాఁకెఁ
బ్రథన మయ్యిద్దఱకు నుగ్రభంగి నమర
పతికి వృత్రునకుంబోలెఁ బ్రకటమయ్యె.

అర. VII. 88.

ఇందు పూర్వోత్తరార్ధములందు యత్యైక్యము కనఁబడుచున్నది. ఆరణ్య. VI. 397కూడ నిట్టిదే.

మాత్రాక్షరసంఖ్యచేతను, గురులఘుక్రమముచేతను ననియతమై ప్రసన్నలలితగతియైన తేటగీతమున రసాద్యర్థానుకూల గతివిశేషములను భాసింపఁజేసికొనుచుఁ గవిత్రయ మెట్లు యథోచితముగ నా ఛందము నుపయోగించికొనిరో దిఙ్మాత్రముగఁ బరిశీలింతము.

అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు
నల్లగల్గిన నీవిప్డు నాకు దాసి
వగుము మఱి యందు నల్లలేదయ్యెనేని
నీకు నే దాసినగుదుఁ బన్నిదము సఱుము

ఆది. III. 32.

నల, నగణ వర్జనముచేఁ బూర్వార్ధమున విలంబనము, వాని యనుప్రవేశముచే నుత్తరార్ధమునఁ గొంత ద్రుతియు గోచరించుచున్నవి. అశ్వదేహమున నల్ల లేదు. ఉన్నదని కద్రువ బొంకినది. ఉన్నచో నీవు నాకు దాసివగుము అనుటయందు సంశయకృతవిలంబనము కలుగుచున్నది. లేనిచో

నేను నీకు దాసినగుదునని పలుకుటయందు దాసీత్వభీతిచే ద్రుతి కనఁబడుచున్నది. మొత్తము పద్యమున గుర్వక్షరబాహుళ్యముగోచరించి ఛందము స్వదేహగౌరవముచే వర్ణ్యవస్తువైన యశ్వముయొక్క దేహమహత్వమును వ్యక్తముచేయుచున్నది.

> రనకు మఱి తాన చుట్టంబు తాన తనకు
> గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్తయనఁగ
> వనజనేత్ర గాంధర్వవివాహ మతి ర
> హస్యమును నమంత్రకమును నగుచు నొప్పు.

ఆది. IV. 58.

దుష్యంతుని వివాహమాడుటకుఁ దా నంగీకరించి యందులకుఁ గణ్వుని యంగీకారముగూడ కావలయునన్న శకుంతలతో దుష్యంతుఁడు పలికిన వాక్యమిది. మదనాతురుండైన దుష్యంతుఁడు శకుంతలతోడి భోగానుభవవిషయమున క్షణవిలంబనమునుగూడ సహింపఁజాలకున్నాఁడు. కాలాక్షమత్వరూపమైన యౌత్సుక్యమును వ్యంజించు దుష్యంతుని వాక్యమునఁ గొంతద్రుతియు, నెడనెడ నుత్ప్లుతియు గోచరించుచున్నవి. 'వివాహ' 'రహస్య' 'అమంత్ర' – ఇత్యాది పదములందు జగణస్వరూపము ప్రస్ఫుటమగుచున్నది. ధర్మముచేఁ బ్రసన్నమైయున్న శకుంతలచిత్తమునఁ గామోత్సాహమును దీపింపఁజేయుట దుష్యంతుని యాశయము. ద్రుతోత్ప్లుతగతియైన ఛందమున వాక్యమును బ్రయోగించి దుష్యంతుఁ డుద్దిష్టార్థమును సాధింపఁగలిగినాఁడు. 'రహస్య' 'అమంత్ర' యన్న పదములనడిమి గుర్వక్షరములను దుష్యంతుఁడు సున్నితముగ నొత్తిపలికిన యభినయభంగియు ఛందమున ననుభావ్యమగుచున్నది.

> అనిన విని కిన్కఁబూనిన యలఁతినగవు
> చెలువు మొగమున కొక క్రొత్తపొలు పొనర్పఁ
> బుండరీకాక్షుఁడగు తెల్లఁ బోయి యప్పు
> డరుణకమలాక్షుఁడగుచు మురాంతకుండు.

ఉద్యోగ. III. 364.

పాండవులకు వాఁడిసూదిమొన యంతయు భూమి యొసంగననియు, రణమొనర్చుటకే నిశ్చయించితిననియుఁ జెప్పి తన సంధివచనములను దిరస్కరించిన దుర్యోధనునియందు శ్రీకృష్ణదేవునకు హఠాత్తుగఁ గోపముగలిగినది. అంతవఱకును బ్రసన్నధవళాక్షుఁడైన యాదేవుఁడు క్షణములోఁ గ్రోధారుణితాక్షుండైనాఁడు. అనాదరక్రోధముచే నలఁతిగా నగినాఁడు. పద్యమందలి యేఁబది యక్షరములలోఁ బదమూఁడుమాత్రమే గురువులు. ఆకస్మికోత్పన్నమైన క్రోధము ఛందమందలి యత్యంతద్రుతిచే సూచింపఁబడుచున్నది. ద్వితీయచతుర్థచరణాంతములందు జగణములు భాసించి ద్రుతియం దించుకయుత్ప్లుతియు గోచరించుచున్నది. "మురాంతకుండు" అను పదము ఖండితమై యందలి స్వరముతో వడిమైత్రి పాటింపఁబడి మురుని యంత మొందించినవాఁడను నవయవార్థము

నకుఁ బ్రాధాన్యముగలిగి తత్కాలమున శ్రీకృష్ణదేవుఁడు దుర్యోధనవధోన్ముఖుఁడయ్యెనన్న స్ఫూర్తిగలుగుచున్నది. క్రోధప్రథమావతార మత్యంతత్వరాన్వితమని వెనుకఁజెప్పఁబడినది. క్రోధసత్వరహృదయస్పందుఁడైన శ్రీకృష్ణదేవుఁ డీగీతమున వర్ణింపఁబడినాఁడు. క్రోధసత్వరమైన యాయన వాగనుభావము కందపద్యమున నిబంధింపఁబడియున్నది. అదియు లఘ్వక్షరబహుళమై యనుభావముయొక్క భావ వ్యంజకతను నిరూపించుచున్నది.

మొనతఁల బడియెదు నీ చె
ప్పినయట్టుల తడవులేదు బిరుదలరై నీ
వును వీరు నిలువుడీఁదె ఛం
డస మెల్లియవచ్చె నూఱటలుగనుఁ డింకన్.

ఉద్యోగ. III. 365.

ఈ కందమునందును నక్షరము లేఁబదియే. వానిలో గురువులు పదమూఁడే. విభావముయొక్కయు, అనుభావముయొక్కయు వర్ణనము గావించు ఛందములం దిట్లు వృత్తితౌల్యము నిర్వహించుట పరమాద్భుతమైన శిల్పము.

అలంకరణముచేత, గతిస్ఖలనముచేత అర్థవిశేషసమర్పణము గీతములచేతఁగూడ చేయింపవచ్చును.

ఓరిదుష్టాత్మ యేనిట్లు పోరఁ బెక్కు
మాఱు లెగువంగ సిగ్గఱి పాఱు చుండు
నట్టి నీకున్న యున్కిన యిట్టలముగ
నిట్టి బీర మెక్కడనుండి పుట్టెఁ జెపుమ

అర. VI. 375.

పూర్వార్ధమందలి దీర్ఘగుర్వక్షరములు, రేఫప్రాస ప్రాసయతులు, వాలియొక్క యనాదరక్రోధమయ చిత్తవృత్తియొక్క దీప్తవిలంబనమును బట్టి యిచ్చుచున్నవి. ఉత్తరార్ధమందలి ద్విరుక్తటకారప్రాస, ప్రాసయతులయందును, లఘ్వక్షరానుప్రవేశకల్పిత ద్రుతియందును విస్మయదీప్తి చక్కగా వ్యక్తమగుచున్నది. ధీరోదాత్తుఁడైన వాలి వాక్యమునకు సమలంకృతమైన ఛందము శోభావహమై పరమోచితముగనున్నది.

తల్లి! నీ కులగోత్రసౌందర్యములకుఁ
దగినపతిఁ గంటి దానికిఁదగఁగ గర్భ
మయ్యె నీదుగర్భమునవాఁ డఖిలభువన
వహనమహనీయుఁడగు చక్రవర్తి సుమ్ము.

ఆది. IV. 62,

తాను ప్రేమతోఁ, బెంచిన శకుంతల యనురూపభర్తృలాభము నందినదని కణ్వమహర్షి హర్షావిష్టుఁడై పలికిన వాక్యమిది. ఆగతానాగతదర్శియైన యా మహర్షి హర్షనిమిత్తమున దర్శించిన యీ ఛందోమయవాక్యమాయన హృదయవృత్తిని జక్కఁగా వ్యంజించుచున్నది. "దానికిఁదగఁగ గర్భ మయ్యె''నన్న వాక్యఖండమున మూఁడు హ్రస్వగకారము లొకదానివెంట నొకటి తఱుము కొనివచ్చి యా విషయమును శకుంతలకుఁ దెలియఁజేయుచో నాయన కంఠమునం దుద్భవించిన యానందగాద్గద్యమును సువ్యక్తముచేయుచున్నవి. "అఖిల భువన వహన మహనీయుఁడు" అను మహాప్రాణసహిత హ్రస్వాక్షర త్రిపుటీపరంపర శకుంతలాసంతాన భవిష్యదభ్యుదయ భావనా వశమున ఋషికిఁ గలిగిన హర్షావేగసంభ్రమమును బట్టియిచ్చుచున్నది. అనునాసికాక్షరసాన్నిహిత్యముచే హకారము మాధుర్యమువహించి ఋషిహృదయమందలి యానందమాధుర్యమును వ్యంజించుచున్నది.

యథారసము, యథాభావము, యథావస్తువు కవిత్రయమువారి తేటగీతినిర్మాణము, అలంకరణము, వినియోగము నిట్లే యనుశీలించి గ్రహింపఁదగును.

## ఆటవెలఁది

''మేలుమేలటంచు మిత్రులు ముగ్గురు
వింతవింత యనుచు విబుధులిద్ద
అహహ యనుచు నూరు లయిదుగురును మెచ్చ
నాటవెలఁది మూట నలరు నగము."

ఆప్ప. IV. 537.

మూఁడు సూర్యగణములు, రెండింద్రగణములు, నైదుసూర్యగణములు గలిసి యాటవెలఁది యందు సగమగును. ఈపదిగణములలో నైదుగణము లొకఖండము, మిగిలినయైదు నొకఖండము. ప్రతిఖండమునను మూఁడుగణములమీఁద (మూఁట) వడి. ఒక్కొక్కఖండ మొకపాదముగా వ్యవహరింపఁబడుచున్నది. ఆటవెలఁదిని లాక్షణికులు సమగీతులలోని యొకభేదముగాఁ జేర్కొనిరి.

పద్యములందుఁ బాదములకు లక్షణముచెప్పు సంప్రదాయమునుబట్టి యాటవెలఁదిపాదమునకుఁ బదిగణములయినచో నట్టి రెండుపాదములతో నేర్పడినపద్యము ద్విపదభేదము గావలయును. అట్లుగాక మూఁడుసూర్యగణములు, రెండింద్రగణములు గలిసి విషమపాదములును, నైదుసూర్యగణములు గలిసి సమపాదములును నేర్పడునని తలఁచినచో నిది యుపజాతులందు

అర్ధసమపద్యభేదము కావలసియుండును. ప్రథమతృతీయచరణములయు, ద్వితీయచతుర్థచరణములయు లక్షణములు భిన్నములుగానున్న యాటవెలఁదిని లాక్షణికులు సమగీతిభేదముగాఁ జెప్పుటయందు సామంజస్యము కనఁబడదు.

సూర్యేంద్రగణమిశ్రమైన ప్రథమతృతీయచరణముల గతియుఁ, గేవలసూర్యగణాత్మకమైన ద్వితీయచతుర్థచరణముల గతియు భిన్నములై విషమగమనాశ్రితమైన యొక చమత్కృతి యాటవెలఁదియందు భాసించును.

"పంచమం లఘు సర్వేషాం సప్తమం ద్విచతుర్థయోః"
"గురు షష్ఠం చ సర్వేషాం ఏతత్ శ్లోకస్య లక్షణం"

అని శ్లోకలక్షణము నిబంధించిన సంస్కృతచ్ఛాందసికులు ప్రథమద్వితీయచరణముల గతిభేదము నాశ్రయించిన యొకానొక శ్రుతిచమత్కృతినే యుద్దేశించిరి. ఈ గమనవైషమ్యము హృదయంగమమై శ్లోకము సుఖముగా గళగ్రహణయోగ్యమగుచున్నది. ఆటవెలఁదియందలి గమనచమత్కృతియు ధారణానుకూలమైన లక్షణమే యనఁదగియున్నది.

సూర్యేంద్రగణములలో సర్వలఘువులు, గురులఘుమిశ్రములు గలవు. కనుక ఆటవెలఁదిని లఘుబహుళముగాఁగాని, గురుబహుళముగాఁగాని సమగురులఘువుగాఁగాని నిర్మించుకొని వివిధరసముల వివిధావస్థలయందు యథోచితముగ వినియోగించుకొనవచ్చును.

"అవని ముగురుభాను లాదిత్యపతు లిద్ద
అవల నేగురర్కు లర్ధమునకుఁ
బవడగీతియందుఁ బ్రాసముల్ సమకూరు
నవియె యాటవెలఁదియందు లేవు"

అప్ప. IV. 541.

నాల్గుచరణములందుఁ బ్రాసములుకూర్చినచో నాటవెలఁది పవడగీతియగును. ఆటవెలఁదిని సమగీతులలోఁ జేర్చిన లాక్షణికులు పవడగీతిని విషమగీతులలోఁ జేర్చుట వింతయే. ప్రాసమును జేర్చినంతమాత్రమున సమగీతి విషమగీతి యగునా ? ప్రాసనియమముగల ఆటవెలఁది కన్నడమున 'ఆటగీతి' యనఁబడును.

నన్నయ రచించిన —

"పరనరేంద్రమకుట పద్మరాగద్యుతి
నరుణమగు భవత్పదాబ్జయుగము
పరుషదారుశిలలపై నిప్పుడరుగుట
నరుణమయ్యెఁ బర్వతాంతరముల"

ఆర. I. 212.

అనుపద్యమును లాక్షణికమతమునఁ బడవగీతి యనవలయునే కాని యాటవెలఁది యనరాదు. కాని యిది యాటవెలఁదిగనే ముద్రితమగుచున్నది. అట్లే గణింపఁబడుచున్నది.

ఆంధ్రమహాభారతమునందలి యాటవెలఁదులు మొత్తము 1308.

| | | |
|---|---|---|
| నన్నయవి | — | 195 |
| ఎఱ్ఱనవి | — | 91 |
| తిక్కనవి | — | 1022 |

యతి, ప్రాసయతి, ప్రాసము – ననువాని విన్యాసభేదముల ననుసరించి సీసమునందు వలెనే ఆటవెలఁదియందును గొన్నిభేదములను సాధింపవచ్చును. నన్నయయు, ఆయన ననుసరించి యెఱ్ఱనయు నట్టిభేదములు కొన్ని నియతముగాఁ బాటించి నిర్మించియున్నారు. తిక్కనరచనయం దీభేదములు – స్వతస్సిద్ధము లందందు గోచరించినను, ఆయన కివి నియమములుగావు. యథేష్టముగా యతిని, ప్రాసయతిని వాడుటయే యాయన పద్ధతి.

ఆటవెలఁదియందు నిర్మింపఁదగిన భేదములు —

1. సర్వపాదములందును యతి
2. సర్వపాదములందును బ్రాసయతి
3. విషమపాదములందుఁ బ్రాసయతి
4. సమపాదములందుఁ బ్రాసయతి
5. పూర్వార్ధమునఁ బ్రాసయతి
6. ఉత్తరార్ధమునఁ బ్రాసయతి

నన్నయయు, నెఱ్ఱనయు మొదటినాల్గుభేదములనే ప్రధానముగాఁ బ్రయోగించిరి.

1 వ భేదము :

శాపమిచ్చునాఁడు జనని యుత్సంగంబు
నందు నిద్రవోయినట్లు యుండి
యమరవరుల కఱున కైన యన్యోన్యసం
భాషణంబు లెఱుకపడఁగ వింటి.

ఆది. II. 135.

2 వ భేదము :

బలియుఁడపుడు పెంద్రుకలు పాచి ముడిచి గం
టెనఁగఁ దాల్చి వీరరసికవృత్తి

నుద్ధతుండు మల్లయుద్ధప్రసాధసం
బమర నిలిచె వేడ్క సమితబలుఁడు

సభా. I 201.

3 వ భేదము :

వేదవిహితవిధుల నారరించుట యూర్ధ్వ
గతికిఁ దెరువు, విధులఁగడచి యెందు
నాఁగఁబడినవాని లోఁగక చేయుట
యధమగతికి మార్గమనిరి మునులు

ఆది. III. 220.

4 వ భేదము :

ఎత్తికొని చనంగ నిమ్మగునట్లుగా
మెదలుచున్న వ్రయ్య లదిమి రెంటిఁ
గూడఁబట్టె నవియుఁ గూడి యొండొంటితోఁ
జక్కనంటి రెండు నొక్కఁడయ్యె

సభా. I. 148.

5 వ భేదము :

వానిఁజూచి నలుఁడు దానల్గి శాపమీ
నున్నఁ గలి యెఱింగి నిన్నుఁబొంది
యహివిషంబుచేత ననిశంబు దగ్ధుండ
నైతి నింక నాకు నలుగవలదు

అర. II. 180.

(ఎఱ్ఱనరచనయం దిట్టివి లేవు)

6 వ భేదము :

ఇంద్రియంబులనఁగ నెయ్యవి ? యవి నిగ్ర
హింపకున్నఁ బాపమేమి దొడరు ?
వాని నిగ్రహించువానికి నగు ఫలం
బెట్టిదనిన నాతఁ డిట్టులనియె

అర. V. 79.

ఇది యెఱ్ఱనపద్యము. ఉత్తరార్ధమునందలి యతి ప్రాసయతిగాఁ గూడ గ్రహింపఁదగినది. కనుక 6 వ భేదముగా గణింపఁబడినది. నన్నయ యీభేదము వాడలేదు.

ఆయా భేదములందలి పద్యముల సంఖ్యావివరములు —

| భేదము | నన్నయ | ఎఱ్ఱన |
|---|---|---|
| I | 142 | 61 |
| II | 18 | 7 |
| III | 25 | 11 |
| IV | 9 | 11 |
| V | 1 | — |
| VI | — | 1 |
| మొత్తము | 195 | 91 |

ముద్రితప్రతులనుబట్టి చూడ నన్నయ యాటవెలఁదులలోఁ గొన్నింట నాయన నియమములకు భంగమువాటిల్లిన ట్లగపడుచున్నది.

1 వ భేదమున :

ఆది. VII – 112 వ పద్యము మూఁడవపాదమున 'తెరలి' యను పాఠాంతరమును స్వీకరించిన దోసముతొలఁగును.

2 వ భేదమున :

ఆరణ్య. I – 180 వ పద్యము నాల్గపపాదమును ''మెఱసెఁ జదల'' అని సవరించినచో దోసముతొలఁగును.

3 వ భేదమున :

ఆది. IV – 260 పద్యము నాల్గవపాదమును ''ఏదియొనర్చుదాన నీయెగ్గునకు మూల'' మని సవరించిన సరిపోవును.

నన్నయరచించిన యాటవెలఁదులలోఁ గొన్నింట యతిప్రాసవిన్యాసభేదములుకూడఁ గనఁబడుచున్నవి. నాల్గుపాదములందును ప్రాసముగలది పైనఁ జూపఁబడినది. (ఆరణ్య I 212)

వృద్ధు గొడుకుపల్కు విని క్రూరుఁడై పాప
బుద్ధిఁజేసి మిమ్ము భూతలంబు
వెలువరించి రాజ్యవిభవంబుఁ గొని యిప్పు
డలుకసెడి సుచిత్తుఁ డయ్యెనొక్కొ.

ఆర. I. 208.

ఇందు పూర్వోత్తరార్ధములు భిన్నప్రాసఘటితములై యున్నవి. ఇట్టివే మఱిరెండు గలవు — ఆది. III — 168 ; ఆది. VIII — 274.

సకలలోకకర్మసాక్షి యాకృష్ణుండు
    సాక్షిగాఁగ మీకు సకలవృద్ధ
రాజులొద్ద నర్ధరాజ్య మిచ్చితిఁ బాండు
    రాజవిభవమెల్ల రమణఁ గొనుఁడు

ఆది. VIII. 65.

ఇందు పూర్వోత్తరార్ధము లేకయతిఘటితములై యున్నవి. ఇట్టివింకను రెండుగలవు అర. I_231 అర. IV — 29.

ఆటవెలఁదియనఁగా నట్టువపడుచు. అప్పకవి యాటవెలదిలక్షణము చెప్పు పద్యమునం దీయర్ధమునే చమత్కరించెను. ప్రథమపాదమున రెండింద్రగణములు వచ్చి ద్వితీయపాదము కంటె దానిని గొంతదీర్ఘతరము గావించుచున్నవి. కాఁగాఁ బ్రథమద్వితీయముపాదముల గతి యెత్తియడుగువైచిన ట్లుండును. అది నర్తనరూపమైన గతికౌటిల్యమును భాసింపఁజేయును. ఆటవెలఁది నామ, గతులనాశ్రయించి భారతకవులు చేసిన ప్రయోగవిశేషములు గొన్ని యిట్లు నిరూపింపఁబడుచున్నవి.

"బాల గేలిమీఁదిభరము గ్రమంబున
విడువఁ గళలయందు వేడ్కనొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు
నెలఁత కేడుగడయు నీవకాదె ?

విరా. I. 251.

ఎల్లచుట్టములును దల్లియుఁ దోడును
జెలియుఁ బరిజనంబుఁ జెలువ నీకు
గురువ యింక నొక్కకొఱఁతయు లేదిందుఁ
జేరి బ్రదుకు బుద్ధిగౌరవమున.

విరా. I. 253.

నాట్యము నేర్పుమని యుత్తరను బృహన్నల కొప్పగించుసందర్భమున విరాటుని వాక్యములు ఆటవెలఁదియందు నిబద్ధములగుట నామాశ్రితమైన ఛందశ్చమత్కారము. ఇట్లే విరాటపర్వద్వితీయాశ్వాసమునఁ గీచకావమానితయై విరాటసభకువచ్చి రాజుతో మొఱపెట్టుకొనుచున్న ద్రౌపదిని ధర్మరాజు —

"పలువోకలఁ బోవుచు వి
చ్చలవిడి నాట్యంబుసూపుచాడ్పున నిచటం
గులసతుల గఱువచందము
దొలఁగఁగ నిట్లునికి దగునె తోయజవదనా"

విరా. II. 150.

అని మందిలింపఁగా ద్రౌపది యాయనమాటలనే యందుకొని "సాభిప్రాయంబుగా" నొసంగిన సమాధానము కుటిలమై యాటవెలఁది ఛందమునందున్నది.

నాదువల్లభుండు నటుఁ డింత నిక్కంబు
పెద్దవారియట్ల పిన్నవారుఁ
గాన బతులవిధమకాక యే శైలూషిఁ
గానసంగరాదు కంకభట్ట !

విరా. II. 152.

'నాట్యంబు సూపుచాడ్పునఁ బలువోకలు' వోవుచుంటివనిన ధర్మజుని యధిక్షేపవచనములకుఁ బ్రతివచనముగా ద్రౌపదీపలికిన వాక్యము నాటవెలఁదియందు నిబంధించి "ఏశైలూషి గాననంగరాదు" అన్నయర్థమును దిక్కున చక్కగా సమర్థించెను.

అక్షరాశ్రితము, గణాశ్రితమునైన చమత్కారముగూడ నందంచు గుర్తింపనగుచున్నది.

"తుముల మధికమయ్యె సమరతలంబున
ఘోరరుధిరవారిపూర మెసఁగె
జితవిరోధిబలుఁడు శతమఖుసూనుండు
చాపనైపుణంబు చూపునడుపు"

ఆరణ్య VI. 225.

పూర్వార్ధమందలి లఘుబాహుళ్యకృతమైన ద్రుతగతి తుములయుద్ధముయొక్క ద్రుతిని సూచించుచున్నది.

మెఱుఁగుమెఱచినట్లు మెఱయంగ సరదంబు
కర్ణికారకేతుకాంతి వెలుఁగ
నంపగముల గురుని నలయించి కడచి యిం
ద్రజునికొడుకు మొగ్గరంబు సొచ్చె.

ద్రోణ. II. 17.

పూర్వార్ధమున శకటరేఫసహిత లఘ్వక్షరపదత్రయమున మెఱుపులును, కకారసహిత 'గల' స్వరూపములందుఁ గేతుకాంతులును స్ఫురించుచున్నవి. 'ఇంద్రజుని కొడుకు' అన్న పదఘటనము

తృతీయపాదమును గడచి చతుర్థపాదమును జొచ్చుట యర్థసమర్థకముగ నున్నది. "ఇంద్రజుని కొడుకు' అను సమాసము పూర్వోత్తరపదముల నేకపదమున ఘటించి యభిమన్యుని యింద్రాంశ భాగిత్వమును వ్యంజించుచు నాతని రథమునం దారోపితమైన మెఱపును, "అంపగము'' లందు ధ్వనించు వానజల్లును సమర్థించుచున్నది. విశేషించి మిశ్రము, సాధ్యమునైన సమాసము 'ఇంద్రజ' పదమునుండి 'కొడుకు' పదమును వేఱుపఱచి యర్జునునకుఁ గలుగఁబోవు పుత్త్ర వియోగమును సూచించుచున్నది. వస్త్వలంకారధ్వనిబంధురమై ఛందము శిల్పమగుచున్నది.

ఇన్న రేంద్రుచేత మున్న గృహీతమై
యున్న నా కరంబు గ్రన్న నింక
నొరుల కర్హమగునె పరిణయవిషయమై
ధరఁ బరిగ్రహింపఁ బరమమూర్తి ?

ఆది. III. 168.

ఆటవెలఁదియందు శాస్త్రము విధింపని జగణము లీపద్యమునందలి 'నరేంద్ర' 'గృహీత' 'కరంబు' 'పరిగ్రహింప' నను పదములయందు స్వరూపముధరించి దేవయానియొక్క పరిణ యోత్సాహమును - యయాతిని బెండ్లియాడవలెనన్న దీక్షను - వ్యంజించుచున్నది. ప్రాసయతి చేతను, పాదద్వయఘటితప్రాసవిశేషముచేతను, పద్యమలంకృతమై వాక్యార్థమునకు సౌష్ఠవము, దీప్తియుఁ గలుగుచున్నవి. శ్రోతయైన శుక్రుఁడు అలంకృతవాక్యశ్రవణమునఁ బ్రీతుఁడై తన కభిలషితార్థసిద్ధిని బ్రసాదింపవలెనని దేవయానియాశయము, కనుకనే వాక్యచ్ఛందము నిట్లు శిల్పించుట.

"పరనరేంద్రమకుటపద్మరాగద్యుతి
నరుణమగు భవత్పదాబ్జయుగము
పరుషదారుశిలలపై నిప్పు డరుగుట
నరుణమయ్యె బర్వతాంతరముల"

అరణ్య. I. 217.

ధర్మజుని భూతపూర్వవైభవమును స్మరించుటవలన జనించిన ప్రీతిచేతను, ఆయన ప్రకృతావస్థ వలన జనించిన కారుణ్యముచేతను నార్ద్రమధురమైన ద్రౌపదీదేవి వాగనుభావము సమలంకృత సుందరచ్ఛందోరూపముఁ దాల్చినది. స్థితివిపర్యయమునందును ధర్మజునిపాదము లారుణ్యము వహించియేయున్నవన్న యర్థము పాదచతుష్టయమునం దేకరూపమున నిర్వహింపఁబడిన 'ర' ప్రాసముచేతఁ జక్కఁగా సమర్థింపఁబడుచున్నది. ప్రాసనియతిగల యిట్టియాటవెలఁదిని లాక్షణి కులు 'పవడగీతి' యనిరి. పవడమనఁగాఁ బ్రవాళము. ధర్మజుని పాదముల యరుణకాంతిని వర్ణించు ఆటవెలఁదిని పవడగీతిగా రూపించి యాదికవి ముద్రాలంకారమును సుభుభూరమగ ధ్వనింపఁజేసెను.

రాజతిలక రాజ రాజకంఠీరవ
రాజరత్న దివసరాజతేజ
రాజరాజ యనుచు రాజన్యు సైంధవ
రాజుఁ బనవుచుండె నాజిలోన.

శ్రీ. II. 99.

ఛిన్నమస్తకుఁడై రణరంగమునఁ బడియున్న సైంధవుని కళేబరమును దిలకించి దుస్సల విలపించుతెఱఁగును గాంధారి శ్రీకృష్ణదేవునకు వర్ణించి చెప్పుచున్నది. దుస్సల శోకానుభావవాక్యమున స్థాయిత్వముఁబొందిన పదము 'రాజ'. దుస్సల 'రాజ' 'రాజ' యని యొకటే యేడుపు. ఈ పదమే బహువారము లావృత్తమై ఛందమునఁ బ్రాసము, నను ప్రాసము సర్వపాదములందును నప్రయత్నముగ సిద్ధించుచున్నవి. ఛందమున గల, నగణ స్వరూపము తఱచై యవరోహణము, ద్రుతి రూపొందుచున్నవి. ఆగ్నేయ 'ర' కారము, వాయవ్య 'జ' కారము పునఃపునరావృత్తములై శోకదీప్తిని ఛందమునఁ జక్కఁగా వ్యాపింపఁజేయున్నవి. అక్షరపదసంవాదముచేఁ బద్యము సుసమాహితగతియై గాంధారిహృదయము ఏకైకపుత్రికయగు దుస్సలహృదయముతో శోకస్థాయియందు ఏకాగ్రముగ సంవదించుటను వ్యక్తముచేయుచున్నది. ఇదియుఁ బవడగీతియే.

ధర్మరహితులైన ధార్తరాష్ట్రులకు భూ
రాజ్యలక్ష్మి సుస్థిరంబుగాదు
ధర్మతనయ నిన్ను దద్రాజ్యసంపదల్
వలచి తమకుఁదామ వచ్చి పొందు.

అర. I. 61.

గుర్వక్షరబాహుళ్యముచేఁ బద్యముయొక్క గమనమున భారము, విలంబనము గోచరించుచున్నవి. తన్నెగ్గులుపలికి రాజ్యము వెడలనడచిన ధృతరాష్ట్రునిపట్లఁ గోపముచే విదురుని హృదయస్పందము భారమైయున్నది. ఆతఁడు ధర్మజునితోఁ బలుకుచున్న కౌరవనిందాత్మకమైన వాక్యము చిత్తస్పందభారలక్షణముగా గుర్వక్షరబహుళమై యుండుట మిక్కిలి యుచితముగనున్నది.

అనియతగతియైన యాటవెలఁదియందు యథారసముగా గురులఘ్వన్యతరబాహుళ్యముచేతను, అవిద్యమానగణావభాసనముచేతను, ననియతప్రాసాదినివేశనవైచిత్రిచేతను, నలంకారనిర్మాణవిశేషముచేతను గతిభేదములను, సౌందర్యభేదములను భాసింపఁజేసి భారతకవులు దాని వినియోగమునఁ జూపిన శిల్పమును ఇట్లే పెక్కుపట్టుల ననుశీలించి గ్రహింపవచ్చును.

## సూచికలు :

1. బసవపురాణము — పీఠిక : పుట 85. 2. జనాశ్రయి : V — 44-52 సూత్రములు.
3. అప్పకవీయము : 2 వ అధ్యా. చింతామణికారిక. 16. 4. ఛందోదర్పణము : 3 — 26.
5. కవిజనాశ్రయము : జాత్యధికారము. 6. బసవపురాణము — పీఠిక : పుట 85.

# గద్యము

"గద్యం కవీనాం నికషం వదంతి"

వామనుఁడు : 1-3-21

పింగళముని గద్యమునుగుఱించి తనశాస్త్రమునఁ బ్రసంగింపలేదు. లక్షణీయమైన యక్షర మాత్రానియతి దానియందు లేమియే యందుకుఁగారణము కావచ్చును. వృత్త గీతవర్జితములై ప్రశ్లిష్టపఠితములైన యజుర్వేదమంత్రములు గద్యములు. అవాంతరవాక్యరూపములైన పాదములను విశ్లేషింపవలసిన యవసరము యజుర్వేదమంత్రములకు లేదు. అట్టివానికిఁ బింగళముని లక్షణముచేయలేదు.

గద్య పద్య గేయాత్మకములగు దృశ్యప్రబంధములకు లక్షణము నిబంధింపఁబూనిన భరతముని గద్యమునుగూడ ఛందోభేదముగాఁ బేర్కొనెను. స్వర, వ్యంజన, పద స్వరూపములను నిరూపించి నాట్యశాస్త్ర చతుర్దశాధ్యాయమున —

"ఏభి శ్శబ్దవిధానైః విస్తారవ్యంజనార్థసంయుక్తైః
పదబంధాః కర్తవ్యాః నిబద్ధబంధాస్తు చూర్ణా వా" 38

"అనిబద్ధపదం ఛందః తథా వానియతాక్షరం
అర్థాపేక్ష్యక్షరస్యూతం జ్ఞేయం చూర్ణపదం బుధైః" 40

అని భరతముని పదబంధములు నిబద్ధబంధములు, చూర్ణములు - రెండువిధములని చెప్పెను. వానిలో అనిబద్ధపదము, అనియతాక్షరము, అర్థాపేక్ష్యక్షరస్యూతమునైన ఛందము చూర్ణపదము. గద్యమను పదమును ముని యుపయోగింపలేదు కాని యభినవులు - "ఇదం తు కేవలం పఠనకర్మత్వాత్ గద్య మిత్యుచ్యతే. ...... గద్యమితి నిగదనీయత్వేపి విశేషసంజ్ఞయా వ్యపదేశః"అని వ్యాఖ్యానించిరి.

'అనిబద్ధపదం' అనఁగా అనిబద్ధపాదమని ముని యభిప్రాయము కావచ్చును. అనిబద్ధపాదము, ననియతాక్షరమునై యర్థవిశేషవ్యంజకములగు నక్షరములచేఁ గూర్పఁబడిన ఛందము చూర్ణపదమని మునివచనము. దీనినే తరువాతివారు గద్యమనిరి. పాఠ్యము, గేయము కాక కేవలము నిగదనీయమైనది గద్యము. అది కావ్యమునఁ బ్రయోగింపఁదగినదగుటచే ఛందోవిశేషమే యగుచున్నది. గద్యమునకు శాస్త్రనియతి లేకున్నను రసభావాదినియతి యున్నది.

వక్తయొక్క చిత్తవృత్తిచేత నియతమై గద్యము వర్తించును. కనుకనే దానియందును శ్రవ్యతా ధర్మము వర్తించి కావ్యోపయోగిత్వము దానికి సిద్ధించినది. నియతమైన పద్యమున నియమలభ్య మైన శ్రవ్యతను సాధించుట సుకరము. సాధకునకు నియమము సహకారియగును. అనియతమైన గద్యమున హృద్యత సాధించుట మిక్కిలి దుర్లభము. కనుకనే గద్యము కవులకు గీటురాయి వంటి దయ్యెను.

ఆలంకారికులు గద్యచ్ఛందముయొక్క హృద్యతను గుర్తించి తమ శాస్త్రములందు దానిని గుఱించి ప్రసంగింపసాగిరి.

"శబ్దార్థౌ సహితౌ కావ్యం; గద్యం పద్యంచ తద్ద్విధా" 1-16

అని భామహుఁడు గద్యమును కావ్యోపయోగి పదబంధముగాఁ జేర్కొని యూరకుండెను. దండి గద్యరచనాప్రవణుఁడు గనుక ఆయన తన కావ్యాదర్శమున గద్యమునుగుఱించి స్ఫుటమైన నిరూ పణముచేసెను.

"శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళిః" 1-10

"గద్యం పద్యం చ మిశ్రం చ తత్త్రిధైవ వ్యవస్థితం" 1-11

"అపాదః పదసంతానో గద్యం" 1-23

"ఓజస్సమాసభూయస్త్వ మేతద్గద్యస్య జీవితం" 1-80

"తద్గురూణాం లఘూనాం చ బాహుళ్యాల్పత్వమిశ్రణైః
ఉచ్చావచప్రకారం తత్ దృశ్య మాఖ్యాయికాదిషు" 1-81

అపాదమైన పదసంతానము గద్యము. సమాసభూయస్త్వరూపమైన యోజస్సు దానికిఁ బ్రాణము. గురులఘువుల బాహుళ్యము, అల్పత్వము, మిశ్రణము - వీనివలన గద్యగతి యనేకభంగులుగా నుండును. గద్యగతిభంగీవిశేషములను ఆఖ్యాయికాదులందు చూడవచ్చును. దండి చేసిన యీ గద్యలక్షణవర్ణనము మిక్కిలి యుచితముగా నున్నది. అనంతరలాక్షణికులు చేసిన గద్యప్రసం గము లన్నింటికంటె నిది ప్రస్ఫుటముగ, సమగ్రముగ నున్నది.

గురువులయొక్క బాహుళ్యము, లఘువులయొక్క బాహుళ్యము, తదుభయమిశ్రణము - వీనివలన గద్యమున గతిభేదములు సాధ్యములనియు, ఓజఃప్రసాదమాధుర్యాది గుణభేదములు భిన్నగతులయిన గద్యములందు భిన్నగుణముల నాధానముచేసి నానారసాద్యర్థముల నిర్వహణ మున దానిని సమర్థము గావించుననియు దండి చేసిన గద్యవివేకము అనంతప్రకారములయిన గద్యముల నిర్మాణమునఁ గవికి పరమోపనిషత్తుగా నున్నది. దండి యభిప్రాయమునఁ బ్రస్ఫు టాంతరములయిన వైదర్భగద్యము, గౌడగద్యము నేర్పడి మధుర, దీప్తరసముల నిర్వహణ మునఁ బ్రయోజ్యము లగుచున్నవి.

దండి 'మార్గము'ను 'రీతిగా' రూపించిన వామనుఁడు గౌడవైదర్భములనడుమఁ బాంచాలమును బ్రవేశపెట్టి రీతిత్రయముతోపాటు గద్యత్రయమును బేర్కొనెను.

"పద్యభాగవత్ వృత్తగంధి" 1-3-23

"అనావిద్ధలలితపదం చూర్ణం" 1-3-24

"విపరీత ముత్కలికాప్రాయం" 1-3-25

ఉత్కలికాప్రాయమనఁగా ఉత్కంఠాతిశయజనకమని గోపేంద్రతిప్పభూపాలుఁడు వ్యాఖ్యానించెను. పద్యభాగాన్వితమైన వృత్తగంధి వైదర్భము, అనావిద్ధలలితపదమైన చూర్ణము పాంచాలము, ఆవిద్ధోద్ధతపదమైన యుత్కలికాప్రాయము గౌడమునని వామనాభిప్రాయముగా గ్రహింపవచ్చును.

భోజమహారాజు సరస్వతీకంఠాభరణమున గద్యము ఉత్కలికాప్రాయము, పద్యగంధి యని రెండువిధములనియు (2-25) లలితము, నిష్ఠురము, చూర్ణము, ఆవిద్ధముననుభేదములు రీతివృత్తుల ననుసరించి యేర్పడినవనియుఁ (2-26) దెలిపెను. పద్యగంధియందు వృత్తగంధి, జాతిగంధి యనుభేదములను భోజుఁడు భావించెను దండి మార్గమును, వామనుని రీతిని మేళవించి భోజమహారాజు గద్యమున గతినానాత్వమును దర్శించెను. ఆయన వివేచన మిట్లున్నది——

"గద్యం పద్యం చ మిశ్రం చ వాక్యం యత్ సా గతి స్స్మృతా
అర్థౌచిత్యాదిభి స్సాపి వాగలంకార ఇష్యతే" 2-18

"పఠితేః పదా త్పదాంతరసంచారో గతిః"అని రామసింహుని వ్యాఖ్య. కావ్యపఠనమునఁ బదము వెంటఁ బదము సంచరించురీతి గతి. అది వాక్యమున కొకవిధమైన యలంకారము. గద్య పద్య మిశ్రరూపముల నది త్రివిధముగా నుండును.

"కశ్చి ద్గద్యేన పద్యేన కశ్చి న్మిశ్రేణ శక్యతే
కవితుం కశ్చన ద్వాభ్యాం కావ్యేఽర్థో కశ్చన త్రిభిః" 2-19

కావ్యమందలి యర్థము కొంత గద్యముచేతను, కొంత పద్యముచేతను, కొంత మిశ్రముచేతను,కొంత గద్యపద్యములచేతను, కొంత గద్యపద్యమిశ్రములచేతను వర్ణించుటకుఁ దగినదై యుండును. కావ్యార్థమునకుఁ దగిన ఛందోవిశేషమును గవి యెన్నికచేసికోవలెను.

యథామతి యథాశక్తి యథౌచిత్యం యథారుచి
కవేః ప్రాత్రస్య చ ఏతస్యాః ప్రయోగ ఉపపద్యతే. 2-21

కవియొక్క వివేకము, సామర్థ్యము, అభినివేశము, పాత్రౌచిత్యము – వీనినిఁబట్టి కావ్యమున గద్య పద్య మిశ్ర గతిభేదములు ఉపపాద్యము లగుచున్నవి. ఈ త్రివిధములయిన కావ్యగతులందు శుద్ధములు, సంకీర్ణములునైన యాఱుభేదములను భోజుఁడు వివేచించెను.

ద్రుతా విలంబితా మధ్యా సాథ ద్రుతవిలంబితా
ద్రుతమధ్యా చ విజ్ఞేయా తథా మధ్యవిలంబితా 2-22

సా లఘూనాం గురూణాం చ బాహుళ్యాల్పత్వమిశ్రణైః
పద్యే గద్యే చ మిశ్రే చ షట్ప్రకా రోపజాయతే 2-53

దండిచెప్పిన మార్గమును విస్తరించి భోజుఁడు ఆఱు గతిభేదములను రూపించెను. గురులఘ్వన్యతరబాహుళ్యముచేతను, తన్మిశ్రణముచేతను సిద్ధించు ద్రుత విలంబిత మధ్యాది గతిభేదములు పద్యమునను, గద్యమునను, మిశ్రమునను గుర్తింపఁదగినవే యనుటభోజుని సూక్ష్మబుద్ధికిగుఱుతు.

గురులఘునివేశనియమము, పాదవ్యవస్థ లేమిచేత గద్యము పద్యమునుండి వేఱుపడుచున్నది. కాని గురులఘుబాహుళ్యాదికమువలన ద్రుతవిలంబాది వృత్తిభేదములు, గురులఘుక్రమభేదములవల్ల ఆరోహణావరోహణాది రీతిభేదములు గద్యమునందును సిద్ధించును. రసాద్యర్థనిర్వహణోచితముగ గద్యమును నిర్మించుటయందు వీనిని కవి యవహితచిత్తుఁడై సాధింపవలెను.

సాహిత్యదర్పణమున విశ్వనాథకవిరాజు చేసిన ముక్తకము, వృత్తగంధి, ఉత్కలికాప్రాయము, చూర్ణమునను విభాగములు (IV-330); ఛందోమంజరియందు గంగాదాసుచేసిన చూర్ణకము, వృత్తగంధి, ఉత్కలికాప్రాయమునను భేదములు (VI-1-3); సంగీతరత్నాకరమునఁ బార్శ్వదేవుఁడు చేసిన వృత్తగంధి, చూర్ణము, ఉత్కలిక, లలితము, ఖండము, చిత్రమునను భేదములు అన్నియు భోజుని విభాగములందే యంతర్భవించును.

ఆంధ్రలాక్షణికులు గద్యము కావ్యోపయోగియై రసనిర్వహణసమర్థమైన ఛందోవిశేషముగాఁ బేర్కొనిరిగాని దానియందలి భేదములను నిరూపింపయత్నింపలేదు.

గద్యం బపాదపదనిక
రద్యోతిత నవరసార్థరచనల నెగడున్

సంజ్ఞాధికారము

అని మల్లియరేచన గద్యమును నవరసార్థసాధనసమర్థమైన ఛందోభేదముగాఁ గొనియాడెను.

"పరగుఁ గవిత గద్యపద్యంబులనఁ బాద
కల్పనంబు వలదు గద్యమునకు" 1-6

పాదకల్పనావశ్యకము లేమియే గద్యముయొక్క విలక్షణతయని యనంతుని యభిప్రాయము.

కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి హరిగద్దెవోలె బహుముఖరచనం

బున మెఱయు గద్య మది తాఁ
దెనుఁగుకృతుల వచనమనఁగ దీపించుఁ గడున్. 2-2

అని యనంతామాత్యుఁడు గద్యమహిమను జక్కఁగాఁ గొనియాడెను. గద్యమున కుపమానముగా ననంతుఁడు హరిగద్దెను గ్రహించెను. హరిగద్దె సహస్రశీర్షుఁడైన యాదిశేషుఁడు. ఆదిశేషుని వలె గద్యము పన్నగము-"కనుఁగొనఁ బాదరహితము." వక్రసుందరములయిన గమనభంగులు గలదే కాని చూడఁబోయినఁ బాదములు స్ఫుటముగఁ గనఁబడవు. పద్యము ద్వి త్రి చతుః పంచాది పరిమితపాదములతో నడచును. గద్యమన్ననో అదృశ్యములయిన సహస్రపాదములతో నడచును. అది యనంతుఁడైన యాదిశేషునివలె సహస్రముఖము, సహస్రపాదము. అది రస మయుఁడైన హరికి గద్దె. గుప్తములయిన సహస్రపాదములతో, సహస్రముఖములయిన గతి వక్రతలుగలిగి సర్వరసనిర్వహణసమర్థమైన పదబంధము గద్యమను ననంతుని యభిప్రాయము సరసము, సమంజసమునై భోజుని యభిప్రాయమునకు అనుబంధప్రాయముగా నున్నది.

తెనుఁగుకృతులం దీగద్యమే వచనమనుపేర దీపించుచున్నది. కనుక సంస్కృతలాక్ష ణికులు గద్యమున భావించిన భేదములన్నియుఁ దెనుఁగువచనమునకు నన్వయించును.

ఛందోఽనుశాసనమున జయకీర్తి చెప్పినమాట గద్యవచనములకు భేదము సూచించునదిగాఁ గనఁబడుచున్నది ——

"గద్యం హృద్య మపాదోక్తి సమాసపదసంచితం
తతోఽన్యత్ చూర్ణి రిత్యుక్తా వచనం వాక్యబంధురం" 1-26

సమాసపదసంచితమైన యపాదోక్తి గద్యము. అది హృద్యము, గద్యముకంటె వేఱయిన వచనము చూర్ణి. అది వాక్యబంధురము. హృద్యత గద్యధర్మము. అది లేనిది వచనమాత్రము అని జయకీర్తి యభిప్రాయముగాఁ దోఁచుచున్నది.

వాచ్య (అర్థ) ప్రధానము వాక్యము
వాచక (శబ్ద) ప్రధానము ఛందము

వచనము వాక్యబంధురమగుటచే అర్థబంధదృష్టిచే అసమాహితపదబంధమై అచ్ఛందమగుచున్న దనియు, సమాహితపదబంధమై శబ్దార్థనిబంధనరూపమైన ఉక్తి అపాదమయ్యు హృద్యమై గద్యముఅను ఛందమగుచున్నదనియు జయకీర్తి యభిప్రాయముగా భావింపఁదగియున్నది. స్పష్టప్రతిపాదనము వచనలక్షణము, సరసప్రతిపాదనము గద్యలక్షణము. వచనము నిర్లయము, గద్యము లయాన్వితము నని భావించుట సమంజసము. కథన, వివరణ, విస్తరణోపదేశాదులందు వినియుక్తమగు నిరలంకృతచూర్ణపదబంధము వచనము. వర్ణ్యవస్తురసభావాది సాక్షాత్కరణ సమర్థముగ సమలంకృతమై హృదయంగమ గమనవిచ్ఛిత్తిగలది గద్యము.

ఆంధ్రమహాభారతము చంపూకావ్యము. "పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్" అని లిక్కన ప్రతిజ్ఞచేసెను. ఆదికవిమార్గమును. వ్యాసునిమార్గమును అనుసరింతు ననుటకే ఆ ప్రతిజ్ఞ. ఆయన సహజముగ నిర్వచనరచనాప్రియుఁడు. నిర్వచనోత్తరరామాయణ మునందాయన —

వచనము లేకయు వర్ణన
రచియింపఁగవచ్చుఁ గొంత ప్రౌఢులకుఁ గథా
ప్రచయము పద్యములన పొం
దుచితంబుగఁ జెప్పు టార్య లొప్పిదమనరే.

అని వర్ణనమునకుఁ, గథాప్రచయమునకు వచనము సాధారణముగా నుపయోగపడునన్న యభి ప్రాయము వెల్లడించెను. "యథా హ్యాటవీవర్ణనాదౌ గద్యం ప్రగల్భతే న తథా పద్యం" - ఇత్యాదియైన సంస్కృతాలంకారికుల దర్శనము నిట్లేయున్నది. అయితే వర్ణనోచితమైన గద్య మునకును, కథనోచితమైన వచనమునకుఁ గొంతభేదము భావింపఁదగియే యున్నది.

ఆశ్వాసాంతములందు కవి వంశప్రతిభాదికమును వర్ణించు వాక్యములు గద్యములనఁబడు చున్నవి. అవి సమస్తపదములై హృద్యగతిమంతములై గద్యము అను విశేషసంజ్ఞను ధరింప నర్హములై యున్నవి. కథాప్రచయమున వస్తుప్రధానములు, సంధివాక్యరూపములునైన చూర్ణ పదవాక్యములు హృద్యతాధర్మవర్జితములై వచనము లనఁదగియున్నవి.

తిక్కనసోమయాజి సహజముగ నిర్వచనరచనాభినివేశము గలవాఁడు. భారతము నాయన 'పద్యముల గద్యములన్' రచియింపనిశ్చయించికొన్నను స్వభావనిగూఢమైన యాయన నిర్వచన రచనాభిలాష భారతమునందును గనఁబడుచునేయున్నది. పెక్కు రసవద్వృత్తాంతముల కూడలియైన మహాభారతము నాయన ప్రబంధమండలిగా భావించెను. మొత్తముమీఁద చంపూ మార్గమును వీడక అందొక రసవత్ప్రబంధమును నిర్వచనముగఁ దీర్చి తిక్కన తన యభిలాష మును దీర్చుకొనెను. మౌసలపర్వము నిర్వచనప్రబంధము. సౌప్తికపర్వమును స్రగ్ధరామయము గావించుట, స్త్రీపర్వమును నానావిశేషవృత్తసమలంకృతము గావించుట తిక్కన యభిరుచి విశేషమునకు, శిల్పమునకు నిదర్శనములు.

కవిత్రయము గద్య పద్య రచనాభిమానమును వారు రచించిన గద్య పద్య సంఖ్యల నిష్పత్తినిబట్టి గుర్తింపవచ్చును.

| | గద్యపద్యములు : | | పద్యములు : | | గద్యములు |
|---|---|---|---|---|---|
| నన్నయ : | 4011 | — | 2506 | — | 1505 |
| ఎఱ్ఱన : | 1595 | — | 1099 | — | 496 |
| తిక్కన : | 15901 | — | 11384 | — | 4517 |

### పద్య : గద్య నిష్పత్తి

| | | |
|---|---|---|
| నన్నయ : | 100 పద్యములకు | 60 గద్యములు |
| ఎఱ్ఱన : | 100 ,, | 50 ,, |
| తిక్కన : | 100 ,, | 40 ,, |

### గద్యపద్య : గద్యనిష్పత్తి

| | | |
|---|---|---|
| నన్నయ : | 100 గద్యపద్యములకు | 37 గద్యములు |
| ఎఱ్ఱన : | 100 ,, | 31 ,, |
| తిక్కన : | 100 ,, | 28 ,, |

ఈనిష్పత్తుల నతిక్రమించి గద్యములసంఖ్య కొన్నియాశ్వాసములందు పెరుఁగుట, కొన్నింట తఱుఁగుట కనఁబడుచున్నది.

### పెరిగిన యాశ్వాసములు

| | గద్యపద్యములు: | ఉన్నగద్యములు: | ఉండవలసినగద్యములు: | ఎక్కువ |
|---|---|---|---|---|
| ఆది. I | 161 | 66 | 60 | 6 |
| ,, VII | 290 | 115 | 108 | 7 |
| అర. II | 358 | 150 | 133 | 17 |
| ఉద్యో. IV | 128 | 142 | 122 | 20 |
| భీష్మ. III | 455 | 16) | 130 | 39 |
| ద్రోణ. V | 143 | 156 | 127 | 29 |
| శల్య. II | 422 | 158 | 120 | 38 |
| సౌప్తి I | 240 | 79 | 67 | 12 |
| ,, II | 136 | 51 | 38 | 13 |

### పెరుఁగుదలకుఁ గారణములు

ఆది. I – పర్వానుక్రమణికలందలి వివరములు.

,, VII – పంచేంద్రోపాఖ్యానము – శక్తికల్మాషపాదుల కథ

అర. II – తీర్థముల వర్ణనలు

ఉద్యో. IV – సేనానాయకనిర్ణయము మున్నగు మంత్రాంగము. వచనఖండము లెక్కువ.

భీష్మ. III – } వ్యూహములు, తుములయుద్ధములు
ద్రోణ. V – } రణాంగణవర్ణనలు, ద్వంద్వయుద్ధవివరములు
కర్ణ II – } రౌద్రోద్రేకప్రశాంతికి ఎడనెడ వచనఖండములు.
శల్య II – బలదేవుని తీర్థయాత్రల వర్ణన.
సౌప్తి. I – } రౌద్రవిశ్రాంతికొఱకు వచనఖండములు.
,, II – } క్రూరకర్మఫల సమీక్షారూపములైన వచనములు.

తఱిఁగిన యాశ్వాసములు

| | గద్యపద్యములు: | ఉన్నగద్యములు: | ఉండవలసినగద్యములు: | తక్కువ |
|---|---|---|---|---|
| సభా. II | 322 | 107 | 119 | 12 |
| విరాట. V | 407 | 103 | 116 | 13 |
| స్త్రీ. II | 187 | 31 | 52 | 19 |
| శాంతి IV | 457 | 95 | 129 | 34 |
| ,, V | 632 | 143 | 180 | 37 |
| అను. IV | 451 | 96 | 128 | 32 |
| ఆశ్ర I | 186 | 40 | 53 | 13 |

తఱుఁగుదలకుఁ గారణములు

సభా. II – శిశుపాలవధ, ద్యూతము, ద్రౌపదీమానహరణము రసవత్సన్నివేశములు.
విరా. V – ఉత్తరగోగ్రహణము – ఉత్తరాకల్యాణము – వీరశృంగారరసఘట్టములు.
స్త్రీ. II – స్త్రీలవిలాపములు నానావృత్తవిశేషములందు నిబద్ధములు.
శాంతి. IV } మంత్రప్రభావములు, నీతులు, సాంఖ్యాదితత్త్వములు, వృత్రగీతలు.
,, V } హంసగీతలు కందపద్యబహుళములు.
అను. IV – గద్యము తఱిగినమేరకు కందములు పెరిఁగినవి.
ఆశ్ర. I – ధృతరాష్ట్రవనగమనాదికము రసవత్సన్నివేశము.

మౌసలపర్వము నిర్వచనము

మౌసలపర్వమున 224 పద్యములకు కేవల మొక్కఁడే వాక్యఖండరూపమైన గద్యము కలదు. అదియు "అంత బలుండునుం బోవ నిశ్చయించి చెప్పిన" అను సంధివచనము. అచ్చట నీ వచనము లేకున్నను లోపములేదు. ఉండుట యసంగతమనికూడ చెప్పవచ్చును. ఆ సందర్భమిది ___

చ॥ వెలువడి లీల నేఁగి మును వేడ్క నొనర్చిన మేటిచప్పరం
బుల నెలమిన్ మహార్ణవముపొంత వసించిన నుద్ధవుండు దా

నలఘుతపంబొనర్చుటకునై విపినంబున కేఁగువాఁడుగాఁ
బలికిన దాని కొండొకఁడు వల్కెఁడ కృష్ణుఁడు కాలవేదితన్. 33

వ॥ అంత బలుండునుం బోవ నిశ్చయించి చెప్పిన 34

చ॥ పలుకక మ్రొక్కి వీడుకొలుపంగ వనంబున కప్పురోహితుం
దలఘువినిశ్చయంబు వగపంతయు మాన్పఁగఁ బోయె; నాతనిన్
హలధరుఁ డన్పఁబోయి వినయంబును భక్తియుఁ దోఁప నయ్యనా
కులు నటఁబుచ్చి యొక్కెడ నకుంఠితనిర్ణయ శాంతచిత్తుఁడై 35

కం॥ విను మొక్కెఁడు నొక భూరుహ
మున మూలంబున నిరస్తమోహాంధత్వం
బున వెలుఁగు బుద్ధివిజ్ఞే
యనిరూఢతఁజేసి యుండె నాసీనుండై. 36

సుబద్ధములయియున్న రెండు చంపకముల నడుమ నీ గద్యఖండము నిరర్థకమేకాక యనర్థకముకూడనై ప్రక్షిప్త మనిపించుచున్నది.

పూర్వపద్యాంతమున "ఒండొకఁడు వల్కెఁడ కృష్ణుఁడు కాలవేదితన్" అని ముగిసిన వాక్యమందలి క్రియాపదము ఉత్తరపద్యారంభమున పునర్గృహీతమై "పలుకక మ్రొక్కి వీడుకొలుపంగ వనంబున కప్పురోహితుం డలఘువినిశ్చయంబు వగపంతము మాన్పఁగఁ బోయె" నన్న వాక్యవిన్యాసమే సుశ్లిష్టముగ నున్నది. వాక్యార్థము సుస్పష్టముగ నున్నది. హలధరుఁ డాపురోహితు నంపఁబోయినట్లే పోయెనుగాని తానును తపమునకై వనమున కేఁగుదునని చెప్పి పోలేదు. చెప్పిపోయెనన్న భ్రాంతించే నీ గద్యఖండము పద్యములనడుమ నిఱికింపఁబడినది. ఇది తిక్కన వాక్యముకాదు. 'పల్కెఁడ' యన్న పూర్వవాక్యక్రియ 'పలుకక' యన్న ఉత్తరవాక్య క్రియతోఁ జక్కగా నతుకుచున్నది. ఈ వాక్యసంధానమునందలి యందమును 'చెప్పిన' యన్న గద్యఖండమందలి క్రియ భంజించుచున్నది. విశేషించి బలుఁడు చెప్పుటగాని పోవుటగాని మూలభారతమునం దగపడుటలేదు. మూలమిట్లున్నది—

"నివిష్టాంస్తా న్నిశమ్యాథ సముద్రాంతే స యోగవిత్
జగా మామంత్ర్య తాన్ వీరాన్ ఉద్ధవో ఒర్థవిశారదః" 3-11

"తం ప్రస్థితం మహాత్మానం అభివాద్య కృతాంజలిః
జానన్ వినాశం వృష్ణీనాం నైచ్ఛ ద్వారయితుం హరిః" 3-12

ఉద్ధవుని వనప్రస్థానమును శ్రీకృష్ణుఁడు వారింపలేదనిమాత్రమే యిచ్చటఁ జెప్పఁబడినది. హల ధరునిప్రసంగ మిటలేదు. కాని —

> 'రామస్య పద మన్విచ్ఛ
> తత్ర గచ్ఛామ యత్ర సః' 3—47

అన్న యనంతరవాక్యార్థమును సమర్థించుటకై తిక్కన "ఆతనిన్ హలధరుఁ డన్వఁబోయి" యన్న యర్థమును గల్పించెను. బలుఁడు తానును దపమొనర్పఁబోవుచున్నట్లు కృష్ణునకుఁ జెప్పలేదు. ఉద్ధవుని పోకకే దుఃఖమున మాటాడఁజాలని కృష్ణునకు బలుఁడు తానును బోవు చుంటిననిచెప్పినచో గుండెలు బ్రద్దలుకావా? ఉద్ధవుని సాగనంపుటయను మిషను కల్పించుకొని బలరాముఁ డాతనివెంటఁబోయెను. ఏడకుఁబోయెనో శ్రీకృష్ణాదులకుఁ దెలియదు. సర్వయాదవ క్షయమైన యనంతరము దారుకసహితుఁడై శ్రీకృష్ణుఁడు వెదకి యొక వృక్షమూలమున బల రాముఁడు యోగస్థుఁడై యుండుట కనుంగొనెను.

ఇట్లు సమన్వయముచేసిచూడఁగా నీ సందర్భమున నీ వచనఖండము అనర్థకమనియు, నది తిక్కనరచనకాదనియుఁ దేలుచున్నది. అచ్చటిపద్యముల యన్వయసౌందర్యమును గుర్తింపఁ జాలక, అవి యనన్వితములన్నభ్రాంతిచే నిది ప్రక్షిప్తమైనది. మౌసలపర్వమును దిక్కన నిర్వచనముగ రచించెననుటయే పరమార్థము.

కవిత్రయ ముపయోగించిన గద్యములందు సుదీర్ఘములయినవి చాలతక్కువ. పద్యము లందు నిబద్ధములయిన వాక్యపరంపరను, వాక్యప్రతివాక్యములను సంధించుట కుద్దేశింపఁబడిన లఘుఖండములే యెక్కుడుగానున్నవి. అట్టి సంధివచనములు తరచుగా – అని, అనిన, అనినవిని, అంత, మఱియు, ఇట్లు, అనియిట్లు, కావున, అట – అనుతెలుంగున నల్పాక్షరము లైయున్నవి,

కథనాత్మకవచనములుగూడ సాధారణముగాఁ బదిపంక్తులకు మించియుండవు. కొంత దీర్ఘములయిన గద్యములు ప్రాయికముగా వర్ణనాత్మకములైయున్నవి. ఉపన్యాసరూపములయిన దీర్ఘవచనములు అరుదుగాఁగలవు. ఉదా, శల్య. II. 328 శ్రీకృష్ణుఁడు దుర్యోధనుని పంచలించుట.

కథనాత్మకగద్యములు :

పర్వవృత్తాంతకథనము: ఆది. I. 33, 35, 37, 39, 41, 43, 45, 47, 49, 51, 53, 55, 65
దేవదానవుల యుత్పత్తిప్రకారము : ఆది III. 61, 63, 65, 67, 69, 71, 80,
వంశానుకథనము : ఆది. IV. 2, 114, 16.
నామకథనము : ఆది. II. 4, 213 ; V. 107 ; VII. 171 ; భీష్మ. I – 40.

వర్ణనాత్మక గద్యములు :

సముద్రవర్ణనము : ఆది. I. 27

కణ్వాశ్రమవర్ణనము : ఆది. IV 22

ద్రౌపదీవివాహవర్ణనము , ఆది. VII. 283.

నారదకృతతీర్థవర్ణనము : అర. II 260, 261, 268, 270. 276, 278.

ప్రభాతవర్ణనము : విరాట. II 240

యుద్ధవర్ణనము : విరాట. V 60 : భీష్మ. I 267 ; ద్రోణ. I 311 ; V 207

వ్యూహవర్ణనము : భీష్మ. I 95, 103, 130, II 21,

బలదేవుని తీర్థయాత్రావర్ణనము : శల్య. II 146, 148, 155, 159, 163, 176, 178, 183, 185, 189, 197, 203, 214,

# గద్య భేదములు

పద్యగంధి :

పద్యగంధిగద్యములందు వృత్తగంధి, జాతిగంధి భేదములను భోజుఁడు వింగడించి చెప్పెను. అట్లే యుపజాతిగంధియు భావింపఁదగియున్నది. కవిత్రయరచనయందు వృత్తగంధు లంతగా నగపడవు.

వ॥ అని శంకించియుఁ గొంకువోపవక - (మత్తేభగంధి)

శల్య. I. 264.

వ॥ కావున బంధుమిత్రధనసంచయ - (ఉత్పలగంధి)

అర. I. 24.

జాతిగంధి :

వ॥ వడిగలతురంగంబులం బూనిన రథంబెక్కి——
ఇంద్రప్రస్థపురంబున
కుంజని యిందులకు ధర్మనందనుందోడ్కొని...

సభా II. 134.

(ఇది కందగంధి)

వ॥ ఇట్టి మహోత్పాతంబులు
పుట్టిన సురపతి బృహస్పతిం జూచి...

ఆది. II. 33.

(ఇది కందకంధి)

వ॥ కృతకృత్యులమైతిమిప్రవి । ద్దనుం జాల ప్రాలె సేనయు... (కందగంధి)

శల్య. II. 332.

ఉపజాతిగంధి :

వ॥ అట్లు । చేయుదు నమృతంబుదెచ్చి మీకిచ్చి
యేనునుం దల్లియు దాస్యంబువలన

ఆది. II. 56.

(ద్విపదగంధి)

వ॥ ఇట్లాశ్రమంబునఁ గృత్రిమపక్షి
తలఁదెగనేసిన యర్జుననచలి తదృష్టికి...

ఆది. V. 254.

(ద్విపదగంధి)

వ॥ ఏము భవదీయ—
రాజసూయ మహోత్సవ దర్శనంబు
నను భవత్కృత సత్కారగౌరవంబు । ననుఁజేసి...

సభా. II. 76.

(తేటగీతిగంధి)

వ॥ మఱి యార్తునకు శయనంబును భీతు
నకభయంబు తృషితునకు జలంబు
ను బుభుక్షితునకు నన్నంబును శ్రాంతున
... ... ...
యజ్ఞశేషం బమృతంబునాఁ బరగు

అర. I. 31.

(సీస – ద్విపదగంధి)

వ॥ అని యేడ్చుచుం గుంతి యచ్చటం దడయ
వెఱచి గూఢప్రకారంబునం । గన్యాంతఃపురంబునకు
వచ్చి యెప్పటియట్ల వర్తిల్లుచుండె

అర. VII. 349.

(ద్విపదగంధి)

"నిన్నును భీష్మని నెన్ననేల"

భీష్మ. I. 174.

(సీసఖండగంధి)

అని యిట్లు పుండరీకాక్షుండు దన్ను

శల్య. II. 924.

కయ్యంబునప్పుడు కర్ణు తేజంబు

భీష్మ. I. 161.

(ద్విపదగంధి)

ఇట్టి పద్యగంధిగద్యములలో ముఖ్యముగా గమనింపఁదగినది అరణ్యపర్వ చతుర్థాశ్వాసమందలి 215 గద్యము. అది సరస్వతీదేవి వాక్యము. ఎఱ్ఱన యీ గద్యమును బుద్ధిపూర్వకముగనే పద్యగంధిగా నిర్మించినట్లు కనఁబడుచున్నది. దానియందు పెక్కుపద్యఖండములిమిడి యున్నవి.

"అగ్నిహోత్రం బస్మదాత్మకంబని యెఱుంగుము..."
"అగ్నిహోత్రముఖంబున ననుభవింతు"
ఆత్మజ్ఞులైన మహాత్ములకు నఖిల
 సంశయచ్ఛేదంబు సేయుదు నన
"మామకంబైన పరమపదంబు వినుము"
"ప్రచురమధుక్షీర తోయంబులును శర్క-
 రాసైకతంబులును.........
"యజనశీలురు పెక్కండ్లు మత్పదంబు"

అర. IV. 215.

తొమ్మిదిపంక్తుల గద్యమున నెఱ్ఱన సీస గీత ఖండములను విరజిమ్మివైచినాఁడు. ఇట్టి పద్యగంధిగద్యము సాక్షాత్సరస్వతీదేవి వదనమునుండి నిర్గమించుట పరమోచితముగా నున్నది. లయాత్మకములయి హృద్యములయిన గద్యములే పద్యగంధములయినచో హృద్యతరములై విపంచీస్వరసుభగములగును. ఇట్టి గద్యములు వైదర్భములని వామనుని యాశయముగా భావింపవచ్చును.

## చూర్ణగద్యము :

సంధివచనములు, కథనాత్మక, సంభాషణాత్మక, హితోపదేశాత్మక గద్యములు తరచు చూర్ణములైయున్నవి. చూర్ణగద్యములందును వక్తృవాచకౌచిత్యమునుబట్టి లలిత విస్ఫుర మధురాదిభేదములు గణింపఁదగియేయున్నవి.

లలితచూర్ణము :

వ॥ కావున నీరెండుదెఱంగులవారికి శాంతిగావింపం బ్రయత్నంబు సేసెద. ధర్మార్థసహితంబైన తెఱంగుమాటలు మంత్రిజనసహితుండైన సుయోధనునకుం జెప్పెదఁ దనకుం బాండునందనులకు లోకంబులకు హితంబయినవిధంబు వంచనలేక చెప్పెడు సన్ను పాండవులవాఁడని శంకించి యతండు నామాట వినండయ్యెనేనియు మేలకాక...

ఉద్యో. III. 243.

నిష్ఠురచూర్ణము :

వ॥ నాకట్టిన పుట్టంబు నీకుం గట్టంగాదు గాకేమి యని గర్వంబున నెగ్గులాడి దేవయాని నొక్కనూతం ద్రోచి శర్మిష్ఠ కన్యకాసహస్రపరివృతయయి క్రమ్మఱివచ్చి నిజనివాసంబుననుండె నంత.

ఆది III 138.

మధురచూర్ణము :

"అనిననతం డట్లకాక చనుదెమ్మనుటయు సావిత్రి చయ్యనంజని భార్యాసహితుండై యున్న తనమామకుం బ్రణమిల్లి మీకొడుకు వనంబునకు నగ్నిహోత్రార్థంబై సమిధలుదేరనరిగెడు నాకును నతనితోడనచని వనంబుసూడ వేడ్కయైనది మీరు నాకివ్వరంబు కృపసేయవలయు ననిన నాతం డిమ్మగువ యెన్నండును నెయ్యదియును నడగ దిత్తెఱంగు దీనికిం బ్రియంబై యున్నది నాకు నివారింపనేల యని తలంచి యనుమతించిన నయ్యిరువుర యడుగులంబడి వీడ్కొని—

అరణ్య. VII. 210

## ఉత్కలికాప్రాయము.

లలితోత్కలిక :

"అట్టియెడ మున్ను తురంగమఖురాదులం దూలిన కెంధూళియుం బైఁబయినెగయఁ బరబలంబు నెత్తుటజొత్తిల్లుచు నుచ్చిచను విప్వచ్చు నిశితశరపరంపరలు సైనికశరీరంబులపై సుడిసి తడిసి రుధిరశీకరనికరవికీర్ణ రవికిరణపరిణతంబగు సమీరణంబును, ధారాళకరాళరక్తపరిషిక్త విశ్వంభరాభాగంబునుం గలయం గెంపుసంపాదించి యకాలసంధ్య నావహించినం దదుచితవ్యాపార పారంగతంబులై పొడసూపిన యుడుగణంబులుంబోలెఁ బొలుచు ధనంజయసాయకదళితకుంజర కుంభవికీర్ణ మౌక్తికవిసరంబులవలనను, సముదీర్ణ మదవేగదుర్నివారవారణవిదారణంబులగు నర్జునాస్త్రపాతంబుల బెదరి తేంట్లెగయుట పొగలెగయుటయుం, బ్రతిభటబాణఘట్టనంబునం బాండవ మధ్యము కాండప్రకాండంబుల నిబిడజ్వాలలు నిగుడుట మంటయునుగా మూర్తంబగు తదీయ క్రోధదవానలంబు ఛటచ్ఛటాశబ్దంబులఛాడ్పునం జెలంగుచున్న యుధిష్ఠిరానుజు నతినిష్ఠురభల్ల

ధజ్యమానబలవదరాతిఖరాస్త్రనిస్వనంబులవలనను. బొట్టిబొట్టి బెడబెడ పడుపులుగట్టు శోణితంబు నీళ్ళనందుఁబడి తేలాడు వెలిగొడుగులు పుండరీకంబులును వింజామరలు మరాళపుంజంబులునునై కొలంకులచందంబునొంద వాని రెఱగెడు కొదమతుమ్మెదల పదువులపగిదిఁ బొరఁగు నాఖండల తనయఖండితపరవీరకాలాయసనారాచశకలములవలనను, గిరీటిశరపాటవపరిస్ఫోటితరిపుకపాల గళితమస్తిష్కపలలపంకంబువలనను, నలుదెసల నంతంతఁ గదియం జాఁగిపడియున్న కృత్త కరచరణంబులను......అభిరామంబయ్యును ఘోరప్రకారంబయ్యె......"

విరాట. V. 60.

నిష్ఠురోత్కలిక :

"అప్పుడు ప్రదీప్తవదనులుఁ బ్రజ్వలితనేత్రు లనేకపాదులుఁ గరితురంగసింహసూకరానన సమానముఖులును. దీర్ఘదంష్ట్రికరాళాస్యులును మఱియు ననేకప్రకారంబులగు వక్త్రంబులం బొలుచువారు వక్రాంగులు, దీర్ఘదేహులు హ్రస్వశరీరులు నతిస్థూలకాయులుఁ గృశమూర్తులుఁ బింగళగాత్రులుఁ నీలతనులు మఱి నానావర్ణంబులు గలుగువారును బంచశిఖులును జటాధారులును గపాలధరలును మఱియు బహుభంగిరంబులైన మౌళితలంబులం బొలుపొందువారును లోనుగా వివిధవిశేషవికృతస్వరూపులగు ననంఖ్యాతప్రమథులు చిత్రాంబరమాల్యాంగరాగంబులు రత్న కనకమయభుజగాస్థిమాలాభూషణంబులును ధనుస్తూణకృపాణముసలముద్గరపరశుభిండివాలస్థూల ప్రభృతిస్ఫారప్రహరణంబులు మెఱయ మృదంగపణవడమరుఘంటాగోముఖాదితూర్యంబులు మొరయ విస్ఫురద్ధ్వజపతాకాకుంచికలు శోభిల్లఁ బాడుచు నాడుచు నార్చుచు బొబ్బలిడుచు నవ్వుచు గఱచుచుఁ ద్రుళ్ళుచు గురువులువాఱుచుఁ గరటిబృంహితంబులుఁ గంఠీరవగర్జితంబులు శంఖరవం బులు భేరీధ్వనులుం బోని యెలుంగులు సెలంగ బెట్టిదంబులగు పలుదెఱంగులపలుకు లెసంగ బ్రహ్మద్వేషులగువారి మాంసరుధిరంబులఁ బూర్ణంబులగు కపాలంబులు గరతలంబులంగొని యాభీలంబులగు భక్షణపానంబు లాచరించుచు సోమపానశమదమతపోబ్రహ్మచర్యప్రముఖంబు లగు తమవిశిష్టకర్మంబులకు భవుండు విస్మయంబునొందుంగాని యష్టగుణంబగు నైశ్వర్యంబు నొందియుఁ దారు విస్మితులుగానియట్టి మహానుభావులద్దేవునకు గౌరికి గజముఖషణ్ముఖులకుం జె నర్మిలికింబట్టగు భవ్యులు దివ్యజనస్తవ్యు లయ్యశ్వగురుతనూభవు తెంపెఱుంగుటకు సౌప్తిక వ్యాపారఘోరత్వంబు గనుంగొని వినోదించుటకు వచ్చి యతనిచిత్తంబునకు బెదరుపుట్టించువారై భీషణాకారంబుల నుల్లసిల్లిన నాధైర్యధుర్యుండు."

సౌప్తిక. I. 116.

మధురోత్కలిక :

"అంత సూర్యాస్తమయసమయంబునఁ జంద్రుండుదయించి సాంద్రచంద్రికావిలాసంబున దిగ్వనితల నలంకరించుచుండ నిలింపపతిపంపున సొంపార నూర్వశి యర్జునసంగమకాంక్షంజేసి చంద్రికాధవళదుకూలంబుగట్టి మృగమదకర్పూరకుంకుమోన్మిశ్రితసుగంధంబులఁది వివిధసురభి

కుసుమవిస్తరంబులు ముడిచి మణిమయభూషణాలంకృతయై నిలుకడవడసిన క్రొమ్మెఱుంగుఁ దీగయుంబోలె మణిమయమంజీరఝుళంఝుళనినాదంబును గంకణఝణఝణత్కారంబును గటికలాపకింకిణీక్రేంకారంబును మదనాజ్ఞావాద్యఘోషంబునుంబోలె మ్రోయుచుండ మందగమనంబునఁ బురందరనందనుమందిరంబున కరుగుదెంచిన నప్పురుషసత్తముండు భయభక్తిసంభ్రమంబులతోఁ బ్రత్యుత్థానంబును దండప్రణామంబునుం జేసి కరకమలంబులు మొగిచి యిట్లనియె."

ఆరణ్య. I. 358.

# గద్య గతి భేదములు

మధురద్రుతి :

"ఈ లోకంబున వనితలుఁ బురుషులు విచ్చలవిడిఁ గ్రీడింతురు రిచ్చటికిది యనిందితంబైన యాచారంబు నీవును ద్రిదివంబునకు వచ్చినయప్పుడ దివ్యపురుషుండవు గావున నా మనోరథంబు సఫలంబుగా మందారమంజులమంజరీ మకరందపానమత్త మధుకరగానమనోహరస్థలంబులను మేరుశైలకందరంబులను మందపవనంబులుగల నందనాదివనంబులయందును నితాంతకాంతవికసిత కనకారవిందసమధికసౌరభసంవాసిత మహానందకందంబులైన మందాకినీతీరమణిమయవేదికలయందును జంద్రికాసుందరంబులైన సికతాతలంబులను మఱియు నిర్జరవిహారస్థానంబుల ననవరతసురతకేళీసౌఖ్యాంబుధి నోలలార్పుమనిన నిర్వికారధైర్యధుర్యుండైన యర్జునుం డిట్లనియె."

ఆరణ్య. I. 363.

మధురవిలంబనము :

"అని నిశ్చయించిపంచినం బాంచాలపతియును గరంబనురాగంబునఁ బురం బష్టశోభనంబు సేయించి సమారబ్ధవివాహమహోత్సవుండయ్యె నంత నిరంతరక్రముకకదళీస్తంభకుంభత్సంభృత నవామ్రాశ్వత్థపల్లవమాలాలంకృతద్వారతోరణంబులను జందనోదకసంసిక్తప్రాంగణరంగవల్లీకృత కర్పూరమౌక్తికప్రకరంబులను గౌతుకోత్సవమంగళశృంగార వరాంగనాప్రవర్త్యమానస్వనియోగకృత్యంబులను నుత్సవసందర్శనాగతానేకరాజన్యసుహృద్బాంధవబ్రాహ్మణసంకులంబుననుంజేసి యొప్పుచున్న ద్రుపదరాజమందిరంబునం బూర్వోత్తరదిగ్భాగంబున విచిత్రనేత్రవితతవితానముక్తమౌక్తికకుసుమమాలాలంబనాభిరామంబును సమీచీనచీనాంశుకవిరచితస్తంభవేష్టనంబును బ్రత్యగ్రపల్లవశాల్యక్షతాంచితకాంచనపూర్ణకలశోపశోభితంబును లాజాజ్యసంపూర్ణసౌవర్ణపాత్రనవసౌరభబహువిధపుష్పసమిత్కుశాశ్మశమ్యాభిరమ్యంబును నవగోమయశ్యామమర

కతమణిప్రభాపటలవిలిప్తహిరణ్మయవేదీమధ్యసమిద్ధాగ్నికుండమండితంబును సర్వాలంకారసుంద రంబునయిన వివాహమండపంబునకుం జని నిజపురోహితుండయిన ధౌమ్యుండాదిగా ననేకవిద్వ న్మహీసురనివహంబుతోఁ గరంబొప్పి."

ఆది. VII 283.

దీప్తద్రుతి :

"మనకు విడిదల కురుక్షేత్రంబని పలికి దుశ్శాసనుంజూచి నీవును గర్ణుండును గాంధార పతియును సమస్తంబును సమకట్టుండనుటయు వారలు ప్రియంబునం బనిపూని వెడలి దండు పాటించి తగువారలకెల్ల నెఱింగించిపుచ్చిన సకలపరివారంబును బ్రమోదంబునొందె భూవల్లభుం డును గొలిచియున్నవారలం బోవంబంచి వలయునెడకుం జని తగినవర్తనంబున నుండె, నట్టి సమయంబునఁ బ్రయాణోచితంబులగు బహుప్రకారవ్యాపారంబులయందుఁ దత్పరులయినవారల నానాచేష్టితంబులను, గరితురగరథంబులకు సవరణలుసమకూర్చు చతురపరిచారకుల సంభ్రమంబు నను, వివిధాయుధంబులు రవణంబులుగా నాయితంబులు సేయఁ బ్రవర్తించు పదాతివర్గంబుల సంరంభంబునను, నయ్యైసరకులు పయనంబున కనువుసేయు బలుమానిసుల తిరుగుడువడుటయుం బురంబు సమరోత్సాహచంద్రోదయంబునకు మహార్ణవంబై పూర్ణిల్లుచుండె.

ఉద్యో. IV. 136.

దీప్తవిలంబనము :

"మఱియుఁ బ్రతిపక్షసంక్షయకరంబులయిన యక్షయ్యశరధులును వివిధాయుధభరితంబై సింహలాంగూలలాలితగోలాంగూలధ్వజవిరాజమానంబై మహాంబుధరధ్వానబంధురంబై మనో వాయువేగసితవాహవాహ్యమానంబై రణితరమణీయమణికింకిణీకలాపాలంకృతంబై సకలదిగ్వి జయాధిష్ఠానంబై యొప్పుచున్న దివ్యరథంబు నర్జునునకిచ్చి సహస్రకరసహస్రదుస్సహ మహః పటలభాసురంబగుచు దేవదైత్యదానవయక్షరాక్షస పిశాచోరగప్రశమనంబయి వెలుగుచున్న సుదర్శ నంబను చక్రంబును గౌమోదకియను గదయును నారాయణునకిచ్చె నట్లు సంప్రాప్తదివ్యచాపరథా యుధులయి యున్న నరనారాయణులం జూచి యగ్నిదేవుం డిట్లనియె.

ఆది. VIII. 254.

# ఛందస్సంవాదము

వస్తురసభావాదులందలి యైక్యమును వృత్తైక్యముచే కవిత్రయము వ్యంజించిన ఘట్టములు పెక్కుకలవు.

అభిమన్యుమరణజనిత శోకవ్యాకులుఁడైన ధర్మజునకు దుఃఖోపశమనముచేయుటకై నారదుఁడు షోడశమహారాజుల వృత్తాంతమును ఆయనకు చెప్పును. జీవితము అస్థిరమనియు, ఎంతటి వారికైనను మృత్యువనివార్యమనియు బోధించుటకు జగత్ప్రసిద్ధులైన షోడశమహారాజుల వృత్తాంతములు స్వీకరింపఁబడినవి. ఈ వృత్తాంతములు–ఒక్కొక్కమహారాజునకు ఒక్కొక్క సీసపద్యముచొప్పున – సీసములందు వర్ణింపఁబడినవి.

సీసము అన్న పదము శీర్షకము అన్నపదమునకు వికృతి. శీర్షకమనఁగా శిరస్త్రాణము లేక శిరోభూషణమునగు మకుటము – కిరీటము.

> "తనపాదంబులు నాలుగు
> మొనసిన పై గీతపాదములు నాల్గునుగా"[1]

అనుతీరున సీసపద్యము "ఇంద్రగణము లాఱు నినగణంబులు రెండు"[2] గల నాల్గుపాదముల మీఁద "సూర్యుఁ డొక్కరుండు సురరాజు లిద్దరు దినకరద్వయంబు"[3] గల నాల్గుగీతపాదములతో నిర్మింపఁబడును. ఆఱింద్రగణములు రెండుసూర్యగణములుగల నాల్గు స్థూలపాదములతో దృఢ గంభీరమైన శరీరముగలిగి దానిపై రెండింద్రగణములు, మూఁడు సూర్యగణములుగల శిఖర మమర్పఁబడిన సీసపద్యము కిరీటాలంకృతుఁడైన మహాప్రభువు ననుకరించుచుండును.

సదృశమహిమాన్వితులగు పదునాఱుగురు మహారాజుల వృత్తాంతములను సదృశవృత్తముల నిబంధించి కవిబ్రహ్మ వర్ణ్యవస్తుస్వరూప సాక్షాత్కరణసమర్థముగ ఛందఃశిల్పము నిర్వహించెను. శ్రోతయైన ధర్మజునకువలెనే సహృదయునకును ఒక్కొక్కపద్యమున నొక్కొక్క మహారాజుయొక్క మహిమతోపాటు మకుటాలంకృతమూర్తియు సాక్షాత్కరించుచున్నది. వృత్త స్వరూపముచేత వస్తుస్వరూపమును, వృత్తైక్యముచే వస్త్వైక్యమును సుష్ఠుగా వ్యక్తముచేయఁ బడినవి.

షోడశమహారాజచరిత్రవర్ణనమున నిట్లు వృత్తైక్యనిర్వహణము తిక్కన స్వోపజ్ఞమే. వ్యాస మహర్షి యాపట్టున నిట్టి శిల్పమేదియుఁ బ్రదర్శింపలేదు. ద్రోణపర్వమందలి షోడశరాజకీయ

మును వ్యాసముని 16 అధ్యాయములలో వర్ణించెను. అనఁగా ఒక్కొక్కరాజుమహిమ యొక్కొక్క అధ్యాయమున వర్ణించెనన్నమాట. ఆ అధ్యాయములందలి శ్లోకముల సంఖ్య 11 నుండి 37 వఱకు మారుచున్నది. శాంతిపర్వమున మరల నీవృత్తాంతము పునరుక్తమైనప్పుడు మహర్షి పదునార్వుర చరిత్రలను ఒకయధ్యాయమందే వర్ణించెను. శ్లోకములసంఖ్య 6 నుండి 13 వఱకు మారుచున్నది.

పదునార్వురును తుల్యమహిమాన్వితులగుటచే సమకక్ష్యయందు ప్రతిష్ఠింపఁబడి పరిగణింపఁబడిరి. కనుక తిక్కన్న యొక్కొక్కని నొక్కొక్కసీసమున వర్ణించుట యుచితముగ నున్నది. వారి వృత్తములు స్థలాంతరమున పునరుక్తములయినప్పుడు పూర్వోక్తములయిన సీసములను అక్షరశః పునరుక్తములుచేయుటయు తిక్కన్న ఛందఃశిల్పమర్మజ్ఞతకు నిదర్శనమగుచున్నది.
(ద్రోణ. II. 197 - 212 ; శాంతి. I. 229 - 244)

మహర్షి రచనయందు ద్రోణ - శాంతిపర్వములందలి షోడశరాజక్రమము భిన్నముగ నున్నది. ద్రోణపర్వమున సగరుఁడు, శాంతియందు పరశురాముఁడు షోడశరాజులందు చేర్పఁబడిరి. తిక్కన్న యీ భేదములన్నియు సరిచేసెను.

గాంధారి పొలకలను దర్శించిన సందర్భమున తిక్కన్న లయగ్రాహివృత్తముల నుపయోగించెను. పుత్రపౌత్రాదిమరణశోకాతురయైన గాంధారి యుద్ధరంగముననిల్చి దృష్టిప్రసారము గావించెను. అతనువాహియగు ఆమె చిత్తవృత్తిపరిస్పందమునందలి ద్రుతగతిని తిక్కన్న మణిగణనికరమున వర్ణించెను.

"వసు ముని యతి రితి మణిగణనికరః"[4] అని మణిగణనికరలక్షణము. పదునాల్గు లఘువులపై నొకగురువుగల యీ వృత్తము గాంధారీహృదయస్పందద్రుతిని చక్కఁగా వ్యక్తము చేయుచున్నది. శోకము వెల్లిగొన్నప్పుడు చిత్తము "కొండొక దిగంబారు"నని తిక్కన్న. శోకవికారోదయమున హృదయము తొలుత ద్రుతగతియై క్రమముగ విలంబితగతియగునని డార్విన్. విలంబితగతియందుకూడ అవరోహణము శోకాక్రాంతహృదయలక్షణము. లయగ్రాహి యట్టిది. రౌద్రకర్మప్రతిబింబమైన యుద్ధరంగము విషయము. పుత్రమరణజనిత శోకావిష్టయైన గాంధారిహృదయమున తద్దర్శనముకారణముగాఁ గలిగినవి భయజుగుప్సాభావములు. భయజుగుప్సామిశ్రిత శోకావిష్టమైన గాంధారి హృదయవృత్తిని ఛందోవృత్తిచే సహృదయుని హృదయమున కవిబ్రహ్మ యెట్లు వర్తింపఁజేసెనో చూడుఁడు :

మణిగణనికరము.

"గొడుగుల పఱియలు గుఱుకులు గొనుటన్
సిడముల తునియలు సెదరియునికి బెం

దడిగలు బడగలు దఱచు మురియలై
పుడమిఁ గలయుటకుఁ బొగులొలయ మదిన్"

త్రి. II. 3.

రణావనియందంతటను నింతింతలు తునియలై చెదరిపడియున్న ఛత్రధ్వజాదుల ఖండములను లఘుహ్రస్వాక్షరములును, తద్దర్శనమున గాంధారిహృదయమునఁగలిగిన త్వరితగతిని వృత్తము యొక్క ద్రుతగతియు, ఆగ్నేయములైన డ,ఱలు పునరావృత్తములై గాంధారిహృదయస్పంద తాపమును సుష్ఠుగా వ్యక్తముచేయుచున్నవి. ఛందము వర్ణ్యవస్తువును ధ్వనించుచు గాంధారి హృదయమును ప్రతిధ్వనించుచున్నది.

కం॥ "నుఱుమైన కాల్బలంబును
నఱవఱలై యున్నయట్టి యరదంబులు బెం
దఱుచగు సూతాంగకములు
నొఱగిన రథ్యములగములు నుల్లమలంపన్"

త్రి. II. 4.

లఘ్వక్షరబహుళమైన యీ కందమున అంతరాంతరముల గురుదీర్ఘాక్షరములు సన్నివిష్ట ములై వర్ణ్యవస్తువును, తద్దర్శనజనితమైన గాంధారీహృదయస్పందమును చక్కఁగా వ్యంజించు చున్నవి. ఛత్రాదిఖండములకంటె రథరథ్యాదుల ఖండములు మొండెములు కొంత పెద్దవి. అక్షర సన్నివేశము దృశ్యమందలి వస్తుసన్నివేశమునకు దర్పణమువలెనున్నది. గాంధారిహృదయ స్పందగతి యించుక మందగించుట దీర్ఘాక్షరానుప్రవేశకల్పిత ఛందోగతివిలంబనమున స్ఫుటమగు చున్నది.

లయగ్రాహి :

"రావుతుల తుండములు మావతుల నుగ్గు దుర
గావలి శవంబులు గజావయవరాశీ
భావభయదస్థలులఁ బ్రేవులును గండలును
ప్రోవులయి పెన్మెదడు పైవిరసి రక్త
స్రావమునఁ బెల్లయిన తేవమునఁ జూడఁ గడు
నేవమగుపట్ల మృతభావగతులయ్యున్
జీవములు బాయరొకొ నా వికచవక్త్రముల
తో వఱలు రాజులు మనోవికృతిసేయన్"

త్రి. II. 5.

లఘ్వక్షర చతురస్రగతియగు మణిగణనికరమువెంట మిశ్రాక్షర చతురస్రగతియగు కందము, దానివెంట లఘ్వక్షరబహుళ ఖండగతియగు లయగ్రాహి - గాంధారి హృదయగతియందలి పరిణామక్రమమును చక్కఁగా నిరూపించుచున్నవి. షోడశవారావృత్తమైన జలేయవకారము గాంధారి హృదయమునం దావిర్భవించుచున్న యార్ద్రతను లక్షించుచున్నది. ద్రుతావరోహణగతియుక్తమైన విలంబితలయ 'భల' గణాకృతిచే సుష్ఠుగా భాసించుచున్నది. నిర్జీవపదార్థశకలదర్శనము, జంతుశకలదర్శనము, రాజకళేబరదర్శనము గాంధారిహృదయమును క్రమముగ నార్ద్రముచేయుట గుర్తింపవచ్చును. 'భయదస్థలులు' "ఏవమగునట్లు" ఆమె హృదయమును వికృతముగావించినవి. భయజుగుప్సామిశ్రితశోకార్తి ఖండవిలంబితలయచే వ్యంజితమగుచున్నది.

గాంధారి మొదట యుద్ధరంగము కలయఁజూచినది. చెదరినతునియలతో బఱపఁబడియున్న ఆ దృశ్యము మణిగణనికరము, మఱల చూచినది. తునియలప్రోవులు కనిపించినవి. అవి దీర్ఘాక్షరమిశ్రలఘుబహుళమైన కందము. గాంధారి యటుపై ఒక్కొక్కదిక్కు చూచినది. అధికవిస్తారదూరమైన పొలకలను ఏదిక్కు చూచినను అధికవిస్తారమే. లయగ్రాహియందు ఆ విస్తృతి ప్రత్యక్షమగుచున్నది. నాల్గుదిక్కులును సమానవిస్తృతికలవే. నాల్గిటికి నాల్గు లయగ్రాహులు. ఛందము స్వరూపముచే వస్తురూపమును రమ్యముగ భాసింపఁజేయుచున్నది. ఒక్కొక్కదిక్కును జూచినప్పుడు గాంధారిదృష్టి నాకర్షించుచున్న దృశ్యము ఒక్కొక్కతీరుగనున్నది. ఒకదానికంటె ఒకటి చిత్తక్షోభాకరముగనున్నది.

"హారరుచులన్ హృదయహారితరరోచులగు
వారు; హరినీలమణిభార విలసత్కే
యూరబహులాంశుచయ చారుతరరేఖలగు
వారు; నవవజ్రరుచిరోరు ఘృణిమత్కో
టీర రమణీయులగువారు; గరుడాశ్మమయ
భూరికటకద్యుతివిహార పరిశోభా
స్ఫారులగువారలును; బోరఁబడి నెత్తురుల
గూరుట కరం బెడద కారటముసేయన్"

శ్రీ. II. 6.

రెండవదిక్కున దృశ్యమంతయు నానావిధమణిమయోజ్జ్వల హారములచే ధగధగ మెఱయుచున్న రాజుల శిరములతో, కరములతో, మొండెములతో నిండియున్నది. ఆర్ద్రమగుచున్న గాంధారి హృదయమునఁ గొంతదీప్తి పొడముచున్నది. జలేయమైన వకారస్థానమున ఆగ్నేయమైన 'ర' కారము నిల్చినది. దృశ్యమందలి తేజస్విత ఛందమున ప్రతిఫలించుచున్నది. త్రింశద్వారావృత్తమైన రేఫము స్థాయిత్వముపొంది గాంధారి హృదయమందలి మృదువిదారణరూపమైన 'యారట

మును' బట్టియిచ్చుచున్నది. అవాంతరవాక్యవిరామములందు క్రమారోహణము నిబంధింపఁబడి గాంధారి నిశ్శ్వాసములు క్రమదీర్ఘములగుటను వ్యంజించుచున్నది. విరామములందు 'వారు' అను పదమే ఆవృత్తమై దృష్టవస్తువునందలి సారూప్యము వ్యంజితమచున్నది. అక్షరబంధము క్రమముగా నిబిడమై హృదయస్పందబంధము భారమగుటను స్ఫుటీకరించుచున్నది.

"అమ్ములును విండ్లు బరిఘమ్ములును దోమరచ
యమ్ములును గుంతనికరమ్ములు గనత్ఖ
డ్గమ్ములు నహీనముసలమ్ములును జక్రనివ
హమ్ములును లోనగు నసమ్మతమహోగ్రా
స్త్రమ్ములును గండలును నెమ్ములు గపాలములు
సమ్మిళితరూపశకలమ్ములయి సంగ్రా
మ మ్మతులదారుణవిధమ్మగుటఁ దెల్పు టది
కమ్మగు కలంక హృదయమ్మునకొనర్పన్"

శ్రీ. II. 7.

మూఁడవదిక్కున దృశ్యము మారణాయుధములతో, తత్కృతిమాంసాస్థికపాలములతో నిండి యున్నది. ఆ 'దారుణవిధమ్మ'గు దృశ్యము గాంధారి హృదయస్పందమును భారముచేయు చున్నది. హృదయవర్తనమున ఘనీభావలక్షణము (Curdling) సంయుక్త, ద్విత్వాక్షర బాహుళ్యమున వ్యక్తమగుచున్నది. జలేయానునాసికమైన మకారద్విత్వము షోడశవారావృత్తమై స్పంద ఘనీభావమును, అంతరాంతరముల నావృత్తములైన మహాప్రాణాక్షరములు, కనత్ఖడ్గ, మహో గ్రాస్త్ర - ఇత్యాది క్లిష్టాక్షరములు స్పందభారమును భాసింపఁజేయుచున్నవి. గాంధారి హృదయ మున అధికమ్మగుకలంక - సంక్షోభము పుట్టుచున్నది. జలేయమైన మకారద్విర్భావస్థాయిత్వము ద్రవీభూతగాంధారీహృదయస్పంద క్రమఘనీభావనిరూపకము, 'అతులదారుణవిధమ్మ'గు దృశ్యము రక్తఘనీభావకారణమగుట ప్రసిద్ధము.

"కుత్తుకలబంటియగు నెత్తురులు దోయిళుల
నెత్తి చవిఁగోలుచును చిత్తములు దృప్తిన్
జొత్తిలి నితాంతమదమత్తములుగా జటుల
నృత్తములు సేయుచు జలత్తనువికారో
ద్వృత్తపటుహాసముల రిత్తలగు దుర్వచన
వృత్తులను నొండొరుల నొత్తికొని మాంసం
బత్తి తినుటన్ వికటవృత్తులగు రాక్షసుల
మొత్తము పరిక్షుభితచిత్తత యొనర్పన్"

శ్రీ. II. 8.

నాల్గవదిక్కున దృశ్యము రుధిరపాన, మాంసఖాదన, వికటహాసన చటులనృత్తనములచే వికట వృత్తులగు పిశాచములతో నిండియున్నది. వికటాక్షర బాహుళ్యమున ఛందోబంధము ఉదార గుణబంధురమై నృత్యలీలాస్ఫోరకముగ నున్నది. పార్థివపరుషతకారద్విరుక్తి షోడశవారాభ్యస్తమై గాంధారిహృదయస్పంద ఘనీభావాతిశయ వ్యంజకమగుచున్నది. సంయుక్తపరహ్రస్వాక్షర ఘటనారూపమైన యోజోగుణము ఘనీభవించుచున్న గాంధారీహృదయమును తప్తముగావించి యంతర్ఘూర్ణితము చేయుట గుర్తింపవచ్చును. అంతర్ఘూర్ణనమే పరిక్షోభణము. భయజుగుప్సామిశ్రితశోకముచే ఘూర్ణితమైన గాంధారిహృదయమునకు ఛందము దర్పణమువలె నున్నది.

వస్తుస్వభావ రసావస్థాన వ్యంజనసమర్థముగ ఛందమును నిర్మించుట శిల్పముయొక్క పరాకాష్ఠ.

తిక్కన్న స్త్రీపర్వమున నారీజనముల నానావిధవిలాపములందలి నానావిధశ్రవ్యతాభంగులను వ్యంజించుతీరున నానావిధవృత్తవిశేషముల నుపయోగించెను. వ్యాసమహర్షి యట్టి ఛందశ్శిల్పము ప్రదర్శించియుండలేదు.

కర్ణపత్నీవిలాపమును వర్ణించుచుట్లమాత్రము గాంధారినోట మహర్షి నాల్గు ఉపజాతివృత్తములను పలికించెను. (21 అధ్యాయము - 11, 12, 13, 14 శ్లోకములు) 26 వ అధ్యాయమున శ్రీకృష్ణునిచే నొక యుపజాతివృత్తము పలికించెను. 13 వ అధ్యాయముచివఱ ధృతరాష్ట్రుఁడు ఉపశమితక్రోధుఁడై పాండవులను గౌగిలించుకొనుటను మహర్షి యొకయుపజాతియందు వర్ణించెను. (శ్లో. 17). ఈ ఆఱు ఉపజాతివృత్తములుతక్క తక్కిన స్త్రీపర్వమంతయు అనుష్టుప్పులందే నిబంధింపఁబడినది.

వస్త్వైక్యమున వృత్తైక్యము పాటింపఁబడుటకు మఱియొక యుదాహరణము ఉపపాండవ సంహారఘట్టము.

సౌప్తికపర్వము అద్భుత భయానక బీభత్సజనకమైన మహారౌద్రరసమునకు ఆటపట్టు. రుద్రదేవతావిష్టుఁడైన యశ్వత్థామ ప్రళయవిహారము ఇందలి వస్తువు. ఆ వస్తువును భావించి కవిబ్రహ్మయు రౌద్రరసావిష్టుఁడై రచనసాగించెనా యనిపించును. ఈ పర్వమునందలి స్థాయిచ్ఛందము స్రగ్ధర. అది సర్వేతరవృత్తములను అధఃకరించినసహృదయహృదయమున ఉద్ధతతాండవమొనర్చును. దారుణమైన యిందలి వృత్తాంతము సహృదయుని రక్తమును కరడుగట్టించి హృదయస్పందమును మందీభూతము గావించు తమఃప్రధానమైనది. గురుదీర్ఘాక్షరబాహుళ్యము ఈపర్వమందలి పద్య గద్యము లన్నింటను సులభముగ గుర్తింపవచ్చును. మంద్రము, మందమునైన హృదయస్పందసంచారము పర్వమందంతటను ప్రళయసమయ మహాతాండవమందలి రుద్రదేవుని గురు విలంబితపదన్యాసము ననుకరించుచున్నది. ఆఱు మత్తేభములు, ఆఱు శార్దూలములు నాతి దూరాంతరావృత్తములైన ఇరువది స్రగ్ధరా మహాస్రగ్ధరల రౌద్రతాండవమును దీపింపఁజేయుచున్నవి. పర్వమును పఠించిన సహృదయునకు ఇందలి 327 గద్యపద్యములను స్రగ్ధరాఛందమే

యావేశించినదా యనిపించును. అశ్వత్థామహృదయమువలెనే తిక్కన్నహృదయముకూడ రౌద్ర రసముచే నేకాగ్రమైయున్నది. అంతరంగ బహిరంగ క్రియాసంవాదము, వస్తు చ్ఛంద స్సంవాదము ఈ పర్వమున పరమరమణీయముగ నున్నది.

కృపకృతవర్మాశ్వత్థామలు చీకటిపడినంత ఒక వటవృక్షచ్ఛాయ నాశీనులైరి. ఆ సమయమున.—

"వారి ముఖమండలములతో వారిజములు
మొగిడె శోకతమంబుతో నిగిడె దిమిర
పటలి; బహువిచారములతోఁ బరగఁబొల్చె
భూతభేతాళగణములు భూపముఖ్య"

సౌప్తిక. I 13.

ఇందలి తుల్యయోగితాలంకారము పర్వమందలి నాయకాదుల బహిరంతర్వ్యాపారసంవాదమును చక్కఁగా ధ్వనించుచున్నది. క్రోధాతిశయంబున నిదురరాక వటశాఖలందు దృష్టిసారించియున్న యశ్వత్థామకు భూతవితానభీకరమైన యులూకము కాకముల సంహరించుతెఱఁగు గోచరించెను. కాకసంహారవిధానము –

"కొన్నిటి కంఠముల్ నులుపుఁ గొన్నిటి కాళులు ద్రుంచు నుగ్రతం
గొన్నిటి పక్షముల్ నఱకుఁ గొన్నిటి పొట్టలువ్రచ్చు లీలమై
గొన్నిఁటి నప్పళించుకొని కోలెముకల్ నురుమాడు నిట్టుల
య్యన్నిఁటి నయ్యులూకము రయంబెసఁగన్ వధియించె భూవరా

సౌప్తిక. I. 18.

ఈ యులూకచర్య యశ్వత్థామ హృదయమున గాఢముగ ముద్రితమయ్యెను. అశ్వములఁ బొలియించుపట్ల అతనిచర్యయందు వీని ప్రతిముద్ర యచ్చుపడుట కవిబ్రహ్మ ఛందస్సంవాదముచే ధ్వనింపఁజేసెను.

"కొన్నిటి పాదముల్ నఱకుఁ గొన్నిఁటి మోరలు సెక్కు లీలమైఁ
గొన్నిటి కంఠముల్ దునుము గొన్నిటి వీఁపులు వ్రచ్చు నుబ్బునన్
గొన్నిఁటి సర్వగాత్రములు గ్రూరవిచేష్టితవిభ్రమంబు దోఁ
పన్నుఱమాడుఁ బ్రౌఢబలభాసిత భూరిభుజావిహారుఁడై"

సౌప్తిక. I. 176

ఛందస్సాదృశ్యమున వస్తుసాదృశ్యము సుప్రతీతమగుచున్నది. అశ్వసంహారమునందు ఉత్పలము నుపయోగించి గజసంహారమున స్రగ్ధర నుపయోగించుట వృత్తస్వరూపగౌరవముచే వస్తుస్వరూప గౌరవమును వ్యంజించు శిల్పము.

శార్దూల మత్తేభ వృత్తముల స్వరూపములతోఁ బోల్చిచూచినచో స్రగ్ధరా మహాస్రగ్ధరలను శరభ సింహములను నామములతో వ్యవహరించుట యుచితమనిపించును.

శిబిరమంతయుఁ బీనుఁగుపెంటలు చేయుచున్న యశ్వత్థామ రౌద్రసంరంభము కర్ణాకర్ణిగా విని ద్రౌపదేయులు సేనాసమేతులై యాతని నెదిరింపవచ్చిరి. "వారల నేర్పడ నాలోకించి—

"అగ్గురునందనుండు హరిణావలి గాంచి కుభృత్తటంబు వే
డిగ్గ మృగేంద్రుచాడ్పున గడింది మగంటిమి యుల్లసిల్లఁగా
డిగ్గి రథంబు చోద్యపువడిం గలయన్ బెరసెన్......"

సౌప్తిక. I. 180.

గిరిశృంగమునుండి లేళ్ళమందపై చెంగున దుముకు సింగమువలె అశ్వత్థామ యుపపాండవులపై దుమికి విచిత్రవేగమున నొక్కొ-క్కదూకున నొక్కొ-క్కనిఁగా ఉపపాండవుల నైదుగురను సంహరించెను. ఆ సంహరించుటను తిక్కన్న వరుసగా నైదు మహాస్రగ్ధలందు వర్ణించెను. అశ్వత్థామ విహారమున సింహవిక్రమక్రమము ఏర్పించిన తిక్కన్న ఆ క్రమమును మహాస్రగ్ధర యందు ప్రదర్శించెను.

"విततజ్యానాద మాశావితతి నినిచి దోర్వీర్య మేపార బాణ
ప్రతతిన్ దన్ముంప పీకం బలక జడియుచున్ బల్విడిం బేర్చి చంచద్
గతిఁ గ్రీడన్ దంతిహేలావలనరత మృగేంద్రస్ఫురన్మూర్తి దోఁపన్
శ్రుతకీర్తిం గిట్టి కంఠత్రుటన విలసనారూఢి నవ్విప్రుఁడొప్పెన్"

సౌప్తిక. I. 189.

అశ్వత్థామమూర్తియు, క్రీడయు తిక్కన్న కెట్లు దర్శనగోచరమయ్యెనో యీ యుపమానము పునరుక్తమై ధృఢీకరించుచున్నది. విషయైక్యమున ఉపమానైక్యము, వృత్తైక్యము చక్కఁగా నిర్వహింపఁబడినవి. నాల్గింట 'త' కారప్రాసమునుగూడ గుర్తింపవలెను.

అనంతరము తన్ను గుర్తించి తనపైఁ గవియుదెంచిన చతురంగబలములను 'అబ్బాలు మగండు సముద్దండ బాహుదండ విలాసుండై" సంహరించిన క్రమము —

"తలలన్ హస్తమ్ములన్ బాదములఁ దనువులం దత్ప్రదేశంబు గప్పన్
తొలగించున్ వానిఁ గొన్నెత్తురువఱపి; హయస్తోమ దంతిప్రతానం
బుల మేదోమాంసఖండంబుల దనుజమహాభోజనం బావహించున్
మలగంబాఱున్ జెలంగున్ నలి నెసఁగు జయోన్మత్తుఁడై మానవేంద్రా;"

సౌప్తిక. I. 194.

అని తిక్కన మహాస్రగ్ధరయందే వర్ణించెను. అశ్వత్థామ యిట్లావహించిన దనుజమహాభోజన క్రీడనుగూడ తిక్కన మహాస్రగ్ధరయందే వర్ణించెను.

అశ్వత్థామ కావించిన రౌద్రకర్మఫలముగా పాండవశిబిరమున కరుణము ఒరసినదఁట. అనఁగా కరుణరసము వెల్లువలై పొంగారినది. కాని "తన కరయఁగ జేరుగడలేమి నది వృథయయ్యెనఁట". పొంగారిన యీ కరుణమునకు ఆశ్రయము ధర్మరాజాదులు. వారట లేరుగదా. ఉండినచో కరుణప్రవాహము వారి నాశ్రయించియుండెడిది. తిక్కన్న యీ కరుణమునుగూడ మహాస్రగ్ధరలందే వర్ణించియుండెడివాఁడు. నిజముగ ఆయన యట్లేచేసెను.

శిబిరమంతయు పీనుఁగుపెంటకావించి తిరిగి దుర్యోధనుఁడు పడియున్నచోటికేఁగి ప్రాణావసానదశయం దున్న యాతనింగాంచి యశ్వత్థామాదులు విలాపముచేయుటను తిక్కన మహాస్రగ్ధరయందే వర్ణించెను.

"కని శోకం బాత్మలం దగ్గలముగ రథముల్ గ్రక్కునండిగ్గి భూమిన్
ధనువుల్ వోవైచి బాష్పోద్గమము వొదవ వక్త్రింబులన్ విప్రలాపం
బును దైన్యం బావహిల్లన్ బొరలుచు బొరి నాభూవిభున్ శాంతదృష్టిన్
గనుగొంచున్ జేరి కేలంగముపయి నిడుచున్ గౌఁగిటంజేర్చికొంచున్"

సౌప్తిక. I. 214.

అశ్వత్థామ హృదయస్పందములు విలంబితగమనముననే యున్నవి. రౌద్రము హృదయగతి విలంబకమని గుర్తించితిమిగదా! కరుణమున విలంబితగతి మునిచే విహితమై యుండనే యున్నది. విలంబితగతియందు పృథక్పదత్వ విరామబాహుళ్యముచే మాధుర్యగుణము ఆధానము చేయఁబడి రౌద్రోచితమైన చిత్తభూమికయందే కరుణము అనుభూతమగుచున్నది.

ప్రథమాశ్వాసమునం దిట్లు నిర్నిరోధముగ విహరించిన మహాస్రగ్ధరయొక్క ప్రభావము కవిహృదయమునుండి తొలఁగలేదు. అశ్వాసాంతమున హరిహరనాథుని సంబోధింపవలసి యున్నది.

"పరమజ్ఞేయానుభావా! భవభయహరణప్రౌఢ నామానుభావా!
కరఖేలచ్చక్రశూలా! కలుషహృదయసాంగత్య వైముఖ్యశీలా!
కరుణాయత్తాంతరంగా! కమలభవమనఃకంజ సంవాసభృంగా!
దురితధ్వాంతప్రదీపా! తులనిరసనసంస్తుత్య నిర్వ్యాజరూపా!"

సౌప్తిక. I. 238.

అని యాయన స్వామిని మహాస్రగ్ధరయందే సంబోధించెను. "కరషేంచ్చస్రహాలా : కరుణా యత్తాంతరంగా !" అన్న సంబోధనలు అశ్వత్థామ నావేశించి రౌద్రకర్మ ప్రవర్తింపఁజేసిన రుద్రమూర్తిని, ఆ రౌద్రకర్మనుజూచి కరుణమునకు ఆయత్తమగుచున్న యంతరంగముఁగల శ్రీకృష్ణుని స్మరింపఁజేయుచున్నవి

పదునైదు పర్వములం దెచ్చటను తిక్కన్న యాశ్వాసాంతముల హరిహరనాథుని స్రగ్ధర లందు సంబోధించియుండలేదు. సౌప్తికపర్వమందుమాత్రమే ఉభయాశ్వాసాంతములందును ఆయన స్వామిని స్రగ్ధరలందు సంబోధించెను. ఈపర్వమున స్రగ్ధరాగతి యాయన హృదయము నెట్లావేశించెనో దీనివలనఁ జక్కఁగా స్ఫుటమగుచున్నది.

ద్వితీయాశ్వాసారంభమున ధృష్టద్యుమ్నుని సారధి పరతెంచి ధర్మరాజాదులకు జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పును. అశ్వత్థామ రౌద్రచర్యయంతయుఁ దిలకించి భయశోకాక్రాంతుఁడై యున్న సారథిహృదయమునుగూడ స్రగ్ధరాగతియే శాసించుచున్నట్లున్నది.

> "వీడెల్లం దల్లడిల్లన్ వివిధగతులమై విక్రమోల్లాస మొందం
> గ్రీడాకల్పంబుగా నాకృతిగని ప్రజ శంకించి దైత్యుండసం జెం
> డాడెన్ శీర్షవ్రజంబున్ హరులగముల వేటాడె నేనుంగులం దు
> న్మాడెన్ గాఢేయహేలాభ్యసన లసితబాహార్గళాభీషణుండై"
>
> సౌప్తిక. II. 5.

అనియు ——

> "కృపుడున్ హార్దిక్యుఁడున్ వాకిట నిలిచి భయాక్షిప్తయోధవ్రజంబున్
> నృపులున్ వే నిర్గమింపన్ వివిధశరములన్ మేదినిం గూల్చుచున్ ఘో
> రపుసంరంభంబు దుర్వారముగఁ గెరలి రౌద్రంబు రూపంబుఁదాల్పన్
> గుపితక్రవ్యాదులోనాఁ గుచరితనిరతిన్ గ్రూరతాధుర్యులైనన్"
>
> సౌప్తిక. II. 9.

అనియుఁ దాను కండ్లారఁదిలకించిన క్రూరకర్మను వర్ణించెను. ధర్మజాదు లది వినిరి. శోకవేగ సంతప్తుఁడై సొలసి వ్రాలఁబోయిన ధర్మజుని సాత్యక్యాదులు పట్టుకొనిరి. ఆయన యంతలో మూర్ఛఁదేరి పుత్రమరణశోకాక్రాంతుఁడై విలపింపఁదొడఁగెను. సారథివర్ణనమునందలి యక్షర గతియే ఆయన విలాపమునందును ప్రత్యక్షమగుచున్నది ఎట్టికష్టమునందును ధైర్యము కోల్పోని వాఁడు ధర్మరాజు. ఒకపట్టున నాయన హృదయము ప్రసన్నగతిని వీడదు. గత్యల్పణత యాయన హృదయమున అభిమన్యుమరణ సందర్భమున గోచరించినది.

"గురు శారద్వత ముఖ్యయోధవర సంగుప్తంబు నిర్భేద్య ము
ద్ధుర మా సైన్యము; దానిఁజొచ్చి నను బ్రీతుంజేయఁగాఁబూని యొ
క్కరుఁడున్ గోవులలోను చొచ్చు బలుసింగంబొక్కొనా నట్లు సొ
చ్చి రయంబార ననేకవీరశిరముల్ చెండాడె నుద్దండుఁడై"
ద్రోణ II. 138.

గురుదీర్ఘాక్షరప్రాయమైన మత్తేభవృత్తము ఎన్నఁడోకాని ధర్మజునినోట రాదు. దీప్తమందస్పంద బంధురమైన వాక్యము అనుతాపమిశ్రితశోకవశమైన యవస్థయందే అయన యుచ్చరించును. అభిమన్యుమరణజనితమైన శోకముకంటె ద్రౌపదేయమరణజనితమైన దుఃఖము అత్యంతము ఉత్కటమైనది. పాండవవంశము సర్వనాశనమైనది. తనగెలుపు ఓటమితో సాటియై నగుబాట్ల పాలయినది. తన రణోద్యమము వ్యర్థమైనది. ధర్మజుని హృదయము తీవ్రమైన శోకమునకు, పశ్చాత్తాపమునకు లోనైనది. ఆయన హృనయస్పందముల మాంద్యము, దీప్తి మరల స్రగ్ధరా రూపమే తాల్చినది.

"బాణజ్వాలానితాంత ప్రసరణముల శుంభద్విపక్షత్వాంద్రసైన్య
శ్రేణీకాంతారముల్ చూర్ణితములుగఁ బటుక్రీడమైఁ దేజరిల్లెన్;
ద్రోణాచార్యాగ్నివేడిం దొడరక మెఱసెన్ దోర్విలాసంబు; వైరుల్
ప్రాణంబుల్ నాచికోల్ దప్పదు; తుది విధి యబ్బాలురన్ ద్రెళ్లవైచెన్"
సౌప్తిక. II. 14.

"శరదంష్ట్రాభీషణంబై చటులరిపుమృగస్వైర విధ్వంసలీలా
స్ఫురణన్ శోభిల్లు రాధాసుతుఁడను పులి విస్ఫూర్జితంబున్ సహింపన్
వెరవున్ దర్పంబుఁగల్గెన్; వికలరిపులచే వీటిపోయెం గుమారో
త్కర; మింకేమందుః నాపత్పరికలన ప్రమాదంబుసం గాకయున్నేః"
సౌప్తిక. II. 15.

"శాతాస్త్రస్ఫారవీచీసముదయ రభసాశ్చర్యసంపాదిహేలా
స్ఫీతంబై క్రమ్మదేరఁ బెదరక కలచెఁ భీష్మవారాశిఁ; దుష్ప్రా
రాతివ్యాపార దుర్వారతఁ దెగియెఁ గుమారవ్రజం బక్కటా! ని
ద్రాతంద్రావ్యాప్తి నక్రూరతఁ బొరసి భుజాప్రౌఢి వమ్మయ్యెఁజుమ్మీ!"
సౌప్తిక. II. 16.

ఈ వృత్తములందు పక్షాంశము భీష్మాదుల భుజప్రతాపము, దానిని బ్రతిఘటించి నిలిచిన యుపపాండవుల భుజప్రతాపము, దానిని వమ్ముచేసిన యశ్వత్థామ క్రూరకర్మ – వీని స్మరణమున ధర్మజునిచిత్తము దీప్తమయ్యెను. దీప్తి యనఁగా విస్తారప్రజ్వలనరూపమైన చిత్తవృత్తి. అది యీ వృత్తములందు ప్రస్ఫుటముగ వ్యక్తమగుచున్నది. కుమారులమృతికి ద్రౌపది యెట్లు శోకముపాలగునో యని స్మరించినప్పుడే ధర్మజుని హృదయమున మార్దవము అడుగుపెట్టెను. ఆయన వడివడింబోయి యశ్వత్థామ క్రూరవిహారముఁ గావించిన క్షేత్రమును దర్శించెను. ఇంత వఱకును నచ్చట పొంగారిన కరుణమునకు ఆశ్రయములేదు. ఇప్పు డాశ్రయ మేర్పడెను. ధర్మజాదుల కరుణాక్రాంతావస్థయు స్రగ్ధరయందే వర్ణింపఁబడెను.

> "స్ఫురదశ్వత్థామ చంచద్భుజలసదసివిస్ఫూర్జిత క్రూరధారా
> పరికృత్తావ్యక్తగాత్రప్రకరుల సఖులన్ బంధులన్ బుత్రులన్ దా
> గరుణం బుప్పొంగ నార్తిం గనుగొని వికలాంగత్వముంబొంది మూర్ఛా
> పరతంత్రుండై ధరిత్రింబడిఁ బడిరి జద్రాభ్తలున్ గేశవుండున్"
>
> సౌప్తిక, II 21.

అశ్వత్థామ క్రూరకర్మవర్ణనము, తద్దర్శనమున ధర్మజాదులు కరుణపరవశులగుట వృత్తముయొక్క పూర్వోత్తరార్ధములఁ బొందుపఱుపఁబడియున్నవి. పూర్వోత్తరభాగములందు నిర్విరామపరుషాక్షరవృత్తియు, విరామబహుళమృదులాక్షరవృత్తియు విభాగశః శ్రవణగోచరములగుచున్నవి.

పుత్రఘాతియగు ద్రౌణిని శిక్షింపవెడలు భీముని వీరోద్యమము, ఆత్మరక్షాపరుఁడై యశ్వత్థామ బ్రహ్మశిరోనామక మహాస్త్రమును ప్రయోగించుట, తత్ఫలముగా నుత్పన్నములయిన యుత్పాతములు స్రగ్ధరలందే వర్ణింపఁబడినవి.

సౌప్తికపర్వమున ప్రధానరసము రౌద్రము. బీభత్సభయానకములు, అద్భుతకరుణములు దానికి అంగములు. రౌద్రము నిమిత్తముగా జన్మించు ఈ యంగరసములును తదేకభూమికములే. అనఁగా ప్రజ్వలనాత్మకమైన రౌద్రము నిమిత్తముగా జన్మించిన రసములుగూడ ప్రజ్వలనస్పృష్టములై యుండును. వీరరౌద్రముల ఫలముగా నుద్భవించు అద్భుతము ఒక్కతీరున నుండదు. వీరజన్యాద్భుతము సత్త్వప్రధానము. రౌద్రజన్యాద్భుతము తమఃప్రధానము. రౌద్రజన్యాద్భుతము రౌద్రభూమికయందే ఆస్వాదింపఁబడును. హృదయస్పందములందు గతివిలంబము నారోపించు స్రగ్ధరావృత్తము పునఃపునరావృత్తమయి యీ పర్వమున సాంగమైన రౌద్రము ఆస్వాదింపఁబడుటకు యోగ్యమైన హృదయక్షేత్రమును దృఢముగా ప్రతిష్ఠించుచున్నది.

రసావిష్టుఁడైన కవి రసానుకూలవృత్తనిర్మాణమున సమర్థుఁడగును. విశిష్టరసావేశమున నుత్పన్నమగు విశిష్టహృదయస్పందవృత్తి యాతని వాక్యములందు స్ఫుటముగ వర్తిం

చును. సౌప్తికపర్వమునందు స్థాయిభావము క్రోధము, స్థాయిచ్ఛందము స్రగ్ధర. ద్వితీయాశ్వాసాంతమున నైతము తిక్కన్న —

"సాయంప్రాతర్హుత ప్రజ్వలిత హుతవహస్వైర నిర్ధూతజాడ్య
స్ఫాయచ్చేతఃప్రసాద ప్రసృమరవిమలప్రౌఢ బోధానుమోదీ!
మాయావ్యాపారదూరా! మఖతతిఖ్యాతినిర్మాణసంపాద్యమానా!
శ్రేయోరాజత్త్రిలోకాశ్రిత జనదురితక్షేపలీలావిలాసా!"

సౌప్తిక. II. 134.

యని హరిహరనాథదేవుని సంబోధించెను. స్రగ్ధరాచ్ఛందోవృత్తి యాయన చిత్తమునం దెట్టి స్థిరత్వమును పొందియున్నదో రూపించుటకు ఇంతకన్న ప్రబలనిదర్శన మేముండును!

"సావేగపవనాదీనాం వర్ణనే స్రగ్ధరా మతా"[5]

అని క్షేమేంద్రుఁడు స్రగ్ధరయొక్క వర్ణనానుకూలతను సూచించెను. సౌప్తికపర్వమునందలి యశ్వత్థామచర్యయంతయు సావేగపవనసదృశమే. క్షేమేంద్రుని సూచనను అక్షరశః అనుసరింపవలసినయెడల స్రగ్ధరావృత్తప్రయోగమునకు అవకాశము అత్యంతసంకుచితమగును. సావేగపవనాదులు విధ్వంసకద్రవ్యములకు ఉపలక్షకములుగా గ్రహించుట యుచితము. ఆదిపదముచే పంచభూతవిజృంభణము గ్రహింపవచ్చును. స్రగ్ధరయొక్క రసానుకూలత క్షేమేంద్రుఁడు పేర్కొనకున్నను విధ్వంసాత్మకమైన కర్మయే ప్రధానముగాఁగల రౌద్రమును వ్యంజించుటయందు స్రగ్ధర సమర్థమగును అని కవిబ్రహ్మ ప్రయోగదృష్టాంతబలమున నిశ్చయము చేయవచ్చును.

"వీరస్య భుజదండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్"[6]

అని కాత్యాయనుఁడు స్రగ్ధరచే వర్ణింపఁదగిన వస్తువును పేర్కొనెను, ఇదియు ఉపలక్షకముగనే గ్రహింపఁదగియున్నది. వీరుని భుజదండములనుమాత్రమే కాక ఆ భుజదండములు నిర్వర్తించు వీరరౌద్రక్రియలనుగూడ స్రగ్ధరయందు వర్ణింపఁదగునని కాత్యాయనాభిప్రాయముగా స్వీకరింపవచ్చును. వీరరౌద్రములందలి విభావ, అనుభావములను వర్ణించుటయందు స్రగ్ధరాప్రయోగము ఉచితమని నన్నయ తిక్కనల యభిప్రాయముగా లక్ష్యములవలన స్పష్టమగుచున్నది

"అకారగురుయుక్తాదిః పర్యంతాంతవిసర్గిణీ
అనస్యూతవిరామా చ స్రగ్ధరా రాజతేతరాం"[7]

అని క్షేమేంద్రుఁడు స్రగ్ధరావృత్తనిర్మాణములందలి మెలకువలు వివరించెను. ఉగ్రవస్తురసభావవర్ణనమున సర్వసమర్థము గావలెనన్నచో స్రగ్ధర అకారాదిగుర్వక్షరారబ్ధము కావలెను. పర్యంతమున విసర్గముండవలెను. విరామములు కలిసిపోఁగూడదు.

సంస్కృతమునందువలె తెలుఁగున విసర్గమునకు విపులప్రయోగములేదు కనుక పాదాంతమున విసర్గమునకుబదులు వ్యంజనాంతమైన యక్షరము నుంచవచ్చును. యతిస్థానమున పదచ్ఛేదము సంస్కృతసంప్రదాయము. తెలుఁగున అక్షరమైత్రి చాలును. అసంస్యూత విరామత్వమను లక్షణము తెలుఁగుస్రగ్ధరలం దుండుట స్వాభావికముకాదు. ధారావాహియగు గమనమునందే లయను రూపించుట తెలుఁగుమార్గము. "ఆకారగురుయుక్తాదిః" అను లక్షణము మహాస్రగ్ధరయందు వర్తింపదు. క్షేమేంద్రుఁడు మహాస్రగ్ధరరమాట వేఱుగాఁ జెప్పలేదు. కాత్యాయనుఁడును చెప్పలేదు. పరమార్థమున రెండును ఒక్కఁడేకదా !

ద్రోణభీష్మాదిమహావీరుల ప్రతాపము నెదిరినిల్చిన యుపపాండవులు అశ్వత్థామ సౌప్తిక విక్రాంతిపాలఁబడి మృతులగుటను స్మరించి ధర్మరాజు శోకించుట వ్యాసమహర్షిచే ఉపజాతి వృత్తముల నిబంధింపఁబడినది. ఈ యుపజాతియే యక్షరచ్ఛందమై కాళిదాసునిచే వియోగిని యనఁబడినది. అజవిలాపమందలి, రతివిలాపమందలి వియోగినీవృత్తప్రయోగము దాని కరుణరసవ్యంజకత్వమును చక్కఁగా స్థాపించియున్నది. ధర్మజవిలాపమున వ్యాసముని యుపయోగించిన యుపజాతివృత్తములును కరుణరసవ్యంజనదక్షములై యొప్పారుచున్నవి. కాని ధర్మజుని కరుణము శుద్ధముకాదు. అందు ఉపపాండవప్రతాపస్మరణముచేత, అశ్వత్థామ క్రూరతాస్మరణముచేత, తన విజయము వ్యర్థమైనదను తలంపుచేతఁ గలిగిన దీప్తి యున్నది. ఇట్టి యోజోమిశ్రితమైన దీప్తకరుణమునకు ముని ప్రయోగించిన యుపజాతికంటె తిక్కన ప్రయోగించిన స్రగ్ధరయే పరమోచితముగనున్నది.

ఈ సందర్భమున సౌప్తికపర్వ దశమాధ్యాయమందలి 17, 18, 19 ఉపజాతులను ఒక స్రగ్ధరయందును, 20, 21 ఉపజాతులను ఒకస్రగ్ధరయందును నిబంధించి తిక్కన్న వ్యాసమహర్షి యుపదేశించిన ఛందశ్శిల్పమునకు మెఱుఁగులు దిద్దెను.

ఉక్తిప్రత్యుక్తియందు ఛందస్సామ్యము లోకమున ప్రసిద్ధమైయున్నది. వక్తృవాక్యవిన్యాసము ప్రతివక్తృవాక్యవిన్యాసమున ప్రతిఫలించి వాదిప్రతివాదుల ప్రతిస్పర్ధ సువ్యక్తమగుచుండును. సమానచిత్తభూమికములయిన వాక్యవృత్తులు సమానములగును.

వక్తల స్వభావమునందు, తత్కాలచిత్తవృత్తియందు, లక్ష్యమునందుఁ గలసామ్యము వారి ఉక్తిప్రత్యుక్తులయందు బింబప్రతిబింబభావము భజించుచుండును. సదృశములయిన వస్తుగుణక్రియల వర్ణనమున సదృశచ్ఛందమును వరించుట ఛందశ్శిల్పవిశేషము. ఛందస్సంవాదమువలె ఛందోనువాదము, ఛందోవివాదము, ఛందశ్శిల్పవిశేషములే. ఇట్టి ఛందశ్శిల్పనిర్వహణము సమాహితచిత్తుఁడైన కవిరచనయందే దర్శింపఁదగును.

యయాతిమహారాజుచరిత్రమున శర్మిష్ఠా దేవయానులు కన్యకాసహస్రసహితలై వనవిహారముచేయుదురు. జలక్రీడలాడుదురు. సురకరువలిచేఁ గలిసిపోయిన వస్త్రములను ఎవరికి దొరి

కినది వారు ధరింతురు, శర్మిష్ఠాదేవయానులును అన్యోన్యపరిధానములు వీడ్వడ లాగికొందురు. దేవయాని వస్త్రమును శర్మిష్ఠ కట్టికొనును. శర్మిష్ఠ వస్త్రమును దేవయాని కట్టికొననొల్లక—

కం. లోకోత్తరచరితుండగు
నా కావ్యతనూజ నీకు నారాధ్యను నేఁ
బ్రాకటభూసురకన్యక
నీ కట్టినమైల కట్టనేర్తునె? యనినన్

వ. శర్మిష్ఠ యిట్లనియె

కం. మా యయ్యకుఁ బాయక పని
సేయుచు దీవించి ప్రియము సేయుచునుండున్
మీ యయ్య; వెండి మహిమలు
నాయొద్దన పలుక నీకు నానయు లేదే ?

వ. నా కట్టినపుట్టంబు నీకుం గట్టంగాదు కాకేమి ?......

ఆది. III. 135-138.

దేవయాని రోసి పలికినపలుకు కందము. శర్మిష్ఠ గర్వించి పలికినపలుకు కందము. ఇరువురి చిత్తస్పందము తత్కాలమున నేకరూపమై ఛందమున సువ్యక్తమగుచున్నది. ప్రౌఢపరుష స్వభావయగు దేవయానివాక్యము క, చ, త, ర ఇత్యాదిపరుషాక్షరబహుళమును, ఉత్తరార్ధమున ద్విరుక్తటకారద్వయఘటితమునై యాభిజాత్యాభిమానవ్యంజకముగ నున్నది. ముగ్ధమృదుస్వభావ యగు శర్మిష్ఠవాక్యము సరళ, యణ్ బాహుళ్యమున సుకుమారమైయున్నది. దీర్ఘాక్షరబాహుళ్య మున విలంబితవృత్తియైన ఛందము మానజన్యమైన రోషముచే ప్లుతగతియైన చిత్తవృత్తినిఁ బట్టియిచ్చుచున్నది. కాఁబోవుసపత్నుల వివాదమునందలి ఛందములు సపత్నములై స్పర్ధించుట రమణీయమైన శిల్పము.

సౌగంధికాపహరణార్థ మరుగుచున్న భీమునకు హనుమంతుఁడు మార్గావరోధము కల్పించును. ఇరువురును వాయుపుత్రులు, మహాబలసంపన్నులు, లోకోత్తరోత్సాహవంతులు.

గంధమాదనమందలి కదళీవనమున భీముని గమనమును, హనుమంతుని శయనమును నన్నయ్య సీసములందు వర్ణించెను. భీముని శంఖధ్వానమును, హనుమ లాంగూలస్ఫోటనరవ మును కందములందు వర్ణించెను. ఆ యన్నదమ్ములు పరస్పర మెఱిఁగికొన్న యనంతరము హనుమ భీమునితో—

మత్తకోకిలము :

"మీకు నెగ్గొనరించియున్న యమిత్రులన్ హతబుద్ధులన్
జీకురాజు తనూజులన్ గురుసింహ నీకుఁ బ్రియంబుగా
నేకమాత్రనఁ బోరిలో వధియించి నాగపురంబు నా
నాకులాద్రిశిలావలీ గహనంబుసేయుదు నావుడున్"

అర. III. 352.

భీముఁడు హనుమతో ——

మ. "ఇంతయుం గపినాథ! నీకిది యేమిపెద్ద ? మహాహవా
భ్యంతరంబున నుద్ధతప్రతిపక్షవీరుల నేమ ని
ర్జింతు; మెవ్వరు మాకు మీదయఁజేసి మార్కొనునంత య
త్యంతవీరులు లేరు భూవిదితప్రతాపబలోన్నతుల్"

అర. III. 353

అని సమాధానముచెప్పును. అన్నదమ్ముల స్వభావసంపాదము ఛందస్సంవాదమున సుష్ఠుగా భాసించుచున్నది.

ఉద్యోగపర్వమున శ్రీకృష్ణుఁడు పెక్కుతెఱఁగుల సంధివచనములు పలికి దుర్యోధనుఁ డెంతకును దనత్రోవకు రామికిఁ గినిసి యుద్ధనివారణకు చరమోపాయముగా దుర్యోధనదూషణ మును సూచించుచు నిట్లనును——

ఆ. వె. "అంతతోడ నెల్లయాపదలును దీఱు
వంశ మధికగౌరవంబు నొందుఁ;
గూడిమనుట గలుగుఁ గురుపాండవులకు ని
త్తెఱఁగుసూడ మీకు నుఱవుగాదె?"

వ. అనిన విని ధృతరాష్ట్రుం డదరిపడి విదురున కిట్లనియె

ఆ. వె. "బుద్ధిమంతురాలు పొందుగఁబలుకంగ
నేర్చు; వచ్చి కొడుకుఁదేర్చిపోవుఁ;
గాన వేగ నీవు గాంధారిఁ దోడితె
మ్మనుడు నరిగి యతఁడు నట్లచేసె"

ఉద్యో. III. 380-382

శ్రీకృష్ణుని వాక్యార్థము, వాక్యచ్ఛందము ధృతరాష్ట్రుని హృదయము నదురునట్లు చేసెను. అదరిన యాతని హృదయమునుండి వెడలిన వాక్యము శ్రీకృష్ణుని వాక్యమునకు ప్రతిధ్వనివలెనున్నది. వక్తృవాక్యచ్ఛందము శ్రోతృవాక్యచ్ఛందమును ఎట్లు ప్రభావితముచేయునో ఇచ్చటి ఛందఃప్రతిధ్వని చక్కఁగా నిరూపించుచున్నది.

కర్ణపర్వమున ధృష్టద్యుమ్నాశ్వత్థామలు యుద్ధరంగమునఁ దారసిల్లుదురు. పితృహంతయైన ధృష్టద్యుమ్నునితో క్రోధదీప్తుఁడైన యశ్వత్థామ వాక్యము —

కం. మా తండ్రియెడలఁ జేసిన
పాతకము గతంబుగాఁగ బాంచాలనికృ
ష్టా ! తునిమెద నిను నరుఁడిట
యేతేరకయున్నఁబాఱ కీవు నిలచినన్''

వ. అనిన విని ధృష్టద్యుమ్నుఁ డతని కిట్లనియె

కం. మీతండ్రి కుఱికి నఱికిన
హేతియ నీకొఱకు నునిచి తిపుడ నఱుకుదున్
నీ తులువపలుకులకు నీ
డై తోఁచినయుత్తరంబు నదియె దురాత్మా !"

కర్ణ. II. 327-329.

అశ్వత్థామపలుకులకు ధృష్టద్యుమ్నునకుఁ దోఁచిన యుత్తరము ఛందస్సంవాదముచే సుందరమైయున్నది. పరస్పరద్వేషావిష్టులగు మహావీరులు, ఉద్ధతులు రణరంగమునఁ దారసిల్లినప్పటికి ఉక్తిప్రత్యుక్తియందు అతిహ్రస్వమైన కందము పరమోచితమైన వృత్తము. వృత్తసంవాదము గర్జాప్రతిగర్జవలె వక్తృప్రతివక్తృ చిత్తవృత్తిసామ్యమును స్ఫుటీకరించుచున్నది. "మా తండ్రి" యన్నదానికి "మీ తండ్రి" యన్నసమాధానము బింబమునకు ప్రతిబింబమువలె నున్నది. ప్రాసాక్షరసామ్యము ఛందస్సంవాదమును ప్రతివస్తూపమాకల్పము చేయుచున్నది. అశ్వత్థామవాక్యమునకు ఉత్తరముగా ధృష్టద్యుమ్నునకు సద్యఃస్ఫురితమైన వాక్యమును సమానచ్ఛందమున నిబంధించి కవిబ్రహ్మ రమ్యమైన శిల్పము ప్రదర్శించెను.

కర్ణపర్వప్రథమాశ్వాసమున కర్ణుని ప్రథమదివసయుద్ధావసానమున కర్ణార్జునులు తారసిల్లిన సందర్భమున — (కర్ణుఁడు ధృష్టద్యుమ్నాదులను వివిధాస్త్రప్రయోగమునఁ జెదరఁగొట్టుచుండ నర్జునుఁడు వచ్చి కర్ణ విజృంభణము నరికట్టుట)

మ. "అవి వేగంబ మరల్చి భూరిపవనవ్యాపార నిర్మర్దితా
టవులం బోలఁగఁజేసి దంతిభటఘోటస్యందనశ్రేణులన్
దివిజవ్రాతము పిచ్చలింప రభసోద్రేకంబు రౌద్రంబుఁ బెం
ప విజృంభించె ధనుర్గుణధ్వని నభోభాగంబు భేదింపఁగన్.
కర్ణ. I. 207.

ఇట్టి కర్ణ విజృంభణము నర్జునుఁడు నిరోధించి కౌరవసేనలను పాఱద్రోలుట —

మ. "కని గాండీవధరుండు దర్పమెసగం గర్ణాస్త్రజాలంబు నీ
సునవారించి శిలీముఖార్చులు పరిస్ఫూర్జత్ప్రభం బర్వఁ బే
ర్చినఁ గార్చిచ్చడరన్ మృగంబులు భయోద్రేకంబునం బాఱుచా
డ్పున నీ మూకలు నల్గడంబఱచె నుద్భూతభ్రమార్తంబులై"
కర్ణ. I. 208.

తుల్యబలపరాక్రమసంపన్నులగు కర్ణార్జునుల విజృంభణములను సమానవృత్తమున వర్ణించి, కవిబ్రహ్మ వర్ణ్యవస్తువునందలి సమానతను చక్కఁగా వ్యంజించెను. కర్ణుఁడు పాండవవీరులనెడు మహాటవులను భూరిపవనమువలె మర్దించెనఁట. అర్జునుఁడు శిలీముఖార్చులడరింపఁగా కార్చిచ్చునకు భయపడిన మృగములవలె కౌరవసేనలు పాఱిపోయెనఁట. కర్ణ విజృభణమున నిరూపింపఁబడిన వాయువిజృంభణమును మొదటి మత్తేభమునందలి మహాప్రాణాక్షరబాహుళ్యమువల్లను, అర్జునపరాక్రమమున రూపింపఁబడిన యగ్నివిజృంభణమును ఆగ్నేయములయిన రేఫ మూర్ధన్యాక్షరబాహుళ్యమువల్లను కవిబ్రహ్మ సమర్థించెను. రెండును మత్తేభములే కాని రెండును రెండుమత్తేభములు – ఒకదానితోనొకటి 'ఈసున' తలపడుచున్నవి. ఒకటివాయువువలె బలిష్ఠమైనది. ఒకటి యగ్నివలె దాహకమైనది. సమానవృత్తమున గుణభేదకల్పనచే అర్జునుని యాధిక్యము నిరూపించి కవిబ్రహ్మ భావిని ధ్వనింపఁజేసెను.

సౌప్తికపర్వమున నశ్వత్థామ ధృష్టద్యుమ్నుని సంహరించుసందర్భమున అశ్వత్థామ యల్లెత్రాట ధృష్టద్యుమ్నుని కంఠమునకు ఉరివెట్టినప్పు డాతఁడు పెనగులాడి పెనుగులాడి యెట్టకేలకు గొంతుపెగల్చుకొని పలికినపలుకులు, ఆ పలుకులకు అశ్వత్థామ సమాధానమును కందములందు నిబంధింపఁబడినవి.

కం. గురుపుత్ర! శస్త్రనిహతిం
బొరిపుచ్చుము; తడయనేల! పుణ్యగతికిఁ జె
చ్చెరఁ బోవునట్లు సేయుట
పరికింపఁగ మేలకాదె పగతునికైనన్"

వ. అనిన విని యశ్వత్థామ యతని మొగంబు చూచి

కం. వినుము; గురుద్రోహికిఁగ
లుగనె యుత్తమగతిః నితాంతకుత్సితభంగిన్
దునిమితివి నీవు గురు; నే
నును దద్విధకరణమున నినుం దెగఁజూతున్''

సౌ. I. 154_156

కంఠమునకురివైచి శత్రువు తొమ్ములపైనెక్కి పీడించుచుండ పెనగులాడియాడి యెట్టకేలకు పలుకు వెలువరింపఁగలిగిన ధృష్టద్యుమ్నుని నోట తత్కాలమున కందముకంటె దీర్ఘమైన వృత్తము వెలువడఁజాలదు. నిద్రాముద్రితులైయుండ శిబిరమునం దెల్లరను వధింపసమకట్టి వచ్చి తొలిబలిగా ధృష్టద్యుమ్నుని వధింపఁబూనిన యశ్వత్థామ ఆసన్నమృతియై గిలగిలఁదన్నుగొనుచున్న శత్రువునకు కందమునకంటె దీర్ఘమైనవృత్తమున సమాధానమీయఁడు. శీఘ్రమరణార్థి ధృష్టద్యుమ్నుఁడు. శ్రీఘ్రమారణార్థి యశ్వత్థామ. ఆశయసామ్యమున ఛందస్సామ్యము.

కర్ణపర్వద్వితీయాశ్వాసమున శల్యుఁడుచెప్పిన హంసకాకీయోపాఖ్యానము విని కోపించి కర్ణుఁడు శల్యునితో నిట్లనును—

కం. జను లెట్టిది మిత్రవిధం
బని చెప్పుదు రట్టిచంద మఖిలము దుర్యో
ధనునందుఁ గలదు నాయెడ;
మన మూఱడియుండు నా కమందప్రీతిన్.

కం. జను లెట్టిది శత్రువిధం
బని చెప్పుదు రట్టి చంద మారయఁగా దు
ర్జనుఁడవగు నీకు నాయెడ
వినుము కలిగె; దీన మనసు విచ్చెం గుటిలా!

కర్ణ. II. 103_104

దుర్యోధనునకుఁ దనయందుఁగల మిత్రభావమెంతటిదో, శల్యునకుఁ దనయందుఁగల శత్రుభావమంతటిదని చెప్పుచు వక్తవ్యమైన శత్రుత్వమిత్రత్వముల తౌల్యమును తుల్యచ్ఛందములందు కర్ణుఁడు ప్రతిపాదించెను. "జనులెట్టిది..." ఇత్యాదిగా వాక్యద్వయము ఎత్తుగడ తుల్యరూపమైయట్టివాక్యములు తుల్యచ్ఛందస్కములగుటయందలి యౌచిత్యమును సమర్థించుచున్నది.

ఆదిపర్వద్వితీయాశ్వాసమున దేవదానవుల యుద్ధమును వర్ణించుచు నన్నయ నరనారాయణుల పరాక్రమములను రెండుమత్తేభములందు వర్ణించెను.

మ. నరచాపప్రవిముక్త దారుణబృహన్నారాచధారల్ భయం
కరదైతేయనికాయ కాయములపైఁ గప్పెన్ దిశల్ నిండ బం
ధురధాత్రీధరతుంగశృంగతట సందోహంబుపైఁ గప్పు దు
ర్ధరధారాధరముక్త సంతతపయోధారావలిం బోలుచున్.

ఆది. II. 23.

మ. పతదుర్వీధరధాతునిర్ఝరజలాభంబై మహాదేహని
ర్గత సాంద్రారుణపూర మొక్కమొగి నొల్కం ద్రెస్సి నారాయణో
న్నతదోర్దండవిముక్త చక్రనిహతిన్ నాకద్విషన్మస్తక
ప్రతతుల్ ఘోరరణంబునం బడియె భూభాగంబు గంపింపఁగన్.

ఆది. II 24

ఈ మత్తేభములజంట నరనారాయణులవలె వేఱుపఱుపనానంత సాదృశ్యమును భజించుచున్నవి. గాండీవ చక్రములవలనమాత్రమే నరనారాయణుల ప్రత్యేకత గుర్తింపవీలయినట్లుగా నీ మత్తేభముల భేదము ప్రాసభేదమువలనమాత్రమే గుర్తింపవీలగుచున్నదా యనిపించుచున్నది.

శకుంతల సౌందర్యమును దిలకించి 'సంచలితహృదయుం'డయిన దుష్యంతుఁడు తాను కణ్వుని కూతురనని యామె చెప్పినంతనే ధర్మభంగశంకచేఁ దనలో నిట్లని తర్కించుకొనెను.

చం॥ ఇది మునికన్యయేని మఱి యేలొకొ యీ లలితాంగియందు నా
హృదయము తద్దయుం దవిలె; నిప్పలు కింకను నమ్మనేరన
య్యెద; విజితేంద్రియుండనఁగ నిమ్మునిఁ బాయక విందునంచు దా
నిది కలరూపెఱుంగ నవనీపతి యుత్సుకుఁడయ్యె నాత్మలో.

ఆది. IV. 30.

శకుంతలాజన్మవృత్తాంతము విని యామె క్షత్రియకన్యయని తెలిసికొన్నంతనే ఆయన హృదయమున మరల రతిభావము పొంగివచ్చెను. అప్పుడాయన తనలో ననుకొన్నమాటలు —

చం॥ ఇది మునినాథకన్యయని యెంతయు నిస్పృహవృత్తి నున్న నా
హృదయము రాజపుత్రినని యిక్కమలాక్షి నిజాభిజాత్యసం
పద నెఱిఁగించినన్ మదనబాణపరంపర కిప్పు డుండనా
స్పదమయి సంచలించె నళిపాతవికంపిత పంకజాకృతిన్.

ఆది. IV. 51.

రెండు స్వగతములును సదృశతమములయిన చంపకములందే నిబంధింపఁబడినవి. మొదటిదానియందుఁ దునిగిపోవచ్చిన దుష్యంతుని రతి రెండవదానియం దతుకుకొని కొనలు

సాఁగినది. శకుంతలాదుష్యంతుల ప్రణయకలాపమున కడ్డుగాఁ జొచ్చుకొనివచ్చిన మేనకా విశ్వామిత్రుల శృంగారవృత్తాంతమున కుభయకూలములందును నిల్చి యీరెండుపద్యములు అవాంతరకథాప్రవాహ సేతునిబంధనప్రయోజకము లగు రెండుమహాస్తంభములవలె నున్నవి. ఇది ఛందస్సాధనముచే సాధింపఁబడిన కథాశిల్పము. (చూ. నన్నయగారి ప్రసన్నకథాకలితార్థ యుక్తి. పుట. 162).

తాను కాలూదినంత బల్లనవిఱిగిన రౌహిణపాదపశాఖ నవలంబించి వాలఖిల్యమహామునులు తపమాచరించుచుండు టెఱింగి దానిని నోటఁగఱచుకొనిపోయి గరుడుఁడు "ముఖనిక్షిప్తశాఖా స్ఖలితవచనుండగుచుఁ దండ్రి కిట్లనియె" —

కం॥ ధరణీసురవిరహితమగు
నరణ్యదేశంబు నాకు నానతియిం డి
త్తరుశాఖ విడువవలయును
కరము నిరోధమిది యనినఁ గశ్యపుఁ డనియెన్.

కం॥ హిమశైలకందరాఖా
గముకడ నిష్పురుషనగముగల దచ్చో నీ
ద్రుమశాఖ విడువు మది దా
నమానుష మగమ్య మీశ్వరాదులకైనన్.

ఆది II. 77-78.

ముఖనిక్షిప్తశాఖా స్ఖలితవచనుండగు గరుడని వాక్యమును, గురుభారక్రాంతుఁడైయున్న కుమారునకుఁ గశ్యపుఁ డొసఁగిన ప్రతివచనమును లఘుచ్ఛందమైన కందమున నిబంధించి నన్నయ యౌచిత్యమును వెలయించెను.

క్రీడిపరాక్రమమును గొనియాడుచున్న ద్రోణుని గర్ణుఁడు తిరస్కరించి పలుకఁగాఁ గోపించిన కృపాశ్వత్థామలకుఁ గోపోపశమనము గావించుచు భీష్ముఁడిట్లనెను —

కం॥ క్షమియింపవలయు నొకఁ డెఱుఁ
గమి నేమేనన్న నంతఁ గటకటఁబడి భూ
రమణుని కార్యస్థితి చి
త్తములం దెడసేయునట్టితరమే మీరల్ ?

వ॥ అనిన విని వార లిట్లనిరి

కం॥ క్షమియింప నెవ్వరము భూ
రమణుని కార్యమున కెవ్వరము ద్రోణుల చి
త్తము శాంతివొందఁజేయుట
మముఁ దెలచుట యిట్టులేల మాకొలఁదులకున్ ?

విరా. IV. 225-227.

వచ్చినకోపము నణంచుకొని పలుకునప్పుడు ఎదుటివాని వాక్యమును ద్రిప్పికొట్టుట లోక స్వభావము. కావ్యమునం దట్టివాక్యములను నిబంధించుట లోకజ్ఞతానిరూపకమై శిల్పమగుచున్నది.

కవిత్రయరచనయం దిట్టి ఛందస్సంవాదశిల్పము పెక్కుసందర్భములఁ గానఁబడును. ఛందస్సంవాదమువలె ఛందఃపునర్వాదముగూడ నొకవిధమగుశిల్పమే. ఆంధ్రభారతమునఁ గొన్ని పద్యములు యథాతథముగఁ బునరుక్తములయినవి. అట్టిపునరుక్తులు పెక్కు శిల్పవిషయము లగుట గుర్తింపవచ్చును.

తన కపకారముగావించిన తక్షకునిపైఁ గోపించి యుదంకుఁడు సర్పకులనాశము గావింపఁ గృతనిశ్చయుండై జనమేజయుపాలికిం జని యిట్లనెను —

ఉ॥ కాదన కిట్టిపాటియపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁజేసి చేసె నృపపుంగవ నీవు ననేకభూసురా
పాదితసర్పయాగమున భస్మముచేయుము తక్షకాదికా
కోదరసంహతిన్ హుతవహోగ్రసమగ్ర శిఖాచయంబులన్.

ఆది. I. 125.

ఉదంకుఁ డిట్లు జనమేజయునకు సర్పయాగబుద్ధి పుట్టింపఁగా నాతనిమంత్రులు తక్షకునిచేఁ బరీక్షిత్తు మృతినొందిన వృత్తాంతమును వర్ణించిచెప్పి జనమేజయునకుఁ గలిగిన సర్పయాగ బుద్ధిని దృఢతరము, తత్క్షణకార్యకారి గావించుటకై యుదంకుని వాక్యమును యథాతథముగఁ బలికిరి. (ఆది. II. 204)

తనకు ద్రోణుఁడు కావించిన పరాభవమునకుఁ బ్రతీకారముగావింపఁగల పుత్రుఁడు తన కుద్భవింపవలెనన్న వాంఛతో ద్రుపదుఁడు పుత్రార్థియై యుపయాజుఁడను మునీశ్వరునిఁ జేరి యిట్లు ప్రార్థించెను —

కం॥ మునినాథ నాకు సత్సుత
జననంబగునట్టి క్రతువు సద్విధిఁ గావిం
చినఁ గృతకృత్యుఁడ నగుదుం
గొనుమిచ్చెద నీకు లక్ష గోధేనువులన్.

ఆది. VII. 9.

ఉపయాజుఁడు దాని కంగీకరింపక యాజునిఁ బోయివేడుమని చెప్పఁగా ద్రుపదుఁడు యాజునికడకేఁగి యుపయాజునితోఁ బలికిన ప్రార్థనావాక్యమును యథాక్షరముగాఁ బునరుచ్చరించును. (VII - 13)

ఈ పునరుక్తి ద్రుపదుని పుత్రవాంఛయొక్క గాఢత్వమును, ఆయన చిత్తముయొక్క తదేకలగ్నత్వమును జక్కఁగాఁ జాటుచున్నది.

కీచకుఁడు దన్ను పీడించుటకుఁ గోపించి, వాఁడు నీచుగావున జంకించినంగాని మెత్తబడి పోవఁడని తలంచి ద్రౌపది —

శా॥ దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫురత్
గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా !
విరాట. II. 55.

అని యదరుపుట్టునట్లు మాట్లాడును. పిమ్మటఁ దన భంగపాటును భీమునితోఁ జెప్పికొనుచుఁ గడచినవృత్తాంతమునుఁ బూసగ్రుచ్చినట్లు వర్ణించి తానాతనిని బెదరించుచుఁ బలికినవాక్యమును యథాక్షరముగాఁ బునరుక్తముచేయును. (విరాట. II. 172). ఒకవ్యక్తి గతవృత్తాంతమును స్మరించి యప్పటి యుద్రేకమును తిరిగి పొందినప్పుడు వెనుకటి వాక్యములు యథాక్షరము పునరుక్తములగుట లోకస్వభావము. మానవమనస్తత్వము తెలిసి చేసిన యిట్టి పద్యపునర్వాదము శిల్పము.

ఉత్తరగోగ్రహణసందర్భమున భీష్ముఁడు పాండవుల యజ్ఞాతవాససమాప్తి నిష్కర్షించి దుర్యోధనాదులతో నిట్లనును —

ఉ॥ వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తుమనంగరాదు రా
లచ్చికినై పెనంగినబలంబులు రెండును గెల్వనేర్చునే ?
హెచ్చుగుఁ గుందగుం దొడరు టెల్లవిధంబుల కోర్చు టట్లుగా
కిచ్చఁదలంచి యొక్కమెయి నిత్తఱిఁ బొందగుచేతయుం దగున్.

వ॥ అనిన విని కురుపతి దరహసితవదనుండగుచు నిట్లనియె.

ఆ॥ మనకుఁ బాండురాజ తనయవర్గమునకు
నెట్లు పొందుగలుగు ? నేను రాజ్య

భాగ మీను; సమరభంగిక విక్రమ
నిరతిఁబూను టిదియ నిశ్చయంబు.

విరాట. IV. 234_236.

ఈ సందర్భమున భీష్ముఁడు పలికిన సంధిసూచకవాక్యము, దుర్యోధనుఁడు పలికిన యవినయవాక్యము కురుసేనలయం దెల్లరు వినిరి. పలుమారులు తమలోఁదాము వానినిఁ జెప్పికొనిరి. అవి హస్తినాపురమం దెల్లరకుఁ దెలియవచ్చెను. ఆనోటఁనానోటఁ బడి వచ్చి యావాక్యములు శ్రీకృష్ణుని చెవులఁగూడ ప్రవేశించెను. రాయబారము వోవుటకుముందు పాండవులతో సంప్రదించుసందర్భమున శ్రీకృష్ణుఁ డావాక్యములను యథాక్షరముగాఁ బునరుక్తములుగావించెను. ఉత్తరగోగ్రహణసమర మెట్లనివార్యమయ్యెనో కురుక్షేత్రసమరము నట్లే యనివార్యమని యీ పునరుక్తి సూచించును. (ఉద్యోగ. III. 85, 87.)

సంజయుఁడు ధృతరాష్ట్రునకు భీష్మపాటు సెప్పుచు విలాపముచేసిన సీసపద్యమునందలి గీతి —

ఆ॥ తీవ్రబాణజాలదీప్తులు పరగించి
పాండుతనయసైన్యబహుళతమము
లీలఁ బదిదినంబు లోలి వినోదించి
యధిప భీష్మభానుఁ డస్తమించె.

భీష్మ. I. 47.

ఈ యాటవెలఁది స్త్రీపర్వమున గాంధారీవిలాపవాక్యములఁ బునరుక్తమైనది. 'అధిప' యన్న పదము 'అకట' యని మార్పఁబడినది. భీష్మభానుఁడస్తమించెను గాని భీష్ముఁడు మరణింప లేదు. ఈ రూపకమందలి యౌచిత్యమే వాక్యపునరుక్తిని సమర్థించుచున్నది.

శల్యుఁడు కర్ణునకు సారథ్యముచేయుచు నతని యుత్సాహము భంజించుటకై యర్జునస్తుతి పూర్వకముగా నిట్లనును —

ఉ॥ అల్లదె యర్జునధ్వజవిహారము గానఁగనయ్యెడుం గపీం
ద్రోల్లసనంబునన్ మెఱసి యుద్భటులైన త్రిగర్తు లేపు శో
భిల్లఁగ వారె యన్నరుని బెట్టుగఁదాఁకి రతండు వారినంపపె
న్వెల్లి నిగిడ్చిముంచె నదె నింగి గుణధ్వనిమ్రోంగ వారలన్.

కర్ణ. II. 120.

ఈ పద్యమునే కొంత సేపాగి శల్యుఁడు పునరుక్తముచేయును. కర్ణునిచిత్తమును గలఁత వెట్టి యుద్ధమునం దతని కేకాగ్రత సిద్ధింపకుండఁజేయుట శల్యుని యాశయము.

(కర్ణ. II. 152.)

రాయబార మేఁగుచున్న శ్రీకృష్ణునితో భీమసేనుఁడు ధర్మజమతము ననుసరించువాఁడై యిట్లనును —

తే॥ అన్నదమ్ములమైయుండి యకట మనల
నొరులు దలయెత్తిచూడ నొండొరులతోడఁ
బెనఁగనేటికి ? నీనేల పెద్దవారి
బుద్ధి విని పంచికుడుచుట పోలదొక్కో ?

ఉద్యోగ. III. 50.

ఇది భీముఁడు దుర్యోధనాదులకు శ్రీకృష్ణునిముఖమునఁ బంపిన సందేశమందలివాక్యము. స్త్రీపర్వమున గాంధారి భీముఁడు దుర్యోధనుని తొడలువిఱుగఁగొట్టి పడవైచుటను తప్పుగా నెన్ని కోపించి పలికినసందర్భమున భీముఁడు భయకంపితుఁడై యామె కోపమునుండి తప్పించుకొనుటకై తన శాంతిప్రియత్వమును, దుర్యోధనుని మూర్ఖత్వమును సూచించువాఁడై యీ వాక్యమును యథాక్షరము పునరుక్తముచేయును. (స్త్రీ. I. 159)

అభిమన్యుమరణమున శోకవ్యాకులుఁడై యున్న ధర్మజునకుఁ జిత్తశాంతిగలుగుటకై వేదవ్యాసుఁడు నారదుఁడు సృంజయునకుఁ జెప్పినవని షోడశమహారాజుల వృత్తాంతములు చెప్పెను. ద్రోణపర్వ ద్వితీయాశ్వాసమునం దావృత్తాంతములు పదునాఱు సీసపద్యములందు వర్ణింపఁబడినవి. (197–212). "బహుబంధుమరణ శోకప్రహతవివేకుఁడై" రాజ్యము సేయనొల్లని ధర్మజునకు చిత్తశాంతి చేకూర్చుటకై శ్రీకృష్ణుఁడు – "నారదుం జూపి యిమ్మహాత్ముం డట్లు...... తెలియనుపన్యసించిన వాక్యంబు లభిమన్యుమరణశోకవ్యాకులుండవగు నీకుం దాపోపశమంబుగాఁ గృపాతిశయంబునం బరిపాటి వీరలు సెప్పిరని పారాశర్యమునీశ్వరు నిర్దేశించి వీరివచనంబుల యేనునుం జెప్పెద నాకర్ణింపుమని" ద్రోణపర్వమందలి పదునాఱుసీసపద్యములను తిరిగిచెప్పెను. ఈ పునరుక్తికి ఇతిహాసపరిపాటియే కారణము. నారదుఁడు చెప్పినవాక్యములను యథాక్షరముగ వ్యాసుఁడు చెప్పెను. వానినే యథాక్షరముగ శ్రీకృష్ణుఁడు వారిరువురి సమక్షమందే చెప్పెను. ఇది యితిహాసపరిపాటి.

విరాటుఁడు తనకుమార్తెయైన ఉత్తరను రావించి నాట్యము నేర్పుమని యామెను బృహన్నలకప్పగించును. ఆసందర్భమున తిక్కనకావించిన యుత్తరావర్ణనము :

సీ॥ అల్లదనంబున యనువు మైకొనఁజూచు
నడపు కాంతికి వింతతొడవుగాఁగ
వెడవెడ నూఁగారు వింతయై యేర్పడు
దేరని వళులలో నారు నిగుడ

నిట్టలఁద్రోచుచు నెలవులకలమేర
  లెల్లను బిగియొక్క యేర్పడంగఁ
దెలుపునుగప్పును వెలయంగ మెఱుఁగెక్కు
  తారకంబులఁ గల్కి తనముదొడరఁ

ఆ॥ జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
జవ్వనంబుచెన్ను నివ్వటిల్లు
చునికిఁదెలుపుచుండ నుత్తరచనుదెంచె
నలరువిలుతు పువ్వుటమ్ముపోలె.

విరాట. I. 245.

తన యింట వసింపవచ్చిన పర్వతనారదులకుఁ బరిచర్యగావించుటకై సృంజయుఁడు తన కుమార్తెను రావించును. ఆ సందర్భమున సుకుమారి వర్ణనమునఁ దిక్కన యుత్తరా వర్ణనాత్మకమైన పద్యమును ఆటవెలఁది యుత్తరార్ధమున "ఉనికిఁదెలుప సృంజయునిపుత్రి మెలఁగువిధంబు నారదునకుఁదగులొనర్చె" అను ప్రకరణావసరమైన యల్పతి మార్పుతోఁ బునరుక్తముగావించెను. (శాంతి. I. 248.) ఆంధ్రమహాభారతమునఁ బునరుక్తములయిన పద్యములింకనుగలవు. ఛందఃపునర్వాదమందలి యౌచిత్యమునిట్లే యనుశీలించి గ్రహింతుగాక.

## సూచికలు :

1. కావ్యాలంకారచూడామణి : 8 — 36
2. సులక్షణసారము : 3 — 41
3. Ibid : 3 — 39
4. ఛందోమంజరి : ii — 15 — 3
5. సువృత్తతిలకము : 3 — 22
6. నాట్యశాస్త్రము (అభినవభారతి) . XIV — పుట 246
7. సువృత్తతిలకము : 2 — 41.

# ఉపసంహృతి

ఛందములు గాయత్రములు, వక్త్రములు, శ్లోకములునన్న మహర్షుల దర్శనము మహోజ్జ్వలమైనది.

వక్తృహృదయార్తిజన్యమై శ్రోతృహృదయార్తిజనకమైన ఛందము ఋతంభరమైన యక్షరబంధమనియు,నది యేకప్రాణభావాపన్నమైన హృదయస్పందపరంపరా నిరూపకమనియు భావించిన ప్రాచీనదార్శనికుల యభిప్రాయము పరమార్థము.

ఛందములు వాక్యార్థమునాచ్ఛాదించి గుప్తము, దీప్తము, నమృతము గావించు మహత్తర సాధనములన్న నైరుక్తికుల యుక్తులు సార్థకములు.

ఛందోఽలంకార రస జీవ శరీర మనస్తత్త్వశాస్త్రములయందు గుప్తములయియున్న రహస్యముల నన్వేషించి యథాశక్తి సాధించి, యవి ప్రసాదించిన వెలుంగులో ఋషికల్పులు, మహాశిల్పులునైన కవిత్రయము ఆంధ్రమహాభారతమునఁ గావించిన యనంతప్రకారమైన ఛందశ్శిల్పమును దర్శించి సాధ్యమైనంతవఱకుఁ బ్రదర్శింపఁ బ్రయత్నించితిని. ఈ ప్రయత్నముయొక్క సామంజస్యమునకు, సాఫల్యమునకు రసజ్ఞులైన విద్వాంసులు ప్రమాణము.

ఇ తి శి వ మ్.

# ప్రసక్త గ్రంథసూచిక


కవిత్రయభారతము : వావిళ్ళముద్రణము 1962

కవిత్రయభారతము : ఆనందముద్రణము 1955

నన్నయ్య ప్రసన్నకథాకలితార్థయుక్తి : కళాప్రపూర్ణ, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

నన్నయ భారతము : డాక్టర్ దివాకర్ల వేంకటావధాని.

ఆంధ్రశబ్దచింతామణి : నన్నయభట్టారకుఁడు

కవిజనాశ్రయము : మల్లియ రేచన

కావ్యాలంకారచూడామణి : విన్నకోట పెద్దన

ఛందోదర్పణము : అనంతామాత్యుఁడు

లక్షణసారసంగ్రహము : చిత్రకవి పెద్దన

అప్పకవీయము : అప్పకవి

ఆనందరంగరాట్ఛందము : కస్తూరి రంగకవి

సులక్షణసారము : లింగమగుంట తిమ్మన

అహోబలపండితీయము : అహోబలుఁడు

తెలుఁగులో ఛందోరీతులు : డాక్టర్ గిడుగు వేంకటసీతాపతి

నిర్వచనోత్తర రామాయణము : తిక్కన సోమయాజి

బసవపురాణము : పాల్కురికి సోమనాథుఁడు

కావ్యాలంకారసంగ్రహము : మూర్తికవి

వ్యాఖ్యాత : శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

దర్శనములు : కీ. శే. డాక్టర్ ఆచంట లక్ష్మీపతి.

నేటికాలపు కవిత్వం : కీ. శే. ఉమాకాంత విద్యాశేఖరులు

తెలుఁగు ఛందోవికాసము – పీఠిక : కళాప్రపూర్ణ, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

గానభాస్కరము : శ్రీ కె. శ్రీనివాస అయ్యంగార్

ఆంధ్రభాషావికాసము : ఆచార్య గంటి జోగిసోమయాజి.

వ్యాకరణసంహితాసర్వస్వము : బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారు

బాలవ్యాకరణము : చిన్నయసూరి

# సంస్కృతము

ఋగ్వేదము
యజుర్వేదము : (దయానందసరస్వతి భాష్యము)
శ్రీమన్మహాభారతము : వ్యాసమహర్షి
శ్రీమద్రామాయణబాలకాండము : వాల్మీకిమహర్షి
కుమారసంభవము : కాళిదాసమహాకవి
రఘువంశము : కాళిదాసమహాకవి
ఉత్తరరామచరిత్రము : భవభూతిమహాకవి
మాళవికాగ్నిమిత్రము : కాళిదాసమహాకవి
నిరుక్తము : యాస్కముని
సిద్ధాంతకౌముది : భట్టోజీదీక్షితుఁడు
మహాభాష్యము (నవాహ్నికము) : పతంజలిమహర్షి
పరమలఘుమంజూష : నాగేశభట్టు
నాట్యశాస్త్రము : భరతముని
అభినవభారతి : అభినవగుప్తపాదులు
భరతరసప్రకరణము : సీడామంగళం తిరువేంకటాచార్య
దశరూపకము : ధనంజయుఁడు
ఋక్ప్రాతిశాఖ్యము : శౌనకమహర్షి
యజుర్వేద సర్వానుక్రమణిక : కాత్యాయనముని
పాణినీయ శిక్ష
యాజ్ఞవల్క్య శిక్ష
ఛందశ్శాస్త్రము : పింగళముని
జనాశ్రయి : మాధవవర్మ
ఛందోఽనుశాసనము : హేమచంద్రుఁడు
ఛందోఽనుశాసనము : జయకీర్తి
జయదేవచ్ఛందము : జయదేవుఁడు
వృత్తరత్నాకరము . కేదారభట్టు (పంచికా)
,, : ,, (మణిమయీ)
,, : ,, (చరణదాసశాస్త్రి హిందీవ్యాఖ్య)

ఛందోమంజరి : గంగాదాసు
వాగ్వల్లభము : దుఃఖభంజనకవి
సువృత్తతిలకము : క్షేమేంద్రమహాకవి
జయదామన్ : ఆచార్య వెలాంకర సంకలనము
ధ్వన్యాలోకము : (సలోచనము) : ఆనందవర్ధనాచార్యులు
కావ్యాలంకారము : భామహుఁడు
కావ్యాదర్శము : దండిమహాకవి
కావ్యాలంకార సూత్రవృత్తి : వామనాచార్యుఁడు
వాగ్భటాలంకారము : వాగ్భటుఁడు
శృంగారప్రకాశము : భోజమహారాజు (డాక్టర్ రాఘవన్ సంపాదితము)
సరస్వతీకంఠాభరణము : భోజమహారాజు
కావ్యమీమాంస : రాజశేఖర మహాకవి
కావ్యప్రకాశము : మమ్మటుఁడు (వామనాచార్యఝల్కీకర్ వ్యాఖ్యానము)
భావప్రకాశనము : శారదాతనయుఁడు
ప్రతాపరుద్రయశోభూషణము : విద్యానాథకవి
సాహిత్యదర్పణము : విశ్వనాథ కవిరాజు
రసగంగాధరము : పండితరాయలు
సాహిత్యసారము : అచ్యుతరాయలు
ఐతరేయోపనిషత్తు
తైత్తిరీయోపనిషత్తు
ఛాందోగ్యోపనిషత్తు
బృహదారణ్యకోపనిషత్తు
ఐతరేయ బ్రాహ్మణము
శతపథ బ్రాహ్మణము
భగవద్గీత
వాచస్పత్యము
వేదాంత పరిభాషా
మీమాంసా సూత్రములు
గౌతమ న్యాయసూత్రములు

పాతంజల యోగసూత్రములు
శార్ఙ్గధర సంహిత
సుశ్రుత శారీరము
జ్ఞానవాసిష్ఠము
బసవరాజీయము
మౌనతంత్రము - శ్రీ రాణీప్రసాదరాయశాస్త్రిలవారు
వాయుపురాణము
మత్స్యపురాణము
సాంఖ్యకారికలు
వైదికచ్ఛందోమీమాంస : యుధిష్ఠిర్ మీమాంసక్
ప్రాకృత పైంగలమ్ :
అమరకోశము
Sanskrit – English Dictionary - Monier Williams
లలితాసహస్రనామావళి

## ENGLISH

A study of Metre : T. S. Omond
Principles of English Metre : Egerton Smith
Elizabethan Lyric : Catherine Ing
Shakespeare : Henry Fluchre
Writers on Writing : Walter Allen
Coleridge : Biographia Literaria
Imagination : Stephen Spendor
The Psychology of Beauty : E. D. Puffer
Introduction to Literary Criticism : W. H. Hudson
The Psychology of Emotions : Th. Ribot
A Biological Introduction to Psychology : R. J. S. Mc Dowall
An Introduction to Psychology : Wilhelm Wundt
A Manual of Psychology : G F. Stout
Introduction to Psychology : R. S. Woodworth
Expression of Emotions in Men and Animals : Charles. Darwin

Indian Aesthetics: Dr. K. C. Pandey
Western Aesthetics: ,, ,,
Phonetics in Ancient India: W. S. Allen
Phonetics: I. C. Ward
Psyche Monograph: M. M Macdermott
The Study of Speech Curves: E. W. Seripture

# అనుషక్త గ్రంథ సూచిక

ఆంధ్రభారతకవితావిమర్శ: శ్రీ కోరాడరామకృష్ణయ్య
తిక్కన రచన: శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు
కవిత్రయ కవితావిమర్శ: శ్రీ జి. సుబ్బరామయ్య
తెలుఁగు – దేశి: శ్రీ కోరాడ రామకృష్ణయ్య
తిక్కన: డాక్టర్ కేతవరపు రామకోటిశాస్త్రి
తిక్కన కవితాసామ్రాజ్యము: శ్రీ కాళూరి వ్యాసమూర్తి
తిక్కన: చిలుకూరి వీరభద్రరావు
తెలుఁగు ఛందోవికాసము: శ్రీ సంపత్కుమార్
తెలుఁగుభాషలో ఛందోరీతులు: శ్రీ రావూరి దొరస్వామిశర్మ
ఆంధ్రధ్వన్యాలోకము: శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు
నాట్యవేదము: శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ
నాట్యశాస్త్రము: డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావు
భారతీయ తత్త్వశాస్త్రము: శ్రీ బులుసు వేంకటేశ్వర్లు
తెలుఁగు జానపదసాహిత్యము: డాక్టర్ బి. రామరాజు
సంస్కృత వాఙ్మయచరిత్ర: కీ. శే. మల్లాది సూర్యనారాయణశాస్త్రి
ఛందప్రభాకర్ (హిందీ) – భానుసింహ
వీరరసము: శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం
మీమాంసా పరిభాష: శ్రీ కృష్ణయజ్వాన్
వృత్తిప్రభాకరము: శ్రీ వాడవల్లి పట్టాభిరామశర్మ
సర్వతంత్రసిద్ధాంత పదార్థలక్షణసంగ్రహము: గౌరీశంకర భిక్షు

ప్రౌఢవ్యాకరణము : బ. సీతారామాచార్యులు.
విశ్వసాహితి : తెలుఁగుభాషాసమితి ప్రచురణము.
కువలయానందము : అప్పయదీక్షితులు.
చిత్రమీమాంస : అప్పయదీక్షితులు.
కవికంఠాభరణము : క్షేమేంద్రమహాకవి.
ఔచిత్యవిచారచర్చ : ,,

Prosody : Miss Hamer
English Prosody : Saintsbury
Milton's Prosody : Robert Bridges
History of English Rhythm - E. Gwest
Chapters on English Rhythm — J. B. Mayor
Psychological Studies in Rasa - Dr. Rakshesh Gupta
An Introduction to Psychology - Calkins
Dictionary of Psychology — Abercrombie
Dictionary of Biology - M. Abercrombie
Dictionary of Music - Arther Jocabs
Some Concepts of Alankara : Dr. V. V. Raghavan
Theories of Rasa and Dhwani : Dr. A. Sankaran
Poetics : Aristotle (Bywater)
Poetic Process : Whalley
Imagery of Keats and Shelly - Fogle
Metaphor in Poetry : J. G. Jennings
Hand Book of Physiology : Halliburton and McDowall
Studies in Kalapurno dayam : Dr G. V. Krishna Rao

# ఛందో ఽనుక్రమణి

| | | నన్నయ | తిక్కన | ఎఱ్ఱన | మొత్తము |
|---|---|---|---|---|---|
| 1. | గద్యము | 1505 | 4517 | 496 | 6518 |
| 2. | కందము | 1228 | 5394 | 413 | 7034 |
| 3. | సీసము | 251 | 1152 | 102 | 1505 |
| 4 | ఆటవెలంది | 195 | 1022 | 91 | 1308 |
| 5. | తేటగీతి | 183 | 1584 | 109 | 1876 |
| 6. | చంపకమాల | 242 | 1004 | 135 | 1381 |
| 7. | ఉత్పలమాల | 185 | 696 | 126 | 1007 |
| 8. | మత్తేభవిక్రీడితము | 61 | 268 | 69 | 398 |
| 9. | శార్దూలవిక్రీడితము | 19 | 122 | 18 | 159 |
| 10. | తరువోజ | 12 | 5 | 2 | 19 |
| 11. | ఉత్సాహము | 4 | 7 | 2 | 13 |
| 12. | తరలము | 25 | 5 | 8 | 38 |
| 13. | మత్తకోకిలము | 26 | 8 | 13 | 47 |
| 14. | స్రగ్ధర | 1 | 9 | 2 | 12 |
| 15. | మహాస్రగ్ధర | 2 | 16 | 2 | 20 |
| 16. | మాలిని | 7 | 46 | 1 | 54 |
| 17. | వనమయూరము | 1 | 1 | 1 | 3 |
| 18. | లయగ్రాహి | 3 | 4 | 1 | 8 |
| 19. | మధ్యాకర | 39 | — | 1 | 40 |
| 20. | మధురాక్కర | 1 | — | 2 | 3 |
| 21. | మానిని | 2 | 3 | — | 5 |
| 22. | కవిరాజవిరాజితము | 2 | 4 | — | 6 |
| 23. | అంబురుహము | 1 | 1 | — | 2 |

| | | నన్నయ | తిక్కన | ఎఱ్ఱన | మొత్తము |
|---|---|---|---|---|---|
| 24. | ద్రుతవిలంబితము | 1 | 1 | — | 2 |
| 25. | వసంతతిలకము | 3 | 1 | — | 4 |
| 26. | స్వాగతము | 2 | 1 | — | 3 |
| 27. | తోటకము | 1 | 2 | — | 3 |
| 28. | పృథ్వి | 5 | — | — | 5 |
| 29. | పద్మకము | 1 | — | — | 1 |
| 30. | రథోద్ధతము | 1 | — | — | 1 |
| 31. | మణిభూషణము | 1 | — | — | 1 |
| 32. | దండకము | 1 | — | — | 1 |
| 33. | స్రగ్విణి | — | 1 | 1 | 2 |
| 34. | క్రౌంచపదము | — | 1 | — | 1 |
| 35. | లయవిభాతి | — | 2 | — | 2 |
| 36. | సరసిజము | — | 1 | — | 1 |
| 37. | భాస్కరవిలసితము | — | 1 | — | 1 |
| 38. | తోదకము | — | 1 | — | 1 |
| 39. | దోధకము | — | 2 | — | 2 |
| 40. | నర్కుటము | — | 2 | — | 2 |
| 41. | ఇంద్రవజ్ర | — | 1 | — | 1 |
| 42. | ఉపేంద్రవజ్ర | — | 1 | — | 1 |
| 43. | ఉపజాతి | — | 1 | — | 1 |
| 44. | మంజుభాషిణి | — | 1 | — | 1 |
| 45. | భుజంగప్రయాతము | — | 2 | — | 2 |
| 46. | మణిమాల | — | 1 | — | 1 |
| 47. | మణిగణనికరము | — | 1 | — | 1 |
| 48. | బంధురము | — | 1 | — | 1 |
| 49. | శుద్ధవిరాటి | — | 1 | — | 1 |
| 50. | ప్రణవము | — | 1 | — | 1 |
| 51. | జలధరము | — | 2 | — | 2 |

| | | నన్నయ | తిక్కన | ఎఱ్ఱన | మొత్తము |
|---|---|---|---|---|---|
| 52. | మేదిని | — | 1 | — | 1 |
| 53. | ప్రహరణకలితము | — | 1 | — | 1 |
| 54. | శిఖరిణి | — | 1 | — | 1 |
| 55. | మంద్రాక్రాంతము | — | 1 | — | 1 |
| 56. | మంగళమహాశ్రీ | — | 1 | — | 1 |

# గద్య పద్య సంఖ్య

| | | |
|---|---|---|
| నన్నయ | — | 4011 |
| ఎఱ్ఱన | — | 1595 |
| తిక్కన | — | 15901 |
| | మొత్తము | 21507 |

## ఆశ్వాసక్రమమున గద్య పద్య సంఖ్య

### ఆదిపర్వము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 164 | II. | — | 240 |
| III. | — | 228 | IV. | — | 275 |
| V. | — | 261 | VI. | — | 312 |
| VII. | — | 290 | VIII. | — | 324 |
| | | | | | 2094 |

### స భా ప ర్వ ము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 296 | II. | — | 322 |
| | | | | | 618 |

## అరణ్యపర్వము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 400 | II. | — | 358 |
| III. | — | 399 | IV. | — | 417 |
| V. | — | 437 | VI. | — | 411 |
| VII. | — | 472 | | | |

**2894**

## విరాటపర్వము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 335 | II | — | 365 |
| II. | — | 240 | IV. | — | 277 |
| V. | — | 407 | | | |

**1624**

## ఉద్యోగపర్వము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 385 | II. | — | 334 |
| III. | — | 415 | IV. | — | 428 |

**1562**

## భీష్మపర్వము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 306 | II. | — | 410 |
| III. | — | 455 | | | |

**1171**

## ద్రోణపర్వము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 397 | II. | — | 383 |
| III. | — | 310 | IV. | — | 336 |
| V. | — | 434 | | | |

**1860**

## కర్ణపర్వము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 322 | II. | — | 401 |
| III. | — | 401 | | | |

**1124**

## శ ల్య ప ర్వ ము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 405 | II. | — | 422 |

**827**

## సౌ ప్తి క ప ర్వ ము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 240 | II. | — | 136 |

**376**

## స్త్రీ ప ర్వ ము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 189 | II. | — | 187 |

**376**

## శా ం తి ప ర్వ ము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 400 | II. | — | 449 |
| III. | — | 531 | IV. | — | 457 |
| V. | — | 632 | VI. | — | 624 |

**3093**

## ఆ ను శా స ని క ప ర్వ ము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 388 | II. | — | 478 |
| III. | — | 347 | IV. | — | 451 |
| V. | — | 484 | | | |

**2148**

## అ శ్వ మే ధ ప ర్వ ము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 233 | II. | — | 228 |
| III. | — | 228 | IV. | — | 287 |

**976**

## ఆ శ్ర మ వా స ప ర్వ ము

| | | | | | |
|---|---|---|---|---|---|
| I. | — | 186 | II. | — | 176 |
| | | | | | 362 |

| | | |
|---|---|---|
| మౌసలపర్వము | 226 | |
| మహాప్రస్థానపర్వము | 79 | |
| స్వర్గారోహణపర్వము | 97 | |
| | | 21507 |

# ఆశ్వాసక్రమమున సామాన్యచ్ఛందముల సంఖ్యావివరములు

### నన్నయభట్టారకుఁడు

| పర్వ | ఆశ్వాస | గద్య | కంద | ఆ. వె. | తే. గీ. | సీస | చంప | ఉత్ప | మత్తే | శార్దూ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | I | 66 | 39 | 2 | 3 | 11 | 17 | 15 | 3 | 4 |
| | II | 94 | 75 | 4 | 6 | 10 | 15 | 14 | 9 | 3 |
| | III | 89 | 76 | 7 | 9 | 18 | 10 | 8 | 4 | 2 |
| ఆదిపర్వము | IV | 103 | 92 | 14 | 11 | 7 | 24 | 9 | 5 | 1 |
| | V | 94 | 89 | 5 | 13 | 13 | 16 | 12 | 3 | 3 |
| | VI | 104 | 105 | 17 | 16 | 18 | 14 | 18 | 7 | 2 |
| | VII | 115 | 72 | 17 | 14 | 26 | 17 | 12 | 7 | 2 |
| | VIII | 111 | 104 | 12 | 7 | 27 | 28 | 16 | 7 | – |
| | మొత్తము : | 776 | 652 | 78 | 79 | 130 | 141 | 104 | 43 | 17 |
| | I | 103 | 104 | 9 | 7 | 21 | 21 | 20 | 4 | – |
| సభా | II | 107 | 84 | 24 | 22 | 24 | 21 | 22 | 4 | – |
| | మొత్తము : | 210 | 188 | 33 | 29 | 45 | 42 | 42 | 8 | – |

| పర్వ | ఆశ్వాస | గద్య | కంద | ఆ. వె. | తే. గీ. | సీస | చంప | ఉత్ప | మత్తే | శార్దూ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | I | 155 | 116 | 29 | 23 | 25 | 20 | 12 | 5 | – |
| అరణ్య | II | 150 | 106 | 23 | 19 | 25 | 12 | 9 | – | – |
| | III | 162 | 119 | 24 | 26 | 19 | 17 | 12 | 4 | 2 |
| | IV | 52 | 47 | 8 | 7 | 7 | 10 | 6 | 1 | – |
| | మొత్తము : | 519 | 388 | 84 | 75 | 76 | 59 | 39 | 10 | 2 |

## ఎఱ్ఱాప్రెగ్గడ

| పర్వ | ఆశ్వాస | గద్య | కంద | ఆ. వె. | తే. గీ. | సీస | చంప | ఉత్ప | మత్తే | శార్దూ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | IV | 79 | 79 | 11 | 18 | 17 | 25 | 18 | 11 | 7 |
| అరణ్య | V | 136 | 112 | 24 | 36 | 28 | 45 | 32 | 16 | 3 |
| | VI | 128 | 100 | 25 | 29 | 21 | 29 | 46 | 19 | 6 |
| | VII | 153 | 122 | 31 | 26 | 36 | 36 | 30 | 23 | 2 |
| | మొత్తము : | 496 | 413 | 91 | 109 | 102 | 135 | 126 | 69 | 18 |

## తిక్కన్నసోమయాజి

| పర్వ | ఆశ్వాస | గద్య | కంద | ఆ. వె. | తే. గీ. | సీస | చంప | ఉత్ప | మత్తే | శార్దూ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | I | 90 | 124 | 25 | 18 | 17 | 20 | 32 | 4 | 4 |
| | II | 92 | 95 | 14 | 35 | 40 | 30 | 42 | 9 | 7 |
| విరాట | III | 66 | 63 | 13 | 21 | 12 | 23 | 29 | 7 | 4 |
| | IV | 78 | 93 | 16 | 25 | 10 | 25 | 18 | 7 | 4 |
| | V | 103 | 143 | 28 | 39 | 14 | 35 | 29 | 10 | 5 |
| | మొత్తము : | 428 | 518 | 96 | 138 | 93 | 133 | 150 | 37 | 24 |
| | I | 110 | 144 | 27 | 29 | 8 | 22 | 30 | 11 | 2 |
| ఉద్యోగ | II | 90 | 111 | 23 | 40 | 10 | 22 | 23 | 9 | 5 |
| | III | 115 | 122 | 29 | 39 | 15 | 32 | 44 | 11 | 7 |
| | IV | 144 | 140 | 23 | 53 | 20 | 21 | 17 | 7 | 2 |
| | మొత్తము : | 459 | 517 | 102 | 161 | 53 | 97 | 114 | 38 | 16 |
| | I | 95 | 94 | 11 | 41 | 21 | 15 | 16 | 10 | 2 |
| భీష్మ | II | 114 | 171 | 19 | 39 | 5 | 29 | 22 | 5 | 5 |
| | III | 169 | 156 | 26 | 43 | 12 | 18 | 16 | 10 | 4 |
| | మ్మొత్తము : | 378 | 421 | 56 | 123 | 38 | 62 | 54 | 25 | 11 |

| పర్వ | ఆశ్వాస | గద్య | కంద | ఆ. వె. | తే. గీ. | సీస | చంప | ఉత్ప | మత్తే | శార్దూ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ద్రోణ | I | 127 | 135 | 22 | 20 | 19 | 33 | 22 | 15 | 3 |
| | II | 121 | 110 | 22 | 25 | 36 | 40 | 23 | 5 | – |
| | III | 105 | 105 | 18 | 24 | 14 | 21 | 14 | 5 | 3 |
| | IV | 110 | 128 | 25 | 24 | 5 | 17 | 11 | 12 | 3 |
| | V | 156 | 147 | 20 | 39 | 13 | 26 | 12 | 16 | 4 |
| | మొత్తము : | 619 | 625 | 107 | 132 | 87 | 137 | 82 | 53 | 13 |
| కర్ణ | I | 104 | 90 | 12 | 22 | 28 | 35 | 17 | 10 | 3 |
| | II | 128 | 112 | 26 | 24 | 28 | 39 | 27 | 12 | 4 |
| | III | 116 | 118 | 25 | 35 | 17 | 45 | 25 | 14 | 5 |
| | మొత్తము : | 348 | 325 | 63 | 81 | 73 | 119 | 69 | 36 | 12 |
| శల్య | I | 124 | 115 | 18 | 30 | 20 | 51 | 28 | 12 | 6 |
| | II | 158 | 96 | 25 | 45 | 22 | 46 | 15 | 10 | 4 |
| | మొత్తము : | 282 | 211 | 43 | 75 | 42 | 97 | 43 | 22 | 10 |
| సౌప్తిక | I | 79 | 47 | 19 | 18 | 15 | 22 | 19 | 5 | 5 |
| | II | 51 | 31 | 4 | 15 | 7 | 12 | 3 | 1 | 1 |
| | మొత్తము : | 130 | 78 | 23 | 33 | 22 | 34 | 22 | 6 | 6 |
| స్త్రీ | I | 62 | 50 | 5 | 20 | 12 | – | – | – | – |
| | II | 31 | 55 | 13 | 27 | 28 | – | – | – | – |
| | మొత్తము : | 93 | 105 | 18 | 47 | 40 | – | – | – | – |
| శాంతి | I | 124 | 104 | 27 | 39 | 61 | 17 | 13 | 7 | 7 |
| | II | 125 | 156 | 33 | 51 | 23 | 20 | 14 | 8 | 6 |
| | III | 153 | 224 | 37 | 29 | 32 | 39 | 12 | 4 | – |
| | IV | 95 | 232 | 32 | 67 | 23 | 6 | 1 | – | – |
| | V | 143 | 275 | 56 | 92 | 35 | 20 | 7 | 1 | 2 |
| | VI | 160 | 259 | 44 | 91 | 37 | 19 | 12 | – | 1 |
| | మొత్తము : | 800 | 1250 | 229 | 369 | 211 | 121 | 59 | 30 | 16 |



| పర్వ | ఆశ్వాస | గద్య | కంద | ఆ. వె. | తే. గీ. | సీస | చంప | ఉత్ప | మత్తే | శార్దూ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అనుశాసనిక | I | 122 | 127 | 24 | 30 | 30 | 26 | 17 | 9 | 2 |
| | II | 127 | 180 | 47 | 66 | 41 | 8 | 7 | – | 1 |
| | III | 90 | 141 | 21 | 41 | 35 | 11 | 4 | 2 | – |
| | IV | 96 | 192 | 33 | 74 | 30 | 18 | 4 | 3 | – |
| | V | 122 | 155 | 48 | 63 | 72 | 15 | 7 | 1 | – |
| | మొత్తము : | 557 | 795 | 173 | 274 | 208 | 78 | 39 | 15 | 3 |
| అశ్వమేధ | I | 66 | 80 | 17 | 19 | 31 | 14 | 5 | – | – |
| | II | 65 | 78 | 17 | 18 | 36 | 11 | 2 | – | – |
| | III | 71 | 73 | 10 | 16 | 26 | 19 | 10 | – | 2 |
| | IV | 85 | 77 | 22 | 26 | 37 | 22 | 12 | 1 | 4 |
| | మొత్తము : | 287 | 308 | 66 | 79 | 130 | 66 | 29 | 1 | 6 |
| ఆశ్రమ | I | 40 | 69 | 11 | 19 | 33 | 8 | 4 | – | 1 |
| | II | 52 | 37 | 14 | 15 | 42 | 8 | 6 | – | 1 |
| | మొత్తము : | 92 | 106 | 25 | 34 | 75 | 16 | 10 | – | 2 |
| మౌసల | I | 1 | 97 | 14 | 27 | 46 | 23 | 12 | 4 | 1 |
| మహాప్రస్థాన | I | 17 | 21 | 1 | 3 | 15 | 12 | 6 | 1 | 2 |
| స్వర్గారోహణ | I | 27 | 21 | 6 | 8 | 19 | 9 | 5 | – | – |

# విశేషవృత్తములు

నన్నయ 23 విధములు.

తిక్కన 40 విధములు.

ఎఱ్ఱన 12 విధములు :

1. మత్తకోకిలము :

ఆది. I - 154. II - 208. III - 228. V - 218. 246. VII - 142. 190. VIII - 29. 205. 227. 324; సభా. I-275. II - 4. 180, 236, 286; అరణ్య. I-49, II - 49, 97. 223. III - 16, 113. 352. 358. 362. IV - 107. 268, 279, 305. 340. 376, 378. V - 180. VI - 4. 538. VII-64. 66. 462. 466; శ్రీ. I-21. 41. 175. 183. II - 69, 109. 139. 145. 47

2. తరలము :

ఆది. I - 21. 68. II - 3. 225. III - 40. 142. IV - 165. V - 51. VI - 139. 291. VII - 20. VIII - 90. 148; సభా. I - 192. 193. 241. II - 35. 268. 287. 311. 315; అరణ్య. I - 118. 374. III-166. 360. IV - 403. V-217. 420. VI - 32. 48. VII-270. 403. 472; శ్రీ. I - 4. II-27. 64. 80. 175. 38

3. ఉత్సాహము :

ఆది. VI - 66; సభా. I - 245. II - 322; అరణ్య. I- 400, VI - 318. VII - 76; శ్రీ. I - 48. 66. 85. II - 94. 101. 142. 153. 13

4. తరువోజ :

ఆది. II - 152. III - 172. V-28. 145. VI-102. 130. 250. VII-170 VII - 195; సభా. II - 207; అరణ్య. I - 132. II - 47. IV - 303. VI - 330; శ్రీ. I - 43. II - 59. 158. 182; అను. III - 58. 19

5. మధ్యాక్కర :

ఆది. II - 185. III - 19. IV - 103. 142. 177, 254. VI - 166. 273. VII - 99. 125. 123. 138. 202. VIII - 133; సభా. I - 82. II - 182; అరణ్య.

I - 134, 200, 225, 234, 235, 392, II - 22, 118, 129, 149, 170, 256, 320, 351, III - 97, 206, 299, 331, 373, 386, IV - 3, 49, 103, 310. 40

6. మధురాక్కర :

ఆది. IV – 49; అరణ్య. VI - 352, VII - 309. 3

7. కవిరాజవిరాజితము :

ఆది. VI - 21; అరణ్య. II - 90; శ్రీ. I - 51, 55, II - 84, 132. 6

8. మానిని :

ఆది. IV - 20, VIII – 91; శ్రీ. I - 90, II - 12, 31. 5

9. మహాస్రగ్ధర :

ఆది. II – 22, V – 38; అరణ్య. V – 421, VII – 87; సౌప్తిక. I - 181, 183, 185, 187, 189, 194, 201, 214, 238, II – 9, 15, 21, 41, 65; శాంతి. II – 434; స్వర్గా. 34. 20

10. స్రగ్ధర :

ఆది. VI – 80; అరణ్య. VII - 16, 91; విరాట. III - 78; ఉద్యో. I - 323, సౌప్తిక, I - 175, II - 5, 14, 16, 61, 134; శాంతి. II - 440. 12

11. లయగ్రాహి :

ఆది. V - 138, 139; అరణ్య. I - 40, VII - 97; శ్రీ. II - 5, 6, 7, 8. 8

12. లయవిభాతి :

శ్రీ. I - 131, II - 73. 2

13. పృథ్వి :

ఆది. II - 167, V - 62, 168, VIII - 103; అరణ్య. II - 358. 5

14. మాలిని :

ఆది. II - 82, 97, V - 127, VI - 312, VIII - 196, 234; సభా.II - 75; అరణ్య. IV - 417; విరాటపర్వాది స్వర్గారోహణపర్వాంతము అన్ని యాశ్వాసముల యంతము లందు — 46. 54

15. వసంతతిలకము :

ఆది. II - 240, V - 29; అర. III - 399; శ్రీ. I - 10. 4

16. వనమయూరము :

ఆది. V - 261; అర. VI - 411; శ్రీ. I - 110 3

17. స్వాగతము : 3
ఆది. VII - 29; అరణ్య. I - 158; శ్రీ I - 109.

18. తోటకము : 3
ఆది. I - 164; శ్రీ. I - 45, II - 122.

19. ద్రుతవిలంబితము : 2
ఆది. IV - 275; శ్రీ. I - 119.

20. అంబురుహము : 2
సభా. I - 296; శ్రీ. I - 177.

21. పద్మకము : 1
ఆది. VI - 230.

22. రథోద్ధతము : 1
సభా. II - 320.

23. మణిభూషణము : 1
అరణ్య. I - 155.

24. దండకము : 1
అరణ్య. I - 324.

25. క్రౌంచపదము : 1
శ్రీ. I - 166.

26. సరసిజము : 1
శ్రీ. II - 37.

27. భాస్కరవిలసితము : 1
శ్రీ. II - 50.

28. తోవకము : 1
శ్రీ. I - 81.

29. దోధకము : 2
శ్రీ. I - 62, 71.

30. నర్కుటము : 2
శ్రీ I - 113, II -146.

31. ఇంద్రవజ్ర : 1
శ్రీ. I - 29.

32. ఉపేంద్రవజ్ర: 1
శ్రీ. I - 136.

33. ఉపజాతి :
త్రి. I - 64. 1

34. మంజుభాషిణి :
త్రి. I - 68. 1

35. భుజంగప్రయాతము :
త్రి. I - 88, II - 107. 2

36. మణిమాల :
త్రి. I - 108. 1

37. మణిగణనికరము :
త్రి. II - 3. 1

38. బంధురము.
త్రి. I - 115. 1

39. శుద్ధవిరాటి ;
త్రి. I - 125. 1

40. ప్రణవము :
త్రి. I - 145. 1

41. జలధరము :
త్రి. I - 148 1.64. 2

42. మేదిని :
త్రి. I - 152. 1

43. ప్రహరణకలితము :
త్రి. I - 185. 1

44. మందాక్రాంతము :
త్రి. I - 185. 1

45. శిఖరిణి :
త్రి. I - 187. 1

46. స్రగ్విణి :
అరణ్య. V - 437; త్రి. I - 140. 2

47. మంగళమహాశ్రీ :
త్రి. II - 29. 1

321

## గద్య, సామాన్య, విశేషచ్ఛందములు.

| | గద్యములు | సామాన్యచ్ఛందములు | విశేషచ్ఛందములు | | మొత్తము |
|---|---|---|---|---|---|
| నన్నయ : | 1505 | 2364 | 142 | = | 4011 |
| ఎఱ్ఱన : | 496 | 1063 | 36 | = | 1595 |
| తిక్కన : | 4518 | 11240 | 143 | = | 15901 |
| | 6519 | 14667 | 321 | = | 21507 |

*ఛందసాం ప్రసవిత్రీ యా*
*స్పందయిత్రీ గిరాం కవేః*
*పశ్యంతీరూపిణీ శక్తిః*
*పాతు మాం సా ఋతంభరా.*

# ముఖ్యపదానుక్రమణిక

ఓం తత్సత్